
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ ఋషిపీఠం వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ఋషిపీఠం వెబ్ సైట్: http://telugu.rushipeetham.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# ఋషిపీఠం వారి వెబ్ సైట్

## http://telugu.rushipeetham.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నమస్సు

*ఊర్ధ్వౌ హస్తౌ యదీయౌ సురరిపుదళనే బిభ్రతౌ శంఖచక్రే*
*సేవ్యావంఘ్రీ స్వకీయావభిదధదధరో దక్షిణో యస్య పాణిః।*
*తావన్మాత్రం భవాబ్ధిం గమయతి భజతామూరుగో వామపాణిః*
*శ్రీవత్సాంకశ్చ లక్ష్మీర్యదురసి లసతస్తం భజే వేంకటేశమ్ ।*



వేంకటేశ్వరస్వామి నాల్గుచేతులవాడు.

పై రెండు చేతులలో రాక్షస సంహారకమైన శంఖచక్రాలు ధరించి ఉన్నాడు.

క్రింది కుడిచేతితో తన రెండు పాదాలవైపు చూపి, ఎడమచేతిని కటిపైనుంచి నిలుచున్నాడు. దీనిభావం – తన పాదాలను ఆశ్రయించిన వారికి, భవసాగరం మొలబంటి లోతేనని సూచించడం.

వక్షఃస్థలంపై శ్రీవత్సలాంఛనాన్నీ, లక్ష్మినీ ధరించి ఉన్నాడు.

అటువంటి దివ్యమంగళరూపుడైన శ్రీ వేంకటేశ్వరుని ఆశ్రయిస్తున్నాను.

ఋషిపీఠం

జనవరి। 2000

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

జనవరి 2000

సంపుటి 1 సంచిక 6

సంపాదకుడు :

**సామవేదం షణ్ముఖశర్మ**

ప్రచురణకర్త

**ఉపద్రష్ట శివప్రసాద్**







చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై-600 017. ఫోన్ : 8281159

# వెయ్యేళ్ల వెలుగు

అందరం అనుసరిస్తున్న ఒక కేలండర్ ప్రకారం - ఒక సహస్రాబ్దినుండి మరో సహస్రాబ్దిలోకి అడుగుపెట్టాం. ఒక శతాబ్ది ముగింపుని చూడడమే ఒక చక్కని అనుభూతి అయితే, ఒక సహస్రాబ్ది పూర్తినీ, మరో సహస్రాబ్ది ప్రారంభాన్నీ సాక్షిగా తిలకించడం మరో గొప్ప అనుభూతిగా భావించవచ్చు.

ఈ సందర్భంలో - ఈ వెయ్యేళ్ళ చరిత్ర నంతా సింహావలోకనం చేసుకోవడం, మానవాళికి స్ఫూర్తినిచ్చిన మహనీయుల్ని స్మరించుకోవడం జరుగుతోంది. ప్రపంచవ్యాప్తంగా వివిధ రంగాల ప్రముఖుల పేర్లు చెప్పుకుంటూపోతే - ఎన్నో ఉద్గ్రంథాలే తయారౌతాయి. వారందరికీ నమోవాకాలు.

అయితే - భారతీయతకు సంబంధించి - ఈ సంస్కృతిని స్ఫూర్తిమంతం చేసిన మహానుభావుల గురించి ఎక్కువగా చెప్పుకొనక, విదేశీయుల ఘనతనే ప్రస్తుతిస్తున్న పరదేశదాస్య భావం ఇప్పటికీ మనలో పోలేదు. అంటే వారిని గురించి చెప్పుకో కూడదనేటంత సంకుచిత ధోరణితో అంటున్న మాటలు కావివి. మన వారిని కాదనేటంత కృతఘ్నత కూడదనే ఘోష మాత్రమే ఇది. మాధ్యమ (మీడియా) రంగమంతా 'మిలీనియం ఘనులు'గా విదేశీ మేధావుల్ని ఎత్తి కీర్తిస్తుంటే... 'అయ్యో! మనవాళ్లు!!' అనిపిస్తుంది.

ముఖ్యంగా - మన తెలుగువారికి ఈ మలుపు గణనీయమైనది. సాహిత్యపరంగా.... నన్నయగారితో ఒక ప్రస్ఫుటమైన ఆకృతి ధరించిన తెలుగుభారతి కూడా సుమారు వెయ్యేళ్లు పూర్తి చేసుకుంది. ''విశ్వశ్రేయః కావ్యమ్'' అని తొలిగా ప్రవచించిన ఋషికల్పుడైన నన్నయ గారి పంథాలో, నిన్న మొన్నటివరకూ తెలుగు సాహిత్యం ఆర్షమార్గంలోనే సాగింది. నన్నయ గారి తర్వాత, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథ, కృష్ణదేవరాయ, పెద్దన, సోమన, రామకృష్ణ కవి... ఇలా పుంభారతీ మూర్తులు ఎందరో ఈ సహస్రాబ్ది సారస్వతాన్ని స్వర్ణమయం చేశారు. మరోవైపు అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య వంటి వాగ్గేయకారులు దివ్య మూర్తులై సంగీత సాహితీ సుక్షేత్రాలు పండించారు.

భారతదేశం మొత్తంమీద ఈ సహస్రాబ్ది ఇంచుమించు పూర్తిగా పరదేశాల పరిపాలనలో ఎన్నో ఆటుపోట్లకు గురయ్యింది. ఈ సనాతన సంస్కృతికి ఎన్నో విధ్వంసాలు, విద్రోహాలు ఎదురయ్యాయి. పాశవిక పైశాచిక పరాయి దాడులలో ఎంత నష్టపోయామో లెక్కలు వేస్తే గుండె చెరువౌతుంది. అయినా.. మరో వైపు చెక్కుచెదరని సంప్రదాయధార అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూండడం చూస్తూంటే, ఋషిసంకల్పానికి తిరుగులేదనే సత్యాన్ని అంగీకరించాల్సిందే.

భారతీయతపట్ల అవగాహనలేని విదేశీయుల్ని సైతం అబ్బురపరచి, ఈ మహోన్నత సంస్కృతి గురించి దశదిశలా చాటిన రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, పరమ హంస యోగానంద, స్వామీరామతీర్థ, రమణమహర్షి-వంటి మహాత్ములు ఎందరో!

దేశాన్ని భౌగోళికంగానే కాక, తనదైన సంస్కృతిని, విజ్ఞానాన్ని గౌరవించడం, పరిరక్షించడం అచ్చమైన దేశభక్తి. ఆ దేశభక్తితో దీపించి, ఈ మాతృ సంస్కృతిని కాపాడేందుకు పోరాడిన ఛత్రపతిశివాజీ, శ్రీకృష్ణదేవరాయలు, అల్లూరిసీతారామరాజు వంటి మహాయోధులూ ఈ సహస్రాబ్దిలో భారతీయతకు రక్షా కవచాలయ్యారు.

ఈ సహస్రాబ్ది మొత్తంమీద చూస్తే... గడచిన ఇరవయ్యవ శతాబ్ది చాలా కీలకమైనది. సుమారు సగభాగం విదేశీయుల పాలనలోనే గడచి, ఆ తరువాత వారి మార్గాన్ని వీడని పరిపాలనా విధానాలే అమలవుతూ సాగింది.

అది అటుంచి, 20వ శతాబ్ది ఆరంభానికి - పాశ్చాత్య భోగలాలసపట్ల, భౌతిక వాదంపట్ల భారతీయ మధ్యతరగతి కుటుంబాలు సైతం ఆకర్షితులై, 'సంప్రదాయం' అన్న ప్రతి

అంశాన్ని తృణీకరించడమే సంప్రదాయంగా ప్రవర్తించడం ప్రారంభించారు. ఈ ధోరణి ముదిరి సంస్కృతిలో కూడా చొచ్చుకొచ్చింది. కళలన్నీ భౌతిక వాదంవైపు మళ్లాయి. ఆధ్యాత్మిక దృక్పథాన్ని 'మతదృష్టి'గా భావించి, భౌతిక నాస్తిక ధోరణులు కవిత్వాదుల్లోనూ ప్రవేశించాయి.

ఈ గాలి తెలుగునేలకీ బలంగానే సోకింది. 'అభ్యుదయం' అనే ముద్రవేసుకొని 'అనార్ష భావప్రాబల్యం' రాజ్యమేలసాగింది. ఇటువంటి కాలంలోనూ ఆర్షభావనా ధార సన్నగిల్లలేదు. మరింత విజృంభించింది. మన తెలుగు నేలపై ఈ శతాబ్ది మొత్తంమీద మన ఆర్ష సంస్కృతికి పెద్ద దిక్కుగా నిలిచిన మహాత్ముల్లో మొదటివారు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, సువిస్తారమైన సారస్వత్వాన్ని సృష్టించ డమేకాక, వ్రాసిన ప్రత్యక్షరమూ, ఋషి సంస్కృతి విజయాన్ని ప్రతిష్ఠించడమే పరమ లక్ష్యంగా సాగింది.

ఒకవైపు ''శ్రీమద్రామాయణ కల్పవృక్షం'' వంటి మహాకావ్య రచన, మరోవైపు ''వేయిపడగలు'' వంటి మహోత్కృష్టవల, భారతదేశపు అసలు చరిత్ర స్వరూపాన్ని ఆవిష్కరించిన 'పురాణ వైరగ్రంథమాల'(12నవలలు) అనేక నాటకాలు, పద్య కావ్యాలు, గేయ కావ్యాలు, నవలలు... ఇలా విస్తృత సాహితీ సామ్రాజ్యాన్ని ఏర్పరచి... సంప్రదాయ సాహిత్యానికి సాకారంగా, అపూర్వమేధాశక్తితో భాసించిన ఆ ఋషికల్పుని గురించి - శృంగేరీ జగద్గురు పీఠాధిపతులు చెప్పిన మాటలు...

''మన దేశంలోని జగద్గురు పీఠాలన్నీ కలిసివైదికసంస్కృతికి ఎంత సేవచేశాయో, అంతకు మిక్కిలిగా విశ్వనాథవారు ఒక్కరూ తన సాహిత్యంతో అంత సేవ చేశారు'' అని.

'వైదికసిద్ధాంత నిబద్ధత'లో 'భగవద్భక్తి' ప్రధాన భూమికగా తాపస జీవితాన్ని సాగిస్తూ, వేదవిరుద్ధ భావుకుల ఎదురుదాడికి నిశ్చలంగా నిలచిన ఆమేరునగధీరునితోపాటు- ఆర్షసంస్కృతిని దీపింపజేయడానికి పాటుపడ్డ మహాత్ములు శ్రీజటావల్లభుల పురుషోత్తం, వేద, మంత్ర, తంత్ర, కావ్యసంప్రదాయాలను ప్రచురంచేసిన 'కావ్యకంఠ' శ్రీవాసిష్ఠ గణపతిముని...

ఆంధ్ర, సంస్కృత వాఙ్మయాన్ని తెలుగువారికి అందించిన త్యాగధనులు శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు...

సశాస్త్రీయంగా భారతదేశచరిత్రను తెలియజేసిన 'భారతచరిత్ర భాస్కర' శ్రీకోట వెంకటాచలం...

ఆంధ్రుల చరిత్రను అద్భుత కావ్యంగా మలచిన శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి...

అవధాన విద్యకు ఆయువిచ్చిన తిరుపతి వేంకటకవులు, మహాసాహితీ మూర్తులు పుట్టపర్తి నారాయణాచార్య, రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ, వేటూరిప్రభాకరశాస్త్రి, ఎక్కిరాల కృష్ణమాచార్య, అడివిబాపిరాజు, సంగీత మూర్తులు ద్వారం వెంకటస్వామి నాయుడు, ఈమని శంకరశాస్త్రి, ఆదిభట్ల నారాయణ దాసు, చిత్రకారులు వడ్డాది పాపయ్య.. వీరంతా భారతీయ మార్గంలో సనాతనమైన సంపదని పరిపోషించిన మన తెలుగువారు.

తెలుగు భాషపై మక్కువతో సి.పి. బ్రౌన్, ఈ భాషను అధ్యయనం చేసి, తెలుగు - ఆంగ్ల నిఘంటువు నిర్మించి, ఎన్నో ప్రాచీనాంధ్ర గ్రంథాలను పండిత పరిష్కృతం చేసి ఆంధ్ర సంస్కృతిని ఉజ్జీవింపజేశారు.

గత శతాబ్ది నుండి నూతన శతాబ్దిలో ప్రవేశించిన మన సమకాలీనులు-

వేదార్థనిధి శ్రీరేమెళ్ళసూర్యప్రకాశశాస్త్రి, మహావాగ్గేయ కారులు, సంగీతమూర్తి డా॥మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు,

సాహితీరంగంలో శ్రీమల్లంపల్లి శరభయ్య గారు, చిత్ర కళారంగంలో శ్రీబాపు గారు, శిల్ప కళారంగంలో శ్రీ గణపతి స్థపతిగారు. ఇలా ఎందరో మహానుభావులు!

మన సంప్రదాయ సంస్కృతి దీప్తిని తమ తమ కళలలో ప్రతిష్ఠించిన తెలుగు వారిని మాత్రమే ఇక్కడ పేర్కొనడం జరిగింది. ఈ మహా యజ్ఞంలో ఇంకా ఎందరెందరున్నారో... వారందరికీ మనసా శిరసా వచసా నమామి.

ప్రపంచం నలుమూలలనుండి వచ్చిన అన్ని గొప్ప ఆవిష్కరణలకూ ఆహ్వానం పలుకుతూ, సార్వజనీనమైన మనదైన 'భారతీయత'ను విస్మరించకుండా- విశ్వానికి మన తపః ఫలాలను ప్రసరింపజేసి- భారతదేశ సనాతన దీప్తిని వ్యాపింపజేసే శ్రద్ధాసక్తులను, శక్తులనూ అనుగ్రహించవలసిందిగా కాల పురుషుని ప్రార్థిద్దాం.

శుభాకాంక్షలతో...



# అత్రి మహర్షి

అత్రి – అనసూయ : ఈ దివ్యదంపతుల పేర్లు మన సంస్కృతిలో అత్యంత ప్రాధాన్యం సంతరించుకున్నాయి.

స్త్రీపురుష ధర్మానికి ఈ ఉభయులు ఆదర్శస్థానంలో ప్రతిష్ఠితులు.

వైదిక సాహిత్యంలో 'అత్రి' మహర్షి ప్రస్తావన ప్రముఖంగా కనిపిస్తుంది. వివిధ పురాణాల్లో అత్రి జన్మ వృత్తాంతాదులు వివరంగా లభిస్తున్నాయి.

సృష్ట్యాదిలో బ్రహ్మదేవుని మానస పుత్రులుగా ఆవిర్భవించిన మహర్షులలో 'అత్రి' ఒకరు. బ్రహ్మదేవుని కంటినుండి ఈ మహర్షి ఆవిర్భవించాడు. ''అక్షిణోఽత్రిః'' – అని 'శ్రీమద్భాగవతం'.

సప్తర్షులలో ఒకనిగా ప్రత్యేక స్థానాన్ని పొందిన అత్రిమహర్షి, ప్రజాపతులలో ఒకనిగా కూడా ప్రఖ్యాతి వహించాడు.

పదిమండలాలుగా విభక్తమైన ఋగ్వేదంలో, అయిదవ మండలానికి ద్రష్ట 'అత్రి మహర్షి'. కాబట్టి ఈ మండలాన్ని 'ఆత్రేయ మండలం' అంటారు. (ఆత్రేయ= అత్రి సంబంధమైన). ఈ మండలంలో 87 సూక్తాలున్నాయి. అగ్ని, ఇంద్ర, మరుతౌ, విశ్వదేవ, సవితా – దేవతలకు సంబంధించిన మహనీయ స్తుతులు ఈ సూక్తాలలో చోటు చేసుకున్నాయి.

'అత్రి' మహర్షిగా ఎంత ప్రసిద్ధుడో ఆయన సతీమణి 'అనసూయ' పతివ్రతా శిరోమణిగా అంత ప్రసిద్ధురాలు. కర్దమ ప్రజాపతి, దేవహూతిల కుమార్తె అయిన 'అనసూయ' మహిమాన్విత అయిన 'దివ్య తేజస్విని'గా ఖ్యాతి వహించింది. జ్ఞానం, తపస్సు, సదాచారం, భక్తి, మంత్రశక్తులు మూర్తీభవించిన వ్యక్తిత్వం 'అత్రి' మహర్షుల వారిది. పవిత్రధర్మం, శీలం, తపశ్శక్తి మూర్తీభవించిన దేవి 'అనసూయ'.



శ్రీమహావిష్ణువు రామావతార సమయంలో వనవాస సందర్భాన స్వయంగా సీతా సమేతుడై అత్రిమహర్షి ఆశ్రమానికి విచ్చేశాడు. ఆ సమయంలో అనసూయ సీతాదేవిని ప్రత్యేక ఆదరణతో స్వాగతించి ఆశీర్వదించింది.

త్రిమూర్తులను శిశువుల్ని చేసి, ఇనుప గుగ్గిళ్ళని వండివడ్డించి దేవతల్ని సైతం శాసించే శక్తిగలది అనసూయమ్మ.

'అసూయ' అంటే 'ఇతరుల్లో దోషాల్ని మాత్రమే దర్శించేగుణం'. అంతేకాక ఇతరుల్లో గుణాలని కూడా దోషాలుగా వ్యాఖ్యానించుకొనే గుణం. ఈ దుర్గుణాలులేని వ్యక్తిత్వమే 'అనసూయ'.

అలాగే అత్రి అంటే (అ+త్రి) 'త్రి' గుణాలకు (సత్త్వరజస్తమో గుణాలకు) అతీతమైన – అని అర్థం.

ఈ విధమైన రెండు దివ్యవ్యక్తిత్వాలు దంపతులుగా ధార్మికజీవనాన్ని సాగించాయి. దాంపత్యధర్మానికి ఆదర్శమై నిలిచాయి. చిత్ర కూట తపోవనంలో నివసిస్తున్న సమయంలో అనసూయ తపోబలం చేత భాగీరథీగంగ ఒక ధారగా అక్కడ ప్రవహించింది. పాపుల పాపాలను కడగడంతో ఆ పాపభారాన్ని భరించలేని గంగ, అనసూయ కరస్పర్శ చేత భారంతొలగి పవిత్రురాలయిందని పురాణగాథ.

''తీర్థీ కుర్వంతి తీర్థాని'' – అని మహాత్ముల గురించి చెప్తారు. పుణ్యాత్ములు, ఉత్తమ వ్యక్తిత్వం గల వారు సేవించడం చేత తీర్థాలు సంతోషిస్తాయి. తీర్థాలను తీర్థాలుగా సార్థకం చేసేది దివ్య జీవనం గల మహాత్ములే.

సృష్ట్యారంభంలో బ్రహ్మదేవుని ఆజ్ఞచేత తపోదీక్ష బూనిన అత్రి, అనసూయలకు త్రిమూర్తులూ ప్రసన్నులై తామే కుమారులుగా జన్మిస్తామని వరమిచ్చారు.

ఆ వర ప్రకారం – విష్ణు అంశతో 'దత్తాత్రేయుడు', బ్రహ్మాంశతో 'చంద్రుడు', శంకరాంశతో మహాముని 'దుర్వాసుడు' అత్రి అనసూయల కుమారులుగా జన్మించారు.

**సోమోఽభూత్ బ్రహ్మణోంశేన, దత్తో విష్ణోస్తు యోగవిత్, దుర్వాసాః శంకరస్యాంశో...**

(శ్రీమద్భాగవతం)

వేదంలో అత్రి సంబంధవృత్తాంతాలు కొన్ని చెప్పబడ్డాయి. అత్రిమహర్షికి దేవవైద్యులైన అశ్వనీకుమారుల కృప లభించింది. ఒకసారి అత్రిమహర్షి తపస్సమాధిలో ఉండగా దైత్యులు ఆయనను 'శతద్వార' అనే యంత్రంలో పడవేసి అగ్నిజ్వాలలు రగుల్కొల్పి వెళ్లారు. ఆ సమయంలో 'అత్రి'ని అశ్వనీ కుమారులు రక్షించారు. అంతేకాక, అత్రి చేసిన దీర్ఘ తపస్సుకి సంతోషించి ఆయనకు నిత్య యౌవనాన్ని వరంగా ప్రసాదించారు.

అత్రి ఇతరకుమారులలో వసూయు, సప్తవధ్రి - అనే పేర్లుగల పుత్రులు కొన్ని మంత్రాలకు ద్రష్టలుగానున్నట్లు 'ఋగ్వేదం' వల్ల తెలుస్తుంది. అత్రిగోత్రజులైన 'ఆత్రేయగణం' ఋగ్వేదంలోని అనేక మంత్రాలకు ద్రష్టలు.

ఋగ్వేదంలోని అయిదవమండలం - 'ఆత్రేయమండలం'లోని 'కల్యాణసూక్తం' (స్వస్తిసూక్తం, మంగళసూక్తం, శ్రేయఃసూక్తం) అన్ని కార్యాలను శుభమయం చేసి అభ్యుదయాన్నీ, భగవత్కృపనీ ప్రాపింపజేసే శక్తిని కలిగివుంది.

'సవితా'దేవతకు సంబంధించిన ప్రార్థనలలో,

**విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ,**
**యద్ భద్రం తత్ర ఆ సువ..**

(ఋగ్వేదం)

"ఓ సవితాదేవతా! మా దుఃఖాలను, శోక - కష్టాలను దూరంచేసి, ఏది హితమైనదో, కల్యాణకరమైనదో దానిని అనుగ్రహించు" - అని దీని భావం.

జగత్కల్యాణమే పరమలక్ష్యంగా త్యాగ, తపోధర్మమయమైన దివ్య జీవితాన్ని సాగించిన అత్రిమహర్షి - శ్రుతి ధర్మాలను ఉపదేశ పద్ధతిలో బోధించే స్మృతులను (ధర్మశాస్త్రాలను) కూడా రచించాడు. 'అత్రిస్మృతి' (ఆత్రేయ ధర్మశాస్త్రం)లో అఘమర్షణ మంత్రాలు, సూర్యోపస్థానం, పావమానీ ఋక్కులు, శతరుద్రీయం, గోసూక్తం, అశ్వసూక్తం, ఇంద్రసూక్తం - వంటి వైదిక మంత్రాల ప్రశస్తి, విశేషం వివరించబడ్డాయి.

వైదిక కర్మల వైభవం కూడా విశిష్టంగా విశదీకరించిన ఈ ధర్మశాస్త్రగ్రంథం భగవద్భక్తిలోని ఔన్నత్యాన్ని, విశేషాన్ని తేటపరచింది.

వేదమంత్ర ద్రష్టగా, ప్రజాపతిగా, తపోమూర్తిగా, ధర్మశాస్త్రకర్తగా అత్రి మహర్షి స్థానం ప్రత్యేకం. ✷

# అర్థవంతమెనది
# మన కాలమానం

పోలిశెట్టి బ్రదర్స్

"హ్యాపీ న్యూయర్" అనే మాట వినగానే నేడు చాలా మందికి మనసులో మెదిలేది "జనవరి 1వ తేదీ". సంవత్సరారంభం అనగానే ఎందరికో ఆ తేదీయే గుర్తుకొస్తుంది. అయితే శాస్త్రీయమైన సంవత్సరారంభం "ఉగాది". ఈ విషయాన్ని నేడు ఎంతమంది గుర్తిస్తున్నారు? ఉగాదికి 'సంవత్సరాది' అనే పేరయితే ఉంది గానీ, 'హేపీ న్యూ ఇయర్' అనగానే ఉగాది మాత్రం గుర్తుకురాదు మనకు, కేవలం వేపపువ్వు పచ్చడి తినే పండుగగానే నేడు మన 'ఉగాది' భావించబడుతోంది. ఖగోళశాస్త్రరీత్యా ఏ ప్రత్యేకతా లేని జనవరి 1వ తేదీని 'సంవత్సర ఆరంభంగా' భావించడం, యథార్థ సంవత్సరాది అయిన 'ఉగాది' ప్రాశస్త్యాన్ని మరచిపోతూండడం నిజంగా ం.

ఆంగ్ల సంవత్సరాన్ని విడిచిపెట్టి, ప్రపంచ రీతికి ఎదురీదమని మేము చెప్పబోవడం లేదు. ఖగోళశాస్త్రపరంగా నిర్ణయించబడిన యథార్థ సంవత్సరారంభాన్ని గుర్తించమని మాత్రమే కోరుతున్నాం. గ్రుడ్డిగా అనుసరించబడుతున్న ఆంగ్ల సంవత్సరాది పేరిట నేడు పెచ్చు పెరుగుతున్న విదేశీ అనుకరణలకూ, ఆకతాయితనాలకూ ఇకనైనా స్వస్తిపలికితే మంచిదని హితవు చెప్తున్నాం. జనవరి ఫస్ట్ నాటి "విష్ యూ హేపీ న్యూ ఇయర్" అలవాటు ముదిరిపోయి ఒక అంటువ్యాధిగా ఎదిగిపోతూ, పాశ్చాత్య విష సంస్కృతిని మనలో నింపుతోంది. తద్వారా పెరుగుతున్న అజ్ఞానంతో విజ్ఞాన భరితమైన స్వసంస్కృతిని దూరంచేసుకుంటున్నాం. ఈ విషయంపై మాకు కలిగిన ఆవేదనే, ఈ రచనకు ఆలంబన!

ఏ కాలంలోనైనా, ప్రపంచంలోని ఏ ప్రాంతానికైనా కాలమానానికి "ఖగోళమే" ఆధారం. ఇది ఎవరూ కాదనలేని సత్యం. కాలమానంలోని అంశాలన్నింటినీ పూర్తిగా ఖగోళ శాస్త్ర రీత్యా ఏర్పాటు చేసుకున్న ఏకైక జాతి "హిందూజాతి". కాలమాన అంశాలైన రోజు, వారం, పక్షం కార్తె, మాసం, ఋతువు, ఆయనం, సంవత్సరం, పుష్కరం, శకం, యుగం, కల్పకం మొదలైన అన్నింటినీ హిందువులు 'ఖగోళ శాస్త్ర ఆధారంగానే ఏర్పాటు చేసుకున్నారు. ఇతరితర దేశాలవారు తమకు తెలిసిన చోట, తమకు నచ్చిన చోట మాత్రమే కాలమానానికి ఖగోళాధారాన్ని తీసుకున్నారు. కొన్నింటికి ఏ ఆధారాలూ లేని స్వంత విధానాల్ని అనుసరించారు. ఖగోళశాస్త్ర బద్ధమైన కాలమానాల్ని పురాణకాలం నుండీ కలిగివున్న ఘనత హిందువులది! ఈ విషయం నేడెంత మందికి తెలుసు?' 'తిని, త్రాగి పడుకుంటే – మనిషికీ, గొడ్డుకీ, తేడా ఏముందన్నాడు' ఓ రచయిత. "మా తాతలు నేతులు త్రాగారు – వారి మూతుల వాసన గురించి చెప్పుకుంటున్నాం" అన్నట్లు కాకుండా, ఆ నేతుల్ని మనమూ కాస్త రుచి చూద్దాం రండి. మన జాతికున్న కాలమాన పరిజ్ఞానాన్ని అవగాహన చేసుకుందాం పదండి.

"యథార్థ సంవత్సరారంభం ఏది? శాస్త్రీయంగా నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పుకోవలసింది ఎప్పుడు? విజ్ఞులు అనుసరించిన, అనుసరించవలసిన కాలమానం ఏది? ప్రస్తుతం అనుసరిస్తున్న కాలమాన లోపాలేవి?..." ఇటువంటి విజ్ఞాన విషయాలెన్నో ఖగోళశాస్త్ర ఆధారాలతో తెలుసుకుందాం.

### విదేశీ సంస్కృతిపై మోజు

సరైన అవగాహన అనేది లేకుండా పాశ్చాత్య పోకడలపై మోజు పెంచుకుంటున్నాం మనం. అన్నింటా మంచిగా పేరొందిన మన సంస్కృతికి మెల్లమెల్లగా దూరమౌతున్నాం. మేధావులమంటూ బోరచాచుకుని తిరిగే ఆర్భాటరాయుళ్ళందరూ ముందుగా ఈ విషయాన్ని గ్రహించాలి.

మన భారతీయ సంస్కృతి నుండి మనమే మన పిల్లల్ని దూరం చేస్తున్నాం... చిరుప్రాయం నుండి కూడా!! సుమారు 30 సంవత్సరాల క్రితం వరకూ మన పిల్లలు "శుక్లాంబరధరం", "శాంతాకారం భుజగశయనం" వంటి భక్తి శ్లోకాలు, మరెన్నో నీతి పద్యాలూ, విరివిగా తమ తల్లిదండ్రులవద్ద నేర్చుకుని, గడగడా అప్పగించేవారు. ఆ శ్లోకాలు వగైరాలు నేటి తల్లిదండ్రులకే రావు. ఇక పిల్లలకేం చెప్తారు? ఆధ్యాత్మిక, నీతి పద్యాల్ని 'అనాగరికంగానూ, ఓల్డ్ ఫ్యాషన్‌గానూ' భావిస్తున్నారు నేటి పెద్దలు. నేటి బిడ్డడికి 3వ సంవత్సరం రాగానే, విధిగా కాన్వెంట్ ప్రవేశం జరిగిపోతోంది. కాన్వెంట్‌లో వాడు నేర్చిన "ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్‌స్టార్," "డింగ్ డాంగ్ బెల్", "బాబా బాబా బ్లాక్‌షీప్" మొదలైన పద్యాలను వింటూ తల్లిదండ్రులు పరవశించిపోతున్నారు.

'ఆ ఇంగ్లీషు పద్యాలలో ఒక నీతిగానీ, పనికొచ్చే ఒక చక్కని అర్థంగానీ ఉందా' అని ఆలోచించే వారే లేరు. అలనాటి వేమన, సుమతీ, భాస్కర, దాశరథీ శతకాలు నేర్పే నీతి, అధ్యాత్మికత ఈనాటి ఇంగ్లీష్ కాన్వెంట్స్‌లో ఎలా దొరుకు తాయి? అందువల్లనే ఈనాటి విద్యార్థులు, విదేశీ వ్యామోహాల పట్ల ఆకర్షితులౌతున్నారు తప్ప, స్వదేశీ సంస్కృతిని గురించి ఆలోచించే స్థితిలో లేరు.

నేటి మన తల్లులు తమ పిల్లలచే 'అమ్మా!'' అని ఆప్యాయంగా పిలిపించుకునే భాగ్యాన్ని కోల్పోతున్నారు. 'అమ్మ' అనే కమ్మ నైన పిలుపుకు బదులుగా - ఈజిప్ట్‌వారి పిర మిడ్లనూ, శవాలనూ గుర్తుకుతెచ్చే ''మమ్మీ'' అనే పిలుపునే నేడెంతో మంది తల్లులు కోరుకుంటున్నారు. (ప్రాచీన ఈజిప్టు పిర మిడ్లలో జాగ్రత్తచేసి ఉంచే శవాలను 'మమ్మీ' లని అంటారు) ఈ తరం భారతీయు లకు... ముఖ్యంగా యువతరానికి పాశ్చాత్య సంగీతం, డాన్స్‌లే తప్ప-మన సాంప్రదాయ సంగీత నృత్యాలు నచ్చవు. మన భారతీయ పద్ధతిలో ''నమస్కారం, నమస్తే రాంరాం'' చెప్పే అల వాటు మనలో తగ్గిపోతోంది. వీటికి బదులుగా ''హలో... హాయ్... టాటా... ఛీరియో... బాయ్... బాయ్... వావ్...!'' అంటూ ఏవో చిత్రవిచిత్ర పదాలు వాడు తున్నారు. 'నమ స్కారం' అంటూ వందనం ఆచరించడంలో ఉన్న సభ్యత, విధేయత 'హలో..హాయ్...!' అనే ఆధునిక పదాల్లో ఉంటాయా?

ఇక ఈనాటి కట్టు, బొట్టు, జుత్తు సంగతి మనందరికీ తెలిసిందే! ఈ విషయాల్లో మన యువతులు మరీ దారుణంగా స్వసంస్కృతికి విముఖత చూపించడం మన దుర్భాగ్యం. మరి ఇటువంటి పరిస్థితుల్లో స్త్రీలపై గౌరవభావం పెరగాలంటే ఎలా సాధ్యం? వినయపూర్వక వేషధారణ, ప్రవర్తన గల స్త్రీలను గౌరవించ కుండా ఉండగలమా?

**నేటి మన తల్లులు తమ పిల్లలచే ''అమ్మా!'' అని ఆప్యాయంగా పిలిపించుకునే భాగ్యాన్ని కోల్పోతున్నారు. 'అమ్మ' అనే కమ్మ నైన పిలుపుకు బదులుగా - ఈజిప్ట్‌వారి పిరమిడ్లనూ, శవాలనూ గుర్తుకుతెచ్చే ''మమ్మీ'' అనే పిలుపునే నేడెంతో మంది తల్లులు కోరుకుంటున్నారు.**

వేషభాషలు, ప్రవర్తన, ఆహారవిహారాలూ అన్నింటిలోనూ విదేశీ అనుకరణనే ఇష్టపడు తున్నారు మనవాళ్ళు. ప్రాచీన హైందవ సంస్కృతీ సాంప్రదాయాలకు విదేశాల్లో ఒక ప్రత్యేక గౌరవం ఉందనేమాట మనవాళ్ళు మరచిపోతున్నారు. పండుగలను అనుసరించే పద్ధతులలో కూడా విదేశీ అలవాట్లకు బానిస లౌతున్నారు. మన పండుగల నిర్వహణా విధా నాల్లో ఉన్న విజ్ఞానాంశాల్ని గ్రహించలేక మూర్ఖపు ధోరణులకు, నాస్తిక ధోరణులకు, అసభ్య నడవడికలకూ బలి అవుతున్నారు. తస్మాత్ జాగ్రత్త!!

## ఆంగ సంవత్సరాది X ఉగాది

జనవరి 1 వ తేదీని 'ఆంగ్ల సంవత్సరాది' అనీ, ఉగాదిని 'తెలుగు సంవత్సరాది' అనీ మనం వ్యవహరిస్తుంటాం.

సంవత్సర ఆరంభాన్ని నిర్ణయించడానికి విదేశీయులు ఎన్నెన్నో పాట్లు పడినట్లుగా చరిత్ర చెప్తోంది. అయితే హిందువులు మాత్రం కాల మాన విషయంలో (శకాల విషయంలో గానీ, సంవత్సర ఆరంభ నిర్ణయంలో గానీ... లేదా మరోటి గానీ) ఎలాంటి ఒడిదుడుకుల్నీ ఎదు ర్కోలేదు. పురాణకాలంనుండీ ఖగోళ శాస్త్ర పరంగా అన్నీ సక్రమంగానే లెక్కించు కుంటూ వచ్చారు.

''ఖగోళశాస్త్రం'' అంటే ఏమిటి?

సూక్ష్మంగా చెప్పాలంటే-విశ్వం (Universe) లోని నక్షత్రాలు, గ్రహాలు, ఉప గ్రహాలు, తోకచుక్కలు, గ్రహశకలాలు మొద లయినవాటి స్థితిగతుల్ని వివరించే శాస్త్రమే ''ఖగోళశాస్త్రం''. శాస్త్రాలన్నింటిలో ప్రముఖ మైన శాస్త్రంగా దీన్ని చెప్పుకోవచ్చు. అయితే ఖగోళశాస్త్ర పరిజ్ఞానం గలవారు మాత్రం బహు అరుదు. మన పాఠ్యాంశాల్లో ఈ శాస్త్రవిజ్ఞానం అంతగా లేకపోవడమే దీనికి కారణం. కాల మాన విజ్ఞానాన్ని తెలుసుకోవాలంటే ఖగోళశాస్త్ర పరిజ్ఞానం అత్యంత అవసరం. (ప్రాచీన హిందు వులు ఖగోళశాస్త్రంలో ఆరితేరిన పండితులు)

ఖగోళం : భూమి వాతావరణానికి అవ తల వ్యాపించియున్న అనంత విశ్వాన్ని 'అంతరిక్షం' అంటారు. గ్రహతారకాదులతో కూడిఉన్న ఆ అంతరిక్ష పరిధినే ''ఖగోళం'' అని వ్యవహరిస్తాం.

కాలమానానికి ఆధారం ''ఖగోళం''

భూమి ఒక ఆత్మ ప్రదక్షిణం చేస్తే '1 రోజు' అనీ, చంద్రుడు ఒక భూప్రదక్షిణం చేస్తే '1నెల' అనీ, భూమి ఒకసూర్య ప్రదక్షిణం చేస్తే '1సంవత్సరం' అనీ.....ఇలా కాల మానాన్ని ఖగోళ ఆధారంగానే లెక్కించు కుంటున్నాం మనం. 'సంవత్సర ఆరంభం' అనేది ఖగోళ విషయ ఆధారంగానే ఉండి తీరాలని ఇందుమూలంగా తెలుస్తోంది.

ఖగోళ శాస్త్రపరంగా మన 'ఉగాది'ని 'సంవత్సరారంభం'గా నిర్ణయించారు మన పూర్వీకులు. ఏ ఖగోళ ఆధారమూ లేకుండా జనవరి 1 వ తేదీని 'సంవత్సరారంభం' గా నిర్ణయించుకున్నారు పాశ్చాత్యులు.

'సంవత్సర ఆరంభానికి ఆధారం ఏది'

''సంవత్సరం'' అనేది కాలమానంలో ఒక అంశం. నక్షత్రాల, గ్రహాల ఉనికీ - చలనా లను బట్టి ఖగోళ శాస్త్రపరంగా కాలమానం

ఖచ్చితంగా ఒక ఖగోళ ప్రత్యేకత అంటూ ఉండితీరాలి.

**ఖగోళ ప్రాముఖ్యత లేని "జనవరి ఫస్ట్"**

ఏ ఖగోళ ప్రత్యేకతా, ఆధారమూ లేకుండా ఎవరికో తోచిన ఓ అనామక తేదీని (జనవరి 1వ తేదీని) "సంవత్సరారంభంగా" అంగీకరించి అనుసరించడం సరికాదు. యదార్థ సంవత్సరారంభం అయిన ఉగాదిని మరచి, పాశ్చాత్య పోకడల వెర్రివ్యామోహంలో పడి జనవరి ఫస్ట్‌కు దాసోహమంటున్నాం. డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి సమయంలో పిచ్చెక్కినట్టు గంతులు వేస్తూ, మత్తు పానీయాలు సేవిస్తూ, గడియారం 12 గంటలు కొట్టగానే, మూర్ఛ వచ్చినట్టు ఆవేశంగా ఊగిపోతోంది నేటి యువతరం. అంతగా వెర్రెక్కిపోవడానికి ఏం జరిగింది ఆ సమయంలో! ఏమీ లేదు, అంతా భ్రమ!! కాలగమనంలో సంవత్సరం మార్పుకు 'నాందిగా' ఖగోళపరంగా ఏ మార్పూ అప్పుడు జరగదు. మరి ఆ వెర్రి కేరింతలు ఎందుకో మరి! జనవరి ఫస్ట్ పేరిట వెర్రిమొర్రి చిన్నెలు పెచ్చుపెరిగి పోతున్నాయి. మనదైన యథార్థ విజ్ఞానాన్ని మనం మననం చేసుకోవలసిన తరుణం ఆసన్నమయింది. పాశ్చాత్య సంస్కృతి వల్ల మనకు కలుగుతున్న వెర్రిని అదుపులో ఉంచుకుని, యథార్థ స్థితిగతుల్ని ఆకళింపుచేసుకోవలసిన సమయం వచ్చింది. కేవలం వేపపువ్వు పచ్చడి తినే పండుగలా మిగిలిపోతున్న ఉగాదిని గురించి అనేక వివరాలు నేటి తరం తెలుసుకోవాలి. మన సంస్కృతికి వెర్రితలలు వేయిస్తున్న పాశ్చాత్య దుష్టసంస్కృతిని ఓ కంట కనిపెట్టడం అత్యంత అవసరం.

**నలుగురితో పాటూ నారాయణా**

"ప్రపంచమంతటా జనవరి ఫస్ట్ 'సంవత్సరాదిగా' ఆచరించబడుతోంది కదా! ఒక్కరమూ ఉగాదిని 'సంవత్సరాదిగా' పట్టుకుని వ్రేలాడ్డం బావుంటుందా?" అని కొందరికి సందేహం రావచ్చు. వారి సందేహం యథార్థమే! "ఊరందరిదీ ఒక దారి అయితే, ఉలిపి కట్టెది మరో దారి" అన్నట్లుగా ఉండడం మంచిదికాదు, నిజమే! 'నలుగురితో పాటూ నారాయణా....' అన్నట్లుగా ప్రపంచాన హెచ్చుమంది అనుసరిస్తున్న కాలమానం ప్రకారం 'జనవరి టు డిసెంబరు' క్యాలెండరును

**సంవత్సర ఆరంభాన్ని నిర్ణయించడానికి విదేశీయులు ఎన్నెన్నో పాట్లు పడినట్లుగా చరిత్ర చెప్తోంది. అయితే హిందువులు మాత్రం కాల మాన విషయంలో ఎలాంటి ఒడిదుడుకుల్నీ ఎదుర్కోలేదు. పురాణకాలం నుండీ ఖగోళ శాస్త్ర పరంగా అన్నీ సక్రమంగానే లెక్కించుకుంటూ వచ్చారు.**

మనమూ అనుసరిద్దాం. ప్రస్తుత ప్రపంచరీతికి ఎదురీదమని మేము చెప్పడం లేదు. నలుగురితో పాటూ జనవరి ఫస్ట్‌తో మొదలెట్టి సంవత్సరాన్ని లెక్కించుకుంటే, మనకు పోయిందేమీ లేదు. అయితే జనవరి ఫస్ట్ అనేది, యథార్థ కాలమాన సంవత్సరానికి మొదటిరోజు కాదనే విషయాన్ని మాత్రం మనం గుర్తుంచుకోవాలి. కాలమానంలో యథార్థ సంవత్సర ఆరంభం 'ఉగాది'' అని తెలుసుకోగలగాలి.

**మన ప్రాచీన విజ్ఞత**

అనంతమైన కాలచక్ర గమనాన్ని లెక్కించుకోవడానికి 'కాలమానాన్ని' ఏర్పరచుకున్నారు మానవులు. విశ్వసృష్టిని అత్యంతటగా కాలమానాన్ని ఏర్పరచింది మన ప్రాచీన భారతీయులే! భూమిపై అతి ప్రాచీన నాగరికత వైదిక జాతిదే!

మన పురాణాల్లో మేరు పర్వతం గా వ్యవహరించబడే నేటి ఉత్తర ధ్రువప్రాంతం ప్రాచీన హిందువుల మొట్టమొదటి నివాసం. (మన వేదాల రచన ఆకాలంలోనే ప్రారంభమయింది) క్రమంగా ఉత్తర ధ్రువప్రాంతం 'మంచుభూమిగా' మారుతూ నివాసయోగ్యం కాకపోవడంతో, మన ప్రాచీన భారతీయులు అక్కడనుండి మధ్య ఆసియా ద్వారా క్రిందకు దిగివచ్చి సింధునది వద్ద భరతఖండంలో స్థిరపడ్డారు.

అనంతర కాలంలో భూమిపై అక్కడక్కడా కొన్ని (విదేశీ) జాతులు పుట్టుకొచ్చాయి. వాళ్ళంతా అనాగరికులుగా తిరిగే కాలంలో, మన వేదమతస్థులు అత్యున్నత నాగరిక జీవనాన్ని కలిగి ఉండేవారు. వేల వేల సంవత్సరాల తర్వాత మెల్లగా విదేశీజాతులు నాగరికత అలవరచుకోసాగాయి. ప్రాచీన హిందువులనుండి అనేక విజ్ఞాన విషయాల్ని వారు నేర్చుకోసాగారు. అయితే వారి బుద్ధి మాత్రం సరియైనదికాదు. సుభిక్షంగా ఉన్న భరత ఖండంపై వారి వక్రదృష్టిపడింది. ఫలితంగా భరత ఖండం విదేశీయుల దండయాత్రలకూ, దోపిడీలకూ, దౌర్జన్యాలకూ, చివరకు ఆక్రమణలకూ గురిఅయింది. తత్కారణంగా "మన హిందూ జాతి పూర్వ చరిత్ర" మెల్ల మెల్లగా కాలగర్భంలోకి వెళ్ళిపోయింది. విదేశీయుల దౌర్జన్య పరిపాలనల్లో హిందువులు తమ ప్రాభవాన్ని కోల్పోయి, తమ సంస్కృతిని మరచిపోతూ జీవచ్ఛవాల్లా తయారయ్యారు. ఇదీ నేటి మన జాతి పరిస్థితి! మన హిందూజాతి ప్రాచీన ఔన్నత్యాన్ని ఒప్పుకోలేని పాశ్చాత్యులు - హిందూజాతి

నాగరికత కంటే ఈజిప్ట్, గ్రీకు, చైనా మొదలగు వారి నాగరికతలు ప్రాచీనమైన వని నిర్ధారణ చేస్తూ 'తప్పుడు చరిత్రల్ని' వ్రాసి పెట్టారు. వారు వ్రాసిన కల్లబొల్లి చరిత్రల్ని యదార్థాలుగా నమ్మి తలకెక్కించుకుని, పాశ్చాత్య సంస్కృతీ ప్రభావంలో గమ్యంలేని దిశగా కొట్టుకు పోతున్నాం మనం. ఈ పరిస్థితి గురించి ఆలోచించేందుకు తీరిక లేదు మనకు. అదీ ప్రస్తుత దుస్థితి!!

నేటి ప్రపంచ విజ్ఞానానికి యథార్థ పునాది మన హైందవ విజ్ఞానమే! మన హైందవ విజ్ఞాన ప్రాచీనతను కనుగొనడం ఎవరి తరమూ కావడంలేదు. మన హిందూ ప్రాచీన విజ్ఞాన గ్రంథాలు ''వేదాలు''. అయితే వేదకాల నిర్ణయాన్ని ఎవరూ ఖచ్చితంగా చేయలేక పోయారు. అంతటి పురాతన గ్రంథాలవి! భూగోళంపై మొట్టమొదటి విజ్ఞా గ్రంథం, 'ఋగ్వేదం' అని ప్రముఖ జర్మన్ పండితుడు మాక్స్ ముల్లర్ కూడా ప్రశంసించడం మనం గుర్తుకు తెచ్చుకోవచ్చు. ఇదీకాక... మరో విషయం! గంగానది పుట్టుకను వివరిస్తున్నాయి మన పురాణాలు. అంటే గంగానది కంటే ముందే మన విజ్ఞానం పుట్టిందన్న మాట. గంగానదీ జన్మకాలాన్ని ఏ చరిత్రకారులూ నిర్ణయించలేకపోతున్నారు. అంతకంటే ప్రాచీనత కల్గిన 'సింధునది' పుట్టుక ఇక ఎవరికీ అందదు. (సింధునది పేరుమీదనే మన ప్రాచీనులకు 'సింధువులు' అని పేరొచ్చింది. 'సింధువులు' అనే పేరే కాలక్రమేణా 'హిందువులు'గా మారడం మనకు తెలుసు కదా') దీన్ని బట్టి మన సంస్కృతీ ప్రాచీనత ఎటువంటిదో ఆలోచించండి. ఏ దేశ చరిత్రకారులైనా సరే - విదేశీయుల ప్రాచీనతల్ని మాత్రమే నిర్ణయించగలిగారు. హిందువుల ప్రాచీనతను నిర్ణయించలేకపోతున్నారు. ప్రపంచ జాతులన్నింటిలో అగ్రగణ్య సంస్కృతీ శోభలో వెల్లి విరిసిన ప్రాచీన జాతి 'మన హిందూ జాతి'.

మనం ఇప్పుడు చదువుకుంటున్న తప్పుడు చరిత్ర ప్రకారం ఈజిప్ట్, గ్రీకు, చైనా మొదలగు దేశాలవారు అతి ప్రాచీనులుగా లెక్క. అతి ప్రాచీనులుగా చెప్పబడే అనేక దేశాల వారు పోటాపోటీలుగా ప్రాచీనకాలపు మన భరత ఖండాన్ని దర్శించుకుని, మన సంస్కృతీ జీవన విధానాల్ని ఎంతగానో కీర్తించారు. (పూర్వ కాలాన మన భరతఖండానికొచ్చిన విదేశీ రాయబారుల, యాత్రికుల వ్రాతలే ఇందుకు సాక్ష్యాలు.)

మన పూర్వీకుల వద్ద మన కళలనూ, విజ్ఞానాన్నీ నేర్చుకుని వెళ్ళేవారు విదేశీయులు. (ఎందరో విదేశీ విద్యార్థులు మన తక్షశిల, నలందా, కాశీ విశ్వవిద్యాలయాల్లో ఉన్నత విద్యాభ్యాసం చేసేవారు ఆనాడు) గ్రీకులు మన కళలను తమ కళలతో కలబోసుకున్నారు. హిందువులనుండే తమకు గణిత, ఖగోళ శాస్త్రవాషయాలు లభించాయని అరబ్బులు తమ గ్రంథాల్లో చాటుకున్నారు. విజ్ఞానార్జన కోసం ఇలా విదేశీయులు మన భరత భూమికి తరచుగా వచ్చేవారు. చివరకు ఇజ్రేల్ దేశ జెరూసలెం వాసి అయిన ఏసుక్రీస్తు కూడా మన భరతఖండాన్ని పర్యటించి ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని పొందడం జరిగిందని ఇటీవలి చారిత్రక పరిశోధనలు నిరూపిస్తున్నాయి. (గురుతుల్యులూ, ప్రముఖ చారిత్రకపరిశోధకులూ అయిన డాక్టర్ వేదవ్యాస్ **I.A.S.**, గారి ''ఇండియాలో జీసస్'' అనే గ్రంథం ద్వారా మనం యేసుక్రీస్తు జీవితానికి సంబంధించిన ఎన్నో చారిత్రక యథార్థాల్ని తెలుసుకోవచ్చు. యేసుక్రీస్తు జీవితంపై, బైబిల్‌పై ఎన్నో విస్తృత పరిశోధనల్ని సాగించిన విదేశీ చరిత్రకారుల, పరిశోధకుల పరిశీలనా ఫలితాల్ని ఆ గ్రంథంలో చూడవచ్చు. ఆ గ్రంథం ఆధారంగా కొన్ని విషయాల్ని ఈ వ్యాసంలో ప్రస్తావించడం జరిగింది.)

## క్రీస్తు శకం గురించి ఒక అవగాహన

ప్రస్తుత ప్రపంచమంతా '' క్రీస్తు పూర్వం, క్రీస్తు శకం '' అంటూ కాలమానాన్ని లెక్కించడం చూసి, మనలో చాలామంది అనేక అపోహలకు లోనౌతున్నారు. మన హిందువుల చరిత్ర అంతటి ప్రాచీనమైనదైతే, క్రీస్తుశకాన్ని ఉపయోగిస్తూ కాలాన్ని లెక్కించడం ఎందుకొచ్చిందని అనేకమందికి సందేహం. ప్రపంచమంతా క్రీస్తుశకం వాడడంలో ప్రముఖమైన విశేషమేదో ఉండి ఉంటుందనుకుని, ఆ విదేశీ శకాన్ని ఎంతో గొప్పగా భావిస్తుంటారు చాలామంది. అయితే ఇందులో దాగివున్న యధార్థాలెన్నో వారికి తెలియవు. క్రీస్తుశకం అనేది ఎందుకొచ్చిందో, ఎలా వచ్చిందో తెలియని వాళ్ళు అసంఖ్యాకంగా ఉన్నారు. అందుచేత 'క్రీస్తుశకం' వెనుక దాగి ఉన్న యథార్థాన్ని తెలుసుకుందాం రండి.

---

చరిత్రలో ఎప్పుడు ఏ సంఘటన జరిగిందో ఖచ్చితంగా తెలుసుకోవడానికి, సంవత్సరాలను వరుసగా లెక్కించుకుంటూ రావడం అవసరమయింది. అయితే ఈ లెక్కకు ఎక్కడ నుండి మొదలని చెప్పగలం? పురాణ పురుషుల కాలం నుండో, మహాప్రతిభావంతులైన చక్రవర్తుల కాలం నుండో, ఏ ప్రవక్త కాలం నుండో, ఏదైనా గొప్ప సంఘటన జరిగిన నాటి నుండో - సంవత్సరాలను లెక్క పెట్టడం చరిత్రలో ఒక రివాజు. అదే 'శకం' లెక్కింపు!

ఒక్కొక్క జాతి ఒక్కొక్క కాలంలో తమ 'శకాలను' ప్రారంభించుకుంది. మన హిందూ జాతికి అతి పురాతన కాలంనుండీ అనేక శకాలున్నాయి. (కలిశకం, విక్రమశకం, శాలివాహన శకం మొదలైనవి.) ప్రస్తుతం మనకు కలిశకం లెక్క ఆచరణలో ఉంది.

## క్రీస్తుశకాన్ని మనం ఎందుకు వాడుతున్నాం మరి?

ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో అలవాటుచేయబడిన క్రీస్తుశకం కాలమానాన్ని ప్రపంచరీతి కోసం నేటికీ మనం అనుసరిస్తున్నాం.

ఏ జాతికి ఆ జాతి విడివిడిగా బ్రతుకు తున్నప్పుడు ఎవరి శకాన్ని వారు నిక్షేపంగా వాడుకోవచ్చు. పరజాతుల సంపర్కం మొదలై, ఒకరి చరిత్రను మరొకరు అర్థం చేసుకోవలసి వచ్చినప్పుడు మాత్రం 'ఏదో ఒక ఉమ్మడి శకాన్ని' అందరూ కలసి ఆచరించవలసి వస్తుంది. ప్రపంచాన క్రైస్తవాన్ని ఆదరించే దేశాల ప్రాబల్యంవల్ల ఏసుక్రీస్తు శకాన్ని ('క్రీ.శ ను) ఉమ్మడి శకంగా తీసుకోవలసి వచ్చింది. అంతే గానీ మిగిలిన శకాల కంటే క్రీస్తుశకానికి ఏదో ప్రత్యేకత ఉందని మాత్రం అనుకోకండి. క్రీస్తుశకం గురించి మరింత వివరంగా....

క్రీస్తుశకం అనే కాలమానం ప్రపంచ వ్యాప్తం కాకముందు వివిధ దేశాల్లో అనేక రకాల కాలమానాలు, శకాలు వాడబడేవి. (కాల మానం కోసం శకాలను వాడిన ప్రథములు హిందువులే నని మరువకండి. శకం అనే లెక్కను మననుండి నేర్చుకున్న విదేశీయులు, 'క్రీస్తు శకం' అనే అసంబద్ధ శకాన్ని సృష్టించుకుని - తిరిగి దాన్ని మనకే అంటగట్టారు.)

వివిధ దేశాల ప్రజలు వివిధ కాలమానాలతో జీవనాలు సాగించేవారు. ఎవరి లెక్కలు వారికుండేవి. తమకు తెలియని విషయాల్ని, మరో జాతి నుండి నేర్చుకునేవారు. అయితే కాలం గడిచేకొలదీ - ప్రపంచమంతా ఒకే కాలమాన పద్ధతిని అనుసరిస్తే బావుంటుందనే భావన మొదలయింది. 'అయితే ఎవరి కాల మానాన్ని ప్రపంచ కాలమానంగా' తీసు కోవాలనే సమస్య వచ్చింది. - ఈ సమస్య ఉత్పన్నమైన కాలాన ప్రపంచంలో అనేక ప్రాంతాలు బ్రిటీష్‌వారి ఆక్రమణలకు లోనై వున్నాయి. ('రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం' అనే వారందుకే!) బ్రిటిష్‌వారు తాము స్వీకరించిన 'క్రీస్తుశకం' అనే కాలమానాన్ని బలాతి శయంతో ప్రముఖంగా ముందుకు తీసు కొచ్చారు. తమ ఆధీనంలోని దేశాలన్నింటిలో దాన్ని అమలు పరచడం మొదలెట్టారు. ఆ విధంగా ప్రపంచాన హెచ్చు ప్రదేశాల్లో క్రీస్తు శకం వాడకం మొదలయింది. ఆ తర్వాత కాలంలో మిగతావారు కూడా తమ సౌలభ్యం కోసం క్రీస్తుశక కాల మానాన్ని తప్పనిసరిగా తీసుకున్నారు. (ప్రపంచ వ్యాప్తంగా సౌలభ్యం కోసం శకాన్ని వాడుతున్నా కూడా, నేటికీ అనేక దేశాల వారు వారివారి స్వంత శకాలనూ, కాలమానాలనూ, పండుగలనూ వేర్వేరుగా అనుసరిస్తూనే ఉన్నారు) కాల క్రమేణా ఈ విధంగా క్రీస్తు శకం అనేది వాడుక కాలమానంగా ప్రపంచాన స్థిరపడింది. అయితే ఇందులో మరో చిత్రం ఒకటుంది. ఏసుక్రీస్తు ఎప్పుడు పుట్టాడనే విషయాన్ని చరిత్రకారులెవరూ కూడా ఒక నిర్ధారణగా ఇప్పటికీ చెప్ప లేకపోతున్నారట. క్రీస్తు జీవితానికి సంబంధించి ఏ చారిత్రక ఆధారమూ కన్పించడంలేదని విదేశీ చరిత్రకారులు అంటున్నారు. (ప్రముఖ విదేశీ గ్రంథకర్త హెచ్.జి.వెల్స్ (**H.G.Wells**) తన ''ప్రపంచ చరిత్ర'' గ్రంథంలో ఇటువంటి అభిప్రాయాన్నే వెలిబుచ్చడాన్ని ఇందుకో ఉదాహరణగా చెప్పుకోవచ్చు.)

## ...ని ప్రారంభించింది ఎవరు?

క్రీస్తుశకం ఆరంభం కావడం ఒక విచిత్ర పరిస్థితి ద్వారా జరిగింది. క్రీస్తు పుట్టుక నుండి క్రీస్తుశకం మొదలయిందని అనేక మంది భావిస్తారు. అది పొరబాటు, యేసుక్రీస్తు జీవించాడని చెప్పబడుతున్న కాలానికి కొన్ని శతాబ్దాల తర్వాత క్రీ.శ. 532వ సంవత్సరంలో ''డయోనీషియస్ ఎక్సీగస్'' అనే రోమన్ సన్యాసి, క్రీస్తు పేరుతో ఒక శకాన్ని ప్రారంభించా లంటూ ప్రచారాన్ని మొదలెట్టాడట. క్రీస్తు పుట్టిన సంవత్సరం క్రీ.శ 1 అని అతను ప్రతిపాదించాడు. అయితే చాలా కాలం వరకూ ఈ క్రీస్తుశకం అనే అంశాన్ని ఎవరూ అంగీకరించలేదు. క్రీ.శ.816లో చల్సా బిషప్‌ల మహాసభ క్రీస్తు శకాన్ని వాడకంలోకి తీసుకురావాలంటూ పిలుపునిచ్చింది. అయినా చాలా సంవత్సరాలు ఎవరూ పట్టించుకోలేదు. క్రీ.శ.879 లో జర్మనీ చక్రవర్తి 2వ ఛార్లెస్ మొట్టమొదటగా క్రీస్తు శకాన్ని అమలులో పెట్టాడట. అనంతర కాలంలో ఇతర చోట్ల మెల్ల మెల్లగా క్రీస్తుశకం వాడకం మొదలయింది. అదీ క్రీస్తుశకం చరిత్ర! అంటే క్రీస్తు జీవితానంతరం సుమారు 800 సంవత్సరాల తర్వాత, క్రీస్తుశకం అమలులోనికి వచ్చిందన్న మాట. అయితే క్రీస్తు పుట్టింది క్రీ.శ 1లో కాదనీ, క్రీస్తుపూర్వం 4వ సంవత్సరం అయిఉండవచ్చుననీ 'సర్ జాన్ కెప్లర్' అనే సుప్రసిద్ధ చరిత్రకారుడు తేల్చాడట. అయినా క్రీస్తుశకం లెక్కను మాత్రం ఎవరూ మార్చలేదు. అలాగే వదిలేశారు. అదే అలా కొనసాగుతోంది.

చరిత్ర నిర్ధారణ చేసిన ఒక మహానుభావుని పుట్టుకతో 'శకాన్ని' లెక్కించడం ఒక ఆనవాయితీ! ఇప్పటికీ చరిత్ర నిర్ధారణ చేయలేక పోతున్న క్రీస్తు కాలాన్ని ప్రమాణంగా చేసుకుని కాలమానాన్ని (శకాన్ని) లెక్కించడం ఆశ్చర్యకరం. ఒక ఆధారమంటూ లేకుండా కొనసాగుతున్న ఆచారం ''క్రీస్తుశకం వాడకం''.

''పదుగురాడు మాట పాడియై ధర జెల్లు!'' అన్నారు అందుకేనేమో!!

ఇజ్రేల్ నందలి జెరూసలెంలో క్రీస్తు పూర్వం ''ఎస్సీనులు'' అనబడే సాధువుల జాతిలో ఈశా (యేసు) అనే ఆయన ఉండే వాడట. ఆయన జీవితాన్నే కొన్ని వందల సంవత్సరాల తర్వాత, ఈనాడు చెప్పబడుతున్న ఏసుక్రీస్తు జీవితంగా మలచడం జరిగి ఉంటుందని ''ఇండియాలో జీసస్'' గ్రంథం ద్వారా మనకు అర్థం కాగలదు.

'ఈశా' అని పిలువబడే ఈ జెరూసలెం వాసి తన 13వ యేట కొందరు వర్తకులతో

కలిసి బయలు దేరి శిల్కు మార్గం గుండా మధ్య ఆసియాకు, అక్కడ నుండి కైబరు కనుమలు దాటి హిమాలయాల మీదుగా భారతదేశానికి చేరుకున్నాడట. కాశ్మీర్ - లడక్‌ల మధ్య 'లామాసరీ' బౌద్ధాశ్రమంలో యోగసాధనలూ, జపతపాలూ చేశాడట. ఆయన బుద్ధ భగవానుని అహింసా సూత్రాలతో బాగా ఆకర్షించబడ్డాడట. ఆ తర్వాత పంజాబ్‌లో జైనుల్ని కూడా కలిశాడట. అనంతరం పూరీలోని వేద పండితుల్ని కలుసుకుని, భారతదేశంలోని ధర్మ నిరతికి అబ్బురపడ్డాడట. హిందూ యోగుల వద్ద వేదాలలోని రహస్య యోగ సిద్ధులూ, ధ్యానం, వైద్య విధానాలూ నేర్చుకున్నాడట. ఆ తర్వాత కాశీ, గయ, సారనాధ్, ద్వారక మొదలగు తీర్థాలు అనేకం దర్శించుకుని భూటాన్ చేరుకున్నాడట.

అక్కడ 'హిమ్మిస్' బౌద్ధారామంలో జ్ఞాన మార్గం గురించి అధ్యయనం చేసి, తన 30వ యేట తిరిగి జెరూసలెంకు వెళ్ళిపోయా డట. అక్కడ ఎస్సీను సాధువులు కొంతమంది ఆయనకు శిష్యులయ్యారట. తన యోగశక్తితో, వైద్య విధానాలతో ప్రముఖంగా పేరు తెచ్చుకుంటున్న 'ఈశా' అంటే, అక్కడి మతాధికారు లకు అసూయ బయలుదేరింది. రాజకీయ ఉద్యమం ఏదో నడిపిస్తున్నాడనే నెపంపై ఈశాకు శిలువ శిక్ష వేయించారు. ఈశాను శిలువ వేశారు. (అయితే శిలువపై ఆయన మరణించలేదనే విషయం, పాశ్చాత్యుల పరిశోధనల వల్ల తేలిందట) కొనప్రాణంతో ఉన్న ఈశాను ఆయన శిష్యులంతా శిలువపై నుండి దింపి, రక్షించుకున్నారట. ఆవిధంగా ఈశా అక్కడ నుండి తప్పించుకుని జెరూసలెం నుండి పర్షియా మీదుగా ఆఫ్ఘనిస్తాన్ చేరి, మళ్ళీ భారతదేశానికే చేరుకున్నాడట. హిందూ యోగుల మూలికావైద్యాలతో మళ్ళీ పూర్తి ఆరోగ్యవంతుడై భారతదేశ సందర్శన గావించి, చివరగా కాశ్మీర్‌లో ఆశ్రమజీవితాన్ని గడిపి, తన 89వ యేట మరణించడం జరిగిందట. కాశ్మీర్‌లో ఇప్పటికీ ప్రత్యక్షంగా ఈశా (ఏసు) సమాధి ఉంది. క్లుప్తంగా ఇదీ ఈశా (ఏసు) చరిత్ర! ఈయన తన జీవితంలో ఏ మతాన్నీ స్థాపించలేదట! ఈ ఈశా (ఏసు) చరిత్ర అంతా హిమాలయాల్లోని 'హిమ్మిస్ మొనాస్టరీ' అనే బౌద్ధారామంలో తాళపత్ర గ్రంథాల రూపంలో నేటికీ లభిస్తోందట. ప్రముఖ చారిత్రక పరిశోధకుడూ, రష్యన్ రాయభారి అయిన ''అలెగ్జాండర్ నోటొవిచ్'' అనే ఆయన స్వయంగా ఆ తాళపత్ర గ్రంథాలను పరిశోధించి ఈ వివరాలన్నింటినీ ప్రపంచానికి మొట్టమొదట సారిగా అందించాడు. ఈ చరిత్ర అంతటిపై అమెరికాలోని ఒక ప్రముఖ T.V. సంస్థ వారు వీడియోక్యాసెట్స్ కూడా రూపొందించారట.

మరో ప్రముఖ విషయాన్ని కూడా మనం ఇక్కడ తెలుసుకోవాలి. తన 13వ సంవత్సరం నుండి 30వ సంవత్సరం వరకూ ఏసుక్రీస్తు ఎక్కడున్నదీ, ఏంచేసినదీ బైబిలు కూడా చెప్పడం లేదు. ఆ కాలాన్ని "Missing years of Christ" (జాడతెలియకుండా పోయిన ఏసుక్రీస్తు జీవిత భాగం) అని విదేశీయులు వ్యవహరిస్తుంటారు. చరిత్ర పరిశోధకులకూ, బైబిలు పరిశీలకులకూ కూడా ఈ 'మిస్సింగ్ ఇయర్స్' ఒక సమస్యగా తయారయింది చాలాకాలం. దానిపై అనేక పరిశోధనలు జరిగి ఎన్నో గ్రంథాలు ప్రచురితమయ్యాయి. ఆ గ్రంథాల్లో పరిశోధకులంతా ''ఏసుక్రీస్తు భారతదేశ పర్యటన''నే నిరూపించారు.

క్రీస్తుశకం ప్రారంభం కావడానికి మూల కారకుడైన 'డయొనీషియన్ ఎక్సీగస్' చేసిన మరో విచిత్రాన్ని ఈ సందర్భంలో తెలుసుకుందాం. డిసెంబర్ 25వ తేదీని క్రీస్తు జన్మదినంగా భావిస్తుంటారు కదా! దానివెనుక ఒక గాథ ఉందట. క్రీస్తు గత చరిత్రపై అద్భుతమై పరిశోధన చేసిన ''విల్‌డ్యూరాంటో'' అనే అమెరికన్ చరిత్రకారుడు క్రిస్‌మస్ పండుగ వెనుక దాగిఉన్న ఆ గాథను బయటపెట్టాడు. (క్రీస్తు పుట్టిన సంవత్సరాన్ని నిర్ధారణ చేయలేకపోతున్నారు చరిత్రకారులు. ఆయనపుట్టిన నెల, తేదీలను నిర్ణయించగల అవకాశాలు కూడా చరిత్రలో ఎక్కడా కన్పించడంలేదు.) క్రీ.శ 5వ శతాబ్దిలో 'డయొనీషియన్ ఎక్సీగస్' ఒక ప్లాను వేశాడట. ఆ కాలాన రోమ్ నగరంలో ప్రతియేటా డిసెంబరు 25వ తేదీన ''శాటర్నేలియా'' అనే పండుగ వేలాది మందితో తిరునాళ్ళవలే జరుపుకొబడేది. తన క్రైస్తవ మత ప్రచారానికి అనుకూలంగా ఉంటుందని భావించిన ఎక్సీగస్, అదే రోజును క్రీస్తు జన్మదినంగా ప్రచారం చేసేవాడట. కాలక్రమేణా ఆ ప్రచారం ముదిరి, క్రీ.శ. 1020 నాటికి డిసెంబర్ 25వ తేదీ క్రీస్తు జన్మదినం 'క్రిస్‌మస్'గా ప్రపంచాన అనేకచోట్ల స్థిరపడిందట! ''విల్ డ్యూరాంటో'' ఈ విషయాన్నంతా పరిశోధించి, ప్రపంచానికి అందించాడు.

''ఎన్నో పరిశోధనల ద్వారా పై విషయాలన్నింటినీ నిరూపించినవారు విదేశీ క్రైస్తవులేనని మనం మరచిపోకూడదు.''

''అలెగ్జాండర్ నోటొవిచ్, లూయీస్ జకొలియట్, మేడమ్ బ్లావట్స్కి, హెచ్.జి. వెల్స్, హోల్గర్ కెర్‌స్టన్, మేడమ్ బార్బరా, ఎర్నెస్ట్ రేనాన్, విల్ డ్యూరాంట్, ప్రొఫెసర్ ట్రిలింగ్, ఆర్థర్ బి.మోస్, బ్రూస్, బీచర్ మొదలయిన విదేశీ చారిత్రిక పరిశోధకులూ, బైబిలు పరిశోధకులూ, ఎంతోమంది పై విషయాల్ని నిరూపిస్తూ ఎన్నెన్నో గ్రంథాల్ని వ్రాసి ప్రపంచానికి అందించారు.

(తరువాయి వచ్చే సంచికలో)

# వాగ్గేయ వైభవం

కల్లూరి వీరభద్రశాస్త్రి

*(త్యాగరాజ ఆరాధన సందర్భంగా)*

*(సంగీత సాహిత్య జగత్తులో శ్రీత్యాగరాజస్వామి వారు పరిపూర్ణ సరస్వతీ అవతారం. వాగ్గేయకారునిగా ఆయన ప్రశస్తి లోకవిదితం. రామార్పణంగా సంగీత సార స్వతాలలో నాదోపాసనచేసిన ఆ మహాయోగి, రామకథను ప్రస్తావిస్తూ రచించిన కీర్తనల్లో ఇది ఒకటి-)*

## చారుకేశి - దేశాది

**ఆడమోడి గలదే రామయ్య మాట ॥ఆ॥**

**తోడునీడ నీవే యనుచు భక్తితో**
**గూడి పాదముల, బట్టిన మాట ॥ఆ॥**

**చదువులన్ని దెలిసి శంకరాంశుడై**
**సదయు డాశుగ సంభవుండు మ్రొక్క**
**కదలు తమ్ముని బల్కజేసితివి**
**గాకను త్యాగరాజేపాటి? మాట ॥ఆ॥**

శ్రీరాముడు తనతో మాటలాడుటకు మోడి అనగా బింకమును (అంద చందము లతో - అధికార సంపదలతో ఏర్పడు నొకానొక గర్వాభినయము,) చూపుచున్నాడని ఆరో పణము చేయుట ద్వారా, రామాయణమం దలి ఒక అద్భుత సన్నివేశమును వర్ణించినారు.

రామాయణమందు రామలక్ష్మణులు సీతాన్వేషణము చేయుచూ, ఋష్యమూక మును ప్రవేశింతురు; సుగ్రీవుడు వాలి భయ ముతో, ధనుర్బాణధరులైన రామలక్ష్మణుల జూచి, వీరు వాలిపక్షీయులై నన్ను హింసించు టకు వచ్చుచున్నారని భయమంది, వారెవ్వరో విచారించి రమ్మని ఆంజనేయుని వారికడకు బంపెను.

హనుమంతుడు తన వృత్తాంతమును తొల్త విన్నవించి, వారి వివరము నడిగెను. రాముడు హనుమంతుని వాక్యపద్ధతి మాటల పొందు, మాధుర్యమును చూచి, వానితో లక్ష్మ ణుని మాటలాడమని ఆదేశించెను. ''లక్ష్మణా! ఈతడు వేదవినీతుడు. నవ వ్యాకరణవేత్త, ఇంత సంభాషణలో ''నకించి దపశబ్దితమ్'' ఒక అప శబ్దమేని రాలేదు - అని ఆనందాశ్చర్యములతో వారి సంభాషణమును విను కుతూహలము కలిగియుండెను.

ఈ సందర్భమున త్యాగ రాజస్వామియు రామాయణానుసరణముతో ''చదువులన్ని దెలిసి'' యనియు ''శంకరాంశుడైన ఆశుగ సంభవుడు = వాయుపుత్రుడు'' అనగా ఆంజనేయుడు శివాంశయగుటయేగాక, ''కిమేషభగవాన్ నందీభవేత్సాక్షాదిహాగతః'' యనియు రావణుడు తొలుత ఆంజనేయుని చూచినపుడు కైలాసమందు తన పూర్వస్మృతిచే ''ఈతడు నందీశ్వరుడా! ఏమి?'' యనివాడు. కావున శంకరాంశుడనుట ఎంతో అర్థవంతము.

ఇంతఉపకారి, అంతటి మహనీయుడు, దూతగా తనవద్దకు వచ్చినపుడు, రాముడు స్వయముగా మాట్లాడక లక్ష్మణు నితో మాట్లా డించుట వలన రామా! నీకు మాటలాడ ఎంత మోడి! యని స్వారస్యముతో అధిక్షేపించి, ఇంతటి బిగువుకల నీ దృష్టిలో ''త్యాగరాజే పాటి? నన్ను లెక్కచేతువా?'' యనుట మిక్కిలి స్వారస్యము.

అయిననూ నాతోడునీడ, నా సర్వస్వము నీవేయని శరణందిన నాతో ఒక్క మాటు పలుక మని ప్రార్థించినారు.

ఇందొక సంగీత మర్యాదతో కూడిన స్వారస్యమున్నూ కలదు. ఈ కీర్తనము తోడి, శంకరాభరణ రాగముల కలయికలో నేర్ప డిన చారుకేశియందురు. తోడి ఉత్తరదేశ గాన సంప్రదాయములోనిదని, శంకరాభరణము దక్షిణదేశ సంప్రదాయమునకు చెందినదని ప్రసిద్ధికలదు.

ఉత్తరదేశ ప్రాంతీయులైన రామలక్ష్మణు లకు దక్షిణదేశమందలి తత్రాపి కిష్కింధ పరి పాలకులతో అనుబంధమును కూర్చు సాహిత్య భావము కల యీ కీర్తనము రామ సుగ్రీవమైత్రి ప్రధానముగాగల ఆంజనేయుని రాయబార మును వర్ణించుటలో సంగీత సాహిత్యముల పొందిక ఆశ్చర్యము.

తోడునీడ నీవేయని రామపరముగా 'తోడు, శబ్దము' శంకరాంశయని ఆంజనేయ పరముగా శంకరశబ్దము, రాగముల ధ్వనియు కలదు.

త్యాగరాజస్వామి సాహిత్యమందు సంగీత సంప్రదాయము లెన్నో కలవు. భావుకులు వాటిని భావింతురుగాత! ✷



# ఉభయభారతి

విశ్వనాథ పావనిశాస్త్రి

## 1

''చూశావా?''

''ఏమిటి చూశావా?''

''శాస్త్ర చర్చలో నన్నోడించడానికి శంకరుడొస్తున్నాట్ట!''

''వచ్చాక చూద్దాం లెండి.''

''అంటే రాడంటావా?''

''నేనన్నది ఆ అర్థంలో కాదు''

''మరే అర్థంలో?''

''శంకరుడింకా రాలేదుకదా! రానివాణ్ణి ఎలా చూస్తాం? అందుకే వచ్చాక చూద్దాం అన్నాను.''

''సంతోషించాంలే!''

''సంతోషించక ఏం చేస్తారట?!''

''ఓసి ఉభయభారతీ బిరుదాంకిత సరస్వతీ మహాదేవీ! నువు మీ నాన్నగారి దగ్గర తర్కం చదివిన మాట నిజమే కానీ, నువ్విప్పుడు చేస్తున్నది కుతర్కమేమో కాస్త చూసుకో!''

''ఓయి ధర్మవిద్యా చతురానన బిరుదాంకిత మండన మిశ్ర మహాశయా! ఏం చూడమంటారు? శంకరుడొస్తున్నాడనేది వార్త. వార్తని వింటారుగాని చూడరు. ఏదైనా విషయం చెప్పబోయే ముందు 'విన్నావా' అని అనాలిగాని, 'చూశావా' అని అంటారా?''

''ఇల్లా విపరీతంగా వాదిస్తే, అసలు మాట్లాడటమే అసాధ్యమౌతుంది.''

''కష్టసాధ్యమౌతుందేమో గాని, అసాధ్యం మాత్రం కాదు. ఆచితూచి మాట్లాడటమంటే అదేమరి!''

''అబ్బా! అలాగా! అయితే-ఏదైనా విషయం చెప్పబోయే ముందు లోకంలో ఎవరైనా 'విన్నావా' అనో, 'చూశావా' అనో ప్రారంభిస్తున్నారు. అది తప్పంటావా?''

''అనను. ఏదైనా విషయం చెప్పబోయేముందు - వినే వ్యక్తిలో ఆసక్తిని పెంచడానికి-'విన్నావా' అని మొదలుపెట్టడం లోకంలో ఆచారం. కాని 'విన్నావా' అనే మాట బదులు, 'చూశావా' అనే మాట ఎలా వచ్చింది?''

''అదీ నువ్వే చెప్పు. వింటాను.'' అని నవ్వాడు మండన మిశ్రుడు.

''అయితే వినండి'' అని మండనుడి కళ్ళలోకి చూస్తూ మొదలుపెట్టింది ఉభయభారతి, ''జ్ఞానేంద్రియాలు అయిదు; చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు. వీటి అనుభూతులు అయిదు; శబ్దము, స్పర్శ, రూపము, రుచి, వాసన. ఈ అనుభూతుల్ని అందించేది ఇంద్రియాలే అయినా, పొందేది మనస్సు. సాధనాలైన ఇంద్రియాల కన్నా, అనుభవించే మనస్సుకే ప్రాధాన్యం యిచ్చిన యోగి వరేణ్యులు 'చూసినా', 'విన్నా' మనస్సే కాబట్టి, ఎలా అన్నా తప్పు లేదన్నారు.''

''అయితే యింకేం? తప్పు లేదుగా! నా ప్రాణం తీస్తావేం చెప్పేది వినక?'' అన్నాడు మండనుడు ఆమె కళ్ళలోకి మరింత

గుచ్చిచూస్తూ.

గుచ్చే ఆ చూపుల్ని చెదరగొట్టేట్టు నవ్వుతూ, ''మహానుభావా! తమరి ప్రాణం కాపాడటానికే నా ప్రయత్నం. ధర్మాచరణమూ, కర్మాచరణమూ మాత్రమే మోక్షమార్గాలు అని నమ్మే పూర్వమీమాంసావాదులైన మీరు, ఒక ఇంద్రియం చేసే ధర్మాన్ని మరొక ఇంద్రియానికి అంటగడుతుంటే-రక్షిద్దామని చేస్తున్న ప్రయత్నం యిది!'' అని అంది ఉభయభారతి.

''చాల్లేవోయే నీ పాండిత్యం! ఇంతలో అంత కొంపేమీ మునగదుకాని.''

''ఎందుకు మునగదు? వస్తున్నవాడు శంకరుడు. వచ్చేది తమరిని ఓడించడానికి. ఇలా వాదిస్తే కొంప మునిగే తీరుతుంది.''

''నీకా భయమేమీ అక్కర్లేదు. నా అనుభవంలో సగం వయస్సు లేదు ఆ శంకరుడికి. మొదటి వాక్యంతో వాగ్బంధనం చెయ్యగలను.''

''తమరి ఆత్మవిశ్వాసమూ, శక్తీ అంతటివే గాని స్వామీ, ఆ శంకరుడు సాక్షాత్తూ శంకరుడట! ఎనిమిదేళ్లు నిండకముందే నాల్గు వేదాలూ అభ్యసించాడట! ఇప్పుడతనికి పదహారేళ్లు నిండాయో లేదో, ప్రస్థాన త్రయానికి భాష్యం వ్రాస్తున్నాడట! ప్రస్థానత్రయమంటే మాటలా? బ్రహ్మ సూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీత! పదహారేళ్లు నిండే లోపల



ఈ మూడింటినీ ఒక్కసారి చదవడం కూడా సరిగ్గా సాధ్యం కాదే! అలాంటిది భాష్యమా? వ్రాయడమా? అందుకే కుమారిలభట్టు వంటి మొండివాడుకూడా దండంపెట్టి తమదగ్గరికి పంపిస్తున్నాడు.''

''ఓసి సరస్వతీ! కుమారిల భట్టారకులు శంకరునితో వాదించలేక కాదు. గురుద్రోహ నేర భావానికి ప్రాయశ్చిత్తంగా ఆయన 'తుషాగ్ని'లో ప్రవేశించాడు. ఆ సమయంలో వచ్చిన శంకరునితో వాదించే శక్తీ, సమయమూ ఆయనకి లేవు. అందుకే ఈ శంకరుడి తిక్క కుదర్చడానికి నా దగ్గరికి పంపిస్తున్నాడు.''

''పోనీ, అలాగే అనుకోండి. కాని ఆ శంకరుని వాదనా పటిమ అపూర్వమట! అతని మేధాశక్తి అపారమట! అతని ముఖ వర్చస్సుకే ప్రతివాది సగం లొంగిపోతాడట! ఇప్పటికే అతనికి కొన్ని వందల మంది శిష్యులట-''

అలా అంటున్న ఉభయభారతిని మధ్యలోనే ఆపి, ''ఈ ట-ట-లు మన దగ్గిర పనికి రావట'' అని నవ్వించాడు మండనుడు.

''తమరి ''తాతాలు'' మా దగ్గర పనికొస్తాయి కాబోలు!'' అని కవ్వించింది ఉభయ భారతి.

''నీ దగ్గర తాతాలు, ఫో ఫోలు ఎందుకే నా సురలోక రాణీ! లే లే లు, తై తై లు చాలు'' అని ఆమెను సమీపించాడు మండనుడు.

''ఆహా! నేను సురలోక రాణినైతే తమరెవరు ఆచార్యా?'' అని ఒక అడుగు వెనక్కి వేసింది ఉభయభారతి.

''నేనా? సురేశ్వరుణ్ణి!'' అని నవ్వుతూ రెండడుగులు ముందుకి వేశాడు మండనుడు.

దానితో ఉభయభారతే ఒకడుగు ముందుకి వేసినట్టయింది.

అందిన సహధర్మచారిణిని-చంద్రమౌళీశ్వరుడెత్తిన ఓంకార నాదమల్లే-నడుం పట్టుకుని పైకెత్తాడు మండనుడు. చక్కిలిగింతలైన ఉభయభారతి కిలారుమని నవ్వుతూ, శివ జటా జూటం నుంచి దూకిన గంగల్లే మండన మిశ్రుడి పట్టు విడిపించుకుంది.

★ ★ ★

మండన మిశ్రుడు పూర్వమీమాంసలో నిధి. ఆయన భార్య ఉభయభారతి, షడ్దర్శనాలూ క్షుణ్ణంగా చదివిన పండితు రాలు. మండన మిశ్రునితోపాటు అనేక పండిత సదస్సులకి అధ్యక్షురాలిగా ఆవిడ కూడా వెళ్ళిన సందర్భాలు అనేకం.

వాళ్ళు నివసిస్తున్నది నర్మదా నదీ తీరాన గల మాహిష్మతీ నగరం. భార్యాభర్త లిద్దరూ నడి వయస్సు దాటినవాళ్ళే! కాని

## షడ్దర్శనములు

**వైశేషికం** – దీని ద్రష్ట కణాదుడు. దీనిని 'ఆరంభవాదం' అని కూడా అంటారు. పరమాణువుల కలయికతోనే సృష్టి ప్రారంభమైందనీ, అవి ఎలా కలుస్తున్నాయో పదార్థ విజ్ఞానం ద్వారా వివరిస్తూ, ''ఎందుకు కలవాలి?'' అన్న ప్రశ్నకు, అది ఈశ్వరేచ్ఛ, అని చెప్తుంది ఈ దర్శనం.

**న్యాయం** – దీని ద్రష్ట గౌతముడు. జన్మకి కారణం ప్రవృత్తి. పరమాణువులు కలయికే ప్రవృత్తి. ప్రవృత్తికి కారణం రాగ ద్వేషాది సంస్కారాలు. అవి మిథ్యాజ్ఞానం వలన ఏర్పడుతున్నాయి. ఆ మిథ్యాజ్ఞానాన్ని నశింపజేస్తే మోక్షానందం సిద్ధిస్తుంది, అని చెప్తుంది ఈ దర్శనం.

ఈ రెండూ కవలలు. 'వైశేషికం' పదార్థం గురించీ, 'న్యాయం' దానిలోని జ్ఞానం గురించీ చెప్తాయి.

**సాంఖ్యం** – దీని ద్రష్ట కపిలుడు. దీనిని 'పరిణామవాదం' అని కూడా అంటారు. సృష్టిలోని ఏ పదార్థమూ నశించదు. ప్రతి వస్తువూ మరొక వస్తువు యొక్క పరిణామ రూపమే, విత్తనం నుంచి చెట్టూ, చెట్టు తగలబడితే బూడిదా ఇలా ఒక రూపంలో కాకపోతే మరొక రూపంలో వస్తుతత్త్వం ఉంటుంది. గాని నశించదు; ఇలా నశించని ఇరవైఐదు మూలతత్త్వాలు న్నాయి. వాటిలో ప్రధానుడు పురుషుడు (ఆత్మ),అని చెప్తుంది ఈ దర్శనం.

ఈ పరిణామవాదం 'సంఖ్యకి సంబందించినది' అనే అర్థమే కాక, 'జ్ఞానం' అనే అర్థం కూడా ఉంది.

**యోగం** – దీని ద్రష్ట పతంజలి. ఇంద్రియ వ్యాపారాలను విరమించి, మనస్సుని నియమించగలిగితే కలిగే అపరిమిత ఆనందమే బ్రహ్మానందం అనీ, దానిని యోగి అనుసరించవలసిన సాధనా మార్గం వివరించి, సర్వ శక్తుల్ని పొందిన యోగి, చిత్తశుద్ధి ద్వారా సమాధి – తర్వాత జీవన్ముక్తి ఎలా పొందాలో చెప్తుంది ఈ దర్శనం.

**పూర్వ మీ మాంస** – దీని ద్రష్ట జైమిని. ప్రతి కర్మకీ, నిర్దిష్ట మైన ఒక మహా ఫలం ఉంది, ఎవరి కర్మఫలం వారనుభవి స్తారు; ప్రయోగశాలలో ప్రయోగం సరిగా చెయ్యకపోతే, రసాయనం సిద్ధించదు,అలాగే కర్మ సరిగా నిర్వహించకపోతే, కోరిన ఫలం సరిగా సిద్ధించదు; కాబట్టి సర్వకర్మకలాపాలు, వివరంగా సదాచారంగా శ్రద్ధగా నిర్వర్తించాలి, కర్మరూపమైన ధర్మాన్ని ఆచరించడమే మోక్షప్రదం – అని నిర్దేశిస్తుంది ఈ దర్శనం.

**ఉత్తర మీ మాంస** – దీని ద్రష్ట బాదరాయణుడు. ఈయనే వేదవ్యాసుడు. ఫలితం కర్మలోనే ఉన్నప్పటికీ, దాన్ని అందించేవాడు ఈశ్వరుడు, జీవుడు నిమిత్త మాత్రుడు, అంటూ జీవుని అనధి కారాన్ని చెప్తుంది ఈ దర్శనం.

సంక్రమించి, యౌవనులుగానే కనిపిస్తారు. అలాగే ప్రవర్తిస్తారు కూడా!

అనేక మతాల కలగూరగంపగా ఆయోమయ స్థితిలో ఉన్న ఆనాటి భారతదేశాన్ని, ఒక త్రాటిపై నడిపించదలచుకున్న ఏ మహానుభావుడైనా, ముందుగా మండనమిశ్రుడి వంటి పండితుడి శుశ్రూష చెయ్యవలసిందే! కాని అలాకాక, మండనునితో వాదించి, అద్వైతమనే కొత్త సిద్ధాంతాన్ని ప్రవచించడానికి రావడం సాహసమే! కాని వస్తున్నాడు.

ఆ వస్తున్నవాడు పదహారేళ్ళ బాలుడు! తుషాగ్నిలో ప్రవేశించిన కుమారిలభట్టుకి, శరీరబాధకతీతంగా వైరాగ్యస్థితిలో మనస్సు నిలపడానికి వైరాగ్యబోధ చేసినవాడు! అన్నిటికన్నా ఆశ్చర్యం ఆ బాలుడు బ్రహ్మచారిగానే సన్యాసం స్వీకరించినవాడు!

బుద్ధి వికసించిన కొద్దీ మానవుణ్ణి వేధించే అనేక ప్రశ్నల్లో మొదటిదీ చివరిదీ కూడా మృత్యువే. నిజానికది ప్రశ్నకాదు. ప్రశ్నతో పనిలేని సమాధానం. కఠోపనిషత్తులో, నచికేతుడు యముణ్ణి మృత్యు రహస్యం చెప్పమని అడిగాడు. అది మాత్రం అడగవద్ద న్నాడు యముడు. ఎందుకంటే అది ఆయనకే తెలియదట. అందుకే మృత్యువు ప్రశ్నలేని సమాధానం.

సృష్టి గురించి తెలిస్తే మృత్యువు గురించి తెలిసినట్టే. సృష్టికి సంబంధించిన అనేక రహస్యాలు వేదాలలో నిక్షిప్తమై ఉన్నాయి. అవి స్పష్టం కావాలంటే వేదాంగాలు అర్థం కావాలి. వేదాలలో నిగూఢంగా చెప్పబడిన ఆత్మ తత్త్వాన్ని విపులీకరించడం కోసం కొందరు మహర్షులు కొన్ని గ్రంథాలను వ్రాశారు. వాటిని "షడ్దర్శనములు" అంటారు.

కాని వేదాలు చెప్పిన ఏ విషయాన్నీ నాస్తికులంగీకరించరు. వేదాల్లోంచి పుట్టిన పదార్థ విజ్ఞానమూ, ఆయుర్వేదమూ, ధనుర్వేదమూ, గాంధర్వమూ, కవిత్వమూ, ఖగోళమూ వంటి భౌతిక విషయాలు మాత్రం కాదనలేరు. అందుచేత వాటిని స్వీకరించారు. మంత్రశక్తీ, దైవధ్యానమూ, జన్మ విచారమూ జాతకమూ మొదలైన విషయాలను నిరాకరించారు. ఈ విషయంలో నాస్తికులతో ఏకీభవిస్తూ, వేదం చెప్పిన మోక్షభావాన్ని మటుకు బౌద్ధమతం స్వీకరించింది. కాని 'మోక్షం' అనే మాటని తృణీకరిస్తూ, 'నిర్వాణం' అనే పదాన్ని ఉపయోగించింది.

బౌద్ధమతం దానికొక తర్కాన్ని నిర్మించింది. కాలగమనం అనేది ఒక భ్రాంతి అనీ, ఈ మహాకాలంలో ఏ క్షణానికి ఆ క్షణం స్వతంత్రంగా పుడుతోందనీ, ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలియదు కాబట్టి పూర్వక్షణానికీ పరక్షణానికీ సంబంధం లేదనీ చెప్పి, ఒక విలక్షణమైన క్షణికవాదాన్ని ప్రచారంలోకి తెచ్చి, దాని ద్వారా పునర్జన్మలు లేవని వాదిస్తుంది. "దేవుడూ, దేవతా శక్తులూ లేవు, నిర్వాణమనే నిశ్చలమైన మనస్స్థితి మాత్రమే ఉంది" అని బోధిస్తుంది.

ఇలా చెప్పిన బౌద్ధమతంలో రాను రాను బుద్ధుని అనేక జన్మల గురించి చెప్పే జాతక కథలూ, ఆ బుద్ధుడినే దైవంగా ఆరాధించే మార్గాలూ బయలుదేరాయి. అనేక తాంత్రిక విద్యలు ప్రారంభమయ్యాయి. ఆ మతాన్ని ఖండించాలంటే, దానిలోని లోతుపాతులు తెలుసుకోవాలి. తెలుసుకోవాలంటే, ఆ మత గురువుల నెవరినైనా ఆశ్రయించాలి....

కలిశకం 2545వ సంవత్సరం (లేదా క్రీ.పూ. 557)లో కుమారిల భట్టు అనే ఒక మహాపండితుడు పుట్టాడు. ఈయన ఆంధ్రుడు. ఆనాటి ఆంధ్రదేశం మహానది వరకు వ్యాపించి ఉంది. ఆంధ్ర ఉత్కళదేశాల సరిహద్దులోని 'జయమంగళం' అనే గ్రామం ఈయన జన్మస్థలం. ఈయన తల్లి చంద్రగుణ, తండ్రి యజ్ఞేశ్వరుడు. వైదిక కర్మకాండలో ఈయన పాండిత్యం అమోఘం. జైన సాహిత్యంలో ప్రధానమైన 'జిన విజయం' అనే గ్రంథం, ఈయన పుట్టుపూర్వోత్తరాల గురించి ప్రస్తావించింది. ఆనాటి పశ్చిమభారత మహాపండితులలో ప్రసిద్ధుడైన మండన మిశ్రుడు ఈయన శిష్యుడే! తానెవరైనదీ చెప్పకుండా, ఒక జైన గురువు దగ్గర శిష్యుడిగా జేరిన కుమారిలభట్టు, జైన బౌద్ధ రహస్యాలన్నీ క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. వాదంలో ఆ గురువుని కూడా ఓడించాడు. ఆ మతాలను ఖండించాడు. తన దేశంలో వేదమతాన్ని తిరిగి నిలబెట్టాడు.

మోసం చేసి విద్య నేర్చుకోవడం, వేదమత సూత్రాల ప్రకారం గురుద్రోహం. వేదమత రక్షణ కోసమే అలా చేయవలసి వచ్చినప్పటికీ, ఆ వేదమత సూత్రాలనే పాటించకపోతే, దానిని రక్షించి ప్రయోజనం లేదు. అందుకని ఆ ద్రోహానికి ప్రాయశ్చిత్తంగా కుమారిలభట్టు 'తుషాగ్ని'లో ప్రవేశించాడు. తుషాగ్ని అంటే-చుట్టూ ఊకమంట పేర్చుకుని అందులో నిలబడి దహనమైపోవడం. ఇది ఎవడికి వాడు విధించుకోవలసిన శిక్ష.

ఋషిపీఠం

ఈ తీవ్ర త్యాగం ఆ ప్రాంతాల గొప్ప ప్రభావం చూపింది. జైన బౌద్ధ మతాలను తిరిగి తలెత్తకుండా చేసింది.

కుమారిలభట్టు పుట్టే నాటికి, భారతదేశాన్ని మౌర్య, శుంగ, కాణ్వ వంశాల తర్వాత ఆంధ్రశాతకర్ణులు పాలిస్తున్నారు. పులోమశాతకర్ణి దివంగతుడై, అతని కుమారుడైన మేఘశాతకర్ణి సింహాసనాన్ని అధిష్ఠించిన సంవత్సరమే కుమారిలభట్టు జన్మించాడు. మేఘశాతకర్ణి కుమారుడు అరిష్టశాతకర్ణి. అరిష్టశాతకర్ణి కుమారుడే ''గాథాసప్తశతి'' రచించి చరిత్ర ప్రసిద్ధి గాంచిన హాలచక్రవర్తి. హాలుడు క్రీ.పూ. 494 నుంచి క్రీ.పూ. 489 వరకు ఐదు సంవత్సరాలు రాజ్యం చేశాడు.

హాలుడు సింహాసనాన్ని అధిష్ఠించిన సంవత్సరమే కుమారిల భట్టు తుషాగ్నిలో ప్రవేశించాడు. అప్పటికి కుమారిలభట్టుకి అర్వై మూడు సంవత్సరాలు. ఆది శంకరులకు పదిహేను సంవత్సరాలు.

కుమారిలభట్టు తుషాగ్నిలో ప్రవేశించిననాడే ఆది శంకరులు ఆయనను కలుసుకున్నారు. అద్వైతబోధ చేశారు. శరీర బాధకి అతీతంగా కుమారిలభట్టు మనస్సుని వైరాగ్య స్థితిలో నిలిపాడు. శంకరులు మాహిష్మతికి బయలుదేరారు.

## 2

సమరసేనుడు కోట్లకి పడగలెత్తిన పెద్ద వ్యాపారి. పది పన్నెండు ఓడలు అతనివి నిత్యం సముద్రం మీద తిరుగుతూ ఉంటాయి. ఉత్తర దక్షిణ భారతదేశాలలో అతడు ముఖ్యుడు.

ప్రయాగలో వ్యాపారపు పనులు ముగించుకుని, స్వస్థలమైన మాహిష్మతికి ప్రయాణమయ్యాడు.

ఇరువైపులా మహావృక్షాలున్న ''శిలామార్గం'' గుండా రథం దూసుకుపోతోంది.

ఆ కాలానికీ, ఆ నాటి నాగరకతకీ చెందిన సుఖాలన్నీ అనుభవిస్తున్న మహా ధనవంతుడు సమరసేనుడు. అతడు ఎప్పుడు ఎక్కడికి ప్రయాణం చెయ్యాలన్నా తన స్వంత రథాల మీదే ప్రయాణం చేస్తాడు. ప్రయాణీకుల సౌకర్యార్థం నడపబడే మజిలీరథాలు ఉపయోగించడు. అతనికి అనేక రథాలున్నాయి. ప్రస్తుతం అతడు ఉపయోగిస్తున్న రథం ప్రథమ శ్రేణికి చెందిన ఉత్తమ రథం. దానిపేరు ''సార్థవాహి''.

ఆ రథం పొడుగు ఎనిమిది గజాలు. వెడల్పు రెండున్నర గజాలు. ఎత్తు యిరుసు నుంచి మూడు గజాలు. నేల నుంచి అమర్చిన బలమైన ఉక్కు ధనుస్సులక ఇనుపసలలతో బిగించబడిన మేలుజాతి రథం అది. దానికి నాలుగు జతల చక్రాలున్నాయి. నాలుగు జతల గుఱ్ఱాలు దానిని లాగుతున్నాయి.

ప్రయాణపు కుదుపులు లేకుండా రథం సాగిపోతోంది. రథం లోపలి భాగం మూడు గదులుగా విభజింపబడి ఉంది. మధ్య భాగం సమరసేనుడిది. అది అన్నిటికన్నా పెద్దది. ముందు భాగం సారథులది, వెనకభాగం సేవకులది.

ముందు భాగంలో యిద్దరు సారథులున్నారు. రథం యొక్క ముఖ్య విడిభాగాలూ, పనిముట్లూ, గుఱ్ఱాల దాణా భద్రపరచడానికి వీలుగా - అనేక అరలున్నాయి. సారథులు విశ్రాంతి తీసుకోవడానికి వీలుగా - కూర్చునే ఎత్తులోనూ, తల యెత్తులోనూ రెండు ''వాలుపడక''లు కూడా ఉన్నాయి.

వెనక భాగంలో యిద్దరు సేవకులూ, ఒక గణకుడూ ఉన్నారు. అందులో ప్రయాణానికి కావలసిన దుస్తులూ, వస్తువులూ, పానీయాలూ, ఆహారమూ, ఆయుధాలూ అన్నీ ఉన్నాయి. మొత్తం అయిదుగురూ ఖడ్గవీరులే, ధనుర్ధారులే!

వారి ఆయుధాలలో ఖడ్గాలూ, ధనుర్బాణాలేకాక, విసిరితే నేలమీద పడి పేలే 'జానకి గుండ్లు', ధనుస్సులకు సంధించి విడిచే 'జానకిబాణాలు' కూడా ఉన్నాయి.

ఈ విధంగా; వేగవంతమూ, సుఖప్రదమూ, సురక్షితమూ అయిన రథంలో సమరసేనుడు ప్రయాణిస్తున్నాడు. అతని ప్రాణ మిత్రుడు లవణగుప్తుడు ప్రక్కనే ఉన్నాడు.

వారు కూర్చున్న రథం మధ్యగది యొక్క లోపలి భాగమంతా ఖరీదైన రత్నకంబళాలతో అలంకరించబడి ఉంది. ఒకవైపున యిద్దరికి సరిపోయే మెత్తని పడక ఉంది. మరోవైపున కుదిమట్టమైన రెండు మెత్తని ఆసనాలు ఉన్నాయి. వాటికెదురుగా చిన్న దంతపు వ్రాతబల్ల ఉంది. దానిమీద రకరకాల రంగుల కరక్కాయ సిరాలు, ఈక కలాలు, ఘంటాలు ఉన్నాయి. దానికెదురుగా గోడకి కూర్చిన, కొన్ని ముఖ్య గ్రంథాలతోనిండిన చిన్న అర ఉంది. కాంతి తగ్గించి పెంచడానికి వీలుగా గది నాలుగువైపులా నాలుగు రత్న దీపాలున్నాయి. సేవకులని, సారథులని పిలవటానికి వీలుగా రెండు మరగంటలున్నాయి. ఆ రెండు గదుల్లోంచి, ఈ గదిలోకి తలుపులున్నాయి. ఆ రెండు గదుల్లోని వాళ్ళు, అవసరపడి ఒకరితో ఒకరు మాట్లాడుకోవాలంటే, రథానికి రెండు పక్కలా బయటవైపున యినపకమ్మీల సన్నని దారి ఉంది.

# జానకి బాణం

మందుగుండుని పేల్చడానికి వాడే వత్తిని తెలుగువాళ్ళు ''జానకితాడు'' అని పిలుస్తారు. దాని నుంచి ''జానకిబాణం'', ''జానకి గుండు'' అనే మాటలు సాధింపబడ్డాయి.

తొలుతగా ''మందుగుండు'' ఉపయోగించింది, చైనీయులు కావచ్చు అని సాధారణంగా చెపుతున్నప్పటికీ – మొట్టమొదటగా దానిని ఉపయోగించింది భారతీయులా, చైనీయులా అన్న అంశం, చారిత్రకంగా నేటికీ సందిగ్ధమైన విషయమే!

భారతీయ చరిత్ర ప్రకారం, యుద్ధంలో రసానిక విద్యని ఉపయోగించిన మొదటివాళ్ళు సత్యభామా కృష్ణులు (దాదాపు B.C. 3150) సత్యభామ తండ్రి సత్రాజిత్తు. ఆయన మణి మంత్ర ఔషధ విద్యలో నిష్ణాతుడు. తక్కువ రకపు లోహాలను బంగారంగా మార్చే ''శ్యమంతక మణి''ని సాధించాడు. అది సౌరశక్తితో పని చేస్తుంది. దాని సాయంతో రోజుకి ఎనిమిది బారువుల బంగారం తయారు చేయవచ్చు. తను గ్రహించిన ఆ రసాయనిక విద్యా (Alchemy)ని, గారాల కూతురైన సత్య భామకి నేర్పాడు. అస్త్రబలానికి లొంగని నరకాసురుణ్ణి, రోదసీ యుద్ధ శిఖామణు లైన సత్యభామా కృష్ణులు, రసాయు నాయుధాలతో, సంహరించారు. కనుకనే ఆ రోజు గుర్తుగా, ప్రతి ఏడూ ''దీపావళి'' జరుపుకుంటూ, భారతీయులు ''బాణ సంచా'' పేల్చడం ప్రారంభించారు. తర్వాత ఆ విద్య అనేక దేశాలకు ప్రాకింది. ఆత్మబలం, ఉపాసనాబలం లేని జాతులు, ఆ విద్యని పూర్తిగా యుద్ధాల కోసమే వాడడం మొదలు పెట్టాయి.

ప్రయాణం ఎక్కడా ఆగటానికి వీల్లేదు. బాగా చీకటి పడే లోపల మాహిష్మతి చేరాలి.

రథం వేగంగా పోతోంది. లోపల సమరసేనుడూ, లవణ గుప్తుడూ మాట్లాడుకుంటున్నారు. లవణగుప్తుడు పాళీ భాషలో గొప్పకవి. సమరసేనుడు లవణగుప్తుడి అభిమాని. ఇద్దరూ పరమ నాస్తికులు. ఏ పనిమీదైనా సమరసేనుడు దూరం వెళ్ళవలసివస్తే ప్రక్కన లవణగుప్తుడు ఉండవలసిందే.

అది సూర్యాస్తమయ సమయం. నర్మదానది ఒడ్డున కొండలలో ఉన్న ఎత్తైన శిలామార్గం మీద రథం పశ్చిమంగా దూసుకు వెళు తోంది. నర్మద పడమరికి పరుగెత్తే నదీ సుందరి. అది గ్రీష్మ ఋతువు నర్మద నిండుగా ప్రవహించడం లేదు. ఇసుక పొరల మధ్యలో అక్కడక్కడ సన్నని ప్రవాహంగా ఉంది. దూరదేశంలో ఉన్న భర్తని తలుచుకుంటూ విరహంతో చిక్కి సగమైనట్టుంది. చిక్కిన ఆ చక్కనమ్మని చేజిక్కించుకోవాలని తీవ్రమైన కోరికతో క్రిందికి దిగుతున్నాడు సూర్యుడు. అతని కోరికని తెలుసుకున్న నర్మద, అన్నగారి రక్షణలోకి వెళుతున్నట్టుగా చటుక్కున ఒక చిన్న కొండవైపు మలుపు తిరిగింది. నిస్సహాయుడైన సూర్యుడు, ముఖం ఎఱ్ఱజేసుకుని, తన ప్రియురాలైన అడవినే కౌగిలించుకుని దిగంతాలకు సాగిపోయాడు...

పరుగెడుతున్న రథంలోంచి – సూర్యాస్తమయం, నది నడక, కొండమలుపు, అడివి–అన్నీ కలిసిన ఆ ప్రకృతి దృశ్యం ఆ విధంగా కనిపించింది భావకవి అయిన లవణుడికి. ఆ భావాన్ని వెంటనే సుందరమైన ఒక పద్యంగా చెప్పాడు.

పరవశించిన సమరసేనుడు రథం ఆపమన్నాడు. రథం ఆగింది. రథం దిగి, ఆకాశపటం మీద ప్రకృతి గీసిన చిత్రవర్ణ దృశ్యాన్ని చూసి మరింత పరవశించిపోయాడు.

అంతలో అతని చెవులకి సుపరిచితమైన ఒక గంభీరకంఠస్వరం దూరం నుంచి వినబడింది. తల తిప్పి చూసిన సమరుడికి-

**పునరపి జననం, పునరపి మరణం**
**పునరపి జననీ జఠరే శయనం**
**యిహ సంసారే బహు దుస్తారే**
**కృపయా పారే పాహి మురారీ-**
**భజగోవిందం భజగోవిందం**
**గోవిందం భజ మూఢమతే॥**

అని పాడుకుంటూ, ఒడ్డు దిగి నదివైపు నడుస్తున్న ఒక సన్యాసి కనిపించాడు. ఆ సన్యాసి చేతిలో ఒక మట్టి పాత్రా, దాని నిండా పువ్వులూ బిల్వదళాలూ ఉన్నాయి. ఆ సన్యాసిని చూసి ఆశ్చర్యపోయిన సమరసేనుడు అప్రయత్నంగా,

''దుర్జయా'' అని కేకవేశాడు.

సశేషం

రంగవల్లి

# గుమ్మంముందు కళాపీఠం

శ్రీమతి పరిమళా శ్రీధర్

*చాలా అద్భుతాలు మనకు నిత్య పరిచయాలై, అలవాటుగా మారడం వల్ల వాటి అద్భుతత్వాన్ని మనం అనుభవించలేక పోతున్నామేమో అనిపిస్తుంది.*

*జీవనవిధానంలో ప్రత్యంశాన్నీ కళామయంగా, సౌందర్యానందాల సంగమంగా మలచుకొనే ఒక చక్కని సంస్కృతి, మన ఆచార వ్యవహారాల రూపంలో సాక్షాత్కరిస్తోంది.*

*ఎటు పోతున్నామో, ఏమి పోగు చేసుకుంటున్నామో గమనించని ఈ పరుగులో... ఎన్నెన్ని కోల్పోతున్నాం!*

* * *

*కేవలం కొన్ని చుక్కల్ని గీసుకొని... ఎన్ని రకాలముగ్గులు! ఎంత గొప్ప కళ! సౌందర్యం, శుభ్రత, పవిత్రత... ఇవే ఐశ్వర్యాల తల్లికి నిలయాలని దర్శించి, వాటిని కాపాడుకునేలా మన ఆచారాలు నిర్మించారు. వాటి వెనక శాస్త్ర చర్చలు, సహేతుక సమర్థనలు గురించి పక్కన పెడదాం.*

*ఆ మంచి పద్ధతుల్లో ఉన్న అనుభూతి ఎంత తీయనిది! దానిని ఆస్వాదించే గుణం కోల్పోతే మిగిలేది ఏముంది?*

*ఒక పేడముద్దలో బంతి పువ్వుని పెట్టి, పసుపు కుంకుమలతో అలంకరించడంలో, ఆవు పేడకున్న ఆరోగ్య విలువలు వంటి భౌతిక కారణాలు, దాని ఫలితంగా సూక్ష్మ – దైవిక ప్రపంచాల ప్రభావాలు – వంటి శాస్త్ర చర్చలు ముఖ్యమైనవే అయినా – ఒక పేడ ముద్దని కూడా అందంగా మలచి ఆరాధించే సౌందర్య దృష్టిని అభినందించడం ఇంకా ముఖ్యం.*

* * *

తెల్లవారితే ధనుర్మాసం ప్రారంభం అవుతుంది. ముగ్గుపిండి, ముగ్గుల పుస్తకాలు అంతా సిద్ధం చేసి పెట్టుకొన్నాను. ''అంతా నీ చాదస్తం కాని, ఈ కంప్యూటర్ యుగంలో కూడా ఇంకా ఈ ముగ్గులేమిటి? కాలం మారింది. కాలంతో పాటు మనమూ మారాలి''. శుభమా అంటూ ముగ్గులు పెడదామంటే ఇదీ శ్రీవారి విమర్శ.



కాలం మారింది. మారుతోంది. ఏ నోట విన్నా ఇదేమాట. నిజంగా కాలం మారుతోందో లేదో గాని, మానవ జీవనసరళిలో చాలా మార్పులొచ్చాయి. ఏటా వచ్చే సంక్రాంతి పండగ ఎప్పటిలా వచ్చేస్తోంది. కాని పండుగ జరుపుకొనే తీరులో ఎన్నో మార్పులు. పరుగెడుతున్న కాలచక్రం ఓ ఇరవై సంవత్సరాలు వెనక్కి మళ్ళితే ఎంత బాగుండునో.

ఆరోజుల్లో ధనుర్మాసం వచ్చిందంటే చాలు. ప్రతిఇంటా ముగ్గులముచ్చటే. ముగ్గుపిండి, రంగులు, ముగ్గుల పుస్తకాలు అంటూ అన్ని సిద్ధంచేసి పెట్టుకొనేవాళ్ళం. ఆనెలరోజులు వేసిన ముగ్గు వేయరాదనే పట్టుదలతో వాళ్ళని, వీళ్ళని అడిగి క్రొత్తక్రొత్త ముగ్గులు సేకరించేవాళ్ళం.

తెల్లవారు ఝామున నాలుగింటికి అమ్మ నిద్రలేపేది. తలుపులు తెరిస్తేచాలు నరాలు జివ్వుమనిపించే చలి. కసువులు చిమ్మి, పేడ నీళ్ళతో కళ్ళాపి చల్లి, ముగ్గు పెట్టేందుకు ముంగిలి సిద్ధంచేస్తాం. ఎంతపెద్ద ముగ్గు పెడితే అంతగొప్ప. ఆరోజుల్లో రత్నకంబళి, పద్మాలు, కాకరకాయ, శివునిమూడుకళ్ళు, స్వసికఇలా అందరికి తెలిసిన ముగ్గులు ఎన్నో ఉండేవి. అవిగాక క్రొత్తక్రొత్త ముగ్గులు వేయడానికి ప్రయత్నించే వాళ్ళం.

నేను, నాచెల్లి చుక్కలు పెట్టి ముగ్గు పెడుతూఉంటే ఇంకోచెల్లి వేస్తున్న ముగ్గు తాలూకు ప్రతిని చూపిస్తూ ఓపిగ్గా నిలబడి ఉండేది. ఒక్కొక్కసారి ఎక్కడ తప్పు చేశామో తెలియక తికమక పడుతూ ఉంటే ఎదురింటి పారిజాతం అక్కయ్య వచ్చి సరిదిద్దేది. అదంతా తలుచుకొంటే ఎంత గమ్మత్తుగా అనిపిస్తుందో.

ఆవీధి దీపాలవెలుగులో, అందరు ఆడవాళ్ళు తమతమ ఇళ్ళముందు ముగ్గులు వేస్తుంటే ఆవీధికే జీవం వచ్చిందా అన్నట్లు కళకళలాడుతూ ఎంత ముచ్చటగా ఉండేదో.

ముగ్గుపెట్టిముగించి, ఆవుపేడతో చేసిన గొబ్బిళ్ళు పెట్టేవాళ్ళం. పచ్చగా కళ్ళాపి చల్లిన నేలపైన తెల్లటి అందమైన ముగ్గు, ఆ ముగ్గు

మధ్యలో ఆవుపేడతో చేసిన గొబ్బిళ్ళు, గొబ్బె మ్మల గుమ్మడిపూలు, బంతిపూలు ప్రత్యేకమైన ఆకర్షణతో ఆ ముగ్గు అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నట్లుండేది.

ఒక్కసారి ఆ ముగ్గుని తనివి తీరా చూసు కొని మురిసిపోయేవాళ్ళం. ఇంటిల్లిపాది ఆ ముగ్గుని చూచి ఆనందించే వాళ్ళే. నాపిల్లలు కాలేజీ చదువులు చదువుతూ ఎంతబాగా ముగ్గులేస్తున్నారో అంటూ అమ్మ పొంగిపోయేది.

ఇంతకష్టపడివేసిన ముగ్గును ఎవరూ తొక్కకుండా మా ఇద్దరు తమ్ముళ్ళు వీధి ముందు అరుగుమీద కూర్చుని కాపలా కాసే వాళ్ళు. వాళ్ళని మీరి ఎవరైనా తొక్కితే పోట్లాడే వాళ్ళం కూడా. అదంతా ఓ మరపురాని మధు రానుభూతి.

ఆ రోజుల్లో ఆడపిల్లలంతా చేరి గొబ్బిళ్ల చుట్టూ తిరుగుతూ చేతులు తట్టుతూ పాడే గొబ్బిపాటలు ఇంకా నాకు గుర్తే.

'సుబ్బి గొబ్బెమ్మ శుభముల నియ్యవే' అన్నపాట, 'గొబ్బియ్యల్లో చందామామ చందా మామ–ఓచందామామ' అన్నపాట,

**''దుక్కులు దుక్కులు దున్నారంట !**
**ఏమి దుక్కులు దున్నారంట?**
**రాజావారి తోటలోన**
**జామి దుక్కులు దున్నారంట**
**అక్కల్లార! చెల్లెళ్ళార!**
**చంద్రగిరి భామల్లార!**
**గొబ్బియల్లో..... గొబ్బియల్లో...''**

ఇలా ఎన్నోపాటలు. కన్నెపిల్లలందరూ చక్కగా అలంకరించుకొని గొబ్బిళ్లచుట్టూ తిరుగుతూ, చక్కని ప్రాసతో సాగే గొబ్బిపాటలని అందరు కలిసి, చేతులు తడుతూ పాడుతూ ఉంటే లయబద్ధంగా చేతులచప్పుడు, చేతి గాజుల గలగలలు, ఘల్లు ఘల్లుమనే కాలి గజ్జెల ధ్వని ప్రక్కవాద్యాలుగా గొబ్బి పాటలు శ్రవణానందకరంగాను, గోపికలు నృత్యం చేస్తు న్నారా అన్నట్లు నయనానందకరంగాను ఉండేవి. అలా నృత్యం చేస్తున్నప్పుడు పొడవైన కుచ్చులజడ కూడా ముందుకి వెనక్కి వస్తు పోతూ ఆ పాట ఆ నృత్యం వర్ణించనలవికాదు.

ఆరోజులు మళ్ళీరావు. తీపిజ్ఞాపకాలతో తెల్లవారు ఝామున నిద్రలేచాను. తలుపులు తెరుస్తూ ఉంటే మావారు నాకు తోడుగా వచ్చారు. వీధి చివర్లో ఓ రెండిళ్ళముందు ముగ్గులు పెడుతూ ఉన్నారు. వీధంతా నిర్మాను ష్యంగా ఉంది. ఏదొంగవాడో వచ్చి మెళ్ళో

**చదువు ఎంత ముఖ్యమో మన జాతి గొప్పతనాన్ని చాటే మన సంప్రదాయాలు అంతే ముఖ్యం. ఈ నిజాన్ని యువత కేనా తప్పక గుర్తించాలి.**

గొలుసుకాస్తాలాగేస్తే? అందుకే మావారి కాపలా. కాపలాతో పాటు సణుగుడుకూడా. అష్టకష్టాలు పడి సంపాదించిన పేడని శాస్త్రానికన్నట్లుగా కొద్దిగా తీసి, నీళ్ళల్లో కలిపి, కళ్ళాపి చల్లాను. రోజులింతగా మారిపోయా యని బాధపడుతూ ఒక్కర్తినే 26 చుక్కల ముగ్గుపెట్టి ముగించాను.

వీధిలో వచ్చీపోయే వాహనాలు ఆ ముగ్గుని తొక్కకుండా వెళ్ళాలని విశ్వప్రయత్నం చేసి వెళుతున్నాయి. ఎదురింటి పక్కింటి వాళ్ళు దగ్గరగావచ్చి ఆముగ్గుని చూచి చాలా బాగుం దని మెచ్చుకొంటున్నారు. ముగ్గులేసేవాళ్ల సంఖ్య తగ్గినా, ఈ కళని చూచి ఆనందించే వాళ్ళు, అభినందించేవాళ్ళు ఇంకా ఉన్నారు. ఇప్పట్లో ఈ కళ అంతరించిపోదు అనుకుంటూ లోపలికి వెళ్ళబోయాను.

'ఆంటీ' అన్న పిలుపు వినిపించి వెనక్కి తిరిగాను. ప్రక్కనే ఉన్న అపార్టుమెంటులోని ఓ పదిమంది ఆడపిల్లలు నిలబడి ఉన్నారు. ఎంత బాగా ముగ్గుపెట్టారు? చాలా బావుంది అంటూ చుక్కలెంచుకొంటూ, మాకు ముగ్గులు పెట్టాలని ఉంది కాని, సమయం లేదు. దానికి తోడు అపార్టుమెంట్లలో చోటు కూడా లేదాయె అని నిట్టూర్చారు.

అమ్మాయిలు! అబద్ధం చెప్పకండి. స్నేహి తులతో వృధాకాలక్షేపాలు, టి.వి. చూడ్డం ఈ నెలరోజులు కాస్త తగ్గిస్తే సమయం దొరకదూ? ముగ్గుపెట్టడానికి స్థలం లేదంటారు. అపార్టు మెంటులోని ఆడపిల్లలంతా కలిసి కట్టుగా ముందున్న స్థలంలో ముగ్గులు పెట్టొచ్చుగా! మనసుంటే మార్గం.

ముగ్గులు స్త్రీజాతి మెత్తం గర్వించ దగ్గ గొప్ప కళ. ముగ్గులు చిత్రలేఖనంలో ఓ భాగంగా గుర్తించవచ్చు. చిత్రకళకి ప్రధాన మైనవి బిందువులు, రేఖలు. ముగ్గులకి మూలం చుక్కలు. చుక్కలతో పెట్టేముగ్గు ఒక సంప్రదాయమైతే, రేఖలతో పెట్టేముగ్గు ఇంకొక సంప్రదాయం. ఈ రెండిటిని సమైక్యం చేసి ముగ్గులు పెట్టడమనేది మన సంప్రదాయం.

నిత్యం ముంగిట ముగ్గులు పెట్టడం మన భారతీయ సంప్రదాయమైనా, ధనుర్మాసం నెల రోజులు కళాత్మకంగా ముంగిట ముగ్గులు తీర్చి, సంక్రాంతి పండుగను నెలరోజులు ముగ్గుల పండుగగా జరుపుకొంటున్నామంటే ఈ కళకి ఎంతటి ప్రాముఖ్యాన్నిచ్చారో గుర్తిస్తే ముగ్గుల గొప్పతనం తెలుస్తుందని గట్టిగా చెప్పాలనిపించింది. కాని మంచిని బోధిస్తూ సలహాలిస్తే ఈ కాలపు పిల్లలకి నచ్చదన్న విషయం గుర్తొచ్చింది.

చదువు ఎంత ముఖ్యమో మన జాతి గొప్పతనాన్ని చాటే మన సంప్రదాయాలు అంతే ముఖ్యం. ఈ నిజాన్ని యువత ఎప్పటికైనా తప్పక గుర్తిస్తారనే ఆశ నాలో ఉంది. ✹

**ఋషిపీఠం**

# స్వప్న విద్యలు

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

మనుష్యులకు అవస్థలు మూడు. జాగ్రత్, స్వప్న, సుషుప్తులు. జాగ్రదవస్థ నించి సుషుప్తి అంటే నిద్రలోకి వెళ్ళే ప్రతి వ్యక్తీ స్వప్నమనే భూమిక దాటక తప్పదు.

కొందరు మాకెప్పుడూ కలలు రావంటుంటారు. అది అసంభవం. మన ఊరుకు, గమ్యస్థానానికి మధ్య ఉండే ఊరు లాంటిది స్వప్నదశ, ఆకాశంలో ఎగిరి వెళ్ళినా మధ్యలో ఉండే ఊరు దాటక తప్పదు. లేకుంటే అక్కడ ఎక్కువ సేపు ఆగకుండా వెళ్లవచ్చు. ఎక్స్‌ప్రెస్ రైలులో వెళ్ళేవాడు చిన్న స్టేషనులో ఆగనట్లు ఒక్కోసారి పడుకొన్న వెంటనే గాఢనిద్రలోకి వెళ్ళవచ్చు. ఇది ఈనాడు సర్వశాస్త్రవేత్తలూ అంగీకరించిన అంశం. అసలు కలలు రావనేవాళ్లు వాటిని మరచిపోయే లక్షణం కలవారని భావించవచ్చు.

ఈ కలలు చాలా రకాలు. మనిషి మనసులోని ఆలోచనలే కొన్నిసార్లు కలలో రూపం ధరించవచ్చు. శాస్త్రజ్ఞులు వాటిని అనేక రీతులుగా వివరించారు. ఫ్రాయిడ్ మొదలైన శాస్త్రజ్ఞులు సెక్స్‌పరమైన వివరణలెన్నో ఇచ్చారు. నేను వాటి జోలికి పోను, కలలకు దేవతలకూ ఉండే సంబంధాన్ని మాత్రం విశదీకరించటానికి ప్రయత్నిస్తాను.

## గాథల్లో 'కలలు'

సామాన్యంగా కలలు కల్లలే, కానీ యాదృచ్ఛికంగా ఎప్పుడన్నా కల నిజం కావటం కద్దు. జూలియస్ సీజరు హత్య చేయబడే ముందురోజు రాత్రి అతని భార్యకు ప్రమాద సూచకమైన కల వచ్చింది. సీజర్ దాన్ని లెక్క చేయలేదనేది వేరే విషయం. ఇలా అక్కడక్కడ ప్రాచీనగాథల్లో సత్యమైన కలలు చదువుతాము

రామాయణంలో త్రిజట స్వప్న వృత్తాంతము ప్రసిద్ధమైనది. రావణుడు నాశనమవుతున్నట్లు, సీతారాములు విజయ శ్రీనందుకొని శుభములు పొందుతున్నట్లు, ఆమెకు కల వచ్చింది. అట్లానే ఉషానిరుద్ధుల స్వప్న ప్రణయదృశ్యం ప్రబంధా లలో బాగా వర్ణించబడింది. కలలో కనిపించిన రాజకుమారికల్ల కోసం వీరులు సాహస యాత్రలు చేయటం జానపదగాథల్లో తరచూ కనిపిస్తూ వుంటుంది.

ఆచార్యశంకరులు ఒక చోట "దేవతాత్మకాః స్వప్నాః కేచిత్ సత్యార్థ గంధినోపవంతీతిమన్యంతే" అన్నారు. దేవతాత్మకములైన కలలు నిజం కావటమనేది వున్నదని చిరకాలముగా వస్తున్న నమ్మకం. తంత్రశాస్త్రములలో మాత్రం ఈ స్వప్నాలకు ఎనలేని ప్రాముఖ్యం వున్నది.

## దేవతలు – స్వప్నాలు

మంత్రసాధన చేయదలచుకొన్న ఏ వ్యక్తియైనా ఆ మంత్రం తనకు సిద్ధిస్తుందో లేదో స్వప్న పరీక్ష ద్వారా తెలుసుకోవాలని మేరు తంత్రం ఆదేశిస్తున్నది. అప్పుడే దాన్ని పురశ్చరణ చేయటం మొదలుపెట్టాలి. అశుభసూచన వస్తే ఈ మంత్రం పడదులే అని విడిచిపెట్టాలి. విడిచిపెట్టటం అది ఒక తంతు.

దాని సంగతి అటుంచి ఈ స్వప్న పరీక్ష చెయ్యటం ఎలా అంటే శివవిష్ణ్వాదిదేవతలకు సంబంధించిన స్వప్న మంత్రాలున్నవి. వాటిని ముందు జపించాలి.

శివ భక్తులు –

**వామాయవిశ్వరూపాయ స్వప్నాధిపతయేనమః॥**
**స్వప్నే కథయ మే నిత్యం సర్వకార్య మశేషతః**
**క్రియాసిద్ధిం విధాస్యామి త్వత్ప్రసాదాన్మహేశ్వర॥**

అని స్తోత్రంచేసి, విష్ణుభక్తులైతే,

**శ్లో॥ నమస్సకల లోకాయ విష్ణవే ప్రభవిష్ణవే**
**విశ్వేశవిశ్వరూపాయ స్వప్నాధిపతయేనమః**
**స్వప్న మానయ.....**

ఇత్యాది స్తోత్రంచేసి ఉపవసించి రాత్రి పూట భూశయనం చేయాలి. తెల్లవారుజామున వచ్చిన కలను పరీక్షించుకోవాలి. స్వప్నాధి దేవత కలలో కనిపించి ఏమి చెపితే దాన్ని అనుసరించాలి. ఏమీ చెప్పదనుకోండి. వచ్చిన కలను పరిశీలించుకోవాలి. సిద్ధుడు, గురువు, దేవత, గంగానది, సూర్యుడు, శివలింగము, రథము, దీపము, ప్రాసాదము, కమలము, వృషభము, ఏనుగు, సముద్రము, పండ్లచెట్టు, సింహాసనము, విమానము, చంద్రుడు, రత్నాభరణములు, పూర్ణ కుంభము మొదలైనవి శుభ దృశ్యాలు.

తెల్లనిపూలు, తెల్లని గుడ్డలు ధరించిన సౌందర్యవతి కౌగిలించుకొన్నట్లు కల రావటం చాలా శుభ లక్షణం. రక్త, అరుణ, నీల, పీత వర్ణాలంకార స్త్రీలు దగ్గరికి వస్తే చాలా ప్రమాదం. నూనె పూసుకున్నట్లు, జుట్టు విర బోసుకొన్నట్లు కలవస్తే అశుభం.

అంధుడు, కుబ్జుడు, బధిరుడు, మలినాంబరుడు, దుర్వచనుడూ కనిపిస్తే దోషం. అశోకము, కరవీరము, పలాశము కనిపించటం మంచిది కాదు. గాడిదనుగాని, దున్నపోతునుగాని, ఒంటెనుగాని ఎక్కినట్లు, దక్షిణాభిముఖుడై పోతున్నట్లు కలవస్తే మూడునెలల్లో ఆయువు తీరినట్లు లెక్క. వికృతాకారులైన నల్లని సాయుధులు బాధిస్తున్నట్లు, రాళ్ళతో కొడుతున్నట్లు కలగంటే వాడు మృత్యువశుడని అర్థం.

ఇటువంటివన్నీ గమనించి తనకు శుభ సూచకమైన మంత్రాన్ని స్వీకరించాలి సాధకుడు. జపదీక్షా సమయంలో అప్పుడప్పుడు దేవతాదర్శనం కావటం జరుగుతూ వుంటుంది. ఒక ప్రధాన విషయం గమనించవలసింది ఏమిటంటే కలలు లక్షరకాలు రావచ్చు. వాటికి ఫలితమేమీ లేకపోవచ్చు. కాని దేవతలు వాళ్ళ అనుగ్రహం లేక మానవుని కలలోకి ఊరకవచ్చి కనిపించటం వుండదు. కలలో ఏదైనా దేవత కనిపిస్తే దానికేదో ఒక విశిష్టమైన అర్థం వుండి తీరుతుంది.

మంత్రోపాసకులు ధ్యానములో దేవతలను నిలుపుకొని, దివ్యదృష్టిని అభివృద్ధి పరచుకొని త్రికాల విషయాలు తెలుసుకునే దశ రావటానికి ఎంతో తపస్సు చేయాలి. అంతకంటే సులభంగా స్వప్న విద్యలవల్ల భూత భవిష్యద్వర్తమానాది విశేషాలు తెలుసుకో వచ్చు. తంత్ర గ్రంథాలలో వాటిని గూర్చి ఎంతో గొప్పగా చెప్పబడింది.

## స్వప్నేశ్వరి

'మంత్ర మహోదధి' లో 'స్వప్నేశ్వరి' అనే ఒక దేవత గూర్చి ప్రస్తావించబడింది. ఉపమన్యుడు దానిని దర్శించిన ఋషి, ఆ మంత్రం లక్షసార్లు జపంచేసి బిల్వపత్రాలతో హోమం దశాంశం చేయాలి. ఆ తర్వాత ఏ విషయాన్ని గురించైనా తెలుసుకోవాలను కొన్నప్పుడు రాత్రివేళ పదివేలు జపంచేసి ఉపవాస నియమంతో భూశయనం చేస్తే వరాభయ పద్మయుగ హస్త, సితాంబర, శరచ్చంద్ర సమాన కాంతిగల స్వప్నేశ్వరి దర్శనమిచ్చి భక్తుని సందేహాన్ని తీరుస్తుంది.

యోగినీ తంత్రంలో 'స్వప్నావతి' వంటి విద్యలు, యక్షిణీతంత్రంలో 'స్వప్నచండి' వంటివి చెప్పబడినవి. మంత్ర మహార్ణవంలో ఒక విచిత్రమైన విద్య వుంది. కాళి అధిదేవతగా గల మంత్రమది. ఆ స్వప్న దేవత మామూలుగా శుభాశుభములు చెప్పటంతో ఊరుకోదు. ఏ మనిషికైనా సరే కలలో ఏ రూపంతో కనిపించమంటే ఆ రూపంతో కనిపించి, ఏమి చెప్పిరమ్మంటే అది చెప్పి వస్తుంది. అది ఒక విచిత్ర ప్రయోగవిద్య అన్న మాట.

ఉదాహరణకు ఒక అధికారో, ధనవంతుడో వున్నాడనుకోండి. వాని వల్ల ఒక పని కావాలి. ఈ మంత్రవిద్యా సాధకుడు అతడి మీద ఈ స్వప్న ప్రయోగం చేస్తాడు. అది వెళ్ళి ఆ వ్యక్తి కలలో వాడి ఇష్టదేవతలాగా కనిపించి ఫలాని వ్యక్తికి ఫలానా పని చెయ్యి అని ఆదేశిస్తుంది. వాడు తన ఇష్టదేవత చెప్పింది కాబోలనుకొని చేస్తాడు.

సుప్రసిద్ధమైన స్వప్న విద్యలలో వారాహి చాలా ప్రాముఖ్యమైనది. ఇది ప్రధానంగా వశీకరణ దేవత.

**''ఉచ్యతే స్వప్న వారాహీ జనతా వశకారిణీ''** అని మంత్రరత్నాకరం ఆ విద్యను గొప్ప వశ్యతంత్రంగా అభివర్ణిస్తుంది. కృష్ణపక్షపు అష్టమినాడు గాని, చతుర్దశినాడుగాని చతుష్పదమునుండి, నది రెండు ఒడ్డుల నుండి, కుమ్మరి ఆవమునుండి మట్టి తెచ్చి వుమ్మెత్త రసంతో కలిపి బొమ్మ చెయ్యాలి.

ఎవరిమీద ప్రయోగం చెయ్యాలో వాడి పేరుతో ఆ బొమ్మకు ప్రాణప్రతిష్ట చెయ్యాలి. చనిపోయిన తర్వాత శవంమీద కప్పిన గుడ్డ ముక్కను సంపాదించి దానిమీద శవాన్ని కాల్చిన బొగ్గుతో స్వప్న వారాహీ ప్రయోగ మంత్రాన్ని వేసి దేవతా ప్రాణ ప్రతిష్ఠ చేయాలి. ఆ పుత్తళి అంటే బొమ్మ హృదయమందు ఈ యంత్రాన్ని వుంచి రాత్రి వేళ ఒంటరిగా జపం చేయాలి. అప్పుడు రాజైనా, వాడి తాతైనా వశంకాక తప్పదని ప్రాజ్ఞుల వచనం. భవిష్యత్తు తెలుసుకోవాలనుకొన్నప్పుడు మంత్రజపం చేసి ఒంటరిగా, ఇతరులు లేనిచోట శయనిస్తే స్వప్న వారాహి వచ్చి సత్యం చెపుతుంది.

ఇటువంటివి ప్రత్యేకంగా స్వప్నదేవతలు, వాటి విశేషాలు. సామాన్యంగా సాధకులు తాము ఉపాసించే దేవతలనే కొన్ని అక్షరాలను మంత్రంలో కలుపుకోవటం ద్వారా, కొన్ని ప్రత్యేక వస్తువులతో హోమం చేయటం ద్వారా కలలో కనిపించి శుభాశుభములను చెప్పేలా చేసుకోవచ్చు. ✸

## పాఠకులకు మనవి

ఋషిపీఠం భారతీయ మానస పత్రికకు అనూహ్యంగా లభిస్తున్న పాఠకాదరణ మమ్మల్ని పరవశుల్ని చేస్తోంది. కొత్త సంచికలు చూసిన కొత్త పాఠకులు తొలి సంచికనుండి కావాలని ఉత్తరాల ద్వారా, ఫోన్లద్వారా అధిక సంఖ్యలో కోరుతున్నారు. కలకాలం భద్రపరచుకోవలసిన పత్రిక ఇది. అని ప్రశంసిస్తున్నారు. వారందరి కోరికపై కొంత శ్రమించి పాత సంచికలు అందజేసే ఏర్పాట్లు చేసాము.

జూలై '99 (ప్రారంభ సంచిక) నుండి ఏఏ సంచికలు కావాలో వాటి మూల్యం పోస్టు ద్వారా ఈ క్రింది చిరునామాకు పంపి పొందవచ్చును.

-సంపాదకుడు

**ఋషిపీఠం**
భారతీయ మాసస పత్రిక
'పార్క్‌వ్యూ', నెం. 6, 4వ ఫ్లోర్.
85, జి.యన్.చెట్టి రోడ్.
టి.నగర్, చెన్నై – 600 017.

# భారతదేశ చరిత్ర–IV

**యు.ఎస్.ఎన్. మూర్తి**

ఇదివరకు చెప్పుకున్నట్లు హస్తతో దక్షిణాయనారంభం ఆర్ద్ర ద్వితీయ పాదంలో వసంత సంపాతం జరిగినప్పుడే సంభవం. ఖగోళ శాస్త్ర జ్ఞానం ఉన్నవారందరికీ ఈ విషయం తెలిసినా దీని గురించి కొంత వివరంగా చెప్పుకోవడం అవసరం.

ప్రస్తుతం వసంత సంపాతం సూర్యుడి మేషరాశి ప్రవేశంతో జరుగుతోంది. దక్షిణాయనం సూర్యుడి కర్కాటక రాశి ప్రవేశంతోను, ఉత్తరాయణం సూర్యుడి మకరరాశి ప్రవేశం తోను ఆరంభమౌతున్నాయి. కర్కాటకరాశి పునర్వసు నాల్గవపాదంతోను, మేషరాశి అశ్వనితోను మొదలౌతాయి. అంటే పునర్వసు నాల్గవ పాదంలో దక్షిణాయ నారంభం అశ్వనీ నక్షత్రప్రథమ పాదంలో వసంత సంపాతం జరిగి నప్పుడే సంభవం. దక్షిణాయనానికి, వసంత సంపాతానికి మధ్య మూడురాశుల, లేదా 90 డిగ్రీల వ్యత్యాసం ఉంటుంది.

హస్తానక్షత్రం కన్యారాశి పదవ డిగ్రీమీద ఆరంభవౌతుంది. కాబట్టి దీనికి సరిగ్గా 90 డిగ్రీల వెనుక వసంత సంపాతం జరగాలి. అంటే మిథునరాశి పదవడిగ్రీమీద జరగాలి. మిథునం పదవ డిగ్రీ ఆరుద్ర రెండవపాదంతో ఆరంభమౌతుంది. అందుచేతనే హస్తతో దక్షిణాయనారంభం ఆర్ద్రద్వితీయ పాదంలో వసంత సంపాతం జరిగినప్పుడే సంభవమని చెప్పడం జరిగింది. పాండవుల కాలంలో సరిగ్గా ఇదే జరిగింది. దీనివల్ల ఒకే విషయం రెండు విధాలుగా స్పష్టవౌతోంది. ఆర్ద్రద్వితీయ పాదంలో వసంత సంపాతం జరిగినకాలం లేదా హస్తలో దక్షిణాయనారంభం జరిగిన కాలం పాండవులది. వసంత సంపాతాన్నే 'విషు' అనీ, సౌరసంవత్సరాది అనీ అంటాం. పాండవుల కాలనిర్ణయం చెయ్యడానికి 'దక్షిణాయనారంభం' ఒక్కటే చాలు. కానీ ఆ కాలంలో 'విషు' ఆరుద్ర రెండవపాదంలో సంభవించేదని నిరూపించడానికి కొంత వివరంగా చెప్పుకోవలసివచ్చింది.

**ఈ తేదీ ఆధారంగా పురాణప్రవచిత రాజవంశావళుల కాలం కూడా సరియైనదేనని వేరుగా చెప్పవలసిన అవసరం లేదు. వీటిగురించిన ఆధునిక చరిత్రకారుల వాదనలు అసంబద్ధాలు.**

విషువత్తు సంభవించే స్థానాన్ని 'విషువద్బిందువు', 'మేషాది' (First Point of Aries) అని అంటారు. ఇది స్థిరంగా ఉండదు. ప్రతి సంవత్సరం కొంచెం కొంచెంగా వెనక్కు జరుగుతూ సుమారు 72 సంవత్సరాలకు ఒక డిగ్రీ వెనక్కువెళ్తుంది. అలా వెనక్కు జరుగుతూ ఒకపూర్తి వృత్తం పూర్తి చేయడానికి, అంటే ఆరంభమైన స్థానానికి తిరిగి చేరుకోవడానికి 26000 సంవత్సరాలు పడుతుంది. ప్రాచీన హిందూ శాస్త్రాలు దీన్ని 27000 సంవత్సరాలుగా చెప్పాయి. ఈ తేడాకు కారణం ఇక్కడ అప్రస్తుతం. విషువద్బిందువు ఇలా వెనక్కు జరుగుతూ ఉండడం వలననే పాండవుల కాలంలో ఆరుద్ర రెండవ పాదంలోనూ, నేడు అశ్వని ప్రథమ పాదంలోనూ 'విషువత్తు' జరుగుతోంది.

అశ్వని నుండి ఆర్ద్ర రెండవపాదం వరకు 51/4 నక్షత్రాలున్నాయి. (అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర మొదటి పాదం). ఒక్కొక్కనక్షత్రానికి 131/3 డిగ్రీల చొప్పున 51/4 నక్షత్రాలకు 70 డిగ్రీలు వస్తాయి. అంటే పాండవుల కాలంనుండి ఈనాటి వరకు విషువద్బిందువు 70 డిగ్రీలు వెనుకకు జరిగిందన్న మాట. ఒక్కొక్క డిగ్రీకి 72 సంవత్సరాలవంతున 70 డిగ్రీలకు 70x 72 = 5040 సంవత్సరాలు గతించాయని అర్థం. కాబట్టి కుత్సుడు "అమీయే పంచోక్షణో.." మంత్రం చెప్పినకాలం ఇప్పటికి 5040 సంవత్సరాల వెనుక అన్నమాట. ఈ కాలం నుండి క్రీస్తుశకంలో గడిచిన 1999 సంవత్సరాలను తీసివేస్తే 5040–1999=3041 వస్తుంది అంటే క్రీ.పూ. 3041 అని అర్థం.

ఇక్కడ ఒక ముఖ్యవిషయాన్ని అవలోకించాలి. రాత్రింబవళ్లు సమానంగా ఉండే కాలాన్ని 'విషువత్తు' అంటాం. మార్చి 21, సెప్టెంబరు 23 తేదీలలో ఇలా జరుగుతోంది.

మార్చి 21న ''వసంత విషువత్తు'' (VERNAL EQUINOX) లేదా మహావిషువత్తు అనీ, సెప్టెంబరు 23న శరద్విషువత్తు (AUTO MNAL EQUINOX) అని అంటారు. మార్చి 21న సూర్యుడు ఉత్తరభాద్రా నక్షత్రంలో ఉంటాడు. అంటే 'వసంత సంపాతం' ఉత్తరాభాద్రలో సంభవిస్తోంది. కానీ మనం వసంత సంపాతం అశ్వనిలో జరుగుతున్నట్లుగా తీసుకుని లెక్కవేశాం. మరి ఇది తప్పు కాదా అనే సందేహంరావచ్చు. ఈ సందేహనివృత్తికి సౌర మానానికి సంబంధించిన కొన్ని విషయాల్ని పరిశీలించాలి.

భూమి సూర్యుణ్ణి ఒకసారి చుట్టి రావడానికి ఒక సంవత్సరం పడుతుంది. దీన్ని సౌర సంవత్సరం అంటారు. ఈ సౌర సంవత్సరం రెండురకాలు. ఒకటి సాయనవర్షం (TROPICAL YEAR), రెండవది నిరాయణ వర్షం (SIDERIAL YEAR).

మార్చి 21, సెప్టెంబరు 23 తేదీల్లో 'విషు వత్తు' సంభవిస్తుందని ఇంతకు ముందు చెప్పు కున్నాం. ఆ రోజుల్లో సూర్యుడు సరిగ్గా భూమధ్య రేఖకు ఎదురుగా ఉంటాడు. భూమి తన అక్షంమీద 23 1/2 డిగ్రీలువంగి చరించడం వలన ఇలాజరుగుతుంది. విషువత్తు ఏర్పడే ఈ రెండు స్థానాల్ని 'విషు వద్బిందువులు' (EQUINOCTICAL POINTS) అంటారు. వసంత విషువద్బిందువును గ్రీకు అక్షరం 'గామా' తో సూచిస్తారు. దీనినే ''మేషాది బిందువు'' (FIRSTPOINT OF ARIES) అని కూడా అంటారు. సుమారు రెండువేల సంవత్సరాల క్రితం ఈగామా మేషరాశి ప్రథమ బిందువుతో (అశ్వని ఆరంభం) ఏకీభవించింది. ప్రస్తుతం ఇది వెనక్కుజరిగి ఉత్తరాభాద్రలో విషువత్తు జరుగుతున్నా 'గామా' కు మాత్రం మేషాది బిందువనే పేరు మిగిలిపోయింది.

సూర్యుడు తన గమనపథంలో 'గామా' వద్ద ఆరంభించి సంవత్సరం తరువాత తిరిగి గామాను చేరుకోవడానికి 365 రోజుల 5 గంటల 48 నిమిషాల 46 సెకనులు లేదా 365. 2422 రోజులు పడుతుంది. దీన్ని 'సాయణవర్షం' అంటారు. ఆయనం అంటే చలనం. అస్థిరమైన 'గామా' ఆధారంగా కాల నిర్ణయం చేయడం వల్ల దీనిని 'సాయణ వర్షం' అన్నారు.

గామాతో సంబంధం లేకుండా వేరొక స్థిర నక్షత్రాన్ని సూర్యుడు రెండుసార్లు వరుసగా దాటడానికి పట్టే కాలం 365 రోజుల 6 గంటల 9 నిముషాల 9.6 సెకనులు లేదా 365.2564 రోజులు. దీనిని 'నిరాయణ వర్షం' అంటారు. నిరాయనం అంటే చలనం లేనిది. చలనం లేని స్థిరనక్షత్రాన్ని ఆధారంగా కాలనిర్ణయం చెయ్యడం వల్ల దీన్ని ''నిరాయణ వర్షం'' అన్నారు.

కాలగణన సౌలభ్యం కోసం హిందువులు అనాదిగా 'నిరాయణ' విధానాన్నే ఎన్నుకున్నారు. విషు బిందువు 'గామా' మారుతూ ఉండడం చేత దానికి దగ్గరగా ఉండే ఒక స్థిర నక్షత్రాన్ని తీసుకుని ఆ స్థిరనక్షత్రం ఆధారంగా సంవత్సరారంభాన్ని సూచించారు. ఆస్థిర నక్షత్రాన్ని ప్రథమ నక్షత్రంగా భావించారు. ఈ లెక్కలోనే పాండవుల కాలంలో ఆరుద్రను ప్రథమనక్షత్రంగా గణిస్తే ఆ తరువాతి కాలంలో దాన్ని సరిచేసి కృత్తికానక్షత్రాన్ని ప్రథమ నక్షత్రంగా గణించి 'విషు' జరుపుకున్నారు. వరాహమిహిరుడు దానిని తిరిగి సవరించి అశ్వనిని ప్రథమ నక్షత్రంగా మార్చాడు.

ఆయన కాలంలో 'గామా' కూడా అశ్వనితో ఏకీ భవించింది. ఇప్పటికీ మనం వరాహ మిహిరుణ్ణే అనుసరిస్తూ సూర్యుడి అశ్వనీ నక్షత్ర ప్రవేశాన్ని 'విషు' గా, సౌర సంవత్సరారంభంగా జరుపుకొంటున్నాం. ఈ విధంగా నేడు 'సాయన' వర్షారంభం మార్చి 21న, 'నిరాయణ' వర్షారంభం ఏప్రిల్ 14న జరుతోంది.

పాండవులకాలంలో 'ఆర్ద్ర' లో వసంత సంపాతం 'నిరాయణ' విధానంలోనే గానీ 'సాయన' విధానంలో కాదని తెలుసుకోవాలి. అందుచేత పాండవులకాలనిర్ణయానికిఆరుద్ర నుండి అశ్వనికి గల భేదాన్నే తీసుకోవాలితప్ప, ఆరుద్రనుండి ఉత్తరాభాద్రకు గల భేదాన్ని తీసుకోకూడదు.

కావ్యకంఠవాసిష్ఠ గణపతిముని 'భారత చరిత్ర పరీక్ష' గ్రంథంలో సాయన, నిరాయణ భేదాన్ని విస్మరించి ఆర్ద్రనుండి అశ్వనికి గల భేదానికి అశ్వని నుండి ఉత్త రాభాద్రవరకు గతించిన సుమారు 23 ఆయనాంశలను (డిగ్రీలను) కూడా చేర్చి పాండవులకాలం క్రీ.పూ. 4761 అని నిర్ణయం చేశారు. కానీ ఇది సరికాదు.

కాబట్టి కుత్సుడి ''అమీయే పంచోక్షణో....'' మంత్రకాలం క్రీ.పూ. 3041 గా నిర్ణయించడం సబబే. కానీ భారతీయ సాంప్రదాయాను సారంగాను, పంచాంగాను సారంగాను క్రీ.పూ. 3102 లో కలియుగారంభమైంది. పాండవుల మహాప్రస్థానం క్రీ.పూ. 3077 జరిగింది. మనలెక్కకు, దీనికి కొంత భేదం కని పిస్తోంది. అందుచేత శ్లోకకాలాన్ని కొంత సరిచూడవలసి ఉంది.

1) హస్తలో దక్షిణాయనం ఆరంభమైన కాలం పాండవులది. మన లెక్కకోసం హస్తను పూర్తిగా వదలివేసి (ఆరుద్ర రెండవపాదాన్ని వదలివేసి) గణించాం. అందుచేత పాండవుల కాలం క్రీ.పూ. 3041కి ముందే కానీ తరువాతకాదని రూఢి అవుతోంది.

2) దక్షిణాయనారంభానికి హస్తలో ఎన్ని డిగ్రీలు గతించాయి లేదా 'విషు' ఆర్ద్ర రెండవ పాదంలో ఎన్ని డిగ్రీలలో జరిగిందన్న విషయాన్ని నిర్ధారించుకోవాలి. కనీసం రెండు

డిగ్రీలు గతించాయనుకుంటే 72x2=144 సంవత్సరాల కాలభేదం వస్తుంది. దీన్ని మన లెక్కకు కలుపు కుంటే 3041+ 144 = 3185 వస్తుంది.

3) ఋగ్వేద మంత్రంలోని సన్నివేశం ఎక్కడిదీ అని ఆలోచిస్తే పాండవుల అజ్ఞాతవాస కాలంలో గానీ, లక్క ఇంటిదహన కాలంలో గానీ జరిగిందనుకోవచ్చును. మహాభారత యుద్ధం క్రీ.పూ. 3139 లో జరిగిందనడం సాంప్రదాయంకనుక అంతకు 10-20 సంవత్సరాల ముందు ఋగ్వేద మంత్ర సంఘటన జరిగి ఉండవచ్చని భావించవచ్చు. అంటే క్రీ.పూ. 3159- 3149 మధ్యలో జరిగి ఉండవచ్చును. దీనిని బట్టి ఆనాటి దక్షిణాయనారంభం హస్త రెండవడిగ్రీ ద్వితీయార్ధంలో జరిగిందనుకుంటే మన లెక్కకు సుమారు 105 నుండి 115 సంవత్సరాలను కలుపుకోవచ్చు. అప్పుడు క్రీ.శ. 3156-3146 మధ్య వస్తుంది. ఇది సాంప్రదాయకాలానికి దగ్గరలో ఉంది కాబట్టి దీనిని ఒప్పుకోవచ్చు. అంటే ఆనాడు దక్షిణాయనారంభం హస్త ప్రధమపాదం రెండవ డిగ్రీలో లేదా 'విషు' ఆర్ద్ర ద్వితీయ పాదం రెండవ డిగ్రీలో జరిగిందని స్థూలంగా నిర్ణయించవచ్చును.

ఈ విధంగా ఏ పద్ధతిలో శోధించినా సాంప్రదాయానుసారం చెప్పుకుంటున్న క్రీ.పూ. 3139 మహాభారత యుద్ధకాలమని చెప్పడంలో సందేహం లేదు. ఇంతకన్న తిరుగు లేని ఆధారం మరొకటి లేదు: ఉండదు. ఈ తేదీ ఆధారంగా పురాణప్రవచిత రాజవంశావళుల కాలం కూడా సరియైనదేనని వేరుగా చెప్పవలసిన అవసరం లేదు. వీటిగురించిన ఆధునిక చరిత్రకారుల వాదనలు అసంబద్ధాలు. ఇక మహాభారత యుద్ధం తరువాత మగధను పరిపాలించిన రాజవంశాల కాలాన్ని పరిశీలిద్దాం. (-సశేషం.)

# సభ



'నర్తనశాల - కూచిపూడి నాట్య విద్యాలయం' ఆధ్వర్యంలో ఇటీవల చెన్నైలోని రాణీసీతై హాలులో - ''గంగావతరణం'' నృత్యరూపకాన్ని 25 మంది కళాకారులు ప్రదర్శించారు. పురాణాల ఆధారంగా గంగాజననం, బ్రహ్మలోక గమనం, అక్కడినుండి విష్ణుపాదాలను చేరడం, భగీరధుని తపః ఫలితంగా, శివజటాజూటంపై నుండి ఇలకు చేరడం, సగరులను తరింపజేయడం... అనే కథని నృత్యానుగుణమైన రీతిలో సామవేదం షణ్ముఖశర్మ రచించారు.



ప్రముఖ సంగీత దర్శకులు సంగీతరావు గారు స్వరపరచారు. శ్రీమతి సత్యప్రియా రమణ అత్యద్భుతంగా, హృద్యంగా, ఔచితీమంతంగా నృత్యదర్శకత్వం వహించారు. శివ, గంగ, భగీరథ... మొదలైన పాత్ర ధారులందరూ చక్కగా అభినయించారు. కూచిపూడి విద్యను విశ్వవ్యాప్తం చేసిన వెంపటి చినసత్యం గారి శిష్యురాలైన శ్రీమతి సత్యప్రియ, ఆ సంప్రదాయ శైలిలో నృత్య



కల్పన చేసి గురువారసత్వాన్ని పుణికి పుచ్చుకున్నారు. అరూప్ ఘోష్, మధురిమ - మొదలైన కళాకారులు శివ, గంగ మొదలైన పాత్రలను పోషించారు.

గానగంధర్వ డా॥ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం ముఖ్య అతిధిగా, ప్రముఖ పారిశ్రామికవేత్త, సాహితీ సంగీతవేత్త శ్రీ మల్లాది సచ్చిదానందమూర్తి అధ్యక్షులుగా పాల్గొన్న ఈ కార్యక్రమం.... ఆద్యంతం చక్కని ఆహార్యాలతో, అలంకరణలతో, సాంకేతిక నైపుణ్యంతో ప్రేక్షకుల్ని అలరించింది. నగరంలోని ప్రముఖులతో పాటూ, అత్యధిక సంఖ్యలో తెలుగు, తమిళ ప్రజలు పాల్గొని సభను జయప్రదం చేశారు.

# మన సంస్కృతాన్ని  నేర్చుకుందాం

**సరస్వతి! నమస్తుభ్యం**
**వరదే! కామరూపిణి! ।**
**విద్యారంభం కరిష్యామి**
**సిద్ధిర్భవతు మే సదా ॥**

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః**
**గురుర్దేవో మహేశ్వరః ॥**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ**
**తస్మై శ్రీ గురవే నమః ॥**

★★★

సంస్కృతాన్ని నేర్చుకోబోతున్నాం.

దానికి ప్రారంభంగా ఈ భాషా ప్రాశస్త్యాన్ని, స్వభావాన్ని కొంత తెలుసుకోవాలి.

ఈ ప్రపంచంలో అనేక ప్రాచీన భాషలు అంతరించిపోయాయి.

కానీ 'సంస్కృతం' జీవించి ఉంది. ప్రత్యేకంగా వ్యాకరణసహితంగా సంస్కృతాన్నే మాట్లాడే గ్రామాలు కూడా ఉన్నాయి. అలా మాట్లాడుకోకపోయినా, మనం మాట్లాడుకునే భారతీయ భాషలన్నిట్లో సంస్కృతం కలిసే వుంటుంది. అసలు మన వాక్య నిర్మాణాలన్నీ సంస్కృతాన్ని అనుసరించే ఏర్పాడ్డాయి. మనం గుర్తించనంతగా మన మాటల్లో, మన హృదయాల్లో సంస్కృతం విలీనమై ఉంది.

దానిని గుర్తించాలి. సలక్షణంగా, సంస్కృతాన్ని నేర్చుకోవాలి.

ఈ నేర్చుకోవడం జ్ఞానసముపార్జన కోసం. మన సంస్కృతి యదార్థస్వరూపాన్ని మనంతట మనమే తెలుసుకోవడం కోసం, మనమంటే ఏమిటో, మన ప్రత్యేకత ఏమిటో చాటి చెప్పడం కోసం. రామాయణ, భారతాదులే కాక - అనేక కావ్యాలు, శాస్త్రాలు ఈ భాషలో ఉన్నాయి. నాస్తిక దర్శనాలు కూడా ఈ భాషలోనే రచింపబడడం గమనార్హం.

ముఖ్యంగా - గుర్తుంచుకోవలసిన విషయం - సంస్కృతం నేర్చుకోవడం చాలా సులభం. కారణం ఈ దేశంలో అతి సామాన్యుడికి కూడా సంస్కృతం తప్పకుండా పరిచయమై ఉంది. నేర్చుకోవలసిందల్లా వాక్య నిర్మాణం, కొద్దిపాటి వ్యాకరణం, కావ్యాదుల్లో వాడే శ్లోకాలను అన్వయించుకొని, అర్థం చేసుకునే విధానం. పాఠం నేర్పే పద్ధతుల్లో కూడా ఒక శాస్త్రీయ విధానాన్ని ఏర్పరచారు మన పూర్వ గురువులు.

'సంస్కృతం' - అంటే 'సమ్యక్కృతం' - సమగ్రం చేయబడిన, సంస్కరించబడిన భాష. అంటే 'శబ్ద శక్తి'ని అక్షరాలుగా, పదాలుగా సంస్కరించి, వ్యక్తీకరణకు వాడిన భాష అని అర్థం. వేదాల నుండి ఈ భాషను స్వీకరించారు. 'పాణిని' వంటి మహా భాషా వేత్తలు దీని స్వరూప స్వభావాలను, వ్యాకరణ శాస్త్రాన్ని అందించారు.

'దేవభాష'గా, 'దైవీవాక్కు'గా పేర్కొనబడే ఈ భాష మన భారతీయుల ఉమ్మడి సంపద.

మనం ఎన్నో భాషలు నేర్చుకోవచ్చు. ఎన్నో విద్యలు అధ్యయనం చేయవచ్చు. కానీ అంతా యింతో సంస్కృతం నేర్చుకోవడం - మన జీవితాలకే చాలా ముఖ్యం. ఆ 'ముఖ్యం' ఏమిటో నేర్చుకున్న తరువాత బాగా అవగతమౌతుంది. పెద్ద పండితులం కాకపోయినా - భాషలో ప్రవేశముంటే చాలు, చాలా తెలుసుకోవచ్చు. భాష నేర్చుకున్నవారంతా, ఆ భాషలో పండితులు కాలేరు కదా. ఇంగ్లీషు నేర్చుకున్న వాళ్లంతా, ఇంగ్లీషు పండితులైపోవడం లేదు. కానీ ఆ భాషాగ్రంథాలు చదివి అర్థం చేసుకోగలిగే సాటి పరిజ్ఞానం చాలు.

ఆ పరిజ్ఞానాన్ని అందించడానికి, ప్రస్తుత కాలమాన పరిస్థితుల్నీ, 'వేగాన్నీ' దృష్టిలో పెట్టుకొని పిల్లలు మొదలుకొని, సంస్కృతం రాని పెద్దల వరకు అందరి సౌలభ్యం కోసం ప్రణాళికాబద్ధంగా ఈ పాఠాలను ఏర్పరచడం జరిగింది.

గురుకులాలకు పోయి, లేదా మాష్టారు వద్దకు వెళ్లి నేర్చుకోవాల్సిన సంస్కృతాన్ని ఒక పత్రిక ద్వారా నేర్పడం సాహసమే. అయినా ఆ బోధకుల ఆధ్వర్యంలో - 'ఇంట్లో కూర్చునే, రోజులో అతికొద్ది సమయాన్ని కేటాయిస్తే చాలు' - అన్నట్లుగా ఈ పాఠాలను సిద్ధం చేశాం.

ప్రతి రోజూ పది నిమిషాల నుండి అరగంట వరకు ఈ పాఠాలని, ఒకదాని తరువాత ఒకటి పరికించండి. మీరు 'అభ్యాసా'లని పూర్తి చేయండి. ప్రతి ఆరునెలలకూ - అంతవరకూ మీరు అధ్యయనం చేసినవాటిపై, ఈ పత్రిక ద్వారా వచ్చే ప్రశ్న పత్రాలకు సమాధానాలు వ్రాసి 'ఋషిపీఠాని'కి పోస్టు చేయండి.

వచ్చే సంచిక నుండి పాఠాలు ప్రారంభం కానున్నాయి. మా ఈ ప్రయత్నానికి హృదయపూర్వకమైన మీ స్వాగతం, ఆదరణ లభిస్తాయని ఆశిస్తూ -

**ఋషిపీఠం**
భారతీయ మానసపత్రిక

# MAN OF THE MILLENNIUM

K. VENKATARAMANI

Mother of nights
that ushered
days of dear, dear release
from the drear yoke of despotism
delirium, defeatism
and condescensions
I salute;

light was wrested
from the black caverns of serfdom
by an earthing
no less valorous
than the fabled Prometheus;
life was reclaimed
out of the dreaded divide
that had formed
betwixt natives
and the intruders and their men.

High-rise mansions,
bridges, roads,
iocomotives, posts,
street-lights, rail-tracks,
anglo-saxon linguo,
insights into western lores,
and much more
we were endowed
by the whites
yet, yet precious freedom
spine of the living
we were deprived;

countless millions we were
born free,
we remained subdued
by the rule of many
by a few, for a few
for years three hundred
and more, until that night
which revealed

vistas new and pastures numerous
old ebon shadows
of subjugation, subservience,
and surrender fled
and with them the fear
of calling one's possession
one's own.

Distraught days
there had been before
when brothers turned
against their kin,
sons against sires
thanks to machinations
of the ruling elite!
culture of discords
was adeptly nourished
in families, communities
earlier knit by silken chord
of hoary unity.

Armed with wisdom
infused by potions
of indigenous texts
and the best
from ohter climes,
that gaunt soldier
bare of the fineries
of conceit
boast and disdain
came to guide us
stranded as we were
inside the rudderless plane;

truth and dignity
informed his words
action and mien
and they, deluge-like,
swept into the portals
of the insolent might;

waters of non-violence
dampened dynamite;
cannons fell quiet
in meek obeissance
to the spirit of man.

Annals have no precedent
to compare
with this matchless tale
of one man inspring legions
to a bloodless campaign
and making the sun of authority
set for ever
on the Empire's
plum Eastern possession.

As we, this day, bow
in reverence
for his and for the memory
of his vast band of men
we do ourselves proud
for holding aloft
above all, above life itself,
cannon of virtuous living
which they practised.

Mark-now the scenario!
grenades, shells, sickles
are doing freely the rounds
in public places
in neighbourhoods,

money's slyly flow
from the state coffers
into private chests
of men in power
to gratify
their prickly heat of want
that itches more
the more it is indulged.

Countrymen, why despair?-
To do so is a slur
on the memory of those that lived
as one,
threaded on the life-breath
of freedom-wish
and laid down all their own
to realise the ALL
for all;
let's therefore, jubilate
and not despair.
why fall foul of freedom?-
if burglar break into the house,
why think you should smash the
house itself?

# VEDIC HERITAGE







***Namaste Sarade Devi, Veena Pustaka Dharini,***
***Tvamaham Prarthaye nityam, Vidyadanam pradehi me.***

***Dr. JayaVenugopal***







In a Vedic society, war was waged only as a last resort to preserve dharma. The puranas and other works describe warfare through stories. There is an authoritative text providing the necessary rules of warfare and weaponry. This text is known as dhanur -veda. Even though the word dhanus means bow, here it covers the use of all weapons. Dhanur-veda is considered to be an upaveda, a subsidiary text of the Yajur-veda. It describes various weapons and also how to make and use them

## Origin

It was believed that Lord Siva revealed the knowledge of dhanur -veda to Parusurama in a composition of sixty thousand verses. Over the course of time Vasista received this knowledge and imparted it to Visvamitra.





Parusurama's work on dhanur veda is known as Dhanuscandrodaya.



Vasistha authored a work called Vasistha-samhita.



Drona who is another link in the tradition wrote Dhanus-pradipam

## Texts on dhanur veda

Sukra -niti(శుక్రనీతి)by Usanas (ఉశన), Yuddhajayarnava (యుద్ధజయార్ణవ)by Bhoja, Yuktikalpataru (యుక్తికల్పతరు) and Vriddhasarangadhara.(వృద్ధ సారంగధర)



Dhanur veda is also dealt in some sections of Arthasastra of Kautilya, Yajur veda, Asvamedha -yajna and Agni -purana and the itihasas.



Upholding dharma is a gruesome act such as war, which appears to be adharmic, can be considered dharmic when it is meant to uphold dharma. This idea is beautifully unfolded in the Bhagavad Gita when Lord Krishna teaches Arjuna the duties of a prince, reminding him of war as the ultimate symbol of justice for a kshatriya

## Weapons and warfare

Dhanur- veda is classified in to four sections

- ★ initiation of the student,
- ★ rules of study
- ★ skill and mastery of the art of weaponry
- ★ use of weapons

weapons used in warfare are of two fold
Astra -- includes mantra and
Sastra -- power of the weapon and skill of the person using it.

## Astras

well known astras are

**Nagastra**
(నాగాస్త్రం)

**Brahmastra**
(బహ్మాస్త్రం)

**Pasupatastra**
(పాశుపతాస్త్రం)



Arjuna receives pasupatastra from Lord Siva

## Dhanur-Vidya

Wars that employ the bow and arrow are known as Dhanur-Yuddha.
This specific science of weaponry is thus known as dhanur- vidya.



Rama
God



Arjuna
A prince



Ekalavya
A tribal

All are great archers

## Types of Weapons

There are three types of weapons



mukta -
released from hand
- an arrow





amukta
held in hand
-a sword

muktamukta
partly held and
partly released
- a noose

## Components of Army

Cavalry

Infantry

Chariotry

Elephantry



## Akshauhini

An army made up of
65,610 horses,
109,350 foot soldiers
21,870 chariots
and 21, 870 elephants
is called Akshauhini.
It is divided into ten
divisions and each is
called an anikini.

## Vyuha

Complex battle formations with the various components of the army viz - chariots, elephants, horses, and foot-soldiers, occupying definite strategic positions are called vyuha. These vyuhas took various shapes -

**makara** vyhua - fish formation,





**garuda** vyhua -
- eagle formation,

**chakra** vyhua-
- circle formation





Abhimanyu in Chakra Vyhua

## Rules of the war

-- under no conditions can civilians be attacked.
-- fighting is to be restricted only to the battle field.
-- those who have surrendered can not be killed,
-- a soldier can not be attacked when preparing himself for war,
-- an unarmed soldier can not be fought with unless he is willing to fight.



# GANDHARVA VEDA

## Gandharva Veda

Art is any means of communication with the message of knowledge . It becomes sacred if the message is love, truth and god's glories are conveyed. Indian fine arts and performing arts are sacred because they carry sanctity with them. Art is a means to portray bhavas, feelings and emotions, and the fulfilment of its expression lies in the creation of rasa. The various disciplines of dance, music and instrumentation come under Gandharva veda.



## Origin

Nada (నాద), the basis of gandharva -veda is described as the cause of all activities in the universe. "Through nada , the syllables are produced; from syllables emerge the words; words form speech and speech leads to activities.

Thus nada forms the basis of the "universe"

The **tradition** has it that gandharva -veda was handed down by the Lord himself.

" Brahma", the Lord, evolved gitam from the sama veda. And he shared it with goddess Saraswati and she revealed it to

Sage Narada
↓
Kasyapa
↓
Bharata

## Essence of nada

" The trinities, Lord Brahma, Lord Vishnu and Lord Siva are worshipped by worshipping nada , since the trinities are the essence of nada."

Since gandharvas, celestial beings, are believed to be engaged in dance and music, sangita-sastra is known as gandharva - veda. Having a divine origin, these arts were considered integral the temple worship and were used as an offering of one's devotion.

## Natya Sastra

The earliest work on sangita is Bharata's Natya Sastra which is basically a treatise on dramaturgy. The chapters 28 to 33 of Natya Sastra deal with music and musical instruments.



# Gita

The Indian music is essentially melodic. The melodic form may be monotone, a song chanted in a single note, or a highly evolved raga. It is linear.
There are three features of classical music which are unique to India.

Raga -- (రాగ)
the art of
improvisation

Tala -(తాళ)
the complex
nature of time
measure

Gamakas (గమకాలు)
the use of
ornamentation
techniques

# Swaras

" That sound which is of the nature of resonance and which delights the minds of the listeners is called Swara."

There are seven swaras:
shadja -(షడ్జ) sa,
Rishabha -- (ఋషభ) ri,
gandharva - (గాంధార) ga,
madhyama - (మధ్యమ) ma,
panchama - (పంచమ) pa,
dhaivata - (ధైవత) dha,
nishada - (నిషాద) ni

The seven natural notes are traced to the three vedic notes
Udatta, (ఉదాత్త)
anudatta (అనుదాత్త)
svarita. (స్వరిత)

# Raga and tala

*Melodic aspect of Sangita is referred to as a raga.*

A raga is described by those who know as that particular sound adorned with swaras and motives which delights the minds of the listeners. Ragas are three jatis .
Raga having five notes called - audava, and seven notes - sampurna.

Tala is meter in music and is cyclic [ avartana ] in nature.
Rhythm includes laya .





*Gandharva Veda deals with all the musical instruments*

స్వామీజీ-చార్వాకరావు

# "హోమ" (Homa) చికిత్స

విశ్వనాథ పావనిశాస్త్రి

ఆధునిక నాగరకతా ప్రభావం వలన అవతరించిన, ఇరవై రెండవ నరకంలా ఉంది నగరం. నగరాన్ని ఆవరించిన వాహనాల పొగ, శూర్పణఖ కప్పుకున్న మేలి ముసుగులా ఉంది.

స్కూటరు గుమ్మంలో ఆపి, చార్వాకరావు ఖళ్ళు ఖళ్ళున దగ్గుతున్నాడు. గుండె నిండా గాలి పీలిస్తే, కడుపులో తిప్పుతోంది. కాస్సేపు నిదానించి చూద్దామంటే, కళ్ళు ఎఱ్ఱబడి, నీళ్ళు కారుతున్నాయి. ఎక్కువ సేపు నిలబడితే, నీరసంతో కాళ్ళు లాగుతున్నాయి. ఆలోచించే తీరుబడి లేదు. 'టెన్షన్'తో బుర్ర వేడెక్కి పోతోంది.

ముక్కుకీ మూతికీ అడ్డం కట్టుకున్న "పొల్యూషన్ మాస్క్" తీసి, రాబర్ట్ లోపలికి నడిచాడు. ఆయాస పడుతూ చార్వాకరావు కూడా లోపలికి నడిచాడు.

అంతలో బయట వానజల్లు ప్రారంభమైంది. "వానా వానా వల్లప్ప...." అంటూ పిల్లలు బయటికి పరిగెత్తబోయారు.

"వల్లప్పా లేదు, వల్లకాడప్పా లేదు... లోపలికి పదండి" అని పిల్లల్ని కసురుకున్నాడు రాబర్ట్. ఎప్పుడూ కసురుకోని రాబర్ట్ కేసి, పిల్లలు వింతగా చూశారు.

రాబర్ట్ బాధ పడుతూ, "వానా వానా వల్లప్పా అంటూ, వానలో చిందులు వేసే భాగ్యం మీ తరానికి లేదు నాయనా! ఎందుకంటే, "డీజిల్" వాహనాల దివ్య మహిమ వలన ఒక పెద్ద యాసిడ్ మేఘం ఆకాశంలో ఏర్పడింది. అది హిందూ మహాసముద్రం పైన రాకాసల్లే తిరుగుతోంది. అది అమెరికా వైశాల్యానికి మూడింతలు ఉందిట. అది ఎప్పుడు ఎక్కడ ఎలా కురుస్తుందో తెలీదు. అది నెత్తిన కురిస్తే... ఎందుకులే? అందుకని వానలోకి వెళ్ళకండి" అన్నాడు.

"అదంతా ఒక్కసారిగా కురిస్తే చచ్చిపోమూ!" అన్నాడు చార్వాకరావు.

"ఆహా! ఒక్కసారిగా కురిస్తే, ఒక్కసారిగా ఛస్తాం. కొద్ది కొద్దిగా కురిస్తే కొద్ది కొద్దిగా ఛస్తాం!" అన్నాడు రాబర్ట్.

"ఛఛ! ఈ పొల్యూషన్‌ని ఎలా అరికట్టాలో అర్థం అయి చావడంలేదు. అని విసుక్కున్నాడు చార్వాకరావు.

★ ★ ★

సూర్యోదయం అవుతోంది.

**"సూర్యాయస్వాహా - సూర్యాయ ఇదం నమమ**

**ప్రజాపతయేస్వాహా - ప్రజాపతయ ఇదం నమమ"**

స్వామి సత్యానాధానంద ఆశ్రమ పరిసరాల్లోని ప్రతి ఇంట్లో నిత్యాగ్నిహోత్రం ప్రజ్వరిల్లుతోంది. ఆవు నేతితో తడిసిన బియ్యమూ, చిన్న చిన్న సమిధలూ హోమం చేయబడుతున్నాయి. హోమ కుండాల్లోంచి సర్పిలాకారంగా పైకి లేస్తున్న చిన్నిచిన్ని ధూమ జ్వాలలు, వేగంగా మేఘమండలం చేరుకుంటున్నాయి.

హోమ ధూమాన్ని ఆస్వాదిస్తున్న మొక్కలూ చెట్లూ ఆరోగ్యంగా తల లాడిస్తున్నాయి. వాటి పాదుల్లో చల్లిన యజ్ఞభస్మంతో బలం పుంజుకుంటున్నాయి.

ఒక ప్రక్కగా ఉన్న యజ్ఞశాలలో, ఆవు పిడకలు కుప్పలు పేర్చి ఉన్నాయి. అక్కడే మేడి, మోదుగ, రావి, జమ్మి, జువ్వి, మఱ్ఱి, వేపవంటి సమిధలు విడివిడిగా కట్టలు కట్టబడి ఉన్నాయి.

మధ్యాహ్నం జరగబోయే మహాకామ్య యజ్ఞానికి ఏర్పాట్లు జోరుగా సాగుతున్నాయి. స్వామివారు వసారాలోకి వచ్చి, అరుగు మీద కూర్చున్నారు. ఏదో గ్రంథం తెరిచారు. అప్పుడే వచ్చిన రాబర్ట్ స్వామి వారికి నమస్కరించాడు.

ముక్కు ఎగపీలుస్తూ, దగ్గుతూ వచ్చిన చార్వాకరావు, చుట్టూ కలయ జూశాడు. "ఏం స్వామీ! ఈ అగ్ని హోత్రాలేమిటి? ఈ యజ్ఞాలేమిటి? ఈ చాదస్తాలని మళ్ళీ బ్రతికించాలని ప్రయత్నిస్తున్నారా?" అన్నాడు.

స్వామివారు అతణ్ణి జాలిగా చూస్తూ, "అసలు ఈ చాదస్తాలు ఛస్తేకదా, బతికించే ప్రయత్నం? వాతావరణ కాలుష్యంతో చావ

> "ఔను. ఆయుర్యజ్ఞేన కల్పతాం. ప్రాణో యజ్ఞేన కల్పతాం. అగ్నిహోత్ర విధిని చేపట్టండి. అగ్నిహోత్రవిధిని సాగనివ్వండి. తిరిగి భూగోళాన్ని సస్యశ్యామలం చెయ్యండి." అని స్వామి వారు లేచి యజ్ఞశాలవెపు నడిచారు.

బోతున్న నేటి మానవ జాతిని బ్రతికించాలంటే ఎప్పటికైనా ఈ అగ్నిహోత్రమే శరణ్యం!'' అని అన్నారు.

రాబర్ట్ ఆశ్చర్యంతో, ''సరిగ్గా ఆ విషయమే తమతో మాట్లాడదామని వచ్చాను స్వామీ? నేటి వాతావరణ కాలుష్య నివారణకి, ఈ హోమాలూ యజ్ఞాలూ పని చేస్తా యంటారా?'' అని అడిగాడు.

''హోమాలూ, యజ్ఞాలూ మాత్రమే పని చేస్తాయి. మరొక గతిలేదు,'' అన్నారు స్వామి వారు.

చార్వాకరావు కనుబొమలు ముడి వేశాడు.

రాబర్ట్ చేతులు జోడించి ''ఎలా పని చేస్తాయో దయచేసి వివరంగా చెప్పమని నా ప్రార్థన'' అన్నాడు.

స్వామి సత్యనాథానంద యిలా మొదలు పెట్టారు:

''ముఖ్యంగా, యజ్ఞయాగాది క్రతువుల్లో ఏ కట్టెపేళ్ళు పడితే, ఆ కట్టెపేళ్లు వాడకూడదు. నిర్ణయింపబడిన కట్టెలే వాడాలి. వాటిని సమిధలు అంటారు. నిత్యాగ్ని హోత్రం, రోజూ సూర్యోదయ సూర్యాస్తమయ సమయాల్లో, రెండుసార్లూ చెయ్యాలి. నిత్యాగ్ని హోత్రానికి ప్రధానంగా ఆవు పిడకలు వాడాలి. హోమానికి ఆవునెయ్యీ, బియ్యమూ వాడాలి. పాలాశం, (మోదుగ), వంటి సమిధలు వాడాలి.

మోదుగ - శ్వాసరోగాలనీ, చర్మవ్యాధులనీ, సర్పవిషాలనీ హరిస్తుంది. మేడి - వ్రణాలనీ, రక్తపైత్యాలనీ, దంతవ్యాధులినీ అణచి వేస్తుంది. రావి - మేహ రోగాలనీ, కఫ పిత్తాలనీ, విరేచన వ్యాధులనీ నశింపజేస్తుంది. జువ్వి - కఫవాత మేహాలనీ, మహా వ్రణాలనీ, కుళ్ళిన గాయలనీ కూడా తొలగిస్తుంది జమ్మి - అగ్నిమాంద్యాన్నీ, కఫ కుష్ఠ రోగాలనీ, పురీష వ్యాధులనీ తగ్గిస్తుంది.

ఇలా ఒక్కొక్క సమిధకీ ఒక్కొక్కరకంగా అనేకానేక గుణాలున్నాయి. ఏ సందర్భంలో, ఏ హోమంలో, ఏ సమిధలు వాడాలో శాస్త్ర బద్ధమై ఉంది.

ఆయా గుణాలు కలిగిన, ఆయా ద్రవ్యాల్ని, హోమం చెయ్యడం వలన, ఆ హోమ ధూమం, ఆ ఉష్ణశక్తితో మేఘ మండలం దాకా చేరుతుంది. వాతావరణంలో చేరిన రకరకాల దుర్వాయువు (గ్యాస్) లను, అనేక సూక్ష్మజీవు (మైక్రోబ్) లను నాశనం చేస్తుంది.''

స్వామివారు చెప్తుండగా, చార్వాకరావు, ''అయ్యా! ఈ మాయావాదాలూ, ఊహాగానాలూ నా చిన్నప్పటి నుంచీ వింటూనే ఉన్నాం. తమరిప్పుడు కొత్తగా చెప్పక్కర్లేదు'' అన్నాడు వెక్కిరింపుగా.

స్వామివారు అతణ్ణి జాలిగా నవ్వుతూ, ''నీకు కొత్తగానే చెప్పాలి నాయనా! ఎందుకంటే అగ్నిహోత్రం మీద, యిప్పుడు ప్రపంచ వ్యాప్తంగా పరిశోధనలు జరుగుతున్నాయి. అవి నీకు తెలియదు.'' జాగ్రత్తగా విను.....

బియ్యం 300 సెల్సియస్ డిగ్రీల ఉష్ణానికి దగ్ధం అవుతుంది. దగ్ధమైన గ్రాము బియ్యం నుంచి 3500 క్యాలరీల ఉష్ణశక్తి విడుదల అవుతుంది. అలాగే ఆవునెయ్యి 600 సెల్సియస్ డిగ్రీల ఉష్ణానికి దగ్ధం అవుతుంది. దగ్ధమైన ఒక గ్రాము నెయ్యినుంచి 9300 క్యాలరీల ఉష్ణశక్తి విడుదల అవుతుంది. ఈ విధంగా అనేక ఇతర హోమ ద్రవ్యాల నుంచి 10000 క్యాలరీల దాకా ఉష్ణశక్తి విడుదలౌతుంది.

ఆ ఉష్ణశక్తితో కూడిన హోమధూమం, మేఘమండలాన్ని చేరుతూ, దారిలో CO, $CO_2$, $H_2O$, $H_2O_3$ వంటి రసాయనిక మార్పులు జరుపుకుంటుంది.

రెండు పూటలా జరిగే, అనేక అగ్నిహోత్రాలు, అధికమొత్తాలలో $H_2O$ (Water)ని సృష్టించి, నిర్మల వర్షమేఘాల సృష్టికి కారణ మౌతాయి. $CO_2$ (Carbondioxide)ని వెలువరించి, పగటి పూట చెట్లలో జరిగే కిరణజన్య సంయోగ క్రియ (Photo Synthesis)కు దోహద పడతాయి. తెల్లవారు ఝాముున, తడిసిన చెట్ల ఆకుల మీద $H_2CO_3$ (Carbonic Acid)గా మారి, చెట్ల బలాన్ని పెంచి, స్వచ్ఛమైన ప్రాణవాయువు (Oxygen)ను మనకి అందిస్తాయి.

ఆవు పిడకలు హుతమైనప్పుడు, అందులోని జీవగంధకం, డయాక్సైడ్ గా మారి, కృమి నాశకంగా పనిచేస్తుంది. అల్ప ప్రమాణంలో ఉన్న ఆ జీవగంధక వాయువు మానవ శరీరానికి హాని చెయ్యలేదు. ఈ విషయాలన్నీ ఈ మధ్య అనేకమంది ''సైంటిస్టులు'' పరిశోధించి తెలుసుకుంటున్నారు.''

అని స్వామివారు అంటూండగా, రాబర్ట్ అందుకని, ''ఔను స్వామీ! పోలెండ్ లో ఎల్. మటేలా అన్న సైంటిస్టు ఒకాయన ఉన్నాడు. ఆయన ఈ మధ్య భారతీయ అగ్నిహోత్రం మీద పరిశోధనలు చేస్తున్నాడు. పోలెండ్ లో 'బయాలిస్తోక్' అనే ప్రాంతం వుంది. ''గామా కిరణ'' ప్రభావంతో అదంతా అణుధార్మికత (Nuclear Radiation)తో నిండిపోయి ఉంది. వైదికమైన అగ్నిహోత్ర భస్మం కలిపిన జలంతో, ఆయన ఆ ప్రదేశాన్ని అనేకమార్లు తడిపి ప్రయోగాలు చేశాడు. కొన్నాళ్లకి, ఆ ప్రాంతంలో అణుధార్మికత గణనీయంగా తగ్గిపోయిందట! ఈ విషయమై, ఆయన ఒక నివేదిక (Paper) కూడా సమర్పించాడు. ఆ ప్రయోగం మరింత శక్తివంతంగా చేపట్టి, అణుధార్మికతని పూర్తిగా నిర్మూలించాలని ఆయన ఇప్పుడు గట్టిగా ప్రయత్నం చేస్తున్నాడు.'' అని అన్నాడు.

స్వామివారు నవ్వుతూ, ''ఔను డాక్టర్ ఎ.జి. మోండ్కర్ అనే ఇంకొక బొంబాయి సైంటిస్టున్నాడు. ఆయన కూడా మరొక ప్రయోగం

చేశాడు. సమానమైన వాతావరణం ధర్మం గల రెండు గదుల్ని సిద్ధంచేసి, ఆ ప్రయోగానికి ఉపయోగించాడు. ఒక గదిలో వైదికంగా అగ్నిహోత్ర విధినిర్వహించాడు. మరొక గదిలో ఎప్పటికప్పుడు, అగ్నిహోత్ర గదితో సమానమైన వేడిని, యాంత్రికంగా పెంచు కుంటూ వచ్చాడు. చివరికి రెండు గదుల్నీ వివరంగా పరిశీలించాడు. అగ్నిహోత్ర విధి నిర్వహించిన గదిలో 91.4% ''బాక్టీరియా'' నశించి పోయింది. యంత్రాగ్ని నిర్వహించిన గదిల ఏమీ తగ్గ లేదు.'' అని అన్నారు.

అంతలో ఆశ్రమంలోని కుందేలు, చెంగుచెంగున దూకుతూ స్వామి వారి పక్కన చేరింది.

చార్వాకరావు దానిని ఆశ్చర్యంగా చూస్తూ, ''నాలుగు రోజుల క్రితం, దీని ముక్కుకీ, చెవులకీ ఏదో ''స్కేబీస్'' (Scabies) వంటి చర్మవ్యాధి చూశానే! ఏమై పోయిందీ?'' అని అడిగాడు.

స్వామివారు కుందేలుని ప్రేమగా నిమురుతూ నవ్వారు.

చార్వాకరావు, ''బెంజిలూ, క్లాట్రిమజోలూ లాటి ఆయింటుమెంట్లు ఏవో వాడి ఉంటారు.'' అన్నాడు.

స్వామి వారు అతడిని ఎగాదిగా చూస్తూ, ''అవి వాడితే మూడు నాలుగు రోజులకే తగ్గిపోతుందా?'' అని అడిగారు.

''తగ్గదు...కానీ...'' అంటూ నసిగాడు చార్వాకరావు.

''నిత్యాగ్నిహోత్రంతో ఏర్పడిన భస్మంలో, కొంచెం ఆవు నెయ్యి కలిపి, ఆయింట్మెంట్ లాగా వాడాం. ఒక్కసారి రాసినంతలో సగానికి సగం తగ్గిపోయింది. దీనికి ''సైడ్ ఎఫెక్ట్స్'' కూడా ఏమీ లేవు. పూర్వం మనవాళ్ళు ఈవైద్యం వాడేవారు. దీని ఫలితం ఈ మధ్య పరిశోధనల్లో కూడా తేలింది మరి! అందుకే మనవాళ్ళు విభూతి వాడమన్నారు.'' అన్నారు స్వామివారు.

''మరే! మా పక్కంటాయన రోజూ ముఖానికి ఇంత విభూతి దట్టిస్తాడు. అందుకే కాబోలు చివరికి ఎలర్జీ వచ్చింది'' అని వెక్కిరించాడు చార్వాకరావు.

''హు?! దేవాలయాలను కూడా వ్యాపార కేంద్రాలుగా మార్చే ప్రభుత్వాలు తయారైనప్పుడు, చాకపీస్ పౌడర్లు, సీమ సుద్దా లాటిదే విభూతి అవుతుంది మరి! విభూతి అంటే అది కాదు. యజ్ఞ భస్మమే విభూతి! నియమితమైన సమిధలు వాడిన అగ్నిహోత్ర భస్మమే విభూతి. దాని లోనే ఈ ఔషధగుణం ఉంటుంది. ఏ బూడిదలో పడితే, ఆ బూడిదలో ఉండదు.'' అన్నారు స్వామి వారు.

రాబర్ట్ నవ్వుతూ చార్వాకరావు వైపు చూశాడు. చార్వాకరావు తల ఎటో తిప్పుకున్నాడు.

అంతలో లోపలి నుంచి ఒక శిష్యుడు వచ్చాడు. ''స్వామీ! కండ్లకలకకి మందు సిద్ధమైంది.'' అన్నాడు.

రాబర్ట్ ఆశ్చర్యంగా చూస్తూ. ''ఇది కూడా యజ్ఞభస్మంతో చేసిందేనా స్వామీ!'' అని అడిగాడు.

''ఆహా!.... అగ్నిహోత్రంలో మామూలుగా వేసే బియ్యమూ,నెయ్యీకాక - మఱ్ఱి - (Ficus Bengalnensis), కొండవేము - (Melia Azadirachta), మేడి - (Ficus Glonerata), ఈ మూడు సమిధలూ హోమం చేసిన భస్మం కొద్దిగా తీసుకోవాలి. దానిలో స్వచ్ఛమైన నీళ్ళు - ఒకటికి పదిపాళ్ళు - కలపాలి. అరగంట సేపు మరగ బెట్టాలి, వడపొయ్యాలి. అప్పుడు ఈ కలికం తయారౌతుంది. ఇది వాడితే కండ్లకలక మటుమాయం అవుతుంది. ఇది కూడా పరిశోధనలో రుజువైంది. కండ్ల కలక వచ్చిన రోగి, ఈ హోమం చేసేటప్పుడు, ఆ దగ్గరలో ఉంటే, ఫలితం యింకా తొందరగా కనబడుతుంది. కండ్లకలక ఊరంతా వ్యాపిస్తుందన్న అనుమానం వచ్చినప్పుడు, ఈ హోమం పెద్ద ఎత్తున చేస్తే, ఆ వ్యాధి అసలు తలే ఎత్తదు ఇంకా ఇటువంటి రీసెర్చిలు ఎన్నో జరుగుతున్నాయి.''

రాబర్ట్ చేతులు జోడించి, ''స్వామీ! నేనూ చెయ్యవచ్చా, ఈ నిత్యాగ్నిహోత్రం?'' అని అడిగాడు.

స్వామివారు అతడిని నిదానించి చూస్తూ, ''నీకు నిజంగా దాని యందు నిష్ఠ కుదిరితే చెయ్యవచ్చు, కానివైదిక పరంగా నిర్దేశింపబడిన మంత్రాల తోనే చెయ్యాలి. ఊరికే అగ్ని పేర్చి, సమిధలు అందులో పడేస్తే ఏమీ ప్రయోజనం లేదు. అది కూడా ఈ పరిశోధనల్లో నిరూపింపబడింది. వేద శబ్దాల లాగా వినబడే కొన్ని అర్థంలేని శబ్దాలని, అదే తీరులో ఉచ్చరించి చేసిన అగ్నిహోత్రాలు, ఆశించిన ఫలితాలని కొద్దిగా కూడా యివ్వలేదు. కాబట్టి ఇందులో వేదాక్షరాలకీ, వాటి స్వరానికీ కూడా ఎంతో ప్రాధాన్యం ఉంది. చేతనైతే చెయ్యి. అయినా, ఈ దేశంలో చెయ్యవలసిన వాళ్ళందరూ, అగ్నిహోత్రాలు సరిగ్గా చేస్తే చాలు. మిగిలిన వాళ్ళు, వాళ్ళని చెయ్యనిస్తే చాలు'' అని చార్వాకరావు వైపు చూశారు.

రాబర్ట్ చార్వాకరావు వైపు కోపంగా చూసి,''ఏం చార్వాకరావు! ఈ అగ్నిహోత్రాలూ, యజ్ఞాలూ - ఒక వర్గంవాళ్ళు వాళ్ళ స్వార్థం కోసం ఆడిన నాటకం అని చెప్పావ్! నాకేమో జగత్కల్యాణం కోసం చేసిన త్యాగం అనిపిస్తోంది. దీనికి నువ్వేం సమాధానం చెప్తావ్?'' అని అడిగాడు.

స్వామివారు ''అది సరే! ఇందాక వచ్చేటప్పుడు దగ్గుతూ వచ్చాడు. ఇప్పుడు ఆ దగ్గేమైపోయిందో అడుగు!'' అన్నాడు.

చార్వాకరావు బుర్ర గోక్కుంటూ అగ్నిహోత్రాల వైపు చూశాడు.

''కాబట్టి.... ప్రస్తుత వాతావరణ కాలుష్యాన్ని ఎదుర్కోవాలంటే, అంతా అగ్నిహోత్రం వైపు నడవాల్సిందే! లేదా అగ్నిగుండం లోకే!'' అని స్వామివారు అంటూండగా, చార్వాకరావు. ''క్రితంసారి నన్ను చెట్లు నరకద్దన్నారే! ఇప్పుడు చెట్లు నరకకుండా, యజ్ఞాలకి సమిధలు ఎక్కడనుంచి వస్తా యిట?'' అని తన దగ్గరున్న చివరి అస్త్రం ఉపయోగించాడు.

స్వామివారు తీక్షణంగా చూస్తూ, '' ఓరి మూర్ఖుడా! నీ మాత్రం జ్ఞానం వైదికులికి లేకకాదు. సమిధలంటే ఎండుకట్టెలు! దాని కోసం చెట్లు నరకక్కర్లేదు. పైగా ఆ ఎండిన కొమ్మల్ని విరవడం వలన చెట్లకి బలం కూడా!'' అని అన్నారు.

రాబర్ట్, ''చూడు చార్వాకరావ్! ఈ శతాబ్దంలో, ఒట్టి న్యూసుప్రింటు కోసం అమెరికా ఖండం లోని ''అమెజాన్'' అడవి సగానికి నరికి వేయబడింది అలాగే ప్రతి దేశంలోనూ అడవులు విధ్వంసం చెయ్యబడ్డాయి. దాని వలన ఋతుపవనాలు మారిపోయాయి. ఆక్సిజన్ తగ్గిపోయింది. వేడి పెరిగిపోయింది. ఓజోన్ పొర చిల్లులు పడిపోతోంది. మనుష్యుల ఆరోగ్యాలు పాడైపోయాయి. ఎన్నో జీవ రాశులు నశించిపోతున్నాయి. మనకింక ఎక్కువ మాట్లాడే అధికారం లేదు. ఈ వాతావరణ కాలుష్యాన్ని వెంటనే నివారించాలి. మానవ జాతినీ, భూమిమీది ప్రాణాన్నీ రక్షించాలి.'' దానికి ఈ అగ్నిహోత్రవిధే ''సైంటిఫికల్''గా శరణ్య మనిపిస్తోంది.'' అని ఆవేశంగా అన్నాడు.

''ఔను. ఆయుర్యజ్ఞేన కల్పతాం. ప్రాణో యజ్ఞేన కల్పతాం. అగ్నిహోత్ర విధిని చేపట్టండి. అగ్నిహోత్రవిధిని సాగనివ్వండి. తిరిగి భూగోళాన్ని సస్యశ్యామలం చెయ్యండి.'' అని స్వామి వారు లేచి యజ్ఞశాలవైపు నడిచారు.

రాబర్ట్ ఆయన్ని అనుసరించాడు. చార్వాకరావు బలంగా గాలి పీల్చుకుంటూ ఏమీ తోచక నిలబడి పోయాడు. ✷

# ప్రతిస్పందన

### ఋషిపీఠం

ఇది మన పత్రిక ఋషిపీఠం<br>
నీవు, నేను చదివే పత్రిక<br>
తెలియనివెన్నో తెల్పేపత్రిక<br>
బ్రతుకున కర్థం తెల్పే పత్రిక<br>
మదిలో దేవుని నిల్పే పత్రిక అందని,<br>
తెలియని విషయాలెన్నో అందించే<br>
మన సంస్కృతి పత్రిక<br>
ఇది మన తెలుగ్గు పత్రిక<br>
''ఋషిపీఠం''

*– డి. వేణుగోపాల్, చెన్నై.*

వైదిక సాహిత్యం ఆచార వ్యవహారాలు మొదలైన విషయాల గురించిన వ్యాసాలతో నిండిన మీ పత్రిక చాలా బాగుంది. నాకు తెలిసినంతలో ప్రస్తుత పరిస్థితుల్లో కేవలం మన సాంప్రదాయంలోగల ఉన్నతమైన భావాలను మాత్రమే పాఠకులకు తెలియచేస్తే చాలదని అనిపిస్తుంది. మన సాంప్రదాయం ఎన్ని ఒడిదుడుకులకు, కష్టనష్టాలకు గురైందో, వాటిని ఎలా దాటుకుని మనకు నేడు వెలుగుబాట చూపగలుగుతోందో కాస్తంతైనా వివరించడం మంచిదని నా అభిప్రాయం. నేడు అనేక శక్తులు ప్రజాజీవితంలో హైందవ వైదిక విలువలు, విజ్ఞానము బహిరంగంగా, సూటిగా వ్యక్తం చేయడానికి, ప్రచారం కావడానికి వీలులేని పరిస్థితులను కల్పిస్తున్నాయి. అట్టి విఘటన అసురీశక్తులను కూడా పాఠకులకు పరిచయం చెయ్యవలసిన అవసం ఉందని నేను అనుకుంటాను. మూడు వ్యతిరేక శక్తులు ముఖ్యంగా మనదేశంలో హిందూవైదిక సాంప్రదాయానికి అడుగడుగునా అడ్డు తగులుతున్నాయి. వాటి కుటిల ప్రయత్నాలను తెలుసుకోనిదే మన సాంప్రదాయాన్ని కాపాడుకోలేము. కాబట్టి ఆయా విషయాలపై వీలు వెంబడి వ్యాసాలను ప్రచురిస్తారని ఆశిస్తాను.

*– కె. సత్యదేవప్రసాద్, హైదరాబాద్.*

అగ్ని దేవుని ముఖచిత్రంతో వెలువడిన డిసెంబర్ సంచిక అద్భుతం. అగ్ని దేవుని గురించి చాలా విషయాలు తెలుసుకోగలిగాం. భారతదేశానికి అగ్ని ఆరాధనవల్లే ఆ పేరు వచ్చిందన్న విషయం మా ఊహకి అందనిది. ప్రతి యొక్క రచన ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి.

*– ఆనంద్ కుమార్‌స్వామి, ఒంగోలు.*

''ఋషిపీఠం''లో ప్రచురిస్తున్న సంపాదకీయాలు చాలా బాగుంటున్నాయి. నేటి సమాజాన్ని మేల్కొల్పే రీతిలో ఉంటున్నాయి. ఈ స్థాయిలోనే వచ్చే సంచికలు కూడా ఉంటాయని ఆశిస్తున్నాను. గాలి పిల్లలు వంటి రచనలు ఎక్కువగా వేయాలని మా కోరిక.

*– చింతల లక్ష్మీకాంతం, కొండపల్లి.*

''ఋషిపీఠం'' ఎప్పుడు వస్తుందా.... అని ప్రతినెలా ఎదురు చూస్తుంటాం. వచ్చిన వెంటనే మా మనస్సులు మీరు తెల్పే విషయాలతో వికసిస్తున్నాయి. మా యింట్లో ఒకరి చేతినుండి ఒకరు లాక్కొని చదువుకుంటున్న ఏకైక పత్రిక. ప్రతినెల ఎంత ఆకర్షణ. పుస్తకం చదివేసిన తరువాత అయిపోయిందే అన్న ఆవేదన. మీరు పక్షపత్రికగా ఋషిపీఠాన్ని మార్చాలని మా కోరిక. ఋషిపీఠం వెయ్యేళ్ళు వర్ధిల్లాలని కోరుతూ....

*– ఎస్. కామేశ్వరి మరియు కుటుంబ సభ్యులు, భద్రాచలం.*

బాలశిక్ష

# స్థల ప్రభావం

## (కథ)

డాకర్ ప్రసాదరాయ కులపతి

లోకంలో ఎందరో ఇంట్లో నిత్యం శ్రద్ధతో మంత్రానుష్ఠానం చేస్తూ లక్షలు కోట్లు జపం చేసినా దేవతానుగ్రహం కలుగలేదని బాధపడుతుంటారు. దానికి కారణం వాళ్ళు జపం చేసే వాతావరణం.

కలుషిత భావతరంగాలతో నిండిన ఇళ్ళలో తపస్సు త్వరగా సిద్ధించదు. అక్కడకు దేవత లను వచ్చేలా చేసే వాతావరణం నిర్మించటానికి చాలా తపస్సు వ్యయమవుతుంది. అలా కాక దేవతలుండే చోటికే మనం వెళ్ళి తపస్సు చేస్తే సిద్ధి వేగం లభిస్తుంది.

అందువల్ల పవిత్రదేవాలయాలలో, సిద్ధ క్షేత్రాలలో దీక్ష ధరించి తపస్సు చేయాలి. ఆ వాతావరణంలో ఉండే దివ్యభావతరంగాలు మనలను దేవమయం చేస్తవి. అంతేకాక అటువంటి ప్రదేశాలలో అదృశ్య రూపాలతో సిద్ధులు సంచరిస్తూ ఉంటాయి. తీవ్రసాధకులైన వ్యక్తులను చూచి వాళ్ళు దయతో ఆశీర్వదిస్తారు. అందువల్లవేగంగా దేవతల కరుణ లభిస్తుంది.

అశుచియైన ప్రదేశము, కలుషిత భావములతో నిండిన స్థలము మనస్సు మీద అటువంటి ప్రభావాన్నే కలిగిస్తాయి.

ప్రాంతీయమైన ఒక కథ ఉన్నది. సీతా రామలక్ష్మణులు వనవాసం చేస్తూ దండకారణ్యంలో ప్రవేశించారట. సీతారాముల సామాన్లు లక్ష్మణుడు మోస్తున్నాడు. ఒక చోటికి వచ్చేసరికి లక్ష్మణుడు, ''మీ సామాన్లు మీరే మోసుకోండి. మీకేం నేను కూలీనా!,'' అని సామాను రాముడికి ఇచ్చేశాడట.

కొంతదూరం నడిచిన తర్వాత మళ్ళీ పశ్చాత్తాపపడి ''అయ్యో ఇదేమిటి? నేనిట్లా మాట్లాడానేమిటి?'' అని రాముడి కాళ్ళమీద పడి క్షమాపణ వేడాడట!

రాముడు నవ్వి ''అది నీ తప్పు కాదు. ఈ వాతావరణ ప్రభావమది. ఇక్కడ స్వార్థ పూరితులైన రాక్షసులు తపస్సు చేశారు. వాళ్ళ భావతరంగాలతో ఇచటి వాయుమండల మంతా నిండి వుంది. ఎవరిక్కడ ప్రవేశించినా వాళ్ళ మనస్సుల మీద అది ప్రభావం చూపుతుంది. ఆ ప్రదేశం దాటివచ్చాము. సహజమైన నీ మనస్సు మళ్ళీ పని చేయటం మొదలు పెట్టింది. అద్దాన్ని ధూళి కమ్మినట్లుగా నిర్మలమైన నీ మనస్సు మీద ఆ వాతావరణం కొంత ప్రభావాన్ని చూపించింది.'' అని సమాధాన పరిచాడు. ★

## 'విజ్ఞానం పోటీ – 6' ఫలితాలు

గత సంచిక (డిశంబర్ '99)లోని 'విజ్ఞానం పోటీ – 6'కి వచ్చిన సమాధానాలలో, అన్నివిధాలా సరిగ్గా వ్రాసిన 1. ఎం. సాయికృష్ణ(విజయవాడ), 2. వి. భానుమతి, (నెల్లూరు) లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ. 100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు.

*– సంపాదకుడు*

సరియైన సమాధానాలు :

1. కురుక్షేత్రం 2. సంజీవని 3. ముత్తుస్వామి దీక్షితులు 4. కృష్ణవేణి 5. ఇంద్రజిత్తు 6. కాశి (వారణాసి) 7. ఊర్మిళ 8. మిథిల 9. విశ్వనాథ సత్యనారాయణ 10. భద్రాచలం.

## కంఠస్థం చేయదగిన శ్లోకం

***నమస్సవిత్రే జగదేక చక్షుషే***
***జగత్ ప్రసూతి స్థితి నాశ హేతవే।***
***త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే***
***విరించినారాయణశంకరాత్మనే ॥***

*సవిత్రే:* సృష్టికారకుడైన సూర్యునకు, *జగదేక చక్షుషే:* జగత్తునకు నేత్రము వంటి వానికి (దృష్టి అటినవానికి), *జగత్ ప్రసూతి స్థితినాశహేతవే:* ఈ విశ్వ సృష్టి స్థితిలయలకు హేతువైనవానికి, *త్రయీ మయాయ :* ఋక్, యజుస్, సామము లనే మంత్రములతో కూడిన చతుర్వేద మయునకు, *త్రిగుణాత్మ ధారిణే:* సత్త్వ రజస్తమో గుణములను ధరించిన వానికి, *విరించి నారాయణ శంకరాత్మనే :* బ్రహ్మవిష్ణు మహేశ్వర స్వరూపుడైన వానికి *నమః :* నమస్కారము.

ఇది సూర్యుని దర్శిస్తూ చేయవలసిన స్తుతి.

'దృష్టి వేల్పు' – అని సూర్యుని అంటారు. ఆయన అనుగ్రహం చేత దృష్టి లభిస్తుంది. ప్రపంచానికి ఆయన లేకపోతే దృష్టిలేదు. త్రిమూర్తులూ ఆయన స్వరూపమే.

ఋషిపీఠం

# విజ్ఞానం పోటీ - 7

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -5'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసినవారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 15 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు జనవరి 20వ తారీఖులోపు పంపాలి.

1. 'మృచ్ఛకటికం' నాటకాన్ని రచించిన సంస్కృత కవి?
2. నకుల సహదేవులను కన్నతల్లి?
3. దశరథుని ముగ్గురు భార్యల పేర్లు?
4. ఆంధ్రప్రదేశ్‌కి 'త్రిలింగదేశం' అని పేరు రావడానికి కారణమైన 'త్రిలింగాలు' ఏమిటి?
5. శ్రీకృష్ణుని ఆశ్రయించి దారిద్ర్యాన్ని పోగొట్టుకున్న బాల్య స్నేహితుడు?
6. భాగవతాన్ని ఆంధ్రీకరించిన మహాకవి?
7. దుష్యంతుని భార్య పేరు?
8. కోణార్కమందిరం ఏ రాష్ట్రంలో ఉంది?
9. విశ్వామిత్రుడు సృష్టించిన వినూత్న స్వర్గం?
10. మువ్వగోపాలునిపై పదాలు రంచించిన వాగ్గేయకారుడు?

# హితవచనం

ఉదేతి సవితా తామ్రః
తామ్ర ఏవాస్తమేతిచ।
సంపత్తౌ చ విపత్తౌచ
మహతాం ఏక రూపతా॥

సూర్యుడు ఉదయిస్తున్నప్పుడు ఎఱ్ఱగానే ఉంటాడు. అస్తమిస్తున్నప్పుడూ అరుణ వర్ణంతోనే ఉంటాడు. సంపత్తులు కలిగినప్పుడు, విపత్తులు ఎదురైనప్పుడూ మహాత్ములు ఒకేలా ఉంటారు.

అంటే - సంపదలు కలిగినప్పుడు గర్వించి పొంగిపోవడం, ఆపదలు కలిగినప్పుడు విచారంతో క్రుంగిపోవడం తగదు. మహాత్ములు సుఖ దుఃఖాలలో ఒకే స్థితిలో ఉంటారు. చలించరు.

# మహాభారత ప్రశ్నోక్తి - 3

31. రూపం ఉన్నా హృదయం లేనిది ఏది?
32. పాండవులు అరణ్యవాసానికి వెళ్లినప్పుడు కుంతి ఎక్కడుంది?
33. పాండవులలో ఒకడు సంజయుని బాలసఖుడు. ఎవరు?
34. ''ధృతరాష్ట్రుని కౌగిలి'' ఈ మాటకు అర్థం ఏమిటి? ఆ పదబంధం ఎందుకు వచ్చింది?
35. పుణ్య పురుషుడని ఎవరినంటారు?
36. పాండవులు ఏ ఊరిలో ఉండి కౌరవులతో రాయబారాలు సాగించారు?
37. జాంబవతి కొడుకు పేరేమి?
38. భారత యుద్ధం ఎన్ని రోజులు జరిగింది?
39. చాక్షుషీ విద్య అంటే ఏమిటి? ఇది ఎవరు ఎవరి నుండి పొందారు భారతంలో?
40. పరశురాముని తల్లిదండ్రులెవరు?
41. ఉలూకు డెవరు? ఎవరిచేత మరణించాడు?
42. యుద్ధానంతరం పట్టాభిషిక్తుడై ధర్మరాజు ఎంతకాలం రాజ్యం చేశాడు?
43. ఈ మహాభారతాన్ని మొదట ఎవరు ఎవరికి చెప్పారు?
44. సాత్యకి ధనుర్విద్యా గురువెవరు?
45. యుద్ధానికి ముందు రణభూమిలో కృష్ణుడు కర్ణునితో ఏమి మాట్లాడాడు?

(జవాబులు 49వ పేజీలో చూడండి)

ప్రకృతివరాలు

# తృతీయా, త్రిఫలా

డా॥ గాయత్రీదేవి

## తృతీయా :

*ఉసిరి కాయ, కరక్కాయల గురించి గత రెండు సంచికలలో తెలియజేశాను. త్రిఫలాలలో మూడవది – విభీతకీ. దీన్ని తెలుగులో 'తానికాయ' అంటారు. విభీతకీ అంటే రోగాలకి భయాన్ని కలిగించేది అని అర్థం. తాని ''కాయ''లని ప్రధానంగా ఔషధాలలో ఉపయోగిస్తారు. విభీతకీ గింజలూ, చెట్టు బెరడూ కూడా ఔషధ గుణాలని కలిగి ఉన్నాయి. సత్ఫలితాల కోసం నవంబర్ – ఫిబ్రవరి మధ్య కాలంలో చెట్టు నుండి తాజాగా కోసిన కాయలను వాడాలి. ఆ కాయలని పురుగు పట్టకుండా భద్రంగా ఎండబెట్టి జాగ్రత్త చేసుకోవచ్చు. తాని కాయకి కూడా కరక్కాయ లక్షణాలే ఉన్నాయి. ఇది కరక్కాయ కంటె గుణాలపరంగా మృదువయినది. తానికాయ ఏక మూలికా ప్రయోగం అంతగా వాడుకలో లేదు. సాధారణంగా దీనిని త్రిఫలాలలో కలిపి వాడతారు.*

## త్రిఫలా

త్రిఫలాలు మూడింటి గురించీ విడి విడిగా తెలియ జేశాను. మూడింటినీ కలిపి వాడే విధానం, ప్రయోజనాలు చూద్దాం-

త్రిఫలా చూర్ణంలో కరక్కాయ, ఉసిరి కాయ, తానికాయ సమపాళ్ళలో ఉంటాయి. మూడు రకాల కాయలను పొడి చేసి, వస్త్ర గాలనం (పల్చటి బట్టలో జల్లించాలి) చేసి, చేస్తారు. రకరకాల ఫర్మశీల వారు, త్రిఫలా చూర్ణాన్ని తయారుచేసి అమ్ముతూం టారు. అవకాశం, ఓపిక ఉన్నవారు ఈ మూడు రకాల కాయలనీ (నాణ్యమైనవి) సంపాదించు కుని స్వయంగా చేసుకోగలిగితే ఉత్తమ ప్రయోజ నాలు పొందవచ్చు.

✷ త్రిఫలా చూర్ణం రసాయనంగా (General Tonic) ఉదయం 2 గ్రా॥, రాత్రి 2 గ్రా॥ తీసుకోవచ్చు.

✷ దగ్గు వస్తున్నప్పుడు త్రిఫలా చూర్ణంలో తేనె కలిపి రోజుకి మూడుసార్లు వాడాలి.

✷ మల బద్ధకం ఉన్నవారు శరీరప్రకృతిని అనుసరించి సుమారు 2 - 3 గ్రాముల త్రిఫలాచూర్ణాన్ని గోరువెచ్చని నీటిలో కలిపి ప్రతిరోజూ రాత్రివేళ తీసుకోవాలి.

✷ త్రిఫలా కంటికి మంచి టానిక్. ప్రతి రోజూ రాత్రిపూట 1 గ్రా. త్రిఫలా చూర్ణంలో కొద్దిగా నెయ్యి, తేనె కలిపి నియమంగా తీసుకో వడం వల్ల 'చత్వారం' త్వరగా రాదు. రకరకాల దృష్టి లోపాలలో (హ్రస్వ దృష్టి, దీర్ఘదృష్టిమొ॥) త్రిఫలాల వాడకం వలన కంటి అద్దాల పవర్ తగ్గించే అవకాశం ఉంది.

రకరకాల కంటి వ్యాధులలో ఇతర చికి త్సలు చేయించుకుంటున్నప్పటికీ, త్రిఫలా చూర్ణం వాడడం వలన ఆ చికిత్సలకి సహకా రంగా ఉంటుంది.

✷ కండ్ల కలకలో త్రిఫలా కషాయంతో ''నేత్రధార'' (వైద్యులే చెయ్యాలి) చేసినట్ల యితే త్వరగా తగ్గుతుంది.

✷ గాయాలు, పుళ్ళని త్రిఫలా కషాయంతో శుభ్రం చేయడం వలన త్వరగా మానిపోతాయి.

✷ గత సంచికలో 'యాంటీ ఆక్సిడెంట్ల' గురించి ప్రస్తావించాను. త్రిఫలాల్లో కూడా యాంటీ ఆక్సిడెంట్ లక్షణాలున్నాయి. అందు వల్ల నిత్యం త్రిఫలా చూర్ణం వాడడం ఆరోగ్యకరం. త్రిఫలా టాబ్లెట్లుగా దుకాణాల్లో దొరుకుతుంది.

ఈ మధ్య ఒక పరిచయస్తురాలు ఒక అందమైన ప్లాస్టిక్‌డబ్బా (Container) చేత్తో పట్టుకొచ్చి, ''డాక్టర్‌గారూ, మా అబ్బాయి అమెరికా నుండి ఈ డబ్బాలో టాబ్లెట్లు పం పాడు. ఒంటికి చాలా మంచివట. ఇవి మన దేశంలో దొరుకుతాయేమో చెబుతారా'' అని అడిగింది. డబ్బా తీసుకుని పేరు చూశాను. అవి ''త్రిఫలా టాబ్లెట్లు''. ఇక్కడ దొరుకు తాయా అని అడిగితే ఏం చెప్పను? అది మన దేశీయ ఔషధం. ఆ మందు అమెరికాలో తయారుచేయడానికి అవసరమయిన వైద్య విజ్ఞానంతోపాటు, అక్కడా మందు తయారు కావడానికి అవసరమయిన మూలికలు అవే రూపంలోనో, చూర్ణం రూపంలోనో ఇక్కడి నుండే అక్కడికి వెళ్ళి కూడా ఉండొచ్చు.

మా నాన్నగారు (శ్రీ ఉషశ్రీగారు) రామా యణ, భారతాల గురించి ఉపన్యసిస్తూ, ''చైనా లోనూ, రష్యాలోనూ రామాయణం ప్రదర్శిస్తు న్నారు, పిల్లలచేత గీత చదివిస్తున్నారు, రేప్పొద్దున్న మీ మనవడు విదేశాలకి వెళ్ళొచ్చి, తాతా చైనాలో 'గీత' ఉంది, రష్యాలో రామా యణం ఉంది, అదేమిటో నీకు తెలుసా అని ప్రశ్నిస్తే, మీ తల ఎక్కడ పెట్టుకోవాలి'' అని ప్రశ్నిస్తూ ఉండేవారు. ఆయుర్వేదం విష యంలో కూడా అదే పరిస్థితి.

పాశ్చాత్య దేశాలలో ఈ వైద్యానికి గుర్తింపు వచ్చిన తరువాతే మనవారు మేలుకుంటు న్నారు. మన స్వామి వివేకానందుని, మన రామానుజాన్ని కూడా పాశ్చాత్యులు గుర్తించిన తరువాతే మనవారు గుర్తించారనే అపప్రథ ఉంది. ఆ పరిస్థితి పోయి మన సంస్కృతి, మన విజ్ఞానాలలో ఉన్న ఔన్నత్యాన్ని, మన వారిలోని ప్రత్యేకతను, మనం గుర్తించి, ప్రపంచానికి చూపించే రోజు ఈ నూతన సహస్రాబ్దిలో నైనా వస్తుందని ఆశిద్దాం.

## దారిద్ర్యమోచనస్తోత్రమ్

# లక్ష్మీ అష్టోత్తరశతనామాలు

విద్యావారిధి, అద్వైత సిద్ధిరత్నాకర
డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి

(గత సంచిక తరువాయి)

**8. పరమాత్మికాయై నమః :**

అన్నిటికీ అతీతమై, చరమమై, సర్వ వ్యాపిని అయిన తల్లి - పరమాత్మిక.

**2. వాచం పద్మాలయాం పద్మాం**
**శుచిం స్వాహాం స్వధాం సుధామ్ ।**
**ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం**
**నిత్యపుష్టాం విభావరీమ్ ॥**



**9. వాచేనమః**

✦ సరస్వతీ స్వరూపురాలైన జగదంబకు నమస్సులు.

✦ వాగ్రూపంలో ఉన్న శబ్దబ్రహ్మ స్వరూపమే జగదంబలక్ష్మి.

✦ కంఠం, తాలు, మూర్ధ, దంత, ఓష్ఠ (పెదవులు) మొదలైన స్థానాలలో నుండి బహిర్గతమయ్యే శబ్ద స్వరూపం 'వాక్కు'.

'నాభిహృత్కంఠ రసన నాసాదుల యందు శోభిల్లుసప్తస్వర సుందరులు...' అని శబ్దబ్రహ్మ(వాక్కు) యొక్క స్వరాకృతిని త్యాగరాజులు వర్ణించారు. సంగీత, సాహిత్యాదులుగానే కాక, జీవుల అంతరంగాన్ని అభివ్యక్తం చేసే శబ్దంకూడా అమ్మవారి రూపమే. ఈ వాగ్దేవి దయ ఉంటేనే పలుకగలిగేది. సర్వశక్తి మూర్తులూ ఒకే శక్తి యొక్క రూపాలని తెలియజేసే ఇటువంటి నామాలు ఈ అష్టోత్తర శతనామాలలో కనిపిస్తాయి.

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ... అనే నాలుగు విధాలుగా వాక్కు మననుండి పలుకుతుంది. మొదటి మూడు 'అంతరప్రయత్న రూపం'. నాలుగువది 'వైఖరి' - బాహిరంగా వినబడే మాట. మాటాడాలనే సంకల్పం 'పశ్యంతి', దానికి కారణమైన ప్రేరణ 'పరా'. అది పలుకులుగా ఒక క్రమాన్ని మనస్సులో ఏర్పరచుకోవడం 'మధ్యమ'.

**'గుహా త్రీణి నిహితా నేంగయంతి**
**తురీయం వాచో మనుష్యా వదన్తి'।**

(ఋగ్వేదీయ సరస్వతీ సూక్తం)

భావ ప్రకటనకు వృక్షాలు 'పరా' వాక్కును, పక్షులు 'పశ్యన్తీ' వాక్కును, పశువులు 'మధ్యమా' వాక్కును, మనుష్యులు 'వైఖరీ' వాక్కును ఉపయోగిస్తారని శాస్త్ర వచనం.

**'పరా' వృక్షేషు యా వాక్ సా**
**'పశ్యన్తీ' పక్షిషు స్మృతా ।**
**'మధ్యమా' పశుషు ప్రోక్తా**
**మనుష్యేషు చ 'వైఖరీ' ॥**

ఈ నాలుగు వాక్కుల వివరణ ఇంకా అనేక విధాలుగా శాస్త్రాలలో వివరించబడింది.

జగన్నియమానికి వాక్కు ప్రధానం.

✦ 'వాక్కు' అనగా తొలి విజ్ఞానమైన వేదమే. ఆ వేదమాత ఆదిశక్తి లక్ష్మి.

**10. పద్మాలయాయై నమః**



✦ పద్మమును నివాసముగా చేసుకున్న దేవి - పద్మాలయ.

✦ వికసించే హృదయానికి ప్రతీక పద్మం. పద్మం సూర్యకాంతి వల్ల వికసిస్తుంది. పరిపూర్ణ జ్ఞానకాంతి చేత హృదయపద్మం వికసిస్తుంది. వికసించిన హృదయకమలంలో గోచరించే పరాశక్తి - లక్ష్మి - పద్మాలయ.

**11. పద్మాయై నమః**

పద్మస్వరూపిణి అయిన లక్ష్మి - పద్మా. పరిపూర్ణంగా వికసించే స్వభావం, ఆనందమకరంద స్వరూపం ఉన్నకారణంగా అమ్మవారు - పద్మా. కమలం (పద్మం) విశేష మేమిటంటే సౌకుమార్య, మకరందాలతో పాటూ 'బీజాలు' కూడా పుష్పంలోనే ఉం టాయి. జగత్కారణమైన కర్మ, గుణ బీజాలను కలిగిన ప్రకృతిగనుక 'పద్మా'. సద్యఃఫలకారిణి - వెంటనే ఫలితాన్ని ఇచ్చే గుణంకలది.

పద్మం జలంలోనే పుడుతుంది. జలం లోనే పెరుగుతుంది. కానీ పద్మంపై జలం అం టదు. అదే విధంగా జగత్తులో సర్వత్రా ఉండి భాసించినప్పటికీ, జగద్వికారాలేవీ అంట కుండా భాసిస్తుంది లక్ష్మి.

**12. శుచ్యై నమః**

'శుచి' అంటే 'పరిశుద్ధి'. ఏవిధమైన వికా రాలూలేని దేవి. నిజానికి ఈ శరీరం 'అశుచి'. విడిగా చూస్తే అసహ్యించుకునే మాంస, అస్థి, రక్తాదులతో దేహ పంజరం - లోపల ఏచైతన్యం ఉండడం ద్వారా ఆదరణ యోగ్యంగా కనబడు తోందో... ఆ చైతన్యం - నిత్యశుచి. స్వాభా వికంగా శుద్ధమైనది. ఆ చైతన్యమే లక్ష్మీతత్వం. ఆ 'శుచి' వల్లనే దేహం 'శుచి'గా భావింప బడుతుంది.

ప్రపంచగత దోషమేదీ అంటకుండా ప్రపంచాన్ని కాపాడుతూ పరిపాలిస్తున్న పరమశుద్ధ స్వరూపిణి.

**13. స్వాహాయై నమః**

వహ్ని స్వరూపుడైన యజ్ఞపురుషుని ఒక భార్య స్వాహా. దేవతాహ్వాన వాచకంగా పలికే వాక్కు 'స్వాహా'.

**14. స్వధాయై నమః**

యజ్ఞపురుషుని మరోశక్తి 'స్వధా'. పితృ దేవతలను ఉద్దేశించి యజ్ఞంచేసేటప్పుడు పలికే ఆహ్వానశబ్దం - 'స్వధా'. అగ్నివాయు సూర్యాత్మకంగా జగత్తును ధరించే శక్తి స్వధా.

**15. సుధాయై నమః**

నిత్య, శాశ్వత ఆనంద చైతన్యమే - జగదంబలక్ష్మీ. అమృత స్వరూపురాలు కనుక 'సుధ'.

**16. ధన్యాయై నమః**

✦ ధనమునిచ్చునది 'ధన్య'.

✦ ప్రతి సంకల్పాన్నీ, క్రియనీ కృత కృత్యం చేసే శక్తి - ధన్య. లక్ష్మి సంకల్పం, కృత్యం నిత్యం ఫలవంతమై తీరుతాయి.

**17. హిరణ్మయ్యై నమః**

సూర్యరూపుడైన నారాయణుని కాంతిశక్తి 'హిరణ్మయి'. హితం, రమ్యం - హిరమ్యం. ఇదే 'హిరణ్యం'. హితాన్నీ, రమ్యాన్నీ కలిగించే దేవి - హిరణ్మయి.

**18. లక్ష్మ్యైనమః**

✦ ఈ జగత్తులో లక్షణ శక్తిగా ఉండే దేవి - లక్ష్మి.

దేని ద్వారా ఈ విశ్వం గుర్తింపబడు తుందో, పోషింపబడుతుందో ఆ శక్తి - లక్ష్మి.

'లక్ష్యాలక్ష్యరూపిణీ లక్ష్మీ'... ఈ జగత్తు రూపంలో (కార్య రూపంలో) గోచరంగానూ, కారణరూపంలో అగోచరం(అలక్ష్యం)గానూ ఉండే శక్తి - లక్ష్మి.

**19. నిత్యపుష్టాయై నమః**

స్వాభావికమై, శాశ్వతమైన పుష్టికలిగినదీ - ప్రపంచానికి పుష్టినిచ్చేది 'నిత్యపుష్టా'.

**20. విభావర్యై నమః**

'విభావరి' అంటే కాంతులకు నిలయ మైన 'రాత్రి'. 'రాత్రిసూక్తం' అనివేదంలో చెప్ప బడింది. రాత్రిగా, కాళరాత్రిగా విశ్వానికి విశ్రాంతినిచ్చే ఉపశమనదాయినిగా ఆదిశక్తిని 'విభావరి' అన్నారు.

(సశేషం)

# రచయితలకు ఆహ్వానం

'ఋషిపీఠం' భారతీయమైన ఆర్ష విద్యలలోని శాశ్వత విలువలని విశ్లేషించి, వ్యాఖ్యానించి, నేటి కాలం వారికి అనువైన రీతిలో అందించే రచనలను ఆహ్వానిస్తోంది.

- ✱ రచన సాధికారికంగా ఉండేలా జాగ్రత్త వహించవలసి ఉంటుంది.
- ✱ క్లుప్తత, సూటిగా చెప్పడం, సరళంగా, సుబోధకంగా ఉండేలా భాషని అందివ్వడం ముఖ్యం.
- ✱ ప్రచురణకి అనుగుణంగా ఎడిట్ చేసే బాధ్యత సంపాదక వర్గానికి ఉంటుంది.
- ✱ రచనలు వేటికీ అనువాదాలు, కాపీలు కావని హామీ పత్రం జతచేయాలి.
- ✱ పత్రిక నియమనుసారం వీలు వెంబడి రచనలు ప్రచురిత మవుతాయి. ప్రచురణకు అంగీ కరించిన వెంటనే ఆ విషయం తెలియజేయబడుతుంది.
- ✱ వీలైనంతవరకు ఉటంకించే అంశాల మూలగ్రంథాలను కూడా పేర్కొనాలి.
- ✱ రచనల పరిశీలనకు కనీసం రెండు నెలల వ్యవధి అవసరం.
- ✱ ప్రచురితమయ్యే ప్రతి రచనకు 'ఋషిపీఠం' నియమానుసారం పారితోషికం ఉంటుంది.

ఋషిపీఠం



# నవరత్న ప్రభావం

శ్రీమతి వి.బి.వి.ఎల్. రాజేశ్వరి

## పచ్చ

దీనికి అధిపతి బుధుడు. మరకతము, తృణగ్రాహి, హరిన్మణి, గారుడము, అనేపేర్లు కలవు. ఈ పచ్చ 1) నెమలి కంఠము రంగు వంటి రంగులోనూ, 2) ఆకుపచ్చగఉండే గాజులగాను, 3) గరికగడ్డి వంటి ఆకుపచ్చగా, ఉండి మెరుస్తూండేది, 4) పాల చెట్టు కొమ్మ వంటి ఆకుపచ్చగాను, 5) చిలుకరెక్కలవంటి ఆకుపచ్చగాను, 6) దిరిసెన పువులాగాను, 7) ఆకు పచ్చగాను, 8) నాచుగడ్డి రంగులోనూ, మనకు లభిస్తుంది.

పచ్చను ఎండలో సూర్యునకు ఎదురుగా బెట్టిన పచ్చని కాంతి నాలుగుపైపులా ప్రస రిస్తుంది. బంగారము, తెల్లని రత్నము, తెల్లని వస్త్రముపైన పచ్చను పెట్టినపుడు వాటిని కూడా పచ్చగా కనిపించేటట్లు చేస్తుంది. అట్లా చేసిన పచ్చ ప్రశస్తమైన పచ్చగా గ్రహించాలి. ముదురాకుపచ్చగా ఉన్నది 'గరుడపచ్చ'. ఇది బరువుగా నునుపుగా ఉండి మెరుస్తుంది. ఇది చాల ప్రశస్తమైన పచ్చ.

## పచ్చలలో దోషములు

పచ్చపై సున్నమును పల్చగా పట్టిస్తే పచ్చని కాంతిపైకి కనబడుతుంది అది జాతి రత్నము. పచ్చపైన నల్లని జీడి పూస్తే కాంతితగ్గితే అది మంచి రత్నముకాదు.

పచ్చలలో ''పుప్పి, గార, కర్కశము'' అనే మూడు రకాల దోషాలుకలవు. అట్టి దోషాలు కల పచ్చలు ధరించరాదు.

పుప్పిదోషము:- పచ్చపై సూదితో గ్రుచ్చినట్లు ఉండి, పుచ్చిపోయినట్లు ఉన్ననూ, అది 'పుప్పి' అనే దోషం కల పచ్చ.

గారదోషము:- పచ్చమీద గుండ్రంగా చారలు ఉంటే అది 'గార' అను దోషం కల పచ్చ.

కర్కశదోషము:- కాంతిహీనంగా, పైన రంగు పూసినట్లుగా ఉండే పచ్చ 'కర్కశ' మనే దోషంకలది.

ఈ దోషాలు కల పచ్చలు ధరిస్తే ధన నష్టం, పశునష్టం, అశాంతి, అసౌఖ్యం, మొద లైన అనేక కష్టనష్టాలు కలుగుతాయి.

పచ్చలలో కొన్ని 'గరుడ పచ్చ'లని ఉన్నాయి. ఇవి గరుత్మంతుని వలన పుట్టినవని ప్రచారము. అందుచేత ఇవి విషమును హరించు శక్తి కలిగి ఉంటాయి. జాతి పచ్చకు జీడిపూసి కడిగితే నిర్మలంగా కనబడుతుంది. పచ్చలను అగ్నిలోకాల్చి, రాతిమీద అరగతీసి పరీక్ష చేయకూడదు. రత్నము నునుపుపోయి, కాంతిపోయి, పాడయిపోతుంది. కృత్రిమ రత్నా లకు జీడి పూస్తే కాంతి తగ్గుతుంది. అయినా కృత్రిమ రత్నాలు నిలువుగా చూస్తే కాంతిగా కనబడి, అడ్డంగా చూస్తే కాంతి హీనంగా కన బడతాయి. అందుకని మంచి రత్న పరీక్షాధికారి చేత పచ్చను పరీక్ష చేయించి తీసుకోవాలి.

## పచ్చను ధరించుట వలన ప్రయోజనములు

పచ్చకు బుధుడు. బుద్ధి కారకుడు బుధుడు. అందుచేత జ్ఞాపకశక్తి కొఱకు పచ్చను ధరించవచ్చు. మేధాశక్తి, బుద్ధిచాతుర్యము కూడ పెరుగుతుంది. నరములకు బలము చేకూరుతుంది. సకల విషదోషహరము. ఉన్మాదము, పిచ్చి, దృష్టి దోషములను కూడ పోగొడుతుందని ఆయు ర్వేదము చెపుతోంది. ప్రశస్తమైన పచ్చ-నెమలి కంఠంగులోగాని, చిలుకరెక్కలరంగులోగాని, గరిక గడ్డి రంగులోగాని-ఉన్న వాటిని భస్మము చేసి, తగు అనుపానములతో వైద్యుని సలహా మేరకు సేవిస్తే నరముల బలహీనతలు పోగొడు తుంది. స్త్రీల యొక్క వ్యాధులు కూడా నయం చేస్తుంది. ఇంకా పచ్చధరిస్తే స్ఫోటకము, మసూచి వలన వచ్చే జ్వరాలు తగ్గుతాయి. పచ్చకామెర్లను కూడా తగ్గిస్తుంది. రక్తపోటు, వ్రణాలు, తలనొప్పి, రాత్రులందు వచ్చే కడుపునొప్పి, నిద్ర లేకపోవుట, దుష్టస్వప్నాలు రావటం, ఇలాంటి వన్నీ కూడా పచ్చధరించడం వలన మేలు జరుగుతుంది. వైద్యశాస్త్రంలో కూడ పచ్చను గురించి విశేషించి చెప్పారు. అనేక రకాల వ్యాధులకు ఇది సంజీవిని వంటిది.

మిధున, కన్యాలగ్నాల వారు, జ్యేష్ఠ, ఆశ్లేష, రేవతినక్షత్రములలో జన్మించిన వారు, బుధుడు జన్మజాతకంలో నీచ, అస్తంగత, శతృక్షేత్రములో ఉన్నవారు. సప్తమ, రాజ్యాధి పతి బుధుడు అయిన జాతకులు, పచ్చను తప్పక ధరించాలి.

బుధుడు బుద్ధికారకుడు, గణిత శాస్త్ర

మునకు, వ్యాపారానికి బుధుడు కారకుడు. జన్మ జాతకచక్రంలో బుధుడు షష్టాష్టమ వ్యయాలలో ఉన్నవారు కూడ పచ్చను ధరిస్తే, ధనాదాయం బాగుంటుంది. బుధ మహర్దశ నడుస్తున్నవారు కూడ పచ్చను ధరించాలి.

గణితశాస్త్రమును చదివే విద్యార్థులు, (అంటే కామర్స్ కూడ). ఈ పచ్చను ధరిస్తే చాలా ఉపయోగం ఉంటుంది. విద్యార్థులు ప్రతిరోజు పచ్చరాయి ఉంగరాన్ని శుభ్రమైన నీటిలో (చిన్నకప్పుడు) 17 నిమిషాలు ఉంచి, భక్తిగా బుధునికి నమస్కరించి ఆ నీటిని త్రాగి చూడండి. ఎంత ఉపయోగంగా ఉంటుందో!

పచ్చలు చాలా విలువైనవి. పవిత్రమైనవి. వైద్యశాస్త్రంలోనూ, విద్యార్థులు, వ్యాపారులూ మొదలైనవారికే కాకుండా మంత్ర శాస్త్రంలో కూడా ఈ పచ్చ శ్రేష్టమైన స్థానంలో ఉంది. దీనిని ధరిస్తే భక్తి యోగమునందు అభిరుచి కలుగుతుంది. శివాలయాలలో కొన్ని శివలింగాలుగా పచ్చలతోనే చెక్కుతారు. వాటిని 'మరకత లింగము' అంటారు. వేదాంత జ్ఞానము పచ్చను ధరించినా, పూజించినా పెరుగుతుందని తాత్త్వికులు భావిస్తారు. ఈ పచ్చలను "శ్రీ చక్రము"గా చెక్కి దేవతామందిరంలో ప్రతిష్టించుకుంటారు. పచ్చ మోక్షప్రదాయని అని పండితులు చెపుతారు. అందుకే రావణాసురుడు పెద్ద పచ్చపై కూర్చుండి స్నానం చేసేవాడని ప్రతీతి. ఎందుకంటే పచ్చకు అధిదేవతా ప్రత్యధి దేవతలు విష్ణువే. పరోక్షంగా విష్ణుచిత్తుడై, మోక్షకామియైన రావణాసురుడు అలాస్నానం చేసేవాడని పెద్దలు చెపుతుంటారు.

## పుష్యరాగము

పుష్యరాగానికి అధిపతి గురువు. ధనుర్మీనలగ్నాధిపతి గురువు. ఈయన జ్ఞానప్రదాత. ప్రకృతిలో ఎన్ని రంగులు ఉన్నాయో అన్ని రంగులు ఈ పుష్యరాగరత్నంలో ఉన్నాయి.

పుష్యరాగరత్నము ఆకాశములో ఉండే 'పుష్యమి' నక్షత్రము వలె మెరుస్తూ ఉంటుంది. అందుకే దీనికి 'పుష్యరాగము' అనే పేరు వచ్చింది. ఇది చాలా శ్రేష్ఠమైన రత్నము. దీనిని ధరించుట వలన గొప్పయోగము పట్టును. దీనికి గురురత్నము, శ్వేతమణి పుష్యమి అనే ఇతర పేర్లు ఉన్నాయి.

పుష్యరాగంలో రకాలు : పుష్యరాగం అనేక రంగులలో దొరుకుతుంది. కాని బంగారు ఛాయతో మెరిసేది కనకపుష్యరాగాలు, లేత గులాబీ రంగు పుష్యరాగాలు అత్యంత విశేషమైనవి. కానీ ఈ గులాబీరంగు పుష్యరాగాలు ఇపుడు దొరకటం చాలా కష్టం. పుష్యరాగం నిర్మలంగా, నున్నగా, కొంచెం బరువుగా ఉండి మిట్ట పల్లాలు లేకుండా గోగుపువ్వురంగులో ఉన్నది, శ్రేష్ఠమైనదిగా చెప్పబడింది.

తేనే వంటిరంగు, జనప పువ్వురంగుకల పుష్యరాగాలు కూడ చాలా శ్రేష్ఠమైనవి.

**పుష్యరాగంలోని దోషాలు**

గోరోచనము రంగు, నలుపురంగు, తెలుపు కలిసి, గరగరగా, మలినంగా, కర్కశంగా ఉన్న పుష్యరాగాలు మంచివి కావు. సానపట్టినచో గరగరలు పోయి నిర్మలంగా నున్నగా, ప్రకాశవంతంగా ఉంటే ఆపుష్యరాగాన్ని ఉపయోగించుకోవచ్చు. నల్లని మచ్చలు, చుక్కలు ఉన్నవి, అత్యంత తెల్లగా ఉండేవి పనికిరావు. సానబట్టినా కూడా మాసిపోయినట్లున్నది మంచిదికాదు. సాధారణంగా పుష్యరాగాలు రెండు మూడు రంగులు కలిసి ఉంటాయి. అవి దోషయుక్తమైనవని చెప్పబడినది.

సాధారణంగా పుష్యరాగం రెండుమూడు పొరలతో పుడుతుంది. కొన్ని పుష్యరాగాలు క్రిందిపొర ఎర్రగాను, పైపొర తెల్లగాను, లేకపోతే క్రిందిపొర తెల్లగాను, పై పొర నీలంగాను, ఇలా రెండు మూడు రంగులతో ఉంటాయి. అందుకని పొరలు పొరలుగా వివిధ రంగులు కలిగిన పుష్యరాగాలు మంచివి, ధరించటానికి శ్రేష్ఠమైనవి. కాని రెండుమూడు రంగుల సమ్మిశ్రమైనది ధరించరాదు. పగిలిన పుష్యరాగము, చారలు కలిగినది బీటలు వారినది మంచివికావు. అంటే శ్రేష్ఠమైన కనకపుష్యరాగము దొరికినను అది 'పగిలితే మంచిది కాదు' అని అర్థము. ఏ రత్నమైనను అంతే.

పుష్యరాగము రాతిపై అరగతీసి చూస్తే పూర్వం కంటే ప్రకాశవంతంగా, నిర్మలంగా ఉంటే అది శ్రేష్ఠమైనదని అర్థము. బంగారు రంగులో మెరిసే కనకపుష్యరాగాన్ని దాని రంగు ఆధారంగా నాలుగు (4) రకాల జాతు లుగా "రత్నశాస్త్రంలో" విభజించబడింది. అవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర రకాలు.

బ్రాహ్మణజాతి:– స్వచ్ఛమైన తెలుపు రంగులో ఉండేది. బంగారం వంటి లేత పసుపు పచ్చని రంగులో ఉండేది కూడా బ్రాహ్మణ జాతిదే.

క్షత్రియ జాతి : ఎరుపురంగులో ఉండేది క్షత్రియజాతిది.

వైశ్యజాతి : ఎరుపు, పసుపచ్చరంగు కలిసినది వైశ్యజాతి అని, కేవలం పసుపు పచ్చరంగు వైశ్యజాతని వేరువేరు అభిప్రాయాలు కలవు.

**ఎప్పుడూ అలవాటుగా నిజం చెప్పేవాళ్ళకి, తాము ఏది అంటే అది శక్తి వస్తుందని హిందూ పవిత్ర గ్రంథాలు ఘోషిస్తున్నాయి. వాళ్ళ హృదయంలోంచి వెలువడ్డ మాట జరిగి తీరుతుంది. సత్యమనే ఆదర్శం హిందూ సమాజాన్ని యుగయుగాలుగా అను ప్రాణితం కావిస్తూ వస్తోంది.**

శూద్ర జాతి:- నలుపు, నీలం రంగులలో ఉన్నవి శూద్ర రకాలు.

వాసిపోయినది, కాంతిహీనమైనది, బరువులేనిది అయిన పుష్యరాగాన్ని ధరిస్తే ఉన్న ఐశ్వర్యం కూడా పోయి దారిద్ర్యం కలుగుతుంది. అందుకని రత్నాన్ని ఎన్నుకునేటపుడు జాగ్రత్త!

గురువు పుష్యరాగరాత్నానికి అధిపతి. ఈయన ధనుర్మీన లగ్నాలకు, పునర్వసు, విశాఖ, పుర్వాభాద్రా నక్షత్రాలకు అధిపతి. జన్మజాతకంలో గాని, గోచారంలోగాని, గురువు షష్టాష్టమ వ్యయాల్లోను, నీచ శత్రు క్షేత్రాలలోను, అస్తంగత్వం కలిగినను ఈ పుష్యరాగాన్ని ధరించాలి. గురుమహర్దశ నడుస్తున్నవారికి కూడా ఇది మంచిదే.

**పుష్యరాగం ధరించటం వలన ప్రయోజనాలు:-**

జ్యోతిశ్శాస్త్రములో గురుని సంపూర్ణ శుభుడుగా గుర్తించడమైనది. ఏపని చేసినా, ఏజాతకానికైనా గురువీక్షణ ఉందా అని చూస్తారు. అందుచేత అందరికి, అన్ని మానవ కార్యక్రమాలకు కూడా సంపూర్ణ శుభుడైన గురుని అనుగ్రహం చాలా అవసరం.

గురుగ్రహము పుత్రకారకుడు. అందుచేత శ్రేష్ఠమైన పుష్యరాగం ధరిస్తే పుత్రసంతానం కలిగే అవకాశం కలదు. దీనిధారణ వలన ఋణవిముక్తి జరిగి ధనలాభం కలుగుతుంది. శత్రువులు మిత్రులుగా మారతారు, కోపోద్రేకము అహంకారము తగ్గి మనసు ప్రశాంతత చెందుతుంది. దానివలన రక్తపోటు (B.P) కూడా తగ్గే అవకాశం ఉంది.

గురువు జ్ఞానప్రదాత, విద్యాదాత. అందుచేత విద్యార్థులు వారి విద్యకోసం, పెద్దలు మోక్ష జ్ఞానాదుల కోసం ఈ రత్నాన్ని ధరించ వచ్చు. దైవభక్తి పెరిగి సన్మార్గములో నడిచే వీలు కలదు. మేధాశక్తి పెరుగుతుంది. అంతే కాకుండా వైద్య శాస్త్రం కూడా ఈ రత్నధారణ చాలా ఉత్తమమని చెపుతోంది. జీర్ణశక్తిని పెంచును. నరముల బలహీనతను తగ్గించి, చేతులు కాళ్ళు వణకటం తగ్గిస్తుంది. ఈ రత్నం అదృష్టం కలుగచేసి ధనయోగం పట్టించుటేకాక రోగనివారణలో కూడా అద్భుతంగా పని చేస్తుంది.

## గోమేధికము

ఇది రాహుగ్రహానికి చెప్పబడినది. ఇది గోమూత్రం వర్ణంలో ఉంటుంది. అందుచేత దీనిని 'గోమేధికం' అన్నారు. గోమేధికాలు అనేకరంగుల్లో ఉన్నప్పటికీ రంగులేనివి కూడా విశేషమైనవే. తెలుపురంగులో ఉన్న గోమేధికాలు ఇంచుమించు వజ్రం లాగ ఉంటాయి.

ఈగోమేధికాలు హిమాలయ పర్వతాలలోను, తపతీ సింధునదీ తీరాలలోను విరివిగా దొరుకుతాయి. హిమాలయాల్లో దొరికేవి. చంద్రకాంతిలాగా తెల్లగా ఉంటాయి, వింధ్య పర్వతాల్లో, తపతీ తీరంలో దొరికేవి అశోక వృక్షపు ఆకుల వలె ఉంటాయి. శ్రేష్ఠమైన గోమేధికం ఒకవైపునుండి చూస్తే రెండవైపు కూడ కనపడుతుంది. అంటే పారదర్శకమైన రత్నమన్నమాట. అసలు గోమేధికము, వైఢూర్యము, పుష్యరాగము, పచ్చ ఈ నాలుగు రత్నాలూ స్ఫటికజాతికి చెందినవే.

రత్నశాస్త్రంలో గోమేధికాన్ని నాలుగు (4) జాతులుగా విభజించారు.

బ్రాహ్మణజాతి – తెల్లని కాంతితో కన్పించేవి.

క్షత్రియజాతి – ఎరుపురంగు మిశ్రమంతో కన్పించేవి.

వైశ్యజాతి – ఆకుపచ్చ, పసుపుపచ్చ వర్ణాలతో కనిపించేవి.

శూద్రజాతి – నలుపు, నీలం రంగులలో ఉండేవి.

## గోమేధికాలలో దోషాలు

మచ్చలు, చారలు, కంతిహీనమైన రత్నాలు ధరించకూడదని రత్నశాస్త్రంలో చెప్పబడిఉంది. గోమేధికంలో 5 రకాల దోషాలు ప్రత్యేకంగా చెప్పారు.

మలదోషం : మలినంగా కాంతి హీనంగా ఉండటం.

బిందుదోషం : లోపల బిందువులుగా మచ్చలుగా ఉండటం.

రేఖాదోషం : చారలు, గీతలు ఉన్నవి.

త్రాశదోషం : బీటలుగా, ముక్కలుగా విరిగిపోయినవి.

కాకపదము : రత్నంమీద కాకిపాదము వంటి గుర్తులుకలవి

ఈ దోషాలు కల గోమేధికాలు ధరించటానికి యోగ్యమైనవి కావు.

గోమేధికాలు ప్రశస్తమైన రెండు రకాల్లో ఉంటాయి. అవి సూర్యకాంతగోమేధికం, చంద్రకాంత గోమేధికం.

సూర్యకాంతగోమేధికం: ఈ గోమేధికాన్ని సూర్యకాంతికి ఎదురుగా పెట్టినపుడు అగ్నిజ్వాలవలె కనిపిస్తుంది.

చంద్రకాంతగోమేధికం : చంద్రకాంత పరీక్షించినపుడు మంచువలె చల్లగా ఉంటుంది. ఈ రెండురకాల గోమేధికాలు చాలా ప్రశస్తమైనవి. ఇవి కలియుగంలో లభించటం కూడా చాలా దుర్లభం.

గోమేధికం రాహుగ్రహరత్నం. రాహువు జన్మజాతకంలోగాని, గోచారంలోగాని అనుకూలుడుగా లేనపుడు ఈ రత్నాన్ని ధరించాలి. రాహువు భాగ్యంలో ఉన్నపుడు తప్పక ఈ రత్నాన్ని ధరించాలి. ఎందుకంటే రాహువుకు భాగ్యం (తొమ్మిదవస్థానం) చాలా అరిష్టం. జన్మజాతకంలోగాని, గోచారంలో గాని భాగ్యంలో రాహువున్న వారు ఈ రత్నాన్ని ధరించాలి. రాహుదశనడుస్తున్నవారు కూడ. లగ్నంలో రాహువున్న వారు ఈ రాత్నాన్ని ధరిస్తే విశేష ధనలాభం, అనుకున్న పనులు శీఘ్రంగా నెరవేరటం జరుగుతాయి.

**గోమేధికం ధరించుటవలన ప్రయోజనములు**

గోమేధికం ధరించటం వలన సర్వ జన వశీకరణం కలుగుతుంది. నష్టధనలాభం కలుగుతుంది. స్త్రీమూలక సహాయము కూడా కలుగుతుంది. శత్రువులు మిత్రులుగా మారతారు.

రాహువు ఆరుద్ర, స్వాతి, శతభిషా నక్షత్రాలకు అధిపతి. రాహుమహాదశలో భూతప్రేత పిశాచాది బాధలు అనుభవించేవారు ఈ రత్నాన్ని ధరిస్తే కొంచెం ఉపశమనం తప్పక కలుగుతుంది. యుద్ధమందు విజయం కలగటానికి, రాజకీయాల్లో ఉన్నవారికి గోమేధికం చాలా ఉపయోగమైనది.

గోమేధికాన్ని రత్నశాస్త్రంలో అదృష్ట రత్నంగా వర్ణించారు. రాహు దశలో సాధారణంగా కలహాలు, ఆస్థి నష్టాలు, విద్యాభంగములు, వ్యాపారచిక్కులు, రోగ భయాలు, ఋణబాధలు, ఉద్యోగంలో ప్రతికూలాలు, ఆర్థిక బాధలు మొదలైన చిక్కులు కలుగుతుంటాయి. ఈ విధమైన కష్టాలన్నీ సమసిపోవటానికి ఈ రత్నధారణ చాలా ఉపయోగిస్తుంది. విదేశ యానం చేయదలచినవారు, విదేశాలతో వ్యాపారం సంబంధాలు ఉన్న వారికి ఇది ఉత్తమమైన రత్నం. విదేశధనార్జనకు ప్రధానగ్రహం రాహువే. తీర్థయాత్రలు చేస్తున్నవారికి కూడా ఈ రత్నధారణ మంచిది.

అదృష్టరత్నంగా చెప్పబడిన ఈ గోమేధికాన్ని జాతక చక్రంతో పనిలేకుండా కొందరు ధరిస్తున్నారు. అనుభవంలో చూస్తే ఈ రత్నం ధరించినవారు జీవితంలో ఎల్లప్పుడూ సుఖప్రదంగా దినదినాభివృద్ధిగా ఉండటం చూస్తూనే ఉన్నాము.

*(ఎవరికైనా జాతకచక్రంలో సందేహాలు ఉంటే మా ఋషిపీఠం ద్వారా సంప్రదించి వారివారి సందేహాలను నివృత్తి చేసుకోవచ్చు.)*

# మహాభారత ప్రశ్నోక్తి - 3 కి జవాబులు

31. తాయి : హృదయరహితంబు జా రూపము. అర - 7-437
32. విదురుని యింట్లో
33. అర్జునుడు : బాలసఖుండవు నాకును అని అర్జునుడు సంజయునితో అంటాడు. సంజయ రాయభారం చివరలో 55-1-378
34. పైకి ప్రేమ నటిస్తూ మోసం చేసి ప్రాణం తీసే విధానం : యుద్ధం అయిన తరువాత పాండవులు ధృతరాష్ట్రునికి నమస్కారం చేస్తున్నారు. అందులో భీముడు నమస్కారం చేయబోతూంటే కృష్ణుడు భీముని తప్పించి ఒక ఇనుప భీముని ధృతరాష్ట్రుని దగ్గరకు నెట్టాడు. ధృతరాష్ట్రుడు దాన్ని గట్టిగా కౌగిలించుకొని పొడిపొడిగా రాలిపోయేటట్లు నలిపివేశాడు. పైగా భీమా! చనిపోయావా అని ఏడ్చాడు. ''చనిపోలేదు మామా'' అని కృష్ణుడు ఓదారుస్తాడు. స్త్రీ - 1-129
35. సమర్థుడయినా సహనం వహించేవాడు : పేదవాడయినా ఉన్నంతలో ప్రీతిగా దానం చేసేవాడు.

    *చెల్లియుండియు సైరణ సేయునత.*
    *పేదవడియును నర్థికి ప్రియముతోడ*
    *తనకు గల భంగి నిచ్చు నత.డు పుణ్య*
    *పురుషులని చెప్పిరార్యులు కురవరేణ్య.* *5-2-42*
36. ఉపప్లావ్యము : ఇది మత్స్యదేశంలో ఒక ఊరు. ఇక్కడ ఉండే అభిమన్యుని వివాహం కూడ జరిపారు.
37. సాంబుడు : ఇతనికే దుర్వాసుని శాపం వల్ల ముసలం పుట్టి యాదవ వినాశానికి మూలమయింది.
38. 18 రోజులు
39. మూడులోకాల్లో దేన్నయినా చూడగలిగే విద్య - అంగారపర్ణుడు అర్జునునకు ఇచ్చాడు. 1) షణ్మాసవ్రతం చెయ్యాలి. 2) కాపురుష ప్రాప్తమయితే ఫలించదు. ఆది 7-50
40. జమదగ్ని, రేణుక
41. శకుని కొడుకు : సహదేవుని చేత. శల్య - 1-386
42. 36 సంవత్సరాలు
43. వైశంపాయనుడు జనమేజయునికి : జనమేజయునికి వైశంపాయనుడు చెపుతూంటే రౌమహర్షణి విన్నాడు. అతడు శౌనకాది మునులకు చెప్పాడు. అతని మరో పేరు ఉగ్రశ్రవసుడు. రౌమహర్షణి అంటే రోమహర్షణుని కొడుకు - రోమహర్షణుడు వ్యాసుని శిష్యుడు. ఆది 1-66
44. అర్జునుడు
45. భీష్ముడు పడేవరకూ సరదాగా పాండవుల పక్షంలో యుద్ధం చెయ్యరాదా! అని. భీష్మ 1-164

<u>ఋషిపీఠం</u>



# అన్నం తినడం యజ్ఞం చేయడమే

**అహం వైశ్వానరో భూత్వా**
**ప్రాణినాం దేహమాశ్రితః।**
**ప్రాణాపాన సమాయుక్తః**
**పచామ్యన్నం చతుర్విధమ్**

అన్నం- భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యాలని నాలుగు విధాలు. 'అగ్ని' ద్వారా పచనమయిన అన్నం (ఆహారం) ప్రాణుల దేహంలోకి వెళ్ళి, అక్కడ జఠరాగ్ని ద్వారా ప్రాణాపాన వాయువులతో కలిసి పచనమై, శరీరానికి శక్తి నిస్తుంది. ''ఆ జఠరాగ్నిని నేనే'' అని శ్రీకృష్ణపరమాత్మ వచనం.

ఆ విష్ణువే అగ్ని కదా. కనుక మనలో హోమ కుండం సిద్ధంగా వుంది. అగ్ని సిద్ధమై వుంది. అదే జఠరాగ్ని. అందులో మనం అన్నాలను హుతం చేస్తున్నాం. అలా హుతమైన దానిని స్వీకరించి, విభజించి, సారంగా, శక్తిగా మార్చి సర్వేంద్రియాలకు ఆ శక్తిని పంపుతున్నాడు జఠరాగ్నిరూప వైశ్వానరుడు.

యజ్ఞ జరిగేటప్పుడు అగ్నిలో హుతమైన దానిని దేవతలకు అగ్ని అంద జేస్తాడు కదా. అలాగే ఇంద్రియాలకు ఈ అన్న శక్తిని అంద జేస్తోంది జఠరాగ్ని. ఇంద్రియాలకు అధిష్ఠాన దేవతలున్నా రని మరోసారి ఇక్కడ గుర్తు తెచ్చుకోవాలి.

కనుక అన్నం తినడం అంటే యజ్ఞం చేయడమే.

అయినా- అది యజ్ఞం ఎలా అవుతుంది? యజనం చేస్తే. అనగా ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తేనే యజ్ఞమవుతుంది. అంతేగానీ - కేవలం మనం తినడానికే అన్నం వండుకోకూడదు, యజ్ఞార్థం అన్నం వండాలి.

**తే అఘం భుంజతే మూఢాః**
**యే పచంత్యాత్మ కారణాత్** ॥ (భగవద్గీత)

తనకోసం తాను వండుకొనేవాడు పాపాన్ని తినే మూర్ఖుడు. యజ్ఞార్థం వండి, యజ్ఞం చేశాక మిగిలిన దానిని తినేవాడు అమృతాన్ని ఆరగిస్తున్నట్టే. అలాంటి అన్నం అమృతత్వాన్ని ప్రసాదిస్తుంది.

> ఈశ్వరునకు నివేదించనది, పాచిపట్టినది, శుష్కమైనది, అక్రమార్జితమైనది, శుచిలేనిది - యజ్ఞనిషిద్ధం. అనగా నిషిద్ధాహారం. వీటికి వ్యతిరేకమైన - ఈశ్వర నివేదిత, శుచియుక్త, న్యాయార్జిత సాత్విక మితాహారం యజ్ఞయోగ్య ద్రవ్యం. అదే స్వీకరించాల్సిన ఆహారం.

కనుకనే అన్నం తినేముందు ఈశ్వర స్మరణ చేయాలి అంటారు. అంటే ఈశ్వరార్పణ బుద్ధితో అన్నాన్ని తినాలి.

''జఠరాగ్ని స్వరూపుడైన విష్ణువు నకు అన్నాన్ని సమర్పిస్తున్నాను. తద్వారా దేవతల తృప్తికి'' అనే భావనతో అన్నం తినడం యజ్ఞమే. దానివల్ల ఇంద్రియాధిష్ఠాతలైన దేవతలు, అగ్నిరూపుడైన నారాయణుడు ప్రసన్నులై, ఆ దేహిని అనుగ్రహిస్తారు. వారి అనుగ్రహం కన్నా మించినది లేదు. ''నేను భుజిస్తున్నది బ్రహ్మమయమైన అన్నమే. అన్నం పరబ్రహ్మస్వరూపం కదా! భుజించే నేను (జీవుడు) బ్రహ్మమునే. నేను సమర్పించేదీ బ్రహ్మమునకే. ఇది బ్రహ్మకర్మ. దీనివల్ల లభించే ఫలం కూడా బ్రహ్మమే''- ఇదీ కావలసిన భావన.

**బ్రహ్మార్పణం బ్రహ్మహవిః**
**బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్**
**బ్రహ్మైవ తేన గంతవ్యం**
**బ్రహ్మకర్మ సమాధినా** - అని గీత.

ఆహార స్వీకారం యజ్ఞం కనుక- ద్విజుడు గాయత్రీ మంత్రపూతమైన ఆహారాన్ని - ప్రాణాయస్వాహా, అపానాయస్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయస్వాహా, సమానాయస్వాహా- అని అగ్ని (జఠరాగ్ని)కి సమర్పిస్తాడు. దేవతలకు ఆహుతులిచ్చేటప్పుడే స్వాహాకారం! ఇంద్రియాధిష్ఠాన దేవత లకు అన్నాన్ని ఇస్తున్నారు కనుక ఈ స్వాహోచ్చారణ.

కానీ అందరూ ఈ భావాన్ని గుర్తుపెట్టుకొని, ''ఆ పరమేశ్వరునకు సమర్పిస్తున్నాను'' అనే దృష్టితో, దైవ నామాన్ని భక్తితో స్మరించి అన్నాన్ని స్వీకరించాలి. అదే యజ్ఞం.

భగవద్భావనతో చేసే అన్నదానం 'యజ్ఞం' అనిపించుకునేది, ఈ కారణం చేతనే.

ఏ పూజా పునస్కారాలు చేయకపోయినా, అన్నం తినడం ఎవడూ మానడు గనుక, కనీసం అన్నం తినే ముందైనా, 'అగ్నిరూపుడైన ఆ సర్వేశ్వరునకు సమర్పిస్తున్నాను' అని భక్తితో అన్నం తింటే అతడు 'యజమానే'. (యజనము చేయువాడే)

యజ్ఞం శాస్త్ర సమ్మతం కావాలి. అశాస్త్రీయం కాకూడదు. కనుక అన్నాన్ని తినడం కూడా పశుప్రాయంగా కాక, సంస్కారబద్ధంగా వుండాలి.

ఈశ్వరునకు నివేదించనది, పాచిపట్టినది,

శుష్కమైనది, అక్రమార్జితమైనది, శుచిలేనిది - యజ్ఞనిషిద్ధం. అనగా నిషిద్ధాహారం.

వీటికి వ్యతిరేకమైన - ఈశ్వర నివేదిత, శుచియుక్త, న్యాయార్జిత సాత్త్విక మితాహారం యజ్ఞయోగ్య ద్రవ్యం. అదే స్వీకరించాల్సిన ఆహారం.

**...'మే గోపాయ రసమన్న మిహాయుషే**
**అదబ్ధా యోౖఽశీతతనో**
**అవిషం నః పితుం కృణు**
**హే అశీతతనో!'**

(వెచ్చని శరీరంగల అగ్నీ!) అన్నాన్నీ, రసాన్నీ- ఆయువు నిమిత్తం- నా శరీరంలో వుంచు. మా అన్నాన్ని రక్షించు. మా అన్నాన్ని విషశూన్యంగా చేయి'' అని నీరాజన మంత్రం.

కనుక అగ్ని అన్న రక్షకుడు. అన్నాన్ని నిర్విషంగా, అమృతంగా మార్చే పరబ్రహ్మ.

అన్నాన్ని అనుసరించే బుద్ధి వుంటుంది. అన్నాన్ని ఈశ్వరార్పణంగా స్వీకరిస్తే, బుద్ధి శుద్ధమై సత్కర్మలకు ప్రేరేపించబడుతుంది. ఆయువు సార్థక మవుతుంది.

''శివ పార్వతులను (అగ్నీ సోమా త్మక పరబ్రహ్మను) స్మరించకుండా తిన్న అన్నం విషసమానం. వారిని స్మరించి తినే అన్నం అమృతం'' - అని పురాణోక్తం. ఆ శివదేవునే 'అన్నానాం పతయే నమః' అని స్తుతించింది 'రుద్రనమకం'.

వంట వండేటప్పుడే, (పొయ్యి ద్వారా) అగ్నిని ఎలాగూ వెలిగిస్తాం. ఆ అగ్నిని నమస్కరించి, 'పరమేశ్వరా! నీకు నివేదించడానికి వండుతున్నాము' అనే భావనతో వండడం, (అభీష్ట దైవానికి) ఈశ్వరునకు నివేదన చేయడం, ఈశ్వరార్పణతో ఆరగించడం- ఇది చాలు.

నిత్యం దీపారాధన, ఈ ఆహార యజ్ఞం - మనం చేయగలిగే సులువైన మహోత్తమ ధర్మాలు. (దీపం లేనిదే నైవేద్యం పెట్టకూడదు)

దేవయజ్ఞం, ఋషియజ్ఞం, యజ్ఞం, మనుష్య యజ్ఞం, భూత యజ్ఞం- చేసి అన్నాన్ని ఆరగించాలి.

నిత్యం చేసే దేవపూజ, పర్వ దినాలలో ఉద్దేశింపబడ్డ దేవతల అర్చన - మొదలైన వాటిద్వారా 'దేవయజ్ఞం' నెరవేర్చినట్టే. వేదాధ్యయనం, సద్గ్రంథ పఠనం, వాటియందు పేర్కొన్న ప్రకారంగా స్వధర్మ నిర్వహణ చేస్తే 'ఋషి యజ్ఞం'.

తల్లిదండ్రుల్ని, వారు బ్రతికుండగా సేవించడం, మృతులయ్యాక తర్పణాదుల ద్వారా తృప్తిపరచడం 'పితృయజ్ఞం'. అతిథి పూజ, దాన ధర్మాదులు 'మనుష్య యజ్ఞం'. ప్రాణి కోటికి ఆహారాన్నివ్వడం- 'భూత యజ్ఞం'. ఈ యజ్ఞాలు చేసేవాడు తినే అన్నం అమృతమే. ✹

# పంచాగ్నులు

'ఛాందోగ్యోపనిత్తు'లో ప్రవాహణుడనే రాజర్షి గౌతమ మహర్షికి 'అగ్నివిద్య'ను ఉపదేశించాడు.

**1. 'అసౌ వా లోకో గౌతమాగ్నిః'**

-'ఓ గౌతమ ఋషీ! ఈ లోకమే అగ్ని. ఇది సోమకారకం'.

**2. 'పర్జన్యో వా వ గౌతమాగ్నిః'**

- ఓ గౌతమా! పర్జన్యుడే (లేక ఇంద్రుడే) అగ్ని. ఇది వర్ష కారకం'.

**3. 'పృథివీ వా వ గౌతమాగ్నిః'**

-'పృథివే అగ్ని. ఇందులో హవనమయ్యేది వర్షం. ఆ ఆహుతులచే అన్నం కలుగుతోంది'.

**4. 'పురుషో వా వ గౌతమాగ్నిః'**

-'ఓ గౌతమా! ఈ పురుషుడే అగ్ని. ఈ అగ్నిలో అన్నం హుతమై, ప్రజాకారకరేతస్సు పుడుతుంది'.

**5. 'యోషా వా వ గౌతమాగ్నిః'**

'ఓ గౌతమా! యువతే అగ్ని. ఈ అగ్నిలో ఇంద్రియాధి దేవతలచే హోమం చేయబడ్డ రేతస్సునుండి గర్భం కలుగుతోంది'.

ఇవీ పంచాగ్నులు. ఇలా విశ్వమంతా వున్నది అగ్నే. అవిచ్ఛిన్నంగా జరిగేది యజ్ఞమే.

పురుషుడు ఏ అగ్నినుండి వచ్చివున్నాడో, ఏ అగ్నుల చేత పుట్టివున్నాడో, ఆ అగ్నులే అతడిని తీసుకుపోతాయి.

జీవుడి రాకపోకలకి, ఊర్ధ్వలోక గతులకి కారణం అగ్నే. ✧

ఋషిపీఠం

# మాసఫలాలు

(దోష నివారణకు సూచనలతో)

| | గు<br>శ | | |
|---|---|---|---|
| కు | జనవరి 2000 | | రా |
| కే | | | |
| బు<br>ర | శు | చ | |

శ్రీమతి వి.బి.వి.ఎల్. రాజేశ్వరి, ఎం.ఏ

## (జనవరి 2000)



## మేషం

– భరణి –

ప్రథమ పాదం.)

ఈ రాశివారికి ఈ సంవత్సర మంతయూ గడచిన సంవత్సరం కంటే బాగుంటుంది. ఆర్థికంగా, వ్యవహారికంగా చాలా అనుకూలంగా ఉంటుంది. రవి బుధుల కలయిక భాగ్య రాజ్యాలలో జరగ టం వలన వృత్తి ఉద్యోగ వ్యాపారాలలో ఆశించిన ఫలం కలుగుతుంది. విద్యార్థులు ఉత్తీర్ణత పొందే అవకాశం ఉంది. పిల్లల ఆరోగ్యాలు బాగుంటాయి. కొద్దిగా అనారోగ్యం కలుగుతుంది. ఈశ్వరాభిషేకం, అరుణ పారాయణం చేయించుకోవాలి.



## వృషభం

కృత్తిక 2,3,4, రోహిణి–మృగశిర 1,2)

వీరికి ఉద్యోగమునందు వ్యాపారము నందు, ప్రశాంతముగా నడచును. రోహిణి నక్షత్రకులకు మాత్రము కొంచెము శ్రమ అధికము, ధనము అధికంగా ఖర్చు అగును. ఈ రాశివారికి జనవరి కొద్దిగా అనారోగ్యము, అధికారులవలన భయము, శరీరమునందు అధికవేడి కలుగును. జనవరి 15 నుండి అన్ని విషయములలో సర్దుబాటు జరుగును. కుటుంబంలో చికాకులు ఎక్కువ. 15వ తారీకు నుండి వీరికి అధిక ధనలాభము. వృత్తి ఉద్యోగాలలో ఆధిక్యత కలుగును. ఆరోగ్యము కుదుటబడును. వీరు అరుణ పారాయణము, ఏకాదశ రుద్రాభిషేకము తప్పక చేయించుకోవటం మంచిది. ఎర్రని పూలతో పూజించవలెను.



## మిథునం

(మృగశిర 3,4 – ఆరుద్ర – పునర్వసు 1,2,3)

విదేశీ విద్యలందు కృషి చేసేవారికి మేలు జరుగును. వ్యాపార వ్యవసాయములు చేయు వారికి లాభము కలుగును. వినోద యాత్రలు చేస్తారు. సంగీత, సాహిత్య, వేదశాస్త్రములలో కృషి చేయువారికి లాభదాయక సమయము. ఇనుప వ్యాపారస్థులకు అనుకూలము. జనవరి 15 తరువాత వీరికి కొంచెము అనారోగ్యము. కాళ్ళకు నొప్పులు కలుగుతాయి. విద్యార్థులకు అధికంగా శ్రమపడవలసిన అవసరం ఉంది. సూర్య నమస్కారములు, గోధుమలు ఆదివారం దానము చేయవలెను. గణపతి సహస్రనామము చేసుకోవాలి.



## కర్కాటకం

పునర్వసు – 4, పుష్యమి – ఆశ్లేష)

వీరికి అధికారుల ఆదరణ, బంధుమిత్రుల రాకపోకలు ఉండును. లారీ పరిశ్రమలు, ఇనుప పరిశ్రమల వారికి అనుకూలించును. ప్రభుత్వ వ్యవహారములందు, కోర్టులందు, రాజకీయాల్లోను మేలు జరుగును. ప్రయాణా లలో వృధా శ్రమ. వ్యవసాయ, వ్యాపారులకు అనుకూలమైన రోజులు. రియల్ ఎస్టేట్స్ వ్యాపారస్థులకు అనుకూలము. ఈ రాశి వారికి అనారోగ్యము కలిగే అవకాశం కలదు. జ్వరాదులచే బాధపడుదురు. ఆదిత్య హృదయము,సుబ్రహ్మణ్య పూజలు చేసుకోవాలి. దుర్గాదేవి పూజ చేయించుకోవాలి. కందులు దానము చేసుకోండి.



## సింహం

(మఘ–పుబ్బ – ఉత్తర – 1)

అధికారవృద్ధి కలుగుతుంది. బంధుసన్మానము, వినోదయాత్రలు, కలవు. సంగీత సాహిత్య నృత్య కళలలో కృషి చేయువారికి మేలు కలుగును. వస్త్రలాభము. గృహోపకరణములు కొందురు. పిల్లలు ఆరోగ్యంగా ఉందురు. విద్యాదులయందు లాభంగా ఉండును. కళత్రము (భార్య - భర్త)నకు కొద్దిగా అనారోగ్యము. గృహమందు సుఖశాంతులు ఉండును. తలచిన కార్యములయందు అనుకూలత కలదు. కులాచారవర్తనము కలిగియుంటారు. మఘ నక్షత్ర జాతకులు ఉలవలు, కందులు దానం చేసుకోవాలి. విష్ణు సహస్రనామం పారాయణ తొమ్మిది రోజులు ఈ రాశివారందరూ చేసుకోవాలి. విద్యార్థులకు మంచి రోజులు. హయగ్రీవ స్తోత్రం చదువుకోండి. పరీక్షా ఫలితాలు ఇంకా మంచిగా ఉంటాయి.



## కన్య

(ఉత్తర– 2,3,4; హస్త; చిత్త –1,2)

మీరు ప్రారంభించిన పనులు అనుకూల ముగా ఫలించును. కుటుంబములో సుఖ సంతోషంగా ఉందురు. రచయితలకు అనుకూలం ఉండదు. వ్యవసాయ, వ్యాపారులకు అనుకూల కాలంకాదు. ఆశించినంత రాబడి రాదు. ఈ రాశివారు ఏ వృత్తిలో ఉన్ననూ ఆశించినంత ఫలితముండదు. జనవరి 15 దాటిన తరువాత మీరు అనుకున్న పనులు చేయు అవకాశాలు అధికంగా ఉంటాయి. విద్యార్థులకు మంచి రోజులు. ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. అనవసర ఖర్చులు మెండు. వీరు ఈశ్వ రాభిషేకము చేయించుకొని సూర్యనమస్కారములు గాని అరుణపారాయణం

కాని చేయించుకోవాలి. గణపతికి పూజ చేసి ఉండ్రాళ్ళు నైవేద్యం పెట్టండి. స్త్రీలు లక్ష్మీపార్వతి పూజలు తెల్లని పూలతో తప్పక చేసుకోవాలి.



## తుల

చిత్త – 3,4; స్వాతి – విశాఖ –1,2,3)

శరీరారోగ్యము బాగుంటుంది. ధనలాభం, పుత్ర సౌఖ్యం, ఉద్యోగాభివృద్ధి, వ్యాపారంలో అనుకూలత ఉంటుంది. కళత్ర మూలకంగా సౌఖ్యం కలదు. గృహోపకరణ ములు క్రయం చేస్తారు. విద్యార్థులకు జనవరి 15 నుంచి మంచి రోజులు. స్వయంగా చేయు వ్యాపారము అనుకూలంగా నడుచును. అధి కారుల వలన మేలు జరుగును. నెలాఖరులో వృత్తివ్యాపార వ్యవసాయ కళా కారులకు ప్రతికూల రోజులు. కొద్దిగా అనారోగ్యము కూడా చేస్తుంది. వీరు శివాభిషేకము చేయించుకొని, దక్షిణా మూర్తిని కూడా పూజించాలి. శనగలు, నువ్వులు (నల్ల) దానం ఇవ్వాలి. స్త్రీ జాతకులకు మంచి రోజులు. అనుకున్న పనులు సాధించగలరు.



## వృశ్చికం

విశాఖ – 4 – అనురాధ – జ్యేష్ఠ)

వీరికి ప్రయత్న కార్యాను కూలత ఉండి హృదయా నందముగా ఉందురు. వాహన సౌఖ్యము కలుగును. వ్యాపారాలు బాగుంటాయి. ఆరోగ్యం బాగుంటుంది. సినీ, నాటక, కంప్యూటరు, ఇనుము, ప్రత్తి మొ. వృత్తి వ్యాపారస్థులకు అను కూలమైన రోజులు. సంతానము వలన సుఖము ఉండును. కోర్టులు, రాజకీయాలలోవారికి మేలు రోజులు. ప్రభుత్వ ఉద్యోగులకు అభివృద్ధి రోజులు. స్థానచలనము కలదు. భూలాభము ఉంటుంది. రాహువు భాగ్యంలో ఉండుటవలన దుర్గాపూజ చేయించుకొని మినుములు దానం ఇవ్వటం మంచిది. శివాభిషేకం కూడా చేయించు కోవాలి. జ్యేష్ఠ విశాఖా నక్షత్రజాతకులు శనగలు, పెసలు కూడా దానం ఇవ్వాలి.



## ధనుస్సు

(మూల – పూర్వాషాఢ – ఉత్తరాషాఢం –1)

అనుకున్న పనులు చేస్తారు. ధనప్రాప్తి కలదు. వస్త్రలాభము, ఆరోగ్యము కలవు. ఫ్యాక్టరీలు, పోలీసుశాఖ, మిలటరీలలోను, విద్యుత్‌శాఖలోను, కంప్యూటర్లు మొ. వాటిలో కృషి చేయువారికి మంచిరోజులు. వ్యవసాయ దారు లకు బాగుంటుంది. పంటలు బాగుంటాయి. పాడిపరిశ్రమ వారికి కూడా మంచి రోజులు. సద్గోష్టిలో పాల్గొంటారు. వాహన సౌఖ్యం కలదు. విద్యార్థులకు విద్యాభివృద్ధి కలదు. జనవరి 20వ తారీఖు వరకు కళత్రమునకు (భార్య – భర్త) కొద్దిగా అనారోగ్యము. అందుచేత ఆంజనేయస్వామికి మంగళవారంగాని, శుక్రవారంగాని ప్రదక్షిణలు చేసి అప్పాలు నైవేద్యం పెట్టండి. దుర్గాదేవిని పూజ చేయాలి (ఎర్రని పూలతో)



## మకరం

(ఉ.షా – 2,3,4; శ్రవణం – ధనిష్ఠ – 1,2)

ప్రయత్నించిన పనులు సానుకూలంగా జరుగును. వాహనముల వృత్తి వ్యాపారస్థులకు సామాన్యమైన అనుకూలంగా ఉండును. కుటుం బంలో సామాన్య సుఖశాంతులుంటాయి. బంధు వులతో మాటా మాటా పట్టింపు కలుగుతుంది. రాజకీయం, ఫ్యాక్టరీలు, కోర్టులు, వైద్యం మొ. వారికి ఆశించినంత ఫలితం కన్పించుటకు అధికశ్రమ పడాలి. శ్రవణా నక్షత్రంవారు జాగ్రత్తగా ప్రయాణాలు, చేయాలి. కుజశనులకు జపం చేయించుకొని కందులు, నల్ల నువ్వులు దానం చేయాలి. స్త్రీలు సుబ్రహ్మణ్యపూజ (పుట్ట లోపాలుపోయుట ఆదివారంనాడు) చేయాలి. దుర్గాదేవికి తెలుపు, ఎరుపు పూలతో పూజ చేయించాలి.



## కుంభం

(ధనిష్ఠ – 2, 3 – శతబిషం – పూర్వాభాద్ర – 1,2,3)

విదేశంలో విద్యానభ్యసించే వారికి అనుకూలం. విదేశాలతో వ్యాపార సంబంధీకులకు ధనలాభం కలదు. ఉద్యోగాభివృద్ధి కలదు. రాజకీయ, పత్రికా, సినిమా, కోర్టు, రంగాలలో ఉద్యోగ వ్యాపారస్థులకు అనుకూలమైన రోజులు. కళాకారులకు గుర్తింపు రోజులు. జనవరి 15 తరువాత కొద్దిగా అనారోగ్యం కలుగును. వాహన సౌఖ్యం కలదు. పెద్దలు, అధికారుల ఆదరణ ఉంటుంది. అనుకున్న పనులు సునాయాసంగా చేయగలరు. రచయితలు గుర్తింపబడి సన్మానములు పొందుతారు. విదేశప్రయాణాలు చేయటం, ప్రయాణ సన్నాహములు కలవు. విందులు వినోదాల్లో పాల్గొంటారు. తృతీయ గురువువల్లన అనారోగ్యం కలుగుతుంది. గురువారంనాడు గాని గురునక్షత్రంలోగాని ఈశ్వరాభిషేకం గంగతోగాని ఆవు పాలతోగాని చేయించుకొని, శనగలు దానం ఇవ్వండి. సుబ్రహ్మణ్య పూజ చేయించుకోండి. స్త్రీలు ఆంజనేయస్వామికి ప్రదక్షిణం, ఆదిత్యహృదయం పారాయణ చేసుకోవాలి.



## మీనం

(పూర్వాభాద్ర 4 – ఉత్తరాభాద్ర – రేవతి)

కులాచార కార్యక్రమములు చేయుదురు. పెద్దలు, అధికారుల వలన ఆదరాభిమానములు పొందుతారు. సుగంధ ద్రవ్య వ్యాపారస్థులకు కార్యసఫలత, ద్రవ్యలాభము. సంతానం వృద్ధి బాగుంటుంది. చదువులో ఉత్తీర్ణత. శని కుజుల పాపార్గళం వలన అనారోగ్యం కలిగినా త్వరగానే స్వస్థత కలుగుతుంది. వస్త్రలాభం, బంధు మిత్రుల సమగమము. రాజకీయంలోగాని, ప్రభుత్వపరంగాగాని కార్యానుకూలత జరుగు తుంది. కుజశనుల వలన కలిగిన ఘర్షణ, అశాంతి అనారోగ్య, శత్రు, ఋణ, రోగ బాధలు అన్నీకూడ స్వల్ప పరిధిలో కలుగుతాయి. అందువలన శని, కుజ జపం, కందులు నల్ల నువ్వుల దానం చేసుకోవాలి. ఆంజనేయ, విష్ణుపూజ చాల అవసరం. సుందరకాండ చదువుకోండి. స్త్రీలు నవగ్రహాలకు తొమ్మిది రోజులు ప్రదక్షిణలు చేసి శివదర్శనం చేసుకో వాలి. ఉత్తరాభాద్ర జాతకులకు అన్ని విధాలా జాగ్రత్త అవసరం.

# పరిష్కార మార్గాలు

డా॥ గాయత్రీదేవి

రకరకాల కారణాల వలన వచ్చిన వ్యాధులు మనిషి శరీరాన్నీ, మనసునీ బాధిస్తూంటాయి. ఆ వ్యాధుల బాధల నుండి తనని రక్షించుకోవడానికి మనిషి చేసిన (చేస్తున్న) ప్రయత్నఫలమే - వైద్యశాస్త్ర ఆవిర్భావం. అధర్వ వేదానికి ఉపవేదమైన ఆయుర్వేదంలో వ్యాధులకి మూడు విధాలయిన చికిత్సలు వివరింపబడ్డాయి.

* దైవ వ్యపాశ్రయ చికిత్సలు
* యుక్తి వ్యపాశ్రయ చికిత్సలు
* సత్వావజయ చికిత్సలు

మనిషి అంటే కేవలం భౌతిక శరీరం మాత్రమే కాదు. శరీరం, మనస్సు ఆత్మల సంయోగం. వైద్యం చేసేటప్పుడు కూడా కేవలం శరీరానికి మాత్రమే కాకుండా మనసుకి కూడా చికిత్స చేయవలసి ఉంటుంది. వైద్యులు వ్యాధిని అనుసరించి, పైన వివరించిన మూడు రకాల చికిత్సలలో ఏది ప్రధానంగా అవసరమో నిర్ణయించి, చికిత్స చేస్తారు.

## దైవ వ్యపాశ్రయ చికిత్సలు

చరక, సుశ్రుత, వాగ్భట, కాశ్యప సంహితలలో ఈ చికిత్సల గురించి వివరంగా తెలియజేశారు.

దైవవ్యపాశ్రయ చికిత్సలు అంటే రకరకాల పద్ధతుల ద్వారా దైవానుగ్రహాన్ని, తద్వారా ఆరోగ్యాన్ని పొందడం. మంత్రాలు జపించడం, ఓషధులు, మణులు ధరించడం, మంగళ ప్రదమయిన కార్యక్రమాలు నిర్వహించడం, దేవతలకి నైవేద్యాలు సమర్పించడం, తపస్సు, భజనలు, దేవతల్ని, గురువుల్ని, పెద్దలను పూజించడం, తీర్థ స్నానాలు చేయడం, స్వాధ్యాయం (ధార్మిక గ్రంథ పఠనం), భగవంతుడికి ఆత్మ సమర్పణ చేసుకోవడం మొదలయిన వన్నీ దైవ వ్యపాశ్రయచికిత్సలలో వివిధ అంశాలు.

అనేక రకాల వ్యాధులకి, మనిషిలో కలిగే అభద్రతా భావనే కారణం. దైవ వ్యపాశ్రయ చికిత్సావిధానంలో వివరించిన అనేక విధుల వలన - మనిషిలో ఒక రక్షిత భావం కలుగుతుంది. అది ఆరోగ్యానికి అత్యవసరం.

ప్రాయశ్చిత్తం - తమ తప్పులను పాపాలను తామే నిర్మూలించుకొనే సాధనం.

దైవ వ్యపాశ్రయ చికిత్సలన్నీ వ్యక్తి వ్యక్తిత్వం మీద ప్రభావం చూపిస్తాయి, ఆరోగ్యాన్ని రక్షిస్తాయి.

## యుక్తి వ్యపాశ్రయ చికిత్సలు:

ఇది సాధారణంగా అందరూ చేసే చికిత్సా విధానం. ఆహారంలో అవసరమైన మార్పులు చేయడం, ఔషధ సేవన - ఈ విధానంలోని అంశాలు. యుక్తి వ్యపాశ్రయ చికిత్సలు మూడు రకాలు.

* 'అంతః పరిమార్జనం' - అంటే ఔషధాలని శరీరం లోపలికి ప్రయోగించి, విషమించిన దోషాలకి సమస్థితికి తీసుకు వచ్చి, ఆరోగ్య వంతుల్ని చేసే విధానం.

* బహిఃపరిమార్జనం - అంటే శరీరం బయట చేసే ఔషధ ప్రయోగం - తైలమర్దన, స్వేదకర్మ, అంజనము, ఔషధ ద్రవ్యాలతో చేసే ధూమపానము మొదలయిన చికిత్సలు.

* శస్త్ర ప్రణిధానం - అంటే Surgery. మార్గాంతరం లేని పరిస్థితులలో శస్త్ర చికిత్స చేయవలసి ఉంటుంది. (ఆయుర్వేద శస్త్ర చికిత్స నిపుణుడు సుశ్రుతా చార్యుణ్ణే ఈనాటికీ ఆధునిక శస్త్ర వైద్యులు Father of surgery అని చెప్పుకుంటున్నారు)

## సత్వావజయ చికిత్సలు

శరీర అనారోగ్యానికి మనసు, శరీరం రెండూ కారణమౌతాయి. శారీరక వ్యాధులకి శారీరక దోషాలు, మానసిక వ్యాధులకి మానసిక దోషాలు మాత్రమే కారణాలుకావు. అందువల్ల శారీరక వ్యాధుల్లోనూ మానసిక వ్యాధుల్లోనూ కూడా మనసుని ఆరోగ్యంగా ఉంచుకోవలసిన అవసరం చాలా ఉంది. సత్వావజయ చికిత్సలు మనసుని ఆరోగ్యంగా ఉంచుకోవడం కోసం చేసేవి (సత్వం అంటే మనస్సు)

సద్వృత్తాన్ని పాటించడం, జపం, ధ్యానం, ''మేధో'' వృద్ధికర ఔషధాలు (మేధస్సు - అంటే మెదడు, తెలివితేటలు 'మేదస్సు' అంటే కొవ్వు లేదా fat) ఔషధాలు వాడడం, సంగీతం మొదలయిన కళల ద్వారా మనసుకి ప్రశాంతంగా, ఉల్లాసంగా ఉంచుకోవడం మొదలయినవన్నీ సత్వావజయ చికిత్సలోని అంశాలు.

ప్రస్తుతం పాశ్చాత్య వైద్య విధానంలో కూడా వివిధ వ్యాధులకి కారణాలలోనూ, చికిత్సలోనూ మనసు ప్రాధాన్యతను ప్రధానంగా చెబుతున్నారు. గుండె జబ్బులు, మధుమేహం, అల్సర్‌మొదలయిన వ్యాధులను నిరోధించడానికి మానసిక ప్రశాంతత ఎంతో అవసరం అనే అంశాన్ని ప్రచారం చేస్తున్నారు.

చికిత్స అంటే ''ఈ వ్యాధికిది మందు'' అనే కేటలాగు వైద్యం కాదు. ఒక్కొక్క లక్షణానికి ఒక్కొక్క మందువేసి, లక్షణాలని అణిచివెయ్యడమూ కాదు. కార్యరూప వ్యాధి లక్షణాలకి, కారణాన్ని గ్రహించి, సరయిన చికిత్స చేయాలి. ప్రస్తుతపు 'స్పీడు' కాలంలో ప్రతివారికీ 'Instant' ఫలితాలు కావాలి. పేషెంటుకి - పేషెన్సీ (ఓర్పు) లేదు, తత్కారణంగానో ఇతర కారణాల వల్లనో, చాలా మంది డాక్టర్లలోనూ లేదు పేషెన్సు. (కాల ప్రభావం అయి ఉండాలి) ✷

# పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు

డా॥ గాయత్రీదేవి

✧ పలువురికి కలిగిన, కలుగుతున్న సందేహం

ప్ర: ''డాక్టర్ గారూ, 'ఫలానా' వ్యాధికి ఆయుర్వేదంలో మందుందా, మీరు చికిత్స చేస్తారా?

జ: బహుశా ఈ సందేహానికి కారణం, 'ఆయుర్వేదం' అంటే అవగాహన లేకపోవడం అనుకుంటాను. ఆయుర్వేదం - పరిపూర్ణమైన, ప్రాచీనమైన, శతాబ్దాలుగా మానవుల ఆరోగ్య రక్షణలో సత్ఫలితాలనిస్తున్న శాస్త్రం.

అన్ని రకాల వ్యాధులకీ ఆయుర్వేద వైద్యంలో చికిత్స ఉంది. అలాగని, ఎటువంటి తీవ్ర వ్యాధినయినా ఆయుర్వేద వైద్యులు మటుమాయం చేసేస్తారని అర్థం కాదు. వ్యాధి తీవ్రత, ఎంత కాలంగా ఉన్నదీ, వంశపారం పర్యంగా వచ్చినదా - ఇలా రకరకాల అంశాల మీద చికిత్సా ఫలితాలు ఆధారపడతాయి. ఏ వ్యాధినయినా నిమిషాలలో కుదురుస్తాం అంటూ వ్యాపార ధోరణిలో జరిగే కొన్ని ప్రచారాలు చూసి మోసపోకపోవడానికి, ప్రజలకి శాస్త్రీయ అవగాహన అవసరం.

మరొక మాట - కొంతమంది కొన్ని ప్రత్యేక వ్యాధులకి వైద్యం చేస్తామని బోర్డులు పెడుతుంటారు. తరతరాలుగా ఆ వైద్యం వారి కుటుంబంలో నేర్చుకుని ఉండవచ్చు - బహుశా అటువంటి బోర్డుల కారణంగా కూడా ''ఫలానా రోగానికి ఆయుర్వేదంలో మందుందా'' అనే సందేహం కలుగుతూ ఉండవచ్చు. అటువంటి అనుభవవైద్యాలు వేరు, సంపూర్ణ ఆయుర్వేదవైద్యం వేరు అని పాఠకులు గ్రహించాలి.

ఐ.పద్మజ — కావలి.

ప్ర. వయసు నలభై సంవత్సరాలు. చలికాలంలో ఉదయం లేవగానే తుమ్ములు, జలుబు చల్లటినీళ్ళు తాకితే చర్మం ఎర్రబడుతుంది, దద్దుర్లువస్తాయి. చల్లటి పానీయాలు తాగితే గొంతు పూణుకు పోతుంది, పెదవులు వాస్తాయి. చల్లదనం ఏ మాత్రమూ సరిపడదు. ఈ సమస్యకి సరయిన మందు ''ఋషిపీఠం'' ద్వారా సూచించగలరు.

జ: మీరు లక్షణాలను బట్టి చూస్తే, మీది శుద్ధ కఫ ప్రకృతిగా తోస్తోంది. దానికి తోడు ఎలర్జీ లక్షణాలు కూడా ఉన్నాయి. ఆయుర్వేద చికిత్సలో, మొదటి అంశం - నిదానపరివర్జనం - అంటే వ్యాధికారక అంశాలను విడిచిపెట్టాలి.

## ''సర్వేసంతు నిరామయాః''

అందరూ ఆరోగ్యవంతులై ఉందురుగాక!

మీలో ఈ ఎలర్జీ లక్షణాలు తగ్గడానికి, కాలిక వైద్యం అవసరం.

శీతాంశురసం మాత్రలు ఉదయం, సాయంత్రం ఒక్కొక్క మాత్ర, ''హరిద్రా ఖండం'' - ఉదయం, సాయంత్రం ఒక్కొక్క చెంచాచొప్పున వేడిపాలతో, ''దశ మూలకటు త్రయ కషాయం'' - 15ml. మందు, సమానంగా నీరు కలిపి రెండుపూటలా వాడాలి. చల్లటి పదార్థాలకి దూరంగా ఉంటూ, నలభై రోజుల పాటు ఈ మందులు వాడి, తెలియజేయండి.

శ్రీరాంప్రసాద్ — బెజవాడ

ప్ర : మా తాతగారు త్రిఫలా చూర్ణం చాలా కాలంగా వాడుతున్నారు. వాడవచ్చా?

జ: ఈ సంచికలోనే త్రిఫలా గురించి వ్రాశాను. త్రిఫలా చూర్ణం ఎక్కువకాలం వాడడం శరీరానికి ఆరోగ్యకరమే, కానీ నష్టంలేదు.

ప్ర : శొంఠి చూర్ణం ప్రథమ కబళంలో వాడుతున్నారు. దీనితో పాటుగా పిప్పలీ చూర్ణం కూడా వచ్చా?

జ : శొంఠి ఒక్కటే వాడమనండి. వేడివేడి అన్నంలో శొంఠిపొడితో పాటుగా, కరిగించిన నెయ్యి కూడా చేర్చి భుజించాలి. ప్రతి ద్రవ్యం వాడేటప్పుడు, దానిలోని ఇతర గుణాల వలన శరీరానికి కీడు కలగకుండా, మరికొన్ని ద్రవ్యాలను లేదా అనుపానాలనూ వాడడం అవసరం.

ప్ర : మా తాతగారికి సుగర్ వ్యాధి లేదు. కానీ రాత్రిళ్ళు అతిమూత్రం ఉంటోంది

జ: వార్ధక్యంలో - ప్రోస్టేటు గ్రంధికి సంబంధించిన సమస్యల వలన అతిమూత్రం బాధిస్తుంది. ఒక్కసారి, వైద్యుల్ని సంప్రదించండి. పరీక్షిస్తే కానీ పరిస్థితి తెలియదు.

కె.వి.రామశర్మ — యర్రగుంట్ల

ప్ర: నా వయస్సు 78 సంవత్సరాలు. నాకు 5-6 మాసముల నుండి ఎక్కువగా తుమ్ములు వస్తున్నాయి. అప్పుడప్పుడు దగ్గు, జ్వరము కూడా వస్తున్నాయి.

జ : అభ్రక భస్మం (శతపుటి), 100 మి.గ్రా తేనెతో కలిపి రోజుకి మూడు సార్లు, అమృతారిష్టం - 15 మి.లీ. మందు సమానంగా నీరు చేర్చి, అదే విధంగా దశమూలారిష్టం - 15 మి.లీ. మందు, సమానంగా నీరు కలిపి, మూడు పూటలా వాడండి. రోజూ ఉదయం వేడిపాలలో, చిటికెడు పసుపు వేసుకుని తాగండి. ఒక్కసారి రక్తపరీక్ష చేయించుకుని, ఫలితాలు తెలియజేస్తే - సమస్య మరింత స్పష్టంగా తెలియడానికి వీలుంటుంది. రక్తం - T.C., D.C., E.S.R. చేయించుకుని ఫలితాలు తెలియచేయండి.

విజయ — రాజమండ్రి

ప్ర : గర్భాశయానికి సంబంధించిన వ్యాధులకి ఆయుర్వేద చికిత్స ఉన్నదా?

జ : గర్భాశయానికి సంబంధించిన వ్యాధులకి ఆయుర్వేదంలో ఉత్తమ ఔషధాలు ఉన్నాయి. ముఖ్యంగా ఋతుక్రమానికి సంబంధించిన సమస్యలకి, అల్లోపతి వైద్యంలో హార్మోనులే ప్రధాన ఔషధాలు. ఈ హార్మోనుల వాడకం వల్ల అనేక దుష్ఫలితాలున్నాయి. హార్మోనుల అవసరం లేకుండా, ఇతర సమస్యలు సృష్టించకుండా, అసలు సమస్యని ఆయుర్వేద ఔషధాలతో పరిష్కరించవచ్చు.

# మన ప్రాచీన సైన్స్ గ్రంథాలు

వేదకాలం నుండే మన దేశంలో అనేక శాస్త్రాల అధ్యయనం జరిగింది. అనేక విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు వెల్లివిరిశాయి. వాటిలో కొన్నింటిని గురించి తెలుసుకుందాం.

1) అక్షరలక్ష: ఇది సర్వశాస్త్ర సంగ్రహం (Encyclopedic Science). దీనికర్త వాల్మీకి. రేఖా గణితం, బీజగణితం, త్రికోణమితి, భౌతిక గణితశాస్త్రం మొదలైన 325 రకాల గణిత ప్రక్రియలు, ఖనిజశాస్త్రం, జల (యంత్ర) శాస్త్రం, భూగర్భశాస్త్రం, గాలి, ఉష్ణము, విద్యుత్తులను కొలిచే పద్ధతులు మొదలైన ఎన్నో విషయాలు ఇందులో తెలుపబడ్డాయి.

2) శబ్దశాస్త్రం: కండిక ఋషి ప్రణీతం పేరుకు తగ్గట్టు ఇది సృష్టిలోని సమస్త చరాచర పదార్థాల ధ్వనుల్ని, ప్రతిధ్వనుల్ని గూర్చి చర్చించింది. యాంత్రికంగా ధ్వనుల్ని ప్రతి సృష్టించడం, వాటి స్థాయి, వేగాలను కొలవడం వంటి విషయాలు కూడా ఐదు అధ్యాయాలలో వివరించబడింది.

3) లక్షణశాస్త్రం:– శకటాయనఋషి ప్రణీతం. చైతన్య, జడ సృష్టుల లింగ నిర్ధారణ శాస్త్రం.

4) కన్యాలక్షణశాస్త్రం: బభ్రుముని ప్రణీతం. కన్యాలక్షణాలను చర్చించిన ఈ శాస్త్రంలో సౌశీల్యాది విషయాలను నిర్ధారించే విధానాలు తెలుపబడ్డాయి.

5) శకునశాస్త్రం: గర్గమునిప్రణీతం. పక్షుల ధ్వనులనుబట్టి, మనుష్యుల మాటలను బట్టి శుభాశుభములను నిర్ణయించే విధానాలు తెలుపబడ్డాయి.

6) శిల్పశాస్త్రం: కశ్యప ఋషిప్రణీతం. 22 అధ్యాయాల్లో 307 రకాల శిల్పాలను గూర్చి (101 రకాల విగ్రహాలతో కలిపి) కూలంకషంగా చర్చించబడింది. గుళ్ళు, రాజభవనాలు, చావడులు మొదలైన నిర్మాణ విషయాలు వెయ్యికిపైబడి ఉన్నాయి. ఇదేశాస్త్రం మీద విశ్వామిత్రుడు, మయుడు, మారుతి, ఛాయా పురుషుడు మున్నగువారు చెప్పిన విషయాలు కూడా ఇందులో చర్చించబడ్డాయి.

7) సూపశాస్త్రం: 'సుకేశ' ప్రణీతం. పాకశాస్త్రం. సుమారు 108 రకాల వ్యంజనాలు, ఊరగాయలు, మిఠాయిలు, కేకులు, పిండి వంటలు మొదలైన అనేక రకాల వంటకాల గురించి, ప్రపంచవ్యాప్తంగా వాడుకలో నున్న 3032 రకాల పదార్థాల తయారీ విధానం చెప్పబడింది.

8) మాలినీ శాస్త్రం: ఋష్యశృంగ ప్రణీతం. పూల అమరిక గురించి చెప్తుంది. మాలలు తయారు చెయ్యడం, పూలగుత్తులు (Bouquets), పూలతో వివిధ రకాల శిరోలంకరణలు, గుప్త భాషలో పూరేకుల మీద ప్రేమ సందేశాలు పంపడం వంటి అనేక విషయాలు 16 అధ్యాయాలలో విశదీకరించబడ్డాయి.

9) కాలశాస్త్రం: భగవాన్ కార్తికేయ ప్రణీతం. కాలం, కాలవిభజన, శుభ–అశుభ కాలాలు వాటి అధిదేవతలు విశదీకరించబడ్డాయి.

10) సాముద్రికశాస్త్రం: సముద్రునిచే చెప్పబడి సాముద్రికశాస్త్రంగా ప్రసిద్ధి పొందింది. శ్రీమహావిష్ణువు ఆదిశేషునిపై శయనించి ఉన్నప్పుడు ఆయన శరీరం పైనున్న శుభ ముద్రలను సముద్రుడు తెలిపాడు. ఈ శాస్త్రం తదుపరి కాలంలో నారద, మాండవ్య, వరాహ, కార్తికేయాదులచే విస్తరింపబడింది. హస్తరేఖాశాస్త్రం ఇందులోనిదే.

11) ధాతుశాస్త్రం: అశ్వనీకుమార ప్రణీతం. సహజ, కృత్రిమ ధాతువులను గూర్చి 7 అధ్యాయాలలో కూలంకషంగా విశదీకరించబడింది. మిశ్ర ధాతువులు, ధాతువుల రూపాంతరణ, రాగిని బంగారంగా మార్చడం మొదలైన విషయాలు కూడా వివరించబడ్డాయి.

12) విషశాస్త్రం: అశ్వనీ కుమార ప్రణీతం. 32 రకాల విషాలు, వాటి గుణాలు, తయారీ, ప్రభావాలు, విరుగుళ్ళు మొదలైన సమస్త విషయాలు చెప్పారు.

13) చిత్ర కర్మ శాస్త్రం: భీమ ప్రణీతం. చిత్ర లేఖనం గూర్చిన శాస్త్రం. 12 అధ్యాయాల్లో సుమారు 200 రకాల చిత్ర లేఖన ప్రక్రియలను గురించి తెలుపబడింది. ఒక వ్యక్తి యొక్క తలవెంట్రుకలను గాని, గోటినిగాని, ఎముకను గాని చూసి ఆ వ్యక్తి బొమ్మను గీసే ప్రక్రియ చెప్పబడింది.

14) మల్ల శాస్త్రం: మల్ల ప్రణీతం. ఆరోగ్య పరిరక్షణకు కసరత్తులు, క్రీడలు వివరించబడ్డాయి. వట్టి చేతులతో చేసే 24 రకాల యుద్ధ విద్యలు చెప్ప బడ్డాయి.

15) పరకాయ ప్రవేశం:– వాలఖిల్య ప్రణీతం. ఒక శరీరాన్ని వదలి ఇంకొక శరీరంలోనికి ప్రవేశించడం పరకాయ ప్రవేశం. 32 రకాల

యాగవిద్యలను, అణిమాది అష్టసిద్ధులను నేర్పుతుందీ శాస్త్రం.

16) అశ్వశాస్త్రం:– అగ్ని వర్మ ప్రణీతం. గుర్రములు, వాటికి సంబంధించిన శుభాశుభ చిహ్నాలు, దేహధర్మాలు, ఈనడం, తర్ఫీదు మొదలైన సమస్త విషయాలను కూలంకషంగా తెల్పుతుంది.

17) గజశాస్త్రం:– కుమారస్వామి ప్రణీతం. ఏనుగుల శరీర లక్షణాల్ని పరీక్షించడానికి 16 పద్ధతులు, ఇంకా అనేక విషయాలు సవివరంగా చర్చించబడ్డాయి.

18) రత్న పరీక్ష:– వాత్సాయన ఋషి ప్రణీతం. రత్నాల 24 లక్షణాలు; సహజ - కృత్రిమ రత్నాలు. వాటి రూపములు, బరువు మొదలైన విషయాలన్నీ తరగతులవారీగా విభజించి తర్కించబడ్డాయి. రత్నాల శుద్ధతను పరీక్షించడానికి 32 పద్ధతులు వర్ణించబడ్డాయి.

19) మహేంద్రజాల శాస్త్రం:– సుబ్రహ్మణ్య స్వామి శిష్యుడైన వీర బాహు ప్రణీతం. గారడీ విద్య వివరించబడింది. నీటిపై నడవడం, గాలిలో తేలడం వంటి భ్రమలను కల్పించే విధానాలు నేర్పుతుంది.

20) అర్థశాస్త్రం:– వ్యాస ప్రణీతం. 3 భాగాలు. 82 ధనసంపాదనా విధా నాలు-ధర్మబద్ధమైనవి వివరించ బడ్డాయి.

21) శక్తి తంత్రం:– అగస్త్యప్రణీతం. 8 అధ్యాయాలు గలది. మూలప్రకృతి, మాయ; సూర్యుడు, చంద్రుడు, గాలి, అగ్ని మొదలగు వాటి 64 రకాల బాహ్యశక్తులు వివరించబడి వాటి ప్రత్యేక వినియోగాలు కూడా చెప్ప బడ్డాయి. అణు విచ్ఛేదనం ఇందులోని విభాగమే.

22) సౌదామినీకళ:– మతంగఋషి ప్రణీతం. నీడల ద్వారా, ఆలోచనల ద్వారా సమస్త దృగ్గోచర విషయాలను ఆకర్షించే విధానం చెప్పబడింది. పర్వతాల అంతర్భాగాల, భూమి అంతర్భాగాల ఛాయాచిత్రాలను తీసే ప్రక్రియ చెప్పబడింది.

23) మేఘశాస్త్రం:– అత్రిముని ప్రణీతం. 12 రకాల మేఘాలు, వాటి లక్షణాలు, 12 రకాల వర్షాలు, 64 రకాల మెరుపులు, 33 రకాల పిడుగులను గూర్చి తెలుపబడింది.

24) యంత్రశాస్త్రం:– భరద్వాజ ప్రణీతం. భూమిపై ప్రయాణానికుపయుక్తమైన 339 రకాల వాహనాలు; నీటిపై చరించడానికి 783 రకాల పడవలు, ఓడలు; 101 విధాల గాలి ఓడలు (విమానాలు)-మంత్ర తంత్ర కృత్రిమ విధానాలతో సాధ్యమయ్యేవి - చెప్పబడ్డాయి. గంధర్వాదులుపయోగించే వాహనాలు కూడా వివరించబడ్డాయి.

25) స్థాపత్యవిద్య:– అథర్వవేదం లోనిది. ఇంజనీరింగ్, ఆర్కిటెక్చర్, కట్టడములు, నగర ప్రణాళిక మొదలైన సమస్త నిర్మాణ విషయాలు తెలుపబడ్డాయి.

26) ఆయుర్వేదం:– బ్రహ్మ, అశ్వనీ దేవతలు, ధన్వంతరి, భరద్వాజుడు, అత్రి, అగ్ని వేశాదులచే చెప్పబడింది. తరువాత చరకుడు సమస్త ఆయుర్వేద విజ్ఞానాన్ని క్రోడీకరించి తన సంహితలో వ్రాశాడు. సుశ్రుతుడు మరింత ముందుకు తీసుకుపోయాడు. వాగ్భటుడు ఒక గ్రంథం వ్రాశాడు. ఔషధాలేకాక శస్త్ర చికిత్స, ఇంజక్షనులు కూడా ఉపయోగించారు. సుశ్రుతుడు కాయకల్పం మీద ఒక గ్రంథం వ్రాశాడు.

27) ధనుర్వేదం: విశ్వామిత్ర మహర్షిచే చెప్పబడింది. ఇందులో దీక్ష, సంగ్రహం, సిద్ధాంతం, ప్రయోగం అని నాలుగు విభాగాలు. చక్రం, కత్తి వంటివే కాక అనేక ఇతర ఆయుధాల ప్రయోగం కూడా చెప్పబడింది. బ్రహ్మాస్త్రం, వైష్ణవాస్త్రం, పాశుపతాస్త్రం, ఆగ్నేయాస్త్రం వంటి వివిధ శాస్త్రాస్త్ర ప్రయోగం ఆయా అస్త్ర దేవతలు, మంత్రాలు, ఆయుధాల వర్ణన వంటివే కాక నకిలీ యుద్ధాలు కూడా వర్ణించబడ్డాయి.

28) గాంధర్వవేదం:– నందికేశ్వర, నారద, హనుమదాదులచే చెప్పబడిన సంగీత నాట్య విద్యను భరతముని విపులంగా గ్రంథస్థం చేశారు. గాత్ర-వాద్యసంగీతాలు, నృత్యం ఇందులోని భాగాలు. భగవదర్చనతో మానసిక తాదాత్మ్యం పొందడమే ఈ శాస్త్రం యొక్క ముఖ్యోద్దేశం. ✧

## మూలకాంతి



ఒకగదిలో దీపం వెలిగించి... 'ఇక్క డేముంది?' అని అడిగితే, ఆ గదిలోనున్న వస్తువుల వివరాలు చెప్తాం. అంతేగానీ అక్కడ 'ఆ దీపపు వెలుగు ఉంద'ని చెప్పం. ఏ వెలుగుద్వారా అన్నీ గ్రహిస్తున్నామో, ఆ వెలుగుని గమనించం, పేర్కొనం. దానిద్వారానే మన ఉనికి, మన చుట్టూ ఉన్న ప్రపంచపు ఉనికీ ఆధారపడి ఉన్నాయని తెలుసుకోం.

అదే విధంగా ఈ విశ్వానికంతటికీ వెలుగైన భగవంతుని గమనించకుండా బ్రతుకుతుంటాం. వివేకవంతులు మాత్రమే ఆ వెలుగుని గ్రహిస్తారు. కృతజ్ఞతా పూర్వక భక్తిని ప్రకటిస్తారు.

– డా॥ జి.వి. శాస్త్రి.

# జిజ్ఞాస

నిర్వహణ: ఋషిపీఠం

వి.వి.మూర్తి

ప్ర. రావణుడంతటి మహాబలశాలి శివధనుస్సు ఎందుకు మోయలేక పోయాడు? శివభక్తి వల్లనా?

జ. అసలు రావణుడు శివధనుస్సు జోలికే వెళ్ల లేదు, సీతా స్వయంవరమూ జరగలేదు. యజ్ఞ నిమిత్తం వెళ్లిన విశ్వామిత్రునితోపాటూ మిథిలకు చేరారు రామలక్ష్మణులు. అక్కడ ప్రసంగవశాత్తూ శివధనువును చూపించాడు జనక మహారాజు. దీనిని ఎక్కిడిన వీరునికి తన తనయ సీతమ్మన్ని వివాహం చేయాలనుకున్నట్లు జనకుడు వివరించాక, విశ్వామిత్రుని యానతితో రాముడు శివధనుస్సును ఎక్కిడి, ధనుర్భంగం చేశాడు. ఇంతే రామాయణంలో ఉన్న కథ. రామవన వాస సమయంలో, శూర్పణఖ భంగపడిన తర్వాత, ప్రహస్తుడు చెప్పాకగానీ సీతారాముల గురించి రావణునికి తెలియదు, కాబట్టి రావణునికీ శివధనుస్సుకీ సంబంధమే లేదు. శ్రీరాముడుకూడా శివభక్తుడే.

బి.సాయిరాం చెన్నై

ప్ర. త్యాగరాజస్వామి జన్మతః తమిళుడని ఈ మధ్య ఒక ప్రముఖ దినపత్రికలో చదివాను. నిజమేనా? మరి ఆయన తెలుగులోనే కీర్తనలు ఎందుకు రచించాడు?

జ. త్యాగరాజస్వామి తమిళ భాషా ప్రాంతంలో నివసించాడు. అంతే. ఆయన జన్మతః తెలుగువాడు, పైగా తెలుగు భాషలోనున్న సంగీతాత్మక మాధుర్యమర్మాలను ఎరిగినవాడు కనుక తెలుగు, సంస్కృతాలలోనే కీర్తనలు రచించాడు.

అప్పట్లో ఈ భాషాప్రయుక్త రాష్ట్రవిభజన లేదు కదా. త్యాగరాజులవారి ముత్తాతగారు 'కాకర్ల పంచనద బ్రహ్మం' గారు. వీరు కర్నూలు జిల్లా లోని 'కంభం' తాలూకా ప్రాంతం వారు. 1600 సంవత్సరంలో ఆ ప్రాంతం నుంచి తంజావూరుకి చెందిన 'తిరువారూరు' అనే పుణ్యక్షేత్రానికి వచ్చి స్థిరపడ్డారు. ములకనాటి ఆంధ్ర బ్రాహ్మణులు. భారద్వాజ గోత్రులు.

పంచనద బ్రహ్మం గారి అయిదవ పుత్రుడు గిరిరాజబ్రహ్మం. ఆయన 'శాహభూపాలుని ఆస్థాన వాగ్గేయకారుడు', ఆయన కుమారుడు రామబ్రహ్మం. ఈయన తులజాజీ మహారాజు ఆస్థానంలో పౌరాణికులు. ఈయన భార్య సీతమ్మ, ఈ దంపతులకు పంచాపకేశ బ్రహ్మం (జపేశయ్య), రామనాథబ్రహ్మం, త్యాగరాజబ్రహ్మం - అని ముగ్గురు కుమారులు, ఈ మూడవ వ్యక్తియే, మన నాదబ్రహ్మ. 1767లో జన్మించిన ఈ మహానుభావుడు 1847 వరకు జీవించారు. ఇదీ త్యాగరాజుల వారి జన్మవృత్తాంతం. భాషావిషయకమైన భేద దృష్టిని ఈ మహాత్ముల వైపు ప్రసరించరాదు. వీరు విశ్వానికి అవసరమైన కారణజన్ములు. కాబట్టి ఏ భాషవారైనా సరే ఈ కారణజన్ముని ఆరాధించవలసినదే.

టి.కృష్ణ భోగాపురం

ప్ర. ఈ రోజు కోసిన పువ్వుల్ని మరుసటి రోజు వాడవచ్చునా?

జ. మారేడు, తులసి, పద్మాలు (తామర పువ్వులు)... ఈ మూడూ మరుసటి రోజు కూడా వాడవచ్చు. ఇవి తప్ప మిగిలిన పువ్వుల్ని ఏరోజు కోసిన వాటిని ఆరోజే ఉపయోగించాలి. మరుసటిరోజుకి పనికిరావు. ఒకసారి అర్చన చేసిన పుష్పాలు నిర్మాల్యం అవుతాయి కనుక, వాటిని మరునాడు ఉపయోగించరాదు.

వెండి, బంగారం వంటి లోహాలతో చేసిన బిల్వాలకు, పుష్పాలకు నిర్మాల్యదోషం లేదు. కడిగి, శుభ్రపరచి ప్రతిరోజూ ఉపయోగించవచ్చు.

రామదాసు హనుమాన్ జంక్షన్

ప్ర. భగవంతుని పటాలకి ప్లాస్టిక్ పూల మాలలు వేయవచ్చునా?

జ. ఏ దేవుడి పటానికైనా ప్లాస్టిక్ పూలమాలలు వాడరాదు.

ఎ.విష్ణుప్రియ గుడివాడ

ప్ర. జరగవలసినవి జరిగి తీరుతాయన్నప్పుడు, మరి హోమాలు, పూజలు...వీటివల్ల ఫలితం ఉంటుందా?

జ. ప్రారబ్ధకర్మ అనుభవించవలసిందే. అయితే అందులో 'సాధారణకర్మ' వ్రతహోమాదుల ద్వారా తొలగించవచ్చు. అనివార్యమైన దానిని పూర్తిగా మార్చలేకపోవచ్చును గానీ దాని తీవ్రతను తగ్గించవచ్చు. ఎండనీ, వాననీ మనం మార్చలేం గానీ, వాటినుండి కాపాడుకోడానికి గొడుగు వంటివాటిని వినియోగించుకుంటాం కదా. అలాంటిదే ఇది కూడా.

జి.చిట్టిబాబు బళ్లారి

ప్ర. శివునికి మంగళవారం బిల్వార్చన చేయకూడదు అనీ, శివుని పటాలు ఇంట్లో పెట్టుకోకూడదని కొందరు నాతో అన్నారు. నిజమేనా?

జ. ఏ వారమైనా శివునికి బిల్వార్చన చేయవచ్చు. లక్షణంగా శివుని పటాలు ఇంట్లో పెట్టుకోవచ్చు.

జయలక్ష్మి పెదకళ్లేపల్లి

ప్ర. సుబ్రహ్మణ్యస్వామిని 'మురుగ' అంటారు కదా. తమిళులు పెట్టుకున్న ఈ పేరుకి అర్థమేమైనా ఉంటుంది?

జ. 'మురుగ' అనే పేరు తమిళుల సొంతం కాదు. సుబ్రహ్మణ్యుని నామాలు సంస్కృతంలో అనేకం ఉన్నాయి. అందులో ''మురుక'' అనేది ఒకటి. దీనికి అర్థం 'స్కాంద పురాణం' ఇలా చెప్తోంది.

**'ము' కారాస్తు ముకుందః స్యాత్**
**'రు' కారో రుద్రవాచకః**

'క' కారో బ్రహ్మవాచీచ
'మురుకో' గుహ వాచకః॥

'ము' అనేది విష్ణువునీ, 'రు' - రుద్రునీ, 'క' - బ్రహ్మనీ తెలియజేస్తుంది. బ్రహ్మవిష్ణు శివాత్మకమైన పరబ్రహ్మగా సుబ్రహ్మణ్యుని (గుహుని) ఉపాసిస్తూ ''మురుక' అని స్వామిని పిలుస్తారు.

కాబట్టి 'మురుక' అనేది వైదిక సంస్కృతిలోని పదమే. తమిళ భాషలో 'క' కారానికీ, 'గ' కారానికీ తేడా లేదు కనుక 'మురుగ' అని వారంటారు అంతే.

సి.సంధ్య తణుకు

ప్ర. ఏవో దేవతల పేర్లమీద, వారిమహిమలమీద మా ఇంటికి చాలా ఉత్తరాలొచ్చాయి. అలాంటి ఉత్తరాలే మరో ఇరవై మందికో, నలభైమందికో వ్రాసి పంపాలని, అలా చేయకపోతే ఎన్నో కష్టాలు కలుగుతాయని భయపెడుతూ వస్తుంటాయి. అది నిజమేనా? మాకు భయంగా ఉంది.

జ. ఆ ఉత్తరాల రచన ఒకరకం పిచ్చితనం. వాటిని పట్టించుకోనవసరం లేదు. వాటిని సుబ్బరంగా చించిపారేయవచ్చు. భయపడడం అనవసరం. ఇటువంటి పిచ్చిపనులవల్లే అసలైన దైవమతం అపార్థాలపాలవుతుంది.

ఎ.కుమార్ ఉప్పల్

ప్ర. 'ఆర్షసంస్కృతి' అనే మాటకి అర్థం ఏమిటి?

జ. 'ఆర్ష' అంటే ''ఋషిసంబంధమైన'' అని అర్థం. మన సంస్కృతి అంతా ఋషులద్వారా లభించినదే. అందుకే దీనిని ''ఆర్షసంస్కృతి'' అన్నారు.

ఎస్.శ్యామ్‌సుందర్ చెన్నై

ప్ర: ఇంట్లో దేవుణ్ణి ఏ దిక్కున ఉంచాలి? మనం ఏ దిక్కువైపు తిరగాలి?

జ: పూజించేమనం తూర్పు, లేదా ఉత్తరంవైపు తిరిగి పూజించడం మంచిది. కాబట్టి దేవుడు ఆ దిక్కుల్లో ఏ దిక్కునైనా ఉండాలి. అంటే దేవుడు దక్షిణంవైపుగానీ, పశ్చిమంవైపుగానీ చూస్తున్నట్టుగా అమర్చుకోవాలి.

# మన పద్యం

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

**ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనమ్మునకగుఁ దా
నొరులకు నవిసేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్.**

(తిక్కన గారు రచించిన మహాభారత పద్యమిది)

ఈ పద్యము సర్వప్రసిద్ధమైనది. మన దేశమునందున్న ఆంధ్రదైనిక పత్రికలలో మొదటినుంచి వచ్చు పత్రికయైన ఆంధ్ర పత్రిక లక్ష్యభూతముగా శీర్షిక క్రింద ఎన్నోయేండ్లుగా ఈ పద్యం వాడుకుంది.

అర్థమెఱిగించినచో నిది చాల గొప్ప పద్యము. అనుభూతికి తెచ్చికొన్నచో దానికి వందరెట్లెక్కువ గొప్ప పద్యము. కవితా దృష్టితో కాదు. నీతిదృష్టితో, మన మతముయొక్క దృష్టితో, మన మతమును మనమనుభవములోనికి తెచ్చుకొనవలయునన్న దృష్టితో.

ఇతరులేమి మనకు చేసినచో మన మనస్సునకు బాధకలుగునో, అది యితరులకు మనము చేయకుండ నుండుట అన్ని ధర్మములకు శిరోభూషణమైనది.

'ఆత్మవత్సర్వభూతాని' అను మహా విషయము ననుభవములోనికి తెచ్చికొనుట. అనగా తాను ప్రపంచకముతో నొకటియగుట. ప్రపంచకము నంతయు తనలో చూచుకొనుట.

అనగా నేమి? మనయందంతర్యామియైన పరమేశ్వరుని మనము తెలిసికొనుట.

దీనివలన నాత్మజ్ఞానము సమకూరును. అపుడు నిజమైన వైదిక మతస్థుడగును. సనాతనధర్మముయొక్క రహస్యము తెలిసినవాడగును. ఆచరించినవాడగును. దానితో నైక్యము పొందినవాడగును.

ఈ నాల్గవ చరణమునందు నొక శబ్దమున్నది. 'పరాయణము' అని. దీనికర్థము 'ఆశ్రయము.' లేనిచో 'నభీష్టమైనది'. అర్థము సామాన్యము. శబ్దము చాలగొప్పది.

భారతములో ఈ శబ్దమును సమృద్ధిగా వాడుదురు.

అభీష్టము, ఆశ్రయము అన్న మాటలయందు ఒట్టి యర్థమే యున్నది. 'పరాయణ'మన్న శబ్దమునందు అర్థముతోపాటు కొంత పవిత్రత యున్నది. కొంత యాస్తికత్వమున్నది. కొంత గొప్పదనమున్నది. అందుచేత నర్థము చెప్పినంత మాత్రము చేతనంతయు తెలిసినట్లు కాదు. హృదయము మాత్రమే గ్రహింపగల యొకదీప్తి కొన్ని కొన్ని శబ్దముల నావరించి యుండును. వానినవిగానే తెలిసికొనవలయును.

దీనిని 'శబ్దశక్తి' యనవచ్చును. శబ్దబ్రహ్మము వీనినుండియే పుట్టునేమో! కనుక నర్థాపేక్షతో మహాకవియొక్క పద్యమును నిరసింపరాదు. శబ్దమునందు ప్రోగుపడి, హృదయైకవేద్యమగు నొకశక్తియుండును. అది హృదయమునకే తెలియును. మనస్సునకు తెలియదు. దీనిని గురించి యెంతయైనను చెప్పవలయును. ✸

ఋషిపీఠం

డిసెంబరు '99

# ఈ నెల విశేషాలు

శ్రీ ఎస్. రామమూర్తి శర్మ

(మార్గశిర బహుళ దశమి మొదలు
పుష్య బహుళ ఏకాదశి వరకు)

**ముఖ్యదినాలు**

| | |
|---|---|
| 2 | సఫల ఏకాదశి |
| 12 | శ్రీ రమణమహర్షి జయంతి |
| 14 | భోగి |
| 15 | మకర సంక్రాంతి |
| 16 | కనుమ |
| 25 | త్యాగరాజ ఆరాధనోత్సవం |
| 27 | వివేకానంద జయంతి |

### ✷ 2 సఫల ఏకాదశి

ధనుర్మాసంలో వచ్చే రెండవ ఏకాదశి. విష్ణుప్రీతికరమైన రోజు. నారాయణార్చన, విష్ణు సహస్రనామ పారాయణ వంటివి ఈరోజున విశేషఫలప్రదం.

### ✷ 14 భోగి

భోగము కలది భోగి.

విష్ణుచిత్తుని కుమార్తె అయిన శ్రీ గోదాదేవి (ఆండాళ్) శ్రీరంగనాథుని వరించి తరించిన భూలక్ష్మి. స్వామిని అలంకరించాల్సిన పూలమాలను తాను ధరించి, వాటి సౌందర్యానికి మురిసి – ఆ తరువాత భగవంతునికి అలంకరించేది. శ్రీమన్నారాయణుని పతిగా కోరి – ధనుర్మాసవ్రతం (మార్గళివ్రతం) ఆచరించి, ఆ స్వామి అనుగ్రహాన్ని పొందినది. వ్రత పరిసమాప్తి జరిగి, స్వామిని చేపట్టిన రోజు ఇది. నారాయణుని చేరి, ఆ జగజ్జనని భోగములందిన దినమిది.

ఈ రోజున తలంటుస్నానం చేసి భగవదర్చన చేయడం శ్రేయఃప్రదం.

చలిమంటలు వేయడం ఈ రోజున ఆచారం.

### ✷ 15 మకరసంక్రాంతి



సూర్యభగవానుడు మకరరాశిలో ప్రవేశించే పుణ్యఘడియ, ఉత్తరాయణ పుణ్యకాల ఆరంభం. దేవమార్గం ప్రారంభమయ్యేరోజు. ఈ సంక్రాంతి వేళ స్నాన, దాన, జప, వ్రతాదులు విశేషఫలం. గుమ్మడి, వస్త్రములు దానం చేయడం ఆచారం. పంట చేతికందిన ఈ పర్వం నాడు ప్రతి ఇంటా శోభ వెల్లివిరుస్తుంది.

విష్ణుసహస్రనామ పఠనం – ఈ రోజున విశేషమైన శుభఫలాలనిస్తుంది.

దేవ, పితృ పూజలకు దివ్యమైన కాలం. పితృదేవతలనుద్దేశించి చేసే తర్పణాదులు, దానాదులు పుణ్యప్రదం. పౌష్యలక్ష్మిగా జగదంబను ఆరాధించే కాలమిది.

### ✷ 16 కనుమ

పాడి పంటలను పూజించేరోజు. పశుసంపదను లక్ష్మీ స్వరూపంగా భావించి అర్చించడం ఈ రోజున విశేషం.

ప్రకృతిలో తన్మయమయ్యే పండుగలివి.

### ✷ 25 త్యాగరాజ ఆరాధన

మహాభక్తుడు, సంగీత సాహిత్య సమ్రాట్, మహావాగ్గేయకారుడు రామానుగ్రహసిద్ధుడు నాదబ్రహ్మ శ్రీత్యాగరాజస్వామివారు పరమపదించిన పుష్యబహుళ పంచమి ఈ దినం. సన్యాసాశ్రమ స్వీకారం చేసి, కైవల్యం పొందిన కారణంగా వారి తిథిని 'ఆరాధన'గా చేస్తారు. వారు సమాధి పొందిన 'తిరువాయారు' క్షేత్రంలో – ప్రసిద్ధ, వర్ధమాన సంగీతకారులందరూ విచ్చేసి – స్వామివారి 'ఘనరాగ పంచరత్న కీర్తనలు' మొదలైనవి ఆలపిస్తారు. త్యాగరాజస్వామిని ఆరాధిస్తారు. తెలుగువారే కాక, సంగీత సాహిత్య ప్రియులు, భారతీయ సంస్కృతి పట్ల ప్రీతి కలవారంతా ఆరాధించవలసిన పుణ్యమూర్తి శ్రీత్యాగరాజుల వారు.

సదాశివునకు చక్కెర పలుకుల నివేదన -

# శివదర్పణమ్

రచన :
'సిరివెన్నెల' సీతారామశాస్త్రి
ప్రతులకు :
301, వెస్టర్న్ ప్లాజా,
ఎల్లారెడ్డిగూడ,
హైదరాబాద్ - 500 873.



'విశ్వం దర్పణ దృశ్య మాన నగరీ తుల్యం'... అంటూ అంతరంగ దర్పణ స్వరూపాన్ని ఆది శంకరులు ఆవిష్కరించారు. దానిని 'శివ దర్పణం' గా దృశ్యమానం చేసుకొనే సాధన-సిద్ధి ఈ పుస్తకరూపంలో సాక్షాత్కరించింది. 'చిదానందరూపం శివోహం శివోహం'... అనే 'ఎరుక'ను ఉనికిగా, మనికిగా మలచుకొనే దర్శనశక్తి ఈ కృతిలో ప్రతిపదంలో పల్లవించింది.

'సినీ గేయ సాహిత్యాన్ని' సుసంపన్నం చేసి 'మంచి కవి'గా తెలుగువారి ఆదరణ పొందిన శ్రీ శాస్త్రిగారి సినిమా పాటల్ని పరిశీలించిన వారెవరూ, ఈ కృతిని చూసి ఆశ్చర్యపోరు.

ఇందులో మొత్తం 54 పాటలు. వీటి పంథా, ప్రక్రియ నిర్మాణం విభిన్నం. 'తొలి జోత'గా గణపతికి నమస్కరిస్తూనే, ఆయనచేత తొలిజోతలందుకునే దేవునిగా సదాశివుని భావించి - తన ఇష్టదైవాన్ని మొదటే స్తుతించిన వైనం - రసౌచితీసమంచితం. ఆ తరువాత కొన్నిపాటలు సినీసాహిత్యంలో వారు పండించిన 'చిన్నికావ్యాలు'. ఇక 'శివదర్పణ' గీతాలు మొదలుపెడితే - జగత్తులో ప్రతి అణువులోనూ అంతర్యామిగా ఉండే ఆది దేవుని ఆవిష్కరించుకునే సాధన మొదలవుతుంది.

ఈపుస్తకంలో ప్రధానంగా భాష, భావం... రెండూ చాలా మేరకు వినూత్నంగా ధ్వనిస్తాయి. పదబంధాల కూర్పులో వైలక్షణ్యం, వైదగ్ధ్యం అబ్బురపరుస్తుంది. భావంలో - ప్రస్ఫుటంగా కనిపించే ఆర్తి, ప్రపత్తి మనస్సును శివుని పాదాలపై కుసుమంగా మార్చుతాయి.

పదం తరువాత పదం కూర్చడంలో ఒక శిల్పి లక్షణం ఈ పాటల్లో ప్రత్యక్షమౌతుంది.

నిరంతర చింతన, తనలో తనను తరచితరచి, అంతరంగ చిదాకాశాన శివుని వెతికి పట్టుకుని భావసంచలనాలన్నీ ఆయన వైపే ప్రసరిస్తూ... పరాచికాలూ, ప్రణతులూ, ఎత్తిపొడుపులూ, వేడికోళ్లూ, చలించని యోగ భూమికలూ, చలనం ఆపని ఆనందార్భటీ విలాసాలూ అన్నీ ప్రతిష్ఠించే ఈ పాటల్ని చూస్తుంటే... మనసు కైలాసశైల శిఖరాలలో సంచరించక మానదు.

వ్యాఖ్యానానికందకుండా కేవలం అనుభూతి బరువుతో అవాక్కయ్యే స్థితిని కలిగించే వాక్కులు ఈ పాటల్లో దర్శనమిస్తాయి.

'ప్రభలు పెరుగపసిపాటలు ప్రబలమొందనీ' - అనే 'ప్రణవసింధువు'న 'ప్రపంచ ప్రథమ బిందువు'గా పోల్చుకొని, స్తుతించి, కృత్యా ద్యవస్థదాటి 'మధుపదాళి మృదుమ ధూళి మధుకరస్వర సంగతులలో పరవశించే' దివ్యగేయధారని ఆవిష్కరించారు.

ప్రతి పాటా అనంతమైన ఆర్తిని, శరణాగతిని పుంజీ భూతం చేస్తుంటే, 'శివభక్తి' అనే అర్హత ఏ మాత్రం ఉన్నహృదయమైనా కరగకమానదు. కవితో తాదాత్మ్యం చెందక తప్పదు. ఎందరు దైవాలున్నా, అందరినీ కాదని, 'పశుపతి'నే ఎంచుకున్న కారణాన్ని, 'నమ్మనమ్మకపో' అనే పాటలో చెప్తూ ''నీదీ నాదీ వీబూది జాతి!!'' అనడంలో శివుడు కూడా చిరునవ్వు నవ్వుకునేటంత చమత్కృతిని చూపించారు.

వైయుక్తికంగా తన కవన శక్తినీ, శ్వాసనీ కూడా ఈశ్వరాయత్తం చేసుకోవాలనే తపన - తనకీ, స్వామికీ ఉన్న స్వాభావిక బాంధవ్యం, సహజ తాదాత్మ్యం తెలుసుకొనే సాధనగా పరిణమించింది. ''పరస్పరం చిరపరిచితులం, పరిపరి వరుసల బంధువులం, మరచితివేమో గురుతుచేయనా? శివదర్పణముగ ఎదను నిలుపనా...'' అని మనోదర్పణంలో మహాశివుని పట్టి చూస్తారు. ఆ దర్శనం మొదలైతే దర్పణం ఇంక మిగలదు - దైవమే మిగిలిపోతాడు, అదే ''ఏకం అద్వితీయం బ్రహ్మ''.

''అమ్మతో చెబుతా'', 'ఊహకైన అందవేమి ఉమామహేశ!', 'అప్పలో నిండా మునిగావు లింగా!', 'తామసమా! దేవతమా!', 'గెలుపు ఎవరిమీదరా' 'ఈశావాస్యమ్' - ఈ పాటలో తాత్త్వికంగా పరాకోటికి చెందినవి.

'సాహో! సాఁవిరో సాగిలబడిగిడిగిడి సేసాఁవురో!', 'మల్లయ్యా! మేలుకో' లాంటి జానపద సౌరభాలు, 'దహనదృక్‌భ్రూదేశ!' 'త్రిదివేశనత శీర్షరంజిత చరణదేశ' శంటి ప్రౌఢ వాగ్ధోరణులు... అన్నీ రసాత్మకంగా ప్రవహించే భావధుని స్వీకరించే మెలికలహొయలు.

ఈ 'శివదర్పణం'కి చివర వచ్చిన క్షీరసాగర మథనం - ఒక అపూర్వ గేయామృతసిద్ధి. 'మృత్యువెంతటి ప్రశ్నయో...మర్త్యుడా! బ్రతుకుకూడా అంతటి ప్రశ్నయే' అని ముగుస్తుంది గేయం.

ఆ స్వామిని మచ్చిక చేసుకోవడానికి అన్ని ఉపాయాలనూ ఉపయోగించడమే కవితా సాధనగా... అదే శివసన్నిధికి సోపానక్రమంగా మలచుకోవడం అనే ఒక 'శబ్ద బ్రహ్మోపాసన' ఈ కృతిలో సుస్పష్టమౌతుంది.

''భక్తి మనశ్శాంతిని కలిగించే ఆదమరపు కాదు, ఒకానొక అజ్ఞాతమైన బాధ్యతను తలకెత్తే మేలుకొలుపు'' వంటి వ్యాఖ్యాన వాక్యాలు ఆర్ష భావనలోని ముక్తిపథాల మర్మాన్ని కళ్ల ముందుంచుతాయి, ఆర్షసంస్కృతి వైభవంలోని శాశ్వతత్వం ఇటువంటి ఆర్జవశక్తిగల రచనల వల్ల ఆవిష్కరింపబడుతూనే ఉంటుంది.

- సామవేదం షణ్ముఖశర్మ

# ఆప్తవాక్యం

## సుగా ఋతస్య పంథాః ॥ (ఋగ్వేదం)

## సత్యమార్గం సుఖమయమైనది – సరళమైనది

సత్యంలో ఉన్న సుఖం అసత్యంలో లేదు. స్థూలదృష్టితో చూస్తే అసత్యమే సుఖంగా కనిపించవచ్చు. "ఈరోజుల్లో 'సత్యం' అంటూ కూర్చుంటే లాభం లేదు. అసత్యం వల్లనైనా సరే సుఖపడాలి" అని కపట జీవితాన్ని సమర్థించే లౌకికులు ఉండవచ్చు. కానీ అసత్యం వల్ల చాలా చిక్కులున్నాయి. 'అసత్యం' అంటే నిజాయితీ లేకపోవడం, అవినీతి, (మోసం) కపటం, అధర్మం... అని అనేకార్థాలున్నాయి. వీటితో కూడిన జీవితానికి అడుగడుగునా ప్రమాదాలు పొంచి వుంటాయి. సత్యాన్ని (ధార్మికనైతిక జీవనం) నమ్ముకోవడాన్ని చాదస్తం కింద కొట్టి పారేయడం మంచిది కాదు.

సాధారణంగా ఎవరూ చూడరు కదా అనో, గమనించే వారు లేరనో, ఎప్పటికీ గమనించే అవకాశం లేదనో, అతి త్వరగా ఎంతో సంపాదించేయాలనో – సత్య మార్గాన్ని వదులుతారు. పాపభీతీ, దైవభీతీ కూడా లేక, 'సత్యప్రియుడైన' భగవంతుని ఉనికిని కూడా విస్మరించి మోహంతో, అడ్డదారుల్ని తొక్కుతారు. అయితే ఆ దారిలో వెళ్లేటప్పుడు, మనస్సులో పొంచి వుండే భయాల్ని గమనించడం చాలా ముఖ్యం.

ఎప్పుడు ఏ నిఘా ఉంటుందో, ఎవరికి దొరికిపోతామో అనే భయం సహజంగానే ఉంటుంది.

కాలం అన్ని వేళలా అసత్యానికి అనుకూలంగా వుండదు. దాని స్వభావం సత్యంతో సహజ సాంగత్యమే. తాత్కాలికంగా అసత్యాన్ని సత్యంలా భ్రమింపజేయవచ్చు. కానీ అది కొనసాగదు. ఇది ప్రకృతి నియమం. శాశ్వత నియమం. సృష్టి చక్ర నిర్వహణకు అవసరమైనది ఆ శాశ్వతసత్యమే. దానినే వేదం "ఋతం" అంది. దీనికి మార్పు ఉండదు. దీనిలక్షణం 'ఆనందం'.

కాబట్టి సత్యమార్గ సంచారి తాత్కాలికంగా దుఃఖితునిలా కనిపించవచ్చు. అసత్యవాదిలా తొంతరతొందరగా లౌకిక అభివృద్ధులు సాధించలేకపోవచ్చు. కానీ అతడు శాశ్వతమైన సత్యంతో బంధం ఏర్పరుచుకున్నాడు కనుక, నిజమైన ఆనందానికి దూరం కాడు. అతడికి భయం ఉండదు. ధైర్యానికి లోటుండదు. అతడి చూపులో బెదురుండదు. నిర్భయంగా సుఖంగా జీవితం సాగుతుంది. ఆ సరళమైన జీవనపథం – సత్యమార్గగమనమే. రామచంద్ర ధర్మరాజాదులు అచంచలంగా, అకుంఠితంగా అన్నీ ఓర్చుకొని సత్యమార్గాన్ని అనుసరించి జీవితం సాగించడం చేతనే ఆదర్శ మూర్తులయ్యారు. వేదధర్మానికి సాకార మయ్యారు. దుర్యోధన రావణాదుల పతనాలూ మనకు హెచ్చరికలుగా కనబడుతున్నాయి.

అసత్యమార్గంలో సాధించిన సంపదలో అభద్రత, భీతి వెన్నంటే ఉంటుంది. ఆ జీవితంలో అణువణువునా 'ఆత్మన్యూనతా భావం' (Guity Consciousness) నీడలా వెన్నాడుతూనే ఉంటుంది. అసత్యమార్గగామికి బయటి నుండి శత్రువులక్కర్లేదు, అతడి అంతరాత్మే ప్రథమ శత్రువవుతుంది. ప్రతి దశలో పొడుస్తూనే ఉంటుంది. గోరంతని కొండంతగా చూపిస్తూ భయపెడుతూనే ఉంటుంది. అటువంటి జీవితాలు ఎన్నో మనకు ప్రత్యక్ష ప్రమాణాలుగా కనిపిస్తూనే ఉంటాయి.

ఎంత ఉన్నత పదవుల్లో ఉంటే, అంత ఉన్నతంగా అసత్యాన్ని ఆశ్రయించి, సత్యంగా భ్రమింపజేస్తూ ఎదగవచ్చు. కానీ ఆ అభ్యున్నతి ఏనాటికైనా సర్వనాశనమవుతుందని ఇప్పటికీ ఎందరో పెద్దల పతనగాథలు మనకు తారసపడుతుంటాయి.

సృష్ట్యాదియందే ఈ విశ్వచక్రం సజావుగా నడిచేందుకు కావలసిన ధార్మికసత్యాలను ప్రవచించిన వేదం – సృష్టిలో ప్రతిప్రాణికీ ముఖ్యమైన ఆప్తవాక్యాలను ఇలా ప్రబోధించింది.

ఎన్నికాలాలు మారినా వేదమాతబోధ సార్వకాలీనం, సార్వజనీనం కావడంలో రహస్యమిదే. ✵

**ఎంత సముద్రము మీద ఎగిరిననూ, పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత, ఇది సంప్రదాయము.** – కవిసమ్రాట్ విశ్వనాథ

# MEMBERSHIP FORM

*Please fill in capital letters and mail to...*

RUSHI PEETHAM PUBLICATIONS
'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be a member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) ☐ 3 Years Rs 360/- (US $90) ☐

5 Years Rs 600/- (US $125) ☐ Donations Rs ..........................

Iam paying by cheque/D.D.No............................................drawn on

.................................................................for Rs..........................

date...............Favouring Rushi Peetham Publications.

Name :

Sex : Male ☐ Female ☐ Age ☐

Address :

City : Pin :

Education : School ☐ College ☐ Graduate/Post Graduate ☐

Business ☐ Employed ☐ Retired ☐

P.T.O.

ఋషిపీఠం

Please mention Addresses or E-mail of your Nearest & Dearest who have interest in Rushi Peetham, Bharatheeya Manasa Patrika

1.

2.

3.

4.

5.

6.

7.

8.

9.

10.

11

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

---

Owned & Published by : **UPADRASTA SIVAPRASAD** From From : No.3, Kamarajasalai, Ashok Nagar, Chennai - 600 083.
Printed By : **V.C. Chermakani, Sakthi Process**, No. 21F Kumballamman Koil St., Chennai - 600 081. Edited by : **SAMAVEDAM SHANMUKHA SARMA**

# చలించని దేవాలయాలు



ఇటీవల ఒరిస్సా రాష్ట్రంలో సంభవించిన తుపాను సృష్టించిన బీభత్సం ఇప్పటికీ హృదయ విదారక దృశ్యాలను మిగిల్చింది.

అయితే... ఈ బీభత్స ప్రభావంలో ఆశ్చర్యకరమైన కొన్ని విషయాలు ప్రకటించబడ్డాయి.

అక్కడ టీవీ టవర్లు నేలకూలాయి. విద్యుత్ స్తంభాలు సూదుల్లా రాలిపోయాయి. మహావృక్షాలు కూకటి వ్రేళ్లతో పడిపోయాయి. అనేక కట్టడాలు ధ్వంసమయ్యాయి. కానీ ఎంతో కాలంనాటి పురాతన దేవాలయాలేవీ ఏమాత్రం చెక్కుచెదరలేదు.

క్రీ.శ. 6వ శతాబ్ది 12వ శతాబ్దికి చెందిన దేవాలయాలు కూడా దెబ్బతినలేదు.

కొన్నిచోట్ల అయితే – గంటకు 250 కి.మీ. వేగంతో వీచే పెనుగాలుల్లో సైతం, దేవాలయ గోపురాలపై ఉండే జెండాలు కూడా కదలలేదు.

సముద్ర తీర ప్రాంతాలలో నున్న ఏ దేవాలయాన్నీ ఈ తుఫాను దెబ్బతీయలేకపోయింది.

రాష్ట్ర పురాతత్వ శాఖకి చెందిన అధిపతి శ్రీ బి.కె. రథ్ వివరణలో – ''కేవలం భువనేశ్వర్ మహానగరంలో నున్న పురాతన కాలంనాటి 320 దేవాలయాలు సుస్థిరంగా నిలబడడం ఆశ్చర్యమే. ఈ 'దేవస్థలాలు' నిర్మించబడ్డ ప్రాంతాలు, నిర్మాణ విధానాలు పూర్తిగా సంప్రదాయబద్ధమైన దేవాలయ నిర్మాణ పద్ధతుల్నీ, ఆగమశాస్త్రాన్నీ, వాస్తు నియమాలనీ అనుసరించడం చేత ఇవి ఇంత సుస్థిరమైన నిర్మాణాలుగా నిలవగలిగాయి.

''వీటికి వాడిన రాళ్లు కూడా విలక్షణమైనవి. దీర్ఘకాలం మీద, వీటి ఉపరితలంపై స్వాభావికమైన క్షయం తప్ప ఇంకే విధమైనా క్షతీ ఏర్పడలేదు. మా శాఖకు చెందిన పరిశీలనా నివేదికల ప్రకారం, మరమ్మత్తుల్లో ఉన్న దేవాలయాలు కూడా దెబ్బతినలేదు. తీరప్రాంతంలో మారుమూలల ఉన్న దేవాలయాలు కూడా కదలలేదు.

''తుఫాను దాటికి గురయిన ప్రాంతాలలో మొత్తం 800 దేవాలయాలూ భద్రంగా, సురక్షితంగా ఉన్నాయి. అత్యధికంగా తుఫాను విజృంభణ జరిగిన 'పారాదీప్'లో నున్న పదవ శతాబ్ది నాటి 'పరాశర' దేవాలయం, ఇతర ప్రాంతాలలో నున్న పన్నెండవ శతాబ్ది నాటి మాధవానంద దేవాలయం, లతాహరణ దేవాలయం, గ్రామేశ్వర దేవాలయం వంటివి కూడా ఆశ్చర్యకంగా నిలిచి ఉన్నాయి.''

దేవాలయ నిర్మాణ సమయంలోనే మనవాళ్లు వైదికమైన శాస్త్రాలను ఆధారం చేసుకోవడం వల్లనే ఈ బలమైన కట్టడాలు సాధ్యమయ్యాయని పురాతత్త్వ శాస్త్రవేత్తల అభిప్రాయం. మన సనాతన నిర్మాణ పద్ధతుల్లో శాస్త్రీయతే ప్రధానం. అది లేని ఆధునిక కట్టడాలు పేకమేడల్లా కూలిపోయాయి.

ఇకనైనా మన నిర్మాణ శాస్త్రాన్ని అధ్యయనం చేయాల్సిన బాధ్యత నేటి తరానికి ఉందని, ఈ అనుభవంతో హెచ్చరిస్తున్నారు శాస్త్రవేత్తలు. ఆలయ నిర్మాణాలకు లాగానే సమాజ నిర్మాణానికి కూడా వేద సంస్కృతి బలమైన పునాదులు వేసింది. వాటిని కాదంటే, ఏ ఉపద్రవానికో గురిఅయి, భారతదేశ తేజమే హరించుకుపోయే ప్రమాదముంది.

అయితే ''ఇది ఆ దేవాలయ దైవాల మహిమ'' అని నమస్కరించే వారూ ఉన్నారు. దీనినీ కాదనలేం. దైవం పట్ల అచంచలమైన నమ్మకంతోనే, ఆ దేవాలయ నిర్మాణకర్తలు శ్రమించారు. అంటే దైవవిశ్వాసం, శాస్త్రం రెండూ విభిన్న విషయాలుగా పరిగణించలేదు. పైగా రెండింటి అవినాభావ సంబంధాన్ని కూడా గ్రహించారు. అదీ ఈ దేశ సనాతన శాస్త్రాల విశిష్టత.

ఆ దైవం, ఈ తుపాను బాధితులందరినీ త్వరగా కోలుకొనేలా అనుగ్రహించాలని మనసారా ప్రార్థిద్దాం.

# కైలాస పర్వతే రామ! మనసా నిర్మితం పరం।
# బ్రహ్మణా నరశార్దూల! తేనేదం మానసం సరః॥

*(వాల్మీకి రామాయణం)*



"ఓ రామా! కైలాస పర్వతాన బ్రహ్మమనస్సంకల్పం చేత నిర్మింపబడిన దివ్యమైన సరస్సు 'మానస సరోవరం' అని విశ్వామిత్రుడు శ్రీరామునితో చెప్పాడు.

పృథ్విపై ఉన్న శివస్థానాలలో ప్రముఖమైన హిమాలయ పంక్తులలోనిది ఈ దివ్యకైలాస పర్వతం. అలౌకికమైన కైలాసలోకం 'శివధామం' వేరే ఉంది. మానస సరోవరం తీరాన ఈ కైలాస పర్వతం పుడమిపై శివుని రూపంగానే శాస్త్రాలలో వర్ణించబడింది. కొన్ని కోణాలలో ఓంకారకారంలో గోచరించే అచలమిది.



# నమస్తే

*మండలాంతరగతం హిరణ్మయం*
*భ్రాజమాన వపుషం శుచిస్మితమ్ ।*
*చండదీధితిమఖండితద్యుతిం*
*చింతయేన్మునిసహస్ర సేవితమ్ ॥*



''మండలం (సూర్యమండలం)లో ఉన్నవాడు, బంగారు కాంతులతో ప్రకాశించువాడు, వెలుగులతో నిండిన శరీరం కలవాడు, శుచియైన చిరునవ్వుతో ప్రకాశించువాడు. జాజ్వల్యమానమైన తీవ్ర కాంతులతో తేజ రిల్లుతూ, కొరతలేని తేజంతో దీపించువాడు, వేలకొలది మునుల చేత సేవింపబడేవాడు అయిన సూర్యభగవానుని చింతన చేస్తున్నాను.''

సూర్యమండల మధ్యంలో దీపించే ఆదిత్య భగవానుని స్తుతి ఇది. కాంతులమూర్తియైన సూర్యభగవానుని సర్వదేవతాత్మకునిగా ఆరాధించే సంస్కృతి మనది.

ఋషిపీఠం

ఫిబ్రవరి | 2000

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

ఫిబ్రవరి 2000

సంపుటి 1 సంచిక 7

సంపాదకుడు : సామవేదం షణ్ముఖశర్మ

ప్రచురణకర్త ఉపద్రష్ట శివప్రసాద్

**ధారావాహికలు :**



**బోధన :**



**శీర్షికలు**



**ప్రత్యేక రచనలు :**



గౌరవ పర్యవేక్షణ :
డా. ప్రసాదరాయకులపతి
డా. పినపాటి వీరభద్ర మహదేవ్
డా. పప్పు వేణుగోపాలరావు
సాంగస్వాధ్యాయ వాచస్పతి శ్రీ దెందుకూరి మల్లికార్జునసోమయాజి
శ్రీ యాబలూరు లోకనాథశర్మ
మహా మహోపాసక శ్రీ చెన్నూరు కృష్ణమూర్తి సిద్ధాంతి (అద్దంకి)

సంచాలకులు : సూరి శ్రీవిలాస్
ప్రధాన ప్రచారకులు : ఎస్. వి. ఎస్. లక్ష్మీనారాయణ (గుంటూరు)

ముఖచిత్ర కళాకారుడు : శ్రీ బాపు



చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై-600 017. ఫోన్ : 8281159

# తస్మాత్ ఉత్తిష్ఠ

ఇటీవలి 'హైజాక్' ఉదంతంలో ఒక వర్గం వారి సహజ దౌర్జన్య విధానం మరోమారు విశృంఖలావతారం ధరించింది.

అయితే ఆ హైజాక్ సంఘటనలో - విమానంలోని విదేశీ ప్రయాణికుడు స్విట్జర్లాండ్‌కి చెందిన ప్రముఖ కరెన్సీ ముద్రణ వ్యాపారి 'రాబర్ట్ గియోరీ' టైం పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో భారతీయుల మనోబలం పై అద్భుతమైన వ్యాఖ్య చేశాడు -

''నాకు హిందూమతం అంటే ఏమిటో తెలియదు. కానీ విమానం లోని భారతీయ పౌరులు ఆ ఎనిమిదిరోజుల నిర్బంధంలో వ్యవహరించిన తీరు నాకు ఆశ్చర్యం కలిగించింది. ఆ హైజాక్ ఉదంతం నన్ను పూర్తిగా మార్చివేసింది. ఆ సంక్షోభం సాగినన్నాళ్లూ భారతీయులు నిశ్శబ్దంగా, నిబ్బరంగా ఉన్నారు. చివరికి చిన్న పిల్లలు కూడా ఆదర్శంగా ఉన్నారు. ఇటలీవారో, ఫ్రెంచివారో ఈ విమానంలో ఉంటే పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉండేది'' అని 'గియోరీ' మాటలు.

ఈ గుండె నిబ్బరం మన వాళ్లకెలావచ్చింది? మనదేశస్థులు నరనరాన జీర్ణించుకున్న కర్మసిద్ధాంతం, తాత్త్విక చింతన దీనికి కారణం అనవచ్చు. ఇది సంప్రదాయం. ఇదీ భారతీయత.

''కర్మసిద్ధాంతం'' అనగానే, దీని మూలకంగానే మనం ఎంతో కోల్పోతున్నామని సిద్ధాంతీకరించిన మేధావులూ ఉన్నారు. నిజానికి 'కర్మసిద్ధాంతం' పట్ల అవగాహనలేక పోవడం చేతనే వారీ నిర్ణయానికి వచ్చి ఉంటారు.

''నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్'' కర్మాచరణ లేకుండా ఎవడూ ఒక్కక్షణం కూడా ఉండలేడు అని ఉపనిషత్ చెప్తోంది. కర్మ చేయడం జీవిలక్షణం.

జీవితాన్ని జననమరణ బిందువుల మధ్య గీసిన గీతగా చూడడం పాక్షిక దృష్టి. ఈ రెండు బిందువలకు అవల, ఈవల ఉన్న విషయం ఎంతో!

''ఎలారాసి ఉంటే అలా జరుగుతుంది! దైవ సంకల్పం ఎలా ఉంటే అలా అవుతుంది! 'ప్రారబ్ధం' అనుభవించక తప్పదు!!! ఇటువంటి మాటలు మనలో తరచూ వ్యక్తమవుతుంటాయి. ఇది కర్మపట్ల, కర్తవ్యం పట్ల వైముఖ్యాన్ని నిరాసక్తతని పెంచదు. ఏ అనుభవం కలిగినా దానికి తీవ్రంగా చలించిపోయి, చతికిలబడి, కూలబడి పోకుండా; కొత్తబలంతో ముందుకు పురోగమించడానికి కావలసిన స్థైర్యాన్నిస్తుంది. 'ఈ ఫలితం ఎప్పటిదో నీకు తెలియక పోయినా, ఎప్పడో ఒకప్పుడు నువ్వు చేసిన దానిదే' అనే అవగాహన ఇది. వెనకటి జను ల కగు ుపభావం కూడా మనం అనుభ విస్తున్నాం. ''కర్మాచరణ వల్ల ఒకు ఫలం లభించి తీరుతుంది. ఇప్పటికైనా, ఎప్పటికైనా'' - అని కర్మ పట్ల ప్రేరణని కలిగించేదే మన కర్మ సిద్ధాంతం.

**కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతుర్భూః మాతే సంగోస్త్వకర్మణి ॥**

ఈ ఒక్క శ్లోకాన్ని అర్థం చేసుకుంటే 'కర్మసిద్ధాంతం' అర్థమవుతుంది.

కర్మాచరణపై మనకు పూర్తి అధికారం వుంది. ఫలితంపై లేదు. అంటే ఫలితం లేదని కాదు. దాని స్వరూపాన్ని నువ్వు అంచనా వేయగలవు గానీ, అనుభవించలేవు - అది వచ్చేవరకు. ఆ ఫలం నీ అంచనాకి భిన్నంగా ఉండవచ్చు.

అంతేకాక - ఫలం మీద నువ్వు దృష్టి ఉంచి కర్మ చేయడం వల్ల, కర్మపట్ల ఉండాల్సిన సమగ్ర ఏకాగ్రత ఫలంవైపు కొంత మళ్లుతుంది. ఫలితంగా కర్మలో సమగ్రత లోపిస్తుంది. అలాకాక యథావిధిగా, సంపూర్ణ చిత్తంతో కర్మాచరణ చేయడం వల్ల ఆ కర్మ సర్వసమగ్రమౌతుంది.

కాబట్టే - ''అలాగని కర్మను చేయుట మానరాదు - మా తే సంగోస్త్వకర్మణి'' అని హెచ్చరించాడు జగద్గురువు. ''తస్మాత్ ఉత్తిష్ఠ'' అందువల్ల లేచి యుద్ధం చేయమని బోధించాడు.

అనుకోని అనుభవం ఎదురవగానే, దానిని మనమేమీ చేయలేనప్పుడు మానవప్రయత్నాలన్నీ వ్యర్థమైనప్పుడు మాత్రమే ''కర్మఫలం అనుభవిస్తున్నాం'' అని సమాధానపరచుకుంటాం. దీనివల్ల మరో వ్యక్తిపట్ల శత్రుతాభావం లేకపోవడం, సంయమనం, మనశ్శాంతి, హృదయశక్తి వృద్ధి జరుగుతున్నాయికదా! మనకి సుఖదుఃఖాలిచ్చేవాడు వాటికి కారణం కాదనీ, మన కర్మఫలాన్ని అందించే మాధ్యమం మాత్రమేనని మన వేదాంతం బోధిస్తోంది.

**సుఖస్య దుఃఖస్యనకోపి దాతా । పరో దదాతీతి కుబుద్ధి రేషా ॥**

(సుఖదుఃఖాలకు దాతఎవడూ లేడు. ఎవరో ఇస్తున్నారనుకోవడం సరియైన ఆలోచన కాదు.)

అంటే ఎవరేమి చేసినా పడుండమనీ కాదు. అదే కర్మసిద్ధాంతమైతే, యుద్ధంపట్ల విముఖత చూపించిన అర్జునుని, ''యుద్ధం చేయమని'' ఆదేశించేందుకు 'కర్మసిద్ధాంతమే' ఎందుకు బోధింపబడింది? 'కర్మ' పట్ల అవగాహన కలిగించేందుకే.

''**నియతం కరు కర్మత్వం**'' (నీ కర్తవ్య కర్మనీవు ఆచరించవలసిందే.)

అని కర్మాచరణం పట్ల ప్రబోధం కలిగించాడు గీతాచార్యుడు. గిజిగాని గూడులా అల్లుకున్న కర్మఫలాల సంగతి అవగాహన కావడమే కష్టం.. (గహనా కర్మణోగతిః) అని కూడా సెలవిచ్చాడు.

ప్రకృతి, మన జీవలక్షణం మనల్ని ప్రేరేపించక తప్పదు. ఇంద్రియాల లక్షణమే కర్మను ఆచరించడం. ఇంద్రియాలను శాసించే బు

'మంచికి మంచి, చెడుకి చెడు... ఇదీ ప్రకృతి నియమం. అనివార్యం. ఈ ఫలం ఎప్పటికైనా తప్పదు. కాబట్టి ధర్మాన్ని వీడకు...'' ఇదే కర్మ సిద్ధాంతసారం.

**ఋషిపీఠం**

**ఫిబ్రవరి 2000**

# శివుని ఎనిమిది నామాలు

ముఖచిత్ర కథనం



ఎస్.రామమూర్తి శర్మ

పరాత్పరుడైన సదాశివుని తత్త్వం అనంతం. అపారం.

స్మరణతో, అర్చనతో ఆ భోళాశంకరుని అనుగ్రహం పొంది జీవితాన్ని సుసంపన్నం చేసుకొనే సాధనలనెన్నిటినో మహర్షులు అందజేశారు.

'శివపురాణం'లో సూత పౌరాణికులు శౌనకాది మహర్షులకు నైమిశారణ్యంలో శివ మహిమనీ, లీలలనీ వివరిస్తూ శివతత్త్వాన్ని ప్రతిష్ఠించారు.

ఆ పురాణంలో చెప్పిన ప్రకారం...

శ్రీ వ్యాసదేవుడు శివతత్వ విషయమై సనత్కుమారుని ప్రశ్నించగా, సనత్కుమారుడు వ్యాసునకు శివతత్వ విషయాలను బోధిస్తూ... నైమిశారణ్యంలో బ్రహ్మ ఆజ్ఞ చేత దివ్య తపో దీక్షలు నిర్వహించిన షట్కులముల మహర్షులకు వాయుదేవుడు ప్రత్యక్షమై పాశుపత యోగాన్ని వివరించాడు - అని చెప్పారు.

పాశుపతవ్రత ఫలం సులభంగా అందరికీ అందాలని, వాయుదేవుడు మహిమాన్వితమైన శివుని ఎనిమిది నామాలను చెప్పాడు.

అనంతుడైన శివుని నామాలూ అనంతమే. కానీ మంత్ర రహస్యాలతో కూడిన ఈ ఎనిమిది పేర్లను నిరంతరం మననం చేయడం, వీటితో శివుని అర్చించడం - పాశుపతవ్రతం చేసిన ఫలాన్ని ఇస్తుంది. ఈ వృత్తాంతం 'శివపురాణం - వాయవీయ సంహిత'లో చెప్పబడింది.

ఆ దివ్యనామాలు :

**శివో, మహేశ్వరశ్చైవ**
**రుద్రో, విష్ణుః, పితామహః ।**
**సంసారవైద్యః, సర్వజ్ఞః**
**పరమాత్మా ఇతి ముఖ్యతః ॥**

1. శివాయనమః
2. మహేశ్వరాయ నమః
3. రుద్రాయ నమః
4. విష్ణవే నమః
5. పితామహాయ నమః
6. సంసారవైద్యాయ నమః
7. సర్వజ్ఞాయ నమః
8. పరమాత్మనే నమః

శివః

అతి ఉత్కృష్టమైన నామమిది.

వేదాలసారం. సర్వ శుభములకు పరమ నిధానము - 'శివ'. శాశ్వతమైన, పరమమైన శుభమే 'శివ' శబ్దానికి అర్థం.

**'శివ' ఇత్యక్షర ద్వంద్వం పరబ్రహ్మ ప్రకాశకమ్ ।**
**ముఖ్యవృత్త్యా తదన్యేషాం శబ్దానాం గౌణవృత్తయః ॥**

'శివ' అనే రెండక్షరాల పదం పరబ్రహ్మ తత్త్వాన్ని వెల్లడిస్తుంది. మిగిలిన చంద్రశేఖర, శంకర, శూలి, విరూపాక్ష వంటి నామాలన్నీ శివుని గుణాలను తెలియజేస్తాయి.

శ్రేయసం, శివం, భద్రం, కల్యాణం, మంగళం, శుభమ్ (అమరకోశం)... ఇవన్నీ సమానార్థక పదాలు. అంటే 'శివ' శబ్దానికి శ్రేయస్సు, భద్రం, మంగళం... వంటి అర్థాలున్నాయి.

**'శేరతే ప్రాణినో యత్ర స శివః'** - అని కూడా ఒక అర్థం. సర్వ ప్రాణులకు విశ్రాంతినీ, ఆశ్రయాన్నీ ఇచ్చే శాంతస్థితియే 'శివుడు'.

## మహేశ్వరః

'ఈశ్వరుడు' అంటే ఐశ్వర్యవంతుడు. ఐశ్వర్యములకు నియామకుడు, శాసకుడు, పాలకుడు, ఈశ్వరులందరికీ ఈశ్వరుడు 'మహేశ్వరుడు'. ఈశ్వరుడంటే సదాశివుడే. కనుకనే అయనను మహేశ్వరుడు అన్నారు.

జగమంతా ఆయన మయమే. **'ఈశావాస్య మిదం సర్వమ్'** అని ఉపనిషన్మాత తొలి మాట.

**యో వేదాదౌ స్వరః ప్రోక్తః**
**వేదాంతే చ ప్రతిష్ఠితః।**
**తస్య ప్రకృతి లీనస్య**
**యః పరస్సమహేశ్వరః॥**

వేదములకు ఆదియై, వేదాంతములలోనూ ప్రతిష్ఠితమై, ప్రణవమై, ప్రకృతిలో లీనమై, పురుషుడై, ఆ పురుషుని కంటె పరుడైన (ఉత్కృష్టమైన) తత్త్వమే మహేశ్వరుడు.

## రుద్రః

★ రుద్ర... అంటే 'దుఃఖనాశకుడు' అని అర్థం.

**రుద్దుఃఖం దుఃఖహేతుర్వా**
**తద్ద్రావయతి నః ప్రభుః।**
**రుద్ర ఇత్యుచ్యతే సద్భిః**
**'శివః' పరమకారణమ్॥**

'రుత్'... అంటే దుఃఖం (రోదనం), దుఃఖ కారణం.

వాటిని - ద్రావయతి - నశింపజేస్తాడు కనుక శివుని 'రుద్రుడు' అన్నారు.

★ అంతేకాక - రుతం - వేదశబ్దం బ్రహ్మణే కల్పాదౌ, రాతి - దదాతీతి రుద్రః

కల్పాదిలో బ్రహ్మకు వేదశబ్దాలను ఇచ్చినవాడు రుద్రుడు.

★ 'రుతం' - అంటే నాదం. నాదాంతంలో ఆనంద సుధా స్వరూపంగా అనుభవానికి అందేవాడు 'రుద్రుడు'.

## విష్ణుః

**సర్వం శివమయం జగత్।**

**ఈశావాస్యమిదం సర్వం॥** అనే ఆర్షవాక్యాలు శివుడు ''సర్వ వ్యాపకుడు'' అని తెలియజేస్తున్నాయి.

**శివతత్త్వాది భూమ్యంతం**
**శరీరాది ఘటాదిషు।**
**వ్యాప్యాధితిష్ఠతి శివః**
**తతో 'రుద్ర' ఇతస్తతః॥**

సర్వమునకూ అతీతమైన 'శివతత్వం' మొదలుకొని - శరీరాదులలోనూ సర్వ విశ్వములోనూ వ్యాపించినది శివుడే. ఈ విషయమే 'రుద్రనమకం' స్పష్టం చేసింది.

**''నమో భగవతే రుద్రాయ విష్ణవే''** అని వేదవాక్కు.

''విష్ణు'' అనే శబ్దానికి ''సర్వవ్యాపకుడు'' అని అర్థం. (వేవేష్టివ్యాప్నోతి - విష్ణుః)

సర్వవ్యాపకుడైన కారణంగా శివుని ''విష్ణువు'' అన్నారు.

## పితామహః

'పితామహః' అంటే 'అయ్యలకు అయ్య.'

**జగతః పితృభూతానాం**
**శివోమూర్త్యాత్మనామపి।**
**పితృభావేన సర్వేషాం**
**పితామహ ఇతీరితః॥**

స్థావరజంగమాత్మకమైన జగములకు జనకులు అని చెప్పదగ్గ బ్రహ్మాదులందరికీ జనకుడు (కారణుడు) కనుక శివపరమాత్మను 'పితామహుడు' అన్నారు.

'అయ్యలకు అయ్య' కనుక శివుడు 'పితామహుడు'. ఈ శబ్దానికి 'బ్రహ్మదేవుడు' అని కూడా అర్థం.

ఈ ఐదు నామాలలో మరో ప్రత్యేకత ఉంది.

విశ్వ నిర్వహణకి పంచకృత్యాలు ప్రధానం.

అవి - 1. సృష్టి, 2. స్థితి, 3. సంహారం, 4. తిరోధానం (లయ), 5. అనుగ్రహం (మోక్షప్రదానం). వీటికి క్రమంగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులు - నిర్వాహకులు. ఒకే పరతత్త్వం ఈ ఐదు విధాల అభివ్యక్తులతో పంచకృత్యాలు నిర్వహిస్తోంది. ఆ పరతత్త్వానికే ఈ ఐదు పేర్లు.

ఈ నామాల వల్ల శివకేశవాదుల్లో భేదాలు లేవని స్పష్టమౌతుంది. ప్రతి దైవమూ ఒకే దైవం (పరతత్వం) యొక్క సగుణ, సాకార రూపం. సహస్రనామాలు, అష్టోత్తర శత నామాలూ, ఈ అష్టనామాలూ కూడా ఈ విషయాన్నే ప్రతిపాదిస్తున్నాయి.

## సంసార వైద్యః

**నిదానజ్ఞో యథా వైద్యః**
**రోగస్య వినివర్తకః।**
**ఉపాయైర్భేషజైః**
**తద్వల్లయ భోగాదికారతః॥**
**సంసారస్యేశ్వరో నిత్యం**
**సమూలస్య నివర్తకః।**
**సంసారవైద్య ఇత్యుక్తః**
**సర్వతత్త్వార్థ వేదిభిః॥**

జనన మరణాత్మకమైన జన్మ పరంపరే 'సంసారం'. ఇదే పెద్ద రోగం. నిదానమెరిగిన వైద్యుడు మందులతో, ఉపాయాలతో రోగ

నిర్మూలనం చేయునట్లుగా భక్తులకు సంసార వ్యాధిని పోగొట్టి, కైవల్యాన్ని ప్రసాదించేవాడు కనుక శివుని 'సంసారవైద్యుడు' అన్నారు.

**'ప్రథమో దైవ్యోభిషక్'** - అని శివుని 'వైద్యుని'గా యజుర్వేదం పేర్కొంది.

## సర్వజ్ఞః

**సర్వం జానాతీతి - సర్వజ్ఞః.** సర్వమూ తెలిసినవాడు - సర్వజ్ఞుడు. ఒక్క పరమేశ్వరుడే సర్వజ్ఞుడు. ఇంద్రియాల ద్వారా, మనో బుద్ధుల ద్వారా గ్రహించే జ్ఞానం పరిపూర్ణమైనది కాదు. మూడు కాలాల విషయాలు, సర్వ కారణ తత్వం గ్రహించే శక్తి మాయావృతమైన ఇంద్రియాలకు లేదు. ఇంద్రియాలు లేనిదే కాసింత గ్రహింపు కూడా లేని అస్వతంత్రుడు జీవుడు.

ఏ ఉపకరణమూ అక్కర్లేకుండా సమస్త కాలాన్నీ, విశ్వాన్నీ తెలిసినవాడు శివుడు. కనుక 'సర్వజ్ఞుడు'.

సర్వప్రాణులకు, సర్వమునకు ఆత్మయై, పైన చెప్పిన మహోత్కృష్ట గుణములకు స్థానమైనవాడు కనుక శివుడే 'పరమాత్మ'.

**స్వస్మాత్ పరాత్మ విరహాత్**
**పరమాత్మా శివః స్వయమ్ ॥**

సర్వమునకు ఆత్మయై, తనకంటె పర మైనది లేని కారణం చేత శివుడే 'పరమాత్మ' అని ఋషివాక్కు.

- ఇవీ శివుని ఎనిమిది నామాలు.

**అర్ధనారీశ్వరం దేవం**
**నిర్మలం మధురాకృతిమ్**
**శుద్ధస్పటిక సంకాశం**
**ప్రసన్నం శీతలద్యుతిమ్ ।**
**ధ్యాత్వానామాష్టకేనైవ**
**భావపుష్పైస్సమర్చయేత్ ॥**

'అర్ధనారీశ్వరుడు, నిర్మలుడు, మధుర మైన ఆకృతి కలవాడు, శుద్ధ స్పటికం వలె ప్రకాశించువాడు, ప్రసన్నుడు, చల్లని వెలుగుల వాడు - అయిన సదాశివుని ధ్యానించి, ఈ ఎనిమిది నామాలతో 'భావ' పుష్పాలతో పూజించాలి.

ఈ విధంగా అర్చించడం ఇహపర సాధనం. శివానుగ్రహ సాధనం.

## అర్ధనారీశ్వరుడు

భక్తుల ధ్యానానికై, అనుగ్రహానికై సదాశివుడు తన తత్వాన్ని తెలియజేసే దివ్యరూపాలనెన్నిటినో ధరించాడు.

అందులో అర్ధనారీశ్వర రూపం ఒకటి.

బ్రహ్మదేవుడు జగత్సృష్టి చేసిన తరువాత దీనినెలా కొనసాగించాలి? ఏవిధంగా విస్తృతం చేయాలి? అని తపించి, ధ్యాననిష్ఠలో నున్నాడు. అప్పుడు సదాశివుడు 'అర్ధనారీశ్వరుడు'గా సాక్షాత్కరించాడు.

అంటే జగమంతా 'స్త్రీ పుంస యోగం'తో కూడినది. స్త్రీ పురుషాత్మకంగా ఉన్నదే ఈ ప్రపంచం. ప్రత్యణువూ స్త్రీ పురుషాత్మకమే. ఈ విధమైన అర్ధనారీశ్వర చైతన్యం విశ్వాన వ్యాప్తమై, సృష్టి కొనసాగింపుకీ, విస్తృతికీ కారణమ య్యింది. ఒకే శివుడు తన శక్తితో కలిసి గోచరించే రూపమే 'అర్ధనారీశ్వర రూపం'.

అణువులో, ఋణాత్మక, ధనాత్మక శక్తి సమన్వయం అర్ధనారీశ్వర తత్వమే. ప్రతి స్త్రీ లోనూ, ప్రతి పురుషునిలోనూ... స్త్రీపుం లక్షణం కలిసిన అర్ధనారీశ్వర తత్త్వం ఉంది. అదే శివతత్త్వం.

**'శివశ్శక్త్యాయుక్తో యదిభవతి శక్తః ప్రభవితుమ్'** - అని 'సౌందర్యలహరి'లో ఆదిశంకరుల మొదటి మాట. శక్తిమంతుడైన శివుడే అర్ధనారీశ్వరుడు.

**నమశ్శివాయై చ నమశ్శివాయ** ✦

మహర్షులు - 8



# శ్రుతి - స్మృతి ప్రవర్తకుడు "యాజ్ఞవల్క్యుడు"

వేద ఋషులలో గణ్యమైన స్థానాన్ని అలంక రించినవాడు 'యాజ్ఞవల్క్యుడు'. మహా అధ్యాత్మికవేత్త, యోగి, జ్ఞాని, ధర్మాత్ముడు.

శ్రీమత్ భాగవత కథానుసారంగా - ఈ యాజ్ఞవల్క్యుడు 'దేవరాతు'ని పుత్రుడు. పూరాణోక్తి ప్రకారం - బ్రహ్మదేవుని అవతారమే యాజ్ఞవల్క్యుడు.

వేదమంత్ర ద్రష్టలలో ప్రధానులైన మహర్షులలో ఈయన ఒకడు.

• వైశంపాయనుని శిష్యుడైన యాజ్ఞవల్క్యునికి గురుభక్తి, సేవానిష్ఠ మెండుగానే ఉన్నాయి. వైశంపాయనునికి కూడా యాజ్ఞవల్క్యునిపై ప్రత్యేక వాత్సల్యం ఉంది. కానీ దైవికంగా - ఒకసారి ఈ గురుశిష్యుల మధ్య వివాదం ఏర్పడింది. ఆ కారణంగా యాజ్ఞవల్క్యునిపై గురువు ఆగ్రహించాడు.

అప్పటివరకూ నేర్చుకున్న వేద విద్య నంతా గురుశాప కారణంగా విస్మరించాడు యాజ్ఞవల్క్యుడు. ఆయననుండి వచ్చిన యజుర్వేదీయ విద్యను, 'తిత్తిరి' పక్షుల రూపంలో నున్న ఇతర శిష్యులకు అనుగ్రహించాడు వైశంపాయనుడు. యజుర్వేదంలోని ఆ శాఖను "తైత్తిరీయశాఖ" అంటారు.

గురుశాపానికి గురియై, విద్యను పోగొట్టుకున్న యాజ్ఞవల్క్యుడు వేదనపడి, భక్తి ప్రపత్తులతో సూర్యభగవానుని శరణు వేడాడు. తపోదీక్షతో ఉపాసించాడు.

యాజ్ఞవల్క్యునిపై ప్రసన్నుడైన భాస్కరుడు దర్శనమిచ్చాడు. వేదమయుడైన సూర్యభగవానుని ఆదేశ, ఉపదేశాలమేరకు యాజ్ఞవల్క్యుడు సరస్వతీదేవిని ఉపాసించి - విద్యలన్నింటినీ తిరిగి సంపాదించుకోగలిగాడు.

దేవీ భాగవతంలో యజ్ఞవల్క్యుడు చేసిన 'సరస్వతీస్తోత్రమ్' మహామహిమాన్వితమైన, విద్యాప్రదస్తోత్రంగా ప్రస్తావించబడింది.

**కృపాం కురు జగన్మాతః**
**మామేవం హతతేజసమ్ ।**
**గురుశాపాత్ స్మృతి భ్రష్టం**
**విద్యాహీనం చ దుఃఖితమ్ ॥**

**జ్ఞానం దేహి స్మృతిం విద్యాం**
**శక్తిం శిష్యప్రబోధినీమ్ ।**
**గ్రంథకర్తృత్వ శక్తించ**
**సుశిష్యం సుప్రతిష్ఠతమ్ ॥**

**ప్రతిభాం సత్సభాయాంచ**
**విచారక్షమతాం శుభామ్ ।**
**లుప్తం సర్వం దైవయోగాత్**
**నవీభూతం పునఃకురు ॥**

"జగజ్జననీ! నాయందు కృపచూపించు. గురుశాపం వల్ల స్మృతి గోల్పోయి, తేజస్సు పోగొట్టుకొని, విద్యాహీనుడనై, దుఃఖితుడనయ్యాను. జ్ఞానమును, స్మృతిని, విద్యను, శిష్యులను ప్రబోధించగలిగే శక్తి, గ్రంధ రచన చేయగలిగే శక్తిని, మంచి శిష్యులను, మంచి ప్రతిష్ఠను, ప్రతిభను, సత్సభలలో గౌరవాన్నీ, ఆలోచనా సామర్థ్యాన్ని ప్రసాదించు.

దైవయోగం వల్ల కోల్పోయిన సర్వాన్నీ తిరిగి కొత్తగా నాకు కలిగించు తల్లీ" - అంటూ యాజ్ఞవల్క్యుడు సరస్వతీదేవిని ప్రార్థించి, ఆ అమ్మ దయచేత మేధ, విద్యాశక్తులను సంపాదించాడని - దేవీభాగవత కథనం. సరస్వతీదేవి యాజ్ఞవల్క్యునిపై చూపిన అనుగ్రహ ఫలంగా, సూర్యదేవుడు అశ్వరూపాన్ని ధరించి, యజుర్వేదమంత్రవిద్యను గోచరింపజేసి ఉపదేశించాడు.

అశ్వరూపుడైన సూర్యుని నుండి లభించిన కారణంగా, 'శుక్లయజుర్వేదం'లోని ఒక శాఖను 'వాజసనేయ శాఖ' అనీ, మధ్యాహ్న కాలంలో ప్రాప్తించిన హేతువుగా 'మాధ్యందిన శాఖ' అనీ ప్రసిద్ధి పొందింది.

ఈవిధంగా శుక్ల యజుర్వేదం యాజ్ఞవల్క్య మహర్షి యొక్క దర్శనశక్తి ద్వారా లభించింది. ఈ సంహిత 40 అధ్యాయాలతో ఉన్నది. దీనిననుసరించి చెప్పబడ్డ కర్మకాండ, ఇందులోని మంత్రాలు ఇప్పుడు అధిక భాగం వినియోగింపబడుతున్నాయి. ఈ సంహితలోని 'రుద్రఅష్టాధ్యాయి' పేరుతోనున్న మంత్రముల ద్వారా సదాశివరుద్రభగవానుని ఆరాధన విధానం లభ్యమౌతోంది.

అంతేకాక, ఈ సంహితలోని బ్రాహ్మణ ములభాగం 'శతపథ బ్రాహ్మణం' అనే పేరుతో ప్రసిద్ధి. 'బృహదారణ్య ఉపనిషత్తు' యాజ్ఞవల్క్యుని ద్వారా వచ్చినదే. గార్గి, మైత్రేయి, కాత్యాయని మొదలైన బ్రహ్మవాదినులైన స్త్రీలు యాజ్ఞవల్క్యునితో సాగించిన బ్రహ్మతత్త్వ శాస్త్రార్థ చర్చ, జ్ఞాన విజ్ఞాన చర్చ కూడా ప్రసిద్ధి చెందినదే. విదేహ రాజైన జనకుడు యాజ్ఞవల్క్యుని ద్వారా అధ్యాత్మ తత్త్వ విద్యను స్వీకరించాడు.

వేదభాగమే కాక, యాజ్ఞవల్క్యుని ద్వారా ''యాజ్ఞవల్క్య స్మృతి'' పేరుతో ధర్మశాస్త్ర గ్రంథం రచింపబడింది.

యాజ్ఞవల్క్యుని తల్లి పేరు సునంద. తండ్రిపేరు దేవరాతుడు (బ్రహ్మరాతుడు, యజ్ఞవల్క్యుడు అనికూడ పేరు.) ఆయన పుత్రుడు కనుక 'యాజ్ఞవల్క్యుడు', 'దైవరాతుడు' అనే పేర్లతో ఈయన ప్రసిద్ధుడయ్యాడు.

యాజ్ఞ్యవల్క్యుని భార్య పేరు కాత్యాయని. మిథిలకు దగ్గరలోని అరణ్యాన నివసించే 'కతుడు' అనే మహర్షియొక్క కుమార్తె ఆమె.

''మాఘశుద్ధపూర్ణిమ'' నాడు మునులు, యోగులు కలిసి యోగీంద్రునిగా, యోగీశ్వరునిగా యజ్ఞవల్క్యునికి పట్టాభిషేకం చేశారు. అప్పుడు ఆ మహానుభావుడు బోధించిన పన్నెండధ్యాయాలు 'యోగశాస్త్రం' యోగ విద్యలో ఉత్కృష్ట గ్రంథంగా పేరుపొందింది.

ఇటువంటి తపస్సంపన్నులైన మహర్షుల ద్వారా పరిపుష్టమైన సంస్కృతి మనది. ✦

# ఆచార్యుడు భీష్ముడు

మహాభారతం లోని ప్రధాన పాత్ర భీష్ముడు. ఈ మహేతిహాసానికి నాయకుడు - అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీకృష్ణుడే. ప్రతినాయకుడు ధృతరాష్ట్రుడు.

అష్ట వసువులలో 'ద్యో' అనే వసువు భీష్ముడుగా జన్మించాడు. మిగిలిన ఏడుగురు వసువులలో ఒక్కొక్కరి నుండి 8వ భాగం భీష్మునిలో కలిసింది. ఆవిధంగా ఆయన అష్ట వసువుల సమగ్రరూపమయ్యాడు.

గంగా శంతనుల పుత్రుడైన భీష్ముడు కారణజన్ముడు. అసలు పేరు 'దేవవ్రతుడు'. కానీ తండ్రికి, సత్యవతితో వివాహ నిమిత్తం - తాను అవివాహితుడిగా ఉంటానని భీష్మ ప్రతిజ్ఞ చేసిన కారణంగా 'భీష్ముడ'య్యాడు.

ధర్మదీక్షలో, తపస్సులో కూడా భీష్ముడే. శ్రీకృష్ణుడు - ''భీష్మ తపస్స్వరూపా!'' అని సంబోధించాడు.

భూతభవిష్యద్వర్తమానవేత్త, సమస్త ధర్మస్వరూపుడు - భీష్ముడు. యుద్ధ భూమిలో తొలి పది రోజులూ భీష్ముడు విజృంభించాడు. కృష్ణార్జునులు నరనారాయణులని తెలిసి, వారి సమక్షాన అర్జున బాణాలవల్ల తనువు చాలించాలని సంకల్పించుకున్నాడు. స్వచ్ఛందంగా తనంత తానే రథం నుండి కూలి, ఉత్తరాయణ పుణ్యకాలం వరకూ వేచి ఉన్నాడు.

ద్రుపదునికి కుమార్తెగా జన్మించిన 'శిఖండి', ఒక యక్షుని వల్ల పురుషుడిగా మారాడు. ఒకప్పుడు స్త్రీయై, తరువాత పురుషుడైన వానితో కూడా యుద్ధం చేయనని భీష్మ నియమం. భీష్మునిద్వారా ఈ రహస్యం తెలుసుకొని, పాండవులు శిఖండిని ముందుంచారు. 'శిఖండి' అంటే 'పేడి'వాడు కాదు. గతంలో స్త్రీ, ప్రస్తుతం పురుషుడే. అతడూ యుద్ధంలో యోధుడే. భీష్మునికి మాత్రమే అతడితో పోరాడనని నియమం. పైగా ఈశ్వరవరం వల్ల 'అంబ' - భీష్ముని మృతి కోసం జన్మించింది. కాబట్టి ఆమె జన్మసాఫల్యం కావాలి కదా!

అర్జునుని బాణ పరంపరం శరీరమంతా నాటుకున్న భీష్ముడు రథం నుండి నేల కూలాడు. అతని శరీరంలో నాటిన బాణాలే అతడికి శయ్యగా మారాయి. (అంతేగానీ - అర్జునుని బాణాలతో శయ్య ఏర్పరచలేదు). కేవలం తలభాగానికి దిండు కావాలనీ, అదీ దివ్యమైన అస్త్రాలతో కావాలని, అర్జునునితో చెప్పాడు భీష్ముడు. తపస్సంపన్నుడైన అర్జునుడు, దివ్యాస్త్రాలతో మెత్తని దిండులా అమరేలా బాణాలు వేశాడు. ఆ తరువాత,



తాతగారి కోరికపై, భూగర్భం నుండి దివ్య జలాలను, పర్జన్యమంత్రపూతమైన తేజోమయాస్త్రంతో వెలికితీసి, దాహార్తిని తీర్చాడు విజయుడు.

శ్రీకృష్ణుని ఆనతిపై, ధర్మరాజాదులకు అనేక ధర్మాలను ఉపదేశించి, శ్రీవిష్ణుసహస్రం, అనుస్మృతి, భీష్మస్తవరాజం వంటివి అనుగ్రహించి (అదీ సాక్షాత్తూ పరమాత్ముని సన్నిధిలో) జగత్తుకే ఆచార్యుడయ్యాడు భీష్మపితామహుడు.

ఉత్తరాయణ పుణ్యవేళ మాఘ మాసంలో శుద్ధ అష్టమినాడు శ్రీకృష్ణ పరమాత్మలో లీనమయ్యాడు ఆ మహాయోగి.✦



# వాగ్గేయ వైభవం

పల్లవి:

నాదతనుమనిశం శంకరం

నమామి మే మనసా శిరసా ...

అనుపల్లవి:

మోదకరనిగమోత్తమ సామ-

వేదసారం వారం వారం

చరణం:

సద్యోజాతాది పంచవక్త్రజ

సరిగమపదని వరసప్తస్వర

విద్యాలోలం విదళితకాలం

విమలహృదయత్యాగరాజపాలం



ఇది 'నాదోపాసక చక్రవర్తి' త్యాగరాజ స్వామి రచించిన కృతి. వేదహృదయం తెలిసిన మహర్షికనుక త్యాగరాజస్వామివారు శివకేశవులను ఏకతత్త్వంగా ఉపాసించారు.

సర్వసృష్టికీ, సంగీతానికీ మూలమైన నాదమే శివుని స్వరూపం అని శాస్త్రాలు స్పష్టం చేశాయి. 'ఓం'కారానికి కూడా మూలమైన అవ్యక్తనాదం శివుని తొలిరూపం. 'ఓం'కారం శివుని వ్యక్తరూపం.

నాదరూపః సదాశివః - అనే ఋషి వాక్యాన్ని స్వానుభవంలోకి తెచ్చుకొని, ఆ నాద శరీరుని దర్శించి, సంగీతాన్ని నాదోపాసనగా చేసి తరించిన మహాయోగి త్యాగయ్య ఈ కృతిలో నాదశరీరుడైన శివుని కీర్తించారు.

నాదతనుం – నాదశరీరుని, శంకరం – శంకరుని; అనిశం – ఎల్లప్పుడూ; మే మనసా శిరసా – నా మనస్సుతో శిరస్సుతో; నమామి – నమస్కరిస్తున్నాను.

మోదకరనిగమోత్తమ – ఆనందదాయకమై, వేదాలలోకెల్లా ఉత్తమమైన; సామవేద సారం – సామవేదము యొక్క సారమైన నాదమే శరీరమైన శంకరుని; వారం వారం – మాటి మాటికీ - నమామి.

'వేదానాం సామవేదోస్మి' ''వేదములలో సామవేదమునునేను'' - అని శ్రీకృష్ణుని వచనం.

శుద్ధనాదం యొక్క రూపాంతరాలన్నీ సామవేదంలోనే ప్రస్తరించబడ్డాయి.

సద్యోజాతాది పంచవక్త్రజ – సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన... అనేవి శివుని అయిదు ముఖాల పేర్లు. ఆ ముఖాల నుండి జనించిన; సరిగమపదని వరసప్తస్వర విద్యాలోలం – స, రి, గ, మ, ప, ద, ని అనే ఏడుస్వరాల సంగీత విద్యకు లోలుడూ;

విదళితకాలం – కాలుని (యముని) ఓడించిన వాడూ;

విమలహృదయత్యాగరాజపాలం – విమలహృదయుడైన త్యాగరాజుని పాలించే వాడు అయిన సదాశివుని నమస్కరిస్తున్నాను.

శివుడే నాదస్వరూపుడని తెలిసి, నాదాత్మకంగా సదాశివుని ఉపాసించిన వారు, కాలుని భయమందక, అమృత స్థితిని పొందుతారని వేదవచనం.

ఆ నాదంలోనే సర్వదేవతలనూ దర్శించిన త్యాగరాజు, సంగీత శాస్త్రరహస్యాలను తెలియజేసే ఇటువంటి కృతులు చాలా రచించారు. ✦



# ఉభయభారతి

## విశ్వనాథ పావనిశాస్త్రి

### జరిగిన కథ

మాహిష్మతీ నగర నివాసి, పూర్వమీమాంసాశాస్త్రనిధి మండన మిశ్రుడు. ఆయన భార్య ఉభయభారతి. ఆయనతో వాదనకు ఆదిశంకరులు రానున్నారని తెలుస్తుంది.

సమరసేనుడనే వ్యాపారికి, సన్యాస వేషధారియైన ఒక వ్యక్తి నర్మదా తీరంలో కనబడతాడు. ఆయనను చూసి ఆశ్చర్యపోయిన సమరసేనుడు ''దుర్జయా'' అని కేకవేసాడు.

**ధారావాహిక నవల**

దుర్జయుడొక పెద్ద బందిపోటు దొంగ.

ఏ రాజుకీ చిక్కని జిత్తులమారి.

ఏ సమాచారం ఎలా సేకరిస్తాడో, ఏ దారి ఎలా కాస్తాడో – అంతు చిక్కడు. నేల దొంగల్లోనూ, ఓడ దొంగల్లోనూ అతడి శిష్యులు కొమ్ములు తిరిగిన వారెందరో ఉన్నారు.

అతడి పేరు చెపితే ధనవంతులికి దిగులు, రాజపురుషులికి పొగులు. అడవి దున్నని అరచేతులతో ఆపగల అసహాయశూరుడు. అంతటి ఖడ్గవీరుడు శాతకర్ణుల సైన్యంలో కూడా లేడని ప్రతీతి. కోపం వచ్చిందా వెనక ముందులాలోచించని మహా సాహసి, పరమ క్రూరుడు.

అయితే మహాధనవంతుల్ని తప్ప సామాన్యులను దోచడు. సమరసేనుడివంటి యిద్దరు ముగ్గురు తప్ప అతని ముఖం చూసిన వాళ్ళెవరూ బయటి ప్రపంచంలో లేరు. అతడే దుర్జయుడని నిరూపించే సాక్ష్యాలూ లేవు.

అనేకమంది మహారాజులతో స్నేహ సంబంధాలుగల సమర సేనుడే అతడి ధాటికి దడిసి–తన రథాల జోలికీ, ఓడల జోలికీ రాకుండా అతగాడితో ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఒప్పందం ప్రకారం వార్షికాలు అందిస్తూ ఉంటాడు. అలాంటి దుర్జయుడు, యిలా సన్యాసి వేషంలో, సంస్కృత శ్లోకాలు చదువుతూ కనబడటం – సమరసేనుడికి ఆశ్చర్యం కలిగించింది. ఆ ఆశ్చర్యంతోనే అప్రయత్నంగా 'దుర్జయా!' అని కేకవేశాడు. కేకవేసి అతడి దగ్గరికి నడిచాడు.

తల తిప్పిన ఆ సన్యాసి చిఱునవ్వుతో నిలబడి, ''ఓహో, సమరసేనుల వారా! క్షమించాలి. నేనిప్పుడు ఆశ్రమవాసిని, గృహస్థులైన మీకు నమస్కరించకూడదు. అన్యథా భావించకండి. అంతా క్షేమమా?'' అన్నాడు.

ఒక్క క్షణం విస్తుపోయిన సమరసేనుడు తేరుకుని, విరగబడి

నవ్వుతూ, ''చాలు దుర్జయా, చాలు! పరిహాసాలు చాలుగాని, ఎప్పుడూ లేనిది ఏమిటీ కొత్త వేషం?! ఈ సమయంలో ఈ దారి వెంబడి ఏ రాజపరి వారమూ రావడంలేదే?! పెద్ద పెద్ద వర్తకుల బిడారులంతకుముందే లేవు. లేక, నాకు కూడా అందని రహస్య సమాచారం ఏదైనా సేకరించావా?...'' అని ఒక్క క్షణం ఆగి, ఓరగా చూస్తూ,''అన్నట్టు ఈ ఏడాది నేను నీకివ్వవలసిన వార్షికానికి యింకా సమయమున్నట్టుంది కదూ!'' అన్నాడు.



ఆ మాటలు విన్న దుర్జయుడు నిశ్చలంగా చూస్తూ, ''ఆర్య సమరసేనా! నాకు దొంగతనాలేగాని, దొంగ వేషాలు తెలియవు. ఆ విషయం మీకూ తెలుసు. అయినా నా దొంగతనాలూ, దుర్మార్గాలూ, అనుచరులూ అంతా ఒక పీడకల. మరచిపొండి. తమరు నాకిక వార్షికాలు పంపనక్కరలేదు. తమ రథాల జోలికిగాని, ఓడల జోలికిగాని రాను'' అన్నాడు.

''ఆఁ!'' అంటూ సమరసేనుడు నివ్వెరపోయాడు

''నా వంటిదే అయిన ఈ లోకంలో నేను దేనిని దోచుకుంటున్నాను? ఇదంతా భ్రమ!'' అన్నాడు దుర్జయుడు మరింత నిశ్చయంగా.

నివ్వెరపోయిన సమరసేనుడు, ''ఏమిటి యితగాడిలో ఈ మార్పు? యిదంతా నిజమే!?'' అని తనలో తాను గొణుక్కుంటుగా పైకే అన్నాడు.

దుర్జయుడు చిఱునవ్వుతో, ''పరబ్రహ్మ స్వరూపులైన శ్రీ శంకరభగవత్పాదుల కృపవలన యీ భ్రమ అంతా నిజం!'' అని అన్నాడు.

తేరుకున్న సమరసేనుడు దుర్జయుడి వైపు నిశితంగా చూడసాగాడు. అతని మాటలోగాని, ముఖంలోగాని ఎక్కడా జంకులేదు,

గొంకు లేదు. బొంకు అంతకుముందే లేదు. ఇదివరకు అతడు మాట్లాడుతూంటే, వినేవాడికి భయం వేసేది. భయం యిప్పుడూ వేస్తోంది. కాని; ఆ భయానికీ, ఈ భయానికీ తేడా వుంది. పూర్వపు భయంలో-ఒక కిరాతకుడితోనో, మూర్ఖుడైన ఒక మహా రాజుతోనో మాట్లాడేటప్పుడు కలిగే భయం లాంటి భయం ఉండేది. ఇప్పటి భయంలో - మహామేధావి యైన బాల్యమిత్రుడితో మాట్లాడు తూంటే కలిగే భయం లాటి భయం ఉంది. ఇది భయమా? కాదు. కాదా అంటే, ఏమో, అలాగే ఉంది. బాల్య మిత్రుడి యందు భయం ఉండదు గదా! స్నేహం ఉంటుంది, చనువు ఉంటుంది, పరిహాసం ఉంటుంది. కాని గొప్ప విద్యావేత్త, మేధావి అయిన బాల్య మిత్రుడియందు స్నేహమూ చనువులతోపాటు-పరిహాస స్థానంలో ఒక గౌరవం ఉంటుంది. ఆ గౌరవం ఒకవిధమైన భయంలాంటిది. అది ధన ప్రాణ మానస్త్రీ హానిగతమైన భయం కాదు. మనలోని మేధాశక్తి యొక్క పదునుకి సంబంధించిన భయం.

ఈ సమయంలో సమరసేనుడికి దుర్జయుడియందు అటువంటి భయం కలిగింది. ఆలోచిస్తున్న సమరసేనుడు

## శంకరశ్శంకరః సాక్షాత్

**ముక్త్వామౌనం వటవిటపినో**
**మూలతోనిష్పతంతీ ।**
**శంభోర్మూర్తిః చరతి**
**భువనే శంకరాచార్యరూపా ॥**

''వటవృక్ష మూలంలో కూర్చొని, తలలు పండిన బ్రహ్మవేత్తలకు మౌనంతోనే బ్రహ్మజ్ఞానం కలిగించిన ఆదిగురుమూర్తి సదాశివుడు దక్షిణామూర్తి.

ఆ దక్షిణామూర్తి రూపమే మౌనం వదలి, మర్రిమాను మొదలును విడిచి భూమిపై తిరిగి, జ్ఞానప్రకాశాన్ని అనుగ్రహించిన ఆదిశంకరులు''.

తటాలున, ''ఎవరయ్యా ఈ శంకరుడు? ఇతగాడి గురించి చాలా విన్నానీమధ్య! నీ వంటివాణ్ణి కూడా బుట్టలో వేసుకోగలిగాడంటే నిజంగానే మహా గొప్ప దొంగ సన్యాసి అయి ఉండాలి'' అన్నాడు.

అటువంటి భయం కలిగిన తర్వాత యిటువంటి మాటలు మాట్లాడటం కష్టం. కాని ధనమదం ఉందే, అది ఎటువంటి మాటలనైనా మాట్లాడిస్తుంది. దానికి అలౌకిక భయం ఉండదు.

మామూలుగా దుర్జయుడు యిటువంటి మాటల్ని సహించడు. కాని అతడిప్పుడు వెనకటి దుర్జయుడు కాదు! దుర్జయాశ్రమగిరి!

చిఱునవ్వు నవ్వుతూ, ''సమరసేన మహాశయా! దైవం పేరిట వేదాంత బోధ చేసేవారంతా మోసగాళ్ళేనా? దైవం లేదని చెపుతూ మోసం చేసేవాళ్ళు లేరా? మోసకారులనే వాళ్ళు ఆస్తికులూకారు, నాస్తికులూ కారు. వాళ్ళు వేరే జాతి. అయినా తత్త్వం తెలిసే దాకా అంతా మోసం చేసేవారే, మోసపోయేవారే!'' అన్నాడు దుర్జయాశ్రమగిరి.

ఆ మాటలకు సమరసేనుడు అసహనంగా ''చూడు దుర్జయా! నువ్వు నీ బలం ప్రదర్శిస్తే నేను చెప్పలేనుగాని, ఈ బూటకపు మాటలతో నన్ను గెలవలేవు. నీకు చేతనైతే, దేవుడున్నాడని నువు నమ్మితే, నాకు చూపించు'' అన్నాడు.

దుర్జయాశ్రమగిరి మెరిసే కళ్ళతో సమరసేనుణ్ణి ఒక్క క్షణం నిదానించి చూశాడు.

ఆ క్షణంలోనే సమరసేనుడు, ''చూశావా! దేవుణ్ణి చూపించమనేటప్పటికి నీకు మాటపడిపోయింది. ఎందుకంటే, ఆ దేవుణ్ణి నువు చూడలేదు, నాకు చూపించలేవు'' అని నవ్వుతూ లవణగుప్తుణ్ణి చూశాడు.

లవణగుప్తుడు, ''ఔనౌను. ఇతగాడు కాదుకదా, ఇతగాడి గురువు కూడా చూపించలేడు. అసలు ఆ దేవుడనేవాడు ఉంటేకదా, వీళ్ళు చూపించడానికి!'' అని మరో నవ్వు నవ్వాడు.

ఇద్దరినీ పసివాళ్ళను చూసినట్టుగా ఓ చూపు చూసిన దుర్జయాశ్రమగిరి మరింతగా నవ్వుతూ,'' లవణగుప్తా! నా గురువు ప్రసక్తి తెచ్చావు కాబట్టి చెపుతున్నాను. అదిగో, ఆ నది పాయ

# ‘శంకరుల పరకాయ ప్రవేశం’ పై కొన్ని సందేహాలు

‘‘ఉభయ భారతి’’ నవల ప్రారంభసంచిక చదివాను. ఈ పరకాయ ప్రవేశ కథను నేను బహుశా ఏడెనిమిదేళ్ల వయస్సులో విని ఉంటాను. పరకాయ ప్రవేశమంటే ఉత్సుకత కలిగింది. శంకరుడో మంత్రశాస్త్రవేత్త అనే భావం మాత్రమే కలిగింది. మిగతా విషయాల వివరం తెలిసే వయస్సు కాదది.

కాలక్రమేణ పెద్దలవద్ద శంకరుల గ్రంథాలు అధ్యయనం చేసే అవకాశం కలిగింది. వారిని ఇంకా ఇంకా చదువుతుంటే వారు మనస్సు కందనంత మహోన్నతులుగా నిలుస్తున్నారు. వారు అలా ‘‘అప్రాప్య మనసా సహ’’ లై పోతున్నప్పటినుండీ ఈ పరకాయ ప్రవేశ కథ పేలవంగా అనిపించడం మొదలు పెట్టింది.

విద్యారణ్య కృతమని ప్రచారం చేయబడుతున్న ‘‘అభినవ కాళిదాసు’’ మాధవీయ శంకర విజయంలో మండన మిశ్రులవారి ప్రవర్తన మొదలైన కొన్ని విషయాలు విడ్డూరంగా తోచాయి. వెలితిగా అనిపించాయి. మహోన్నతులైన మనీషుల నడుమ జరిగే సంభాషణలో ఔచితి లేని హాస్యాన్ని జోడిస్తే అది అవహేళనగా మారే అవకాశం ఉంది. ఈ కథలో నా మనస్సును బాధపరచిన అంశాలు కొన్ని ఈ క్రింద మనవి చేస్తాను.

కుమారిలభట్టు, పూర్వమున్న అనేక దుర్మతాలను ఖండించి మీమాంసా మతాన్ని సుష్ఠుపరచారు. మీమాంసను మెరుగుపరచి మీమాంసకులలో తలమానికమైన మండనమిశ్రుని వద్దకు వచ్చారు. ఆయన అద్వైతము యొక్క పరమోత్కృష్టత గుర్తింపజేయడానికి ఈ వాదము ఉద్దేశించబడినది – తమ తమ వాదములలో సరమోత్కృష్టులు అయిన వీరి నడుమ న్యాయమూర్తి నిష్పాక్షికంగా ఉండాలి. ఇద్దరూ ‘‘సరస్వతి’’ యొక్క వైభవాన్ని ఒప్పుకొని న్యాయనిర్ణేతగా వరించారు. మండనమిశ్రుడు ఓడిపోయినట్లు ఆమె నిర్ణయించారు. ఆయన అద్వైత సంప్రదాయంలో సన్యాసం స్వీకరించారు.

అంతా అయిపోయిన తరువాత న్యాయమూర్తి అయిన సరస వాణి వాదానికి దిగడమేమిటి? [illegible] చర్చించక ఈ కామశాస్త్ర పరీక్ష ఏమిటి? శంకరులు వచ్చింది సర్వజ్ఞత్వ నిర్ణయానికి కాదే? ఆయన తాను సర్వజ్ఞుడనని ఎక్కడా చెప్పుకోలేదు. ఒకవేళ సర్వజ్ఞ శబ్దం వాడినా ఆయన ఉభయభారతి వాడే అర్థంలో వాడలేదు. ఉభయభారతి సూచించిన అర్థంలో సర్వజ్ఞత్వం అసలు ఎవరికైనా సాధ్యపడుతుందా?

శంకరులు సర్వజ్ఞ శబ్దాన్ని బ్రహ్మశబ్దానికి పర్యాయవాచిగా వాడారు. ‘‘బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి’’ అనే ఉపనిషత్సూత్రాన్ని అనుసరించి జ్ఞాని సర్వజ్ఞుడవుతాడు. ఏ ఎఱుక కలిగితే ప్రపంచంలోని మిగతా ఎఱుకల అవసరం లేదో అట్టి ఎఱుక సర్వజ్ఞత్వము. అట్టి ఎఱుక కలిగినవాడు సర్వ విషయాలు ఎఱిగిన వాడవుతున్నాడు. అట్టి జ్ఞాని అయిన శంకరులకు కామశాస్త్రాభ్యాసం కోసం పరకాయ ప్రవేశం చేసే గతి పట్టించారే. పోనీ ఆ శంకర విజయాలే శంకరులకు దివ్యదృష్టి ఉందని చెబుతున్నాయి కదా. అదేదో ఆ దృష్టితో చూసి చెబితే సరి పోయేది కదా!

‘శంకర విజయ’ కారులు ఇంకొంచెం ముందుకు పోయారు. కాశ్మీరులో సర్వజ్ఞ పీఠాధిరోహణ ఘట్టం. అక్కడి పండితులతో పాటు సరస్వతీ దేవి కూడా ప్రశ్నించడం మొదలుపెట్టింది. ఆమె కూడా కామశాస్త్రాన్ని వదలలేదు. శంకరులు, అంతకుముందే పరకాయ ప్రవేశం చేసి ఉన్నారు కదా! దివ్యమైన సమాధానాలిచ్చారు. అందరూ నిమిత్తమాత్రులైపోయారు. అప్పుడు అశరీరవాణియో, నిజమైన వాణియో గుర్తులేదు కానీ ‘‘సన్యాసివై యుండి సంసారపు చేష్టలన్నీ చేసి అపవిత్రుడైపోయావు, సర్వజ్ఞ పీఠానికి అనర్హుడవు’’ అని అభ్యంతర పెట్టారట. శంకరుడు ధైర్యంగా ‘‘నేనీ శరీరంతో తప్పేమీ చేయలేదని. సమర్థించుకొని సర్వజ్ఞపీఠ మెక్కారట. అదృష్టవంతులు. అక్కడ చండాల వేషధారియైన పరమశివుడంటే ఇంకో వంద ప్రశ్నలు సంధించేవారు.

ఈ కథ చాలాకాలంగా శంకర విజయాల ద్వారా ప్రచారం చేయబడింది. అనేకమంది ఋషితుల్యులైన మహానుభావులు ఏ కారణాల చేతనో తూష్ణీం భావము వహించారు. అలాటి విషయంపై ‘‘జరిగి ఉండదు’’ అని వ్యాఖ్యానం చేసే అధికారం నాకెవరిచ్చారు? అయితే కవి అన్నవాడు ప్రధాన కథకు భంగం కలగకుండా చమత్కారంగా ఔచితీ పోషణ చేయాల్సి ఉంది. లోకానికి చింత కలిగించే విషయాలను రసవత్తరంగా మలచుకోవాలి. పావనిశాస్త్రిగారు మంచి చమత్కారి. తమ నవలా ప్రబంధంలో శృంగార లీలలలోని అద్వైత పరమార్థాన్ని సమర్థించడంలో కృతకృత్యులవుతారని – తన పేరున కొన్ని కథలు జోడించినా, చివరికి ద్వైత చరిత్రలలో రాక్షసుడన్నా, నిశ్చలులై, నిర్గుణులై, నిష్క్రియులై ఉన్న శంకరులను ప్రార్థిస్తున్నాను.

– చల్లా విశ్వనాథశాస్త్రి

దగ్గర, యిసుక తిన్నెల మీద కూర్చుని, శివార్చన చేస్తున్నాడు నా గురువు. మీ కంత తీరికా, ఓపికా ఉంటే నా వెంట యిప్పుడే రావచ్చు. ఆయన మీకు జ్ఞానబోధ చెయ్యగలడు'' అని ఒడ్డు దిగి గబగబా నదిలోకి నడక ప్రారంభించాడు.

ఒక్క క్షణం సందేహించినా, ఆత్మాభిమానం అడ్డం తగిలి, పట్టుదలతో వారూ అతని వెంట బయలుదేరారు. వారి వెంట ఒక సారథీ, ఒక అనుచరుడూ కూడా బయల్దేరారు. మిగిలిన ముగ్గురూ రథం దగ్గర ఉండిపోయారు.

★ ★ ★

నర్మద కొన్నిచోట్ల చీల మండల లోతు ప్రవాహంతో, క్రింది యిసక కనిపిస్తూ, పల్చని చీరలోని పచ్చని వన్నెలాడిలా ఉంది. ఇంక కొన్నిచోట్ల, లోతుగా కోసిన ప్రవాహంతో, ఏమరుపాటున కాలువేస్తే వ్యసనపు లోతుల్లోకి పీకదాకా పడవేసే మాయలాడిలా ఉంది. మరికొన్నిచోట్ల ఇసకపేర్చి, 'ఏముంది యిందులో' అంటూ నగ్నంగా నిలిచి విరాగంగా నవ్వుతున్న నారీమణిలా ఉంది.

సమరసేనుడావేశంతోనూ, లవణగుప్తుడు ఉత్సాహంగానూ నడుస్తున్నారు. వాళ్ళు ఎంత వేగంగా నడుస్తున్నప్పటికీ, దుర్జయా శ్రముడి వేగాన్ని అందుకోలేకపోతున్నారు. వాళ్ళు సుకుమారులు, నిత్యభోగులు! దుర్జయాశ్రముడు పూర్వం పర్వతనివాసి, యిప్పుడు గిర్యాశ్రమి!

అలా యిసకలో కొంతదూరం నడిచి, అక్కడ నిలబడిన కొందరు సన్యాసులలో కలిసిపోయాడు దుర్జయాశ్రమగిరి. తర్వాత కొంతసేపటికి సమరసేన లవణగుప్తులు వాళ్ళని సమీపించారు.

అక్కడ చుట్టూ అందరూ నిలబడి ఉండగా, ఆజాను బాహువైన ఒక యువకుడు కూర్చుని ఉన్నాడు. అతడు యువకుడు కూడా కాదు. బాల్య యౌవనదశాసంధిలో ఉన్న ఒక కుఱ్ఱవాడు. ఎఱ్ఱగా ఉన్న ఆ కుఱ్ఱవాడు, కాషాయంబరాలు కట్టుకుని ఉన్నాడు. శివస్తుతి చేస్తూ చంద్రమౌళీశ్వర లింగంపై మల్లికా కుసుమాలు చల్లుతున్నాడు. ఇసకలో గుచ్చిన దండం గాలికి సన్నగా కదులుతూ - మసక వెలుతురులో తోకమీద నిలిచిన త్రాచులా కనిపిస్తోంది.

పరమ తేజశ్శాలియైన ఆ బాలసన్యాసి విసురుతున్న పూలల్లోది ఏ పువ్వన్నా పొరపాటున తనదాకే రాదేమోనన్న భయంతో, ప్రతిసారీ శివలింగమే ముందుకి వంగుతున్నట్టుగా భ్రాంతి కలుగుతోంది.

ఆ దృశ్యానికి చలించిపోయిన లవణగుప్తుడు తనకు తెలియకుండానే-

**పరిమళించు తేజము**
**తా వికసించిన కుసుమమై**
**నిను చేరదన్న భయమా?!**
**అది భక్తి పరాధీనమౌ**
**శిరసువంచు గుణమా?!**
**మరి సహజమైన శివమా?!-**

అంటూ ఒక చిన్న భావగీతిక ఆలపించాడు. అందులోని సుకుమార భావానికి 'ఆహా!' అన్నాడు సమరసేనుడు. అన్న తర్వాత యిద్దరూ ఆశ్చర్యపోయారు. ఇలాటి భావం రావడం, దానికి ఆనందించడం తమ జన్మలో యిది వరకు లేదు. విరుద్ధమైన ఈ స్పందన ఎక్కడిది, ఎలా వచ్చింది? ఆశ్చర్యంగా ఉందే! ఈ సన్యాసి ఎవడో మాంత్రికుడిలాగా ఉన్నాడు.

మాంత్రికుడనే ఊహ రాగానే మరీ మతిపోయింది సమరసేనుడికి. 'ఛీ ఛీ' అనుకున్నాడు.

ఆవేశంగా మరి నాలుగడుగులు ముందుకి వేసి, అందరినీ ఉద్దేశిస్తూ, ''ఈ కుఱ్ఱవాడా మీ కందరికీ గురువు? నిస్సందేహంగా మీ కందరికీ మతులు పోయినాయి. లేకపోతే ఏమిటిది? కోరికలే సరిగా వికసించని ఈ వయస్సులో యితనికి ఈ సన్యాసం ఏమిటి? ఈ గురువు వేషం ఏమిటి? ఇదంతా యితగాడిని అడ్డం పెట్టుకుని మీరాడుతున్న నాటకం. సంఘాన్ని దోచుకోవాలని, సోమరులైన మీరు ఆడుతున్న బూటకం''. అని విజృంభించసాగాడు.

దుర్జయాశ్రమగిరి అతన్ని మధ్యలోనే అడ్డుకుని, ఆ కుఱ్ఱవాడితో, ''గురువర్యా! ఇతడు సమరసేనుడు. మాహిష్మతీ నివాసి. కోట్లకు పడగలెత్తిన గొప్ప వ్యాపారి. భూపతులతో కూడా భుజాలు రాసుకు తిరగగల భూలోక కుబేరుడు. సముద్రవర్తకం యితనికొక హేల. దేవుడుంటే చూపించమంటాడు. ఆ ప్రక్కనున్నది అతని మిత్రుడు లవణగుప్తుడు. పాళీభాషలో గొప్ప కవి'' అని

# ''పద్మపాదుడు''

భారతదేశపు దార్శనికులందరిలోకి గొప్పవారు శంకరాచార్యులవారు. శంకరులు గోవిందయతి శిష్యులు. గోవింద యతి గౌడపాదులవారి శిష్యులు. గౌడపాదాచార్యుల 'మాండూక్య కారిక'కు శంకరులు వ్రాసిన వ్యాఖ్యానం సుప్రసిద్ధమైనది. తిరుగులేని తర్కంతోనూ రమ్యమైన ప్రసన్నశైలిలోనూ శంకరులు, వేదాంత తత్త్వాన్ని ఖచ్చితంగా అద్వైత (రెండు కానటువంటి, ఏకేశ్వరతత్త్వ) పరంగా వ్యాఖ్యానించారు. ఈ మహాద్వైతి భక్తిపరమైన స్తోత్రాలు కూడా రచించారు. అమ్మవారిని ఉద్దేశించి వీరు చెప్పిన 'దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రం'లో మకుటం ఇలా ఉంటుంది - ''కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి'' దుర్మార్గులైన కొడుకులు ఎందరో ఉన్నప్పటికీ దుర్మార్గులైన తల్లి, ఎక్కడా ఉండదు.

శంకరుల శిష్యుడైన సనందనుడు 'బ్రహ్మ సూత్రా'లకు (వేదాంత తత్త్వం) భాష్యం రాశాడు. దాని వ్రాతప్రతి అగ్నికి ఆహుతి అయిపోగానే (దాన్ని ఒక్కసారి తిలకించిన) శంకరులు, దాంట్లో ఉన్న ప్రతిమాటా తిరిగి శిష్యుడికి అప్పచెప్పారు. 'పంచపాదిక' అన్న పేర ప్రసిద్ధమైన ఈ గ్రంథాన్ని ఈనాటికీ పండితులు అధ్యయనం చేస్తూ ఉంటారు.

సనందనుడనే ఈ శిష్యుడికి మరో కొత్త పేరు రావడానికి చక్కని సంఘటన ఒకటి జరిగింది. ఒకనాడు ఏటి ఒడ్డున కూర్చుని ఉన్న సనందనుడికి, అవతలి ఒడ్డునుంచి శంకరులు తనను పిలుస్తూ ఉండడం వినిపించింది. వెంటనే అతను నీళ్ళలోకి దిగాడు. అతని విశ్వాసానికి పాదాలకూ కూడా ఊతగా శంకరులు తమ సంకల్పబలంతో, సుళ్ళు తిరిగే ఆ ఏటిలో తామరపూల బారు ఒకటి సృష్టించారు; అతను వాటిమీంచి నడుచుకుంటూ వెళ్ళి అవతలి ఒడ్డుకు చేరాడు. అప్పటినుంచీ ఆ శిష్యుడికి 'పద్మపాదు'డనే పేరు వచ్చింది.

'పంచపాదిక'లో పద్మపాదుడు తన గురుదేవులకు భక్తిప్రపత్తులతో బహుధా జోహార్లు అర్పించాడు. శంకరులే స్వయంగా చక్కగా ఇలా రాశారు. ''సద్గురువుతో పోల్చదగినది ఈ మూడు లోకాల్లోనూ మరొకటి లేదు. చింతామణి అన్నది నిజంగా ఉందనే అనుకున్నప్పటికీ, అది ఇనుమును బంగారంగా మార్చగలదే కాని మరో చింతామణిగా మార్చలేదు. కాని పరమపూజనీయుడైన గురువు అలా కాకుండా, తన పాదాల్ని ఆశ్రయించిన శిష్యుణ్ణి తనంతవాణ్ణి చేస్తాడు. అంచేత సద్గురువు, సాటిలేనివాడే కాదు, లోకాతీతుడు.''

**- పరమహంస యోగానంద**

ముగించాడు. గురువు ముఖంలో ఒక చిఱునవ్వు రేఖ కనిపించింది. ఆయన కళ్ళలో సహస్ర చంద్రరేఖలు కదిలాయి. ఆయనే శంకరాచార్యుడని లవణగుప్తుడు గ్రహించాడు.

అక్కడ అందరిలోకీ పెద్దవాడూ శంకరాచార్యుని ప్రధాన శిష్యుడూ అయిన **పద్మపాదుడు** గురువువైపు చూశాడు. గురువు కళ్ళలో అనుమతి కనిపించింది. సమరసేనుడివైపు చూస్తూ పద్మపాదుడు, ''దేవుడి నెవరూ చూపించరు. చూడదలుచుకుంటే చూసే మార్గాలు చూపిస్తారు. ఎవరికి వారే చూసుకోవాలి'' అన్నాడు.

సమరసేనుడు చిరాకుగా, ''తమరి పేరేమిటో నాకు తెలియదుగాని, దయచేసి అతితెలివి కట్టిపెట్టండి. తమరు నిజంగా దేవుణ్ణి చూశారా?'' అని అడిగాడు.

పద్మపాదుడు సమరసేనుడి కళ్ళల్లోకి నిశితంగా చూస్తూ, ''నా పేరు పద్మపాదుడు. నేను దేవుణ్ణి చూశాను'' అన్నాడు.

సూటిగా వచ్చిన ఆ సమాధానానికి కొద్దిగా కంగారుపడుతూ, ''అయితే నాకు చూపించండి. నమ్ముతాను. లేదా ఈ నాటకాలు యింతటితో కట్టిపెట్టి తోక ముడవండి'' అన్నాడు సమరసేనుడు.

పద్మపాదుడు చిఱునవ్వు నవ్వుతూ, ''చిత్తం. తప్పకుండా చూపిస్తాను. ఒక్క అరగంటలో తమకు దైవదర్శనం అవుతుంది. అంతవరకు నేను చెప్పినట్లు విని తమరలా కూర్చోవాలి'' అన్నాడు.

— సశేషం.



# సరస్వతీ క్షేత్రం

**''శరణం కరవాణి శర్మదం తే**
**చరణం వాణి చరాచరోపజీవ్యమ్...''**

(మల్లినాథసూరి)

''చరాచరాత్మకమైన జగత్తు సర్వం సరస్వతీ శక్తిని ఆశ్రయించియే జీవిస్తోంది. దివ్యానందప్రదమైన ఆమె చరణాన్నే నేను శరణు పొందుతున్నాను.''

సర్వ జీవులలో చైతన్య స్వరూపిణిగా ప్రవహించే శక్తియే 'సరస్వతి.'

వేదాలలో **'అంబితమే, నదీతమే, దేవితమే సరస్వతీ'** అని అమ్మలలో, నదులలో, దేవతలలో శ్రేష్ఠురాలుగా కీర్తించబడిన జగదంబ శారద.

'శ్రీమాతా' అని కీర్తించబడిన ఆ తల్లి విశ్వేశ్వరుని వాక్, బుద్ధి, జ్ఞానాది ధీశక్తులకు అధిష్ఠాత్రి. సర్వజీవులకు ఆ తల్లి వల్లనే ఉలుకూ, పలుకూ, ఎరుక ఏర్పడుతున్నాయి.

**''సర్వ చైతన్యరూపాం తాం ఆద్యాం విద్యాం చ ధీమహి**
**బుద్ధిం యా నః ప్రచోదయాత్''**

– అని వ్యాసభగవానుడు, ''దేవీ భాగవతమ్'' మహాపురాణానికి ఆదిలో, అమ్మవారిని స్తోత్రించాడు. మన బుద్ధి శక్తులను ప్రేరేపించే విద్యా స్వరూపిణి శారదాంబ.

ఈ సరస్వతీ దేవిని విశేషంగా, తప్పనిసరిగా పూజించవలసిన తిథి – మాఘశుద్ధ పంచమి. దీనిని 'శ్రీ పంచమి' అంటారు. అమ్మ వారికి తెల్లని పువ్వులతో పూజించి, క్షీరాన్నం, చెరకులు, నేతి వంటలు, నారికేళ, కదళీ ఫలాలు, శుక్ల వస్త్రాలు, శుక్ల చందనం నివేదించాలి. ఈరోజు పిల్లలకు విద్యాభ్యాసం చేయిస్తే, విద్యలో ఉత్తమశ్రేణులు పొంది, విజయం సాధించడం తథ్యం.

**మాఘస్య శుక్లపంచమ్యాం...**
**మానవో మనవో దేవా మునీంద్రాశ్చ ముముక్షవః ।**
**వసవో యోగినస్సిద్ధా నాగా గంధర్వ రాక్షసాః ॥**
**మద్వరేణ కరిష్యంతి కల్పే కల్పే లయావధి ।**
**భక్తియుక్తశ్చ దత్త్వావై చోపచారాణి షోడోశ ॥**

(దేవీ భాగవతం)

'మాఘశుద్ధ పంచమి' నాడు విశ్వమంతా – మానవులు, మనువులు, దేవతలు, మునులు, ముముక్షువులు, వసువులు, యోగులు, సిద్ధులు, నాగులు, గంధర్వులు, రాక్షసులు – అందరూ సరస్వతీ దేవిని ఆరాధిస్తారు. అయితే ఆ అమ్మ అనుగ్రహం లేనిదే, అమ్మను ఆరాధించాలనే బుద్ధి పుట్టదు.

ఇకనుండి మన తెలుగువారు కూడా అమ్మ అనుగ్రహం పొంది, ఈ దివ్యతిథిని శారదారాధన చేసి తరించాలని కోరుకుందాం.

✣ ✣ ✣

ఆంధ్రప్రదేశ్‌లో ఆదిలాబాద్ జిల్లాలో గోదావరీ తీరాన ఉన్న బాసర క్షేత్రంలో – ఈ 'మాఘశుద్ధ పంచమి'నాడు శారదాదేవి జన్మదినోత్సవం మహావైభవంగా జరుగుతోంది. ఈ క్షేత్రాన వెలసిన అమ్మవారి పేరు 'జ్ఞాన సరస్వతి'.

శ్రీ వేదవ్యాసుడు ఇక్కడే తపస్సు నాచరించి, అమ్మవారి సాక్షాత్కారం పొంది వేద విభజన, పురాణ, భారత రచనా శక్తిని పొందారు. అమ్మ ఆజ్ఞ వలన సైకత (ఇసుక) మూర్తిని నిర్మించాక, అందులో చైతన్యమూర్తి



అయిన శారదాదేవి ప్రతిష్ఠితమయ్యింది. ఇక్కడ మహాకాళీ, మహాలక్ష్మి ఆలయాలు, దత్తాత్రేయ మందిరం, వ్యాసమందిరం ఉన్నాయి. ఇక్కడ సరస్వతి 'స్వయంభువు' అనీ, వ్యాసమహర్షికి దర్శనాన్ని అనుగ్రహించిందని పురాణ కథనం.

సుమారు రెండు వందల ఏళ్ల క్రితం - సనాతన ధర్మవిధ్వంసులైన పరమతస్థుల దాడిలో అనేక దివ్య దేవాలయాల మాదిరిగానే, ఈ దేవాలయంలోని కొన్ని విగ్రహాలు, పరిసర దేవాలయాలు ధ్వంసమయ్యాయి. అప్పుడు శూరశిరోమణి అయిన ముక్కాజీ పటేల్, కొందరు యువకుల సాయంతో, ఆ దుండగులను తరిమి, శ్రీ సరస్వతీ మందిర పునర్నిర్మాణం గావించారు. నాటి జగద్గురు పీఠాధిపతులు పరమహంస పరివ్రాజకాచార్యులగు శ్రీశ్రీశ్రీ విద్యారణ్య భారతీ స్వామివారిచే పునఃప్రతిష్ఠ గావింపజేశారు.

ఈ ఆలయానికి ఆంధ్రప్రదేశ్ నుండే గాక మహారాష్ట్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్ మొదలుకొని దేశం నలుమూలల నుండి భక్తులు. అధిక సంఖ్యలో వచ్చి దేవిని దర్శించుకుంటూ, విశేషార్చనలతో అమ్మవారిని ఆరాధిస్తున్నారు.

ముఖ్యంగా విద్యాప్రాప్తికై ఇక్కడ విద్యార్థుల చేత అక్షరాభ్యాసం చేయించి దేవికి పలక, బలపం, కాగితం, కలం మొదలైనవి సమర్పిస్తారు.

## ఉత్సవాలు

ఇక్కడ - 1.మాఘశుద్ధ పంచమి 2. ఆశ్వయుజ - శారదా నవరాత్రులు 3. మహాశివరాత్రి ఉత్సవం మహావైభవంగా జరుగుతాయి. పావన గోదావరీ జలాలలో స్నానం చేసి, శారదామాతను దర్శించడం ఒక దివ్యానుభూతి.

ఈ దేవి సన్నిధిలో మంత్ర జపాద్యనుష్ఠానాలు శీఘ్రంగా ఫలవంతమౌతాయనడంలో సందేహం లేదు.

'బ్రహ్మాండ పురాణం'లో ఈ క్షేత్ర మహాత్మ్యం విశేషంగా వర్ణింపబడింది. వ్యాసమహర్షి చేత ప్రతిష్ఠితమైన దేవత కనుక, ఈ క్షేత్రానికి, 'వ్యాసపురి', 'వాసర' అని పేర్లు. కాలక్రమంగా మహారాష్ట్ర ప్రభావం చేత 'బాసర' (బాసర్) అని పిలువబడుతోంది.

## మధుకరం

పుష్పానికి ఏవిధమైన బాధ కలగనీయక, తుమ్మెద పువ్వు నుండి తేనెను గ్రహించిన విధంగా, భిక్షుకవృత్తిచే గృహాల నుండి గ్రహింపబడిన భిక్షను 'మాధుకరం' అంటారు.

ఈ క్షేత్రంలో ఇప్పటికీ 'మాధుకర దీక్ష'తో ఉపాసన చేసేవారున్నారు. శ్రీదేవతా అనుగ్రహం పొందగోరువారు దేవీ ఆలయంలో నియమనిష్ఠలతో 11, 21, 41 రోజులు దీక్షతో, గురూపదేశ మంత్రాన్ని అనుష్ఠానం చేస్తూ,



మధ్యాహ్నం గ్రామంలోకి వెళ్లి భిక్షను స్వీకరించి శ్రీ సరస్వతీ దేవికి నివేదించి భుజిస్తారు. ఇదీ ఒక్కపూట మాత్రమే. వీరి కోసమని గ్రామంలోని కొందరు గృహస్థులు శుచిగా వండి వుంచుతారు కూడా. ఈవిధంగా దీక్షతో ఉపాసన చేసే వారికి, అనతి కాలంలోనే స్వప్నంలో శారదా మాత సాక్షాత్కరించి కామితార్థాలను ప్రసాదిస్తుంది. ఈవిధంగా అమ్మను ఉపాసించి తరించిన మహాత్ములెందరో ఇప్పటికీ మన దేశంలో ఉన్నారు. హైదరాబాద్ నుండి మీటర్‌గేజ్ రైలు మార్గములో 'బాసర క్షేత్రం' చేరవచ్చు. నిజామాబాద్‌కి 35 కి.మీ. దూరంలో ఉన్నది ఈ క్షేత్రం.

**ఇంద్రనీలాలకా చంద్రబింబాననా**
**పక్వ జింబాధరా రత్నమౌళీధరా ।**
**చారువీణాధరా చారుపద్మాసనా**
**శారదాపాతుమాం లోకమాతా సదా ॥**

(వ్యాసకృత వాసరా సరస్వతీ స్తుతి - బ్రహ్మాండపురాణం)

**శరదిందు సమాకారే! పరబ్రహ్మ స్వరూపిణి ।**
**వాసరా పీఠనిలయే! సరస్వతి! నమోస్తుతే ॥**

## పలుకు ''బడి''

# కథ కంచెకి....

సాత్యనారాయణి

కార్తీకమాసం వచ్చింది. టపాకాయల హడావుడి తగ్గి, వన భోజనాల సందడి పెరిగింది. ముందురోజు రాత్రికే, అందరం-దగ్గర్లో ఉన్న మా పల్లెటూరు చేరాం. రాత్రంతా చేనుకి కాపలాగా, మా రైతుతో మా పెద్దవాడు కూడా వెళ్ళాడు.

ప్రొద్దున్నే మా తోటలో, ఉసిరి చెట్టు క్రింద పూజలూ, పనస చెట్టు క్రింద వంటలూ మొదలయ్యాయి. ఆ ఊళ్ళో మా మేనత్త ఒకావిడ ఉంది ఆవిడ ఒక కథాసరిత్సాగరం! ఆవిడకి తెలియని కథలు లేవు.

''అమ్మమ్మా! ఓ మంచి కథ చెప్పవూ?'' అంటూ మా చంటివాడు ఆవిడ దగ్గర జేరాడు.

''దేనికి? కంచికి పంపడానికా?'' అన్నాడు మా బావమరిది జంతికలు నముల్తూ వాడొక సినీ ''భూతరచయిత''.

''కాదు. మద్రాసులో సినిమా కంపెనీలకి అమ్ముకోవడానికి'' అని ఓరగా చూశాడు మా చిన్నవాడు.

''ఆ?...'' అంటూ మా బావమరిది నోరు వెళ్ళబెట్టాడు.

''లేకపోతే ఏమిటి మామా! నువుకంచి మేకల్లే తింటున్నావు కదా అని, కథని కూడా కంచికి పంపేయడమేనా? అయినా కథ కంచికి వెళ్ళడ మేమిటి నాతలకాయ! కారణం ఉండద్దూ?!'' అన్నాడు మా చిన్నవాడు.

''వీళ్ళ పరాచికాలకేంగాని, నువు కథ చెప్పు అమ్మమ్మా!'' అన్నాడు మా చంటివాడు.

''వీల్లేదు. ముందు కంచి విషయం తేలాల్సిందే!'' అంది మా బావమరిది కూతురు.

''ఏముందీ! అసలు సామెత 'కథ కంటికి, మనం ఇంటికి' - అని అయ్యుంటుంది. పొరపాటున 'కథ కంచికి, మనం ఇంటికి'గా మారింది'' అన్నాడు మా చిన్నవాడు.

''ప్రాసకుదిరింది గదా అని, అంటే సగిపోతుందా? కథ కంటికి కాదోయ్ సోగ్గాడా, చెవికి చెప్తారు'' అంది అది.

''ఓసి బొంబాయి హీరోయినూ! కథ ఊరికే చెవిలో ఊదేస్తే సరిపోదు. కంటికి కట్టినట్టు చెప్పాలి. అందుచేత కథ కంటికే'' అన్నాడు వీడు.

''అదీ ఒప్పుకోను. ఎందుకంటే, మనం ఇంట్లో కూర్చుని కథ చెప్పుకున్నాం అనుకో- అప్పుడు 'మనం ఇంటికి' అనే మాట దండగ'' అన్నది అది.

''అదేమిటో నేను చెప్తా పట్టు'' అన్నాడు రాత్రి చేను కాపలా కాసి వచ్చిన మా పెద్దవాడు. అందరూ వాడికేసి తిరిగారు.

వాడు మారైతు వైపు తిరిగి, ''బాబాయ్! రాత్రి మనం ఎక్కడున్నాం?'' అని అడిగాడు.

మా రైతుని, వాడు - బాబాయ్ అని పిలుస్తాడు. మారైతునే కాదు, తనకన్న వయస్సులో పెద్దవారైన ఎవరినీ పేరు పెట్టి పిలవడు. ఏదో ఒక చుట్టరికపు వరసతోనే పిలుస్తాడు. వాడే కాదు, మా ఊళ్ళో ఎవరూ, పెద్దవాళ్ళని పేరు పెట్టి పిలవరు. మా ఊళ్ళోనే కాదు. తెలుగు నాట ఏ పల్లెటూర్లోనూ పిలవరు. అలా ఆత్మీయంగా పిలుచుకోవడానికి, వాళ్ళకి కులాలు, అంతస్తులు అడ్డం రావు. అది భారతీయ సంప్రదాయం.

మా వాడి ప్రశ్నకి మా రైతు నవ్వుతూ, ''పొలంలో ఉన్నాం'' అన్నాడు.

''దేనికి?'' అని అడిగాడు మా వాడు.

''కాపలాకి'' అన్నాడు మా రైతు.

''కాపలా దేనికి?''

''సరిహద్దు దాటి, గొడ్డూ గోదాదొంగలూ చేలోకి రాకుండా ఉండటానికి.''

''సరిహద్దు నేమంటాం?''.

''కంచె, అని అంటాం''

''కాపలా కాస్తూ, కాలక్షేపానికి ఏం చేశాం?''

''ఏదో కథ చెప్పుకున్నాం''

''అప్పుడు ఆ కథ దేనికి చెప్పు కున్నట్టయింది?''

''కంచె కాపలాకి.''

''కాబట్టి, ఆ కథ మన కోసం కాదన్న మాటేగా?''

''కాదు.''

''కంచె కోసమేగదా!'' అన్నాడు మా వాడు.

''అందుకు సందేహం లేదు గదా!'' అన్నాడు మారైతు.

''ఆ కథ ఎప్పటి దాకా చెప్పుకున్నాం?''

''తెల్లారే దాకా చెప్పుకున్నాం''

''చివరకి ఏం జేశాం?''

''ఇంటికి బయల్దేరాం''

''మరి కథ ఏమైంది?''

''కంచెకి సరిపోయింది.''

''కాబట్టి, ఆ సామెత ఏమిటో ఇప్పుడు మరొక్కసారి చక్కగా చెప్పు.''

''కథ కంచెకి, మనం ఇంటికి''

''ఈ సామెత పట్నం పోయి - అట్టే మాట్లాడితే చెన్నపట్నం పోయి, చీరకట్టు మార్చి, 'కథ కంచికి మనం ఇంటికి' అయ్యుండ వచ్చుగా?

''ఆహా! నిక్షేపంగా!''-

- ''భలే అన్నయ్యా! భలే!'' అని మా చిన్నది చప్పట్లు చరిచింది. అంతా తాళం వేశారు.

మా బావమరిది కాస్సేపు నిలబడి చూసి, ''ఒరేయ్ పెద్దాడా! నా చేతిలో లేదు గానీ - ఉంటే నీకో డాక్టరేట్ ఇచ్చేవాణ్ణిరా!'' అన్నాడు.

మా పెద్దవాడు, ''అందుకే అది నీ చేతిలో లేదు. ఉంటే, ఆ డాక్టరేటు ఏదో కంచెకియ్యి తర్వాత అది చేను మెయ్యకుండా చూడు.'' అన్నాడు. అందరం బంతి భోజనాలకి లేచాం.

(వచ్చేమాసం - ''నక్కతోక పట్టుకుని...'')



# ప్రత్యక్షదైవం

భారతీయ వాఙ్మయం యొక్క సనాతన పరంపరలో సూర్యభగవానుని స్థానం, మహిమ కూడ అద్వితీయం. శ్రుతి, స్మృతి పురాణాదులు, రామాయణ భారతాదులు కూడా సూర్యమహిమ వల్ల పరిప్లుతమై ఉన్నాయి. సూర్యభగవానుడు మనకు ప్రత్యక్ష దైవం. మన సంస్కృతి సంప్రదాయాలననుసరించి మనమనేక దేవతామూర్తులను సేవిస్తున్నాం. కాని మనకు ఆ మూర్తులన్నీ వేదోప నిషత్పురాణాదులలో వర్ణింపబడిన విషయాలు ఆధారంగా కనబడుతున్నవి.

'సౌరశక్తి'కి చెందిన విజ్ఞానమెంతో వేదంలోని సూర్యమంత్రాలలో నిక్షిప్తమై ఉంది.

సూర్యుడు ప్రతి రోజు ప్రత్యక్షంగా మన కళ్ళ యెదుట సాక్షాత్కరిస్తున్న దైవం. తత్త్వతః ఆయన పరబ్రహ్మము. స్థావర జంగమాత్మకమయిన సమస్త విశ్వానికి ఆయనయే ఆత్మ. సూర్యోపనిషత్తులోని 1-4ను అనుసరించి 'సూర్యుడు సమస్తప్రాణి జాతమును ఉత్పత్తి చేస్తున్నాడు, పోషిస్తున్నాడు, అంతమున తనలోనే లయం చేసుకొంటున్నాడు' అని మనకు తెలుస్తుంది.

**దశిక కృష్ణమోహన్**

అందుచేతనే సాధకుడు స్వయంగా ''యః సూర్యోఽహమేవ చ'' అని బ్రహ్మాత్మ భావన చేసుకోవాలి. విజయప్రాప్తి, ఆరోగ్యలాభం, రోగ నివారణార్థం - వివిధ అనుష్ఠానాల ద్వారా సాధకులు సూర్యభగవానుని ఆరాధించాలి.

'సువతి కర్మణి తత్తద్వ్యాపారే లోకం ప్రేరయతి ఇతి సూర్యః', 'సరతి గచ్ఛతి ఆకాశే ఇతి సూర్యః' అని, సూర్య శబ్దానికి ఉత్పత్తి చెప్పారు పెద్దలు. తన ఉదయం చేతనే లోకాన్నంతటిని ఆయా కర్మలయందు ప్రేరేపించు వాడు కాబట్టి అతడు సూర్యుడు. అందుకే ఆయనను జగచ్చక్షువు, కర్మసాక్షి అన్నారు. ప్రత్యక్ష దైవమయిన సూర్యభగవానుడే మనం చేసే సమస్త శుభాశుభకర్మలకు సాక్షి. కావున మనమాచరించే కర్మలు శుభకర్మలు పుణ్యప్రదాలు అయి ఉండాలి. అందుకోసం ఎల్ల వేళల శుభకర్మలనాచరించే అదృష్టాన్ని ప్రసాదించుమని మనం సూర్యుణ్ణి వేడుకోవాలి. ఆయన సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడు. ఆయనను ఆరాధించడమే మానవునకు పరమ కర్తవ్యమని వేదశాస్త్రాలన్నీ ముక్తకంఠంతో ప్రబోధించాయి.

సూర్యుడే కాలచక్ర ప్రణేత. సూర్యుని వల్లనే షడృతువులు ఏర్పడ్డాయి. సమస్తానికి కారణభూతుడయిన పరమాత్మ సూర్యుడే. కనుక **'ఓం ఆదిత్యాయ విద్మహే సహస్రకిరణాయ ధీమహి తన్నః సూర్యః ప్రచోదయాత్'** అనే సూర్య గాయత్రీ మంత్రంతో నిత్యం ఆయనను ఆరాధించాలి. ఇది సూర్యునకు పరమ ప్రీతికరమయిన మంత్రం. అలాగే జపవిధి కోసం కూడ ఒక విశేష అష్టాక్షరీ మంత్రాన్ని బోధించింది సూర్యోపనిషత్తు. సూర్యమంత్రాన్ని జపించడం వల్ల మహా వ్యాధుల యొక్క పీడ నుండి విముక్తి లభిస్తుంది.

**ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషుచ ।**
**కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ ॥**

అని రామాయణం. ఆపదల్లో చిక్కినా, పాపాల్లో కూరుకుపోయినా, అటవీమధ్యంలో దిక్కుతోచక తిరుగుతూన్నా, భయంతో కింకర్తవ్యతామూఢుడై ఉన్నా సూర్యభగవానుని ఆరాధించిన పురుషుడు

ఏవిధమయిన క్లేశాన్నీ అనుభవించక సమస్త దుఃఖాలను అధిగమిస్తాడని వివరించింది.

**ఆకాశ స్యాధిపో విష్ణుః అగ్నేశ్చైవ మహేశ్వరీ।**
**వాయోః సూర్యః, క్షితేరీశో, జీవనస్య గణాధిపః॥**

ఆకాశం యొక్క అధిపతి విష్ణువు. అగ్నికి అధిరాజ్ఞి మహేశ్వరి. వాయుతత్త్వానికి అధిపతి సూర్యుడు. పృథివికి శివుడు. జలాధిపతి గణపతి. ఈవిధంగా కాపిల తంత్రం బోధించిన పంచదేవోపాసనను తెలిసికొని, భువన భాస్కరుని గాయత్రీ మంత్రం ద్వారా ఉపాసన చేస్తే సమస్త దుర్దశలు పటాపంచలవుతాయి.

''ధ్యాయేత్సదా సవితృమండల మధ్యవర్తీ, నారాయణస్సరసి జాసన సంనివిష్ట...'' అనడం చేత ఆ శ్రీమన్నారాయణుడే సవితృ మండల మధ్యవర్తియై ఉన్నాడని గ్రహించి ''ఓం నమో నారాయణాయ'' అనే అష్టాక్షరీ మహామంత్రాన్ని స్మరిస్తూ అర్ఘ్య ప్రదానం చేసి, మనస్సును పవిత్రంగా, ఏకాగ్రంగా నిలిపి భక్తిపూర్వకముగా ప్రతిరోజు ఉదయం 108 సార్లు జపించినా సూర్యభగవానుని అనుగ్రహం లభిస్తుంది.

సూర్యుడు కాలాత్మ అని ఋగ్వేదం స్పష్టం చేస్తోంది.

**సప్త యుంజన్తి రథ, మేక చక్ర, మేకో అశ్వోవహతి, సప్త నామా।**
**త్రినాభి చక్ర, మజర మనర్వం, యత్రేనామా విశ్వాభువనాధి తస్థుః॥**

అని (1-164-2). అంటే ఈ కాలాత్మ యొక్క రథం విశిష్టమైనది, విలక్షణమైనది. రంహణ(గమన) శీలం కలది కాబట్టి దాన్ని రథమన్నారు. అది నిరంతరం నడుస్తూనే ఉంటుంది. ఆ రథానికి సంవత్సరాత్మ ఒకేచక్రం. (ఏకచక్ర రథోయస్య దివ్యః కనకభూషితః) అహోరాత్ర స్వరూప నిర్వహణార్థం దానికి సప్తాశ్వాలు కట్టబడ్డాయి. (సప్తాశ్వరథమారూఢం ప్రచండం కశ్యపాత్మజం) ఈ సప్తాశ్వాలూ ఏడువారాలు. కాని వాస్తవానికి అశ్వం ఒక్కటే. (ఏకో అశ్వోవహతి సప్తనామ-) కాని దానికి 7 పేర్లు ఉండడంచేత సప్తాశ్వాలంటున్నారు. ఆ ఏకచక్రానికే భూత భవిష్య ద్వర్తమానాలు 3 నాభులు. ఆరథం అజరామరం. అంటే అవినాశి. ఇట్టి సప్తాశ్వ రథారూఢుడయిన భవన భాస్కరుని దర్శనం చేసుకొన్న మానవునకు పునర్జన్మలేదని (రథస్థం భాస్కరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే) పురాణాలు చెప్తున్నాయి.

వాల్మీకి రామాయణంలో యుద్ధకాండలో ఆదిత్యహృదయ స్తోత్రం కనిపిస్తుంది. అందు సూర్య భగవానుని విరాట్‌స్వరూపం గోచరిస్తుంది.

**'ఏషబ్రహ్మాచ విష్ణుశ్చ శివఃస్కందః ప్రజాపతిః।**
**మహేంద్రో ధనదః కాలోయమః సోమోహ్యపాంపతిః॥'**

దీన్ని బట్టి సమస్తదేవతలు ఒకేచోట మూర్తీభవించిన దైవం సూర్య భగవానుడని తెలుస్తుంది. ఎట్టి విపత్కర పరిస్థితుల్లోనైనా సూర్య నారాయణుని స్మరణ కీర్తనల వలన దుఃఖాలు తొలగి శాంతి లభిస్తుంది.

సూర్యుడు అదితిపుత్రుడు. అందువల్ల (అదితేః అపత్యంపుమాన్) ఆదిత్యుడు. ''ఆదిత్యానామహం విష్ణుః...'' అని కృష్ణపరమాత్మ ఉవాచ. వేదాలు 'సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ' అని చెప్తున్నాయి. అంటే సమస్త జగత్తుకు ఆత్మరూపముగా సూర్యుడున్నాడని అర్థం. అట్టి ఆత్మ రూపుని ఆదిత్యదేవుని శుక్ల యజుర్వేదం (31-18) ఈ విధంగా కీర్తించింది.

**''ఓం వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్।**
**తమేవం విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యఃపన్థా విద్యతేఽయనాయ॥''** అని.

''ఆదిత్య స్వరూపునిగా, మహానుభావు నిగా, వేదాంతమూర్తిగా, పెనుచీకటి కవ్వలి వానిగా - అనగా పరిపూర్ణ ప్రకాశ స్వరూపునిగా, సూర్యభగవానుని నేను తెలిసికొనుచున్నాను. ఇట్టి సూర్యదేవుని తెలిసికొన్న మానవుడు మృత్యువును తరించును. కనుక మోక్ష ప్రాప్తికి సూర్యారాధన వినా మరో మార్గం లేదు.''

# సూర్యనామాలు

1. మిత్రాయ నమః
2. రవయే నమః
3. సూర్యాయ నమః
4. భానవే నమః
5. ఖగాయ నమః
6. పూష్ణే నమః
7. హిరణ్యగర్భాయ నమః
8. మరీచినే నమః
9. ఆదిత్యాయ నమః
10. అర్కాయ నమః
11. సవిత్రే నమః
12. భాస్కరాయ నమః
13. సూర్యనారాయణా నమః

# రాజకీయాలు - మంత్ర తంత్రాలు

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

రాజకీయ రంగంలో ప్రముఖస్థానాలలో ఉన్న వ్యక్తులు, మంత్రులు, అధికారులు తమ స్థానాలు నిలబెట్టుకోవటం కోసం, తమ శత్రువులను నాశనం చేయటంకోసం మాంత్రికులను తాంత్రికులను ఆశ్రయించి వాళ్ళచేత పూజలు, జపములు, హోమములు, రకరకాల ప్రయోగాలు చేయించటం గురించి తరచుగా పత్రికలలో చదువుతూ ఉంటాము. ఆ మధ్య పదవీ భ్రష్టుడైన ఒక కేంద్రమంత్రి తనకు సంబంధించిన ఒక తాంత్రికుని చేత అర్ధరాత్రి శ్మశానంలో చితిలో మద్యంతో హోమం చేయించినట్లు ఢిల్లీ నుంచి వచ్చే ఒక వార్తా పత్రికలో ప్రచురించబడింది. అదే విధంగా దేశనాయకులనేకులు పదవీప్రమాదం, అనారోగ్యం మొదలైన ఇబ్బందులు వచ్చినప్పుడు చాలావరకు వాటికి శత్రువులు చేయించిన ప్రయోగాలే కారణమని భావించబడటం దానికి తిరుగుగా మాంత్రికులు ప్రతిప్రయోగాలు చేయటం చిత్రవిచిత్రాలుగా వార్తలు వెలుగులోకి రావటం చూస్తూనే ఉన్నాము.

ఇవి చూచి విని అనేకులు ఈ రాజకీయ వాదుల బలహీనతలని కొట్టి పారేస్తుంటారు. నాస్తికులు, మంత్రతంత్రములను విశ్వసించని వారు ఎలాగూ వీటిని ఖండించి పారేస్తారను కోండి. కాని నమ్మకం కల వాళ్ళలో కూడా వీటి సహాయంతో రాజకీయంగా పదవులు సాధించటం పోగొట్టటం సాధ్యమవుతుందా అనే సందేహాలు కలుగుతూవుంటవి. ఎందుకంటే భారతీయులమైన మనం సహజంగా కర్మ సిద్ధాంతం మీద నమ్మకం కలవాళ్ళము. పూర్వజన్మలో చేసిన కర్మననుసరించి ఈ జన్మలో మంచిగాని, చెడుగాని జరుగుతుంది. ఒక వ్యక్తి ఉన్నతపదవి పొందాడంటే అది అతడు చేసుకొన్న సుకృత కర్మ యొక్క ఫలితం. ఆ కర్మానుభవం పూర్తి అయ్యేదాకా అతడా స్థానంలో ఉంటాడు. పుణ్య ఫలం అయిపోగానే ఆ పదవినించి తప్పుకోవలసి వస్తుంది. పదవి పోవటానికి నిమిత్తం న్యాయమైనది కావచ్చు, అన్యాయమైనది కావచ్చు. గద్దెనించి దించటానికి ఉపయోగించబడిన పద్ధతులు కుయుక్తులు కుట్రలు కావచ్చు, కాకపోవచ్చు. ఏదైనా అతడి సుకృత కర్మ పూర్తి కానిదే ఎంతమంది ఎన్నిరకాలుగా ప్రయత్నించినా అతడిని పదవీభ్రష్టుణ్ణి చెయ్యటం సాధ్యం కాదు.

కొన్నాళ్ళు పదవీభ్రష్టులై బాధపడి మళ్ళీ కొంతకాలానికి ఉన్నత పదవిని పొందిన వాళ్ళనూ చూస్తుంటాము. అంటే మధ్యలో వచ్చిన దుర్యోగం తొలగి, కొత్తయోగం ప్రారంభమైనదన్నమాట. కనుక సమస్త మానవజీవితాలు కర్మ వశములై నడుస్తున్నవి.

**వినుకర్మం బొనరించును**
**జననము, మరణంబు, నదియ సౌఖ్యము దుఃఖం**
**బును గావించున్, దనచే**
**సినదానింబడక పోవ శివునకు వశమే.**

మరి ఇటువంటి కర్మ సూత్రము ప్రవర్తమానమవుతూ ఉన్నపుడు రాజ్యాధికారములు, పదవులు, సమస్తము పూర్వజన్మ కర్మవశమున ప్రాప్తిస్తూ పోతూ ఉన్నపుడు అందులో మాంత్రికుల ప్రయోగ తంత్రముల స్థానమేమిటి అన్న ప్రశ్నపుడుతుంది. మంత్రశాస్త్రాన్ని, పురుషకారము యొక్క ప్రాధాన్యాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే కేవలం సిద్ధాంతం వరకు మంత్ర శక్తులచేత ఏదైనా చేయవచ్చును, ఏమైనా సాధింపవచ్చును అని అంగీకరించినా లోక పరిస్థితిని గమనించినపుడు సామాన్య మాంత్రికులు రాజ్యాధికారముల విషయములో జోక్యము చేసుకొని సాధించిపెట్టలేరని చెప్పక తప్పదు.

ఉదాహరణకు ఒక శాసనసభానియోజక వర్గంలో ఒక లక్షమందికి పైగా ఓటర్లు ఉంటారు. ఈ లక్షమందిలో ఓట్లు వేయటానికి ఎక్కువ మందిని వచ్చేలా చేయాలి. వచ్చిన వాళ్ళని అందరినీ కాకపోయినా అధికభాగం చూడాలి అంటే మాంత్రికుడు వేల మందిని ఆకర్షించి సమ్మోహితులను చేసి వశీకరించుకో గలిగిన సామర్థ్యం కలిగి ఉండాలి. అంతటి శక్తి పరమేశ్వరుని దివ్యానుగ్రహం గలిగిన ఏ సిద్ధపురుషునికో సాధ్యం కాని సామాన్య మాంత్రికునకు సాధ్యం కాదు. వశీకరణ ప్రయోగం చేసి ఒకరినో, ఇద్దరినో ఒకటో, రెండో పనులు సాధించుకోవటానికి అదీ నియమిత కాలం వరకు మామూలుగా మాంత్రికులు సాధించ గలరు. షట్ప్రయోగములన్నీ సామాన్యంగా ఏక వ్యక్తి నిష్ఠములు. కనుక ఏ ధనవంతుని దగ్గరనో రాజకీయనాయకుని దగ్గరనో డబ్బు తీసికుని వారి ఆశ్రితులై వారికొరకు దేవతా పూజలు, ప్రయోగములు చేసే మంత్ర తంత్రవేత్తలు ఏకసమయంలో శతసహస్రాధిక మహాజన వశీకరణం చేసి ఒక వ్యక్తికి ఓట్లు వేయించి గెలిపించటం జరిగే

పనికాదు. మహాసిద్ధుడైన తాంత్రికుడు, యోగి అలా చేయగలడు గదా ఎందుకు సాధ్యం కాదు అని ప్రశ్నిస్తే సాధ్యవేం కాని అంతటి యోగసిద్ధుడు ఈ క్షుద్ర రాజకీయవాదుల కాశ్రితుడై వారిచ్చే ధన కనక వస్తు వాహనాలకు ప్రలోభపడి వారికి పనిచేసి పెట్టడు. కర్మ దేవతల చేత నిర్దిష్టమైన వ్యక్తుల జయాపజయములలో సిద్ధ పురుషులు జోక్యం చేసుకోరు. ఎవరు గెలిచినా ఓడినా వారికొకటే. కాబట్టి ఎన్నికలలో పురాకృత కర్మవశాన ఎవడు గెలవాలని నిర్దేశింపబడి యున్నదో వాడే గెలుస్తాడు. కాని సామాన్య మాంత్రికుల కార్య కలాపములు నిష్ఫలములు.

ఒక వ్యక్తి రాజ్యాధికారము సిద్ధింపజేయ గలిగిన మహాయజ్ఞమో తపస్సో చేస్తే అప్పుడు రాదా అన్న ప్రశ్న వెయ్యవచ్చు, దాని ఫలితము ఈ జన్మలో సిద్ధికాదని సమాధానము చెప్పవలసి ఉంటుంది.

సుకృతము కాని దుష్కృతము కాని ఈ జన్మలో ఫలించదు.

**శ్లో॥ పూర్వదేహకృతం కర్మ, భుంజతే తదిహప్రజాః**
**ఇహైవయత్కృతం పుంసాం తత్పరత్ర ఫలిష్యతే**

భారతములోని అనుశాసన పర్వంలో ఈ విషయము వివరముగా చెప్పబడినది. దీనికి కారణము కలదు. మానవులు స్వల్పాయుష్కులు. పూర్వజన్మలో చేసిన తపో దాన యజ్ఞ రూపాది కర్మచేత ఒక వ్యక్తి ఒక అరవై సంవత్సరములు ఒక దేశమునకు రాజుగా ఉండవలసిన యోగము పొందాడనుకోండి. మరొకడు అదే పదవి కోసం తగిన కర్మ చేస్తే ముందువాడియోగం ఏమవుతుంది? కనుక మొదట వాని యోగం అయిపోయిన తరువాత యోగ్యతను సంపాదించిన రెండవవానికి ఫలించాలి. కాని అన్ని సంవత్సరాలు గడిచేసరికి ఈ రెండవవాడు వృద్ధుడై, జరా రోగ పీడితుడై రాజ్య భోగములు అనుభవించగల శక్తి లేని స్థితిలో ఉంటాడు. చేసిన సుకృత కర్మ ఫలితంగా అనుభవించవలసిన సుఖ భోగములను మహారాజ పదవి పొందినా అనుభవించ లేడు. అందుచేత కర్మ దేవతలు వచ్చే జన్మలో యవ్వనంలో ఉండగానే వాడికి మహారాజ పదవిని ప్రసాదించి భోగ భాగ్యములను అనుభవింపజేస్తారు. సుదీర్ఘాయుర్దాయము కలిగిన మానవులకే ఆ జన్మలోనే చేసిన తపో వ్రతముల ఫలితం కనిపించేది. పురాణాలలో శాస్త్రములలో ఈ యజ్ఞం చేస్తే, యీ వ్రతం చేస్తే మహారాజవుతాడు ప్రజలను పరిపాలిస్తాడు అని చెప్పినవన్నీ ఆ కాలం వారికి చెల్లినవి. కలియుగంలో అల్పాయుష్కులైన మనుష్యులు రాజ్యప్రదమైన ఏ కర్మ చేసినా వచ్చే జన్మదాకా వేచియుండక తప్పదు. భారతంలో ఈ విషయం స్పష్టంగా చెబుతూ ఈ పరజన్మఫలమట నేటువంటిది మనుష్యులలో మాత్రమేనని చిరంజీవులైన దేవదానవులు ఆ జన్మలోనే సర్వకర్మఫలితములను అనుభవిస్తారని చెప్పటం జరిగింది.

**శ్లో॥దేవానామసురాణాంచ - అమరత్వాత్తపోబలాత్**
**ఏకేనైవ శరీరేణ - భుజ్యతే కర్మణాంఫలమ్**

ఇంకా ఇటువంటి సందర్భంలో రాజ్య పదవులకై చేసే ప్రాకులాటలో దేవతాపూజలకు మంత్ర తంత్ర ప్రయోగాలకు మాంత్రిక తాంత్రికుల శక్తులకు ఫలితమే లేదా అనవచ్చు. వీటిని అంత సులభంగా త్రోసిపుచ్చటానికి వీలులేదు. ఇవి ఎంత వరకు పని చేస్తవో వీటివల్ల సిద్ధించే ఫలితాలు ఎంతమేర ఉండగలవో వివరిస్తాను.

మహాజనం మీద వశీకరణశక్తి ప్రయోగించి ఎన్నికలలో గెలవటం సాధ్యం కాదని నిర్ణయించిన తర్వాత మరివచ్చిన పదవికి భంగం కలిగే పరిస్థితి ఏర్పడినప్పుడు రక్షించటం సాధ్యమా అన్న విషయాన్ని గురించి ఆలోచిద్దాము.

ఒక యోగాన్ని గురించి భావించినప్పుడు అందులో రెండు స్థితులున్నవి. ఒకటి లేని యోగమును పుట్టించటం. రెండు యోగం బలహీనంగా ఉండి ఫలించని దశలో దానికి గల ఆటంకాలను తొలగించి ఫలించేలా చేయటము. ఒక వ్యక్తి దీర్ఘాయువుండి కూడా మధ్యలో గండాలవల్ల అకాల మృత్యువు పాలై మరణించవచ్చు. ఆ గండములకు తగిన శాంతి చేసి వానిని తొలగించుకొంటే పూర్ణాయుర్దాయం అనుభవించవచ్చు. కాల మృత్యువును తప్పించుకోటం సాధ్యం కాదు గాని అకాల మృత్యువును పోగొట్టుకోవచ్చు. ఆలయాలలో తీర్థం ఇచ్చేప్పుడు చదివే ఈ క్రింది శ్లోకం కూడ అదే భావాన్ని వ్యక్తం చేస్తుంది.

**శ్లో॥ అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం**
**సర్వ పాప ప్రశమనం దేవీ పాదోదకం శుభం.**

అలానే ఒక జంటకు పిల్లలు లేరనుకొందాము. దాన్ని తొలగించి సంతానం కలిగించాలంటే రెండు స్థితులున్నవి. సంతాన యోగం ఉండి దుష్టగ్రహప్రభావం చేత ఫలించని దశ లేదా అసలు యోగమే లేని దశ. మొదటి స్థితిలో దుష్టగ్రహవీక్షణాన్ని తొలగించి సంతాన యోగాన్ని ఫలింపచేయటం సులభం. యోగమే లేనప్పుడు పుట్టించటం చాలా కష్టసాధ్యం. అసాధ్యమే అని కూడా అనవచ్చు.

రాజకీయాలలో కూడా పదవీ యోగం ఉండి దుష్టగ్రహముల ప్రభావం చేత ఆటంకాలు ఏర్పడుతున్నపుడు మంత్ర తంత్ర సాధనల చేత వానిని నిర్మూలించవచ్చు. యోగం ఉన్నంతకాలం భంగం కాకుండా కాపాడవచ్చు.

ఈ విషయంలో ఒక ప్రత్యేకమైన అంశం కూడా ఉంది. శాంతి, వశ్య, స్తంభన, ఉచ్చాటన, ఉన్మాదన, మారణాది ప్రయోగ దక్షుడైన మాంత్రికుడు ఒక ఉన్నత పదవిలోని వ్యక్తి మీద ఒక దుష్ట ప్రయోగం చేశాడనుకోండి. అప్పుడేమవుతుందనేది జాగ్రత్తగా గమనించాల్సిన విషయం.

సమర్థుడైన మాంత్రికుడు చేసిన ప్రయోగం జరిగి తీరుతుంది. మరి అప్పుడు రాజయోగం కలిగి ఉన్నత పదవిని అనుభవిస్తున్న వాని కర్మ ఏమవుతుంది? అనుభవిస్తున్నాడంటే అది ప్రారబ్ధ కర్మ గదా! ప్రారబ్ధ కర్మ విడిచి పెట్టబడిన బాణం వంటిదని అది ఆగదని శాస్త్రములు చెపుతున్నవి. మంత్ర ప్రయోగ శక్తి చేత ప్రారబ్ధ కర్మ భంగమవుతుందా? అయితే కర్మ సిద్ధాంతం భంగమయినట్లు కాదా?

ఈ ప్రశ్నలకు సమాధానాలు కర్మ సిద్ధాంతాన్ని సూక్ష్మంగా అర్థం చేసుకొంటే తప్ప తెలియవు. ఒకనికి వ్యాధి వచ్చి పీడితుడవుతున్నాడనుకొందాం.

**శ్లో॥ పూర్వజన్మకృతం పాపం వ్యాధి రూపేణ బాధతే**
**తచ్ఛాంతి రౌష, ధైర్దా నైర్జపహోమ సురార్చనైః**

పూర్వజన్మలో చేసిన పాపము రోగ రూపంగా పీడిస్తుంది. ఔషధముల చేత, దానముల చేత, జప హోమముల చేత, దేవతార్చనముల చేత అది శాంతిస్తుంది.

కొందరు జ్యోతిష్కుల నాశ్రయించి చెడు కాలం ముందే తెలుసుకొని బాధలు, రోగాలు రాకుండా శాంతి కర్మ చేయించుకొంటారు. మరి కొందరు రోగాలు వచ్చి పీడితులవుతూ గ్రహశాంతులు చేయించుకొంటారు. అంటే ప్రారబ్ధ కర్మ పని చేయటం మొదలు పెట్టిన తర్వాత కూడ శాంతి కర్మల చేత ఉపశమనం కలగటం ఉంది.

కర్మ వాదమున కెక్కువ ప్రాధాన్యమిచ్చే వాళ్ళు చెప్పే పద్ధతి ఒకటున్నది. కర్మానుభవం పూర్తి అవుతున్న దశలోనే పీడితునికి శాంతి కర్మలు చేయించుకొందామని బుద్ధిపుడుతుంది. కనుక ప్రారబ్ధం తప్పించుకోవటమనేది లేదు. అనుభవించి తీరవలసిందే. ఒక వేళ ఎవరికైనా మంత్ర సాధనల చేత వ్యాధి కుదిరితే అది కూడ కర్మలోనే వ్రాసి పెట్టి ఉందిగాబట్టి జరిగింది అని.

ఇది అతివాదము. శాస్త్రములలో ఈ విధమైన బాధను ఈ శాంతి కర్మ చేత, ఈ జపము చేత ఈ హోమము చేత, ఈ దానము చేత పోగొట్టుకోవచ్చునని మహర్షులు చెప్పారు. దానిని అంగీకరించి తీరాలి. కనుక ప్రారబ్ధాన్ని కూడా మంత్రాది కర్మలు ఎదిరించ గలవు లేదా శమింపజేయ గలవు అని అంగీకరించాలి. మరి ప్రారబ్ధం అనుభవించక నశించదని పురాణములు, శాస్త్రములు చెపుతున్నవి గదా.

**శ్లో॥ ప్రారబ్ధజామధిక సంపదమా పదం వా**
**భుం జాన ఏవపురుషః పరిశుద్ధిమేతి.**

ఈ రెంటికి సమన్వయాన్ని పరాశరోప పురాణం సాధించి చూపింది.

**శ్లో॥ శరీరారంభకం కర్మ యోగినో యోగినోపిచ**
**వినాఫలోపభోగేన నైవనశ్యత్య సంశయః**

యోగులకు కాని అయోగులకు కాని అనుభవించకుండా ప్రారబ్ధకర్మ నశించదు. ప్రారబ్ధాన్ని ఎదిరించటానికి మంత్ర తంత్ర దక్షులైన యోగులు చేసే కర్మ వల్ల ప్రారబ్ధం ఆగిపోక తప్పదు. ప్రారబ్ధంలో అప్పటికీ అనుభవించగా మిగిలిన భాగము స్వప్నములోను కాలాంతర దేహాంతరములలోను అనుభవమునకు వచ్చునట. ప్రమాణం చూడండి.

**శ్లో॥ ఇహైవ ఫలదం కర్మ ప్రారబ్ధం ప్రతి బద్ధ్వచ**
**ఫలందదాతి స్వప్నేవ జాగ్రత్ కాలేధవ్యాః**
**నివృత ప్రతి బద్ధంతు ప్రారబ్ధం కర్మ సత్తమ**
**నిరుద్ధాంశ సమో భోగో యధోద్భూతశ్చ జాగ్రతి**
**తథా నిరుద్ధంతేనైవ సహ కర్మ దదాతివై**
**ఏవం విరుద్ధ భాగంతు స్వప్నే జాగ్రతివా ఫలం**
**ఆరబ్ధస్యానుగుణ్యేన భుంక్తే దేహీన సంశయః**
**ప్రారబ్ధ శేషం విచ్ఛిన్నం పునర్దేహాంతరేణతు**
**భుంక్తే దేహీ ననోభుంక్తే తల్లంఘయతికః పుమాన్**

దీనిని బట్టి తేలేదేమిటంటే ప్రారబ్ధాన్ని కూడా మంత్ర తంత్రములతో ఎదిరించవచ్చు అని అంటే ఉన్నత పదవిని తన సుకృత కర్మ చేత అనుభవిస్తున్న ఒక వ్యక్తిని మాంత్రికుడు పదభ్రష్టుణ్ణి చేయవచ్చు. అతడి మీద ఏ దుష్ట యోగమో చేసి రోగ గ్రస్తుణ్ణి చెయ్యటమో చంపటమో చేస్తే అప్పటికనుభవించగా మిగిలిన ప్రారబ్ధం తాత్కాలికంగా నిరోధించబడి తర్వాత ఎప్పుడో అనుభవానికి వస్తుంది. ఐతే అత్యంత బలవత్తరమైన మహారాజయోగం కలిగిన వ్యక్తి మీద ఎవరైనా చేతబడి వంటి ప్రయోగం చేస్తే అతడి యోగం గట్టిగా ఉండటం చేత ఆ ప్రయోగం పూర్తి ఫలితాన్ని ఇవ్వకముందే విషయాన్ని తెలిసికొని సమర్థుడైన మరొక మాంత్రికుణ్ణి ఆశ్రయించి తనకు వచ్చిన యిబ్బందిని పోగొట్టుకుంటాడు. కొద్దిపాటి రాజయోగమైతే ప్రయోగకారుని శక్తి ముందు తట్టుకోలేక దెబ్బతిని ఆగిపోతుంది. ఇటువంటి వాటిని ఊహించే ప్రాచీన కాలంలో మహారాజులు మహామంత్రులు ప్రయోగోపసంహార దక్షులైన మంత్ర సిద్ధులను తమ ఆస్థానాలలో రక్షణ క్రింద ఉంచుకునేవారు. వారు శత్రువుల ప్రయోగాలను శమింపజేస్తూ అవసరమైతే తిప్పికొడుతూ తమను పోషించే అధికారులను కాపాడుతూ ఉండేవారు. ఈ నాటి మాంత్రికులకు కూడా అంతవరకు సాధ్యమే. పదవీ భ్రష్టత, రక్షణ చేయగల సామర్థ్యం కలవాళ్ళు అక్కడక్కడా లేక పోలేదు.

ఆపదలు వచ్చినప్పుడు రోగాలు, క్షుద్ర ప్రయోగాలు బాధిస్తున్నప్పుడు వాటినుండి మానవులను రక్షించటం మాంత్రికుల ధర్మం. దుష్టప్రయోగాలు చేసి బాధించటం క్షుద్ర మార్గం, రాజకీయాలలో ఏ విధంగానైతే సజ్జనులు, దుర్జనులు ఉన్నారో మాంత్రికులలోనూ ఆ రెండు రకాలవారు ఉన్నారు. ధనాది ప్రలోభాలకు లొంగి ప్రయోగాలు చేసేవారు ఈనాటికీ ఉన్నారు. అందుకే పెద్ద పదవులలో ఉన్నవారు తమను తాము కాపాడుకోవటానికి, తమ స్థానాలను నిలబెట్టుకోవటానకి మంత్ర తంత్ర నిపుణుల నాశ్రయించక తప్పనిస్థితి ఏర్పడుతున్నది. ఐతే ఆ మంత్ర తంత్రములు ప్రయోగించే సిద్ధసాధకుల శక్తి పరిమితులు అల్పమైనవని గుర్తించాలి. (సశేషం)

శివరాత్రి ప్రత్యేక రచన

# శివుడే ఆదర్శం



భగవానుడు, భూతభావనుడు అయిన శ్రీ విశ్వనాథుని చరిత్రల వలన మానవులకు నైతిక, సామాజిక, కౌటుంబికాలైన అనేక ఉప దేశాలు లభిస్తాయి.

**నాయకుడు ఇలా ఉండాలి :**

సముద్ర మథనం వల్ల జనించిన కాలకూటవిషాన్ని శ్రీ శంకర భగవానుడు పానం చేసి, అమృతాన్ని దేవతలకిచ్చాడు. దేశ నాయకుల, సమాజ నేతల, కుటుంబ యజమానుల కర్తవ్య మిదే. ఉత్తమ పదార్థాలను దేశంలోని ఇతర జనులకు ఇయ్యాలి. తమకోసం పరిశ్రమనీ, త్యాగాన్నీ, కష్టాలను ఉంచుకోవాలి. విష (కష్ట) భాగాన్ని దేశానికీ, పిల్లలకు ఇస్తే ప్రమాదమే. దానివల్ల సర్వనాశనమవుతుంది.

శివుడు విషాన్ని లోనికి పోనీయనూ లేదు. దానిని బయటికి వదలనూ లేదు. కంఠంలోనే నిరోధించి ఉంచాడు. కావుననే, విషమూ, కాలిమా (నల్లదనం) ఆ మహాదేవునకు అలంకారాలయ్యాయి.

ప్రపంచ క్షేమం కోసం విషపానానికి కూడా వెరవని వారే, దేశానికీ, లేక ప్రపంచానికీ ప్రభువులౌతారు. సమాజంలోని, లేక దేశంలోని కటుత్వాన్ని (కష్టాన్ని) అనుభవించడం వల్లనే, నాయకుడు దేశానికి కల్యాణం చేకూర్చగలడు. కానీ ఆ కటుత్వంలోని విషాన్ని వమనం చేయడం వల్ల వైమనస్యాలు, ఉపద్రవాలు కలుగుతాయి. దానితోపాటు ఆ విషాన్ని హృదయంలో ఉంచుకోవడమూ మంచిది కాదు.

**యతిచక్ర చూడామణి శ్రీకంఠానంద స్వామి**

అమృతపానానికై అందరూ ఉత్కంఠులౌతారు. విషపానానికి మాత్రం శివుడే ఉత్సుకత చూపుతాడు. ఆ రీతిగానే, ఫలభాగానికై సర్వజనులు ముందుకు వస్తారు. కానీ త్యాగాన్నీ, పరిశ్రమనీ స్వీకరించడానికి మహా పురుషులే సన్నద్ధులౌతారు. అమృతపానంలో గల అనుచిత లోభం వల్ల దేవ, దానవుల మధ్య విద్వేషం స్థిరపడినట్లే, అనుచిత ఫలకామన వల్ల సమాజంలో విద్వేషం స్థిరపడుతుంది.

**ఇల్లు ఇలా ఉండాలి :**

శివుని కుటుంబమే విచిత్రమైనది. అన్నపూర్ణ యొక్క కోశాగారం సదా అన్నభరితమై ఉంటుంది. మాయ ఎరుగని శంకరుడు మాత్రం సదాభిక్షుకుడు. కార్తికేయుడు సదా యుద్ధ సన్నద్ధుడై ఉంటాడు. గణపతి, స్వభావం చేత శాంతిప్రియుడు. ఇక, వాహనాల విషయ మంటామా- కార్తికేయుని వాహనం మయూరం, గణపతి వాహనం మూషికం, పార్వతీదేవి వాహనం సింహం, ఆ శివుని వాహనం నంది. ఆయన, సర్పాభరణ భూషితుడు. అవన్నీ పరస్పరం శత్రువులే కానీ, గృహ యజమాని ఛత్ర చ్ఛాయలో అన్నీ సుఖశాంతులతో ఉంటాయి.

తరచుగా, గృహంలో విచిత్ర స్వభావం, అభిరుచి కలవారుంటారు. ఆ కారణం చేత పరస్పరం కలహం జరుగుతూ వుంటుంది. గృహంలో శాంతి, ఆదర్శశిక్షణ కూడా శివుని వల్లనే లభిస్తాయి.

**ప్రకృతి సంక్షేమం :**

మహాపార్థివేశ్వరుడైన హిమవంతుని 'మహాశక్తి స్వరూపిణియైన పుత్రిక' పార్వతీదేవి పరిణయం శివునితో జరగడం చేతనే విశ్వ కళ్యాణం జరుగుతుంది. ఏవిధమైన శక్తి అయినా, ధర్మంతో సంయోగం కానంత

వరకు కళ్యాణప్రదం కాజాలదు. ఆసురీ శక్తి తపస్సు కోరనే కోరదు. అప్పుడు, ఆ శక్తికి శివునితో గానీ, ధర్మంతో గానీ సంగమం ఎలా సంభవిస్తుంది?

రక్తబీజ, శుంభ నిశుంభాది దైత్యులు ఎవరూ ప్రకృతి విజేతలు కాలేకపోయారనడం స్పష్టం. కానీ అందరూ ప్రకృతి వల్ల పరాజితులే. ప్రకృతి యొక్క అంశలైన కామ, క్రోధ, లోభ, మోహ, దర్పాదుల చేత అడుగడుగునా భగ్న మనోరథులౌతుంటారు. గుణత్రయాతీతుడు, ప్రకృతి కంటె అతీతుడు, భగవంతుడు అయిన శివుడు మాత్రమే ప్రకృతిని జయిస్తాడు. కాబట్టే 'ప్రకృతి మాత' శ్రీ శంకరునే తన పతిగా స్వీకరించింది. ఇంతేకాదు - కందర్ప విజేతయైన శివుని పొందడానికై ఆమె ఘోరతపం ఆచరించింది.

ఈ నాటి ప్రపంచం శుంభ నిశుంభుల్లా విపరీత మార్గం లో ప్రకృతిపై విజయం కోరుతోంది. కాబట్టి ప్రకృతి అనేకవిధాలుగా ప్రపంచ సంహారం చేస్తోంది.

పార్థివ (పృథ్వీ సంబంధమైన), ఆప్య (ఉదక సంబంధమైన), తైజస (అగ్ని సంబంధ మైన) మొదలైన వివిధ తత్త్వాల అన్వేషణమూ, జలంపైనా, భూమిపైనా, ఆకాశంమీద శాసనం చేయడం, సముద్రతలంలోగల జంతువుల శాంతిని సైతం భగ్నం చేయడం, వివిధ యంత్రాలను ఆవిష్కరించడం, వానిని ఉపయోగించడమే, ఈనాటి ప్రకృతి జయం.

ఇంద్రియాలు, మనోబుద్ధులు - వీటిని నియంత్రించడంలో గల విలువ నేడు ఏమీ లేదు.

ప్రకృతి కూడా బొగ్గు, ఇనుము, తైలము మొదలైన అతిసాధారణాలైన వస్తువుల్ని నిమిత్తంగా చేసి, ఆ యంత్రాల చేతనే వారి సంహారం చేయిస్తోంది.

**పరమదయామయుడు :**

శివుని 'అనార్య' దేవత అని పాశ్చాత్యుల మిడిమిడి పరిశోధనలు ఒంటబట్టిన కుహనా మేధావుల మాట. అది పూర్తిగా మూర్ఖపు మాట.

శివారాధన మరచిపోవడం వల్లనే దేశానికి మంగళం కలగడం లేదు.

క్షీరసాగర మధనం చేసినప్పుడు హాలాహలం ఉద్భవించింది. దాని జ్వాలల చేత సకల దేవతా బృందం దగ్ధం కాసాగింది. అప్పుడు శివుడు ఆ గరళపానం చేసి సకల దేవతాసహితంగా సకల లోకాలను కాపాడాడు. అజ్ఞాను లైనవారు అట్టి పరమ కారుణమూర్తి యైన శివుని భజించడం లేదు. శంకర సదృశుడైన కృపాళువు మరి ఎవరుంటారు? ✦

# లింగార్చన

'లింగం' అంటే చిహ్నం అని అర్థం. సర్వస్వరూపుని పూజ ఎట్లు చేయగలం? కాబట్టి, లింగకల్పన చేయబడింది.

ఆదియందు, అంతమున, జగత్తు అండాకారంగానే ఉంటుంది. కాబట్టి, బ్రహ్మాండం యొక్క ఆకృతియే శివలింగం.

**''లీయమానమిదం సర్వం**
**బ్రహ్మణ్యేవ హి లీయతే''**

సర్వం దేనియందు 'లీనమై' ఉంటుందో, ఆ పరబ్రహ్మమే లింగం. ''లింగగర్భం జగత్ సర్వం'' - అని ఋషివాక్యం.

కోరికలననుసరించి శివలింగరీతులు కూడా భిన్నాలుగా ఉంటాయి. యవమయ లింగం, గోధుమమయలింగం, లవణజ లింగం, త్రికటుమయ (శొంఠి, పిప్పలి, మిరియాలతో కూడిన) లింగం ఐశ్వర్య ప్రదాలు, పుత్ర్యాద్యభీష్టప్రదాలైన లింగాలు. గోఘృత మయలింగం బుద్ధివర్ధకం, పార్థివ (మట్టి) లింగం సర్వాభీష్టప్రదం. తిలపిష్టమయ, గుడమయ, గంధమయ, శర్కరామయ, గోమయజ, దధిమయ, ఫలమయ, ధాన్యమయ, పుష్పమయ, నవనీతమయ, దూర్వాకాండ సముద్భవ, కర్పూరజ, ఆయస్కాంతమయ, వజ్రమయ, మౌక్తికమయ, మహానీలమయ, మహేన్ద్రనీలమణిమయ, స్ఫాటిక, వైఢూర్య, హైమ (బంగారం), రాజత (వెండి), కాంస్యమయ, అష్టధాతు నిర్మిత, తామ్రమయ, రక్తచన్దనమయ, కస్తూరికామయ, కుంకుమమయ, శ్వేతాగరుమయ, పారదమయ లింగాలు భిన్న భిన్న కామనా పూర్తికై పూజనీయాలని చెప్పబడ్డాయి. 'బాణలింగం', 'నార్మద లింగం' సాక్షాత్తు శివస్వరూప మని చెప్పబడింది. శివలింగ విశేషాలు, పూజలు, విధానాలను గురించి శాస్త్రాలలో చాలా చాలా విషయాలు వివరించారు.

లింగరూపమే కాక - గంగాధర, చంద్రశేఖర, త్రిలోచన, పంచవక్త్ర, నీలకంఠ, కృత్తివాస, వ్యాఘ్రచర్మాసన, త్రిశూలధర, వృషభ ధ్వజ, సాంబసదాశివ రూపములు, లోకోత్తర సౌందర్యోపేతములు, మాధుర్య సంపన్నములు అయిన భగవద్రూపాలు ఎన్నో!

**- 'యతిచక్ర చూడామణి' శ్రీకరపాత్రి స్వామి**

# భారతదేశ చరిత్ర - V

యు.ఎస్.ఎన్.మూర్తి

మన సిద్ధాంత గ్రంథాల ప్రకారం కలి యుగం క్రీ.పూ. 3102లో ఆరంభమయింది. ఋగ్వేదంలో చెప్పబడిన ''ఆర్ద్రా నక్షత్రంలో విషువత్తు సంభవించిన కాలం'' కూడా ఇదేనని నిర్ద్వందంగా నిరూపించడం జరిగింది. కాబట్టి మహాభారత యుద్ధం క్రీ.పూ. 3139లో జరిగిందనడం నిర్వివాదాంశం. ఈ తేదీ ఆధారంగా కలియుగ రాజవంశాల కాలాన్ని ఇప్పుడు పరిశీలిద్దాం.

మహాభారత యుద్ధంలో మరణించిన బృహద్రథుని వంశీకులు 22 మంది బార్హద్రథులు మగధను 1006 సంవత్సరాల పాటు పాలించినట్లు మత్స్యపురాణం చెప్పింది. వారి తరువాత మగధ సింహాసనం 'ప్రద్యోతు'ల హస్తగతమైంది. 5 గురు ప్రద్యోతులు 138 సంవత్సరాలు రాజ్యం చేశారు.

ప్రద్యోతుల అనంతరం 10 మంది శిశునాగులు 360 సంవత్సరాలు పాలించినట్లు విష్ణుపురాణం ప్రవచించింది.

శిశునాగుల అనంతరం 9 మంది నందులు నూరు సంవత్సరాలు మగధను పాలించినట్లు వాయుపురాణం చెప్పింది.

నందుల నుండి మగధసింహాసనం మౌర్యుల హస్తగతమై 12 మంది మౌర్యచక్రవర్తులు 316 సంవత్సరాలు పరిపాలించినట్లు భాగవత పురాణం చెప్పింది.

మౌర్యుల తదనంతరం 10 మంది శుంగ వంశజులు 300 సంవత్సరాలు, నలుగురు కణ్వులు 85 సంవత్సరాలు, 32 మంది ఆంధ్ర చక్రవర్తులు 506 సంవత్సరాలు, ఆ తరువాత గుప్తులు 8 మంది 245 సంవత్స రాలు పాలించారని కలియుగ రాజ వృత్తాంతం ద్వారా తెలుస్తోంది.

ఆయా వంశాల రాజుల క్రమాన్ని ఒక పట్టికగా పొందుపరిస్తే ఈ క్రింది విధంగా వస్తుంది :-

| | | | | |
|---|---|---|---|---|
| 1. మహాభారత యుద్ధం | | | | క్రీ.పూ. 3139 |
| 2. బార్హద్రథులు | (22) | 1006సం॥ | క్రీ.పూ. 3139 నుండి | క్రీ.పూ. 2133 వరకు |
| 3. ప్రద్యోతులు | (5) | 138 సం॥ | క్రీ.పూ. 2133 నుండి | క్రీ.పూ. 1995 వరకు |
| 4. శిశునాగులు | (10) | 360 సం॥ | క్రీ.పూ. 1995 నుండి | క్రీ.పూ. 1635 వరకు |
| 5. నందులు | (9) | 100 సం॥ | క్రీ.పూ. 1635 నుండి | క్రీ.పూ. 1535 వరకు |
| 6. మౌర్యులు | (12) | 316 సం॥ | క్రీ.పూ. 1535 నుండి | క్రీ.పూ. 1219 వరకు |
| 7. శుంగులు | (10) | 300 సం॥ | క్రీ.పూ. 1219 నుండి | క్రీ.పూ.919 వరకు |
| 8. కణ్వులు | (4) | 85 సం॥ | క్రీ.పూ. 919 నుండి | క్రీ.పూ. 834 వరకు |
| 9. ఆంధ్రులు | (32) | 506 సం॥ | క్రీ.పూ. 834 నుండి | క్రీ.పూ. 328 వరకు |
| 10. గుప్తులు | (8) | 245 సం॥ | క్రీ.పూ. 328 నుండి | క్రీ.పూ. 83 వరకు |

ఈవిధంగా వచ్చిన కాలాలు సప్తఋషి యుగ విధానంలో చెప్పబడిన కాలాలతో సరిపోతాయేమో చూద్దాం.

అ) ''ధర్మరాజు కాలంలో సప్తర్షులు మఖలోనూ, మహాపద్మనందుడి కాలంలో శ్రవణంలోనూ ఉన్నారు. పరీక్షిత్తు నుండి మహాపద్మనందుడికి 1500 సంవత్సరాలు.'' పట్టిక ఆధారంగా 3139 నుండి మహాపద్మనందుడి రాజ్యారంభం 1635 తీసివేస్తే 1504 సంవత్సరాలు వచ్చింది.

ఆ) ''ఆంధ్రుల పరిపాలనారంభంలో సప్తర్షులు మఖ నుండి 24వ నక్షత్రంలో ఉంటారు. అంటే 2300 సంవత్సరాల వ్యత్యాసం.'' పట్టిక

ఆధారంగా 3139 నుండి ఆంధ్రుల పరి పాలనారంభ కాలం 834 తీసివేస్తే 2305 సంవత్సరాలు.

ఇ) ''మహా పద్మనందుడి నుండి ఆంధ్రులకు 800 సంవత్సరాలు.'' పట్టిక నుండి మహాపద్మనందుడి కాలం 1635 నుండి ఆంధ్రుల కాలం 834 తీసివేస్తే 801 సంవత్సరాలు.

ఈ) ''సప్తర్షులు తిరిగి పునర్వసు చేరినప్పుడు గుప్త సామ్రాజ్యం పతనావస్థలో ఉంటుంది.''

సప్తర్షులు రెండవ చుట్టులో (మఖ నుండి) పునర్వసు చేరడానికి 3000 సంవత్సరాలు (31 నక్షత్రాల వ్యత్యాసం కాబట్టి) పడుతుంది. పట్టిక ఆధారంగా 3139 నుండి 3000 సంవత్స రాలు తీసివేస్తే 139 వస్తుంది. గుప్తుల పరి పాలన 83లో అంతమైంది.

మన ఖగోళ సిద్ధాంతాల ఆధారంగాను, వేదాల ఆధారంగాను, సిద్ధాంతగ్రంధాల ఆధారంగాను ఏవిధంగా చూసినా పురాణ ప్రవచిత రాజవంశావళులు తిరుగులేని సత్యాలని ఋజువయింది. చరిత్రకారులు కూడా ఈ రాజవంశావళుల క్రమాన్ని ఒప్పుకున్నా అనేక కారణాల వల్ల ఆయా కాలాలను మాత్రం తారుమారు చేశారు.

దీనికి కొట్టవచ్చినట్లు కనిపించే ఉదాహరణ చంద్రగుప్తుడు. మన చరిత్ర గ్రంధాలను తిరగవేస్తే దాదాపు అన్ని గ్రంథాలు కూడా అలెగ్జాండరు భారతదేశ దండయాత్రతోనే ప్రారంభమౌతాయి. ఇదమిత్థమైన చరిత్ర మౌర్యుల చరిత్రతోనే ఆరంభమైంది. అంతకు ముందరి చరిత్రను గూర్చిన ఊహాగానాలు, అభిప్రాయాలు మాత్రమే కనిపిస్తాయి తప్ప ఖచ్చితమైన సమాచారం లభించదు. దీనికి కారణం ఏ చరిత్రకారుడూ ఆ దిశలో పరిశోధన చేయకపోవడం. పరిశోధనలు చేసిన వాళ్లను పట్టించుకోకపోవడం.

ఇదివరకు చెప్పుకున్నట్లు భారత చరిత్రను గ్రంథస్థం చేయడం ఆరంభించినవారు విదేశీ మేధావులు. వారి సంకుచిత భావాలకు, ఈర్ష్య అసూయలకు జీవం పోసి తందానతాన పలికారు స్వదేశీ మేధావులు. వీరికి సహకరించాయి- అసంబద్ధమైన మన భాష్యాలు. గ్రీకు రచయితల గ్రంథాలు. ప్రాచీన భారత చరిత్రను వీలైనంత అర్వాచీనం చేయాలనే వాళ్లందరి ప్రయత్నాలకు ఊపిరి పోసింది చంద్రగుప్త నామం.

మెగస్తనీసు 'ఇండికా'లో సాంద్రకోట్టస్ అనే రాజు పాటలీపుత్రాన్ని పాలించినట్లు ఉందని తదనంతర గ్రీకు రచయితలు చెప్పారు. 'సాంద్రకోట్టస్' తరువాత, అతని కుమారుడు 'అలిట్రో ఛేడ్స్' లేదా 'అమిత్రో ఛేడ్స్' రాజ్యం చేశారని వారన్నారు.

సెల్యూకస్ క్రీ.పూ. సుమారు 304 చుట్టుప్రక్కల పాటలీపుత్రం మీద దండయాత్ర చేసినప్పుడు రాజ్యం చేస్తున్న సాంద్రకోట్టస్ ఎవరని ఆలోచించిన చరిత్రకారులకు మౌర్యచంద్రగుప్తుడు, గుప్తచంద్రగుప్తుడు ఎదురయ్యారు. సాంద్రకోట్టస్‌ను గుప్తచంద్రగుప్తుడితో సరిపోలిస్తే భారతచరిత్ర మరింత పురాతనమైపోతుంది. అది ఇష్టంలేని వారు మళ్లీ మెగస్తనీసునే శరణు కోరారు.

ఇండికాలో 'డయనోసిస్' అనే గ్రీకు వీరుడు భారతదేశాన్ని పురాతనకాలంలో ఆక్రమించినట్లు ఉంది. ఆ విషయాన్ని మెగస్తనీసుకు భారతీయ పండితులు చెప్పారట. ఈ డయనోసిస్ ఎవరని ఆలోచిస్తే భారతదేశం మీద ఆర్యుల దండయాత్రలు జ్ఞాపకం వచ్చాయి.

గ్రీసు దేశ చరిత్రలో సుమారు క్రీ.పూ. 1500 ప్రాంతంలో డయనోసిస్ అనే ఆయన తన సైన్యంతో, మేరు పర్వత ప్రాంతం నుండి వచ్చి ఆదేశాన్ని ఆక్రమించుకున్న కథలున్నాయి. కాబట్టి ఈ ఇద్దరు డయనోసిస్‌లు అన్నదమ్ములనీ, ఒకాయన గ్రీసు వేపు వెళితే ఇంకొకాయన ఇండియా వైపు వచ్చారనీ తీర్మానించారు.

దీనికి భారతీయ వాఙ్మయంలో ఋజువులు కావాలి కదా! దాని కోసం మన వేద భాష్యాలను ఆశ్రయించారు. స్వదేశీయులకూ, విదేశీయులకూ కూడా మహారాజశ్రీ మాక్స్ ముల్లర్ గారి వేదభాష్యమే శిరోధార్యం.

ఋగ్వేదంలో అనేక యుద్ధాలు వివరించబడ్డాయి. అందులో ఇంద్రుడి పరాక్రమ గాథలెన్నో. ఇంద్రుడి గుణగణాలు డయనోసిస్‌కి సరిగ్గా సరిపోయాయట (నిజానికి వారిద్దరికి సరిపోయిన గుణం ఒక్కటే. అది మద్యప్రియత్వం. ఇంద్రుడి సురాపాన (అమృతపాన) గుణాన్ని వారు మద్య ప్రియత్వంగా అన్వయించారు.) అందుచేత ఇంద్రుడే గ్రీకు డయనోసిస్ సోదరుడైన భారతీయ డయనోసిస్ అని నిర్ణయించారు. ఇక భారతీయ డయనోసిస్ వంశంలో కొన్ని తరాల తరువాత 'హిరాకిల్స్' (బహుశా హెర్క్యులిస్ కావచ్చు) అనే ఆయన భారతదేశాన్ని ఏలినట్లు మెగస్తనీసు ఉవాచ.

అతడికి మన కృష్ణునికి దగ్గరి పోలికలు కనిపించాయి. సగం కష్టం తీరింది. తరువాతి ప్రయత్నంగా 'పరీక్షిత్తు'ను తీసుకున్నారు. ఆర్యులు ఇండియాకు వచ్చి వేదాలు చెప్పిన తరువాత కాలాన్ని ఇతిహాసాలకాలంగా పరిగణించారు. అంటే సుమారుగా క్రీ.పూ. 1300. ఇతిహాసాల్లో చెప్పిన పరీక్షిత్తుకు చంద్రగుప్తుడికి (మౌర్య) చెప్పబడిన కాలభేదాన్ని తీసుకుని క్రీ.పూ. 304 చుట్టుప్రక్కల రాజ్యంచేసినవాడు మౌర్య చంద్రగుప్తుడే అని తీర్మానించారు. దీనికి ఋజువులుగా అనేక పరిశోధనల్లో లభ్యమైన అరకొర శాసనాల్ని వాడుకున్నారు. వారికి కావలసినట్లు మలచుకున్నారు. సుమారు 1300 సంవత్సరాల చరిత్రను చరిత్ర పుటల్లోనుండి తప్పించడంలో కృతకృత్యులయ్యారు. (సశేషం)

# సంస్కృత బోధన



॥ సరస్వతీ శ్రుతిమహతీ మహీయతామ్ ॥

సరస్వతి! నమస్తుభ్యం వరదే! కామరూపిణి! ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

✤ ✤ ✤

## అక్షరాభ్యాసమ్

భాషాబోధనలో ముందు 'లిపి'ని– అంటే ఆ భాషలోనున్న అక్షరాలను నేర్చుకుంటాం. సాధారణంగా ఏభాషనైనా, మరో భాష వారు ఉచ్చారణకోసం వారి భాషా లిపిలోనే వ్రాసుకోవడం కద్దు. *'Tree'* అనే ఇంగ్లీషు పదాన్ని, 'ట్రీ' అని తెలుగువాళ్లు వ్రాసుకోవచ్చు. కానీ ఇంగ్లీషు లిపిలో మాత్రం– *'TREE'* అనేకదా.

అలాగే మనం సంస్కృతాన్ని తెలుగులో 'రామాయ నమః'– అని వ్రాస్తున్నా, దాని లిపి అది కాదు. रामाय नमः – అని వ్రాయాలి. అయితే ఈ లిపి చూడగానే మనం 'హిందీలిపి' అనుకుంటాం, కానీ ఇది సంస్కృత లిపి. దీనినే 'దేవనాగరలిపి'– అని అంటారు.

హిందీభాషకి లిపిలేదు. కాబట్టి వారు ఈ 'దేవనాగరలిపి'నే హిందీ లిపిగా వాడుకున్నారు. మన తెలుగు మొదలైన భాషలకు వాటికంటూ ప్రత్యేకమైన లిపి ఉంది.

ఇప్పుడు 'దేవనాగరలిపి'లోని అక్షరక్రమాన్ని నేర్చుకుందాం.

ఒక్కవిషయం – 'వర్ణ (అక్షర) క్రమం' మన భారతీయ భాషలన్నిట్లోనూ ఒక్కటే. 'అ'తో మొదలయ్యే అచ్చులు, 'క'నుండి హల్లులు... ఈ పద్ధతికి మూలం ప్రథమంగా సంస్కృతి భాషలో ఏర్పరచిన వర్ణక్రమమే, ఒక క్రమానుసారంగా శాస్త్రీయ పద్ధతిలో కూర్చిన అక్షర క్రమమిది.

## – అచ్చులు –

| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ౠ | ఌ | ఏ | ఐ | ఓ | ఔ | అం | అః |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| अ | आ | इ | ई | उ | ऊ | ऋ | ॠ | ऌ | ए | ऐ | ओ | औ | अं | अः |

## – హల్లులు –

| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ | ఢ | ణ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| क | ख | ग | घ | ङ | च | छ | ज | झ | ञ | ट | ठ | ड | ढ | ण |
| త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ | శ |
| त | थ | द | ध | न | प | फ | ब | भ | म | य | र | ल | व | श |
| ష | స | హ | ళ | క్ష | | | | | | | | | | |
| ष | स | ह | ळ | क्ष | | | | | | | | | | |

## – గుణింతాలు –

| ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ౠ | ఌ | ఏ | ఐ | ఓ | ఔ | అం | అః |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ा | ि | ी | ु | ू | ृ | ॄ | ॢ | े | ै | ो | ौ | ं | ः |

## – ఉదాహరణ –

| క | కా | కి | కీ | కు | కూ | కృ | కౄ | కౢ | కే | కై | కో | కౌ | కం | కః |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| क | का | कि | की | कु | कू | कृ | क | कॢ | के | कै | को | कौ | कं | कः |

# స్వరూపమ్

సంస్కృత భాష అంతా ముఖ్యంగా 'సుబంతములు', 'తిఙ్గంతములు' అనే రెండు విభాగములుగా ఉంటుంది. భాష యొక్క

లక్షణం, వాక్య నిర్మాణం మీద ఆధారపడి ఉంటుంది. వాక్యమునకు కర్త, కర్మ, క్రియ అనేవి ప్రధానమైనవి. వాటి వలననే వాక్య నిర్మాణము జరుగుతుంది. వాటిలో కర్త, కర్మలను తెలియజెప్పేవి ''సుబంతములు''. క్రియను తెలియజెప్పేవి 'తిఙంతములు'. వీటి గురించి వివరంగా తెలుసుకుంటే, దాదాపు అంతా తెలిసినట్లే. ముందుగా వీటిలో ''సుబంతములు'' గురించి తెలుసుకుందాం.

# సుబంతములు

నామవాచకములు, సర్వనామములు, భావ వాచకములు, విశేషణములు అన్నీ సుబంతములు క్రిందకి వస్తాయి. వీటిని ''శబ్దములు'' అని కూడా అంటారు. ''అవ్యయములు'' కూడా సుబంతములే. కాని వాటికి ''లింగ'', ''వచన'', ''విభక్తు''లుండవు, మిగిలిన అన్ని శబ్దాలాబీ లింగ వచన విభక్తి తేడాలు ఉంటాయి.

**లింగము :** శబ్దాన్ని, అర్థాన్ని బట్టీ, ''లింగము'' మూడు రకాలుగా విభజింపబడుతుంది. అవి ''పుంలింగము'' - ''స్త్రీ లింగము'' - ''నపుంసక లింగము''.

**ఉదాహరణకు:**

పుంలింగము : రామః - కృష్ణః - సర్పః - వృక్షః

స్త్రీలింగము : సీతా - రాధా - లతా(తీగ) - డోలా (ఉయ్యాల)

నపుంసకలింగము : ధనమ్ - వనమ్ - పుష్పమ్ - ఫలమ్

**వచనము:**

ఏ భాషకయినా వచనములు రెండు మాత్రమే ఉన్నాయి. అవి ''ఏకవచనము'', ''బహువచనము''. కాని సంస్కృత భాషలో ''ద్వివచనము'' అని మరొకటి ఉంది.

**ఏకవచనము** : ఒక ఒక వ్యక్తిని గురించిగాని, ఒకే ఒక వస్తువును గురించి గాని చెపుతుంది.

**ద్వివచనము** : కేవలం ఇద్దరు వ్యక్తులను గురించిగాని, రెండు వస్తువుల గురించి గాని చెపుతుంది. (ఉదా: ''మీరిద్దరూ ఇలా రండి.'')

**బహువచనము** : చాలా మందిని గురించి గాని, చాలా వస్తువులను గురించి గాని చెపుతుంది.

వాటి రూపాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

**ఉదాహరణ:**

| ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|
| రామః | రామౌ | రామాః |
| కృష్ణః | కృష్ణౌ | కృష్ణాః |
| గోవిందః | గోవిందౌ | గోవిందాః |
| వృక్షః | వృక్షౌ | వృక్షాః |

విభక్తి : విడివిడిగా ఉన్న శబ్దాలను, దగ్గరకు చేర్చి, వాక్యంగా నిర్మించడానికి విభక్తి ఉపయోగపడుతుంది. తెలుగుకి మల్లేనే, సంస్కృతంలో కూడా విభక్తులు ఎనిమిది రకాలుగా ఉంటాయి. వాటి వివరం చూద్దాం.

| | పులింగము | స్త్రీలింగము | నపుంసకలింగము |
|---|---|---|---|
| ప్రథమా విభక్తి: | రామః | సీతా | జ్ఞానమ్ |
| (డు, ము, వు, లు) | (రాముడు) | (సీత) | (జ్ఞానము) |
| ద్వితీయా విభక్తి: | రామం | సీతాం | జ్ఞానమ్ |
| (ని, ను, ల, కూర్చి, గురించి) | (రాముని) | (సీతను) | జ్ఞానమును) |
| తృతీయా విభక్తి: | రామేణ | సీతయా | జ్ఞానేన |
| (చేతన్, చేన్, తోడన్, తోన్) | (రాముడితో) | (సీతచేత) | (జ్ఞానముతో) |
| చతుర్థీ విభక్తి: | రామాయ | సీతాయై | జ్ఞానాయ |
| (కొఱకున్, కై) | | | |
| పంచమీ విభక్తి: | రామాత్ | సీతాయాః | జ్ఞానాత్ |
| (వలనన్, కంటెన్, పట్టి) | | | |
| షష్ఠీ విభక్తి: | రామస్య | సీతాయాః | జ్ఞానస్య |
| (కిన్, కున్, యొక్క, లో, లోపల) | | | |
| సప్తమీ విభక్తి: | రామే | సీతాయాం | జ్ఞానే. |
| (అందున్, నన్) | | | |
| సంబోధనా ప్రథమా విభక్తి: | హేరామ! | హేసీతే! | హేజ్ఞాన! |
| (ఓ, ఓయి, ఓరి, ఓసి) | | | |

ఇవి అన్నీ, విభక్తులలో అకారాంత ఏక వచన శబ్దములు. ఇలాగే హరి, గౌరీ వంటి ఇకారాంత శబ్దములు; సాధు, వధూ వంటి ఉకారాంత శబ్దములు; ధాతృ, మాతృ వంటి ఋకారాంత శబ్దములు కూడా ఉన్నాయి. అలాగే ద్వివచన, బహువచన రూపములు కూడా ఉన్నాయి. అవన్నీ క్రమంగా తెలుసుకుందాం.

# తిఙ్ఙంతములు

వీటిని ''క్రియాపదములు'' అని కూడా అంటారు. ఈ క్రియా పదములు, ధాతువుల మీద ఏర్పడతాయి. వీటికి లింగ భేదము లేదు. ఇవి ప్రథమ పురుష – మధ్యమ పురుష – ఉతమ పురుష, ఏకవచన – ద్వివచన – బహు వచన, భూత – భవిష్యత్ – వర్తమాన – విధి కాల భేదములతో ఉంటాయి.

**ఉదాహరణ:**

ప్రథమ పురుష – (వాడు) భవతి (ఉన్నాడు)(ఉన్నది)

మధ్యమ పురుష – (నీవు) భవసి (ఉన్నావు)

ఉత్తమపురుష – (నేను) భవామి (ఉన్నాను)

ఈ రూపములు వర్తమానకాల ఏకవచన రూపములు. మిగిలిన రూపములు కూడా క్రమంగా తెలుసుకుందాం.

✤ ✤ ✤

# BHARATHISM



*Namaste Sarade Devi, Veena Pustaka Dharini,*
*Tvamaham Prarthaye nityam, Vidyadanam pradehi me.*

Dr. JayaVenugopal

## Artha Sastra
(అర్థశాస్త్రం)

Every living being has an instinct to survive and therefore seeks some form of security.
In the vision of the Vedas there are four fundamental human pursuits.
They are called ***purusarthas*** (పురుషార్థాలు).

*Dharma -ethics* (ధర్మ)

*artha -security* (అర్థ)

*kama - pleasures* (కామ)

(మోక్ష) *moksa -liberation*

### Artha Sastra

Society has evolved a system of administration to protect the rights of every individual. The discipline that deals with healthy administration is called artha-sastra, state-craft. It also refers to economic infrastructure , wherein an individual has the right and opportunity to earn and protect his or her wealth

## Origin

It is believed that **Lord Brahma** composed this treatise to ensure harmony and peace in society. The work originally consisted of one hundred thousand chapters dealing with dharma, artha and kama. Seeing the life-span reducing in each yuga, Lord Siva reduced the work to ten thousand chapters. His work is called **Vaisalaksa -sastra**. Indra further edited to five thousand chapters known as **Bahundantaka**. Later Brhaspati abridged the work to three thousand chapters known as **Barhaspatya** - sastra and finally Usanas reduced the work to one thousand chapters, called **Ausanasa -sastra**.

(ఔసానస)

## Kautilya's Artha Sastra

The definitive work on artha-sastra is attributed to **Kautilya**, also known as Canakya and Visnugupta. (కౌటిల్య)

Kautilya, was the mentor of the great emperor Candragupta.
Scholars trace the date of this work to fourth century B.C. in his work, Kautilya refers to a number of other sources and his work includes compilations of these earlier works.

The artha -sastra consists of **fifteen** chapters. The topics are --

* education and training of a prince to rule a kingdom.
* Duties of various officers of the state or civil administration.
* Civil, criminal and personal law,
* Duties of a minister,
* Acquiring high rank in the state
* Seven constituents of an ideal state -[ king, chief minister, land, fortified capital, treasury, army and ally]
* Sixfold diplomacy in dealing with other kingdoms
* Routines of a king and his possible improprieties
* Preparations and precautions to be taken for war.
* Descriptions of war
* Policies towards oligarchies
* Means of support for a weak king against a powerful one, when the former is threatened by the latter
* Capturing a fort
* Using occult practices to eliminate enemies and traitors
* Methods of handling a subject matter.

Since the society was founded on the system of Varnasrama-dharmas based on the Vedic social order, protecting these dharmas was the foremost duty of the ruler.

PURANAS

# PACT

# PURANAS


Sargasca
Vamso Pratisargasca
Vamsanucaritam Manvantarani ca !
Puranam capi
pancalaksanam!!


Purana describes
(సర్గ) Sarga - creation


Pratisarga - renovation


Vamsa - history of Sages


Manavantara - period of Manus


Vamsanucarita - genelogy of Kings

There are eighteen puranas. Visnu based Siva based and puranas based on Brahma.









Visnu purana
Bhagavata purana
Naradiya purana
Garuda purana
Padma purana
Varaha purana

## Visnu purana



Sage Parasara narrated to Maitreya. It has Six amsas and 23000 slokas. It speaks about Dasavatara. It is estimated that it is compiled between 1st and 2nd century AD



## Bhagavata Purana

Vyasa compiled the purana in 11th century AD. It speaks of all incarnations of Visnu. It has 12 Skandas and 18000 slokas.

## Naradiya Purana

Narada narrated it to Sanatkumara. It has 25000 verses and it is in narration form.



## Garuda Purana

In this purana, Visnu instructs Garuda, He speaks about Astronomy, medicine grammar and life after death.



It has 8000 verses and is composed after Kalidasa.

## స్వామీజీ-చార్వాకరావు

# అనగనగా...

విశ్వనాథ పావనిశాస్త్రి

స్వామి సత్యనాథానంద ఏదో గ్రంథం చదువుతున్నారు. ఆశ్రమ ప్రాంతంలోని బడి పిల్లలందరూ ఆయన చట్టూ చేరారు. చిరు నవ్వు నవ్వుతూ స్వామి వాళ్ళవైపు చూశారు.

'స్వామీ! ఏదైనా కథ చెప్పరూ?' అని అడిగారు పిల్లలు.

స్వామివారు గ్రంథం మూసి ఆకాశంవైపు చూశారు. పున్నమి చంద్రుడు రెండు బారలు పైకొచ్చాడు. ఏదైనా ఒక చిన్న కథ చెపితే, పిల్లలు యిళ్ళకి వెళ్ళి, భోజనం చేసి పడుకుంటారు! ఏం కథ చెప్పాలి?

ఆలోచిస్తూ స్వామివారు ఇలా అన్నారు, ''పిల్లలూ! మా చిన్నప్పుడు, మా పెద్దవాళ్ళు ఒక కథ చెప్పేవారు. ఇప్పుడు మీకు నేను ఆ కథ చెప్తాను. నేనా కథ మొదలు పెట్టంగానే, మీకు తెలిసిన కథే అనిపిస్తుంది కాని మీ తరం వాళ్ళకి, ఆ కథ పూర్తిగా తెలియదు. ఒక వేళ తెలిసినా, ఆ కథ అలా ఎందుకు చెప్పారో తెలియదు.''

స్వామివారు యిలా అంటూండగా రాబర్ట్ వచ్చాడు. స్వామివారికి నమస్కరించి, తానూ పిల్లల్తో కలిసి కూర్చున్నాడు.

రాబర్ట్ కూర్చున్న తర్వాత, స్వామివారు యిలా మొదలు పెట్టారు: ''- అనగనగా ఒక రాజుగారుండేవారు. ఆయనకి ఏడుగురు కొడుకులు. ఏడుగురూ వేటకెళ్ళారు. ఏడు చేపలు తెచ్చారు.-''

స్వామివారు యిలా చెపుతున్నంతలో, చార్వాకరావు వచ్చాడు. వస్తూనే, ''ఏం స్వామీ! మళ్ళీ మొదలు పెట్టారా ఈ పాత చచ్చుకథలు? రాజుగారికి ఏడుగురు కొడుకులు! వేటకి వెళ్ళారు! ఏడు చేపలు తెచ్చారు! బలే, బలే! చేపలు అడవుల్లో ఉంటాయి కాబోలు!'' అని వెక్కిరింపుగా నవ్వాడు.

స్వామివారు అతడిని నిశితంగా చూస్తూ, ''వేటకి వెళ్ళాలంటే, అడవిలోకి వెళ్ళక్కరలేదు. సముద్రంమీదికి కూడా వెళ్ళచ్చు. దాన్ని కూడా వేట అనే అంటారు. నీకు అది కూడా తెలియదు. నువు ఎక్కిరించడానికి మాత్రం సిద్ధం.'' అని రాబర్ట్‌ని చూస్తూ; ''వేట సప్తవ్యసనాలలో ఒకటి. ఆ విషయం ధ్వనింపజెయ్యడానికే ఈ కథలో రాజుకి ఏడుగురు కొడుకులు'' అన్నారు.

రాబర్ట్ మెల్లిగా ''స్వామీ! ఒక చిన్న సందేహం.'' అన్నాడు. స్వామివారు అతడివైపు చూసి, ''అడుగు'' అన్నారు.

''వేట రాజధర్మం అన్నారుగదా! మరి... వ్యసనం, ధర్మం ఎలా అవుతుంది?'' అని అడిగాడు రాబర్ట్.

స్వామివారు పిల్లలవైపు చూసి, ''ప్రశ్నలు అడగవలసిన తీరుయిది!'' అని నవ్వి, ''ప్రజా రక్షణార్థం క్రూర జంతువులను సంహరించడం వరకు పరిమితమైన వేట మాత్రమే రాజధర్మం. అది దాటి, వినోదం కోసం చేస్తే మటుకు అది వ్యసనమే!'' అన్నారు.

రాబర్ట్ సంతృప్తిగా తలాడించాడు.

''ఇక తర్వాతి కథ చెప్పుకుందామా?'' అన్నారు స్వామివారు. పిల్లలు కూడా తలాడించారు.

స్వామివారు మళ్ళీ మొదలు పెట్టారు:

''- తెచ్చిన ఏడు చేపలనీ, రాజుగారి కొడుకులు ఎండ బెట్టారు. అందులో ఒక చేప ఎండలేదు. దాన్ని ఎండబెట్టిన రాజుగారి కొడుకు, 'చేపా! చేపా! ఎందుకు ఎండలేదు?' అని అడిగాడు.

చేప, 'గడ్డిమోపు అడ్డం వచ్చింది' అంది.

రాజకుమారుడు గడ్డి మోపు దగ్గరికి వెళ్ళి ''గడ్డిమోపా! గడ్డిమోపా! ఎందుకు అడ్డు వచ్చావు?' అని అడిగాడు. దానికి సమాధానంగా గడ్డిమోపు, ''మరి నన్ను ఆవు మెయ్యలేదుగా!'' అంది.

ఇలా స్వామివారు చెప్తున్నంతలో చార్వాకరావు మళ్ళీ ఏదో అనబోయాడు. రాబర్ట్ అతడివైపు చూశాడు. చార్వాకరావు ఆగిపోయాడు.

స్వామివారు చెప్తున్నారు, '' ఆ రాజకుమారుడు ఆవు దగ్గరికి వెళ్ళాడు. వెళ్ళి, 'ఓసి ఆవూ! నువు గడ్డి ఎందుకు మెయ్యలేదూ?' అని అడిగాడు. దానికి ఆవు, 'ముసలమ్మ నన్ను కట్టేసింది గదా! ఆ కట్టు విప్పలేదు. మరి ఎలా తినను?' అంది. రాజకుమారుడు ముసలమ్మ దగ్గరికి వెళ్ళి, ''ముసలమ్మా! ముసలమ్మా! ఆవుని ఎందుకు విప్పలేదూ?'' అని అడిగాడు. ముసలమ్మ, ''పిల్లవాడు ఏడ్చాడు నాయనా!'' అంది. రాజకుమారుడు పిల్లవాడినడిగాడు, ''పిల్లవాడా! పిల్లవాడా! ఎందుకు ఏడ్చావు?' అని. దానికి పిల్లవాడు, ''చీమకుట్టింది'' అన్నాడు. రాజకుమారుడు, ''చీమా! చీమా! ఎందుకు కుట్టావు?'' అని అడిగాడు. దానికి సమాధానంగా చీమ ''మరి నా బంగారు పుట్టలో వేలు పెడితే నే కుట్టనా?'' అని

వెళ్ళిపోయింది. -'' అని కథ ముగించారు స్వామివారు.

పిల్లలు ''బలే! బలే'' అని చప్పట్లు కొట్టారు.

రాబర్ట్, ''వండర్‌ఫుల్!'' అన్నాడు.

చార్వాకరావు ఎందుకో సహించలేక పోయాడు ''ఏమిటయ్యా రాబర్టూ! ఏమిటి వండ్రఫుల్, నువు కూడానూ? రాజకుమారు లట, వేటకెళ్ళారుట, చేపలు తెచ్చారుట! ఎండబెట్టారుట! ప్రశ్నవేశారుట! చచ్చిన చేప, గడ్డిమోపు మాట్లాడాయిట! చివరికి చీమ సమా ధానం చెప్పిందిట - నా బంగారు పుట్టలో వేలు పెడితే కుట్టనా - అని! కథ అయిపోయిందిట. దీనికేమైనా అర్థం ఉందా?'' అని విరుచుకు పడ్డాడు.

రాబర్ట్ సీరియస్‌గా చూస్తూ, ''ఈ కథ యొక్క అర్థం తెలియని నీవంటి వాళ్ళు రాజ్యం చేస్తుండబట్టే, ప్రస్తుతం మీ దేశం యిలా ఉంది!'' అన్నాడు.

చార్వాకరావు, ''ఆc!'' అని ఆశ్చర్య పోయాడు.

''ఔను, అందుకే చెప్తున్నాను. రాబర్ట్! జాగ్రత్తగా విను. నీకే అర్థమౌతుంది, యిది ఎంత గొప్పకథో?! రాజకుమారులు వ్యసనం కొద్దీ వేటకెళ్ళారు. అందులో ఒకడు, తెచ్చిన చేప ఎండలేదు. ఎందుకు ఎండలేదు? గడ్డి మోపు అడ్డం వచ్చింది. అంటే, అర్థం ఏమిటి? ఎండకి ఆ గడ్డిమోపు అడ్డం వస్తుందని చూసు కోకుండా ఈ రాజకుమారుడు అక్కడ ఎండ బెట్టాడన్నమాట! అంటే తెలివి తక్కువ వాడన్న మాట.

నిజంగా తెలివి తక్కువ వాడా? కాదు. అయితే చేప ఎందుకు ఎండలేదు అన్న విషయం మీద యిన్ని ఆరాలు తియ్యడుగదా! కాబట్టి, ఎండ వచ్చే సమయానికి అక్కడ గడ్డిమోపు అక్కడే ఉంది. ఎందుకు ఉన్నదీ అని ఆరాలు తీశాడు. తియ్యగా, తియ్యగా చివరికి పిల్ల వాడిని చీమకుట్టడం కారణం అని తెలి సింది.

కాబట్టి దీనిని బట్టి తేలింది ఏమిటి? ఎక్కడో ఒక పని పాడైతే, దాని కారణం మరె క్కడో ఉంటుందన్న మాట! రాజకుమారుడైన వాడు లేదా రాజ్యాన్ని రేపు పాలిద్దామనుకునే వాడు- ఆ కారణాలని జాగ్రత్తగా వెతికి బయ టికి లాగాలి. అది చచ్చిన చేపయినా సరే, ఎండిన గడ్డిమోపైనాసరే, పాలిచ్చే ఆవయినా సరే, ముసలమ్మయినాసరే, పసివాడైనాసరే, ఆఖరికి చీమయినా సరే - ఆరాయి తియ్యా ల్సిందే! ఎందుకంటే, ఆ కారణం, యింత రాజ్యంలో చివరికి చీమయినా కావచ్చు.

ఈ కథలో జాగ్రత్తగా చూడు. మరొక విషయం ఉంది. పాడయింది రాజకుమారుడి పని. దానికికారణం చీమ దగ్గర ఉంది. అది కూడా ఎలా ఉంది? ఎవడో పిల్లవాడు, అజ్ఞానం కొద్దీ, దాని పుట్టలో వేలు పెట్టాడు; దాని యింటిని కెలకబోయాడు; దాని యిల్లు దానికి బంగారం! సహజంగా అది కుట్టింది...

ఈ విధంగా రాజ్యంలోని ఒక అట్టడుగు వాడి సుస్థితికి భంగం కలిగినా, వాడు ఊరు కోడన్న మాట! ఆ మాటే చెప్తాడన్నమాట!

ఇదేకాదు. ఇక్కడ ముసలమ్మ విషయం ఒకటుంది. ఏడ్చిన పిల్లవాడిని, ముసలమ్మ సముదాయించ గలిగింది గాని, వాడిని చీమల పుట్టలో వేలు పెట్టకుండా ఆపలేకపోయింది. ఎందుకని? ఆవుకి గడ్డివెయ్యడం దగ్గర నుంచి, అనేక పనులు ముసలమ్మ మీద పడ్డాయన్న మాట. అది తప్పు! వృద్ధులు జ్ఞాన బోధ చేసే స్థితిలో ఉండాలిగాని, పనులు నెత్తిమీద పడే స్థితిలో ఉండకూడదు. వాళ్ళ అనుభవం - చిన్నవాళ్ళకి జ్ఞానరూపంగా అందాలి గాని, చాకిరీ రూపంలో కాదు. రాజు ఈ విషయం కూడా గ్రహించాలి. లేదా రాజుకి అనవసరమైన సమస్యలు ఎదురౌతాయన్న మాట! వ్యసన పరుడైన రాజుకి అది సమస్యగా మారుతుందన్న మాట.

కాబట్టి తానూ, తన వ్యసనాలూ జాగ్రత్తగా ఉండాలనుకుంటే- రాజైనవాడు అదేమిటో తెలుసుకోవాలి. ముందు సమస్య ఏమిటో తెలుసుకుంటే - దాని పరిష్కారం తర్వాత. ఎందుకంటే ఒక్కొక్క సమస్యకి పరి ష్కారం ఒక్కొక్కరకంగా ఉంటుంది. అందుకనే ఈ కథలో సమస్య ఎలా పుట్టిందో చూపించాడు గాని, దాని పరిష్కారం చూపించలేదు.

నిజానికి పిల్లలకి యిట్లాంటి కథలే చెప్పాలి. అప్పుడే వాళ్ళ బుద్ధి చురుగ్గా పని చేస్తుంది. సమస్యలని ఎలా అర్థం చేసుకోవాలో తెలుస్తుంది. తర్వాత తర్వాత వాటి పరిష్కార మార్గం అర్థం అవుతుంది. అంతేగాని ఆవు తెల్లగా ఉండును, దానికి రెండు కొమ్ములుం డును, నాలుగు కాళ్ళు ఉండును. తోక ఉం డును. ఆవు పాలిచ్చును. ఆవు పాలు తల్లిపాల వంటివి - వంటి పాఠాలు చెప్తే ఏం లాభం? నీవు బళ్ళో చేర్చేటప్పటికే, ఆ విషయం వాడికి తెలుసును. వాడికి తెలిసిన విషయమే మళ్ళీ చెప్పి - చివరికి ఏవో మహా విషయాలు చెప్తా నంటే వాడు ఈ జన్మకి బాగుపడడు.

అందుకే రాజ్యపాలనా విషయంలో, మీ దేశం రోజురోజుకీ యిలా అధ్వాన్నంగా తయా రౌతోంది'' అని రాబర్ట్ స్వామి వారివైపు చూశాడు. స్వామివారు అతడిని ప్రశంసగా చూశారు. చార్వాకరావువైపు బాధగా చూశారు.

పిల్లలు విప్పారిన కళ్ళతో లేచి నిల బడ్డారు. స్వామివారికి నమస్కరించారు. గడ్డి మోపల్లే అడ్డంగా నిలబడిన చార్వాకరావుని తప్పుకుని, యిళ్ళకి కదిలారు.

పున్నమి చంద్రుడు తెల్లని కాంతులు వెదజల్లసాగాడు.

# మహిమాన్వితమైన 'సంకష్టహర చతుర్థి'



శ్రీమహాగణపతికి సంబంధించిన ఉపాసన,మంత్రతంత్ర విధానాలు వైదికసాహిత్యం మొదలుకొని బహుళ వ్యాప్తమయ్యాయి. 'గాణపత్యం' అనేది సుప్రసిద్ధం.

గణపతి అనుగ్రహంచేత సర్వ కార్యాలూ సానుకూలమవుతాయి. అన్ని సంకటాలూ దూరమవుతాయి. అందులో సందేహంలేదు. కలియుగంలో గణపతి, దుర్గ-వెంటనే అనుగ్రహించే దేవతలు - అని శాస్త్ర వచనం (కలౌ చండీ వినాయకౌ).

**'చతుర్థీపూజనప్రీతః'** - అనిగణపతి నామం.

చతుర్థీ (చవితి) తిథి గణపతికి ప్రీతి. ఆ తిథినాడు ఆయన ఉద్భవించాడు.

సృష్టిహేతువైన 'పరబ్రహ్మం' ఒక్కటే, అదే జగత్కల్యాణార్థమై గణపతిగా, విష్ణువుగా, శివునిగా, శక్తిగా, సూర్యునిగా, స్కందునిగా వివిధ రూపాలు ధరించింది. ఒక్కో నామం, ఒక్కోరూపం, వాటి ఉపాసనా విధానం ప్రత్యేక ఫలాలనిస్తాయి.

భాద్రపదశుద్ధ చవితి - 'వినాయక చవితి'గా మనం గణపతిని పూజిస్తాం. కానీ ప్రతిచవితి గణపతికి ప్రీతికరమే. భాద్రపదశుక్ల చవితి - గణపతిపార్వతీ పరమేశ్వరులకు కుమారునిగా అవతరించిన రోజు. కానీ అంతకుముందే గణపతి ఉన్నాడు, ఆయన ఉపాసన ఉంది. బ్రహ్మదేవుడు సృష్ట్యాదిలో సృష్టి నిర్వహణకు కలిగే విఘ్నాలను చూసి భీతిల్లి, పరబ్రహ్మను ప్రార్థించాడు.

ప్రణవ (ఓంకారం) స్వరూపుడైన ఆ పరమాత్మ విఘ్నాలను నశింపజేసేందుకు గజవదనరూపంతో సాక్షాత్కరించి తన వక్రతుండమంత్రాన్ని బ్రహ్మకు ఉపదేశించి, విఘ్నాలను హరింపజేశాడు. ఇది ప్రథమ ఆవిర్భావం. వక్రతుండస్వరూపం, అనేకానేక అవతారాలుగా గణపతి రూపాలు బహువిధాలు అని పురాణ వాఙ్మయం తంత్రశాస్త్రం వివరిస్తోంది.

సర్వదారిద్ర్యాలు, భయరోగాది కష్టాలూ హరింపజేసే గణపతికి ప్రీతి కరంగా చతుర్థీవ్రతం చెప్పారు.

ముఖ్యంగా 'కృష్ణపక్షం'లో వచ్చే 'చతుర్థి' చాలా ముఖ్యం. ప్రతినెలా ఆ చతుర్థికి గణపతిని ఉద్దేశించి ఉపవాసమో, లేదా ఉండ్రాళ్లు మోదకాలు వంటివి నివేదించడమో చేయాలి. కృష్ణ చతుర్థినాడు దూర్వాలతో, బిల్వాలతో, పుష్పాలతో గణపతిని అర్చించి, ఏకవింశతి (21) ఉండ్రాళ్లు నివేదన చేస్తే గ్రహదోషాలూ, గృహదోషాలూ, అన్ని ఈతి బాధలూ తొలగుతాయి.

ఈ కృష్ణచతుర్థులలో - ప్రముఖ మైనదీ, మహామహిమాన్విత మైనదీ... మాఘమాసంలో - అంటే ఈ నెలలో వచ్చే కృష్ణచతుర్థి. (ఈ ఏడాది - ఫిబ్రవరి 22వ తేదీ)

కృష్ణచతుర్థి వ్రతానికి చంద్రోదయంతో చవితి తిథి ఉండాలి. ఆరోజు ఉదయాన్నే లేచి - గణపతిని స్మరించి, ''ఈ రోజున నీ వ్రతాన్ని చేయదలచు కున్నాను'' అని సంకల్పించుకొని, స్నానాది నిత్యనైమిత్తిక కర్మలు చేసి, గణపతి స్తోత్రంతో, ధ్యానంతో, స్మరణతో గడపాలి. ఉపవాసం చేయడం కూడా ఉత్తమం.

సాయంత్రం చంద్రోదయంతో గణ పతిని షోడశోపచారాలతో పూజించి, ఉండ్రాళ్లు, లడ్లు, మోదకాలు, బెల్లం కలిపిన పదార్థాలు శక్త్యనుసారం నివే దించాలి.

పూజానంతరం - శాంతచిత్తాన 'శ్రీగణేశాయనమః' అనే నామాన్ని 21 మార్లు జపించాలి. గణపతి మంత్రోపదేశం ఉన్నవారు ఆ ఉపదేశ మంత్రాన్ని జపించాలి.

ఆ తరువాత-

1. గణేశాయ నమస్తుభ్యం సర్వసిద్ధి ప్రదాయక! ।
సంకష్టహర మే దేవ గృహాణార్ఘ్యం నమోస్తుతే ।
కృష్ణపక్షే చతుర్థ్యాంతు సంపూజిత విధూదయే ।
క్షిప్రం ప్రసీద దేవేశ గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥

-ఈ రెండు శ్లోకాలు చదివి "సంకష్ట హరణగణపతయే నమః" అని చెప్పి రెండుమార్లు అర్ఘ్యమివ్వాలి.

తరువాత - ఈ క్రింది మంత్రంతో 'చతుర్థీ తిథి అధిష్ఠాత్రీదేవి'కి

2. తిథీనాముత్తమే దేవి గణేశప్రియవల్లభే ।
సర్వ సంకట నాశాయ గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥
'చతుర్థ్యై నమః' - ఇదమర్ఘ్యం సమర్పయామి ।

తరువాత - ఈ క్రింది మంత్రంతో చంద్రునికి చందన కుసుమాక్షతలు, పెరుగు కలిపిన రాగిపాత్రలోని నీటిని అర్ఘ్యం ఇవ్వాలి.

3. గగనార్ణవమాణిక్య చంద్ర దాక్షాయణీపతే ।
గృహాణార్ఘ్యం మయాదత్తం గణేశప్రతిరూపక ॥

ఈ చవితినే 'సంకష్టహరచతుర్థి', లేదా 'వక్రతుండ చతుర్థి' అంటారు.

**'యం యం కామయతే యోవై తం తమాప్నోతి నిశ్చితం** - అని పురోణోక్తి.

ఏకోరికతో ఈ వ్రతాన్ని చేస్తే, ఆ కోరిక తప్పకుండా నెరవేరుతుంది.

శ్రీ మహాగణపతయే నమ ✧



# మహిమాన్వితమైన గణపతి 21 నామాలు

1. గణంజయాయనమః
2. గణపతయే నమః
3. హేరంబాయ నమః
4. ధరణీధరాయ నమః
5. మహాగణపతయే నమః
6. లక్షప్రదాయ నమః
7. క్షిప్రప్రసాదనాయ నమః
8. అమోఘ సిద్ధయే నమః
9. అమితాయ నమః
10. మంత్రాయ నమః
11. చింతామణయే నమః
12. నిధయే నమః
13. సుమంగళాయ నమః
14. బీజాయ నమః
15. ఆశాపూరకాయ నమః
16. వరదాయ నమః
17. శివాయ నమః
18. కాశ్యపాయ నమః
19. నందనాయ నమః
20. వాచాసిద్ధాయ నమః
21. ధుంఢి వినాయకాయ నమః

ఈ 21 నామాలు చెప్తూ దూర్వా లతోగుణ, బిల్వాలతో గానీ, పుష్పాలతో గానీ పూజించి, 21 ఉండ్రాళ్లను నివేదించాలి. ప్రతి చవితినాడూ ఈవిధంగా చేయవచ్చు. మహావిశేష ఫలప్రదమైన నామాలివి. నిరంతరం మననం చేయదగినవి.

(సౌజన్యం: శ్రీ గణపతి సపర్యాపద్ధతి,
సంకలనం: శ్రీ పి.వి. బి. మహాదేవ్)




ఋషిపీఠంలో సెంటర్ స్ప్రెడ్‌గా వేస్తున్న ''వేదిక్ హెరిటేజ్'' విజ్ఞానదాయకంగా ఉంది. దీనిని ఇంగ్లీషులో వేయడం వలన ఆంధ్రేతర రాష్ట్రాలలో ఉంటూ, తెలుగు చదువుకునే అవకాశం లేని, ఆసక్తి కల విద్యార్థులు కూడా చదివి, విశేషాలు తెలుసుకునే అవకాశం ఉంది.

డిసెంబర్'99 సంచికలో ఆయుర్వేదం గురించి తెలియజేశారు. అందులో కొన్ని సవరణలు -

★ చరక, సుశ్రుతుల కాలం విషయంలో - చరకుడు ఏ కాలానికి చెందినవాడు అనే అంశంపై చరిత్రకారుల్లో భేదాభిప్రాయాలు ఉన్నప్పటికీ - చరక, సుశ్రుతులలో చరకుడు ముందు వాడు, సుశ్రుతుడు తరవాత కాలం వాడు.

★ ఆయుర్వేద నిర్వచనం

**హితాహితం సుఖందుఃఖం ఆయుస్తస్య హితాహితం।**
**మానం చ తచ్చ యత్రోక్తం ఆయుర్వేదస్స ఉచ్యతే॥**

హితాయువు, అహితాయువు, సుఖాయువు, దుఃఖాయువు - వీటికి ఏది పథ్యం, ఏది అపథ్యం; ఆయుఃప్రమాణం - వీటిని గురించి తెలియజేసే శాస్త్రం ఆయుర్వేదం.

★ పంచకర్మ చికిత్సల వివరణలో

**Vamana - Treatment with Emetics,** (వమన చికిత్స)

**Virechana - Treatment with Purgatires** (విరేచన చికిత్స)

''స్నేహనం'' - అంటే **Medicated Ghee**తో చేసే చికిత్స, **Medicated Ghee**ని ''స్నేహం'' అంటారు.

– డా॥ కోటేశ్వరరావు, హైదరాబాద్

మహాశయా,

జాతికి జీవ గఱ్ఱయ్యై, ఈ భారతజాతిని అత్యున్నత స్థానంలో పూజనీయ స్థితిలో ప్రతిష్ఠించిన మన భారతీయ - వైదిక, సదాచార, సంప్రదాయ సనాతన - సంస్కృతిని, ఈ దేశం, జాతి, జనం, విస్మరించి; నీచస్థాయికి దిగజారుస్తున్న ఈ సంధి సమయంలో, తత్సంస్కృతీ వైభవ పునర్వికాస, పునరుద్ధరణా మహోద్యమానికి మీ ఋషిపీఠం ఆలంబన కాగలదని మా ధృఢ విశ్వాసం.

ఇట్టి పత్రిక ఒకటుందని మాకు తెలియనే లేదు - మొన్న విజయవాడలో (రామనామ క్షేత్రంలో) చూచేవరకు; గతసంచికలు దొరక లేదు, జనవరి సంచిక ఇంకా రాలేదని చెప్పారు.

మీ ప్రయత్నాన్ని మేము అభినందించక పోవడం, మన జాతిని సంస్కృతిని అభిశంసించటమే. ఆ పరాత్పరుడు మీకన్నిటా తోడై వుండి, మీరు కార్యసాఫల్య కృషిలో విజయకేతన మెగరేయగలరని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను.

– శ్రీ సత్యనారాయణరావ్, కొంకల

ఇన్నాళ్ళు మన సంస్కృతికి కావలసిన పత్రిక ఇంత ఆలస్యంగా వెలుగులోకి రావటం దురదృష్టం. కానీ ఇప్పుడు వచ్చినందుకు, అదీ మీ ద్వారా వస్తున్నందుకు మీకు మా ధన్యవాదాలు. మీరున్నత లక్ష్యాలు సాధించ డానికి నేను ఒక సమిధనై మీకు తోడ్పడితే చాలు.

– మార్కండ్, అరసవల్లి

మీ పత్రికను చదివాను. సలక్షణంగా ఉన్నది. నాదొక చిన్న సూచన. మీరు కంఠస్థం చేయదగిన పద్యం (నవంబరు సంచిక) లో 'కృష్ణ శతకం'లోని 'నీవే తల్లివి తండ్రివి... కృష్ణా!' ఉదాహరించారు. బాగున్నది. కానీ ఈ పద్యాన్ని ఎవరు రాశారో తెలియదు అన్నారు. ఈ శతకం వ్రాసినవారు నృసింహుడు.

కృష్ణ శతకంలోని 102వ పద్యం చూడండి.

**భారద్వాజసగోత్రుడ**
**గారవమున గంగమాంబ, కరుణాసుతుడన్**
**పేరు నృసింహాహ్వయుడను**
**శ్రీ రమణా! నన్నుఁగావు, సృష్టినిఁ గృష్ణా!**

గమనింపగలరు.

– ఎం.ఎస్.శ్రీరాములు, బిళ్ళకుప్పం

తమ 'ఋషిపీఠం' సంచికలు కాకతాళీయంగా చదవడం జరిగింది. ధన్యుణ్ణి అయ్యాను. అనేక అమూల్య విశేషాలతో కూడిన మీ(మా) 'ఋషిపీఠం' పత్రిక ఆణిముత్యంగా వెలుగొందుననుటలో అతిశయోక్తి లేదు.

– జి.రంగారావు, చెన్నై

కొత్తగా ప్రారంభమైన ధారావాహిక నవల ''ఉభయభారతి'' ఆసక్తికరంగా ఉంది. చక్కని చారిత్రక ఇతివృత్తాన్ని భావపుష్టిగా నేటి భాషతో అందించడం అభినందనీయం.

– టి.కె.కృష్ణ, బళ్లారి



బాలశిక్ష

# బాటసారి - కల్పవృక్షం
## (కథ)

ఒక బాటసారి ప్రయాణమైపోతూ, దారిలో ఒక మైదానాన్ని చేరుకొన్నాడు.

అతడు బైట ఎండలో నడిచినందున, అలసి ముచ్చెమటలు పట్టగా కాస్సేపు విశ్రమించాలని ఒక చెట్టునీడన కూర్చున్నాడు.

కొంచెంసేపయ్యాక అక్కడ నిద్రపోవటానికి తనకొక పాన్పు లభిస్తే ఎంత సుఖంగా వుంటుందో అని ఊహించసాగాడు.

అతడు కూర్చున్నది కల్పవృక్షం నీడలో. ఆ విషయం అతగాడు ఎరుగనే ఎరుగడు. అతడి ఊహలో కోరికమెదలగానే అతడి పక్కన ఒక చక్కని పానుపు అమర్చబడింది. దాన్ని చూసి ఎంతో ఆశ్చర్యపోయి దానిమీద పడుకొన్నాడు.

ఆ తరువాత ఒక సుందరాంగి వచ్చి సుతిమెత్తగా తన పాదాలను ఒత్తితే ఎంత హాయిగా వుంటుందోకదా .అనుకొన్నాడు. ఈ తలపు కలుగగానే నిజంగానే ఒక సుందరాంగి వచ్చి తన పాదాలను ఒత్తుతూండటం కనుగొని బాటసారి పరమానందభరితుడయ్యాడు.

ఆ తర్వాత అతడికి విపరీతమైన ఆకలి వేసింది. అప్పుడు అతడిలా ఊహించాడు: ''నేను కోరినదంతా సంప్రాప్తమైంది. నా కిక ఏదైనా ఆహారం లభించకపోతుందా?'' మరుక్షణంలోనే అతడి ముందు రకరకాలైన రుచికర పదార్థాలు వడ్డించబడ్డాయి.

వెంటనే వాటిని ఆరగించసాగాడు; తృప్తిగా తిన్న తరువాత, పరుపుమీద పడుకొని ఆరోజు జరిగిన సంఘటనలన్నీ నెమరువేసుకోసాగాడు. అలా చేస్తూ చటుక్కున ''ఇప్పుడు హఠాత్తుగా నన్నొక పులి వచ్చి గుటుక్కున మింగితే!'' అని ఊహించాడు.

మరుక్షణంలోనే గాండ్రు మంటూ ఒకపెద్దపులి అతడి మీదికి ఉరికి మెడను పంజాతోకొట్టి నెత్తురు తాగ సాగింది. ఇలా ఆ బాటసారి ప్రాణాలు కోల్పోయాడు.

సామాన్యంగా లోకుల గతి యిలాగే పరిణమిస్తూంటుంది. కీర్తి గౌరవాలను వాంఛించి భగవంతుణ్ణి ప్రార్థించే పక్షంలో, మీ కోరికలు కొంత మేరకు తప్పక సిద్ధిస్తాయి. కాని వాటి వెనుకే పెద్దపులి దాగివుందని జ్ఞాపకం వుంచుకోండి. రోగం, శోకం, ధననష్టం, మానహాని మొదలైన యీ పెద్ద పులులు సజీవమైన పులికంటె వెయ్యిరెట్లు భయంకరాలుకదా!

శ్రీరామకృష్ణ పరమహంస బోధామృతం

## 'విజ్ఞానం పోటీ - 7' ఫలితాలు

గత సంచిక (జనవరి '2000)లోని 'విజ్ఞానం పోటీ - 7'కి వచ్చిన సమాధానాలలో, అన్నివిధాలా సరిగ్గా వ్రాసిన **1. కె. శ్రీనాథ్ సుమన్‌కుమార్ (సిరివేల్), 2. టి.నిర్మల, (విశాఖ)**లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ.100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు.

– సంపాదకుడు

సరియైన సమాధానాలు :

1.శూద్రకుడు 2.మాద్రి 3. కౌసల్య, సుమిత్ర, కైకేయి 4. శ్రీశైలం (మల్లికార్జునుడు), ద్రాక్షారామం (భీమేశ్వరుడు), కాళేశ్వరం(కాళేశ్వరుడు) 5. కుచేలుడు 6. పోతన 7. శకుంతల 8. ఒరిస్సా 9. త్రిశంకు 10. క్షేత్రయ్య

## కంఠస్థం చేయదగిన శ్లోకం

***శారదా శారదాంభోజ -***
***వదనా వదనాంబుజే ।***
***సర్వదా సర్వదాస్మాకం***
***సన్నిధిం సన్నిధిం క్రియాత్ ॥***

*''శరత్కాలంలో వికసించే పద్మం వంటి ముఖం కలిగిన శారదాదేవి, నా ముఖకమలంలో సర్వకాలములందు సన్నిధి చేయుగాక. ఆదేవి సర్వదా - సర్వమును ప్రసాదించునది''.*

ఇది మహావ్యాఖ్యాత మల్లినాథసూరి చేసిన శారదాస్తుతి.

శారదా అనుగ్రహాన్ని ప్రసాదించే మహిమ ఈ శ్లోకానికి ఉంది. కాళిదాస కావ్యాలకు మల్లినాథులవారు చేసిన వ్యాఖ్యయే దేశమంతటా ప్రమాణం. వీరి వ్యాఖ్యవల్లనే కాళిదాస సాహిత్యం విశేష విఖ్యాతి పొందింది.

# విజ్ఞానం పోటీ – 8

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -8'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసినవారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 15 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు మార్చి 20వ తారీఖులోపు పంపాలి.

1. అగస్త్యుని భార్య పేరు ?
2. అరుంధతీదేవి భర్త అయిన మహర్షి ?
3. శ్రీరామకృష్ణ పరమహంస అసలుపేరు ?
4. జటాయువు సోదరుడైన మరో పక్షిరాజు ? (సీతాన్వేషణ సమయంలో హనుమదాదివానరులకు సహకరించాడు)
5. సంగీతమూర్తిత్రయంలో – త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు కాక మూడవ వారు ?
6. 'మేఘసందేశం' రచయిత ?
7. 'అల్లసాని పెద్దన' ఏ రాజు యొక్క ఆస్థానకవి ?
8. 'ఎవ్వని చే జనించు జగము' – పద్యాన్ని రచించిన కవి ?
9. భద్రాద్రి రామాలయం వద్దనున్న నది ?
10. అజంతా, ఎల్లోరా ఏ రాష్ట్రంలో ఉన్నాయి ?

# హితవచనం

అభివాదన శీలస్య
నిత్యం వృద్ధోపసేవినః ।
చత్వారి పరివర్ధంతే
ఆయుర్విద్యా యశోబలమ్ ॥

పెద్దవారిని ఎల్లప్పుడూ గౌరవించాలి. తల్లిదండ్రులు, అన్న, గురువు, వృద్ధులు, వీరిని మర్యాదతో గౌరవించి నమస్కరించడం మన సంప్రదాయం. ఆ సంప్రదాయం గురించి మనువు ఈ శ్లోకాన్ని చెప్పాడు.

''వృద్ధులను సేవించి, నమస్కరించేవానికి ఆయువు, విద్య, యశస్సు, బలం వృద్ధి చెందుతాయి.'' కాబట్టి ఈ సంస్కారాన్ని బాల్యంనుండి పెంపొందించుకోవాలి.

# మహాభారత ప్రశ్నోక్తి - 4

నిర్వహణ :
**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

46. దుష్ట చతుష్టయం ఎవరు?
47. ''నువ్వెంత లంచమిచ్చినా కృష్ణుడు కౌరవ పక్షానికి రాడు'' ఈ మాటలు ఎవరు ఎవరితో అన్నారు?
48. జరాసంధు డెవరి కరుణతో జనించాడు?
49. యయాతి భార్యలెంత మంది? ఎవరు?
50. శకుని ఎవరి అంశతో పుట్టాడు?

## 2వ భాగం

1. నన్నయ్య తెలుగులో ధర్మాధర్మాలు రెండింటినీ ఒక్క ఆటవెలదిలో చెప్పాడు – ఆ పద్యం ఏది? దాని అర్థం ఏమిటి?
2. కర్ణుడు ఎవరి అంశతో పుట్టినాడు?
3. సుశర్మ ఏ దేశానికి రాజు?
4. యుద్ధంలో రెండురోజులు భీష్ముడు కృష్ణుని కూడా బాధించాడు, ఏయే రోజులలో?
5. వ్యాస మహర్షి తల్లి ఎవరు?
6. ధర్మరాజు చేసిన రాజసూయంలో దుర్యోధనుని విధి ఏమిటి?
7. యక్ష ప్రశ్నలు వేసిన యక్షుడు ఎవరు?
8. అనుద్యూతం అంటే ఏమిటి?
9. భారత యుద్ధంలో పాండవ పక్షానికి సైన్యాధ్యక్షుడెవరు?
10. భారతంలో కౌరవ పాండవులకు రాయబారాలెన్ని జరిగాయి? ఏవి?

(జవాబులు 59వ పేజీలో చూడండి)

ప్రకృతివరాలు

# అక్కర్లేనిది 'అల్లం' కాదు

డా॥ గాయత్రీదేవి

పెళ్ళాం బెల్లం, తల్లి అల్లం అనీ; తల్లి బెల్లం, పెళ్ళాం అల్లం అనీ సందర్భానుసారం సామెత వాడుతూంటారు. వీరి భావం ప్రకారం అల్లం అంటే చెడ్డదీ, అక్కర్లేనిదీ అనీ అర్థం ధ్వనిస్తోంది. అల్లం ఆరోగ్యానికి ఎంత అవసరమో గమనిస్తే ఈసామెతకి అర్థం మారిపోతుంది. (మంచిదే కదా...)

అల్లాన్నీ సంస్కృతంలో ఆర్ద్రకం అనీ, విశ్వభేషజ, మహౌషధీ అని అంటారు. రకరకాల వ్యాధులలో అల్లం అద్భుతంగా పని చేయడం వల్లనే దీన్ని విశ్వభేషజ, మహౌషధీ అంటారు. పద్ధతి ప్రకారం ఎండిన అల్లం, శొంఠి అవుతుంది. అల్లం, శొంఠి - రెండింటిలో కొన్ని లక్షణాలు ఒకేలా ఉన్నప్పటికీ, అల్లం ప్రధానంగా చలవచేస్తుంది. శొంఠి, వేడిచేస్తుంది.

వంటింట్లో అల్లం: పాత కాలం నుండీ మన వంటకాల మీద కూడా ఆయుర్వేద ప్రభావం ఉంది. ఏ పదార్థాన్ని ఏ రీతిలో వండితే త్రిదోషాలూ సక్రమంగా ఉంటాయి, అని ఆలోచించి, పరిశీలించి శాస్త్రకారులు నిర్దేశించిన ప్రకారం వండేవారు. ఆ వంట తీరు ఒకరినుండి ఒకరికి తెలిసి, అదే విధంగా అనుసరించి ప్రయోజనం పొందుతూండేవారు, ఇప్పటికీ కొందరు అనుసరిస్తూనే ఉన్నారు. ప్రతిరోజూ ఏ పదార్థం తినడం అవసరమో, అవి వంటలో చేరేవి. వాటిలో ఒకటి అల్లం. జీర్ణ మండలం సక్రమంగా పని చెయ్యడానికి అవసరమైనది అల్లం. అందుకని, రకరకాల కూరలు వండేటప్పుడు అల్లం చేరుస్తాం. విడిగా అల్లం ఊరగాయ చేసుకుని తింటుంటాం. రకరకాల పిండి వంటల్లో అల్లం చేర్చి చేయడం వలన, అజీర్ణం బాధలేకుండా ఆనందంగా తినగలుగుతున్నాం. అల్లం చేర్చిన మజ్జిగ తక్షణ శక్తినీ, ఉత్సాహాన్నీ ఇస్తుంది. (ఏ కూల్‌డ్రింక్‌లోనో రానంతశక్తి వస్తుంది. కూల్‌డ్రింక్ నుండి వచ్చే కెలోరీల బాధ, గ్యాస్ బాధ మాత్రం రావు). మినుముకీ అల్లానికీ జోడీ. తేలికగా జీర్ణంకాని మినుముల పిండి వంట గారెలోని, జీర్ణ రసాలు ఊరించే అల్లం పచ్చడితో తినడం వలన - అజీర్ణం బాధ ఉండదు, కడుపులో వాయువు చేరి బాధించదు.

ఔషధంగా

ఆయుర్వేదానుసారం - శరీరంలోని అగ్ని (జాఠరాగ్ని) సక్రమంగా పని చేస్తూంటే, శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. అగ్ని మందగించినా, విషమించినా - శరీరానికి అనేక వ్యాధులు వస్తాయి. అగ్నిని సక్రమంగా పనిచేయించే ద్రవ్యాలలో ఒకటి అల్లం.

★ ప్రతిరోజూ ఉదయాన్నే చిన్న చిన్న అల్లం ముక్కలు (4-5) సైంధవ లవణంతో కలిసి, నమిలి తినడం ఆరోగ్యకరం.
★ జలుబు, గొంతు నెప్పి ఉన్నప్పుడు - అల్లరసం, తేనె సమపాళ్ళలో కలుపుకుని నాకడం వలన ఉపశమనం కలుగుతుంది.
★ కడుపు ఉబ్బరంగా ఉన్నప్పుడు - 20 మి.లీ. అల్లరసం 20 మి.లీ. తేనె కలిపి ఒకేసారి తీసుకున్నట్లయితే, సుఖవిరేచనం అయ్యి, కడుపులోని వాయువులు కూడా బయటికి పోయి - నెప్పి తగ్గుతుంది.
★ అల్లరసం తీసుకోవడం వలన మూత్రం సాఫీగా అవుతుంది.
★ ఆకలి మందగించినపుడు, అజీర్ణం, కడుపు నెప్పి, కడుపు ఉబ్బరం, వికారం, నోటిలో రుచి తెలియకపోవడం - ఇలా జీర్ణ మండలానికి సంబంధించిన ఎటువంటి లక్షణాల కయినా అల్లం మంచి ఔషధం.
★ ప్రతిరోజూ ఒకచిన్న చెంచాడు శొంఠిపొడిని, అన్నం మొదటి ముద్దలో తినడం వలన జీర్ణశక్తి బావుంటుంది. అయితే శొంఠి పొడితో - వెచ్చటి నేతిని కలుపుకుని తీసుకోవాలి. నెయ్యి కలపడం వలన వేడిచెయ్యదు.
★ కీళ్ళ నెప్పులున్న వారు, నిత్యం శొంఠి తీసుకోవడం మంచిది.
★ తలనెప్పి, పంటినెప్పి, కీళ్ళ నెప్పులకి శొంఠి గంధం ముద్ద చల్లగా కానీ, వెచ్చగా కానీ పైపూతగా వాడచ్చు. ఈ గంధాన్ని నెప్పి ఉన్నచోట ఒక పొరలా రాయాలి (వాడుక భాషలో పట్టు వేయడం, అంటారు)

అల్లాన్నీ, శొంఠినీ అనేక ఔషధాలలో వాడతారు.

జంబీరాది పానకం

నిమ్మరసం = 3 భాగాలు

అల్లపురసం = 2 భాగాలు

పంచధార = 5 భాగాలు

మూడింటినీ కలిపి, కాచాలి. లేతపాకం వస్తున్నపుడు దింపెయ్యాలి. ఇది కొన్ని నెలలపాటు నిలవ ఉంటుంది.

తల తిరుగుతున్నప్పుడు 10-15 మి.లీ. జంబీరాది పానకం తీసుకుంటే తగ్గుతుంది. ఆకలి మందగించడం, నోటికి రుచి తెలియకపోవడం, అజీర్ణం వంటి సమస్యలున్నా వారు 10-15 మి.లీ. పానకాన్ని, ప్రతిరోజూ రెండు పూటలా వాడాలి. ఏ సమస్యలూ లేని వారు కూడా భోజనానికి 10 నిమిషముల ముందు- రెండు చెంచాల జంబీరాది పానకం తీసుకోవడం వల్ల జీర్ణ మండలం సక్రమంగా పని చేస్తుంది. అగ్ని సక్రమంగా పని చేస్తే, ఆరోగ్యంగా ఉన్నట్లే.

# నవరత్న ప్రభావం

శ్రీమతి వి.బి.వి. యల్.రాజేశ్వరి ఎమ్.ఏ.

## వజ్రము :

వజ్రం పేరు వినని వారుండరు. దీనిని ''రవ్వ'' అని కూడా అంటారు. మానవుడికి తెలిసిన కఠినాతి కఠినమైన ఖనిజం వజ్రమే. ఇది తెల్లగా పారదర్శకంగా ఉండి, చాలా ప్రకాశవంతంగా ఉంటుంది. ఈ మధ్యకాలంలో కోహినూర్ వజ్రము, గ్రేమ్‌మొగల్ వజ్రము చాలా ప్రసిద్ధి చెందాయి.

వజ్రాలు కృతయుగంలో - పర్వతాలలోను, ఏనుగు కుంభస్థలాల్లోనూ కూడా దొరికేవట. త్రేతా యుగంలో - కాశ్మీర కోసల దేశాలలో దొరికేవట. ద్వాపర యుగంలో - పౌండ్రక సౌరాష్ట్ర దేశాలలో దొరికేవట! కలియుగములో విరాట, సింధు విదూర దేశాలలో దొరుకుతాయట! ఆంధ్రదేశంలో అనంతపురం జిల్లాలోని ''వజ్రకరూరు'' అనే ప్రాంతంలో వజ్రాలు తరచుగా దొరుకుతుంటాయట!

వజ్రాలలో చాతుర్వర్ణ్యమూ, లింగభేదమూ ఉంటుందని శాస్త్రజ్ఞులు చెప్తారు. తెల్లని వజ్రాలు బ్రాహ్మణ జాతివి. ఎఱ్ఱనివి క్షత్రియ జాతివి. పసుపు రంగులో గాని, బంగారు రంగులో గాని ఉండేవి వైశ్య జాతివి. నల్లగా గాని, నీలమేఘచ్ఛాయగా గాని ఉండేవి శూద్రజాతివనీ ప్రసిద్ధి.

ఎనిమిది కోణాలతో తెల్లగా ప్రకాశిస్తూ, ఇంద్రధనుస్సులాగా అనేక రంగులు వెదజల్లేది పురుషవజ్రం అంటారు. గుండ్రంగా ఉండేది స్త్రీ వజ్రము. మూడు కోణాలు కలిగి, మధ్యభాగం ఎత్తుగా ఉండేది నపుంసక వజ్రము. వజ్రాలలో పురుష వజ్రం శ్రేష్ఠమైంది.

స్త్రీలు స్త్రీ వజ్రాలనూ, పురుషులు పురుష వజ్రాలనూ ధరించాలని ఒక సిద్ధాంతం. స్త్రీలు పురుషవజ్రాలనూ, పురుషులు స్త్రీ వజ్రాలనూ ధరించాలని మరి కొందరి సిద్ధాంతము.

ఏది ఎలా ఉన్నా, వజ్రానికి అధిపతి శుక్రుడు. జాతకంలో, శుక్రుని స్థితిని బట్టి వజ్రాన్ని ధరించాలి. ఈ వజ్రాధారణ అందరికీ ఫలించదు. పరంపరగా, ఇంట్లో వజ్రం పెట్టుకోవడం అలవాటు లేకపోతే, ధరించకుండా ఉండటమే మంచిది. ఒక్కొక్కసారి దీని వలన ప్రయోజనం కన్నా, ఇబ్బందులే ఎక్కువ ఉంటాయి. కొత్తగా వజ్రాలు ధరించే వాళ్ళు కొన్నాళ్ళు పరీక్ష చేసుకుని, ఇబ్బందులే ఎక్కువగా వస్తుంటే, వజ్రాన్ని పరిత్యజించడం మంచిది.

**వజ్రములలో దోషాలు :** వజ్రాలలో ప్రధానంగా రెండు దోషాలు చెప్పబడ్డాయి. లోపల నల్లని చారలు కనబడితే, అది ''కాకపదం'' అనే దోషం. దీనిని ధరించడం వలన ఆయుర్భావమునకు హాని. సరైన కోణాలు లేక, లోపల మకిలి పట్టినట్లు కనబడుతూ, వెలవెల పోయినట్టుంటే, అది ''ముండ్రము'' అనే దోషం. దీని వలన కష్టనష్టాలు ఎక్కువౌతాయి.

'చిపిటము' అనేవేరే దోషం కూడా ఒకటి చెప్పబడింది.

మంచి వజ్రము, బొగ్గుల కొలిమిలో పెట్టి కాల్చినా, భస్మం కాదు. వజ్రాన్ని భస్మం చేసే విధానం, ఆయుర్వేదంలో వేరే చెప్పబడింది.

**వజ్రధారణ వలన ఉపయోగాలు:** జాతకములో శుక్రుడు ఆరు, ఎనిమిది, పన్నెండు స్థానాల్లో ఉన్నా, నీచలో ఉన్నా, శుక్రమహాదశ జరుగుతున్నా - ఆ సమయంలో కష్టాలు ఎక్కువగా ఉన్నా - వజ్రాన్ని ధరించడం మంచిది. ఉంగరంలో ధరించడం ఉత్తమం. శక్తిని బట్టి, వజ్రాలహారం కూడా ధరించవచ్చు. జాతకంలో కుజదోషం ఉంటే, ఉంగరంలో వజ్రం పొదిగి ధరిస్తే, ఆ దోషం పరిహారం అవుతుంది.

దగ్గు, క్షయ, ఉబ్బసం లాంటి వ్యాధులతో బాధపడుతున్న వాళ్ళు వజ్రం ధరించడం మంచిది. వజ్రధార వలన దాంపత్యజీవితం సుఖవంతంగా సాగుతుంది. సంగీత, సాహిత్య, నాట్య, చిత్రకళలలో అభిరుచి ఉన్నవారు వజ్రాన్ని ధరిస్తే, నైపుణ్యం కలవారు అవుతారు. నాటక, సినీ రంగాలలో ఉన్నవారు వజ్రాన్ని ధరిస్తే, చాలా ఉన్నత స్థితికి వెళ్ళే అవకాశం ఉంది.

వజ్ర భస్మం సేవిస్తే, పురుషులకు వీర్య వృద్ధి, బలము, ఉత్సాహము, సంభోగశక్తి పెరుగుతాయి. స్త్రీలకు సుఖ ప్రసవాది, సుగుణములు కలుగుతాయి.

అనుకూలించడం మొదలుపెడితే, వజ్రం కన్నా గొప్ప రత్నం లేదు. తగిన వజ్రాన్ని, జాగ్రత్తగా పరీక్ష చేయించుకుని ధరించాలి.

## నీలము:

ఇది ముఖ్యంగా నీలపు కాంతితో ఉం టుంది. అందుకే దీనిని ఆ పేరు వచ్చింది. వజ్రం తరువాత, ఇదే కఠినమైన రత్నంగా చెప్తారు. దీనిని అశ్మసారము, సుసారము, గల్వర్కము, సౌదకము, జర్ఘరము మొదలైన పేర్లతో కూడా పిలుస్తారు.

రత్నశాస్త్రంలో మూడు రకాలైన నీలాయి వివరించబడ్డాయి.

ఇంద్రనీలం : తల వెంట్రుకల లాగా నల్లగా గాని, నెమలి కంఠము నీలపు రంగులో గాని ఉండి, ప్రకాశిస్తూ కనిపిస్తుంది. దీనిని ధరిస్తే ఇంద్రభోగాలు కలుగుతాయిట! దీని ఖరీదు లక్షల్లో ఉండచ్చు.

మహానీలం: ఇది కూడా గొప్ప నీల కాంతులతో సహజంగా ప్రకాశిస్తూ ఉంటుంది. దీనిని నేల మీద పెట్టినపుడు, ఆ పరిసరం అంతా నీలకాంతులతో నిండిపోతుంది. దీనిని ధరించడం వలన అనేక మహాశుభ ఫలితాలు పొందవచ్చు. దీని ఖరీదు వేలల్లో ఉంటుంది.

నీలమణి: ఇది నల్లని విష్ణుక్రాంత పుష్పాల రంగు కలిగి ఉంటుంది. సహజ కాంతితో ప్రకాశిస్తూ ఉంటుంది. ఇట్లాంటి నీల రత్నం అరుదుగా దొరుగుతుంది. దీని ఖరీదు కూడా వేలల్లో ఉండచ్చు. దీనిని ధరిస్తే కష్టాలు తొలగి, కీర్తి మంతులగుతారు.

ఉత్తమ జాతి నీలాలను రెండు విధాలుగా పరీక్షిస్తారు. ఆవు పాలలో నీలాన్ని ముంచితే, ఆ పాలు నీలంగా కనబడినప్పుడు, అది ''క్షీరగ్రాహి'' నీలం. ఇది రాజయోగం యిస్తుందని పెద్దలు చెప్తారు. గరిక, ఊక, పొట్టు వంటి వాటిని నీలం మీద ఉంచి నోటితో ఊదితే, అవి గాలికి ఎగిరిపోక, నీలాన్నే అంటిపెట్టుకుని ఉంటే, దానిని ''తృణగ్రాహి'' నీలం అంటారు. ఇది శుభప్రదం.

ఇదికాక పుష్యరాగనీలం, కెంపునీలం, గోమేధికనీలం అని ఇందులో అనేక జాతులున్నాయి.

## నీలములలో దోషములు:

నీలాలలో ప్రధానంగా ఆరు దోషాలు చూపిస్తారు.

త్రాసము: లోపల భీటలు, పగుళ్ళు వంటివి కనిపిస్తాయి. దీనివలన అనేక కలహాలు వస్తాయి.

భిన్నము: కాంతి విహీనంగా, మలినంగా కనిపిస్తుంది. ఇది ధరిస్తే నిత్యము దుఃఖం కలుగుతూ ఉంటుంది..

పటలము: లోపల ముక్కలు ముక్కలైనట్లుగా కనబడుతుంది. దీని వలన ఎప్పుడూ కష్టాలూ, బాధలూ కలుగుతాయి.

పాషాణగర్భం: లోపల యిసుకరేణువులు ఉన్నట్టుగా కనిపిస్తుంది. దీనిని ధరించడం వలన సంతాన నష్టం కలుగుతుంది.

మృద్గర్భము: లోపల ధూళి, బురద ఉన్నట్టుగా తోస్తుంది. దీనిని ధరించడం వలన ప్రాణభయం కలుగుతుంది.

రక్తబిందువు : నీలము లోపల రక్తబిందువులున్నట్టుగా, ఎఱ్ఱని బిందువులు కనబడతాయి. ఇది మహా దోషము. దీనిని ధరిస్తే, ధరించిన ఏడాది లోపల మృత్యువు తప్పదంటారు.

ఇవి కాక ఇంకా ''మలినం'', ''విచ్ఛాయ'' ''కుక్షి'', ''కరంజి'', ''వాలుకాస్పర్శ'' అనే దోషాలు రత్నపరీక్షలో చెప్పబడ్డాయి.

మలినం: సహజకాంతి విహీనంగా కనబడటం.

విచ్ఛాయ: నీలం కాని, వేరే రంగు కనబడటం.

కుక్షి: అరచేతిలో పెట్టుకుని చూస్తే, రాయి లోంచి, చేతి రేఖలు తెల్లగా కనబడటం.

ఈ మూడింటినీ ధరించడం వలన కష్టములు ఎదురౌతాయి.

కరంజి: అరచేతిలో పెట్టుకుని చూస్తే, లోపల పైన ఉలవగింజల్లాగా, నల్లని మచ్చలు కనబడటం. దీనిని ధరిస్తే అన్నీ కలహాలే ఎదురౌతాయి.

వాలుకాస్పర్శ : లోపల నీటి బుడగలు లాగా కనబడటం. దీనిని ధరించడం దరిద్ర హేతువు.

నీలమునకు శని అధిపతి. అందుకనే నీలాన్ని శనిరత్నము అనీ, మంద రత్నము అనీ కూడా పిలుస్తారు.

శని దోషాలు, ఈ రాయిని ధరించడం వలన తగ్గుతాయి. జాతకములో శని నీచలో ఉన్నా - మూడు, ఆరు, ఎనిమిది, పన్నెండు స్థానాలలో ఉన్నా, నీలమును ధరించడం మంచిది. శని దశలో కష్టాలు కలుగుతున్నా, ఏలినాటి శని యిబ్బంది పెడుతున్నా, దీని ధారణ వలన ఆ కష్టాలు శాంతిస్తాయి.

## నీలం ధరించడం వలన ఉపయోగములు:

మంచి నీలపురాయి ఉంగరంలో ధరించడం శ్రేష్ఠం. నరాలదుర్బలత్వాన్ని, పక్షవాత రోగాలనీ, మానసిక రోగాలనీ, వాతదోషాలనీ హరిస్తుంది. వాహన ప్రమాదాలని అరికడుతుంది. అపమృత్యు దోషాలని నివారిస్తుంది. నిత్యం నీలాన్ని చూస్తూ ఉండటం వలన దృష్టి దోషాలు కూడా తొలగిపోతాయి.

దీని భస్మం ఆయుర్వేద విధానంలో వివరింపబడింది. ఈ భస్మాన్ని ఔషధంగా సేవిస్తే - పిచ్చి, క్షయ, కీళ్ళ వ్యాధులు, రక్త దోషాలు నివారింపబడతాయి.

హస్త సాముద్రిక రీత్యా చేతి మధ్య వేలు శనిస్థానం. కాబట్టి, ఈ రాయిని పొదిగిన ఉంగరాన్ని మధ్యవేలికి తొడగడం శ్రేష్ఠం. ఎడమ చేతి మధ్య వేలికి గాని, ఉంగరపు వేలికి గాని తొడగడం ఉత్తమం అని ''భవప్రకాశిక'' అనే గ్రంథంలో చెప్పబడింది.

రాహు శనుల కలయిక దోషానికి ''గోమేధికనీలం'' వాడటం శుభప్రదం అని పెద్దలు చెపారు. ✦

## దారిద్ర్యమోచనస్తోత్రమ్

# శ్రీలక్ష్మీ అష్టోత్తరశతనామాలు

విద్యావారిధి, అద్వైత సిద్ధిరత్నాకర
డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి

(గత సంచిక తరువాయి)

**3. అదితిం చ దితిం దీప్తాం**
**వసుధాం వసుధారిణీమ్ ।**
**నమామి కమలాం కాన్తాం**
**కామాం క్షీరోదసంభవామ్ ॥**
**(కామాక్షీం క్రోధసంభవామ్)**

**21. అదిత్యై నమః**

'అదితి' దేవమాత. కశ్యప ప్రజాపతి భార్య. వామనావతారము అదితియందే జరిగినది. దేవతల తల్లిగా మహాలక్ష్మి యున్నదని భావము. ఈ అదితిని ఋగ్వేదము-

**అదితి ర్ద్యౌ రదిత రంతరిక్ష మదితి ర్మాతా సపితా సపుత్రః॥**
**విశ్వేదేవా అదితి ర్జాతమదితి ర్జనిత్వం ॥**

అని స్తుతించుచున్నది. అదితియే ద్యులోకము. అదితియే అంతరిక్షము. తల్లి, తండ్రి, పుత్రుడు, విశ్వేదేవులు, పుట్టినవి, పుట్టించునవి అన్నియు అదితి స్వరూపమే అని అర్థం.

''ఛేదింపశక్యముకానిశక్తి'' అనే అర్థం కూడా ఈ శబ్దానికి వుంది.

**22. దిత్యైనమః**

'దితి' అసుర మాత. ఈమెయు కశ్యప ప్రజాపతి భార్య. అసురులు, నాగములు దితి సంతానమే. దితి రూపముగ యుండునిదియు మహాలక్ష్మియే.

సృష్టిలోని వెలుగూ, నీడ కూడా శక్తి రూపాలే. 'వివిధముగా విభజనచెందేశక్తి' అని కూడా అర్థం వుంది.

**23. దీప్త్యై నమః**

దీప్తి అనగా ప్రకాశమని యర్థము. ప్రపంచమందున్న సకల పదార్థాలను మనం



చూసేందుకు ప్రకాశం అవశ్యమగుచున్నది. ఈ ప్రకాశం సూర్యుని రూపంగానేకాక చంద్రుడో, విద్యుత్తో, దీప ప్రకాశమో అవీ లేనప్పుడు శబ్దమో, లేనప్పుడు తన అంతరాత్మయే తనకు ప్రకాశకమగును. ఎక్కడ తన అరచేయి సైతము తనకు కన్పించదో అప్పుడు తన ఆత్మయే తనకు ప్రకాశమని 'బృహదారణ్యకము' తెల్పుతోంది. ఇలా వివిధవిధాలుగా 'ప్రకాశ' రూపంలో ఉండే తల్లిగనుక, 'దీప్తి' అనిపేరు.

**24. వసుధాయై నమః**

'వసు' అనగా బంగారమని అర్థం. ఆ బంగారమును ధరించుటచే, తనయందు దాచి యుంచుటచేత భూదేవికి వసుధయని పేరు. భూదేవి బంగారమును మాత్రము ధరించునని కాదు. కానీ సకల ఖనిజ సంపద భూమినుండే వచ్చును. అంతేకాక మానవులకో లేక సకల ప్రాణులకో ఆహారం భూమినుండే లభించును. మాంసాహారులకు సైతం, భూమియే ఆధారం, ఏలయన ఆ మాంసమును ఆ ప్రాణులు భూమి యందు జనించిన శాకములను స్వీకరించుట వలననే యేర్పడినది గదా.

కావున సర్వప్రాణులకు ఆహారము నొసగునది, ఉండుటకు స్థలము నొసగునదీ భూమాతయే. ఈ భూమాతకు దృఢ ముగా సర్వపదార్థములను ధరించు శక్తినిచ్చునది పరమాత్మయే. దీనినే వేదములు-

**'యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా'**

అని బోధించును. అట్టి 'వసుధ' అనగా భూమాత స్వరూపముగను యున్నది మహాలక్ష్మియేయని భావము. మన ఉనికికీ, మనికికీ ఆధారమైన శక్తి 'వసుధ'.

**25. వసుధారిణ్యైనమః**

'వసుధారిణి' యనగా బంగారము, తక్కిన లోహములు, ప్రాణికోటి స్వీకరించు ఆహారపదార్థములు, వీటిని సర్వదా ధరించు

నదని అర్థము. వీటిని మానవులు ఉపయోగించుచుండగా, మరల వాటిని ఉత్పత్తి చేయుచు తనయందుంచుకొనియుండుటయే భూమాత ప్రాశస్త్యమగుచున్నది.

**''సువర్ణపుష్పితాం పృథ్వీ
విచిన్వంత త్రయో నరాః''**

భూమాత బంగారుపువ్వులు వెద జల్లునని అప్పయ్య దీక్షితుల వారి సూక్తి.

**26. కమలాయైనమః**

కమలమనిన తామర పుష్పము. ఈ తామర పుష్పము మన హృదయమునకు ప్రతీక. వికసించిన తామర పుష్పము పూర్ణపురుషుని చిహ్నము. మానవుల హృదయము తామర మొగ్గవలె వ్రేలాడుచుండుననియు, ధ్యానము చేత ఆ తామరను వికసింప జేసి యందు పరమాత్మను యోగులు సర్వదా గాంచు చుందురని మహాత్ములసూక్తి.

**ఉద్ఘాట్య యోగ కలయా హృదయాబ్జ కోశం
ధన్యైశ్చిరాదపి యథారుచి గృహ్యమాణః।
యః ప్రస్ఫురత్యవి రతం పరిపూర్ణ బోధః
శ్రేయః సదా దిశతు శాశ్వతికం ముకుందః॥**

మహాలక్ష్మి తామర యందే కూర్చుండును. తామరయే ఆమెకు ఆసనము. ఆమె రెండు చేతులయందును తామర పుష్పములనే ధరించును. బ్రహ్మ దేవునకును తామరయే ఆసనము. తామర రేకులు అందమైన కండ్లకు ఉపమానము. కమల నేత్రుడని మహా విష్ణువునకు పేరు.

మహా విష్ణువు సైతము చేతియందు తామరనే ధరించును. తామర రేకు, తామర పుష్పము మానవుల పరిపూర్ణతకు గుర్తు కాగా, తామరాకులు పరమాత్మ యొక్క అసంగతకు సూచకము. నీటియందే పుట్టి, నీటి వలననే పెరిగి, నీటియందే నశించు తామరాకు నీటి బిందువులతో సంబంధపడనట్లు, జగత్తును సృష్టించి, జగత్తును కాపాడి, జగత్తును హతమార్చు పరమాత్మ సైతము ప్రపంచ మందలి సుఖ దుఃఖములతో సంబంధింపడని శాస్త్రములు తెల్పును.

**27. కాంతాయై నమః**

'కాంత' యనిన స్త్రీయనియు, అందమైనదనియు అర్థములు. పరమాత్మ నిర్వికారము, నిరాకారమైనను భక్తుల అనుగ్రహార్థము స్త్రీ పుంరూపముల ధరించునని పురాణములు చెప్తున్నాయి.

**దేవానాం కార్యసిద్ధ్యర్థమావిర్భవతి సా యదా।
ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యాప్యభిధీయతే॥**



అని మార్కండేయ పురాణ వచనము. దేవతల కార్యసిద్ధికై ఆ పరమాత్మ స్త్రీ రూపమును ధరించినపుడు దేవియే పుట్టినదని లోకములో వ్యవహరింపబడునని భావము. ఆమెనే 'నిత్యా' అన్నారు.

''త్వం స్త్రీ త్వం కుమార ఉత వా కుమారీ'' అని శ్వేతాశ్వతర ఉపనిషత్తు స్త్రీ రూపముననూ పరమాత్మ అగపడునని బోధించుచున్నది. ఆ స్త్రీ స్వరూపము అనుపమ సౌందర్యవతిగా భక్తులందరకు భక్తి భావమును గల్గించునని అర్థం. తొలి వనిత ఆ ఆదిశక్తియే.

**28. కామాయై నమః**

**'ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మిభరతర్షభ॥**

- అని గీతావచనం.

''ప్రాణులయందు, ధర్మవిరుద్ధముకాని కామము నా స్వరూపము'' - అని శ్రీకృష్ణ పరమాత్మ గీతలో చెప్పిన విభూతియోగవాక్యం. కాబట్టి 'కామము' పరమాత్మ రూపమే.

పరమాత్మయొక్క 'ఇచ్ఛయే' కామము. ఆ ఇచ్ఛాశక్తియే ఆయనయందు 'స్పందశక్తి'. అదే ఈ విశ్వానికి కారణం. ఆతని 'ఇచ్ఛాశక్తి'గా అమ్మను 'కామా' అన్నారు.

✦ అయితే, పాఠాంతరాలలో 'కామాక్షి' అనికూడా ఉంది. తన కడగంటి చూపుతోనే భక్తుల కోరికలను నెరవేర్చే తల్లికనుక జగన్మాతను 'కామాక్షి' అన్నారు. శ్రీ కాంచీపురము నందు అమ్మ 'కామాక్షి' అనే పేరుతో విలసిల్లుతోంది.

**29. క్షీరోదసంభవాయై నమః**

దేవాసురులు క్షీరసాగరమథనం చేయుచుండగా, సంపదల తల్లి అయిన లక్ష్మి ప్రాదుర్భవించింది. కాబట్టి ''పాలకడలినుండి పుట్టినది'' (క్షీరోద సంబవా) అన్నారు.

✦ పాఠాంతరాలలో 'క్రోధసంభవా' అని ఉంది.

క్రోధమనగా జగత్తునందు ఏర్పడే ఏహ్యాభావం. దానివలన కలిగే వైరాగ్యంవలన పుట్టే జ్ఞానము అమ్మ స్వరూపము. కనుక 'క్రోధసంభవా'.

అంతేకాక - మహిషాసురాది దనుజుల అధర్మాలపై ఆగ్రహించి, దుర్గాది దివ్య రూపాలను ధరించినది కనుక 'క్రోధసంభవా' అని అమ్మ పేరు. (సశేషం)

# మన పద్యం

**పవి పుష్పంబగు, నగ్ని మంచగు, నకూపారంబు భూమీ స్థలం**
**బవు,శత్రుండతి మిత్రుడౌ, విషము దివ్యాహారమౌ నెన్నగా**
**అవనీ మండలిలోపలన్ శివ శివేత్యాభషణోల్లా సికిన్**
**శివ! నీ నామము సర్వవశ్యకరమౌ శ్రీకాళహస్తీశ్వరా!**

ఇది ధూర్జటి కవి రచించిన 'శ్రీకాళహస్తీశ్వర' శతకంలోనిది. ఛందస్సు : మత్తేభం. శివభక్తి మాధుర్యం చిందులు వారేలా ఆ మహాకవి ఈ శతకాన్నే కాక, 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యం' అనే అద్భుతమైన ప్రబంధాన్ని రచించాడు.

కంఠస్థం చేయదగిన మంచి పద్యాలెన్నో ఈ శతకంలో ఉన్నాయి. అందులో ఒకటి ఈ పద్యం.

'శివ' నామ మహిమని తెలియజేసే పద్యమిది.

''ఈ భూమండలంపై 'శివ శివ' అని నిరంతరం పలికేవానికి అన్నీ శుభంగా మారుతాయి. అతడిని బాధించాలని ఎవ్వరైనా వజ్రాయుధాన్ని (పవి) ప్రయోగించినా, అది పుష్పమై అలంకారమవుతుంది. సముద్రం (అకూపారం) భూమిగా మారుతుంది. శత్రువు మిత్రుడౌతాడు. విషము అమృతం (దివ్యాహారం) అవుతుంది. ఓ శివా! నీ నామం సర్వవశ్యకరం''. శివనామ పరాయణుడైన భక్తునకు సర్వమూ శివమే.

ఈ పద్యంలో మరో అంతరార్థం ఉంది. నిత్య శివజపం వలన ఆత్మజ్ఞానం కలిగి, ద్వంద్వాతీతుడౌతాడు. అతడికి సర్వమూ సమానమే.

**సమశ్శత్రౌచ మిత్రేచ తథామానావమానయోః ।**
**శీతోష్ణ సుఖదుఃఖేషు సమః, సంగ వివర్జితః ॥**
**తుల్యనిందాస్తుతిః మౌనీ ....**
**...... భక్తిమాన్ యస్స మే ప్రియః ॥**

''శత్రుమిత్రులయందు, మానావమానాదులందు, శీతోష్ణ సుఖదుఃఖాదుల యందు, నిందాస్తుతులయందు సమదృష్టి కలిగిన, సంగరహితుడు, మౌని, జ్ఞాని... నిజమైన (పండిన) భక్తుడు. అతడే నాకు ప్రియుడు'' అని 'గీత' లో కృష్ణ పరమాత్మ వచనం.

అటువంటి 'జ్ఞాని' గా మార్చే మహిమ 'శివ' నామానికి ఉంది. ✦



# వేదవేద్యుడు శివుడు

వేదపద్ధతిలో ఈశ్వరార్చన చేసేవారి వద్దగల శివపూజా సామగ్రిలో ఏ తామస పదార్థమూ లేదు. బిల్వ పత్రాలు, పుష్పాలు, ఫలాలూ, ధూప, దీప నైవేద్యాలతోనే భగవత్పూజ జరుగుతుంది. శివలింగార్చ నంలో మద్యమాంసాలు ఎన్నడూ ఉపయోగింపబడవు. కాబట్టి శివుడు తామస దేవత అనడం అజ్ఞానం, అవివేకం.

మూర్తిత్రయాంతర్గతుడైన శివుడు కారణావస్థానియామకు డుగా భావింపబడతాడు. కారణావస్థ లేక అవ్యక్తావస్థే శివావస్థ.

తమోనియంత్రణమొనర్చడమే సర్వధా కఠినం. శివభగ వానుడు తమోనియామకుడే గానీ, తమస్సునకు అధీనుడు కాడు.

శివుడు భయానకుడే కాక, శాంత స్వరూపుడు కూడా. సర్వ సంహారకుడు, కాలకాలుడు, మహాకాలేశ్వరుడు, మహామృత్యుం జయుడు అయిన భగవంతుని యందు 'ఉగ్రత' ఉండడం యుక్తమే.

ఒకటి నిత్యం గుర్తుంచుకోవాలి - హరిహరులు (శివ విష్ణువులు) ఒక్కరే. వారిలో అణుమాత్రం కూడా భేదం లేదు.

వేదమంత్రములన్నిటి చేత 'రుద్రః పరమేశ్వరః' - పరమాత్మయే రుద్రుడని, మహాదేవుడని చెప్పబడుతున్నాడు. శివుని కంటే రుద్రుడు భిన్నుడని చెప్పేవారు వేదాల్లో ఇతర మంత్రాలపై కూడా దృష్టిని ఉంచాలి. ఆ మంత్రాలలో పరమేశ్వరునికే శివ, త్ర్యంబక, మహాదేవ, మహేశాన, పరమేశ్వర, ఈశ్వర, ఈశానాది శబ్దములు సుస్పష్టంగా ప్రయుక్తాలయ్యాయి.

అనాది, అపౌరుషేయాలైన వేదాలు, తన్మూలకాలైన పురాణ, ఇతిహాస, మంత్రాల ద్వారా శివుని పరమేశ్వరత్వం, శాంతత్వం, సర్వ పూజ్యత్వం సిద్ధమౌతుండగా, ''శివపూజ అనార్యుల నుండి గ్రహింపబడింది'' అని చెప్తున్న తలాతోకలేని మాటలకు విలువ లేదు.

**'యతిచక్ర చూడామణి' శ్రీకరపాత్రస్వామి**

# మాసఫలాలు

*(దోష నివారణకు సూచనలతో)*

**శ్రీమతి వి.బి.వి.ఎల్. రాజేశ్వరి,** ఎం.ఏ

## (ఫిబ్రవరి 2000)

|  | గు<br>శ |  |  |
|---|---|---|---|
| బు<br>కు | ఫిబ్రవరి<br>2000 |  | రా |
| కే<br>ర |  |  |  |
| శు | చం |  |  |



। – భరణి – కృత్తిక ప్రథమ పాదం.)

ఈ రాశివారికి ఈ మాస మంతా అనుకూలమైనదే. ఆయురారోగ్య ధన ధన్యాభివృద్ధిగా ఉంటారు. ప్రభుత్వ ఉద్యోగులకు, అధికారుల మన్నన లభిస్తుంది. ఈ రాశి వారికి యిప్పుడు ఏలి నాటి శని నడుస్తోంది. త్వరలో శని ద్వితీయం లోకి వెళుతున్నాడు. అందుచేత విష్ణుసహస్ర నామం – సుబ్రహ్మణ్య పూజ చేయించుకుంటే మంచిది. కృత్తికా నక్షత్రం వారు ప్రత్యేకంగా శని జపం చేయించుకోవాలి. శనైశ్చరాలయంలో తైలాభి షేకం చేయించుకోవాలి. (ఏలినాటి శని ''గమనిక'' చూడండి)



## వృషభం

(కృత్తిక 2,3,4 – రోహిణి, మృగశిర 1,2)

ఈ రాశివారికి, ఈ మాసమంతా అనుకూలమైనదే. అనుకున్న పనులు సాధించగలుగుతారు. ఈ మాసమంతా సుఖ సంతోషాలతో గడుస్తుంది. అన్ని వృత్తుల వారికీ, ఉద్యోగస్థులకీ మంచి రోజులు. వీరికి కూడా ఏలినాటి శ.. ప్రథమ దశ ముగియ వస్తోంది. వీరు కూడా శనిజపం, తైలాభిషేకం చేయించుకోవాలి. కృత్తిక నక్షత్రం వారు ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. కళాకారులకు ఫిబ్రవరి 15 నుండి ఇంకా బాగుంటుంది.

## గమనిక

''రెండవసారి వచ్చే ఏలినాటి శని, గండం'' అనే సూత్రం – కృత్తికా నక్షత్రం వారికే కాక; ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ నక్షత్రాల వారికి కూడా వర్తిస్తుంది. పుట్టినప్పుడే ఏలినాటి శనిలో పుడితే, అది మొదటిదిగా లెక్కలోకి రాదు. తరువాత వచ్చేదే మొదటిది. ఆ తర్వాత వచ్చేది రెండవది. ఇది సుమారుగా అరవై ఏళ్ళ వయస్సులో వస్తుంది. ఇలా వచ్చినపుడు శనికి తైలాభిషేకం చేయిస్తే శాంతి జరుగుతుంది. శుభప్రదం కాగలదు.



## మిధునం

(మృగశిర 3,4 – ఆరుద్ర, పునర్వసు 1,2,3)

వీరికి లాభనష్టములు ఈ నెలలో సమానముగా ఉంటాయి. భార్యకు (భర్తకు) వీరికి కొద్దిగా అనారోగ్యము. ఆరోగ్యము చేకూరును. వృత్తి, వ్యాపార, ఉద్యోగస్థులకు ప్రథమభాగం, అంతగా బాగుండదు. ఈ రాశివారు రవి, కుజ, శుక్రులకు జపదానాదులు చేసు కోవాలి. నవగ్రహములకు తొమ్మిది రోజులు తొమ్మిది ప్రదక్షిణాలు చొ॥ చేయండి. తరువాత శివదర్శనం చేసుకోండి.



## కర్కాటకం

(పునర్వసు 4 – పుష్యమి – ఆశ్లేష)

వీరికి ఈ మాసములో విశేష ప్రయాణములు ఉన్నాయి. అందుచేత అలసట, అనారోగ్యము కలదు. దుఃఖవార్తా శ్రవణము ఉంది. వేళ తప్పి భోజనములు చేయుదురు. ధన వ్యయము అధికముగా కలదు. వీరికి రవి, బుధ, కుజ, శుక్ర, చంద్రులు ఈ మాసము నందు అనుకూలురు కారు. వారికి జప, దానములు చేసి కొనవలెను. అన్ని వ్యవహారములలో జాగ్రత్తగా వ్యవహరించండి. ఈ ఒక్క మాసము నందు ఆందోళన పడకండి.

మార్చి నుండి ఈ రాశి వారికి బాగుంది. పుష్యమి నక్షత్ర జాతకులు మరికొంత జాగ్రత్త వహించాలి. యథాశక్తి దైవధ్యానము నందు ఉండండి. ఈ రాశి వారు ప్రతి ఒక్కరు పదివేల గాయత్రి జపం చేయించుకోండి. ఇది గ్రహానుకూలతను కలిగిస్తుంది.



## సింహం

(మఘ – పుబ్బ – ఉత్తర ప్రథమ పాదం)

వ్యాపారాభివృద్ధి, గౌరవాభివృద్ధి ఉంది. ఈ మాసములో ద్వితీయ భాగము అంత అనుకూలమైన రోజులు కావు. ఈ మాసం ద్వితీయభాగంలో

ఏమీ క్రయవిక్రయాలు చేయకండి. రవి, కుజ, శుక్ర, బుధలకు జప దానాలు అవసరం. లలితా సహస్రనామ పారాయణం చేయుట అవసరం.



## కన్య

(ఉత్తర 2,3,4 – హస్త – చిత్త 1,2.)

వీరికి రెండు సం॥ నుండి అష్టమ శని నడుచున్నందున వీరుకూడ శనికి తైలాభిషేకము చేయించుకోవాలి. వీరికి ఈ నెల ద్వితీయ భాగము ఇంకా బాగా యోగించును. ధనం అధికముగా ఖర్చు పెడతారు. సుబ్రహ్మణ్య స్వామిని ఆరాధించాలి. 15వ తారీఖునుండి ప్రయత్నసాఫల్యత, వస్త్రలాభము, గృహమందు శాంతి సౌఖ్యములు కలుగుతాయి. రవి, కుజ, రాహులకు జపం చేయించుకోండి. కందులు కుజగ్రహం కొఱకు తప్పక దానం చేయండి. సదక్షిణగా, లీటరుంపావు (1250 గ్రా) పెరుగు దానం చేయండి.



## తుల

(చిత్త – 3,4 – స్వాతి – విశాఖ – 1,2,3.)

ఆరోగ్యము, వ్యవహార జయము, కార్యానుకూలత ధనధాన్యాభివృద్ధి సామాన్య ముగా ఉండును. ఖర్చులు సక్రమంగా ఉండును. దైవభక్తి పెరుగును. పిల్లలకు అభివృద్ధి కలదు. అవయవములలో ఉష్ణ బాధలు ఉంటాయి. వీరికి కూడా కొద్ది మాసములలో అష్టమశని రాగలదు. అందుచేత శనికి తైలాభిషేకం చేయించుకోండి. లలితా సహస్ర నామం చేసుకోండి. చిత్తవారు తైలాభిషేకం వెంటనే చేయించుకోవలెను.



## వృశ్చికం

(విశాఖ-4 – అనూరాధ – జ్యేష్ట)

ధనధాన్యవృద్ధి కలదు, ప్రయత్నములు అనుకూలించును. సేవకుల సహకారముంటుంది. కుటుంబ సుఖ సంతోషాలుంటాయి. బాకీలు వసూలు అవుతాయి. అనూరాధవారికి మంచిరోజులు. శుభ కార్య నిర్వహణ, శత్రుజయము, ధన కీర్తులు కలుగుతాయి. ప్రయాణాలు ఉపకరిస్తాయి. స్త్రీసుఖం, కుటుంబ శాంతి కలుగుతుంది. పిల్లలు ఆరోగ్యంగా ఉంటారు. మహా లక్ష్మీ పూజ మాత్రం చేసుకోవాలి. ఆవుపాలను నైవేద్యం పెట్టవలెను.



## ధనుస్సు

(మూల – పూర్వాషాఢ – ఉత్తరాషాఢ ప్రథమపాదం)

ఈ మాసము విశేష ధనలాభము కలు గును. మానసిక సంతోషము మెండు.. అధికారుల ఆదరణ కలిగి ఉన్నత స్థితికి దోహదమగును. మనస్సు నిర్మలంగా ఉండి ఆనందంగా ఉంటారు.

కుటుంబంలో ఆనందం ఉంటుంది. కీర్తి ప్రతిష్ఠలు కలుగుతాయి. వాహన సౌఖ్యం కూడా కలదు. పూర్వాషాఢవారికి ఇంకా మంచి కాలము. చంద్రోదయ వేళ దీపం పెట్టి లక్ష్మీ అష్టోత్తర స్తోత్రం చదువుకోండి. ఈ రాశి వారికి అధిక ధనప్రాప్తి కలుగును.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 – శ్రవణం – ధనిష్ట 1,2)

నూతన వస్త్ర లాభము కలదు. సోదరులు, సహకరిస్తారు. ఫిబ్రవరి 15 నుండి ధనలాభము, వృత్తి వ్యాపారాలలో జయము కలుగుతుంది. శుభకార్యములు చేస్తారు. శ్రవణానక్షత్రం వారికి మంచి యోగ కాలము. ఈ రాశివారికి అర్ధాష్టమ శని నడుస్తోంది. వీరు శని గ్రహ శాంతికి ఏకాదశ రుద్ర తైలాభిషేకము చేయించుకోవలెను. లక్ష్మీదేవి పూజ చేసుకోవాలి.



## కుంభము

(ధనిష్ట 3,4 – శతభిషం – పూర్వాభాద్ర 1,2,3.)

వాహనవములచేత వీరికి ధనాదాయము ఉంటుంది. విదేశీ ద్రవ్య లాభం కూడా కలదు. ప్రభుత్వ వ్యవహారాలలో అనుకూలత ఉండదు. 15వ తారీకు నుండి అనుకూలంగా ఉంటుంది. దైవచింతన కలిగి, తీర్థ యాత్రలు చేస్తారు. సుబ్రహ్మణ్య పూజ చేసికోవలెను. శనికుజులకు జపదానాలు చేయవలెను. నువ్వులు, కందులు, పెరుగు (1250 గ్రా) దానం చేయవలెను.



## మీనం

(పూర్వాభాద్ర 4 – ఉత్తరాభాద్ర – రేవతి)

ఉద్యోగం, వ్యాపారమునందు అనుకూలత స్వల్పము. వీరు శనికి తైలాభిషేకము వెంటనే చేయించుకోవాలి. త్వరలో మీకు ఏలి నాటి శని అయిపోతోంది. శనిని ప్రసన్నం చేసుకొంటే శుభఫలితాలను పొందవచ్చు.

15 నుండి ప్రభుత్వ వ్యవహారములు అనుకూలించును. విష్ణుసహస్రనామం రోజుకు మూడు సార్లు చేసి కొంటే శాంతి జరుగుతుంది. పెసలు దానం.చేసికోవాలి.

ఉత్తరాభాద్రవారు శని తైలాభిషేకం వెంటనే చేయించుకోవలెను. (ఏలినాటి శని గురించిన "గమనిక" చూడండి.) ✦

# అర్థవంతమైనది
# మన కాలమానం

పోలిశెట్టి బ్రదర్స్

## తలక్రిందుల క్రీస్తు పూర్వం లెక్కింపు

క్రీస్తుపూర్వం, క్రీస్తుశకం అనే కాలమానం లెక్కింపులో ఒక తమాషా ఉంది. క్రీస్తుశకం లెక్క బాగానే ఉంటుంది. కాని క్రీస్తు పూర్వం లెక్క మాత్రం తలక్రిందులుగా నడుస్తుంది, గమనించండి.

క్రీ.శ. 1947 లో పుట్టిన వ్యక్తికి 47 సంవత్సరాలు వచ్చినప్పుడు క్యాలెండరులో 1994 (1947+47)వ సంవత్సరం ఉంటుంది. ఇది సహజమైన లెక్కలా బాగానే ఉంది.

అయితే ఇప్పుడు చూడండి. క్రీస్తు పూర్వం 1947 లో పుట్టిన వ్యక్తికి 47 సంవత్సరాలు వచ్చినప్పుడు - క్యాలెండరులో 1900 (1947-47)వ సంవత్సరం ఉంటుంది. ఎందుకంటే క్రీస్తుపూర్వం సంవత్సరాల లెక్క ముందునుండి వెనుకకు వస్తుంది. ఇది తల క్రిందుల లెక్కలా ఉంటుంది. విద్యావంతులూ, అనుభవజ్ఞులూ దీన్ని అర్థం చేసుకో గలరు గానీ, సామాన్య పౌరులకు మాత్రం ఇది అయోమయంగానే తోస్తుంది.

## హైందవ శకాలు

క్రీస్తుపూర్వం వంటి తలక్రిందుల లెక్క, మన హిందూ శకాల్లో కన్పించదు. మన శకాలకు ఒక స్పష్టత ఉంది. పైగా మన శకాలన్నీ అత్యంత ప్రాచీనమైనవి కూడా!

పూర్వం భారతదేశంలో ఏక కాలంలో వేర్వేరు ప్రాంతాల్లో వేర్వేరు శకాలు అమలులో ఉండేవి. క్రీ.పూ. 57వ సంవత్సరంలో ప్రారంభమైన 'విక్రమశకం' ఉత్తర హిందూ దేశమంతటా వాడుకలో ఉండేది. క్రీ.శ 78వ సంవత్సరంలో ప్రారంభమైన 'శాలివాహన శకం' దక్షిణ భారత దేశంలో అమలులో ఉండేది. (దీన్నే శక సంవత్సరం అని కూడా అంటారు) ఇలా అనేక శకాలు మన దేశంలో వాడుకలో ఉండేవి. ఇవి కాక హిందూ ఖగోళ గ్రంథాల్లో 'కలిశకం' కన్పిస్తుంది. మేషరాశిలో గ్రహాలకూటమి జరిగి నప్పటినుండీ (క్రీ.పూ 3102 సంవత్సరం ఫిబ్రవరి 18వ తేదీన) కలియుగారంభం. విక్రమ, శాలివాహన శకాలకంటే ముందునుండీ అమలు అవుతూ నేటికీ లెక్కించబడుతున్నది ఈ కలిశకం.

కలిశకం అనేది క్రీస్తు శకం కంటే 3,102 సంవత్సరాల క్రితం నుండీ వుంది. (కలిశకానికి ముందు 'యుధిష్ఠర శకం' ఉండేది.) అంటే మన కలిశకం మొదలై ఇప్పటికి 5 వేల సంవత్సరాలు దాటింది. 5వేల సంవత్సరాల క్రితం వరకూ ఉన్న శకాలను చెప్పకున్నాం. అంతకంటే ప్రాచీన కాలాన్ని కూడా చెప్పగల కాలమానం మనకుంది. అదే యుగాల, మహాయుగాల, మన్వంతరాల, కల్పకాల లెక్క! కలియుగం కంటే ముందు ద్వాపరయుగం, దానికి ముందు త్రేతా యుగం, అంతేకంటే ముందు కృతయుగం... అంతకంటే ప్రాచీనం కావాలంటే మహాయుగాలూ... మన్వంతరాలూ ... ఇలా సృష్టి ఆరంభమైన నాటినుండి నేటి వరకూ ఒక్క వాక్యంలో చెప్పగల కాలమానం మన హిందువులకుంది. సృష్టి మొదలయి ఈనాటికి (క్రీ.శ 1999నాటికి) 7వ మన్వంతరంలోని 28వ మహాయుగంలో (కృత, త్రేతా, ద్వాపర యుగాలు దాటి) కలియుగం 5,099వ సంవత్సరం జరుగుతుందని చెప్పగలం. ఇంతటి బ్రహ్మాండమైన కాలమానాన్ని చెప్పగల సామర్థ్యం మరో జాతికి లేదు.

అంతటి ఘనతను కలిగి ఉండీ కూడా, ప్రపంచరీతి కోసం క్రీస్తుశకాన్ని పాటిస్తున్నారు హిందువులు.

## సంవత్సర ఆరంభం

కాలమానంలో సూక్ష్మఘడియలు, పర ఘడియలు, విఘడియలు, ఘడియలు, దినాలు, వారాలు, మాసాలు, సంవత్సరాలు... మొదలైనవన్నీ ఏర్పరచిన అతి ప్రాచీన కాలమానం మనది. ఇవనీ ఖగోళ ఆధారంగానే ఏర్పరచడం జరిగింది. విదేశీయులయితే ఖగోళాధారంగా కొన్ని, తమకు తోచినట్లుగా కొన్ని 'కాలమాన అంశాల్ని' ఏర్పరచుకున్నారు.

సంవత్సర ఆరంభ విషయంలో హిందువులకూ, విదేశీయులకూ పూర్తి తేడా ఉంది.

అనేక పాశ్చాత్య దేశాల్లో జనవరి 1వ తేదీని సంవత్సరాదిగా పరిగణిస్తున్నారు. హిందువులు మాత్రం వసంత ఋతుకాలంలో సంవత్సరాదిని గుర్తిస్తున్నారు. (తెలుగు సంవత్సరాది అనీ, తమిళ సంవత్సరాది అనీ..... ఇలా మనదేశంలో కొద్దిరోజుల తేడాల్లో సంవత్సరాది తేదీలను నిర్ణయించుకుని జరుపుకుంటారు. ఈకొద్దిరోజుల తేడాలూ ఎందుకొచ్చాయనేది తర్వాత పేజీల్లో తెలుసుకుంటారు) మన దేశస్థులు ఇలా కొద్ది రోజుల తేడాలో వేర్వేరు సంవత్సరాదుల్ని ఏర్పరచుకున్నా, అవన్నీ కూడా ''వసంత ఋతు కాలంలోనే'' వస్తాయి. (ఈ విషయాన్ని మనం ఇక్కడ ముఖ్యంగా గమనించాలి.) వసంత ఋతువు నందు సంవత్సరాదిని ఏర్పాటు చేసుకోవడంలో ఖగోళపరంగా ఒక ఖచ్చితమైన

పద్ధతి ఉంది. విదేశీయులు సంవత్సరాదిగి ఏర్పరచుకున్న జనవరి1వ తేదీ ఖగోళ సిద్ధాంతాలకు ఏ విధంగానూ కూడా అనుగుణంగా లేదు. సంవత్సరాదిగా జనవరి 1వ తేదీకి ఇటు చాంద్రమాన ఆధారంగానీ, అటు సౌరమాన ఆధారంగానీ, లేదా చాంద్రసౌరమాన ఆధారంగానీ లేదు. విదేశీ క్యాలెండరులో జనవరి1వ తేదీనుండి డిసెంబరు 31వరకూ తేదీల్ని అంకెల్లో లెక్కించుకోవడం తప్ప, ఏ తేదీన ఖగోళపరిస్థితి ఎలా ఉన్నదీ తెలిపే విధానం ఏదీ లేదు. అదే మన పంచాంగం సంగతి చూడండి మరి!

## మన పంచాంగం ఘనత

ఖగోళ స్థితిగతులను అనుసరించి పంచాంగం రూపొందించబడింది. సంవత్సరంలో ఏరోజును తీసుకున్నా, ఇంకా చెప్పాలంటే ఏ క్షణాన్ని తీసుకున్నా కూడా – ఆ రోజుకు లేదా ఆ క్షణానికి ఖగోళస్థితిగతులు ఎలా ఉన్నాయో మన పంచాంగం స్పష్టంగా వివరిస్తుంది. (ఈ విధంగా మనం పుట్టిన క్షణాలకున్న ఖగోళ స్థితిగతులను పంచాంగం ద్వారా లెక్కిస్తూ, పండితులు మనకు జాతకాలు వ్రాస్తుంటారు.) 5 అంగాలు కలిగి ఉన్నది గనుక దీనికి 'పంచాంగం' అనే పేరు వచ్చింది. మనం ఏ రోజును తీసుకున్నా, ఆ రోజుకు సంబంధించిన పంచ అంగాలనూ (తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణాలను) పంచాంగం ద్వారా మనం నిర్దిష్టంగా తెలుసుకోవచ్చు. పంచాంగంలోని 5 విభాగాలను గురించీ క్లుప్తంగా తెలుసుకుందాం.

**1) తిథి** : ఇది చంద్రుని నడకలకు సంబంధించినది. చంద్రకళలో 12 డిగ్రీల మార్పును 'తిథి' పేరుతో సూచిస్తారు.

**2) వారం** : వారంలోని 7 రోజుల్లో ఒక్కొక్క రోజుకూ ఒక్కొక్క జ్యోతిష గ్రహాన్ని అధిదేవతగా ఊహించి, ఆ రోజును ఆ గ్రహం పేరుతో వ్యవహరిస్తారు.

**3) నక్షత్రం** : రాశిచక్రంలోని 27 నక్షత్రాల్లో ఏ నక్షత్రం దగ్గరగా చంద్రుడు ఉంటే (ఉన్నట్లు కన్పిస్తే) ఆ నక్షత్రం పేరుతో ఆ రోజును చెప్తారు.

**4) యోగం** : సూర్యుడున్నట్లు కన్పిస్తున్న నక్షత్ర రాశిలోని నక్షత్రాల సంఖ్యనూ చంద్రుడున్నట్లు కన్పిస్తున్న నక్షత్ర రాశిలోని నక్షత్రాల సంఖ్యనూ (భిన్నములతో సహా) కూడగా వచ్చిన మొత్తాన్ని బట్టి సూర్యోదయకాలంలో ఏ యోగం నడుస్తుందో, అది ఎప్పుడు పూర్తవుతుందో చెప్తారు. ఈ యోగాలు 27 ఉంటాయి.

**5) కరణం** : తిథిలో అర్ధభాగాన్ని 'కరణం' అంటారు.

యోగం, కరణం అనేవి జ్యోతిషశాస్త్రానికి సంబంధించినవి.

ఇలా 5 అంగాలతో నిర్దిష్టంగా ఉన్న పంచాంగం మన చేతిలో ఉండి కూడా, నేడు మనమంత 'జనవరి టు డిసెంబరు క్యాలెండరునే' ఎక్కువగా ఉపయోగిస్తున్నాం.

మన పంచాంగానికున్న విలువ, శక్తి సామర్థ్యాల్ని విదేశీయుల కాలమానాలు సాధించలేకపోయాయనే విషయం మాత్రం యదార్థం.

## మన సంస్కృతిని గుర్తుంచుకోండి

ఖగోళ గతులకు అనుగుణంగా ఏర్పరచుకున్న మన సంవత్సరాదిని విస్మరిస్తూ – ఖగోళపరంగా అర్థం, పరమార్థం లేకపోయినా సరే – విదేశీయులు నిర్ణయించిన జనవరి 1వ తేదీన ''విష్ యూ హేపీ న్యూ ఇయర్'' చెప్పుకుంటూ పాశ్చాత్య సంస్కృతి వైపు సాగిపోతున్నాం మనం. పాశ్చాత్య సంస్కృతిని అనుసరించడం అనే విషయాన్ని కాస్సేపు ప్రక్కనుంచండి. స్వదేశీ పరిజ్ఞానాన్ని విస్మరిస్తున్నామనేది ఇక్కడ మనం గుర్తించవలసిన ప్రముఖ అంశం. స్వంత సంస్కృతికి దూరమైన ఏ జాతైనా కూడా ఎంత కాలమో మనుగడ సాగించలేదు. ఈ విషయాన్ని మనం ఎంత త్వరగా గుర్తించి కళ్ళు తెరిస్తే అంత మంచిది. ఖగోళ ఆధారంగా మన హిందువులు ఏర్పరచిన వసంత ఋతుకాలంలోని సంవత్సరాదిని గుర్తించి, ఆదరించి ఆచరించే తరుణం రావాలి. అంటే మన తెలుగువారంతా ఉగాది పండుగకు ''నూతన సంవత్సర శుభాకాంక్షల్ని'' తెలుపుకోవలసి ఉంటుంది.

## ''ఇప్పుడెందుకీ మేలుకొలుపు?''

మా స్నేహితుడొకడు మొన్ననే అన్నాడు – ''సంవత్సరానికి మొదటిరోజు జనవరి ఫస్టో, ఉగాదో... ఏదో ఒకటి! ఏదయితే ఏం పోయింది? అది పాశ్చాత్యులదీ, ఇది మన దీనూ! దట్సాల్!!''

మా స్నేహితుడు చెప్పింది ఒక విధంగా నిజమే! ఏదోవిధంగా, అదీ, ఇదీ కూడా ఆచరిస్తూ పోతున్నాం, బాగానే ఉంది. ''అయితే ఏది ఎంతవరకూ అవగాహన కల్గి ఆచరిస్తున్నామనేది ప్రశ్న!'' ఈ దిశలో కాస్త నిదానంగా ఆలోచించి చూస్తే, అసలు సంగతి అర్థమౌతుంది. కాల గమనంలో మనం పాశ్చాత్య సంవత్సరానికి అధికాడంబర విలువనిస్తూ, స్వసంస్కృతికి చెందిన ఉగాది యొక్క అర్థం, పరమార్థాలను మెల్లగా మరచిపోతున్నాం. వేపపువ్వు పచ్చడి తినే పండుగగానే తప్ప, ఉగాది ప్రాముఖ్యత మనలో ఎంత మందికి తెలుసు? ఈవిధంగా ఉగాది ప్రాశస్త్యం వెనుకబడుతోంది. మెల్లగా మనం సాంస్కృతిక పరంగా ఒక దారుణమైన మార్పుకు బలి అవుతున్నాం. ఉత్తమ మార్గాన ఉన్న స్వసంస్కృతిని వదులుకునే జాతి మనుగడ ఏనాటికైనా ప్రశ్నార్థకమే! ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకునే ప్రస్తుతానికి ఈ మేలుకొలుపు!

## తెలుసుకోవలసిన కొన్ని విషయాలు

కాలమానాలను గురించి తెలుసుకునే ముందు కొన్ని ముఖ్య విషయాలపై మనకో అవగాహన అవసరం. అవి ఏమిటో క్రమంగా తెలుసుకుందాము.

(సశేషం)

# స్వప్నం

డా॥ గాయత్రీదేవి

ఆయుర్వేదంలో - ఆరోగ్య రక్షణ, వ్యాధి చికిత్స అని రెండు భాగాలున్నాయని నేను పదే పదే తెలియజేస్తున్నాను. ఆరోగ్య రక్షణ కోసం మానవులు ప్రతిరోజూ అనుసరించ వలసిన విధివిధానాలను ''దినచర్యగానూ, వివిధ ఋతువులలో అనుసరించవలసిన విధులను ''ఋతుచర్య'' గానూ సంహితకారులు వివరించారు.

దినచర్య స్వప్నావస్థ (అంటే నిద్ర) నుండి మేల్కొనడంతో ప్రారంభమవుతుంది.

అలసిన శరీరానికీ, మనసుకీ విశ్రాంతి నిచ్చేది నిద్ర.

## సమయం

రాత్రి పూట నిద్ర పోవడం సామాన్యం. పగటిపూట నిద్ర అందరికీ తగినది కాదు. ఆరోగ్యవంతులు రాత్రి నిద్రపోయి, బ్రాహ్మీ ముహూర్తాన మేలుకోవాలి.

ప్రశాంతంగా నిద్రపోవడం వలన శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. శరీరంలోని ధాతువులన్నీ సమస్థితిలో ఉంటాయి. బలం వృద్ధి చెందుతుంది. ఇంద్రియాలన్నీ స్వధర్మాలు సక్రమంగా నిర్వహిస్తాయి.

## దివా స్వప్నం

దివా స్వప్నం అంటే పగటి నిద్ర. వృద్ధులు, పిల్లలు, రోగులు, ప్రయాణంచేసి, శ్రమపడి అలసిపోయిన వారు, రాత్రి జాగరణ చేసిన వారు, శరీరం క్షీణించిన వారు పగలు నిద్రపోవచ్చు. గ్రీష్మ ఋతువులో అంటే ఎండా కాలంలో పగలు నిద్రపోవచ్చు. మిగిలిన ఋతువులలో పగలు నిద్రపోవడం వలన కఫ, పిత్త సంబంధమయిన వ్యాధులు వచ్చే అవకాశం ఉంటుంది.

స్థూల శరీరం ఉన్నవారు, కఫ ప్రకృతి కలవారూ కఫ సంబంధమయిన వ్యాధులతో బాధ పడే వారూ పగలు నిద్రపోకూడదు.

## జాగరణ

అనుచితంగా రాత్రి జాగరణ చేస్తే శరీరంలో వాతం వృద్ధి చెందుతుంది. శరీరం ఎండి పోయినట్లవుతుంది.

ప్రతిరోజు నియమబద్ధంగా నిద్రపోయి, శరీరానికి మనసుకీ విశ్రాంతి నీయకపోతే - అవయవాలు సక్రమంగా పనిచేయవు. శరీరం రోగగ్రస్తమవుతుంది, క్షీణిస్తుంది.

## నిద్రపట్టకపోతే

రకరకాల కారణాల వల్ల రాత్రి నిద్రపట్టక పోవచ్చు వాటిలో కొన్ని - ఏదయినా పనిలో నిమగ్నం కావడం, అలవాటు కాని సమయంలో పడుకోవడం, కొన్ని వ్యాధులు మొదలయినవి.

నిద్ర పట్టడం కోసం నిద్రమాత్రల్ని ఆశ్రయించడం అనారోగ్యకరం. నిద్రపట్టడం కోసం కొన్ని సూచనలు చేశారు సంహితాకారులు. వాటిని అనుసరించి ప్రయత్నించండి.

★ శరీరానికీ, తలకీ నూనెరాసుకుని చేసే అభ్యంగ స్నానము.
★ శరీరానికి మాసాజ్ చేయడం
★ వెచ్చని నీటితో స్నానం చేయడం
★ రాత్రి పూట ఒక గ్లాసు పాలుతాగడం
★ పరిసరాలలో సుగంధాలుండేలా చేసుకోవడం
★ శిరస్సు మీద చల్లని తైలం రాసుకోవడం
★ ఆహ్లాదకరమయిన సంగీతం వినడం.

## అతిసర్వత్ర వర్జయేత్

నిద్ర కూడా పరిమితిని మించకూడదు. ఆరోగ్యవంతులకి 8 గంటల నిద్ర సరిపోతుంది.

అతిగా నిద్రపోవడం వలన కఫదోషం వృద్ధి చెందుతుంది. శరీరంలో కొవ్వు పెరిగి స్థూల శరీరాలవుతారు (లావుగా అవుతారు). పగటి పూట ఎక్కువ సేపు నిద్రపోవడం వలన ప్రమేహ వ్యాధి, ఇతర కఫరోగాలు కలుగుతాయి. చరక సంహితలో - స్థూల శరీరాన్ని తగ్గించుకోవడానికి నిద్ర తగ్గించుకోవాలనీ, కృశులు (మరీసన్నగా ఉన్నవారు) - పగలు పడుకోవడం వల్ల కొంత బరువు పెంచుకోవచ్చనీ చెప్పబడింది.

ఆచార్య చరకులు - నియమబద్ధమైన ఆహార సేవన కాగానే, నియమబద్ధమైన నిద్రవలన ఆరోగ్యం రక్షింపబడుతుంది, అని చెప్పారు. (''దేహవృత్తే యథాహారస్తథా స్వప్నః సుఖోమతః'') ✹

## మేల్కొనడం

చిన్నపిల్లలకి స్కూలు పుస్తకాలలో, 'రాత్రి త్వరగా నిద్రపోవాలి, ఉదయం త్వరగా లేవాలి' అని బోధిస్తుంటారు. ఆ సూత్రం అక్కడితో సరి, అయిపోతోంది. పెద్దలు ఆచరిస్తూంటే కదా, పిల్లలు అనుసరించగలిగేది. రకరకాల ఛానెల్స్‌లో టి.వి.ప్రోగ్రాంలు చూస్తూ రాత్రి ఆలస్యంగా నిద్రపోవడం మామూలయిపోయింది. ఆలస్యంగా నిద్రపోయి త్వరగా మేల్కోవడం కుదరదు కదా.

ఆరోగ్యవంతుడు ఆరోగ్యంగా ఉండడానికి సూర్యోదయానికి గంట, గంటన్నర ముందుగానే నిద్ర నుండి మేల్కోవాలి. ఈ సమయంలో మనసు ప్రశాంతంగా, ఉత్సాహంగా ఉంటుంది. పరిసరాలన్నీ ప్రశాంతంగా ఉంటాయి. ధ్వని కాలుష్యం, వాతావరణ కాలుష్యం ఉండదు. చదువుకోవడానికి, ధ్యానము, ప్రార్థన చేయడానికి - అనుకూలమైన సమయం. ఏకాగ్రత కుదురుతుంది. అనంతమయిన ఆనందం, పూర్ణజ్ఞానమూ సంపాదించడానికి అనువయిన సమయం - కనుక దీన్ని ''బ్రాహ్మీ ముహూర్తం'' అంటారు. (''బ్రాహ్మీ ముహూర్తే ఉత్తిష్ఠేత్... రక్షార్థమాయుషః స్వస్థః'')

ఉదయం లేవగానే కొంతసేపు ఏకాగ్రతతో దైవప్రార్థన చేయాలి. ఇలా చేయడం వలన మానసిక స్థైర్యం వస్తుంది. మనసు ప్రశాంతంగా ఉంటుంది. మనసు ప్రశాంతంగా ఉంటే, శరీరం కూడా ఆరోగ్యంగా ఉంటుంది.

# పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు

డా॥ గాయత్రీదేవి

**సురేష్ — బెంగుళూరు**

ప్ర : డాక్టర్‌గారూ! ఏదయినా వ్యాధి వస్తుందో లేదో తెలియకుండా, ముందునుండీ జాగ్రత్తలు అంటూ జీవితాన్ని ఆనందంగా అనుభవించక పోవడం నా దృష్టిలో మూర్ఖలక్షణంగా తోస్తోంది. ఆరోగ్యంగా ఉన్నన్నాళ్ళూ హాయిగా కాలం గడిపేసి, అనారోగ్యం వస్తే అప్పుడు చూసుకోవచ్చు కదా?

జ :ఇవి ఈరోజు కొత్తగా ఉదయించిన భావాలు కావు. చార్వాకులు - ''యావజ్జీవేత్ సుఖం జీవేత్, ఋణం కృత్వాఘృతం పిబేత్'' - అనే వారు. బతికున్నన్నాళ్ళూ, సుఖంగా, అవసరం అయితే అప్పుచేసి అయినా సరే, ఆనందంగా కాలం గడిపెయ్యాలి అని. ఎవరు నమ్మిన సిద్ధాంతాలు వారికి ఆనందాన్నిస్తాయి.

అయితే మర్చిపోకూడని విషయం ఏమిటంటే - ''ఆరోగ్యం'' షాపు కెళ్ళి డబ్బిచ్చి, కావలసినప్పుడు కొనుక్కోగలిగిన వస్తువు కాదు. ఆరోగ్య సాధనకి అడ్డదారులు (Short Cuts) లేవు. నిరంతరం శ్రద్ధ తీసుకుని ఆరోగ్యాన్ని వృద్ధి చేసుకోవాలి. ఏం సాధించడానికయినా ఆరోగ్యమే ప్రధానం - శరీరం ఆరోగ్యంగా ఉంటే మనసూ ఆరోగ్యంగా ఉంటుంది. అప్పుడే నిర్మాణాత్మకమైన ఆలోచనలతో ముందుకు సాగగలం.

**పద్మావతి — చెన్నై**

ప్ర : నా వయసు 40 సంవత్సరాలు. విరేచనం సాఫీగా కావడం లేదు. ప్రతిరోజూ కష్టపడి వెళ్ళవలసి వస్తోంది. మందులు వాడితే సాఫీగా అవుతుంది, ఆపగానే మళ్ళీ మలబద్ధకం. దయచేసి సలహా యివ్వగలరు.

జ : విరేచనం సాఫీగా కాకపోవడానికి రకరకాల కారణాలుంటాయి. ఈ స్పీడు యుగంలో - మనకున్న టెన్షన్ ఒక కారణం. ప్రతి పనీ పరుగులు పెడుతూ గడియారానుసారం చేయవలసి వస్తోంది. అలా హడావిడిగా చెయ్యాలనుకోవడం వల్ల, విరేచనం సక్రమంగా కాదు. విరేచనానికి వెళ్ళవలసిన అవసరం కలిగినప్పుడు పనుల హడావిడిలో ఉండి, తరువాత చూద్దాం అని వాయిదా వేయడం వలన కూడా మలబద్ధకం ఏర్పడుతుంది. ఇవికాక ఆహారంలో కావలసినంత పీచు పదార్థం తీసుకోకపోవడం, మంచినీళ్ళు తక్కువ త్రాగడం, కారం, మసాలాలు అధికంగా తినడం, వ్యాయామం లేకపోవడం - ఇలా రకరకాల కారణాలు మలబద్ధకానికి దారితీస్తాయి. ఇది అశ్రద్ధ చేయకూడని సమస్య. మలబద్ధకం - నెమ్మదిగా పైల్స్‌కి దారితీస్తుంది. దీర్ఘకాలిక మలబద్ధకం - ఒక్కొక్కసారి రెక్టల్ క్యాన్సర్‌కి కూడా కారణమవుతుంది. అందువల్ల ఆహార విహారాలలో మార్పులు చేసుకుని, సాఫీగా విరేచనం అయేలా చూసుకోవాలి.

- ★ మల విసర్జనకి - కొంత సమయం కేటాయించాలి - మనసు ప్రశాంతంగా ఉంచుకోవాలి. హడావిడి పనికిరాదు.
- ★ మలవిసర్జన అవసరం గ్రహించిన వెంటనే - ఆ వేగాన్ని ఆపకుండా, విసర్జన పూర్తి చేయాలి.
- ★ ప్రతిరోజూ, 10 గ్లాసులకి తక్కువ కాకుండా మంచినీరు తాగాలి.
- ★ ప్రతిరోజూ ఆకుకూర తినాలి.
- ★ ఫలాలు తినాలి.
- ★ కారం, మసాలాలు బాగా తగ్గించుకోవాలి.
- ★ ఉదయాన్నే 2-3 గ్లాసుల గోరువెచ్చని నీళ్ళు తాగి, మలవిసర్జనకి ప్రయత్నించడం వలన - విరేచనం సాఫీగా అవుతుంది.

కొందరిలో - ఈ సూచనలన్నిటినీ పాటించినా ఫలితం లేకపోవచ్చు. (అందుకు వారి శరీరప్రకృతి కారణం). అటువంటివారు - రోజూ రాత్రిపూట - 1 చెంచాడు కరక్కాయ చూర్ణాన్ని గోరువెచ్చని నీటితో సేవించవచ్చు.

★ రోజూ పుష్పలేహ్యం లేదా గుల్‌కంద్ - 2 చెంచాల లేహ్యం తీసుకోవచ్చు.

ఇవేవీ ఫలితాలనివ్వని వారు, వ్యక్తిగతముగా డాక్టర్ సలహా తీసుకోవడం అవసరం.

**శకుంతల — భీమవరం**

ప్ర : నా వయసు 50 సంవత్సరాలు. గత ఏడాదిగా, రెండు మోకాళ్ళూ నొప్పిగా ఉంటున్నాయి. కింద కూర్చుని లేవడం, మెట్లు ఎక్కడం కష్టంగా ఉంటోంది. ఇంగ్లీషు మందులు వాడాను. అవి వేసుకున్నప్పుడు, తగ్గినట్లుంటుంది. మానెయ్యగానే మళ్ళీ వస్తున్నాయి. నాకు ఈ నొప్పులు తగ్గే అవకాశం ఉందా?

జ : ఈ రకమైన సమస్యని ఆయుర్వేదంలో సంధి వాతం అంటారు. మోకాళ్ళ నొప్పులు, 40-45 సంవత్సరములు దాటిన స్త్రీలలో ఎక్కువగా వస్తుంటాయి. ప్రస్తుతం 30-35 సంవత్సరముల ఆడవారు కూడా, మోకాళ్ళ నొప్పులతో చికిత్సకి వస్తున్నారు. ఆయుర్వేద ఔషధాలు, క్రమం తప్పకుండా కొంత కాలం వాడితే నొప్పులు తగ్గుతాయి. ఎవరు ఎంత కాలం వాడాలి అనేది నిర్ధారణగా చెప్పలేము. మీరు. మహాయోగిరాజ గుగ్గులు పూటకి ఒక్క మాత్ర చొప్పున, మూడు పూటలా + మహారాస్నాది కషాయం 20 మి.లీ. సమపాళ్ళలో నీటితో కలిపి మూడు పూటలా వాడండి. పిండతైలం గోరు వెచ్చగా - మోకాళ్ళ మీద రాసి, అరగంటసేపు అలాగే ఉండి, వేడినీళ్ళ బట్టతో కానీ, వేడినీళ్ళ సంచితో కానీ కాపడం పెట్టండి. 40 రోజుల పాటు మందులు వాడి, ఎలా ఉన్నదీ తెలియజేయండి.

ఒక గమనిక - మీకు చక్కెర వ్యాధి ఉన్నదీ లేనిదీ తెలుసుకుని, బ్లడ్ షుగర్ సమంగా ఉండేలా చూసుకోవాలి. మధుమేహం ఉన్నవారికి (సుగర్ అతిగా ఉంటే) నొప్పులు త్వరగా తగ్గవు. ✷

సుధాలహరి

# వేదాంత స్వరూపం

గొట్టుముక్కల రామకృష్ణమూర్తి

శ్రీ పరమేశ్వర నిశ్వాసరూపమగు వేదము యొక్క జ్ఞాన భాగము, ఉపనిషత్తులనబడు వేదాంతములు. వేదాంతములు బ్రహ్మ జ్ఞానమును దుఃఖనివృత్తిపూర్వక మోక్షానంద ప్రదముగా ప్రతిపాదించుచున్నవి. సుధ అనగా అమృతము. అమృతం సేవిస్తే మరణం ఉండదని కదా ప్రసిద్ధి! కానీ వాస్తవస్థితిలో దేవలోక మందలి అమృతం సంపూర్ణ మరణ రహిత స్థితిని కల్గింపదు. ఎందుకంటే అది ఒక పానీయం మాత్రమే. కనుక జ్ఞానామృతమే వాస్తవమైన, మరణరహిత, నిత్యానందమును ప్రాప్తింపజేస్తుంది.

కనుక తేలింది ఏమిటంటే, అమృత మంటే ముక్తి అని. బ్రహ్మభావమే ముక్తి. లహరి అంటే ప్రవాహం! జ్ఞానామృతమే ఒక ప్రవాహం. సకల జీవులూ, సంసార దుఃఖ ప్రవాహం నుండి బయటపడి, జ్ఞానసుధాలహరిలో ఓలలాడుటయే పరమార్థం.

ఇంతకూ వేదాంతమనే మాటకు అర్థ మేమిటో పరిశీలిద్దాం. వేద + అంత = వేదాంత అని సమాసం ఏర్పడింది. అంతమంటే చివర గనుక వేదముల యొక్క చివరి భాగములు - ఉపనిషత్తులు - వేదాంతములు అని ఒక అభిప్రాయం ఉన్నది. ప్రతి వేదశాఖల చివర గల జ్ఞాన భాగమే ఉపనిషత్తు అనీ, కనుక వేదాంతమని సామాన్యంగా చెప్పే మాట.

అయితే వేదాంత శబ్దమునకు శ్రీ జగద్గురు శంకరులు విశేష నిర్వచనం చెప్పారు. ''అంతం'' అనగా నిర్ణయమనీ - వేదము యొక్క నిర్ణయము (పరమార్థ సత్య నిర్ణయము) వేదాంతము అని!

ప్రతి ఉపనిషత్తు ఒక వేదాంతము గనుక ఉపనిషత్తులు వేదాంతములగుచున్నవి. ఇట్టి జ్ఞానస్వరూపములైన ఉపనిషత్తులకు, సంసార దుఃఖమును క్షీణింపజేయునవి, అజ్ఞానమును నశింపజేయునవి, బ్రహ్మ ప్రాప్తిని కలిగించునవి - అని మూడర్థములు గలవు.

ఇట్టి ఉపనిషత్తులు 108 అని ప్రసిద్ధంగా ఉన్నప్పటికీ, ఈశ, కేన, కఠ - మున్నగు పది ఉపనిషత్తులకు శ్రీ శంకర భగవత్పాదులు భాష్యం రచించారు. ఈ పది ఉపనిషత్తులు అధ్యయనం చేస్తే బ్రహ్మవిజ్ఞానంకరతలామలకం అవుతుందని చెప్పడంలో సందేహం లేదు.

ఉపనిషత్తులు బోధించు విజ్ఞానం ''బ్రహ్మవిజ్ఞాన''మనీ, దానివల్లనే మోక్షప్రాప్తి అనీ తెలుసుకొన్నాము. ఇంతకూ బ్రహ్మ జ్ఞానమంటే ఏమిటి? బ్రహ్మజ్ఞానమంటే-

''బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనా పరః'' అనేదే. అంటే బ్రహ్మమొక్కటే సత్యము. ఈ జగత్తు అసత్యము. జీవుడు బ్రహ్మమే. వేఱు కాదు. అని దీని భావం. ఈ అర్థం స్పష్టంగా తెలియాలి అంటే కొంచెం లోతుకు దిగి ఆలోచించాలి. **మొత్తం తాత్త్విక చింతన అంతా - ప్రపంచం, జీవుడు, భగవంతుడు అనే మూడు విషయాలకు సంబంధించినదే.** ఈ మూడూ పరస్పర భిన్నములా? లేక ఒకే పదార్థమా? మూడూ భిన్నములైతే, భిన్న పదార్థములు ఎప్పుడూ నిత్యభిన్నంగా ఉంటాయేగానీ ఏక పదార్థమెట్లవుతుంది? ఈ మూడూ అఖండైక వస్తువయితే అది మూడు ఖండములెట్లయినది? ఉదాహరణకు, ఆకాశము అఖండైక వస్తువు. అది మూడు భాగములగునా? అగ్ని, జలము, భూమి భిన్న పదార్థములు. మూడు కలిసి ఒకే పదార్థమెట్లవుతుంది?

ఒకదానిలో నుండి ఒకటి పుట్టి మూడు భిన్న పదార్థములైనవి, అనగా అగ్ని నుండి జలము, దాని నుండి భూమి పుట్టినవనీ, మొదట అగ్ని స్వరూపము ఒకే పదార్థముగా ఉన్నది గదా! అని వాదించవచ్చును. కానీ ఈ వాదన సరిగాదు. ఎందుకంటే ఇక్కడ ఒక విశేషము మనము గమనించాలి. పదార్థములు సావయవములు (అవయవములు లేక భాగములు గలవి), నిరవయవములు (అవయవములు లేనివి) అని రెండు విధములు. అగ్ని మున్నగునవి సావయవ పదార్థములు. వానిలో నుండి భాగములు, పదార్థములు ఏర్పడ వచ్చును. నిరవయవ పదార్థమైన ఆకాశము నందు అట్టి భేదము కుదరదు.

ఆత్మయే బ్రహ్మ. అట్టి ఆత్మను ఉపని షత్తులు ''ఆకాశవత్ సర్వ గతశ్చ నిత్యః'' - ఆకాశమువలె సర్వ వ్యాపి, నిత్యము అని వర్ణించినవి. కనుక పరమాత్మ నుండి జీవ జగత్తులు వాస్తవముగా వేరుపడి ఏర్పడడానికి వీలులేదు. ఇంకొక విషయం - ఒకవేళ అట్లా ఏర్పడినట్లు మనం అంగీ కరించినా, ఒకసారి ఏర్పడిన తరువాత ప్రత్యేక భిన్న పదార్థములై ఉంటాయి గదా!

కనుక తేలిన సారాంశమిది - ఒకే వస్తువు భ్రాంతి వలన భిన్న పదార్థంగా కన్పించ వచ్చును. అంతమాత్రం చేత భిన్నవస్తువు ఉన్నట్లు కాదు. ''ఏకశ్చంద్రః సద్వితీయ వత్, శుక్తికాహి రజతవదవభాసతే'' - అని భాష్య కారులు చెప్పనే చెప్పినారు. నేత్ర దోషం వలన ఒకే చంద్రుడు రెండుగా కన్పించినట్లు, భ్రాంతి వలన ముత్యపు చిప్ప వెండిగా కన్పించినట్లు'' - అజ్ఞానదోషం వలన అద్వితీయ పరబ్రహ్మయే చరాచర జగత్తుగా గోచరిస్తున్నాడు.

కనుక 'రెండున్నవి' అనెడు భేదబుద్ధికి కారణం భ్రాంతియే. అవిద్య, అజ్ఞానం, అధ్యాస, మాయ మున్నగు శబ్దాలతో ఈ భ్రాంతియే సూచింపబడుతున్నది. కనుక ఉన్నది ఒక్కటే, అది బ్రహ్మ! ''ఏకమేవాద్వితీయం'' ''నేహనానాస్తికించన'' ''నతుత ద్వితీయమస్తి'' - అని బ్రహ్మము... అద్వితీయము, ఏకము, నానాత్వములేదు అను పై శ్రుతులే ప్రమాణములు. రెండవ పదార్థమే లేదనుటలో, 'ద్వైతము లేదు' 'న+ద్వైతమ్' 'అద్వైతమ్' అని తాత్పర్యమేర్పడుచున్నది. ఇట్టి అద్వైత జ్ఞానమే అజ్ఞాన నివృత్తి చేయగలదు.

అజ్ఞాన నివృత్తి తదనంతరం స్వరూపావస్థానమోక్షసిద్ధి. కనుకనే 'జ్ఞానాదేవతు కైవల్యమ్' అన్నారు. అంటే, జ్ఞానం వల్ల మాత్రమే కైవల్యం అనగా మోక్షసిద్ధి. ఈ మోక్షం సమస్త జీవులకు స్వభావసిద్ధమే గానీ, కొత్తగా సంపాదించుకొనేది గాదు. కనుకనే సాధ్యఫలప్రదములైన కర్మాదులు ముక్తిహేతువులు కావు.

సకల మానవులు ధర్మ, అర్థ, కామ, మోక్షములను, చతుర్విధ పురుషార్థములు సాధింపవలెనని పెద్దలు చెబుతారు. నిజమే కానీ మోక్షమనెడు చతుర్థ పురుషార్థమే పరమ పురుషార్థము. దీనిని సాధించినచో తక్కిన పురుషార్థములు సిద్ధించినట్లే. దీనిని సాధింపకున్నచో తక్కిన పురుషార్థములు సాధించినను దుఃఖనివృత్తి లేదు. ఎందుకంటే, ఈ శరీరము నందొకడున్నాడు. వాడు దేహేంద్రియాదుల కంటె భిన్నుడు. దేహేంద్రియాదులు నశించును. వాడు నశింపడు. వానికే జీవుడని పేరు.

వేదాంత పరిభాషలో ''చిదాభాసుడని'' పేరు. తనకంటే భిన్నమైన దేహేంద్రియాది పంజర బద్ధుడై, ఈ జీవుడు తాపత్రయ దావానల దగ్ధుడౌతున్నాడు. నిరంతర దుఃఖ మగ్నుడౌతున్నాడు. ధర్మార్థ కామ పురుషార్థము లెంతగా సాధించినా, ఇహపర లోక సౌఖ్యము లెంత అనుభవించినా, తిరిగి మర్త్యలోకమునకే వస్తున్నాడు. యజ్ఞయాగాదికర్మలుగాని, ఇతర పుణ్యకర్మలుగానీ, దేవతారాధనలు గానీ, యోగ, ధ్యాన, జప, తపాదులు గాని జీవునికి శాశ్వత దుఃఖనివృత్తిని కలిగించడం లేదు. మరి శోకసముద్రమును దాటించునది ఏది? 'తరతి శోకమాత్మవిత్', 'ఆత్మవేత్త శోకసముద్రమును దాటును' అని వేదాంతములు సమాధానం కంఠోక్తిగా చెప్పుతున్నవి. ఈ విషయాలన్నీ మనం మరింత లోతుకు దిగి పరిశీలించి క్రమంగా తెలుసుకొందాము.

(సశేషం)

## ధర్మస్వరూపులు

ఈశ్వరుడు మానవుణ్ణి తన సర్వశక్తిమంతమైన రూపంలో సృష్టించాడని వేద గ్రంథాలన్నీ ఘోషిస్తాయి. విశ్వంమీద నియంత్రణ ప్రకృతికి అతీతమైనదన్నట్లు కనిపిస్తుంది. కాని నిజానికి తన పుట్టుకకు మూలం భగవంతుడనే ''సరయినస్పృహ'' సాధించిన ప్రతి ఒక్కడిలోనూ అటువంటి శక్తి సహజంగా ఉంటుంది. అహంకారమూ, వ్యక్తిగత వాంఛల రూపంలో అది తల ఎత్తడమూ, భగవత్సాక్షాత్కారం పొందిన వాళ్ళలో ఉండవు. నిజమైన గురువుల కార్యకలాపాలు 'ఋతం' అనే సహజ ధార్మికతకు అప్రయత్నంగానే అనురూపంగా ఉంటాయి. మహాపురుషులందరూ, ''ధర్మపరాయణులు'' కావడం కాదు, వారే 'ధర్మస్వరూపు'లవుతారు. అప్పుడు సృష్టి లక్ష్యం నెరవేరుతుంది. ఈశ్వరుడు బాగా ప్రసన్నుడవుతాడు.

దైవసాక్షాత్కారం పొందిన మనిషి ఎవరయినా సరే, అలౌకిక ఘటనలు ప్రదర్శించగలరు; సూక్ష్మమైన సృష్టి నియమాల్ని అతడు అర్థం చేసుకోడమే దీనికి కారణం. కాని సద్గురువులందరూ అద్భుత శక్తుల్ని ప్రయోగించాలని తలపెట్టరు. ప్రతి సాధువూ తన రీతిలో తాను దేవుణ్ణి ప్రతిబింబింపజేస్తూ ఉంటాడు. ఏ రెండు ఇసుక రేణువులూ ఖచ్చితంగా ఒకదాన్నొకటి పోలకుండా ఉండే ఈ ప్రపంచంలో ఈ మాదిరి అభివ్యక్తి మౌలికమైనది.

కొందరు అద్భుత అలౌకిక చర్యలు ప్రదర్శిస్తారు, కొందరు ప్రదర్శించరు; కొందరు నిష్క్రియులుగా ఉంటే మరికొందరు బృహత్ కార్యకలాపాల్లో తలమునకలై ఉంటారు; కొందరు ఉద్బోధిస్తారు, సంచారం చేస్తారు, శిష్యుల్ని స్వీకరిస్తారు. కాని మరికొందరు నీడ మాదిరిగా నిశ్శబ్దంగానూ వినమ్రం గానూ జీవితాలు గడుపుతారు.

- యోగానంద

## సందేహాలకు సమాధానాలు



నిర్వహణ: ఋషిపీఠం

**ఎన్.రామ్మూర్తి** రాజమండ్రి

ప్ర. నాకు రుద్ర నమకం వంటివి రావు. రోజూ ఓ వెండి శివలింగాన్ని పూజించుకుంటుంటాను. అయితే రుద్రంతో తప్ప శివుని పూజించకూడదనీ, శివలింగాన్ని ఇంట్లో ఉంచుకోకూడదనికొందరంటున్నారు. నిజమేనా?

జ. మీరు విన్నవి సరైనవి కావు. శివలింగాన్ని ఇంట్లో వుంచి పూజించడం సర్వైశ్వర్యకరం. రుద్ర నమకాదులతోనే అభిషేకించనవసరం లేదు. శివనామాలు చెప్తూ అభిషేకించవచ్చు. అష్టోత్తరశత నామాలతోనూ అభిషేకించవచ్చు.

ఏదీ రానప్పుడు 'శివాయనమః' అని చెప్తూ అభిషేకించినా చాలు. నిత్యం ఇంట్లో శివార్చన జరగడం మంచిది. శివపూజ అందరూ చేయవచ్చు. అయితే బాణలింగం, స్ఫటిక లింగం, సాలగ్రామం వంటి వాటికే ఎక్కువ నియమాలు, విధులూ ఉన్నాయి. అవి యోగ్యులైన గురువుల సహాయంతోనే స్వీకరించాలి. అవి లేకున్నా, వెండి లింగాన్ని అర్చించడం మంచిదే.

**ఆర్.మంజుల** శ్రీకాకుళం

ప్ర. మావారు ఈమధ్య ఒకస్వామీజీ ఉపదేశాలకి ప్రభావితులైపోయి 'అంతా మిథ్య – ఎవరి కర్మ వారిది' – అని మాట్లాడుతూ ఇంటి విషయాలు పట్టించుకోవడం లేదు. సంపాదన, పోషణ వంటి విషయాల్లో కూడా నిర్లక్ష్యం చేస్తున్నారు. సంపాదనంతా స్వామీజీ ఆశ్రమానికే ఎక్కువగా ధారపోస్తున్నారు. ఈ వైరాగ్యం చూస్తే భయం వేస్తోంది. ఇలా కుటుంబాల్ని క్షోభ పెట్టే ఆధ్యాత్మికత ఎందుకు?

జ. మీవారికి ఉపదేశించిన స్వామీజీలోనే దోష మంతా ఉంది. అసలు, అన్నీ విడిచిపెట్టమని చెప్పే స్వామీజీలు, శిష్యుల్ని తయారుచేసుకొని, వాళ్ల ద్వారా బోలెడంత సంపాదనలు పెంచుకోవడమే పెద్ద హాస్యాస్పదం.

సంసారికి మించిన లంపటాలూ, పబ్లిసిటీలు వుంటే ఇంక సన్యాసి ఎలా అవుతాడు? మన భారతీయ ధర్మాన్ని దెబ్బతీసేది ఇలాంటి వారే. ఇటువంటి వైరాగ్యాన్ని ''పతన హేతువు''గా వర్ణించారు ఆది శంకరులు.

గృహస్థాశ్రమం స్వీకరించాక, భార్యాబిడ్డల్ని లోటు లేకుండా ప్రేమాభిమానాలతో పోషించడం ధర్మం. ధర్మపూర్వకంగా అర్థాన్ని సంపాదించడం, జాగ్రత్త చేయడం, కోరికలు తీర్చుకోవడం గృహస్థు బాధ్యత. కుటుంబాన్ని క్షోభ పెట్టడం ఆధ్యాత్మికతకి విరుద్ధం. పాపం కూడా. రామాయణ భారతాలలో, ఇతర ఆధ్యాత్మిక గ్రంథాలలో ఈ విషయాలే చెప్పారు.

భగవద్భక్తి, ధర్మచింతన, కర్తవ్య నిర్వహణ – వీటితో జీవితం సాగాలి. మనం పూజిస్తున్న శ్రీరాముడు, శ్రీకృష్ణుడు సన్యాసులు కారు. ఆటుపోట్లకి ధీరులై నిలిచి, ధర్మాన్ని నిలబెట్టిన గృహస్థులు. వారి ఉపదేశం ప్రకారం – ఇటువంటి బైరాగుల జోలి మనకు అక్కర్లేదు. మన ధర్మం మనకు రక్ష.

ఇవిలేని 'వైరాగ్యం' ఆధ్యాత్మికత అనిపించుకోదు. కేవలం పలాయనవాదమే. ఇది మూర్ఖత్వం, అవగాహనారాహిత్యం అనిపించుకుంటుంది. కాబట్టి మీ కుటుంబ క్షోభకి మీవారి అధర్మ వర్తనం, అజ్ఞానమే కారణం గానీ, 'ఆధ్యాత్మికత' కాదు.

నిజంగా వైరాగ్యమే కలిగితే, కోపతాపాలకి లోను కాకుండా, దురాశకీ, నిరాశకీ చోటీయకుండా, ఈర్ష్యాసూయలకు గురి కాకుండా ధర్మ నిర్వహణ చేయడం ముఖ్యం. అంతేగానీ, తనవారిని ఉపేక్షించకూడదు. సన్యాసి ధర్మాలు గృహస్థుకి పనికిరావు. 'ధర్మం' తర్వాతే 'మోక్షం'. దయచేసి – ఆ స్వామీజీల బారి నుండి మీవార్ని కాపాడుకోండి. ఆయన్ని తిరిగి కర్తవ్యపాలనవైపు మళ్లించడం ధర్మపత్నిగా మీదే బాధ్యత.

**వి.రాజకుమార్** తాడిపత్రి

ప్ర. 'లలితా సహస్రనామం' చదువుతూ కుంకుమ పూజ చేసుకోవడం మంచిదా? లేదా ప్రతి నామానికీ వెనుక 'నమః' చెప్తూ చేయడం మంచిదా?

జ. 'సహస్ర నామ స్తోత్రం' చదువుతూ కుంకుమ పూజ చేస్తే చాలు. 'నమః' చెప్తూ చెయ్యనవసరం లేదు. ప్రత్యేకించి, లలితా సహస్రనామాల కూర్పు మంత్రాత్మకంగా సిద్ధమై ఉంది. 'నామ స్తోత్రం' పఠిస్తూ అర్చించితే చాలు, ఫలప్రదమవుతుంది.

**జి.శ్రీనివాస్** మద్రాసు

ప్ర. సువర్చలాంజనేయుడు, పంచముఖాంజనేయుడు వంటి హనుమాన్ రూపాలు రామాయణంలో కనిపించవు. మరి వీటిని నమ్మవచ్చా?

జ. రామాయణంలో హనుమంతుని పరిమితి, లక్ష్యం, ప్రయోజనం వేరు. వాటికి అనుగుణమైన రూపమే ధరించాడు రామకథలో.

ఇక – సువర్చలాంజనేయుడు, పంచముఖాంజనేయుడు – వంటివి మంత్రశాస్త్ర విషయాలు. మంత్రోపాసనలో మంత్రాధిదేవతా మూర్తులవి. రామాయణ హనుమంతుని రూపాలే ఇవి. అయితే ఆ కథలో అవి ప్రకటితం కావు.

ఆయా మంత్రాన్ని ఉపాసించేటప్పుడు మంత్రోద్దిష్ట దేవతగా దైవం అవిర్భవిస్తాడు. శక్తి సహితంగా పరమాత్మను ఉపాసించే విధానంలో – ఆ పరమాత్మను హనుమంతునిగా ఉపాసించినప్పుడు, ఆయన శక్తి అయిన 'సువర్చస్సే' సువర్చలగా సాక్షాత్కరిస్తుంది.

గరుడ, వరాహ, కపి, సింహ, తురగ – వదనాలతో ఉన్న పంచ ముఖాంజనేయుడూ మంత్రమూర్తే. ఆ దివ్య మూర్తుల లక్షణాలన్నీ కలిసిన స్వామి. రుద్రాంశ సంభూతుడైన హనుమంతుడు ఇచ్ఛారూపధారణ చేయగలడని రామాయణంలోనే చెప్పారు కదా?

ఒకచోట చెప్పని విశేషం, మరొకచోట చెప్పబడుతుంది. అంతే. కాబట్టి రెండూ నిజాలే. నిరభ్యంతరంగా వీటిని నమ్మవచ్చు. పూజించవచ్చు.

**జి.కుమార్ — ధర్మవరం**

ప్ర. సీతాదేవి రావణుని కూతురనీ, రావణుడు శివపూజ చేస్తూండగా పుష్పంలోంచి పుట్టిందనీ ఒకచోట చదివాను. ఈ కథ నిజమేనా?

జ. ఇది ఎవరో కల్పించిన కథ. ఇంత అసంగతమైన కథ ఏ రామాయణంలోనూ లేదు. కేవలం 'అయోనిజ'గా జనక మహారాజుకి, భూగర్భంలో లభించిన లక్ష్మీదేవి సీత. ఇదే రామాయణంలో ప్రస్తావించిన కథ.

**పి.రామలక్ష్మి — కరీంనగర్**

ప్ర. మా ఇంట్లో అందరు దేవతల పటాలూ ఉంటాయి. చివరికి ఇతర మతాల దేవుళ్లవి కూడా. ఇది చూసి ఒకరు విమర్శించారు. మేం చేస్తున్నది తప్పా?

జ. ఇతర మతాల్ని గౌరవించడం అంటే వాళ్ల దేవుళ్లని మనం పూజించనవసరం లేదు. మన హైందవ దేవతల అందరి పటాలూ పెట్టుకోవచ్చు. కారణం – ఇవన్నీ ఒకే సంప్రదాయానికీ, ఒకే పద్ధతికీ చెందినవి. బొట్టు, కట్టు, పూజా విధానం... అన్నీ ఒకే విధానానికి సంబంధించినవి. ఇతర మతాల దేశాలూ, కాలాలూ, పరిస్థితులూ, పద్ధతులూ, సంప్రదాయాలూ వేరు. అవి మన విధానంతో కలుపుకుంటే కలవవు.

ఇతర మతాలలో ఒకటో రెండో మనకు తెలుసు. ఇంకా మనకు తెలియని సవాలక్ష మతాలున్నాయి. వాళ్ల దేవుళ్లందర్నీ తెచ్చి పెట్టుకుంటే ఇల్లే సరిపోదు.

పైగా భారతీయేతర మతాలు విగ్రహారాధనను కాదన్నవేనని గుర్తుంచుకోండి. దీనితో పోటీ పడ్డాక వాళ్ల ప్రార్థనా మందిరాలని పటాలుగా అమ్ముతున్నారు. అంతే. ఎవరి సంప్రదాయం వారు పాటిస్తే చాలు. సహజీవనం కోసం ఇతరుల్ని ద్వేషించకుండా ఉంటే చాలు. ఇందులో ఎక్కువ, తక్కువల ప్రసక్తి లేదు.

మరో విషయం – మీరు 'సామరస్యం' పేరుతో వాళ్ల పటాల్ని మీ పూజా మందిరంలో పెట్టుకున్నట్టుగా – వాళ్లు మన దేవుళ్లని పెట్టుకొని పూజిస్తారా? వాళ్లకి ఉన్న 'నిబద్ధత' మనకెందుకు లేదు? ఇప్పుడు మనకి కావలసింది మన సంప్రదాయాన్నీ, మతాన్నీ గౌరవించడం, దీనిని అర్థం చేసుకోవడం. ''స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః''.

**టి.నందకిశోర్ — పెందుర్తి**

ప్ర. లక్ష్మణుడు శ్రీరామునితో సహా వనవాసానికి వెళ్లాక, పద్నాలుగేళ్ళూ నిద్రపోయిన ఊర్మిళ ప్రశస్తి ఎక్కువగా వర్ణించలేదెందుకు?

జ. అసలు 'ఊర్మిళ నిద్ర' అనేది ఎక్కడా లేదు. జానపదాల్లో కల్పించబడ్డ ఒక ఊహ మాత్రమే. అందులో 'ప్రశస్తి' ప్రస్తావన అనవసరం. భర్త విదేశాలకు వెళితే, భార్య స్వదేశంలో ఉండడం ఇప్పటికీ ఉంది కదా!

వనవాసానికి వెళ్లేటప్పుడు గానీ, వెళ్లాక గానీ ఊర్మిళ గురించి రామాయణంలో ప్రస్తావించనే లేదు. కథా సందర్భానికి అది అనవసరం.

**వి.మురళి — ముంగండ**

ప్ర. నామస్మరణ చేస్తే చాలు కదా? ఇతర మంత్ర తంత్రాలు, ఆచారాలు, ధర్మాలు ఎందుకు? పురాణాల్లోనూ ఈ విషయమే చెప్పారు కదా?

జ. నామస్మరణ చేస్తే చాలు – ఇతర మంత్ర తంత్రాలు అనవసరం అన్నది నిజమే. కానీ ధర్మం, ఆచారం విడిచిపెట్టకూడదు. శక్తివంచన లేకుండా ధర్మాచరణ చేస్తూ, ప్రేమపూర్వకంగా నామస్మరణ చేయాలి. ఈ విషయమే పురాణాల్లో చెప్పారు. ఆచారాలను, ధర్మాలను మాత్రం విడిచిపెట్టరాదు. ధర్మాన్ని విడిచిపెడితే ఏదీ ఫలించదు.

**ఎల్.రాధాలక్ష్మి — విజయవాడ**

ప్ర: అష్టాదశ పురాణాలు క్రమంగా – మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్య, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, వరాహ, వామన, విష్ణు, వాయు, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద – అని పేర్కొన్నారు. ఇందులో శివపురాణం లేదు. అది ఎక్కడినుంచి తెచ్చారు?

జ: ఎక్కడినుండీ తేలేదు. ఈ అష్టాదశ మహాపురాణాల్లోనే 'వాయు' పురాణం ఉంది కదా! అదే 'శివపురాణం'. నైమిశారణ్యంలో మహర్షుల తపస్సులకు ఫలంగా వాయుదేవుడు సాక్షాత్కరించి, శివతత్త్వాన్నీ, శివలీలలనీ, శివకథలనీ ఉపదేశించాడు. కాబట్టి దానిని 'శివపురాణం' అన్నారు. ఇదేకాక – స్కాంద, లింగ, కూర్మ మొదలైన ఇతర పురాణాలు శివపారమ్యాన్ని బోధించాయి. ✦

**తామరపువ్వు అన్నది భారతదేశంలో సనాతనమైన దైవీసంకేతం; విచ్చుకొంటున్న దీని రేకలు, ఆత్మవికాసాన్ని సూచిస్తాయి. ఇది పుట్టేది బురదలోనే అయినా స్వచ్ఛమైన సౌందర్యంతో పెరగడం, శుభప్రదమైన ఆధ్యాత్మిక వాగ్దానాన్ని సూచిస్తుంది.**

5 ఫిబ్రవరి 2000 నుండి
4 మార్చి 2000 వరకు

# ఈనెల విశేషాలు

## శ్రీ ఎస్. రామమూర్తి శర్మ

(పుష్య బహుళ ఏకాదశి నుండి మాఘ బహుళ అమావాస్య వరకు)

### ముఖ్యదినాలు

ఫిబ్రవరి 2000

| | |
|---|---|
| 6 | మాఘమాసం ప్రారంభం |
| 10 | శ్రీ పంచమి |
| 12 | రథసప్తమి |
| 13 | భీష్మాష్టమి కుంభ సంక్రమణం |
| 15 | భీష్మ ఏకాదశి |
| 19 | మాఘపూర్ణిమ – మహామాఘి |
| | శ్రీరామకృష్ణ పరమహంస జయంతి |
| 22 | సంకష్టహర చేతుర్థి |

మార్చి 2000

| | |
|---|---|
| 4 | మహాశివరాత్రి, శని త్రయోదశి |

### ✹ 6 మాఘమాసం ప్రారంభం

పన్నెండు నెలలలో ఒక్కొక్క నెలకి ఒక్కొక్క వైశిష్ట్యం ఉంది. పురాణ వాఙ్మయంలో మాస మాహాత్మ్యాలు చెప్ప బడ్డాయి. అందులో కార్తీక, మాఘ మాసాల మహిమ ప్రసిద్ధంగా వివరింప బడింది. కార్తీకం దీపానికి ప్రాధాన్యమిస్తే, మాఘం స్నానానికి ప్రాధాన్యమిచ్చింది. మాఘమాసంలో ప్రాతః కాలం, సూర్యోదయానికి ముందు భగవత్ స్మరణతో స్నానం చేయడం పాపనాశనం. పుణ్యప్రదం. ఆయురారోగ్య వర్ధనం. ఈరోజు నుండి మాఘ అమావాస్య (మార్చి 6) వరకు మాఘ స్నానం చేయడం, ఈ నెల నాళ్లూ జప, వ్రత, స్తోత్ర, దానాదులు చేయడం శ్రేష్ఠం. ఉత్తరాయణంలో వచ్చే ఈ దివ్య మాసం దేవప్రీతికరం.

ముఖ్యంగా మాఘమాసంలో వచ్చే ఆదివారాలు మహిమాన్వితమైనవి. ఆ రోజున పాయసాన్నం (క్షీరాన్నం) వండి సూర్య భగవానునకు నివేదించి, ''ఆదిత్య హృదయం'' వంటి స్తోత్రాలతో సూర్యుని ఆరాధించడం అన్ని అరిష్టాలను, అనారోగ్యాన్ని నశింపజేస్తుంది. ఈ దివ్య దినాన మాంసాదులను, తామసాహారాన్ని వినియోగించ కూడదు. పవిత్రంగా సూర్యారాధన చేయాలి. దీని ఫలితంగా ఆయురారోగ్య ఐశ్వరాలు వృద్ధి చెందుతాయి.

### ✹ 10 శ్రీపంచమి – అసలైన సరస్వతీ పూజ

మాఘశుద్ధ పంచమిని 'శ్రీ పంచమి' అంటారు. ఉత్తరాదిలో, ఒరిస్సా, బెంగాల్ రాష్ట్రాలలో ఇంకా అనేక ప్రాంతాలలో ఈ పంచమిని విశేషంగా నిర్వహిస్తారు.

దేవీ భాగవతం, బ్రహ్మ వైవర్త పురాణం, బ్రహ్మాండ పురాణం మొదలైన వాటిలో ఈ ''శ్రీ పంచమి'' గురించి విశేషంగా చెప్పారు.

ప్రతి ఒక్కరూ ఈరోజున బ్రాహ్మీ ముహూర్తంలో లేచి, తలస్నానం చేసి, నిత్యనైమిత్తిక కర్మలు పూర్తి చేసుకొని సరస్వతీదేవిని ఆరాధించాలి. ప్రతిమలోగానీ, పుస్తక రూపంలోగానీ, పటంలో గానీ సరస్వతి ఆవాహన చేసి షోడశోపచారాలతో పూజించాలి.

చదువులకూ, బుద్ధికీ, జ్ఞానానికీ అధిష్ఠాన దేవత అయిన సరస్వతి పరమేశ్వరుని ''వాగ్బుద్ధి జ్ఞానశక్తి''. ఈ మాఘ పంచమినాడే పరమాత్మని నుండి ఆవిర్భవించింది ఈ తల్లి. కాబట్టి ఈరోజున సరస్వతీ దేవిని ప్రతి ఒక్కరూ విధిగా ఆరాధించాలి.

పుస్తక రూపంలోనూ, పటంగా, విగ్రహంగా ఉన్న సరస్వతీ రూపాన్నీ ఈరోజున షోడశోపచారాలతో పూజించి, సరస్వతీ స్తోత్రాలతో, ధ్యానంతో, గానంతో గడపాలి.

విద్యాబుద్ధులను, సర్వైశ్వర్యా లనూ ప్రసాదించే శ్రీమాత సరస్వతి. ఈమె అనుగ్రహం లేనిదే బుద్ధి, వాక్కు పని చేయవు. ఈ ప్రపంచమంతా ఈ తల్లి దయవల్లే నడుస్తోంది. బుద్ధి ప్రేరణ లేనిదే జగత్తు లేదు. ఆ బుద్ధికి అధిష్ఠాన దేవత భారతీ దేవియే - ఈ అమ్మ వల్లనే వేదాది వాఙ్మయం, లౌకిక - పార లౌకిక విద్యలు విలసిల్లాయి.

### ✹ 12 రథ సప్తమి

సూర్యభగవానుని కాంతి కిరణాలు భూమికి అధికంగా లభించడం ఈ రోజు నుండే ప్రారంభం. సూర్య గమనంలో వచ్చే మార్పు ఇది. సూర్యుడు రథంమారడంగా అభివర్ణింపబడిన తిథి ఇది.

సూర్యుని మహిమ అందరికీ అనుభవైక వేద్యమే. జగచ్చక్షువు, కర్మ సాక్షీ అయిన సూర్యుని దైవీశక్తిని ఉపాసించే విధానాలు భారతీయ ఋషులు ఆవిష్కరించారు.

ఈరోజున సూర్యునకు పాయసాన్నం నివేదన చేసి (చిక్కుడు ఆకుల్లో) ఆరగిస్తారు.

చిక్కుడు, జిల్లేడు సూర్యశక్తిని అధికంగా గ్రహించే వృక్షాల్లో కొన్ని. కనుక వాటిని ఈరోజున వినియోగిసారు.

## 15. భీష్మ ఏకాదశి

'మాఘశుద్ధ ఏకాదశి' - గొప్ప ఏకాదశీ పర్వాలలో ఒకటి. ఈ ఏకాదశికి ముందు వచ్చే అష్టమినాడు, భీష్మాచార్యులవారు కైవల్యం పొందారు. ఆ పరమ భాగవతాగ్రేసరుని స్మరిస్తూ, ఈ ఏకాదశికి భీష్ములవారి పేరుంచారు.

భీష్ముని చరిత్ర దివ్యాతిదివ్యం. ఆ మహాత్ముని వల్ల అనేక ధర్మాలు తెలుసు కున్నాడు ధర్మరాజు. విష్ణు సహస్రం, భీష్మ స్తవరాజం, అనుస్మృతి - వంటి దివ్యస్తోత్ర రత్నాలు మనకు అనుగ్రహించినది భీష్మ పితామహుడే.

ఈ ఏకాదశి రోజున విష్ణుపూజ, ఉపవాసం, విష్ణుసహస్రనామ పారాయణం విశేష ఫలప్రదం.

## 19. మాఘపూర్ణిమ

ఈరోజున స్నానం, విశేషించి సముద్ర స్నానం మహాఫలప్రదం. శివకేశవార్చనతో, దేవీ పూజతో ఈరోజున గడపడం సర్వ శుభాలను ప్రసాదిస్తుంది. దీనినే 'మహామాఘి' అని కూడా అంటారు.

ఆధ్యాత్మిక జగత్తులో ధృవతార వంటి మహాయోగి శ్రీరామకృష్ణ పరమ హంస జన్మించింది ఈరోజునే. ఆ పరమభాగవతశిఖామణి జీవితం, ఉపదేశం సర్వులకూ ఆరాధ్యం, అనుసరణీయం.

## 22. సంకష్టహరచతుర్థి

సమస్త కష్టాలను పోగొట్టే గణపతి వ్రతాన్ని ఆచరించే పర్వదినమిది.

## ✷. మార్చి 4 – మహాశివరాత్రి

మాఘబహుళ చతుర్దశి రాత్రిని 'శివరాత్రి' అంటారు. శివారాధనకు సర్వోత్కృష్టమైన రోజు ఇది. ఉదయాన్నే శివస్మరణతో లేచి, స్నానాది నిత్యకర్మలైన తరువాత శివపూజ చేసుకోవాలి. షోడశోప చారాలతో పూజించాలి. లేదా శివాలయానికి వెళ్లైనా అర్చన, అభిషేకం చేయించ డం శ్రేష్ఠం.

శివుడు 'ఆశుతోషుడు' - అంటే వెంటనే సంతోషించే దేవుడు. సులభప్రసన్నుడు.

అభిషేకప్రియుడైన ఈ స్వామిని కొబ్బరి నీరు, ఫలరసాలు, పంచామృతాలు, చెరకురసం, పాలు మొదలైన వాటితో అభిషేకిస్తారు.

నిరాకారుడూ, సర్వసాకారాలకూ మూలమైనవాడూ, ఆదిమధ్యాంత రహితుడూ, జ్యోతిః స్వరూపుడూ కనుక 'లింగ' రూపంలో శివుని ఆరాధిస్తారు.

వెయ్యి పార్థివలింగాలు చేసి అర్చించే 'సహస్ర లింగార్చన', మున్నూట అరవైపైగా లింగాలు (పార్థివం-మట్టితో చేసినవి) చేసి పూజించే 'మహాలింగార్చన', రుద్రనమకాలతో అభిషేకించే 'రుద్రాభిషేకం', ఒక రుద్రనమకం (చమకసహితంగా) తో అభిషేకించే రుద్రార్చన... ఇలా అనేక శివపూజలు వారి వారి శక్త్యనుసారం చేయవచ్చు.

స్ఫటిక, బాణలింగాలను అర్చిం చేందుకు చాలా నియమనిష్ఠలు అవసరం. అలాకాకవెండి, బంగారం వంటి వాటితో చేసిన శివలింగాలను అర్చించుకోవచ్చు. మంత్రాలు రాకపోయినా, పరవాలేదు. శివనామం చాలు. 'శివాయనమః' అనే పంచాక్షరాలు పలుకుతూ శివుని ధ్యానించి అభిషేకంచేసి, మారేడు దళాలతో, తులసిదళాలతో, జిల్లేడు, ఉమ్మెత్త, తుమ్మివంటి పూలతో పూజించితే చాలు. మనసారా స్మరించడమే మహాదేవుని అనుగ్రహానికి కారణం. విబూది ధరించి, రుద్రాక్షలు ధరించి శివార్చన చేయాలి. (రుద్రాక్షాదుల్ని శుచిగా ఉన్నప్పుడే ధరించాలి).

**మహాదేవ మహాదేవ**
**మహాదేవేతి వాదనమ్ ।**
**వత్సం గౌరివ గౌరీశో**
**ధావంతమనుధావతి ॥**

'మహాదేవ - మహాదేవ - మహాదేవ' అని పలికే వారివెంట పార్వతీసహితుడైన శివుడు నిరంతరం తోడు ఉంటాడు. పరుగెడుతున్న దూడవెంట వదలకుండా పరుగుపెట్టే గోమాతలా గౌరీశుడు ఆ భక్తుని కాచుకుంటాడు. ✧

## మహాభారత ప్రశ్నోత్తరి - 4కి జవాబులు

**46.** దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని

**47.** విదురుడు : ధృతరాష్ట్రునితో : రాయబారానికి కృష్ణుడు వస్తున్నాడని తెలిసికొని ధృతరాష్ట్రుడతనికి తగిన కానుకలిచ్చి లోబరచుకోవాలని సంకల్పిస్తాడు. 5-3-159

**48.** చండకౌశికుడు. సభా-1-143

**49.** ఇద్దరు - దేవయాని, శర్మిష్ఠ

**50.** ద్వాపరుని అంశ. ఆది 3-80

## 2వ భాగం

1. సర్వభూత దయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ వొండెఱుంగ
నొరుల నొప్పికోడ కుపతాప మొనరించు
నదియ కడు నధర్మ మనిరిబుధులు.
ఆది 3-219

అర్థము : భూతదయ, సత్యము ఈ రెండింటికి మించిన ధర్మం లేదు. ఇతరుల బాధకు వెనుకాడక హింసించడమే అధర్మం. ఇది యయాతి చెపుతాడు.

2. సూర్యుని అంశ: కుంతి కన్యగా ఉండగా సూర్యుని ఉపాసించితే కలిగినవాడు.
3. త్రిగర్త దేశానికి రాజు.
4. 3, 9 రోజులలో
5. మత్స్యగంధి: సత్యవతి. దాశరాజు కూతురు. పరాశురుడామెకు కన్యాత్వం చెడదని వరమిచ్చాడు. అందుచేతనే శంతనుడు చేసుకొన్నాడు.
6. రాజులిచ్చిన కానుకలను గ్రహించుట.
7. యమధర్మరాజు
8. రెండవ ద్యూతం: ఒక ద్యూతాన్ని అనుసరించి వచ్చిన ద్యూతం. పాండవులు రెండు జూదాలు ఆడారు. మొదటి జూదం ద్యూతం. రెండవది అనుద్యూతం.
9. ధృష్టద్యుమ్నుడు: ఇతడు ద్రుపదుని కొడుకు ద్రౌపది అన్నగారు.
10. నాలుగు:
1. ద్రుపద పురోహితుడు 2. సంజయుడు 3. కృష్ణుడు 4. ఉలూకుడు.

# ఆపవాక్యం

## స్వస్తిపంథామనుచరేమ ॥ - ఋగ్వేదం

### శుభకారమైన మార్గంలో పయనిద్దాం.

'స్వస్తి' అంటే 'శుభం' అని అర్థం.

అందరం శుభాలను కోరుకుంటాం. కానీ ఆ శుభం కావాలంటే దానిని సంపాదించే మార్గం కూడా శుభమయం కావాలి. ధర్మ మార్గమే శుభం. ఆ శుభానికి ఫలంగానే క్షేమం లభిస్తుంది. శుభమే శుభాన్నిస్తుంది.

చిత్రం ఏంటంటే - మనందరికీ ఆనం దం కావాలి. కానీ తత్సాధనమైన, 'సత్కర్మ' చేయాలని ప్రయత్నించం. మనకి 'దుఃఖం' అక్కర్లేదు. కానీ దుఃఖానికి కారణమైన దుష్కర్మని మాత్రం వదలం. మన మనుకున్నది మనకు రాదు. మనం చేసేదాని, ఫలితమే మనం పొందుతాం.

'స్వస్తిమార్గం' అంటే - మనం చేసేపని దానికి అవసరమైన పరికరాలు, వనరులు, ఆలోచనలు అన్నీ 'స్వస్తి'మయం కావాలి. అప్పుడే అది సరియైన శుభంకరమైన మార్గం అవుతుంది.

లక్ష్యమొక్కటే కాదు, మార్గం కూడా మం గళకరం కావాలి - అని వేదం ప్రభోధిస్తోంది.

మన వాంఛితాలూ, సంకల్పాలూ మం గళకరంగా ఉండాలన్నదే మానసిక విజ్ఞాన సారం. మంచి ఆలోచనల వల్ల, మంచి స్పందనలు, తద్వారా మంచి ప్రేరణలు, మంచి ఆచర ణలు కలుగుతాయి. ఇదో చక్రనేమిక్రమం.

కాబట్టి వేదం శుభాన్ని సంకల్పించు కోవడం, శుభాన్ని ఆశిస్తూ దైవీశక్తులను ఉపాసించడం.. వంటి శుభాకాంక్షలన్నింటినో పలికింది.

జీవితపరమ లక్ష్యం - 'పరమశుభం'. దానినే 'శివం' అంటారు. అదే పరమ (Ultimate) స్వస్తి. అందువల్లనే ''స్వస్తి'' అనే దాన్ని భగవన్నామంగా పేర్కొన్నారు (విష్ణుసహస్ర నామం). ఆ అఖండమైన 'స్వస్తి'ని సాధించ డానికి, అవసరమైన జీవన విధానమే 'స్వస్తి పంథా'

ఏలక్ష్యానికి ఏబాట వేసి ఉందో, దానిని ఆశ్రయించినప్పుడే ఆ లక్ష్యాన్ని చేరుకోగలం. కాబట్టి ఆ 'పరమస్వస్తి'కి వేసిన 1. జ్ఞానమార్గం, 2. భక్తిమార్గం 3. కర్మమార్గం, 4. యోగమార్గం... ఇవే స్వస్తిపథాలు. వీటిని వదలరాదు. ఈ నాలుగూ వేటికవి విభిన్నమూ కావు, విరోధమూ కావు. పరస్పర పరి పూరకాలు.

వేద విహిత కర్మా చరణను జ్ఞాన, భక్తి, యోగనిష్ఠలతో ఆచరించడమే స్వస్తి పథం.

'దారితప్పకపోవడ'మంటే ఇదే.

'స్వస్తి'తో అనుసంధానించిన పథంలో మనం మాత్రమే ప్రయాణించడం సరిపోదు. మన ఆచరణతో మరి కొంతమందికి స్ఫూర్తి కలిగించి, కలిసి ప్రయాణించి ఆ పరమలక్ష్యాన్ని అందుకోవాలి. ఈ ''కలిసి'' అనే స్ఫూర్తి వైదిక సంస్కృతిలో స్ఫుటంగా లభిస్తుంది.

గొప్ప విషయాన్ని పదిమందితో పంచు కోవడం మన గొప్పతనాన్ని చాటుకోవడానికి కాదు. దానితో అనేకమందిని అనుసంధానింప జేయడమనేది ఒక లోకహితం.

తనతో పాటూ తన చుట్టూ ఉన్నవారికి కూడా స్వస్తి కలగాలని కోరుకోవడం ముఖ్యం. మనకి శుభం, మరొకరి 'అశుభం'వల్ల రాకూ డదు. ఒకరి దుఃఖం వల్ల మనం ఆనందించ కూడదు. అలా ఆనందించడం, క్రమంగా దుఃఖంగానే పరిణమిస్తుంది.

స్వస్తినీ, శాంతినీ ఆశించిన భారతీయ సంస్కృతే 'స్వస్తిపంథా.' ఆ పథానికి సదా స్వస్తియగుగాక! ✦

# MEMBERSHIP FORM

*Please fill in capital letters and mail to...*

**RUSHI PEETHAM PUBLICATIONS**

'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be a member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) ☐ 3 Years Rs 360/- (US $90) ☐

5 Years Rs 600/- (US $125) ☐ Donations Rs ..........................

Iam paying by cheque/D.D.No..............................................drawn on
...................................................................for Rs...........................
date...............Favouring Rushi Peetham Publications.

Name : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

Sex : Male ☐ Female ☐ Age ☐

Address : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐
☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐
☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

City : ☐☐☐☐☐☐☐☐☐☐☐ Pin : ☐☐☐☐☐☐

Education : School ☐ College ☐ Graduate/Post Graduate ☐
Business ☐ Employed ☐ Retired ☐

P.T.O.

Please mention Addresses or E-mail of your Nearest & Dearest who have interest in Rushi Peetham, Bharatheeya Manasa Patrika

1. ..............................................................................................

..............................................................................................

2. ..............................................................................................

..............................................................................................

3. ..............................................................................................

..............................................................................................

4. ..............................................................................................

..............................................................................................

5. ..............................................................................................

..............................................................................................

6. ..............................................................................................

..............................................................................................

7. ..............................................................................................

..............................................................................................

8. ..............................................................................................

..............................................................................................

9. ..............................................................................................

..............................................................................................

10..............................................................................................

..............................................................................................

11..............................................................................................

..............................................................................................

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

Owned & Published by : **UPADRASTA SIVAPRASAD** From From : No.3, Kamarajasalai, Ashok Nagar, Chennai - 600 083.
Printed By : **V.C. Chermakani, Sakthi Process**, No. 21F Kumballamman Koil St., Chennai - 600 081. Edited by : **SAMAVEDAM SHANMUKHA SARMA**

# ‘ఋషిపీఠం’ సంస్కృతి సంఘం
## నిర్వహణకు ఆహ్వానం

ఆర్ష (ఋషి) విద్యావ్యాప్తికి మాస పత్రిక నిర్వహణతోపాటూ, ఇతర ప్రచురణలు, ఆడియోలు వెలువరించడమే కాక – ఊరూరా సనాతన సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని వివిధ కార్యక్రమాల ద్వారా తెలియజేయాలని ఈ సంస్కృతి సంఘం సంకల్పం.

మన సనాతన భారతీయ ధర్మానికి వారసులైన, చిత్తశుద్ధి కలిగిన, ఆసక్తిపరులు తమ వివరాలను, పూర్తి చిరునామాను తెలియజేస్తూ ‘ఋషిపీఠం’కి వ్రాయండి. వారిలో ఎంపిక చేసిన వారిని ఆ ప్రాంతానికి ‘‘ఋషిపీఠం సంస్కృతి సంఘ ప్రతినిధి’’గా గౌరవించి, సంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ బాధ్యతను ‘‘ఋషిపీఠం’’ – అప్పగిస్తుంది.

ఆ సంఘంలో సభ్యులను చేర్పించడం ‘ఋషిపీఠం’ లక్ష్యాలను చిత్తశుద్ధిగా, బాధ్యతాయుతంగా వ్యాప్తి చేయడం, కార్యక్రమ నివేదికలను క్రమం తప్పకుండా మాకు పంపడం ప్రతినిధికి తప్పనిసరి బాధ్యత.

ఈ సంస్కృతి సంఘ అభ్యున్నతికి వలసిన సహాయాన్ని అందజేసేవారు ఆ ప్రతినిధికిగానీ, ‘ఋషిపీఠం’కి నేరుగా గానీ విషయం తెలియజేయవచ్చు. ఋషిసంస్కృతిపట్ల నిష్ఠ, ధర్మదృష్టి, చిత్తశుద్ధి – ఇవే ఈ సంస్కృతి సంఘం ప్రాతినిధ్యానికి కనీసార్హతలు.

ఉత్సాహవంతులైన వారు ‘‘ఋషిపీఠం – భారతీయ మానస పత్రిక ’’ చిరునామాకు వివరాలతో సహా ఉత్తరం వ్రాయండి.

– సంపాదకుడు

భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః
స్థి రైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః
వ్యశేమ దేవహితంయదాయుః

"ఓ దేవతలారా, శుభములైన విషయాలనే మా చెవులలో వినుచుందుము గాక! మంగళ ప్రదమైన దృశ్యాలనే మా కనులతో చూచెదము గాక! ఓ ఆరాధ్యులారా! స్థిరమైన అవయవాలతో, నిశ్చలమైన శరీరంతో స్తుతిస్తూ, అనుగ్రహింప బడిన జీవిత కాలాన్ని ఆనందించెదము గాక!"

పాఠక మహాశయులకు, ఏజంట్లకు, ప్రకటనకర్తలకు విక్రమనామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలు.

– ఋషిపీఠం



# నమస్సు

సంపత్కరాణి సకలేంద్రియ నందనాని
సామ్రాజ్య దాన నిరతాని సరోరుహాక్షి ।
త్వద్వందనాని దురితోద్ధరణోద్యతాని
మామేవ మాతరనిశం కలయంతు నాన్యే ॥

''పద్మాలవంటి కన్నులు గల మహాలక్ష్మీ! నీకు నమస్కరించడం మహత్కార్యం. ఆ నమస్కారాలే నాకు కలిగేలా అనుగ్రహించు. (అంటే నిన్ను నమస్కరించడం అనే భాగ్యాన్ని నాకు ప్రసాదిస్తే చాలు... అని అర్థం). ఈ నమస్కారాలు... సంపదలను కలుగజేస్తాయి. సకలేంద్రియాలకూ ఆనందాన్ని కలిగిస్తాయి. సామ్రాజ్యాదులను ప్రసాదిస్తాయి. దురితాల నుండి ఉద్ధరిస్తాయి. కాబట్టి ఇవి (నమస్కారాలు) తప్ప మరేమీ అక్కర్లేదు.''

ఈ ప్రార్థన ఆదిశంకరాచార్యులవారి ''కనకధారా స్తోత్రం'' లోనిది. ఎనిమిదేళ్ల వటువుగా ఆదిశంకరులు ఒక గృహిణి ఇంటి ముంగిటికి వచ్చినప్పుడు, ఆ పేదరాలు ఆదరంతో తన దగ్గరనున్న ఒకే ఒక్క ఉసిరికాయని భిక్షగా వేసింది. అది చూసి, శంకరులు కరుణాంతరంగంతో అమ్మవారిని ప్రార్థించారు. ఏ పాప కారణంగా దారిద్ర్యాది బాధల్ని అనుభవిస్తున్నామో, ఆ పాప కారణాలను నశింపజేసే దేవీస్తుతితో తక్షణం కనకవర్షం కురిసి, ఆమె దారిద్ర్యం నశించింది.

మంత్ర రహస్య గర్భితమైన ఆ మహాస్తోత్రంలోని ఒక ముత్యమిది.

మనం భగవంతునికి నమస్కరిస్తే చాలు. కావలసినవి ఇవ్వగలిగే శక్తి నమస్కారానికి ఉంది. మనస్సును భగవదర్పణం చేయడమే నమస్కారం. కోరుకున్నవి కావాలని ప్రార్థించనక్కర్లేదు. కావాల్సినవి ప్రసాదించేదే నమస్కారం కనుక – ఆ నమస్కారం వల్లనే, సంపదలూ, చైతన్యాలూ, పుణ్యాలూ లభిస్తాయనీ ఆ ''నమస్కార సంపద''నే ఆశించారు ఆదిగురువులు. *(ఈ సంచిక ముఖచిత్రం ఈ ఇతివృత్తమే)*

ఋషిపీఠం

మార్చి 20|00

# ఋషిపీఠం

భారతీయ మానసపత్రిక

మార్చి 2000

సంపుటి 1 సంచిక 8

సంపాదకుడు : సామవేదం షణ్ముఖశర్మ

ప్రచురణకర్త ఉపద్రష్ట శివప్రసాద్



గౌరవ పర్యవేక్షణ :
డా. ప్రసాదరాయకులపతి
డా. పినపాటి వీరభద్ర మహదేవ్
డా. పప్పు వేణుగోపాలరావు
సాంగస్వాధ్యాయ వాచస్పతి శ్రీ దెందుకూరి మల్లికార్జునసోమయాజి
శ్రీ యాబలూరు లోకనాథశర్మ
మహా మహోపాసక శ్రీ చెన్నూరు కృష్ణమూర్తి సిద్ధాంతి (అద్దంకి)

సంచాలకులు : సూరి శ్రీవిలాస్
ప్రధాన ప్రచారకులు : ఎస్. వి. ఎస్. లక్ష్మీనారాయణ (గుంటూరు).



చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై-600 017. ఫోన్: 8281159

# కలిపురుషుని పరమావతారాలు

సత్క్రమమైన బుద్ధి, మంచి ఆలోచన, మంచి భావన... వీటికే ప్రాధాన్యమిచ్చిన సంస్కృతి మనది. ఆ తరువాతే భౌతిక సుఖ జీవనం. **ధియో యో నః ప్రచోదయాత్...** ''భగవత్ శక్తి మన బుద్ధిని ప్రేరేపించు గాక!'' అని ధ్యానించడం మన సంప్రదాయం. **''సనో బుద్ధ్యా శుభయా సంయునక్తు...''** ఆ సర్వేశ్వరుడు శుభమైన దానితో మన బుద్ధిని సంయోగింపజేయుగాక... అని ఉపనిషత్ప్రార్థన.

బుద్ధి శక్తులు జాగృతమై లౌకిక విజ్ఞానాన్ని సముపార్జించి, అంతరమైన ఆత్మజ్ఞానాన్ని సాధించి... ''శ్రేయస్సు'' పరమావధిగా నిత్య చైతన్యంతో మానవ జీవితం సాగాలని ఆర్ష మత విధానం.

అయితే ఆ బుద్ధికున్న సహజశక్తిని కోల్పోయే విధంగా మన జీవితాలు సాగుతున్నాయి ఇప్పుడు.

ముఖ్యంగా.... మన పూర్వులు చెప్పిన సప్తవ్యసనాల కన్నా ప్రమాదకరమైన వ్యసనానికి ప్రతి ఇల్లూ లోనవుతోంది. అదే టీవీ వీక్షణం. మిగిలిన వ్యసనాలు కుటుంబంలోని ఏ ఒక్కరికో ప్రమాదమైతే, ఈ వ్యసనం మాత్రం ఇంటిల్లిపాదినీ ఆక్రమించుకుంది. ఇది ఒక భయంకరమైన పరిణామం.

అందులోనూ - మనవాళ్ళంతా ''వినోద సాధనాలు''గానే టీవీ ఛానల్స్‌ని ఎంచుకుంటారు. మేధో వికసనానికి ఉపయోగించే విషయాల జోలికిపోరు. మానవ స్వభావం ఎప్పుడూ సద్యోవినోదం (Instant Entertainment) వైపే మొగ్గుతుంది. మంచి అభిరుచిగలవాళ్లు కూడా, సహజంగానే మానవ స్వభావరీత్యా వినోదంవైపే మొగ్గుచూపుతారు. కాబట్టే- ఆలోచనను ప్రేరేపింపజేసే విజ్ఞాన కార్యక్రమాల ఛానల్స్ ఒకటో రెండో ఉన్నా వాటివైపు ఆసక్తిపోదు.

ఇప్పుడు జీవితాన్ని రెండు భాగాలుగా చూస్తే - సగం కుక్షింభరత్వం కోసం; ధన సముపార్జన కోసం ! మిగిలిన సగం వినోదం కోసం... పిల్లలూ, గృహిణులూ కూడా ఎక్కువగా ఈ వ్యసనానికి బానిసలవుతున్నారు.

టీవీ వీక్షణంలో నిమగ్నమైపోయి, ఎవరైనా అతిథులు ఇంటికొచ్చినా ఆప్యాయంగా పలకరించడమో, మర్యాదగా మాట్లాడడమో కూడా చేయలేని అసహాయతకి లోనవుతున్నారు.

'వినోదం' అనేది ఒత్తిడి నుండి ఒక 'ఉపశమనం' మాత్రమే. ఆ ఉపశమనమే జీవితమైపోతే, ఇంక అంతా శమనమే. ఇప్పటి వినోదాలు కూడా మానవ బలహీనతల్ని ప్రకోపింపజేసే విధంగా ఉంటున్నాయని అందరికీ తెలిసిన విషయమే. మరోవైపు ఈ శక్తిమంతమైన మాధ్యమం ద్వారా మనలోని ఆధ్యాత్మిక జిజ్ఞాసని కూడా సొమ్ముచేసుకోవాలనే ఉద్దేశంలో పురాణాలజోలికి వెళ్లడం మరో అవాంఛనీయ పరిణామం.

నిజమాలోచిస్తే- ఇప్పుడు పౌరాణిక ధారావాహికలుగా వస్తున్న వాటిలో చాలా భాగం చెత్తే. పురాణగాథల్ని యథార్థంగా అవగాహన చేసి తీయలేక, కొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని అడ్డదిడ్డంగా ఉపయోగిస్తూ, పేలవమైన కల్పనలు సమకూర్చి, వ్యాపార కారణాలరీత్యా-వాటిని సాగదీస్తూ - పురాణవాఙ్మయం మీద గౌరవం లేకుండా చేస్తున్నారు. ''ఇంత అవకతవకలుగా ఉన్నాయా మన పురాణాలు!'' అని తెలివైనవాళ్ళు అసహ్యించుకొనే ధోరణిలోనే దేవతల కథలు మలచుతున్నారు. ఆలోచనని

ఉపయోగించి, చిత్తశుద్ధితో, నేటి తరానికి అన్వ యించి అర్థవంతంగా వాటిని అందించాల్సిన కనీస బాధ్యతని విస్మరిస్తున్నారు.

వినోదాన్ని మనం ఏనాడూ నిరసించలేదు. ఈ దేశంలో ఒకనాడు, సందె వాలితే ప్రతివారికీ వినోద కాలక్షేపమే. పురాణ కాలక్షేపం, హరికథలు, వీధి నాటకాలు, బుఱ్ఱకథలు, యక్షగానాలు... ఇలా అన్ని వర్గాలవారూ ఎవరికి వీలైనవిధంగా వారు ఆ తరంలో వినోదాన్ని సాధించుకున్నారు. అందులోనే మనల్ని మనం తరచి చూసుకొనే ఆలోచనని రేకెత్తించేలా వాటిని రూపొందించారు. ఆయాకాలాల మానవ స్వభావాల పరిణామాలను బట్టి, వాటిని వ్యాఖ్యానిస్తూ వచ్చారు.

''**క్రీడా చ మే, మోదశ్చమే**'' – అని వేదం పలికింది. ఆటలూ, సరదాలూ మానవులకు కావాలనే వాంఛించింది. అయితే అవన్నీ బుద్ధిశక్తిని పెంచేవిధంగా ఉండాలని మాత్రం అభిలషించింది.

పుస్తకపఠనం, ఉత్తమ సంగీత సాహిత్యాది కాలక్షేపం, ప్రపంచాన్ని పరిశీలించడం, చింతన.... ఇవన్నీ క్రమంగా తగ్గిపోతున్నాయి. మెదడుకి వ్యాయామం లేదు. ''అమిత తేలిక'' గా అన్నీ అర్థమైపోయి, వెంటనే వినోదించేయాలనే ఉబలాటమే ఒక గొప్ప సంస్కృతి నుండి మనల్ని దూరం చేస్తోంది.

అనేకమంది మేధావులు, విజ్ఞానవేత్తలు మరోవైపు హెచ్చరిస్తున్నారు కూడా. అత్యధికకాలం టీవీని చూడడంవల్ల దృష్టిశక్తి దెబ్బతినడమేకాక, మెదడుకి ఉన్న ఆలోచనాశక్తినీ, భావనాశక్తినీ కూడా కోల్పోతామని, వైజ్ఞానిక కారణాలను విశ్లేషించి వివరిస్తూ శాస్త్రవేత్తలు ఘోషిస్తున్నారు.

యోగం, ధ్యానం వంటి వాటితో అంతర్వీక్షణం, బుద్ధిశక్తుల్ని జాగృతం చేసుకొనే అనేక సాధనలు మనకున్నాయి. నిరంతరం మెదడుని పదును పెట్టుకొని, అలసతకి అవకాశం లేకుండా జీవితాన్ని చైతన్యవంతం, సార్థకం చేసుకోవడం ఇక్కడి సంస్కృతి. కానీ ఈ టీవీ విష సంస్కృతివల్ల శరీరం వ్యాయామానికి దూరమై, మెదడూ మొద్దుబారి మనం ఎటుపోతామో... అంతా అగమ్య గోచరం!

అయినా మనం మేల్కొనడం కష్టం. మద్యపానాది వ్యసనాలకు బానిసై పోయేవాడ్ని, మానమని చెప్పినా మానలేని విధమే దీనికీవర్తిస్తుంది.

విదేశాల్లో ఇప్పటికే వాటి విషప్రభావాలు గోచరిస్తున్నాయి. మనకన్నా ముందే వాళ్ళు అనుభవపూర్వకంగా గమనించారు. కానీ మనం అది గ్రహించం. మన సత్కాలక్షేపాలు ఏనాడో పోయాయి. మనంతట మనం వాటిని చదివో, వినో, గ్రహించే ఆసక్తులూ నశించాయి. మనం ప్రశ్నించుకోం. ఆలోచించం. అర్థం చేసుకోం.

ఒక మహా కంప్యూటర్ వ్యవస్థని మించిన బుద్ధిశక్తిని కేవలం అయిదుశాతం మాత్రమే వినియోగిస్తున్నామని వైజ్ఞానికులు తేల్చి చెబితే, ఆ మాత్రం శాతం కూడా ఉపయోగించకుండా, ఒక చిన్న ''వినోదాలపెట్టె'' సాధనమవుతోంది. దీనికితోడు 'ఇంటర్‌నెట్' వ్యవస్థ కూడా జతపడింది. కలిపురుషుడి పరమావతారాలివి.

విజ్ఞానం సాధించిన ఆవిష్కరణల్ని అభినందించాల్సిందే. వాటి ప్రయోజనాలనీ అంగీకరించాలి. కానీ పరిమితుల్ని గ్రహించాలి.

జీవితం ఆనందించడానికే. అది ఉత్తమ ఆలోచన ద్వారా, ఉత్తమమైన అలవాట్ల ద్వారా, ఉత్తమ సంస్కారాల ద్వారా లభించాలి. ఆ ఆనందం సత్య సాక్షాత్కారంలో, ఆత్మా విష్కరణతో విలీనమవ్వాలి. ఆ విధమైన ప్రేరణ మనకు కలిగేలా భగవత్‌శక్తి మనల్ని అనుగ్రహించాలని ప్రార్థిద్దాం.





# ఇంద్రశక్తిని చాటిన "గృత్సమదమహర్షి"

భృగువంశజుడు, ఆంగిరస గోత్రోద్భవుడైన 'శునహోత్రుడు' అనే మహర్షి కుమారుడు "శౌనహోత్రుడు". ఇంద్రకృపచే జనించిన ఈ మహర్షికి మరో పేరు "గృత్సమదుడు".

వైదిక మహర్షి శ్రేష్ఠులలో గణనీయుడైన ఈ "గృత్సమద" మహర్షి వృత్తాంతం ఋగ్వేదం, అథర్వవేదం, ఐతరేయ బ్రాహ్మణం, శతపథ బ్రాహ్మణం-వంటి వైదిక వాఙ్మయంలోనూ, గణేశపురాణం, బృహద్దేవతా, మహాభారతం వంటి పౌరాణిక ఐతిహాసిక వాఙ్మయంలోనూ లభ్యమౌతోంది.

"గృత్స" అంటే "ప్రాణవాయువు", "మద" అంటే అపాన వాయువు, ప్రాణాపాన వాయువుల సమన్వయంతో మహత్తమ యోగశక్తిని సాధించినందుకు ఈ మహర్షికి "గృత్సమదుడు" అని పేరు.

తపశ్శక్తిలోనూ, మంత్రశక్తిలోనూ మహోన్నతుడైన ఈ గృత్సమదుడు, ఒకసారి ఒక మహాయజ్ఞాన్ని నిర్వహించాడు.

ఈ మహర్షి ఔన్నత్యం తెలిసిన మహేంద్రుడు, ఆదరంతో తనకుతానుగా ఆ యజ్ఞానికి వచ్చి ఆసీనుడయ్యాడు.

చిరకాలంగా దేవశత్రువులైన రాక్షసులలో ధుని, చుమురి అనే మహారాక్షసులిరువురు ఇంద్రుని దెబ్బతీసేందుకు ఎదురు చూస్తున్నారు. తన స్వాస్థానం వీడి, ఒక మహర్షి ఆశ్రమానికి వెళ్లిన ఇంద్రుని సులభంగా ఓడించి, హరింపజేయవచ్చని భావించి, ఆ ఇద్దరు రాక్షసులు యజ్ఞవాటిక వద్దకు రాసాగారు.

ఈ విషయాన్ని గృత్సమదమహర్షి గమనించాడు. తన తపోబలంచేత ఇంద్రరూపాన్ని ధరించాడు. తన స్థానంలో తాను కూర్చొని యజ్ఞం చేస్తూనే, మరో రూపంలో ఇంద్రునిగా మారి, ఆ రాక్షసులకు కనబడ్డాడు. వారు చూస్తూండగా అంతరిక్షంవైపు సాగి అంతర్ధానమయ్యాడు.

అది గమనించిన ధుని, చుమురి రాక్షసులు అతడిని ఇంద్రుడనే భ్రమించి తాము కూడా అంతరిక్షంలోకి ప్రయాణించారు.

తమ స్థలానికి వచ్చిన వారు ఎంతటి మహాత్ములైనా, శక్తిమంతులైనా వారికి ఏ విధమైనా ఇబ్బందీ రాకుండా, వారి మర్యాదను కాపాడవలసిన బాధ్యత ఆ గృహస్థుదే. అందుకే గృత్సమదుడు ఈవిధంగా ప్రవర్తించాడు. అలా అంతరిక్షంలోకి వెళ్లి, అక్కడినుండి ద్యులోకాన్ని చేరాడు - ఇంద్రరూపధారియైన గృత్సమదుడు.

వెంటాడుతూ వెళ్లిన -రాక్షసులిరువురూ అక్కడ గృత్సమదుని సంహరించేందుకు ఉద్యుక్తులయ్యారు. అప్పుడు తాను ఇంద్రుడ్ని కానని చెప్పాడు మహర్షి. అది నమ్మని రాక్షసులకు ఇంద్రుని తత్వాన్నీ మహిమనీ వివరించి ఇంద్రుని కీర్తించాడు గృత్సమదుడు.

ఆ దనుజులముందు ఇంద్రదేవుని వీరత్వం, శౌర్యం, ప్రభుత్వం ప్రశసింప బడ్డాయి. దానితో ఆ రాక్షసుల మనోబలం కోల్పోయారు. అదే సమయంలో ఇంద్రుడు ఆ చోటు చేరి, ఆ రాక్షసుల్ని వధించాడు.

అంతేగాక గృత్సమదుడు తనపై చూపించిన భక్తి ప్రపత్తులకూ, తపోబలానికీ సంతుష్టుడై అక్షయ తపస్సిద్ధినీ, వాక్సిద్ధినీ, అద్భుత పరాక్రమాన్ని, మంత్రశక్తినీ వరాలుగా అనుగ్రహించాడు. తన స్నేహాన్ని కూడా ప్రసాదించి, తనతో పాటు ఇంద్రలోకానికి తీసుకువెళ్ళి ఉచిత రీతిని పూజించి గౌరవించాడు.

ఇంద్రవైభవాన్నీ, మహిమనీ గృత్సమదుడు కీర్తించిన మంత్రభాగం ఋగ్వేదంలోని ద్వితీయమండలంలో 14వ సూక్తంతో లభిస్తోంది. దీనిని "సజనీయ సూక్తం" అంటారు, సూక్తంలోని మంత్రాలన్నింటి చివరి పాదాలలో "సజనాస ఇంద్రః" అనే పదం ఉండడంచేత ఈ మంత్రాలకు ఆ పేరొచ్చింది. ఈ సూక్తంలో 15 మంత్రాలు చెప్పబడ్డాయి.

**యో జాత ఏవ ప్రథమో మనస్వాన్**
**దేవో దేవాన్ క్రతునా పర్యభూషత్ ।**
**యస్య శుష్మాద్ రోదసీ అభ్యసేతాం**
**నృమ్ణస్య మహ్నా సజనాస ఇంద్రః ॥**

– ఆ సూక్తలోని మొదటి మంత్రమిది.

"ఓ రాక్షసులారా! దేవతలందరిలోనూ ప్రధానుడూ, శ్రేష్ఠుడూ, మనస్వులలో అగ్రగణ్యుడు ఇంద్రుడు. తన ప్రకాశంచేత వృత్రాసురాది రాక్షసుల్ని సంహరించి సమస్త దేవతలనూ రక్షించిన ఇంద్రుడు, సర్వ దేవతలలోనూ ప్రముఖుడు. ఆ ఇంద్రుని బల, వీర్య, పరా

క్రమాల ద్వారా ఈ జల, భూవ్యాదులు శక్తిమంతమౌతున్నాయి.'' - అని దీని భావం.

'మహా భారతం' అనుశాసనపర్వంలో గృత్సమదుని చరిత్రలోని మరికొన్ని విషయాలు లభ్యమౌతున్నాయి.

కాశీ రాజైన 'ప్రతర్దనుడు' (హైహయ రాజ వంశజుడు) ఒకసారి కొన్ని కారణాలవల్ల భీతుడై భృగుమహర్షి ఆశ్రమాన చేరాడు. క్షత్రియుడు తన ఆశ్రమాన ఉండలేడని భృగమహర్షి పలికాడు. ఆ మహర్షి వచనంచేత ప్రతర్దనుడు తిరిగి, భృగువంశజుడై గృత్స మదుడిగా జన్మించాడని భారత కథ.

గణేశ పురాణాన్ని అనుసరించి, గృత్స మదుడు మహాగణపతి భక్తుడు. అపూర్వ తప శ్శక్తితో గణపతి అనుగ్రహాన్ని సంపాదించాడు.

ఋగ్వేదంలోని ద్వితీయమండలంలో 43 సూక్తాలు ''గృత్సమద మండలం''గా ప్రసిద్ధి చెందాయి. ఈ సూక్తాలలో ఇంద్ర, అగ్ని, ఆదిత్య, మిత్రావరుణ, వరుణ, విశ్వేదేవ, మరుత్- మొదలైన దేవతలు స్తుతింపబడ్డారు. రాకా, సినీవాలీ వంటి దేవతల గురించి కూడా చెప్పబడింది.

బ్రహ్మణస్పతి రూపునిగా గణపతిని తెలియజేసే మంత్రం-

**గణానాం త్వా గణపతిగ్ం హవామహే**
**కవిం కవీనా ముపమశ్రవస్తమమ్ ।**
**జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత**
**ఆనః శ్రుణ్వన్ ఊతిభిః సీద సాదనమ్ ॥**

- ఈ మండలంలోనిదే.

ఈ విధంగా మహిమాన్వితుడైన ''గృత్స మద మహర్షి'' వృత్తాంతం వేద పురాణాదులో ప్రస్తావించబడింది.

(శ్రీ వసంతవల్లభ భటే రచన ఆధారంగా)



# FORM - IV


| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publicaton | : | Chennai |
| 2. | Periodicity of the Publication | : | Monthly |
| 3. | Publisher's Name | : | Upadrasta Siva Prasad |
| | Address | : | No. 6, Balasubrahmanyam St., Sivalingapuram, K.K. Nagar, Chennai - 600 078. |
| 4. | Editor's Name | : | Samavedam Shanmukha Sarma |
| | Whether Citizen of India | : | Yes |
| | Address | : | 83-A, Sumukha Appartments Venkatesa Nagar 2nd St., Virugambakkam, Chennai - 600 092. |
| 5. | Printed By | : | V.C. Chermakani Shakthi Proces, Chennai - 600 081. |
| 6. | Name & Address of the Individuals Who own the News Paper | : | Upadrasta Siva Prasad No. 6, Balasubrahmanyam St., Sivalingapuram, K.K. Nagar, Chennai - 600 078. |

I, Upadrasta Siva Prasad, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: 1st March, 2000

Sd/- Upadrasta Siva Prasad
Signature of the Publisher

# ఉద్యోగం పురుషలక్షణం

> ''కత్తెరలో రెండు పదునైన భాగాలుంటాయి. ఒక వస్తువుని కత్తిరించడం ఆ రెండింటిలో ఏ ఒక్కదాని వల్లో జరగదు. రెండూ కలిస్తేనే కత్తిరింపు జరుగుతుంది. అదేవిధంగా పురుష ప్రయత్నం, ఈశ్వర సంకల్పం కలిసే కర్మసిద్ధి.''

ఈ మాట మనం చాలాకాలం నుండీ వింటున్నాం, అంటున్నాం. అయితే వేరే అర్థంలో దీనిని వినియోగిస్తున్నాం. ''ఉద్యోగం (Job) చేయడం మగాడి లక్షణం'' అనే అర్థం చెప్పుకుంటున్నాం.

కాని ఈ ఆర్యోక్తికి అర్థం అదికాదు, 'నౌఖరీ' అనేదానికి మన తెలుగువాళ్ళు 'ఉద్యోగం' అని అంటారు. మిగిలిన భాషల్లో 'ఉద్యోగం' అనే మాటని ఈ అర్థంలో వాడడం లేదు, ఇది తెలుగుమాట కాదు, సంస్కృత వాక్యం, ఇప్పుడు మనం అనుకుంటున్న ఈ 'ఉద్యోగాలు' అనేవి పుట్టక ముందు పుట్టిన వాక్యం.

కానీ బట్టతలకీ, మోకాలికీ ముడిపెట్టే లక్షణంతో దీని అర్థాన్నీ, పరమార్థాన్నీ తెలుసుకోలేకపోతున్నాం.

వైదిక పరిభాషలో – 'పురుషుడు' అనే పదం మగవాడికి మాత్రమే వర్తించదు. స్త్రీ పురుషులందరికీ వర్తిస్తుంది. ''పురే/శయనం కరోతి ఇతి–పురుషః'' – పురమందు ఉన్నవాడు – పురుషుడు. 'నవ ద్వారే పురే' – అని నిర్వచనం. తొమ్మిది ద్వారాల పురం ఈ దేహం. దీనిలోవున్న దేహి – జీవుడు, అతడే పురుషుడు.

శరీరంలో ఉన్న జీవచైతన్యానికి – 'ప్రయత్నం చేయడం' అనేది లక్షణం. ఉద్యోగం – అంటే 'ప్రయత్నం'. ''ప్రయత్నించడం మానవ లక్షణం'' – అని ఈ వాక్య భావం. దైవ సంకల్పంగా సర్వం జరుగుతున్నా, పురుష ప్రయత్నం ఆగదు. ప్రయత్నించడం చైతన్యానికి సహజం అనే విషయాన్ని చెప్పేటప్పుడు ఈ వాక్యాన్ని వాడారు.

'మహాభారతం' లోని ''ఉద్యోగపర్వం'' అనే పేరును కూడా ఇక్కడ గుర్తుంచుకోవాలి. యుద్ధ/ లేదా సంధి ప్రయత్నాలకి సంబంధించిన విషయంగా ఆ పర్వానికి ఆ పేరు పెట్టారు.

పురుష ప్రయత్నానికి చాలా ప్రాముఖ్య ముంది. రామకృష్ణపరమహంస చెప్పినట్లు – ''కత్తెరలో రెండు పదునైన భాగాలుంటాయి. ఒక వస్తువుని కత్తిరించడం ఆ రెండింటిలో ఏ ఒక్కదానివల్లో జరగదు. రెండూ కలిస్తేనే కత్తిరింపు జరుగుతుంది. అదేవిధంగా పురుష ప్రయత్నం, ఈశ్వర సంకల్పం కలిసే కర్మసిద్ధి.''

చిత్తం ఆ పరమ సత్యంవైపున ప్రయత్నం చేయాలని మనవారి బోధ. ''ఉద్యోగినం పురుష సింహ ముపైతి లక్ష్మీః'' – ప్రయత్నశీలుడైన, ఉత్తముడైన మానవునికి లక్ష్మి (ఐశ్వర్యం) లభిస్తుంది. ప్రయత్నశూన్యుడై, అలసత, సోమరితనం అవలంబించకూడదన్నదే మన సిద్ధాంతం. దేవుడిమీద భారంవేసి కూర్చోమని చెప్పలేదు. దేవుడిపై భారంవేసి, ప్రయత్నం సాగించమని ప్రబోధించారు.

''కదలడం మొదలుపెడితే చీమైనా గమ్యం చేరుతుంది, అడుగువేయకపోతే గరుత్మంతుడైనా వెనకబడతాడు''... అనీ, ''నోరు తెరిచి, పడుకున్న సింహంనోటిలోకి జంతువులు తమంతతాము చేరవు. కదిలి వేటాడి శ్రమించాలి''... అని అనేక సంస్కృత సుభాషితాలు మానవప్రయత్నాన్ని ప్రేరేపించే విధంగా చెప్పబడ్డాయి.

ప్రయత్నించి పరమేశ్వరునిసైతం ప్రత్యక్షం చేసుకోగలం. ప్రతిమార్గంలోనూ ఈ 'ప్రయత్నం' ప్రధానం. సంకల్పశుద్ధి,పట్టుదల, లక్ష్యశుద్ధి... వీటితోకూడిన ప్రయత్నానికి దైవసహాయం తప్పక లభిస్తుంది.

ప్రయత్నమే చైతన్య లక్షణం. ✦



# ఉభయభారతి

## విశ్వనాథ పావనిశాస్త్రి

### జరిగిన కథ

మండనమిశ్రుడు పూర్వమీమాంసలో నిధి. ఆయన భార్య ఉభయభారతి శాస్త్ర చర్చల్లో మండనమిశ్రుడిని ఓడించడానికి ఆదిశంకరులు వస్తున్నారని వాళ్ళకి తెలుస్తుంది.

సమరసేనుడు కోట్లకి పడగలెత్తిన వ్యాపారి. అతని మిత్రుడు లవణగుప్తుడు గొప్ప కవి. వాళ్ళకి దుర్జయుడనే ఒక పెద్ద బందిపోటు దొంగ నర్మదానది ఒడ్డున సన్యాసి వేషంలో కనబడతాడు. అతనివెంట శంకరాచార్యుడి దగ్గరకు వెళ్ళి దేవుడుంటే చూపించమంటాడు. పద్మపాదుడు ''తప్పకుండా చూపిస్తాను, అలా కూర్చోండి'' అంటాడు.

ధారావాహిక నవల

సమరసేన లవణగుప్తులిద్దరూ ఆ యిసకలో కూర్చున్నారు. మిగిలిన అందరూ మండలాకారంగా అక్కడే కూర్చున్నారు. కొంతసేపైన తరువాత, ''సమరసేనా! తమకు సముద్ర వ్యాపారం ఉంది కదూ?'' అని అడిగాడు పద్మపాదుడు.

''ఉంది'' అన్నాడు సమరసేనుడు.

''ఆమధ్య తూర్పు సముద్రం చూశానయ్యా! నాకెంతో ఆశ్చర్యం వేసింది. దాని దుంపతెగ ఆ సముద్రం అనంతంగా కనిపిస్తోంది. అందరూ అవతలి ఒడ్డు ఉందంటారు. నాకేమో కనబడదు. ఇంతకీ మీరేమంటారు? అవతలి ఒడ్డు ఉందంటారా?'' అన్నాడు పద్మపాదుడు.

సమరసేనుడు లవణగుప్తునివైపు తిరిగి, ''ఇదీ యితగాడి పాండిత్యం!'' అని వెటకారంగా నవ్వాడు. లవణగుప్త డెందుకో నవ్వలేదు. మాట్లాడలేదు.

మళ్ళీ సమరసేనుడే, ''పద్మపాదా! నీకు భూగోళం కూడా సరిగ్గా తెలీదు. నువ్వు శిష్యుడివి, ఈయన నీకు గురువు! హు! తూర్పు సముద్రం దాటితే కాంభోజం ఉంది. తెలుసుకోండి'' అన్నాడు.

''అలాగా! తమరెప్పుడైనా వెళ్ళారా అక్కడికి?'' అన్నాడు పద్మపాదుడు.

''మా నాన్న వెళ్ళాడు. మా తాత వెళ్ళాడు. ఓడల్లో నా మనుష్యులు నిత్యం వెళ్ళి వస్తూనే ఉంటారు.''

''తమరింతవరకు వెళ్ళలేదు గదా?''

''వెళ్ళకపోతే ఏం? నా మనుష్యులు వెళుతూనే ఉన్నారు. ఆ లాభాలు నాకు కనిపిస్తూనే ఉన్నాయి. కావాలంటే నేనూ వెళ్ళగలను.''

''అయితే యింకేం? దేవుణ్ణి చూడనివాళ్ళు కూడా, చూసినవాళ్ళని నమ్మి, వాళ్ళ ద్వారా ఆ లాభాలు పొందుతూనే ఉన్నారు. కావాలనుకుంటే వాళ్ళూ చూడగలరు.''

''ఏవీ! ఆ లాభాలేవో నాకేం కనిపించడం లేదే?'' అన్నాడు సమరసేనుడు వెటకారంగా.

అంతకన్న వెటకారంగా, ''ఏవీ! నీ లాభాలు కూడా మాకేవీ కనిపించడం లేదే?'' అన్నాడు పద్మపాదుడు.

తను చేసిన వెటకారం బాగానే ఉంది సమరసేనుడికి. కాని పద్మపాదుడు తిరిగి వెటకారం చేసేటప్పటికి కోపం వచ్చింది. ఆ కోపంతో ''పద్మపాదా! అతి తెలివితేటలు ప్రదర్శించకు. కంటికి కనబడే కాంభోజాన్నీ, కంటికి కనబడని దేవుణ్ణీ ఒకటిగా చెయ్యాలని ప్రయత్నించకు'' అన్నాడు.

పద్మపాదుడు ప్రశాంతంగా, ''సమరసేనా! ఎందుకు అనవసరంగా కోపం తెచ్చుకుంటావు? కాంభోజం ఎవడి కంటికి కనబడుతోంది? నీ కంటికా? నా కంటికా? అసలింతవరకు నువ్వే చూడలేదే ఆ కాంభోజాన్ని? ఉందని ఎలా నమ్ముతున్నావు? మీ



నాన్న చూశాడు కాబట్టి, వ్యాపారం చేశాడు కాబట్టి, నీ మనుష్యులు నిత్యం వెళ్ళి వస్తున్నారు కాబట్టి, వర్తకం చేసి లాభాలు సంపాదించి పెడుతున్నారు కాబట్టి, ఉందని అనుకుంటున్నావు. నీ అంత శక్తి లేని కొందరు దొంగ వ్యాపారులు, కాంభోజం పేరుతో దొంగ సరుకు అమ్ముతూ ఉంటారు. అవి కొని మోసపోయిన కొందరు, 'అసలు కాంభోజమే లేదు, అదో దొంగ వేషం' అంటే ఏం చెయ్యగలవు? నీ లాభాల లాగానే, దైవాన్ని నమ్మినవాళ్ళకి - మానసిక ప్రశాంతీ, అలౌకికమైన ధైర్యమూ, దివ్యమైన ఆనందమూ వంటి లాభాలున్నాయి. దొంగస్వాముల్ని నమ్మి, అవ్వన్నీ బూటకాలు అని అనుకోకు'' అని అన్నాడు.

పద్మపాదుడి ధోరణికి ఒక్క క్షణం దిగ్భ్రమ చెందిన సమరసేనుడు, తిరిగి పుంజుకుని, ''అదేమిటయ్యా అలా అంటావు? నావెంటరా, కాంభోజం చూపిస్తాను. నీవెంట వస్తే దేవుణ్ణి చూపిస్తావా?'' అన్నాడు.

పద్మపాదుడు, ''అదే, ఆ అహంకారమే త్యజించి చూడు. నీవెంట వస్తే చూపించగలవుకాని, ఇక్కడే కూర్చుని చూపించమంటాను. చూపించగలవా?'' అన్నాడు.

''ఎలా కుదురుతుంది?'' అన్నాడు సమరసేనుడు.

''నేను చెప్పేదీ అదే. నేను నీతోపాటు బయలుదేరాలి. సముద్ర ప్రయాణానికి భయపడకుండా, ఓడ ఎక్కాలి. ఆ ఓడ మార్గం తప్పకూడదు. తుఫానులలో చిక్కకూడదు. సముద్రపు దొంగల బారిన పడకూడదు. దారిలో సముద్రపు గాలి పడక నా ఆరోగ్యం చెడి నాకేమీ కాకూడదు. ఈలోగా నా వ్యయ ప్రయాసలన్నీ నువ్వు భరించాలి. అప్పుడు అక్కడ రేవు దిగి కాంభోజం చూపించగలవు. అది కూడా కొంత భాగం మాత్రమే చూపించగలవు. అంతా ఒక్కసారి చూపించలేవు. అప్పుడు కూడా నేను కళ్ళు మూసుకుంటే చూపించలేవు. కళ్ళు తెరిచి, ''ఛీ ఛీ ఇది కాంభోజం కాదు'' అంటే - నన్ను మూర్ఖుడి క్రింద జమకట్టడం తప్ప - ఏమీ చెయ్యలేవు. కాబట్టి నువ్వు చూపించడమే కాక - చూడాలి అనుకునే నా ప్రయత్నమూ, చూసినదాన్ని నమ్మే చిత్తశుద్ధీ నా

దగ్గరుండాలి. పోనీ కదలలేని కాంభోజం వద్దు - కదలగలిగిన కాంభోజ రాజున్నాడు గదా, ఆయన్ని తెచ్చి చూపించు. ఆయనెందుకు వస్తాడూ? మహా ధనవంతుడివి కాబట్టి నీకు దర్శనమిస్తాడు. మీ మహిష్మతీ రాజు ఏదో పెద్ద ఉత్సవం చేసి ఆహ్వానిస్తే - వస్తాడు. వచ్చి ఎవడికి పడితే వాడికి దర్శనమిస్తాడా? కాబట్టి మేము బుద్ధిమంతులమైతే - మీ మాటలు నమ్మి, కాంభోజమూ దాని రాజూ ఉన్నాడని నమ్మాలి. దూరంనుంచే నమస్కారం చేసి మా బ్రతుకులు మేము బ్రతకాలి. ఆ కాంభోజం విషయంలో మేమెంతో - కుదురుగా ఆలోచిస్తే, దేవుడి విషయంలో నువ్వూ అంతే!'' అన్నాడు పద్మపాదుడు.

సమరసేనుడికి ఏం చేయాలో తోచలేదు. ఇవ్వాళ తన వాదనాశక్తి యింత బలహీనమై పోయిందేమిటి? ఈ విషయం యింత తేలికా? సమరసేనుడాలోచిస్తూనే, ''పద్మపాదా! నువ్వేదో తర్క చమత్కారం చేస్తున్నావు. కాని, అలా కుదరదు. మా ఆదాయపు లెక్కల్లో కాంభోజం ఉంది. రాజుల లెక్కల్లో ఉంది. అక్కడినుంచి వచ్చిన రాయభారులున్నారు, ప్రజలున్నారు. ప్రముఖ నావికులూ, చిత్రకారులూ గీసిన కాంభోజ చిత్రపటాలున్నాయి. నువ్వు నమ్మకపోతే నాకేమీ నష్టం లేదు'' అన్నాడు.

పద్మపాదుడతడిని చూసి జాలిగా నవ్వాడు. ఆ నవ్వుకి సమరసేనుడు సిగ్గుపడ్డాడు. లవణగుప్తుడు చలించిపోయాడు.

లవణగుప్తుడు సమరసేనుడి వైపు తిరిగి, ''సమరసేనా! దేవుడున్నాడని చాలా గ్రంథాల్లో ఉంది. రాజుల చరిత్రలో కూడా ఉంది. దేవుణ్ణి దర్శించామనే దేవదూతలు, మహాభక్తులూ ఉన్నారు. దైవ చిత్రాలు గీసిన గొప్ప చిత్రకారులున్నారు. మనం నమ్మకపోతే వాళ్ళకీ నష్టం లేదు. నిజానికి కాంభోజాన్ని చూపించవలసిన అవసరం - ప్రత్యక్ష ప్రమాణవాదులమైన మనకి ఉంది. దేవుణ్ణి చూపించవలసిన అవసరం వాళ్ళకి లేదు'' అన్నాడు.

సమరసేనుడు ఆశ్చర్యంతో లవణగుప్తుణ్ణి చూడసాగాడు.

తిరిగి పద్మపాదుడు, ''సమరసేనా! కాంభోజానికి ప్రయాణమైన నీ ఓడకి మల్లేనే, భగవంతుని దర్శనానికీ అనేక ప్రయత్నాలు కావాలి. ఎడ్లబండి ఎక్కి, అలా ఎడారివైపు వెడితే కాంభోజం రాదు. దారిలో ఎడ్లు చచ్చి ఊరుకుంటాయి. కనీసం ఒంటెనెక్కితే గాంధారం చేరుకుంటావు. ఆతర్వాత శక, మల్ల, బర్బర, కిరాత, హారహూణ దేశాలు చేరుకుంటావు గాని కాంభోజం రాదు. దేనికైనా, దానికి తగిన ప్రయత్నం కావాలి. అలాగే భగవంతుణ్ణి దర్శించాలంటే - శమదమాదులు కావాలి. సత్య వాక్పాలన కావాలి. ధ్యానం చెయ్యాలి, తపస్సు చెయ్యాలి. భూతదయ ఉండాలి. భోగాలమీద మనస్సు నశించాలి. ఆ ప్రయత్నాలేమీ లేకుండా దైవదర్శనం కావాలనడం ఎలాంటిదో తెలుసా? వీధిలోని బిచ్చగాడు నీ అంతఃపుర సౌఖ్యాలు అనుభవించాలనుకోవడం వంటిది'' అని ఊరుకున్నాడు.

సమరసేనుడు నిశ్చేష్టుడైపోయాడు. లవణగుప్తుడు చేతులు కట్టుకుని నిలబడ్డాడు. అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

ఎరుపు విరిగిన ఆకాశం నక్షత్రకాంతిలో నిర్మలంగా ఉంది. నర్మదలోని చేపలు మధ్యమధ్య పైకి ఎగిరి, తిరిగి నీళ్ళల్లో పడుతూ విచిత్రమైన శబ్దాలు చేస్తున్నాయి. నది ఒడ్డున ఉన్న చెట్లు గాలికి గలగలలాడుతున్నాయి. గూళ్ళకి చేరుతున్న పక్షులు కిలకిలలాడుతున్నాయి. దుర్గయాశ్రమగిరి వెలిగించిన పెద్ద దీపపు కాంతిలో - అసలే ఎర్రనైన శంకరాచార్యుడి ముఖం మరింత ఎర్రనై జ్యోతిర్మండలంలా ప్రకాశిస్తోంది.

అంతలో శంకరాచార్యుడు కంఠం విప్పి, ''నాయనా సమరసేనా!'' అన్నాడు. ఆ స్వరం వింటూనే లవణగుప్త సమరసేనులు పులకించిపోయారు. మండుటెండలో నిలబడ్డ వాడికి, గొడుగు పట్టి చల్లని మధురపానీయం అందించినట్లయింది.

శంకరాచార్యుడి కంఠం యిలా వినిపించింది, ''ఇంత దుర్లభమనిపిస్తున్న ఈ దివ్యశక్తి మనం సంకల్పిస్తే, క్షణంలో దర్శనమిస్తుంది. ఎందుకంటే, అది ఎక్కడో లేదు. మనలోనే ఉంది. మన చుట్టూ ఉన్న ఈ సర్వ చరాచర జగత్తులోనూ ఉంది. ఒకనాడు కర్మశల్యానికి అంతుచూసిన ఈ దుర్గయాశ్రముడు దానిని సాధించాడు. శాస్త్రాధ్యయనంలో పారం ముట్టిన మరొక పండితుడు దాన్ని సాధిస్తాడు. నిత్య మహాభోగి అయిన ఒక మహారాజు దానిని సాధించగలడు. క్రాంతదర్శి అయిన ఒక మహాకవి దానిని సాధించగలడు. ధనార్జన విషయంలో అంతుచూసిన నీకు అది అసాధ్యం కాదు'' అన్నాడు.

శంకరాచార్యుడలా మాట్లాడుతూ ఉంటే, సమరసేనుడిలో చెప్పరాని మార్పు రాసాగింది. ఒక్కొక్క వ్యక్తి జీవితంలో ఒక్కొక్క మార్పు చాలా మెల్లిగా వస్తుంది. అదే మార్పు మరొక వ్యక్తిలో హఠాత్తుగా వస్తుంది. ఒక్కొక్కడు నానా అవస్థలూ పడి, పైసా పైసా కూడబెట్టి, వయసు మళ్ళే నాటికి ధనవంతుడౌతాడు. మరొకడికి అనుకోకుండా మహానిధి చేతికి తగిలి, చిన్నతనంలోనే ధనవంతుడౌతాడు. అదీ ఇదీ కూడా తరతరాలూ నిలబడవచ్చు, హఠాత్తుగా పోనూ వచ్చు. చూడ చూడగా, 'యీ మార్పులన్నీ యాదాలాపంగా జరుగుతున్నాయి' అనే నిర్హేతుకవాదం కన్నా, 'ఆయా జీవుల పురాకృతకర్మ పరిపాకం వలన జరుగుతున్నాయి' అనే సహేతుకవాదమే సమంజసంగా కనబడుతోంది.

చేతులు కట్టుకుని నిలబడిన సమరసేనుడితో శంకరాచార్యు

ఆంగ్లేయ చరిత్రకారులు, వారినే అనుసరిస్తున్న ఆధునిక చరిత్రకారులు ఆది శంకరుల కాలాన్ని క్రీ॥శ॥ 788 గా నిర్ణయించారు. పాశ్చాత్యులకు మన సంస్కృతీ పౌరాతన్యాన్ని ఒప్పుకోవడానికి మనసొప్పలేదు. బానిసలకు ఇంతటి మహోన్నతమైన సంస్కృతి చరిత్రకు అందని అనాది కాలం నుంచి ఉన్నదనే నిజం వారికి కొరుకుడు పడలేదు. అందువల్లనే మన చారిత్రక పురుషుల పౌరాతన్యాన్ని సాధ్యమైనంత కుదించడానికి ప్రయత్నం చేశారు. మన దురదృష్టవశాత్తూ ''వామాచారులైన'' (లెఫ్టిస్టులు) చరిత్ర కారులు నెహ్రూగారి కాలం నుండి ప్రభుత్వంలో ఆధిపత్యం చేయడం మొదలు పెట్టారు. వీరికి మన పూర్వ ఔన్నత్యం మీద నమ్మకం లేదు.

మన పురాణాలను, సంప్రదాయా లను, ఆధారాలను పుక్కిట పురాణాలుగా తేల్చివేస్తారు. సంబంధం లేని ఆధారాలను కంబోడియా నుండో, చైనా నుండో వీలయితే రష్యా నుండో పట్టుకుని వస్తారు. శంకరుల విషయంలోనూ, సరిగ్గా ఇదే జరిగింది. కంబోడియా శాసనం, శంకరులు తమ గ్రంథాలలో చెప్పిన విషయాలు మొదలుగా గల ఇరవై ఆధారాలను శంకరుల కాలం నిర్ణ యించడానికి ప్రమాణాలుగా తీసుకున్నారు. సాంప్రదాయక చరిత్రకారులు ఆ ప్రమాణా లను అత్యంత సమర్థంగా ఖండించారు. ఇద్దరి వాదనలనూ విని నిర్ణయించేదెవ్వరు? కీ॥పూ॥ ఆరవ శతాబ్దం నుండి క్రీ॥శ॥ తొమ్మిదవ శతాబ్దం వరకు ఎవరికి తోచిన కాలం వారు చెబుతూనే ఉన్నారు.

అయితే శంకరుల నుండి ఈనాటి వరకూ అవిచ్ఛిన్న పరంపర చూపుతున్న పీఠాలు నాలుగున్నాయి. విచ్ఛిన్నమయిన పరపంపరతో ఇంకొకపీఠమున్నది. ఆధునికపరిశోధకులు ఈ పీఠాల సంప్రదాయాన్ని ఎందుకు పరిగణనలోనికి తీసుకోరో అర్థం కాదు. ద్వారక, పూరీ, కంచి పీఠములవారు శంకరుల కాలాన్ని వారివద్దనున్న గురు పరంపర ఆధారంగా కీ॥పూ॥ 509 గా నిర్ణ యించారు. శృంగేరీవారు మాత్రం 1954 దాకా శంకరుల కాలం కీ॥పూ॥ 44 అని చెప్పేవారు. ప్రస్తుతం వీరు శంకరుల కాలం కీ॥శ॥ 788 అంటున్నారని అర్థమవుతోంది. విచ్ఛిన్న పరంపర అయిన జోషీమఠంవారు కూడా శంకరుల కాలం కీ॥పూ॥ 509 గానే చెబుతున్నారు.

ద్వారకాపీఠం వారు ప్రస్తుతపు ఆచా ర్యుల వారితో సహా 80 మంది ఆచార్యుల పీఠాధిరోహణ, సిద్ధి వివరాలను చూపు తున్నారు. 18వ శతాబ్దము వరకు కంచిలో ఎంతమంది పీఠాధిపతులు చూ. బడ్డారో దాదాపు అంతే మంది ద్వారకలో కూడ ఉన్నారు. వీరి పూర్వ పీఠాధిపతులచే వ్రాయ బడిన గ్రంథంలో సుధన్వ మహారాజుగారి తామ్ర శాసనపు నకలు ముద్రించ బడినది. అందులో శంకరులు యుధిష్ఠిర శకం 2031 వైశాఖ శుక్ల పంచమి నాడు జన్మించినట్లు చెప్పబడింది. పూరీ మఠం నూట నలభై మంది ఆచార్యుల పేర్లను తెలియ చెబుతూ శంకరుల కాలం కీ॥పూ॥ 509 గా నిర్ణయించింది. కంచి పీఠము వారు 1524 - 39 లలో సర్వజ్ఞ శివేంద్రులచే వ్రాయ బడిన ''పుణ్య శ్లోక మంజరి'', సదాశివ బ్రహ్మేంద్రు లచే వ్రాయబడిన 'గురు రత్నమాలిక' ఆధా రంగా ప్రస్తుతము శంకర విజయేంద్రులతో సహా 70 మంది ఆచార్యుల వివరాలు అంద జేస్తూ శంకరుల కాలం క్రీ॥పూ॥ 509 గా నిర్ణయించారు.

చిక్కల్లా శృంగేరీ పీఠము వారు చెప్పే కాలంతో వస్తోంది. 1954 సం॥ వరకూ వీరు శంకరుల కాలం క్రీ॥ పూ॥ 44 గా చెప్పారు. వీరి పీఠంతో సంబంధం ఉన్న కుడలి పీఠం వారు కూడా శంకరులాదిగా అరవై ఏడు పీఠాధిపతుల వివరాలు తెలియ పరచి శంకరుల కాలం క్రీ॥శ॥ 44 గా నిర్ణయించారు. క్రీ॥పూ॥ 1844 లో ఒక కోర్టు అఫిడవిట్టులో అప్పటి శృంగేరీ యాజ మాన్యము వారు వారి పరంపరలో రమారమి 2000 సం॥ల పూర్వమున్న శంకరుల కాలం నుండి అప్పటివరకూ 68 మంది ఆచార్యు లున్నట్లు, వారి అధిష్ఠానములకు పూజ జరుగుచున్నట్లు వ్రాతపూర్వకముగా తెలియచేశారు. తరువాత ఏ కారణము చేతనో ఆ పీఠాధిపతుల పూజా పేటిక నుండి గ్రహించ బడినదని చెప్పబడిన పరంపరా విశేషములో ముప్ఫయి ఇద్దరు పీఠాధిపతుల పేర్లు మాత్రమే ఉదాహరించబడినవి.

1910వ సం॥లో అప్పటి శృంగేరి పీఠాధిపతులచే కాలడిలో వేయించబడిన శిలాశాసనం (ప్రస్తుతం తొలగించబడినది) ఆదిశంకరుల కాలం అప్పటికి 2000 సం॥ పూర్వముగా గుర్తించినది. అయితే తరువాత కాలంలో బహుశః 1967-68 లలో అప్పటి పీఠాధిపతులు పూర్వాపరాలను పరిశీ లించి శంకరుల కాలం కీ॥శ॥ 788 గా నిర్ణ యించారు. కాబట్టి శృంగేరీ పీఠము వారిచే చెప్పబడే కాలం వారి సంప్రదాయ పరంగా వచ్చినది కాదు.

''శృంగేరీ పరంపర-పరస్పర స్పర్ధకల ఇరువురి

మధ్యబడి- విచ్ఛిన్నము చేయబడినందున దానిని, దాని ననుసరించు వారిని ప్రమాణముగా అంగీకరింప వీలులేదని భారత చరిత్ర చతురానన, భారత చరిత్ర భాస్కర శ్రీ కోట వెంకటాచలంగారు స్పష్ట పరచారు. సందర్భానుసారంగా చెప్పవలసి వచ్చింది కాబట్టి వ్రాసానుగానీ, శృంగేరీ పీఠ చరిత్రను, ఔన్నత్యాన్ని కించపరచాలని కాదు. హైందవులందరికీ ఆ పీఠం పూజనీయమైనది.

అయితే ప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ ఆర్.సి. మజుందార్ వేరే ఒక సందర్భంలో చెప్పినట్లు **"It is solemn duty of sristorian to state the truth, however, unpleasant and discreditable it might be to any particular class of community"**. యాతా వాతా చెప్పవచ్చిందేమంటే ఆదిశంకరుల కాలం క్రీ॥పూ॥ 509 అన డానికే ఎక్కువ ఆధారాలు ఉన్నాయి. శృంగేరీ పీఠము రెండవ ఆచార్యుల జీవిత చరిత్రను అత్యంత రమణీయముగా ఆంధ్రీకరించిన ప్రముఖ విద్వాంసులు, విమర్శకులు అయిన శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు కూడ ఈ విధంగానే అభిప్రాయపడ్డారు. శంకరుల కాలం క్రీ॥పూ॥ 509 అనడానికి సంప్రదాయ చరిత్రకారులు కొన్ని తిరుగు లేని ఆధారాలు చెబుతున్నారు.

1. పైన చర్చించిన శంకర పీఠాల సంప్ర దాయం ప్రకారం (శృంగేరి మినహాయించి) శంకరుల కాలం కీ॥పూ॥ 509 అనడం సరిగా సరిపోతోంది. వారం దరూ కుమ్మక్కయి ఈ కాల నిర్ణయం చేశారనడానికి, వేరు వేరు చోట్ల వేరు వేరుగా పరిరక్షించబడిన సంప్రదాయాలవడానికి వీలులేదు.
2. ప్రాచీన శంకర విజయాలలో సూచించిన శంకరుల జనన కాలపు గ్రహస్థితి ఈ కాలానికే సరిపోతోంది. వేరే ఏ తేదీకి దగ్గరగా లేదు.
3. పతంజలి చరిత్ర ఆధారంగా గోవింద భగవత్పాదుల సిద్ధి క్రీ॥పూ॥ 493గా నిర్ణయించబడినది. శృంగేరీ పీఠానికి సంబంధమున్న అభినవ విరూపాక్ష పీఠ ఆచార్యులు ఈ నిర్ణయం చేయడం విశేషం. ఈ నిర్ణయాన్ని అనుసరించి కూడా శంకరుల కాలం క్రీ॥పూ॥ 509 అని చెప్పుకోవడం సమంజసం.
4. జిన విజయానన్ననుసరించి కుమారిల భట్టు కాలం క్రీ॥పూ॥ 557గా గుర్తించబడింది. కుమారిలభట్టు కంటె శంకరులు 48 ఏండ్ల చిన్నవారని శంకరవిజయాలు చెబుతున్నాయి.
5. కోట వెంకటాచలం గారు అనేక విధా లుగా శంకరుల కాలం క్రీ॥పూ॥ 509గా నిర్ణయించారు. నేపాళ రాజుల వంశ చరిత్ర వారి శాసనాల ఆధారంగా పునరుద్ధరించి, వారి కాలాన్ని నిర్ణయించి పురాణ ప్రమాణంతో బలపరిచారు. శంకరులు వృషదేవవర్మ కాలంలో నేపాళ దేశం పర్యటించినట్లు చెప్పబడింది. వృషదేవవర్మ కాలం కలిశకం 2554-2615గా నిర్ణయించ బడింది. తద్వారా శంకరుల కాలం క్రీ.పూ. 509 అనటం సరిపోతుంది. వెంకటాచలంగారు భాగవతము, విష్ణు పురాణాలు మొదలైన పురాణాల ఆధా రంగా బుద్ధుని కాలనిర్ణయం, నాగార్జునుని కాలనిర్ణయం చేశారు. దానిబట్టి కూడా శంకరుల కాలం నిర్ణయించబడినది.
6. శంకరుని కాలంలో మగధరాజ్యపు రాజుగా చెప్పబడుతున్న ఆంధ్ర హాలుని కాలాన్ని బట్టి కూడా ఈ నిర్ణయాన్ని సమర్థించవచ్చు.
7. ముఖ్యమైనదింకొక్కటున్నది. కాశ్మీరులో ఉన్న శంకరాచార్య పర్వతంపై నున్న శంకరాచార్య దేవాలయం క్రీ॥పూ॥ 367లో కాశ్మీర రాజు గోపాదిత్యునిచే కట్టబడింది. దీని పునరుద్ధరణ క్రీ॥పూ॥ 220లోను కీ॥శ॥ 600లోనూ జరిగింది. దీనినిబట్టి శంకరుల కాలం క్రీ॥పూ॥ 367 కన్నా ముందు అయి ఉండాలని ఋజువవు తోంది.

అయితే ఒకే శంకరుడు అనేక కాలాల్లో ఉన్నారనడానికి తగిన ఆధారాలు కనిపించడానికి కారణం ఏమిటి? బౌద్ధ గ్రంథాలలో రెండవ శతాబ్దంలో ఉన్న బౌద్ధాచార్యునికీ, ఆరవ శతాబ్దంలో ఉన్నారని చెప్పబడుతున్న ఇంకొక బౌద్ధాచార్యునికీ శంకరులనే బ్రాహ్మణ సన్యాసి సమకాలీనునిగా చెప్పబడింది. ఇదెలా సాధ్యం?

బౌద్ధంలో కూడ అనేక కాలాల్లో ఉన్న నాగార్జునాచార్యులందరినీ నాగార్జునా చార్యుడనే పిలుస్తున్నారు. ప్రస్తుతం లామా లను చూడటం లేదా? అయితే ఆదిశంకరుల నుండి ఇప్పటి వరకు అనేక పీఠాలలో అనేక కాలాల్లో శంకరతుల్యులైన మహామహు లున్నారు. శంకర పీఠాలలో వారినందరినీ శంకరాచార్యుల వారనే కదా పిలుస్తున్నాం. మరి ఈ ప్రసిద్ధులైన శంకరాచార్యుల ప్రశంస అనేక గ్రంథాలలోను, శాసనాల్లోను ఉండటం సహజం. కాబట్టి ఇవన్నీ కట్టు కథలని త్రోసిపుచ్చనక్కర్లేదు. అయితే ఈ మహాత్ముల కాలంతో ఆదిశంకరుల కాలాన్ని పొరబడ టమే ప్రమాదం. ఈ ప్రమాదం ధీమంతులైన మహా పురుషుల విషయంలో కూడా జరిగింది. ఏం చేస్తాం! **''ప్రమాదో ధీమతామపి''.**

**- చల్లా విశ్వనాథశాస్త్రి**

# ఈ నవల ఎందుకు?

• ఫిబ్రవరి సంచికలో శ్రీ చల్లా విశ్వనాథశాస్త్రి గారి లేఖ చూశాను. చాలా ఆనందం కలిగింది. వారు శంకర వాఙ్మయాన్ని ఎంతో అధ్యయనం చేశారు.

నావంటివాడు, ఇటువంటి విషయం మీద, ఒక నవల వ్రాశాడూ అంటే – అటువంటి వారి దృష్టికి రాకుండా ఉండదు; ఆందోళన కలుగకా మానదు. ఎందుకంటే – ఆది శంకరుల పరకాయ ప్రవేశం, ఎంత జగత్ప్రసిద్ధమైన కథో, అంత విషమ చర్చలకు గురైన కథ కూడానూ. దానిని నవలా వస్తువుగా స్వీకరించడమంటే – క్రింద ప్రళయ భయంకరమైన మంట మండుతుండగా, పై కొద్ది ఎత్తులో ఇనప తీగమీద నడవడం వంటిది. తొందరపడితే జారతాం – అలసిస్తే, తీగవేడెక్కిపోతుంది. అందుచేత వారికి ఆందోళన కలగడం సహజం. నా మీద వారికి ఉన్న అభిమానం అలాంటిది. దానికి సర్వదా కృతజ్ఞుడిని.

ఐతే, వారికి కలిగిన సందేహాల వంటివే ఒకప్పుడు నాకూ కలిగాయి. ఉభయ భారతీదేవి సరస్వతీ దేవి యొక్క అపరావతారమనీ, మండనమిశ్రుడు (తరువాత ఈయనే సురేశ్వరాచార్యుడు) బ్రహ్మాంశ సంభూతుడనీ, ఆదిశంకరులు సాక్షాత్తూ శంకరావతారమనీ అంటారు పెద్దలు. అలాటి వారి మధ్య అర్థం లేని ఈ కామ శాస్త్ర చర్చఏమిటి? దానికి తోడు పరకాయ ప్రవేశం, శృంగార లీలలు. ఈ గోలంతా ఏమిటి? పోనీ, ఇవ్వన్నీ ప్రక్షిప్తాలు అని, కొట్టి పారేద్దామా అంటే – కథలోకి చరమ భాగంగా చెప్పబడుతున్న నృసింహ కరావలంబ స్తోత్రంలోని "సంసార" శబ్ద మర్మం ఏమిటి? సంసారం అంటే జన్మ – అనే అర్థంతో సమర్థించుకున్నా, "మారోగ్ర భీకర మృగ", "అనంగ పుష్ప" వంటి శబ్దప్రయోగ ప్రయోజనం ఏమిటి? అసలు పరకాయ ప్రవేశం ఏమిటి? ఆలోచిస్తూంటే!" ఇలా అడుగడుగునా సందేహాలు, సందేహాల వెంట సమాధానాలు – సమాధానాల లోంచి మళ్ళీ సందేహాలు, మళ్లీ వాటికి సమాధానాలు! అందుకే ఈ నవల!!

విశ్వనాథశాస్త్రిగారు సూచించినట్టుగా, "శృంగార లీలలలో అద్వైత పరమార్థాన్ని సూచించడం కూడా ఈ నవల యొక్క ప్రధానోద్దేశ్యాలలో ఒకటి. అందులో ఎంత వరకు కృతకృత్యు డనయ్యానో ఆసాంతం, పరీక్షించి తెలియజేయవలసిందిగా పెద్దలందరినీ ప్రార్థిస్తున్నాను. –రచయిత

డిలా అన్నాడు, "కంటికి కనిపించే ఈ సృష్టి అంతా పంచభూతా లతో కూడినదే. శరీరం కూడా పంచభూతాలతో కూడినదే. బయట కనిపించే పంచభూతాలూ – భూమి జలం నుంచీ, జలం అగ్ని నుంచీ, అగ్ని వాయువు నుంచీ, వాయువు ఆకాశం నుంచీ పుట్టాయి. ఆ నాలుగూ ఆకాశంలో ఇమిడి, ఆకాశంలో కదులుతున్నాయి. ఆకాశాన్ని మించి బయట మరేదీ కనబడటం లేదు. అలాగే శరీరంలోని పంచభూతాలు కూడా. కాని శరీరంలో పంచభూతాలను మించి, 'నేను' అనే భావం ఒకటి అధికంగా ఉంది. ఆకాశంతో సహా అన్నీ ఈ 'నేను' అనే భావంలో కదులుతున్నాయి. అలాగే బయటి ఆకాశం కూడా దేనిలోనో కదులుతూ ఉండాలి కదా! అదేమిటి?

మనిషి చనిపోయినప్పుడు ఈ 'నేను' విడిపోయి, శరీరంలోని పంచభూతాలు బయటి పంచ భూతాల్లో కలిసిపోతున్నాయి. అలాగే ఈ శరీరంలోని 'నేను' కూడా 'బయటినేను'లో కలిసిపోతూ ఉండాలి. ఎందుకంటే శరీరంలో 'నేను'ను మించి మరేదీ లేనట్లుగా, బయట కూడా 'నేను' అనేదే ఆఖరుది. మనిషి మరణించినప్పుడు, ఆ 'నేను', ఈ 'నేను' ఏకమై పోతున్నాయి. అంతా ఒకటై పోతోంది. ఎన్నిసార్లు ఎన్ని జన్మలెత్తినాయింతే! జన్మ అనేది చిన్న మాయ! మృత్యువనేది పెద్ద మాయ. జన్మ అనేది జీవుడు. మృత్యువు అనేది బ్రహ్మ. అంతా ఒకటే. అందుకే వేదం 'అహం బ్రహ్మాస్మి' అని చెప్పింది. 'ఆత్మవత్ సర్వభూతాని' – అని అంటే, అన్ని ప్రాణులూ తన వంటివే అనేకాక, అన్ని భూతములూ ఆత్మ వంటివే అని అర్థం. ఈ ఐహిక సూత్రాన్ని పారమార్థిక సూత్రంగా మలుచుకో! జగమంతా నీవంటిదే అనుకో! బ్రహ్మాసాక్షాత్కారం అవుతుంది. ఇంతకు మించిన దైవభావన లేదు" అన్నాడు.

సమరసేన లవణగుప్తులిద్దరూ మహానందంతో శంకరాచార్యుడికి సాష్టాంగ నమస్కారం చేశారు. చంద్రమౌళీశ్వరుని మీద నున్న రెండు బిల్వ దళాలు, యిద్దరికీ చెరొకటీ యిచ్చాడు ఆచార్యుడు.

ఇద్దరూ అతి భక్తిగా ఆ బిల్వదళాల నందుకున్నారు.

★ ★ ★

ఆ రాత్రి సమరసేనుడి రథంలో గీర్వాణ భారతి చిత్ర చిత్రంగా నృత్యం చేసింది. ఆ నాట్యవేగానికి, ఆమె మొలనూలి ఘంటలు చకచ్చకచ్చలచ్చలత్కింకిణీరణిత వియదధ్వములై, ధణంధణద్రణద్రణత్కుంకుణుగత వాయువర్త్మములై, తళత్తళత్కనత్కనకవర్ణవిదళితాగ్ని మార్గములై, చిత్రవిచిత్ర నాట్యనాద కాంతులతో కదలాడిపోయాయి. ఆ కదలికలతో విగళిత బంధమైన ఆమె మొలనూలు వదులై, జలపాతంవలె జలజల జారి, దేవి సువర్ణ చీనాంబరం ఫెళఫెళమంటూ ధాత్రీ పర్యంత మవదుకదా! అయినా, రసమధ్యమ అయిన ఆ దేవీ పరామర్శ కవీశ్వరునకు కష్టమూ కాదు. పరమేశ్వరునికి నష్టమూ లేదు. సమరసేనుడి "సార్థవాహి" మాహిష్మతివైపు దూసుకుపోయింది. (సశేషం)

ఋషిపీఠం

# అన్నమయ్య పదాలలో శాస్త్ర రహస్యాలు

డా॥ ముదివేడు ప్రభాకరరావు

**తత్త్వం ఆధ్యాత్మికం దృష్ట్వా**
**తత్త్వం దృష్ట్వాని బాహ్యతః।**
**తత్త్వీభూత స్తదారామ**
**స్తత్త్వా దప్రచ్యుతో భవేత్॥**

-మాండూక్యోపనిషత్ (II-38)

తనకు లోపల, వెలుపల ఉన్న ప్రపంచాలలోని తత్త్వాన్ని తెలుసుకున్నవాడు, తానే ఆ తాత్త్విక సత్యమై, అందులో నిమగ్నుడై ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. అట్టి ఆనంద స్థిరుడైనవానిని ఎవ్వరూ దానినుండి విడదీయలేరు.

అన్నమయ్య అభిరుచి సహజంగా ఆధ్యాత్మికమే! అంటే, నిసర్గమైన అనన్యభక్తియే అన్నమయ్య అభిరుచి. తాను "వేంకటశైల వల్లభరతి క్రీడా రహస్యాలు"గా వేలకొలది శృంగార సంకీర్తనలు వ్రాసినా, "శ్రీవేంకటపతియే పరతత్త్వము నాకు" అని కొన్నివేల అధ్యాత్మ సంకీర్తనలు వ్రాసినా, ఆ అభిరుచి యొక్క మూలకందం ఆయనకు పుట్టుకతో వచ్చిన ఆధ్యాత్మిక జిజ్ఞాస! దీనివల్ల, "అభిరుచి" అనేది కవియొక్క రక్తనిష్ఠమైన గుణమని స్పష్టమౌతోంది.

అన్నమయ్య మొట్టమొదట దార్శనికుడైన కవి. ఆ తర్వాత వాగ్గేయ కారుడు. ఈ "కవి - వాగ్గేయకారుని"లో ఒక తత్త్వజిజ్ఞాసువు దాగివున్నాడు. అందుకే, ద్వంద్వాత్మకమైన, చీకటివెలుగులతో కూడిన, సుఖదుఃఖమయమైన ఈ మానవ జీవితాన్ని ప్రతిబింబించే, వ్యాఖ్యానించే శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు వ్రాసి, ఈ రెండు భిన్నమార్గాలను "మధుర భక్తి" సంప్రదాయంలో నడిపించినా, సాధకుడైన భక్తుడు తన లోపలి తత్త్వమైన అంతర్యామి



అన్నమయ్య భక్తిసూత్రం-
అంతర్యామి, అర్చాతత్వాల సమన్వయం

లక్షణాన్ని అవగాహన చేసుకోనిదే, ఈ లోకంలో కంటికి కనబడే విగ్రహారూపం ధరించిన "అర్చాతత్త్వం" అవగతం కాదని అనేక సంకీర్తనలలో హెచ్చరించాడు. అంటే బాహ్యంగా కనబడే లోకస్వభావానికీ, ఆంతరమైన అంతర్యామికీ సమన్వయం ఉండాలని ఆక్రోశించిన మొట్టమొదటి "అనుష్ఠాన వేదాంతి" అన్నమయ్యగా కనబడుతాడు.

భారతీయ సంప్రదాయంలోని "భక్తి యోగాన్నీ" శ్రీవైష్ణవ సంప్రదాయం ప్రసాదించిన "మధురభక్తి"నీ స్వకీయానుభూతిచే రంగరించి, మన లోపల, వెలుపలగా ఉండే అంతర్యామి, అర్చాతత్త్వాలకు సమన్వయం సాధించి, ప్రథమాంధ్ర వాగ్గేయకారుడై పద కవితా సామ్రాజ్యంలో పట్టాభిషిక్తుడైనాడు అన్నమయ్య!

## అంతర్యామి స్వరూపం :

శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ననుసరించి భగవంతునికి ఐదు స్థితులు (Five manifestations of God) చెబుతారు. అవి పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చాస్థితులు. ఆరవ స్థితి కూడ అంగీకరిస్తారు. అది ఆచార్యరూపమైన అవతరణం.

'పర' మంటే శ్రీ వైకుంఠమందలి శుద్ధ సత్త్వమయమైన, షాడ్గుణ్యప్రపూర్ణమైన పర వాసుదేవస్థితి. నిత్యులు ముక్తులే ఈ స్థితిని దర్శించగలరు. బద్ధులైన సంసారిచేతనులకిది ఊహకందని విషయం.

'వ్యూహ'మంటే వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహాలు. ఇవి పాంచరాత్రాగమ ప్రసిద్ధమైనవి. విశిష్టాద్వైతంలో ఈ వ్యూహ నిర్మాణపద్ధతి జీవుడు క్రమంగా అధిరోహించే సోపానాల వరుస. తాత్త్వికమైన ఈ గహన విషయం సామాన్యులకు తెలిసేదికాదు.

'విభవ'మంటే లోకంలో ధర్మగ్లాని సంభవించినప్పుడు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణార్థం సర్వేశ్వరుడు వైకుంఠంలోని నిత్యవిభూతి నుండి ఏదో ఒక రూపాన్ని ధరించి లీలా విభూతిలోనికి వస్తాడు. దీన్నే అవతార మంటారు.

భాగవతం, భగవంతుని ఏకవింశతి

అవతారాలను చెప్పింది. అందులో కొన్ని అంశావతారాలు. కొన్ని పూర్ణావతారాలు. దశావతారాలు ప్రసిద్ధమైనప్పటికీ అందులో మానవాకృతుల్ని దాల్చిన శ్రీరామ, శ్రీకృష్ణావతారాలే సంపూర్ణావతారాలు. వీరిలో రాముడు మాయా మానుష విగ్రహుడైతే, కృష్ణుడు లీలామానుష విగ్రహుడు.

శ్రీరామ, కృష్ణులను అవతార పురుషులుగా వారి సమకాలంలో గుర్తించిన వారిని వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. అంటే, భగవంతుని అవతారాలు సైతం మానవస్వభావాన్ని సంపూర్ణంగా మార్చలేకపోయాయని స్పష్టమౌతున్నది.

'అంతర్యామి' అంటే, చరాచరాత్మకమైన జగత్తునందంతటా వ్యాపించియున్నవాడని అర్థం. దీనినే 'వాసుదేవ' తత్త్వమంటారు. 'భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః' సనాతనమైన వాసుదేవ పర బ్రహ్మమే మహాభారతంలో కీర్తింపబడిందని వ్యాస మహర్షుల వాక్కు.

'విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేనస్థితో జగత్' (భగవద్గీత 10-42) నేను అంతర్యామి రూపంలో ఈ జగత్తునందెల్ల వ్యాపించి యున్నాను. 'సర్వస్యచాహం హృది సన్నివిష్టః' (గీత 15-1) సకలప్రాణి సమూహం యొక్క హృదయాలలో నేనున్నాను. 'ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి. (గీత - 18-61) సర్వ ప్రాణికోటుల హృదయాలలో నివసించునది నేనే. 'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత' (గీత 18-25) 'అంతర్యామిగా నున్న నన్ను శరణు పొందుము. నీకు శాశ్వతమోక్ష పదవి లభించును' అని ఉపదేశించాడు గీతాచార్యుడు.

భగవంతుడు తనలోనే ఉన్నాడన్న అభిజ్ఞ సామాన్యజీవులకు కల్గడం కష్టం. తెలిసినవారు ఉపదేశించినా అవ్యక్తతత్త్వమైన ఈ అంతర్యామిని ఉపాసించడం మరింత కష్టం. మరి, భగవంతుని సులభంగా దర్శించడం ఎలా?

'అర్చ' అంటే భక్తుడు అర్చించుకోవడానికి వీలుగా విగ్రహరూపంగా వెలసిన మూర్తి విశేషం. నిరాకారం నిర్గుణం అవ్యక్తమైంది అంతర్యామి తత్త్వమైతే, సాకారం సగుణం వ్యక్తమైంది అర్చాస్వరూపం. ఈ ఉపాసనలు రెండూ వైదిక మార్గాలే అయినప్పటికీ సాధకునికి సాకారోపాసనమే సులభతరమైంది.

**క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తా సక్తచేతసామ్।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే।**
(గీత 12-5)

''అవ్యక్తతత్త్వం అవాఙ్మానస గోచరం కాబట్టి, అలాంటి ఉపాసకులైన ముముక్షువులకు క్లేశం ఎక్కువ. వారికి ముక్తి లభించదని కాదు. లభిస్తుంది. కాని, అది మిక్కిలి కష్టం మీద గాని లభించదు.''

భగవద్విభూతి సాకారమైనప్పుడు సాధకుని దేహేంద్రియ మనోబుద్ధులకు అందుతున్నది కాబట్టి, ఎక్కువ కష్టం లేకుండా శీఘ్రఫలకారి అవుతోంది. దీన్నే, అర్చావతార సౌలభ్యమని పిలుస్తారు.

ఇంతవరకు చెప్పింది రూప విషయం. జగత్తు నామరూపాత్మకమైంది కాబట్టి 'నామము' (పేరు) కూడ అర్చాతత్త్వం క్రిందే వస్తుంది.

భగవంతుని తత్త్వం ఆయన వివిధ నామధేయాలలో నిక్షిప్తమై వుందని దర్శించిన మహర్షులు వేదాల సార భూతంగా వున్న వివిధ నామధేయాలను క్రోడీకరించి సాధకుల కుపాదేయంగా స్తోత్రరూపంగా అందించారు. అవే, విష్ణుసహస్రనామస్తోత్రం, శివసహస్ర నామ స్తోత్రం- యిత్యాదులు. ఈ నామ మహిమను ఆధారం కొనియే 'నామ సంకీర్తనం' 'నామ సిద్ధాంతం' అనే శాఖ భక్తి ఉద్యమంలో బయలుదేరింది. అద్వైతులుసైతం సగుణోపాసనను చేపట్టి నామసిద్ధాంత ప్రచారానికి నడుం కట్టారు.

సరిగ్గా, ఈ కోవకు చెందినవాడే అన్నమయ్య. జన్మతః స్మార్తుడైనా చిన్నతనంలోనే భగవన్నామమహిమ తెలిసినవాడై తిరుమలపై ఘనవిష్ణువువద్ద వైష్ణవం స్వీకరించినది చాలక, అహోబలంలో ఆదివణ్ శఠకోపయతి వద్ద ద్వాత్రింశత్ అక్షరాత్మకమైన నృసింహ మంత్రాన్ని ఉపదేశం పొందాడు. వైష్ణవ సంప్రదాయ గ్రంథాలను అధ్యయనం చేశాడు. శ్రీ వేంకటపతియే పరతత్త్వమని తెలుసుకొన్న అన్నమయ్య నామసంకీర్తనమే మోక్ష సాధనంగా గ్రహించి వేలకొలది సంకీర్తనలు రచించాడు.

అన్నమయ్య సమన్వయం: 'అంత ర్యామి' అనే పేరే అది 'లోపలి తత్త్వ'మని తెలియజేస్తున్నది. 'అర్చా' అనే పేరు ''అర్చించుకొనే విగ్రహం' అని చెబుతున్నది.

అనిర్వచనీయమైన భగవత్తత్త్వాన్నీ, సౌందర్యాన్నీ 'అర్చ'గా రూపొందినవాడు, ఆయన అనంత కళ్యాణ గుణగణాలను 'నామ సంకీర్తనం'గా పాడుతూ ఆరాధించేవాడు మానవుడు.

వీడు సాధకుడైన భక్తుడని ఎప్పుడు పిలువబడుతాడంటే - అంతర్యామి తత్త్వానికీ, అర్చాతత్త్వానికీ మధ్య ''భక్తి'' అనే సేతువును నిర్మించుకో గలిగినప్పుడే! అప్పుడే, ఆ భక్తుడైన సాధకునికి 'సమన్వయజ్ఞానం' లభించి ఆనందం పొందగలుగుతాడు. అదే ఆనందనిలయుడైన శ్రీ వేంకటేశ్వర స్వామి దర్శనం!

మనసుకు, మాటకు, చేతకు ముడివేయగల్గిన త్రికరణ శుద్ధిగల సాధకునికే నామ సంకీర్తనంచేత అర్చామూర్తిని ఆరాధించిన ఫలం లభిస్తుంది. దీనికి ఏకైకమైన ఉదాహరణ ఆముక్తమాల్యద లోని మాలదాసరి. ఇతడు వరాహపురాణకాలం వాడు కాగా, క్రీ.శ. 15వ శతాబ్దంలోని తాళ్లపాక అన్నమాచార్యులు రెండవ వాడుగా గుర్తింపబడుతున్నాడు.

*(ముగింపు వచ్చే సంచికలో)*

# ప్రకృతి - ఉగాది



ఎన్నో ఏళ్ళ తర్వాత ఈసారి ఉగాది పండుగకి పుట్టింటికి వచ్చాను. నా ఊరు, నేను పుట్టి పెరిగిన ఇల్లు, పరిసరాలు చూస్తుంటే ఎంతో ఆనందంగా ఉంది. తెలతెలవారుతుండగా లేచి, నా నేస్తం వేపచెట్టు క్రిందకు వెళ్ళి కూర్చున్నాను. చెట్టు మాదైనా సగానికి పైగా కొమ్మలు మా ప్రక్కింటికి విస్తరించి ఉంటాయి. అబ్బ ఈసారి పండక్కి వేపపువ్వు కోసం వారం రోజుల వేట అక్కరలేదు. ఎంచక్కా నా వేపచెట్టు పండక్కి చిగుర్లు, పూలతో సిద్ధంగా ఉంది. ఆ చెట్టును చూస్తూ ఉంటే తీపి జ్ఞాపకాలు చుట్టుముట్టుతూ, నన్ను, నా మనస్సుని బాల్యంలోకి లాక్కు వెళ్ళాయి.

**''చెట్లన్నీ చిగురించేకాలం**
**వసంత ఋతువు.''**

అంటూ ఆరు ఋతువులని వర్ణించే పాటని రాగయుక్తంగా పాడుతూ, ఎలా అభినయించాలో కూడా ఆరోజు బడిలో నేర్పించారు. ఆ పాటని తలచుకొంటూ భుజంమీది నుంచి జారిపోతున్న సంచిని సరిచేసు కొంటూ, దారిలోని చెట్లనన్నిటినీ నిశితంగా పరిశీలిస్తూ ఇంటికొచ్చాను. పలక, బలపం సంచిని అరుగుమీదే పెట్టి, ముందున్న వేప చెట్టుని చూశాను. ఆకులన్ని రాలిపోయి, ఉట్టి కొమ్మలతో ఉంది. పరిగెత్తుకొంటూ, అమ్మ దగ్గరికి వెళ్ళి, ''అమ్మా! ఇది శిశిర ఋతువా! ఆకులన్నీ రాలిపోయాయి! మరేమో వసంత ఋతువులో ఈ చెట్టు మళ్ళీ చిగురిస్తుంది కదూ! అంటూ నేనారోజు తెలుసుకొన్న విషయాలన్నీ అమ్మతో చెప్పాను.

''చిట్టి తల్లీ! వేపచెట్టు చిగురించడమే కాదు, వేపపూలు కూడా వస్తాయి. అప్పుడే ఉగాది పండుగ వస్తుందని చెప్పింది అమ్మ. అప్పట్నుంచి వేపచెట్టుకి వేపపూలు వచ్చాయంటే చాలు, ఉగాది పండుగ వస్తోందని సంబరపడేవాళ్ళం.

రాత్రిళ్ళు మేమంతా ఆరుబయట పడుకొనేవాళ్ళం. తెల్లవారుతోందంటే చాలు. కూ... కూ.. అనే కోకిలమ్మ కమ్మని పాటతో మెలకువ వచ్చేది. నిండుగా కప్పుకొన్న దుప్పటిని కాస్త తొలగించి, ఆకుల గుబుర్లలో ఆ కోకిలమ్మ ఎక్కడ దాగుందో చూడా లని ప్రయత్నించే వాళ్ళం. కాని కనిపించేది కాదు. అది కూ... అంటే బదులుకు మేము కూ... అంటూ అనుకరించేవాళ్ళం. అది మళ్ళీ కూ... అంటే మమ్మల్ని అది ఇంకో కోయిల అనుకొని భ్రమపడుతోందని ఊహించుకుంటూ ఇంకా బిగ్గరగా కూ... కూ... అంటూ పాడేవాళ్ళం. మా అల్లరి అమ్మకి ముచ్చటగా అనిపించేది కాబోలు కిలకిలా నవ్వేది.

ఋతువులు మారుతూ సంవత్సరాలుగా దొర్లిపోయాయి. కాని బాల్యంలో ప్రకృతికి నాకు, ఏర్పడ్డ అనుబంధం కొన సాగుతూ మరపురాని మధురానుభూతు లుగా నాలో చెరగని ముద్ర వేయసాగాయి.

కాలేజీ చదివే రోజుల్లో పండగరోజు అమ్మ తెల్లవారుఝామున నాలుగింటికే నిద్రలేపేది. మమ్మల్నంతా పేరు పేరునా తట్టిలేపి, తలంటు పోసేది. జుట్టుకి సాంబ్రాణి పొగవేసి, చిక్కుతీసి, జడవేసి తల నిండా పూలు పెట్టేది. దేవుడి ముందుంచిన క్రొత్త బట్టల్ని మా అందరికిచ్చి వేసుకోమనేది. చిన్నాలంపట్టి పరికిణీ, జాకెట్టు, ఓణీ, మెడలో ఒంటిపేట గొలుసు, చెవులకి జూకాలు, చంపస్వరాలు, గోరింటాకు పెట్టిన చేతులకి గలగలమనే గాజులు, పసుపు రాసిన పాదాలకి గజ్జెలు. నిలువుటద్దం ముందు నిలబడి చూసుకొంటూ ఎంత అద్భుతంగా ఉందో అనుకొంటూ, జడని ముందుకి వేసుకొని, మళ్ళీ ఒకసారి చూసుకోవడం. సాంబ్రాణి, మల్లెపూల వాసనలతో త్రాచు పాములాంటి జడ గుప్పుమనేది. అందరం అమ్మ ముందుకు వెళ్ళి నిలబడేవాళ్ళం. మమ్మల్ని మురిపెంగా చూస్తూ ''ఈరోజు సంవత్సరాది. పోట్లాడుకోరాదు, ఏడవరాదు, అందరూ కలసి, మెలసి సంతోషంగా ఉండాలి. తెలిసిందా'' అని గుర్తుచేసేది. ప్రతి ఏటా ఉగాదిరోజున ఈ మాటలు అమ్మనోట విన్నా ఏ ఏటికాఏడు ఆ మాట క్రొత్తగానే అనిపించేది.

అందరం కలసి వేపపూత తేవడానికి వెళ్ళేవాళ్ళం. తమ్ముడు చెట్టు ఎక్కితే ఎక్కడ క్రిందపడతాడో అని భద్రం, జాగ్రత్త అని చెబుతూ భయం భయంగా చూస్తూ నిలబడే వాళ్ళం. ఈ ముచ్చటంతా ఈ వేపచెట్టు దగ్గరే. తాజా పూలతో చేసిన వేపపచ్చడి, షడ్రుచు లతో ఎంత రుచి! ఉగాది పండుగంటే చాలు క్రొత్త బట్టలు, పిండి వంటలు క్రొత్త చింత పండు, అప్పుడే వస్తున్న మామిడి పిందెలు, క్రొత్త చిగుళ్ళు వేపపువ్వు అంటూ అంతటా క్రొత్తదనం.

సంప్రదాయం పేరిట సంవత్సరాది రోజు వేపపచ్చడితో జీవితాన్ని అన్వయించి, జీవితమంటే ఏమిటో వివరించడం మన ఉగాది పండుగ ప్రత్యేకత. నిజంగా ఎంత విశిష్టమైనది మన సంప్రదాయం.

★ ★ ★

అక్కయ్యా! అప్పట్నుంచి ఆ చెట్టునే చూస్తూ కూర్చొని ఉన్నావు. గత స్మృతులా అంటూ వచ్చి కూర్చున్నాడు నా తమ్ముడు. ''అన్నట్లు నీకో విషయం చెప్పలేదు. చెబితే బాధపడతావేమో. మన ప్రక్కింటి వాళ్ళ పోరు పడలేక ఈ చెట్టుని కొట్టించేస్తున్నాం'' అన్న మాటలు వినగానే ఉలిక్కిపడ్డాడను.

''నమ్మలేకపోతున్నావు కదూ! ఏం చేసేది? వాళ్ళు ఇల్లు కడతారట. పండుగయిన తరువాత కొట్టించేస్తామని మాటిచ్చాం'' వింటూ ఉంటే మనస్సు చివుక్కుమన్నది.

''మా సిటీలోనే ఇలా అంటే, ఈ ఊర్లో కూడా అంతేనా!'' అన్నాను బాధగా. నువ్వింకా ఏ లోకంలో ఉన్నావు? అన్నిచోట్ల ఇంతే. ఎవరి అవసరాలు వాళ్ళవి. మనమేం చెయ్యగలం చెప్పు'' అంటూ లోపలికి వెళ్ళాడు.

ఒక్కసారి తనివితీరా నా వేపచెట్టుని చూశాను. చెట్టునిండా ఆకులు, పూలతో కళకళలాడుతూ వసంతలక్ష్మికి స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉన్నట్లుంది. కోకిలమ్మ కూ... కూ... అంటూ కమ్మగా పాడుతూ ఉగాది తల్లిని ఆహ్వానించడానికి అభ్యాసం చేసుకొంటోంది కాబోలు. కన్నీరు నిండిన కళ్ళకి అంతా మసగ్గా కనిపిస్తోంది.

''నేస్తమా! ఎందుకా కంట తడి? ప్రకృతిని పరికించి, ఆనందానుభూతుల్ని పొందే సంస్కారానికి మనిషి దూరమవుతున్నాడు. యాంత్రిక యుగంలో యంత్రాలతో పాటు తాను ఓ యంత్రంగా మారిపోతున్నాడు. పండుగ రోజు వేప పచ్చడి కూడా అంగళ్ళలో అమ్మితే బాగుండునని ఆలోచించే స్థితికి వచ్చాడు. ఎక్కడ చూసినా వేగం, వేగం. కాని, ఈ మార్పులన్నీ తాత్కాలికమే. మళ్ళీ మమ్మల్ని వెతుక్కుంటూ రాకమానదు మానవజాతి. అప్పుడు కలుసుకొందాం. బాధపడకు'' అంటూ నా నేస్తం, నా వేపచెట్టు నాకు ధైర్యం చెబుతున్నట్లనిపించింది. ✸

# మన పద్యం

**కమలనయన! నీవు కలచోటు సరసంబు**
**నీవు లేనిచోటు నీరసంబు**
**కంబుకంఠి! నీవు కలవాడు కలవాడు**
**లేనివాడు నీవు లేనివాడు**

ఇది శ్రీనాథుని పద్యం 'కాశీఖండం' అనే గ్రంథములోనిది.

దక్షిణాపథానికి వచ్చిన అగస్త్య మహర్షి 'కొల్లాపురి' క్షేత్రానికి వచ్చి, అక్కడ వెలసి ఉన్న శ్రీమహాలక్ష్మిని దర్శించి, భక్తి పారవశ్యంతో స్తోత్రించాడు.

ఆ స్తోత్రంలో భాగమిది.

''పద్మములు వంటి కన్నులు కల తల్లీ! నీవున్న చోట సరసం, నీవులేని చోట నీరసం; శంఖము వంటి కంఠం కల దేవీ! నీవున్న వాడే ఉన్నవాడు, నీవు లేనివాడే లేనివాడు.''

సృష్టిలో ప్రతి ఐశ్వర్యమూ శ్రీమహాలక్ష్మీ స్వరూపమే, ఆమె 'విభూతి' (ఐశ్వర్యం) ఎవరిలో దీపిస్తుందో అతడు ఐశ్వర్యవంతుడు. కేవలం ధనం మాత్రమే కాదు. సర్వవిధ ఐశ్వర్యములూ, కళలూ లక్ష్మీరూపాలే.

లక్ష్మీ అనుగ్రహం, లక్ష్మీకళ లేనిచోటు వెలవెలబోతూ ఉంటుంది. ఉత్సాహ, ఉల్లాస, ఆనందాదులు ఉండవు. సర్వరస స్వరూపిణి ఆ తల్లి. కాబట్టి ఆ తల్లి ఉన్నచోటే రసవంతం. ఆ తల్లి లేనిచోట నీరసమే.

అదేవిధంగా అమ్మ కృప ఎవరిలో ఉంటుందో వాడే ''ఉన్నవాడు''. అమ్మ కళ లేనివాడు నిజమైన ''లేనివాడు''.

అంత శక్తిమంతమైన అమ్మ ఉనికి, కరుణ. కాబట్టి ఆ తల్లి అనుగ్రహాన్ని అర్థిస్తూ అగస్త్య మహర్షి ఈవిధంగా స్తోత్రం చేశాడు.

కంఠస్థం చేయదగిన, లలితమైన ఈ పద్యం రచించిన శ్రీనాథుడు మహాకవి. కవిసార్వభౌమ బిరుదాంకితుడు. భావానుగుణమైన భాషా వైభవంతో తెలుగు కవిత్వాన్ని సుసంపన్నం చేశాడు. ఈశ్వరార్చన కళాశీలుడు. వేద, పురాణాది శాస్త్రాలలో మహాపండితుడు. మహాభక్తుడు. చింతామణి సరస్వతీ ఉపాసకుడు. శృంగార నైషధం, హరవిలాసం, భీమఖండం, కాశీఖండం వంటి మహాగ్రంథాలు రచించాడు.

తెలుగు సాహిత్యంలో పరిపూర్ణ చైతన్యవంతమైన సరస్వతీ అవతారం ''శ్రీనాథుడు''. అనేక శాస్త్ర రహస్యాలను కవిత్వంలో చెప్పడం అయన

# రాజకీయాలు - మంత్ర తంత్రాలు

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

(గత సంచిక తరువాయి)

ఐతే ఆ మంత్ర తంత్రములు ప్రయోగించే సిద్ధసాధకుల శక్తి పరిమితులు అల్పమైనవని గుర్తించాలి. అపారమైన అనంత శక్తులతో అపూర్వమును పుట్టించి రాజ యోగములను సృష్టించి మహోన్నత పదవులను ప్రసాదించగల ఋషితుల్యులు అధికారులకు, ధనవంతులకు తలయొగ్గి వారినుండి ప్రతిఫల మును స్వీకరించి పని చేసి పెట్టరని గ్రహించటం అవసరం.

ఆ మధ్య నేను ఉజ్జయిని వెళ్ళాను. మహాకాలుని దర్శనం చేసుకొన్నాను. దేశంలో ఎక్కడాలేని విశేషం ఒకటి కన్పించింది. శివలింగాన్ని శ్మశాన భస్మంతో అభిషేకం చేసే ఆచారం ఉండేదిట! ఇప్పుడైతే చాలాకాలం కింద శ్మశానం నుండి తెచ్చిన అగ్నిని రక్షించి - ఒక అగ్ని గృహం ఏర్పరచి దాని వల్ల వస్తున్న భస్మంతో అభిషేకం చేస్తున్నారట!

శిప్రా నదీతీరంలో ఉన్న శివపుత్రుడు భైరవునికి కేవలం మద్యం మాత్రమే నివేదన చేయటం మరో విశేషం. ఊరికి దూరంగా అరణ్యంలో ఉన్న మహాకాళి - కాళిదాస విక్రమార్కులు ఆరాధించిన మహాశక్తి. అష్టాదశశక్తి పీఠాలలో ఒకటి - భౌతికమైన వైభవం అంతగా లేకపోవటం - జనం కూడా పెద్దగా లేకపోవటం ఇంకో విశేషం.

ఇక్కడ చెప్పదగిన ప్రధానమైన విశేషం వేరొకటి ఉంది. ఒక వృద్ధ బ్రాహ్మణుడు అక్కడ పరిచయమై విచిత్రమైన అంశాలు చెప్పాడు. కొంత కాలం క్రింద పదవీభ్రష్టత చెందిన ఒక మంత్రి మళ్ళీ ఆ స్థానం అందుకోటానికి కావలసిన తాంత్రిక పూజలు చేయవలసిందిగా కోరి దానికి కావలసిన ధనం ధారాళంగా ఏర్పాటు చేయడం జరిగింది. అయితే అందులో ముఖ్యుడైన తంత్రవేత్త ఒక కీలకమైన విషయం చెప్పాడట. మీకు ''జాతక రీత్యా - కర్మ రీత్యా మళ్ళీ పదవీ యోగం లేదు. తాంత్రిక యజ్ఞాల ద్వారా మీకాయోగం పట్టించటానికి మేము ప్రయత్నిస్తాము. అది సిద్ధించవచ్చు. అయితే పదవీ యోగ కాలంకాగానే మీకు అకాల మృత్యువు కలగవచ్చు. ఆ ప్రమాదానికి మీరు మానసికంగా సిద్ధపడితే ఈ తంత్ర ప్రక్రియ మేము చేస్తాము'' అన్నాడు. ఆ మహా వ్యక్తి ''ముందు పదవి రావటం ప్రధానం, అకాల మృత్యువును జయించటానికి మళ్ళీ ప్రయత్నిద్దాం'' అనటం తరువాత రెండు సంఘటనలు - పదవీ - గండం జరగటం చారిత్రక సత్యాలు. ఈ సంఘటన వెనుక ఉన్న తాంత్రిక ప్రయోగాల సత్యాసత్యాలు పరిశీలించవలసినవి.

దాదాపు పదిహేను సంవత్సరాల క్రింద పత్రికలలో ఒక వార్త వచ్చింది. వింధ్య పర్వతప్రాంతంలోని ఒక అరణ్య మధ్యంలో ఒక భయంకర యజ్ఞం జరిగిందని. ఒక పెద్దకాకి బొమ్మ ప్రధాన పూజలో పెట్టి జంతువుల రక్తమాంసాలతో హోమాలు చేశారని బలులు పూజలు నిర్వర్తించారని అప్పటి ప్రధాన రాజకీయనాయకులు ఈ ప్రయోగాలు చేయించారని దాని సారాంశం. మొత్తం మీద పదవులు సాధించటానికి పెద్దదేవతలనో చిన్నదేవతలనో ఆరాధించటం ప్రయోజనం పొందటం అనేది ఇవాళ కొత్తగా పుట్టినదేమీ కాదు. భారతంలో ధర్మరాజు ఎందరు దేవతలనో ఆరాధించాడు సుత్తించాడు. యుధిష్ఠిరుని దుర్గాస్తుతి చాలా ప్రసిద్ధమైంది. అటువైపు దుర్యోధనుడూ తక్కువ ప్రయత్నాలేమీ చెయ్యలేదు. ఎన్నో యజ్ఞాలు, పూజలు చేయించాడు. అయితే పాండవుల దైవబలం ముందు చాల లేదు. ఈ సందర్భంగా కన్నడ భారతంలో ఒక చక్కని కథ ఉంది.

దుర్యోధనుని పురోహితులలో కనకస్వామి అనేవాడు గట్టిమాంత్రికుడు ప్రభువు ప్రేరణతో వాడొక అభిచారిక హోమం చేశాడు. ఆ హోమకుండంలో నుండి ఒక మహాకృత్య పుట్టింది. పాండవులను చంపమని కనకస్వామి దానిని ఆజ్ఞాపించాడు. అది అరణ్య వాసం చేస్తున్న పాండవుల మీదికి వెళ్ళింది. అయితే దైవయోగం బలవత్తరమైనది. ఆ సమయానికి ఒక కొలను దగ్గర యక్షుని తిరస్కరించి భీమార్జున నకుల సహదేవులు మూర్ఛితులై ఉన్నారు. యక్షుని ప్రశ్నలకు ధర్మరాజు సమాధానం చెపుతున్నాడు. అప్పుడు చేరుకున్నది కృత్య, యక్షుని ఆవరణలో ఉన్న పాండవుల మీదకు దూకబోయింది. కాని ఆ ఆవరణలోకి ప్రవేశించలేకపోయింది. ధర్మదేవతయైన ఆ మహా యక్షుడు కృత్యతో చెప్పాడు. ''నా రక్షణలో ఉన్నవారికి నీవు తాకలేవు. వాళ్ళను చంపడమా బ్రతకనియ్యటమా అనేది నా నిర్ణయం మీద

ఉంటుంది. నీవు వెనక్కి వెళ్ళు'', కృత్య చెప్పింది. ''నేను ఉగ్రమంత్ర ప్రేరణచేత ఉదయించిన కృత్యాశక్తిని! చంపటమే నా లక్షణం. నాకు ఆహారం కావాలి, బలికావాలి. నన్నేం చేయమంటారు. ఎవరినో ఒకరిని చంపకుండా ఉండలేను''. యక్షుడు ''వాళ్ళను చంపనివ్వను, నిన్ను ఎవడు పంపాడోవాని దగ్గరకేవెళ్ళు''. ఆ కృత్య వెనక్కు వెళ్లి ప్రయోగకర్తయైన కనకస్వామిని సంహరించింది. ప్రబల దైవశక్తి సంపన్నుల మీదికి పంపబడిన అభిచారికి కృత్యా ప్రయోగాలు ప్రయోగకర్తనే సంహరించట మనేది మంత్ర శాస్త్రవేత్త లెరిగిన విషయమే.

భాగవతంలో ఇటువంటదే మరొక సంఘటన ఉంది. తన మిత్రుడైన ఒక రాజును శ్రీ కృష్ణుడు చంపాడని కోపంతో కాశీరాజు తన పురోహితులను ఆజ్ఞాపించి కృత్యాహోమం చేయించాడు. చేసిన బ్రాహ్మణులు సామాన్యులు కాదు. మహామంత్రవేత్తలు. రాజాజ్ఞచేత తప్పక అతి భీషణమైన అభిచారిక ప్రయోగం చేసి మహాకృత్యను పుట్టించి ద్వారక మీదకు కృష్ణుని సంహరించమని పంపారు.

ఆ కృత్య పోయినంత మేర దహిస్తూ వెళ్ళి అగ్ని జ్వాలలతో ద్వారకను ముట్టడించి నగరం చుట్టూ ఉన్న ఉద్యానవనాలు - గృహాలు కాల్చి వేసింది. జనం హాహాకారాలతో పట్టణంలోకి పరిగెత్తారు. పట్టణంలో సమయానికి కృష్ణుడు లేడు. నగర రక్షణకు సుదర్శనచక్రం ఉంది. అది కృత్యా సంరంభం చూచింది. ఆగ్రహించి ఆ కృత్యను దహించి వేసి అంతటితో ఆగక పుట్టిన చోటు కాశీ వెళ్ళి రాజుతో ప్రయోగ కర్తలతో అందరితో కాశీపట్టణాన్ని దహించింది.

కాశీపతి విశ్వనాథుడు సుదర్శన విజృంభణాన్ని చూచి పురం విడిచిపెట్టి వెళ్ళిపోయినాడు. పన్నెండు సంవత్సరాలు కాశి - మండుతూ - తగులబడుతూనే ఉంది.

కృత్యా ప్రయోగాల నుండి కాపాడుకోవటానికి ప్రాచీన కాలంలో ప్రత్యంగిరా దేవతను ఎక్కువగా ఆశ్రయించేవారు. అధర్వణ వేదంలో ఉన్న ప్రత్యంగిరా ఋక్కులు మంత్రోపాసకులలో బాగా ప్రసిద్ధి చెందినవి.

శ్లో॥ అభివర్తస్వ కర్తారం నిరస్తాస్మభిరోజసా।
తాం బ్రహ్మణాపనిర్ణుద్మః ప్రత్యక్కర్తారమృచ్ఛతు॥

శ్లో॥ యథావిద్యుద్ధతో వృక్షః ఆమూలాదనుశుష్యతి।
ఏవం స ప్రతితుష్యతు యోమే పాపం చికీర్షతి॥

ఎవరు మా మీద ప్రయోగం చేసి కృత్యను పంపించారో ఆ కృత్య తిరిగి వెళ్ళి వారినే చెందునుగాక. మా తేజస్సుచే ప్రయోగశక్తి - కర్తను అతని సంతానమును చంపునుగాక! పిడుగుపడిన చెట్టువలె నా కపకారము చేసినవాడు మాడిపోవునుగాక!

ఇలా ఉంటవి ఈ మంత్రములు. ఆత్మరక్షణకు వీనిని మించినవి లేవు. తంత్రగ్రంథాలలో ప్రత్యంగిరామంత్రాలు వేరే ఉన్నవి. సింహముఖిగా కొన్ని ధ్యాన శ్లోకాలు, భద్రకాళిగా కొన్ని ధ్యాన శ్లోకాలు కనిపిస్తున్నవి. ఏదైనా ఇది అగ్ని విద్య.

శత్రువును నాశనం చేయటానికి ఇటువంటి విద్యలను మన దేశంలోనే కాక అనేక దేశాలలో ఉపయోగించేవారిని ఆయా దేశాల వాఙ్మయాలలో కనిపిస్తున్నది. వైయక్తికంగానే కాక సామూహికంగా కూడా శత్రుసంహారానికి చైనా చక్రవర్తి స్థాన మాంత్రికుడు వజ్రవైరోజనీ విద్యను ప్రయోగించినట్లు ఆ శక్తి వెయ్యిమైళ్ళ దూరంలో తిరుగుబాటు సైన్యాన్ని పిడుగులు కురిపించినాశనం చేసినట్లు అక్కడి తంత్ర గ్రంథాలలోను గాథలలోను వ్రాయబడింది.

చండీ సప్తశతిలో రాజ్యభ్రష్టుడైన సురథుడు చండీవాక్షరిని ఉపాసించి ప్రతిరోజు తన రక్తంతో తర్పణం చేసి చాముండాదేవి అనుగ్రహాన్ని పొంది మళ్ళీ రాజ్యాన్ని పొందటం మాత్రమేకాక వచ్చే మన్వంతరంలో మనువు కూడా అయ్యే వరాన్ని పొందాడు.

ప్రాచీన వాఙ్మయంలో ఇటువంటి ఉదాహరణలు ఎన్నో చూడవచ్చు. అయితే ఈనాడు అటువంటివి సాధ్యమా? అనేది ప్రస్తుత ప్రశ్న. ఏనాడైనా సాధ్యమే. అయితే సురథునివంటి తీవ్రసాధకులు కరువైపోతున్నారు. జపహోమ యజ్ఞముల చేత యోగము పుట్టించగల మంత్రవేత్తలూ అంతగా కనపడటం లేదు. అంతర్దృష్టి కలిగిన వారు తక్కువ కావటం వల్ల ఏ సాధనచేస్తే ఫలితం వస్తున్నదో తెలియని స్థితి ఏర్పడింది.

మంత్రసాధన సిద్ధి విషయంలో అనుభవజ్ఞులైన శాస్త్రవేత్తలు కొన్ని విషయాలు చెపుతుంటారు. కాలప్రభావము కర్మప్రభావము చేత జరుగుతున్న ఈ ప్రపంచంలో రాజపదవులు-మంత్రిపదవులు మొదలైనవాటి విషయంలో జోక్యం చేసుకొని సాధించటం కష్టం. ప్రయత్నం మొదలు పెట్టేముందు ఆ వ్యక్తికి అనుకూల యోగం ఉన్నదా లేదా అనేది తెలుసుకొని తన ప్రయత్నం ఫలిస్తుందా లేదా అనేది దవతనడిగి తెలుసుకొని కార్యసాధన కుపక్రమించాలి గాని - ఆ రాజకీయ నాయకుడో - ఈ వ్యాపారవేత్తో ధనం కుమ్మరిస్తున్నాడు గదా అని యజ్ఞం చేస్తే అది ఫలించదు.

కర్మదేవతలు ఒక వ్యక్తిని రాజుగా నిర్దేశించి అతనికాయోగాన్ని ఇస్తున్నప్పుడు తద్భిన్నమైన వ్యక్తికి ఆ స్థానాన్ని ఇప్పించటానికి మాంత్రికుడు ప్రయత్నిస్తే అది సాధ్యమయ్యే పనికాదు. అంత యోగం పుట్టించటానికి ఈ మాంత్రికుడు దత్తాత్రేయుడు కాడు. మార్కండేయేశ్వరుడు

గాడు. అందువల్ల దేవతతో మాట్లాడగల అనుబంధం, అనుగ్రహం ఉన్నవాడు తెలిసి చేస్తే ఫలితం లభిస్తుంది అయితే అటువంటి వారు అంత తొందరగా లభించటం లేదు గదా. అందుకని ప్రయత్నం మానుకోవలసిందేనా అంటే మానుకోవలసిన పని లేదు. శ్రద్ధాళువులైన మంత్రవేత్తల చేత, యాజ్ఞికులచేత, పురోహితుల చేత న్యాయమైన కామ్యసిద్ధికి ప్రయత్నించవచ్చు. కర్మ – దానితో పాటు కాలం కూడా కలిసిరావాలి.

పెద్దలు ఇంకొకటి కూడా చెపుతారు. అసలు యోగం ఉన్నవాడికే సరియైన మాంత్రికులు, యోగులు, యాజ్ఞికులు లభించటం – వారు శ్రద్ధగా యజ్ఞం చేయటం జరుగుతుంది. ఈ దైవికమైన పురుషకారం చేయటం కూడా కర్మదేవతల సంకల్పంవల్లనే జరుగుతుంది. ఈ కర్మ సిద్ధాంతపు లోతులకు పోయిన కొద్దీ పురుషకారము యొక్క ప్రాధాన్యమెంత అనేది చాల గహనమైన విషయంగా కనిపిస్తుంది. అందువల్ల మానవుడు అవిశ్వాసి కాకుండా తీవ్రమైన పురుషకారం చేయాలి. అటువంటి వాని సంకల్పం న్యాయమైతే తప్పక నెరవేరుతుంది.

ఇక ప్రపంచ గమనానికి ఇబ్బంది కలిగించనివి, వేల లక్షల మందికి సంబంధించిన అంశాలలో జోక్యం చేసుకోనివి, అయిన మంత్రశక్తులు తొందరగా సిద్ధిస్తవి అని ప్రాజ్ఞుల అనుభవం. ఉదాహరణకు ఒక సాధకుడు ఏదో ఒక రోగనివారణ మంత్రాన్ని సాధించాడనుకోండి. తన దగ్గరకు వచ్చిన కొందరికి అతడు ఆరోగ్యాన్ని ఇవ్వగలుగుతాడు. దీనివల్ల లోకగమనంలో పెద్ద కల్లోలము – ఘర్షణ ఏమీ ఉండదు. అలా మరొకరు భూత భవిష్యద్వర్తమానాలను తెలిపే విద్యపొందాడనుకోండి. దానివల్ల కూడా సమాజానికి పెద్ద సంచలనమేమీకాదు. ఎప్పుడూ నమ్మేవారు – నమ్మని వారు ఉంటారు. కొందరు తమ జీవిత విశేషాలు ఈ వ్యక్తి దగ్గరికి వచ్చి తెలుసుకొంటారు. దానివల్ల కూడా ఏవో చిన్నచిన్న మలుపులు, మార్పులు తప్ప జనజీవన ప్రవాహగమనం ఆగదు. రాజులు మారరు–మంత్రులు మారరు. దేశగతులు మారవు. వాటిని మార్చే ప్రయత్నాలే అంతసులభంగా సిద్ధించవు. కాలపురుషుని సంకల్పమైన అద్వైత స్థితికి వచ్చిన యోగికి ఈ రాజులను, అధికారులను మార్చే ఇచ్ఛ ఉండదు. దానిక్రింది దశలో ఉండి కొంత సాధించిన చినయోగులు, చిన్న మాంత్రికులు – ఒకనికి పదవిని, మరొకరికి ఐశ్వర్యాన్ని, ఇంకొకరికి సామ్రాజ్యాన్ని, వేరొకరికి శత్రునాశనాన్ని చేసి పెట్టటానికి ప్రయత్నిస్తుంటారు. ఆ ప్రయత్నాలు కొన్ని ఫలిస్తవి. కొన్ని ఫలించవు. ప్రతిఫలితం వెనుక దైవికమైన కొన్ని కారణాలుంటవి. యోగము, సిద్ధి–ఇవన్నీ తదాశ్రితములు. ✷

# సంఖ్యా పరిభాష

అపౌరుషేయమైన మన వేద వాఙ్మయం ప్రపంచ వాఙ్మయ చరిత్రలో భారతదేశానికి ఒక ప్రముఖ స్థానాన్ని కల్పించింది. వేదాలు, ఇతిహాసాలు, పురాణాలు, నాటకాలు, కావ్యాలు, ఇలా మన వాఙ్మయం విస్తరించింది. ఈ వేద, ఇతిహాస, పురాణ, నాటక కావ్యాల్లో ఆర్థధర్మ ప్రబోధితాలైన, అనేక విషయాలు, ఉపాఖ్యానాలరూపంలో, కథల రూపంలో, సంభాషణల రూపంలో, సంవాదాల రూపంలో చెప్పబడ్డాయి. ఇలా చెప్పబడిన అనేక విషయాల్లో ఆయా సందర్భాల్లో ఒక విధమైన సంఖ్యాపరిభాష ఉపయోగించబడింది. ఉదాహరణకి 'సప్తలోకాల్ని రావణుడు ఆక్రమించాడు' 'అష్ట దిక్పాలకులు రావణునికి దాసోహం' అన్నారు. వీటిలో సప్తలోకాలు ఏవి? అష్టదిక్పాలకులు ఎవరు? అనేవి ప్రశ్నలు. ఈ సందేహ నివృత్తి కోసం, మన వాఙ్మయంలో తరచుగా ప్రస్తావించబడే సంఖ్యా పరిభాషని పురాతన గ్రంథాల నుండి సేకరించి క్రమంగా అందిస్తున్నాం.

– సేకరణ : జయంతి చక్రవర్తి

ఏకంసత్యం : సత్యము ఒకటే
ఏకవిశ్వం : ఒక ప్రపంచం

②

అయనద్వయం :
అయనాలు రెండు : ఉత్తరాయణం, దక్షిణాయనం

③

త్రిమూర్తులు : బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు
త్రిలోకాలు : స్వర్గ, మర్త్య, పాతాళాలు
త్రిగుణాలు : సత్త్వం, రజస్సు, తమస్సు
త్రికరణాలు : మనో, వాక్కు, కాయం
త్రయావస్థలు (అవస్థాత్రయం) : జాగ్రత్, స్వప్న, సుషుప్తి
క్రియాత్రయం : మణి, మంత్ర, ఔషధాలు
త్రికాలాలు : భూత, భవిష్యత్, వర్తమానాలు
ప్రాతర్, మధ్యాహ్న, సాయంత్రాలు
శక్తిత్రయం : ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి
ధనగతిత్రయం : దానము, భోగము, నాశము
తాపత్రయం : ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక

# విమానశాస్త్ర రహస్యాలు కొన్ని

డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

విమాన నిర్మాణం మరియు ప్రయోగాలకు సంబంధించిన రహస్యాలను వివరించే అతి విశిష్టమైన గ్రంథం ''యంత్ర సర్వస్వం''. ఈ గ్రంథకర్త భరద్వాజ మహర్షి.

ఈ 'యంత్ర సర్వస్వ' గ్రంథం వ్రాతప్రతి బరోడా గ్రంథాలయంలో వుంది. ఈ మహద్గ్రంథంలో విమానానికి సంబంధించిన రహస్యాలు కొన్ని ఇలా వున్నాయి.

**గూఢ :**

అనేక రహస్యాలలో 'గూఢ' అన్న రహస్యం అయిదవది. ఈ తంత్రం ప్రకారం వాయుశక్తుల ద్వారా సూర్యకిరణాలలోని అంధకార శక్తిని అనగా చీకటిని కలిగించే శక్తిని ఆకర్షించి, విమానానికి అనుబంధించిన వెంటనే విమానం శత్రువుకు కానరాకుండా పోతుంది. (ఈ తంత్ర రహస్యం ఇంకా నేటి శాస్త్రజ్ఞులకు అవగతం కాలేదు).

**అపరోక్ష :**

ఇది తొమ్మిదవ రహస్యం. దీనిమేరకు యంత్రంలో రోహిణి విద్యుత్ (ఒక విశేషమైన విద్యుత్) ప్రసారం చేసిన ఎదురుగ వచ్చే వస్తువులు బాగా కనిపిస్తాయి.

**సర్పగమన :**

22వ రహస్యం ప్రకారం దండ, వక్ర మున్నగు ఏడు రకాల వాయు మరియు సూర్యకిరణాలలోని శక్తులను ఆకర్షించి, విమాన ముఖభాగంలోని చలన కేంద్రానికి ప్రసరింపచేసి అందలి కీలక స్థానాన్ని నొక్కిన, విమానం పాములవలె వంకరవంకరగా సాగుతుంది.

**పరశబ్ద గ్రాహక :**

ఇరువది అయిదవ రహస్యం ప్రకారం సౌదామిని కలలో పేర్కొన్నట్లు విమానంలోని శబ్దగ్రాహక యంత్రం ద్వారా శత్రు విమానాల్లో జరిగే సంభాషణను ఆకర్షించి వినవచ్చును!

**రూపాకర్ష :**

ఇరువది ఆరవ రహస్యం ప్రకారం విమానంలోని రూపాకర్షక యంత్రాన్ని నడిపినప్పుడు, శత్రు విమానాలలోని వస్తువుల రూపం స్పష్టంగా కానవస్తుంది.

**దిక్ ప్రదర్శక**

ఇరువది ఎనిమిదవ రహస్యం ప్రకారం విమానం ముందు భాగంలోని 'దిశాంపతి' అను యంత్ర నాళికలోని పరికరం ద్వారా ఇతర విమానాలు వెళ్ళే దిక్కులను తెలుసుకోవచ్చు.

**స్తబ్ధక**

ముప్పది ఒకటవ రహస్యానుసారం విమానం ఎడమ భాగంలో వున్న సంధిముఖ అనునాళిక ద్వారా 'అపస్మార' అను పొగను కూర్చి, స్తంభన యంత్రం ద్వారా ఇతర విమానాలపై ప్రసరింపచేసిన ఆ విమానంలోని వ్యక్తులందరూ ప్రజ్ఞావిహీనులవుతారు!

**అనాలోకం లోచనమివ**
**అశాస్త్రం మనః కియత్ పశ్యేత్?**

వెలుతురులేని కన్నువలె, శాస్త్రంలేని మనస్సు ఎంతవరకు చూడ కలుగుతుంది?

**అకార్యవేదినః కిం**
**బహునాపి శాస్త్రేణ?**

ఏమి చేయాలో అర్థం చేసుకోలేని వానికి, ఎంత శాస్త్రజ్ఞానం ప్రయోజనమేముంటుంది?

**కర్షణ :**

ముప్పది మూడవ రహస్యం మేరకు మన విమానాలను ధ్వంసం చేసేందుకు శత్రు విమానాలు వస్తున్నప్పుడు, మన విమాన ముఖంలోని 'వైశ్వానర' నాళికలోని 'జ్వాలిని' అను ఇంధనాన్ని వెలిగించి, కీలక ప్రాంతాన్ని నొక్కిన శత్రు విమానాలు నాశనమవుతాయి.

పై వివరించిన తంత్రముల ప్రకారం మన పూర్వులకు విమాన నిర్మాణ రహస్యాలన్నీ కరతలామలకమని స్పష్టమౌతున్నది. వారివద్ద దూరదర్శిని (టెలిస్కోప్) వంటి యంత్రం వుండినట్లు 9వ రహస్యం తెలుపుతున్నది. వైర్‌లెస్, రేడియో యంత్రాల గురించి కూడా వారికి తెలిసినట్లు స్పష్టమవుతుంది. శత్రు విమానాలు ఏవైపునుండి వస్తున్నవన్న వాస్తవాన్ని 28వ రహస్యం తెలుపుతున్నది.

ఇటువంటి అద్భుత విషయాలు 'యంత్ర సర్వస్వం' మరియు అగస్త్యుడు వ్రాసిన 'శక్తి సూత్రం' ఈశ్వరుడు రచించిన ''సౌదామిని కళ'' భారద్వాజుల 'అంశుమతీ తంత్ర, ఆకాశశాస్త్రం, యంత్ర సర్వస్వం, శాకటాయనుల, వాయుతత్త్వ ప్రకరణమ్' నారదుల వారి 'వైశ్వానర తంత్రము' మరియు 'ధూమ్ర ప్రకరణ' గ్రంథాలలో కానవస్తున్నాయి.

*('కళ్యాణి' సౌజన్యంతో)*

# దేవుడనేవాడు వున్నాడా?

జి. అరుణ్ కుమార్

''ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'' అన్న వేదమతం

దేవుడు మొదట శబ్దరూపంలోవుండి ఆ తర్వాత విశ్వరూపం దాల్చాడని కొందరు అంటూంటే, కాదు భగవంతుడు తేజో రూపంలో ఉద్భవించి, ఆ తర్వాత, యావత్ సృష్టిని చేసాడని మరి కొందరంటున్నారు.

సృష్టి వేరు, సృష్టికర్త వేరు అని ద్వైతులంటుంటే, సృష్టి, సృష్టికర్త, సృష్టియందలి సకలచరాచరములు, అన్నీ ఒకే పదార్థమనీ, మధ్యలో వున్నది మాయ మాత్రమేననీ మాయావాదులైన అద్వైతులంటున్నారు. ఆయన మాయలో, ఆయన పడటం ఏమిటండీ, అర్థం లేకుండా అని మాయావాదం అర్థం కాని హేతువాదులడుగుతున్నారు.

సృష్టివుందంటే, సృష్టికర్త ఒకడు వుం డాలి కదా అని ఆస్తికులంటుంటే ఆ సృష్టికర్తనెవరు సృష్టించారని నాస్తికులడుగుతున్నారు.

''భగవంతుడు తనంతతానే ఉద్భవించాడు'' అనే ఆస్తికవాదాన్ని, దేవుడు తనంతతానే ఉద్భవించగలిగివుంటే, సృష్టి (విశ్వం) కూడా తనంతతానే ఉద్భవించివుండవచ్చుకదా అని నాస్తికులు ఖండించారు.

సృష్టియందలి జీవము, అజీవము, అనగా శక్తి మరియు పదార్థము, లేక **Energy and matter** లేక ప్రకృతి మరియు పురుషలుగా వ్యవహరింపబడే, చేతన, జడాలు రెండూ విడివిడిగా ఒకేసారి ఉద్భవించాయనేది జైనమతవాదనైతే, అనుక్షణమూ మారుతున్న యీ సృష్టిలో మార్పు చెందని ఒక పదార్థముందనీ, ''భ్రమలా అన్పించేది నిజం, నిజంలా అన్పించేది భ్రమ'' లాంటి నిగూఢమైన కొన్ని సిద్ధాంతాలు బౌద్ధమతవాదనలో స్ఫురించినప్పటికీ, గౌతమబుద్ధుడు యీ వాదనలకన్నా, సద్వర్తనము, నిర్వాణ సాధనామార్గాలకే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చాడు.

★ మనిషిని గురించి, చీమనడిగితే ఏమి చెపుతుంది? చీమయొక్క పరిమాణం, తెలివితేటలను గణనలోకి తీసుకుంటే, అది కనీసం మనిషి యొక్క పూర్తి స్వరూపాన్ని అర్థం చేసుకోలేదనేది అర్థమవుతుంది. అలాగే, విశ్వాత్ముడైన భగవంతుని అర్థం చేసుకోటానికి, అణుమాత్రులమైన మన శక్తి ఏపాటిది? కనుక యిలాంటి విషయాలు మన పరిమిత మేధకి అందని అపరిమితమైన, అద్భుతాలు అని అనేక మంది మేధావులు అంటుంటే, అసలు తర్కం ఎక్కడ అంతమవుతుందో ఆస్తికత్వం అక్కడ మొదలౌతుందని, స్వామీ వివేకానంద ఉద్ఘాటించాడు.

'దేవుడున్నాడా', లేడా 'అసలు ఆయన్నెవరు సృష్టించారు', యిలాంటి రకరకాల ప్రశ్నలతో తలలు బద్దలుకొట్టుకొనేవారికి అదికాదు బాబూ అసలు సమస్య, సంసారసాగరంలోపడి ఈదలేక బాధపడకుండా, జననమరణ చక్రభ్రమణంలోపడి నలిగిపోకుండా, అనివార్యమైన వ్యాధి, జర, మరణాది బాధల నివారణకు తరణోపాయం ఆలోచించటమే అసలు కర్తవ్యం అన్నాడు తథాగతుడు.

ఆత్మ, దాని స్వరూపమూ, ప్రపంచమునకూ, ఆత్మకూగల సంబంధములాంటి వాని గురించి వివరించమని అడిగిన ఒక శిష్యునికి ''విషబాణం గుచ్చుకుని బాధపడేవాడికి ముందు వైద్యం చేయటం మాని ఆ బాణం ప్రయోగించిన వాడెలా వుంటాడు, వాడి గుణగణాలేమై వుంటాయి, ఆ బాణం ఏ దిశ నుంచి వచ్చుంటుందనే మీమాంసలు అనర్థదాయకం, అనవసరం'' అంటున్న బుద్ధుడైన గౌతముడు చేసిన ఉద్బోధ కూడా మహోత్కృష్టమైనదే.

దేవుడున్నాడా, లేదా అనే విషయం కాసేపు పక్కన పెట్టి మానవ జీవితాన్ని గురించి కాసేపు ఆలోచిస్తే, అందరూ ఒప్పుకోవలసిన సత్యాలు కొన్ని స్ఫురించక మానవు.

1. మనం అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరగవు.
2. మనం సుఖాలుగా భావించే వాటన్నిటి వలన, సుఖంకన్నా దుఃఖమే ఎక్కువగా పొందుతున్నాం.
3. జీవితంలో ఎక్కువ భాగం ఆవేదన, ఆరాటాలలో గడుపుతున్నాం.
4. ఎంత భయపడినా, ఎంత వద్దనుకున్నా, మనం జననమరణ జరావ్యాధులనే భవభయాలనుంచి తప్పించుకోలేక పోతున్నాం.
5. అర్థంకాని ఈ సృష్టిలో, ఒక రహస్యాన్ని ఛేదించి సమాధానాన్ని సంపాదించాం అనుకొనే లోపలే వంద కొత్త సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి.
6. మన జీవితంలో, అతి ముఖ్యమైన పాత్ర మన మనసుదే. దానిని నియంత్రించగల్గితే, మనం అద్భుతాలు సాధించవచ్చు.

ఈ సత్యాల నేపథ్యంలో దేవుడున్నాడూ అనుకొంటే, ఏమిటి లాభం? లేడు అనుకొంటే

ఏమిటి లాభం? అని ఒక్కసారి ఆలోచిద్దాం.

దేవుడున్నాడు అనుకొంటే, ఒకసారి కాక పోతే ఒకసారైనా పాపభీతి కలిగి నేరాలు, నేర ప్రవృత్తి తగ్గుతాయి. పుణ్యం చేసుకొంటే, స్వర్గమో, మంచి జన్మమో పొందవచ్చునని, ఒకప్పుడుకాకపోతే ఒకప్పుడైనా యితరులకు సాయం చేయటంలాంటి మంచి పనులు చేస్తాము, ఎవరైనా ''భగవంతుడ్ని నమ్ము కొన్నాం. సర్వసమర్థుడైన ఆ భగవంతుడు మనల్ని కాపాడుతాడు'' అనుకుంటే కొండంత ధైర్యం కల్గుతుంది. తద్వారా అశాంతి తొలగు తుంది.

ఇహ, దేవుడు లేడనుకొంటే మూడొంతుల మంది ఎవరికి తోచిన ధర్మం వారు ప్రవచించి ఎవరిష్టం వచ్చినట్లు వారు ప్రవర్తిస్తారు. అప్పుడు 'Might is Right' అనే ఆటవిక ధర్మం ప్రబలుతుంది. దేవుడి భయం, ఆయన అవసరం, మంచి చెడులు బాగా తెలిసిన నాకు లేవు, అని ఎవరైనా అనుకొంటే వారు పొరపడి నట్లే. ఎందుకంటే వారు జ్ఞాను లైతే అయివుండ వచ్చు కానీ, తక్కినవారంతా అంతటి జ్ఞానులే కానక్కరలేదుకదా!

ఇప్పుడు జరుగుతున్న ఘోరాలన్నీ అలాంటి పాపభీతిలేనివారు చేసే దుర్మార్గాలే. ఇహ యిన్ని కోట్ల నక్షత్రాలు, గోళాలు, గ్రహాలు, వాటి గమనాలు, యిన్నికోట్ల జీవ రాసులు, వాటి సుఖములు, దుఃఖములు, కేవలం కాకతాళీయమేనా? ఇన్ని వింతలు, యిన్ని అద్భుతాలు, కేవలం యాధృచ్ఛికమేనా? ఇంత అందమైన అనంతమైన సృష్టి ఒట్టి అర్థంలేని ప్రక్రియ అనుకొంటే ఎంత హాస్యా స్పదంగా వుంటుంది? రసవత్తరమైన, వైవిధ్య మున్న, యిన్ని కథలు కలిగిన, యింత మంది మానవుల జీవితాలు, వారి సాధనలు, అన్నీ కేవలం అర్థంలేని సంఘటనలు అను కొంటే ఎంత అయోమయంగా వుంటుంది?

ఇహ వున్నాడనుకునే దేవుడ్ని నిజంగా చూడాలన్నా, దుఃఖదాయిని అయిన జనన మరణ చక్రభ్రమణం నుంచి, నిజంగా తప్పిం చుకోవాలన్నా, ''తత్వమసి'' లేక అదీనువ్వూ ఒకటే, 'అహం బ్రహ్మాస్మి' లేక ''నేనే పరబ్రహ్మను'' అనే అద్వైత సిద్ధాంతాలను తెలుసుకోవాలన్నా తపస్సనే మహా యజ్ఞం చేసి తీరాలని ఆయా మతాచార్యులే ప్రకటించారు.

ఆ పరబ్రహ్మ సాక్షాత్కారం పొందాలన్నా, ఆత్మని దర్శించాలన్నా అమృతమయమైన సత్యము స్ఫురించాలన్నా, తపస్సు తప్ప వేరే మార్గం లేదని మహాప్రవక్తలు, మహాను భావులు ఘంటాపథంగా వక్కాణిస్తున్నారు. ఎందుకంటే నిర్వచనీయమైన సుఖము, దుఃఖము, ఆనం

## స మహాన్ యో విపత్సు ధైర్యమవలమ్బతే

**ఆపదల్లో ధైర్యంగా ఉన్నవాడే మహాత్ముడు.**

దము, బాధలాంటివే అనుభవపూర్వకంగా తప్ప అర్థం చేసుకోలేరనేది అందరూ ఒప్పుకొన్న సత్యమైతే, అనిర్వచనీయమైన, పరమానంద స్వరూపమైన పరబ్రహ్మను, దర్శించాలన్నా, పరబ్రహ్మ స్వరూపమైన పరమానందాన్ని అనుభవించాలన్నా, కేవలం తపస్సు ద్వారా సంప్రాప్తించే, ఆత్మానుభవం తప్ప వేరే మార్గం లేదనేది నిర్వివాదాంశం.

అంటే ఆత్మ సందర్శన, లేక దేవుడున్నా డనే, ఏవాదాన్ని నిరూపించాలన్నా, తపస్సనబడే మహాసాగరమధనం తప్ప మరోమార్గం లేదు. అంతర్మధనాంతరం సత్యసందర్శనం తప్పక కలుగుతుంది అనేది నిజం.

సశాస్త్రీయంగా దేవుని చూడటానికి కానీ, అద్భుతమైన యీ సృష్టిరహస్యాన్ని తెలుసుకోవ డానికి కానీ, కొంత ప్రత్యేక సాధన చేయాలి అనే యదార్థవాదాన్ని పక్కనపెడితే, దేవుడున్నాడు అని నమ్మటానికి మాత్రం, ఒట్టి నమ్మకం తప్ప, మరే యంత్రము, తంత్రము, యోగము, సిద్ధులు, దీక్షలు, అర్హతలు, అక్కర్లేదు.

అలా నిస్సందేహంగా నమ్మగలిగిన, సూరదాసు, తుకారం, త్యాగరాజు, రామ దాసు, మీరా లాంటి భక్తులు దేవుడ్ని చూశారు మాట్లాడారు కూడా. భగవంతుడు వారినాదు కున్నాడు, వారి ఆర్తి తీర్చాడు. పైన ఉదహ రించిన వ్యక్తులెవరూ, కాల్పనిక పాత్రలూ కాదు, వివాదాస్పద పురుషులూ కారు. మనం ఒప్పుకొనే చరిత్రకారులు పేర్కొన్న మనలాంటి మనుషులే. వారి రచనలింకా సజీవంగానే వున్నాయి.

నమ్మకంలేని వారికి ఆ భగవంతుడు కూడా రాయిలా కనిపిస్తాడు. నమ్మకం వున్న వారికి, రాయి కూడా భగవంతునిలాగా కనిపిస్తుంది. అసలు యధార్థాన్ని తెలుసుకో డానికి, నమ్మకం ఎందుకు అని ఎవరైనా అడిగితే... మనం లేచి నిలబడాలన్నా, మనం గుమ్మం వరకు నడవా లన్నా, కనీసం మనం అనుకున్నది తప్పులు లేకుండా మాట్లాడాలన్నా, మనమీద మనకు నమ్మకం వుండాలి. నమ్మకం ఆవశ్యకత, పురాణ కర్తలచే ప్రవచింపబడి, చరిత్రకారులచే ఋజువు చేయబడి శాస్త్రజ్ఞులచే ఒప్పుకోబడిన నిర్వివాదాంశం. త్రికరణశుద్ధిగా నమ్మండి. భగవంతుడు తప్పక కనిపిస్తాడు.

గౌతమబుద్ధుడి మాటలతో ముగించా లంటే విశ్వాసమనే విత్తనం నాటి, నిర్మల చిత్తంతో దున్ని, తపస్సనే వర్షం కురిపిస్తే అమర త్వం అనే పంట పండుతుంది.

మనం కొలిచే దేవతలందరూ, మహా తప స్సంపన్నులైన ఎవరో ఒక మహాఋషికి దర్శన మిచ్చినవాళ్లే. భగవంతుని వివిధ రూపాలలో దర్శించిన ద్రష్టలున్నారు కానీ, ఆయన్ని సృష్టించగలిగిన స్రష్టలు ఎవరూ లేరు. ✦

# భారతదేశ చరిత్ర - VI

భారతీయ చరిత్రపుటల్లో నుండి సుమారు 1300 సంవత్సరాల చరిత్రను తొలగించడంలో కృతకృత్యులు కావడంలో తోడ్పడినవి ఒకటి మెగస్తనీసు 'ఇండికా', రెండు వేదార్థాలను తప్పుగా అన్వయించిన భాష్యాలు. వీటిని కొంచెం వివరంగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

కొందరు చరిత్రకారులు - స్వదేశీ, విదేశీ కూడా - మెగస్తనీసు వ్రాతలను అన్వయించవలసిన విధంగా అన్వయించక మన చరిత్రను తారుమారు చెయ్యడానికే వినియోగించారు. వారిచే సృష్టించబడ్డ 'ఆర్యు'లనే అభూత కల్పనకు జీవగర్రగా వినియోగించుకున్నారు.

## ఇండికాలో ఏముంది?

ఇదివరకే చెప్పుకున్నట్లు మెగస్తనీసు వ్రాసినట్లుగా చెప్పబడుతున్న అసలు ఇండికా దొరకలేదు. ఆయన తరువాతి గ్రీకు రచయితలు ఇండికా నుండి ఎత్తి వ్రాసినట్లుగా చెప్పబడుతున్న ఒకదానికొకటి సంబంధం లేని చిన్న చిన్న ఖండాలుగా లభ్యమైన ఈ సమాచారాన్ని Fragments అని పిలుస్తారు. మెగస్తనీసు మాటల్లోనే చెప్పుకోవాలంటే అతడు చూసింది తక్కువ. విని వ్రాసింది ఎక్కువ. అధిక భాగం భారతదేశ నైసర్గిక, సామాజిక స్వరూప వర్ణనమే. చారిత్రకాంశాలు తక్కువైనా వాటికి ఎంతో విలువ ఉంది.

## ఇండికాలోని చారిత్రకాంశాలు

''ఇండియన్లలోని పండితులు కొన్ని పురాణ కథలను చెప్పారు. వాటిని గురించి క్లుప్తంగా చెప్పడం సబబుగా ఉంటుంది. అత్యంత ప్రాచీన కాలంలో ఈ దేశంలోని ప్రజలు ఇంకా గ్రామాలలోనే నివసిస్తున్న కాలంలో, దేశానికి పశ్చిమాన ఉన్న ప్రాంతాల నుండి, గణనీయమైన సైన్యానికి నాయకత్వం వహిస్తూ డయోనిసాస్ (Dionysos) వచ్చాడు. అతని సేనల్ని ఎదరించడానికి పెద్ద పెద్ద నగరాలు లేవు కాబట్టి అతడు మొత్తం దేశాన్ని తన పాదాక్రాంతం చేసుకున్నాడు.''

''అయితే దేశంలో వేడి అధికంగా ఉండి, అతని సైన్యాలు జబ్బుల బారిన పడడం వల్ల, విజ్ఞుడైన డయోనిసాస్ తన సేనల్ని మైదానాల నుండి కొండ ప్రదేశాలకు తీసుకుపోయాడు. అక్కడి చల్లగాలుల వలన, నీటి ఊటల నుండి తాజాగా ప్రవహిస్తున్న జలాల వలన అతడి సైన్యాలు ఆరోగ్యాన్ని పుంజుకున్నాయి. అతడు తన సేనల్ని ఉంచి, కొలుకొనేటట్లు చేసిన ఆ స్థలం 'మేరోన్'గా పిలవబడింది. డయోనిసాస్ తన తండ్రి తొడ నుండి పుట్టాడనే గ్రీకుల పురాణ కథ ఇందులో నుండే వచ్చింది.''

''ఈవిధంగా చేసిన తరువాత అతడు తన దృష్టిని ఉపయోగకరమైన చెట్ల పెంపకం మీదికి మరల్చాడు. వాటి రహస్యాలను భారతీయులకు చెప్పాడు. ద్రాక్షసారా తయారుచేసే విధానాన్ని వాళ్లకు నేర్పాడు. మానవ సుఖ జీవనానికి తోడ్పడే ఇతర కళలను కూడా నేర్పాడు. అంతేకాక గ్రామాలను సౌకర్యవంతమయిన ప్రాంతాలకు మార్చి వాటి స్థానంలో పెద్ద పెద్ద నగరాలను కట్టించాడు. దైవపూజా విధానాలను, న్యాయ స్థానాలను, చట్టాలను ప్రవేశపెట్టాడు.''

''ఈవిధంగా అనేక గొప్ప కార్యాలను సాధించి, దైవంగా పరిగణింపబడి, అమర గౌరవాలను పొందాడు. అతడు తన సైన్యాలతో పాటు అనేకమంది స్త్రీలను కూడా తీసుకు వచ్చాడు. తన సేనలను యుద్ధాలలో నడిపేటప్పుడు డప్పులు, తప్పెటలు మొదలయిన వాయిద్యాలను ఉపయోగించాడు. సమస్త దేశాన్ని 52 సంవత్సరాల పాటు పాలించిన తరువాత వృద్ధాప్యం వల్ల చనిపోయాడు. ఆయన తరువాత అతని కుమారులు వారసులై రాజదండాన్ని అనేక తరాలకు అందించిన తరువాత రాజరికం రద్దు చేయబడి నగరాలలో ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఏర్పాటు చెయ్యబడ్డాయి.''

''హిరాకిల్స్ (Heracles) కూడా డయోనిసాస్ వంశంలోనే పుట్టాడని భారతీయులు చెప్పారు. అతడు కూడా గ్రీకుల వలె గద చేతపట్టి సింహపు చర్మం ధరించేవాడట. అతడు దేహబలంలో మనుష్యులనందరినీ మించి ఉండి భూమి నుండి, సముద్రాల నుండి సమస్త దుష్టప్రాణులను నాశనం చేశాడు.''

''అతడు అనేకమంది భార్యలను పెండ్లాడి అనేకమంది పుత్రులను, ఒక కుమార్తెను కన్నాడు. కొడుకులు యుక్తవయస్సుకు వచ్చిన తరువాత దేశాన్నంతటినీ సమభాగాలు చేసి ఆయా భాగాలకు తన కుమారులను రాజులుగా చేశాడు. తన ఏకైక కుమార్తెకు కూడా అదేవిధంగా కేటాయించి రాణిని చేశాడు. ఆమె పేరు పండైయ (Pandaia). పండైయ దేశపు

స్త్రీలు ఆరు సంవత్సరాల వయస్సులో పిల్లల్ని కనేవారు.''

''హిరాకిల్స్ అనేక నగరాలు కట్టించాడు. వాటిలో 'పేరెన్నిక' గన్నది, అతి గొప్పది పాలిబోత్రా (Palibotra). ఆ నగరంలో అనేక విశాల భవనాలను కట్టించాడు. అనేకమంది జనులను అక్కడ ఉంచాడు. నగరం చుట్టూ పెద్ద కందకాలను త్రవ్వించి వాటిని నీటితో నింపి నగరానికి రక్షణ కల్పించారు. మరణించిన తరువాత అతడు అమర గౌరవాలను పొందాడు. అతని వారసులు అనేక తరాలు పాలించి గొప్ప గొప్ప కార్యాలను సాధించారు. వారు భారతదేశపు ఎల్లలను దాటి ఆక్రమణకు దిగలేదు. వలసలను పంపలేదు. అనేక సంవత్సరాలు గడచిన పిమ్మట అలెగ్జాండరు దండయాత్ర చేసేవరకు అనేక నగరాలు ప్రజాస్వామ్య ప్రభుత్వాలను అవలంబించాయి. కొన్ని రాజరికాలుగానే మిగిలి పోయాయి.''

''మెగస్తనీసు' ఇండియా రాజు సాంద్ర కోట్టస్ ఆ స్థానాన్ని అనేకసార్లు దర్శించారు.''

పాలిబోత్ర గంగ, మరొక నది కలిసిన చోట ఉంది. ఈ నగర పౌరులు యావద్దేశంలోనూ పేరెన్నిక గలవారు. అది ప్రసై (Prasii) అనే రాజ్యంలో ఉంది. ఆ దేశపు రాజు, సాంద్ర కోట్టస్‌వలె, తన వంశనామంతో పాటు పాలి బ్రోతుల ఇంటి పేరును కూడా పెట్టుకోవాలి.''

''ఫాదర్ బేకస్ (Father Bacchus) నుండి అలెగ్జాండరు మధ్యలో 153 మంది రాజులు 6451 సంవత్సరాల 3 నెలలు రాజ్యం చేశారు.''

''ఫాదర్ తన తండ్రి తొడ నుండి పుట్టాడు.'' ✦

# నాలుగు పురుషార్థాలు ముగ్గురమ్మలు

- ఉష

చతుర్విధ పురుషార్థములనగా ధర్మ, అర్థ, కామ, మోక్షములు. ఈ విషయము తెలియని వారుండరు. ఒక పురుషుని జీవితంలో ముప్పు రమ్మలుంటారు.

1. మొదటి తల్లి... అతనికి జన్మనిచ్చిన తల్లి - ధర్మ, అర్థములు.
2. తన పిల్లల తల్లి - ధర్మ, అర్థ, కామములు.
3. జగన్మాత - మోక్షము.

ఒక పురుషుడు ధర్మముగా చరించి, అర్థ విషయంలో ఈ తల్లికి అవసరమైన సౌకర్యములను... అనగా ఆహారము, వస్త్రములు, తదితరమైన పదార్థములతో సంతృప్తిని కలిగించగలడు. అనగా ధర్మ, అర్థములనే మొదటి రెండు పురుషార్థములలో మొదటి అమ్మను అన్నివిధముల సంతృప్తి కలిగించవచ్చు.

ప్రతి పురుషుని జీవితంలో అతని పిల్లలకు జన్మనిచ్చిన తల్లి, అనగా అతని అర్థాంగి - రెండవ అమ్మ. ఈమెని సంతృప్తి పరచుటలో ధర్మముగా చరించుట, ఆర్థికమైన- అనగా వస్తు సంబంధమైన పదార్థములను ఆమె కోరికనను సరించి సంపాదించి పెట్టటం మొదటి రెండు విషయములు.

మూడవ పురుషార్థమైన కామ విషయ సహితముగా ఆమెను ఆహ్లాదపరచి ఆమె మనస్సును రంజింపజేసే కార్యక్రమములను నిర్వర్తించుట, అనగా జీవన ప్రధానమైన ధర్మ, అర్థ, కామములతో ఆమెను సదా సంతృప్తి పరచటమే అతని విధి. ఈ ఇద్దరు అమ్మలలో ఎవరు ముఖ్యులనే విషయం అంత చర్చనీయాంశము కాదు. ఇద్దరిని సంతృప్తిపరచే నేర్పరితనం సామరస్య భావము ఒక పురుషుని యొక్క చాతుర్యానికి నిదర్శనము.

ఈ విధంగా పైన ఉటంకించిన వ్యవహారం నడిపి తన జీవనంలో ఎదురైన ఇరువురు అమ్మలను ఆనందింపజేసిన మానవునికి, చతుర్థ విషయమైన మోక్షమును ప్రసాదించు జగన్మాత అతని అభ్యర్థనను పరిశీలించుటకు ఉద్యు రాలగును. ఎవ్వరైతే తన తల్లిని, భార్యను గౌరవించడో అతనికి మోక్షం సాధించే అవకాశం ఏ పరిస్థితిలోనూ లేదు. ఈ విధంగా ప్రతి ఒక్క జీవితంలో పురుషార్థములకు సార్థకత ప్రసాదించు అమ్మలు ముప్పురు.

**సమయవ్యయః కార్యారంభోరాభసికానామ్**

**తొందరపాటుగలవాళ్ళు (రాభసికులు) తలపెట్టే కార్యాల ఆదాయం, వ్యయం సమంగా ఉంటాయి.**

# ఉగాది



సంవత్సరానికి ఆదియైన చైత్రశుద్ధ పాడ్యమి – ఉగాది.

ఇదే మనకు నిజమైన కొత్త సంవత్సరారంభం. ప్రకృతిలో కూడా కొత్త మార్పులు ఈరోజు నుంచే గోచరిస్తాయి. కొత్త చిగుళ్ళు, కొత్త పూత... ఇలా అంతా కొత్తదనం ప్రత్యక్షమయ్యే ఈరోజున మనం పండుగ జరుపు కుంటాం.

మన ఆంధ్రులు ఔషధీ విలువలున్న ఉగాది పచ్చడి తిని ఈ పండుగ జరుపుకుంటారు.

శాస్త్రరీత్యా – ఈ రోజున బ్రాహ్మీ ముహూర్తంలో లేచి, అభ్యంగన స్నానం చేయాలి. ఇది సమస్త అరిష్టాలనీ నశింప జేస్తుంది. ఆ తరువాత నూతన వస్త్రధారణ, భగవత్పూజ, ఉగాది పచ్చడి భక్షణం, సంవత్సర ఫలశ్రవణం (పంచాంగ శ్రవణం) చేయాలి.

ఈ రోజున అభ్యంగన స్నానం పుణ్యప్రదం. అది చేయలేకపోవడం దోషమని కూడా ధర్మశాస్త్రం చెప్తోంది.

## చలివెందర

ఈ పాడ్యమి నుండే 'చలివెందర'లు ఏర్పాటు చేయాలి. దీనిని ''ప్రపాదానం'' అంటారు. బాటసారులకు, సర్వ ప్రాణులకు ఉష్ణశాంతి, దాహశాంతి జరిపేందుకు జలాలను అందజేసే ఏర్పాటు చేయాలి. ఇది ఎంతో పుణ్యకార్యం. మన సంస్కృతిలో 'సాటి మనిషికి సాయం', 'సేవ' – అనేవి ముఖ్యమైన అంశాలు. ఈ 'ప్రపాదానం' వంటి క్రియలలో అటువంటి క్షేమకాంక్ష ద్యోతకమవుతుంది.

**ప్రపేయం సర్వ సామాన్యా**
**భూతేభ్యః ప్రతిపాదితా ॥**
**ప్రదానాత్పితరస్సర్వే**
**తృప్యంతు చ పితామహాః ॥**
**అనివార్య మితోదేయం**
**జలం మాసచతుష్టయమ్ ॥**

కేవలం మనుష్యులకే కాక, ప్రాణులన్నిటికీ జలమిచ్చేలా ఏర్పాటుచేయాలి. ఈ 'చలివెందర' ఏర్పాటుచేసిన వారి పితరులు తృప్తి పొందుతారు. ఈవిధంగా 'ప్రపాదానం' ఈరోజు నుండి నాలుగు నెలల పాటు సాగించాలి – అని శాస్త్రబోధ.

## నీటికుండ దానం

ఈరోజు నుండీ నిత్యం ఒక విప్రునకు నీటి కుండను దానం చేయడం కూడా శ్రేష్ఠమే.

**ఏష ధర్మ ఘటో దత్తో**
**బ్రహ్మ విష్ణు శివాత్మకః ।**
**అస్య ప్రదానాత్ సకలా**
**మమ సంతు నిరామయాః ॥**

– అనే మంత్రంతో ఉదక కుంభం (నీటి కుండ) దానం చేయాలి.

ఈ చైత్ర పాడ్యమినే 'కల్పాది' అంటారు.

## నవరాత్రులు

సంవత్సరానికి ప్రారంభదినమైన ఈరోజు నుండితొమ్మిదిరోజులు 'వసంత నవరాత్రులు'. ఉత్తరాయణ పుణ్యకాలంలో వచ్చే ఈ సంవత్సరారంభపు తొమ్మిది రాత్రులు మహా మాన్వితమైనవి. ఈ నవరాత్రులలో 'దేవీ నవరాత్రి' పూజ, లేదా 'శ్రీరామనవరాత్రి' పూజ జరపడం ఆచారం.

సంవత్సరమంతా శుభప్రదంగా జరగడానికి దేవతలను ప్రసన్నం చేసుకొనేందుకై సంవత్సరాదిని శుభ సంకల్పాలతో, సత్కర్మాచరణతో, ఉత్సాహోల్లాసభరితంగా పవిత్రంగా నిర్వహించుకోవాలి.

ఇది – స్వస్తిశ్రీ చాంద్రమాన 'విక్రమనామ సంవత్సర' ప్రారంభం.

**అందరికీ ఉగాది శుభాకాంక్షలు.**

# స్వామీజీ–చార్వాకరావు

# యుగధర్మం

విశ్వనాథ పావనిశాస్త్రి

**పరిత్రాణాయ సాధూనాం**
**వినాశాయచ దుష్కృతాం**
**ధర్మ సంస్థాప నార్థాయ**
**సంభవామి యుగేయుగే ॥**

చదువుతున్న గ్రంథం మూశారు స్వామి సత్యానాథానంద. ఆశ్రమంలోని పిల్లలందరూ స్వామివారికి నమస్కరించి లేవబోయారు.

అంతలో రాబర్ట్, ''స్వామీ! ఒక చిన్న సందేహం'' అన్నాడు. ఏమిటన్నట్లు , స్వామి వారు అతడిని చూశారు.

''అధర్మం చెలరేగినప్పుడల్లా, భగవంతుడు అవతారం ఎత్తి, ధర్మాన్ని తిరిగి స్థాపిస్తానన్నాడు గదా!'' అన్నాడు రాబర్ట్.

''ఔను'' అన్నారు స్వామి.

''ధర్మ సంస్థాపన కోసం భగవంతుడు ఎత్తే అవతారాలే గదా, దశావతారాలు?''.

''ఔను.''

''దశావతారాలంటే – మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్క్యవతారాలే గదా!''

''ఔను.''

''యుగాలు నాలుగు గదా?'' అని అడిగాడు రాబర్ట్.

అతడు అడుగుతున్న సామాన్య ధోరణికి పిల్లలు ఆశ్చర్యంగా చూడసాగారు.

స్వామివారు సాలోచనగా, ''ఔను, కృత, త్రేతా, ద్వాపర, కలియుగములంటూ నాలుగు.'' అన్నారు.

రాబర్ట్, ''కృతయుగంలో ధర్మం, నాలుగు పాదాలతో నడుస్తుందంటారు గదా?'' అని అడిగాడు మళ్ళీ.

''ఔను'' అన్నారు స్వామివారు తల ఊపుతూ.

''అలాగే త్రేతాయుగంలో, ధర్మం మూడు పాదాలతో – ద్వాపరయుగంలో రెండు పాదాలతో నడుస్తుంది గదా!''

''ఔను.''

''కలియుగంలో, ప్రధానంగా అధర్మమే నడుస్తుంది గదా?''

''ఔను'' అన్నారు స్వామివారు ఓపికగా.

''దశావతారాలలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన అవతారాలు కృత యుగంలో ఎత్తినవే గదా?'' అన్నాడు.

అంతవరకు వింటున్న కుఱ్ఱవాళ్ళలో ఒకతను, ''ఆ మాటకొస్తే బుద్ధావతారం కూడా కృతయుగంలోదే!'' అన్నాడు.

రాబర్ట్ యొక్క సందేహం ఏమిటో అర్థమై పోయిన స్వామివారు, చిఱునవ్వు నవ్వుతూ, ''ఇప్పుడు అతగాడి ప్రశ్న అది కాదు'' అన్నారు.

రాబర్ట్ తల తిప్పుతూ, ''ఔను స్వామీ! ధర్మం నాలుగు పాదాలా నడిచే కృతయుగం లోనే, భగవంతుడు అవతారాలు ఎత్తవలసి వస్తే, ఇక ఆ యుగంలో ధర్మం ఎంతవరకు సాగినట్లు? ఆ లెక్కన కలియుగంలో ఎన్ని అవతారాలు ఎత్తాలి? కాని కలియుగంలో ఒక్క అవతారమే అంటున్నారు గదా? మరి... అధర్మం ఆ యుగంలో ఎక్కువ ఉందా, ఈ యుగంలో ఎక్కువ ఉందా?... నాకు అన్వయం కుదరడం లేదు'' అన్నాడు.

అప్పుడే వచ్చిన చార్వాకరావు, ''అట్లా అడుగు'' అన్నాడు.

''ఏమిటి యివాళ యింత ఆలస్యంగా వచ్చావ్?'' అన్నారు స్వామివారు.

''ఏం లేదు. మా నాన్న హఠాత్తుగా కళ్ళు తిరిగి పడిపోయాడు. డాక్టర్‌ని తీసుకు రావడానికి వెళ్ళాను. ఆలస్యమైంది'' అన్నాడు చార్వాకరావు.

''అదేమిటయ్యా? మీ నాన్న చాలా ఆరోగ్య మైన మనిషి కదా!'' అన్నారు స్వామి.

ఔను స్వామీజీ! కాని పెద్దవాడౌతున్నాడు గదా! ఈమధ్య అప్పుడప్పుడు ఇలా అవుతోంది. డాక్టరు వచ్చి మందిచ్చి వెళ్ళుతున్నాడు'' అన్నాడు చార్వాకరావు.

''అలాగా! అన్నట్లు మీ నాయనమ్మ పక్షవాతం వచ్చి నాలుగేళ్ళుగా మంచంలో ఉంది గదా! ఆవిడ కెలా ఉంది?'' అని అడిగారు స్వామి.

''అల్లాగే ఉంది? ఏమీ మార్పు లేదు'' అన్నాడు చార్వాకరావు.

''మరి... డాక్టరు ప్రతినిత్యం వచ్చి చూస్తున్నాడా?'' అని అడిగారు స్వామి.

''ఆ... రోజూ చచ్చేవాడికి ఏడ్చేవాడెవడని!... ఏం, చూస్తాడు?'' అన్నాడు చార్వాకరావు.

''అదోయ్ రాబర్ట్ సంగతి! అర్థమైందా?'' అన్నారు స్వామి.

అర్థమైంది అన్నట్లుగా మెరిసే కళ్ళతో తల ఊపాడు రాబర్ట్.

''ఏమిటి అర్థమైంది?'' అని అడిగాడు చార్వాకరావు అయోమయంగా.

''నువ్వేదో 'అడుగు' అన్నావ్‌గదా! అతడు అడక్కుండా, అతని సందేహానికి సమాధానం నువ్వే చెప్పావ్!'' అన్నారు స్వామి.

''ఎప్పుడు?'' అని అడిగాడు చార్వాకరావు.

''ఇప్పుడే'' అన్నారు స్వామివారు.

''ఎలా?''

''ఎలా అయితే నీకెందుకు? అసలు నీకు అవతారాలూ, ధర్మాధర్మాలూ, యుగాలూ వీటిమీదే నమ్మకం లేదుగా!'' అన్నాడు స్వామివారు.

''నమ్మకం లేదనుకోండి. కానీ మీకుంది గదా! మీరెలా సమాధానం చెపుతారో విందామని.''

''నేనెలా చెపితే నీకెందుకు?''

''అలా కాదు, చెప్పండి.''

స్వామివారు నవ్వుతూ, ''ఓరి మూర్ఖుడా! నీకు సగం ఆస్తికం, సగం నాస్తికం, సందేహాలు పీడిస్తూ ఉంటాయి. సమాధానాలు కావాలి. కాని, అవి ఒప్పుకోవడానికి మళ్ళీ మనసొప్పదు. నీ కర్మ. అయినా విను, చెప్తాను. ఇది చాలా తేలిక. ఆరోగ్యవంతుడైన మీ నాన్నకి కొద్దిగా జబ్బు చేసినా డాక్టర్ వెంటనే వస్తాడు. మంచంలో పడ్డ మీ నాయనమ్మని చూడ్డానికి రాడు. చివరికి వచ్చిందని చెప్పడానికి ఒక్కసారే వస్తాడు. అలాగే - ధర్మం నాలుగు పాదాలా నడిచే కృతయుగంలో, ధర్మానికి ఏ మాత్రం హాని జరిగినా వెంటనే భగవంతుడు అవతారాలు ఎత్తాడు. అందుకే ఆ యుగంలో అవతారాలు ఎక్కువ. త్రేతాయుగంలో పరశురామ రామావతారాలు రెండే. కలి అంశ సగానికి సగం ఉన్న ద్వాపర యుగంలో కృష్ణావతారం ఒక్కటే. అలాగే కలియుగం కూడా'' అని లేచారు స్వామివారు. ✦




# పాఠమ్- I

సంస్కృతభాషకు ''విసర్గము'' ప్రాణము. దానిని ''హ'' కారముగా పలుకవలెను. విసర్గమునకు వెనుక ఏవిధమైన అచ్చు ఉంటుందో అదే అచ్చును పలుకవలెను.

**ఉదా : -** **రామః - రామహ**

**హరిః - హరిహి**

**సాధుః - సాధుహు**

సంస్కృత భాషలో శబ్దమునకు మూడు రకములైన లింగభేధములు కలవు. అవి పుంలింగము. స్త్రీలింగము–నపుంసక లింగము. వాటికి కొన్ని ఉదాహరణలు చూద్దాం!

## నామవాచకములు

| పుంలింగము :- | స్త్రీలింగము : | నపుంసకలింగము : |
|---|---|---|
| రామః - రాముడు | సీతా - సీత | పుష్పమ్ - పూవు |
| కృష్ణః - కృష్ణుడు | రమా - రమ | ఫలమ్ - పండు |
| గోవిందః - గోవిందుడు | రాధా - రాధ | గృహమ్ - ఇల్లు |
| షణ్ముఖః - షణ్ముఖుడు | ఉషా - ఉష | ధనమ్ - ధనము |
| మార్కండేయః - మార్కండేయుడు | శ్రీవల్లీ - శ్రీవల్లి | పత్రమ్ - ఆకు |
| శక్తిధరః - శక్తిధరుడు | దేవసేనా - దేవసేన | తృణమ్ - గడ్డి |
| మనోహరః - మనోహరుడు | అన్నపూర్ణా - అన్నపూర్ణ | చక్రమ్ - చక్రము |
| కార్తికేయః - కార్తికేయుడు | మాధవీ - మాధవి | వాహనమ్ - వాహనము |
| సుధాకరః - సుధాకరుడు | నదీ - నది. | పుస్తకమ్ - పుస్తకము |
| శ్రీనివాసః - శ్రీనివాసుడు | - కలము | అన్నమ్ - అన్నము |

మాధవః - మాధవుడు
మృత్యుంజయః - మృత్యుంజయుడు
దుష్టః - దుష్టుడు
మార్జాలః - పిల్లి
సూకరః - పంది
సర్పః - సర్పము
కాకః - కాకి
వృక్షః - చెట్టు
బాలః - బాలుడు
ప్రశ్నః - ప్రశ్న
ఉత్తమః - ఉత్తముడు

లతా - తీగ
దోలా - ఊయల
బాలా - బాల
మాలా - మాల
వీణా - వీణ
గంగా - గంగ
బాలికా - బాలిక
ఉమా - ఉమ
శైలజా - శైలజ
శ్వేతా - శ్వేత
శిల్పా - శిల్ప
పుష్పలతా - పూలతీగె

వనమ్ - తోట, అడవి
విమానమ్ - విమానము
మిత్రమ్ - స్నేహితుడు
క్షేత్రమ్ - క్షేత్రము
జలమ్ - నీరు
ఆభరణమ్ - నగ, ఆభరణము
జ్ఞానమ్ - జ్ఞానము, తెలివి
శకటమ్ - బండి
ఘృతమ్ - నెయ్యి.

# సర్వనామములు

అహం - నేను (ఉత్తమ పురుష - 1st Person)
త్వం - నీవు ( మధ్యమ పురుష - 2nd Person)
సః - ఆతడు, వాడు (ప్రథమ పురుష - 3rd Person పుంలింగము)
సా - ఆమె, అది (ప్రథమ పురుష - 3rd Person స్త్రీ లింగము)
ఏషః - ఇతడు, వీడు
ఏషా - ఈమె, ఇది
ఏతత్ - ఇది (ప్రథమ పురుష - 3rd Person - నపుంసకలింగము)
తత్ - అది
కః - ఎవడు?
కా - ఎవతె?
కిమ్ = ఏది, ఏమి, ఏమిటి?

# అవ్యయములు :

వీటికి లింగ, వచన, విభక్తి భేదములు లేవు. ఇవి ఎప్పుడూ మార్పు చెందవు.

అత్ర - ఇక్కడ, ఇక్కడకు
తత్ర - అక్కడ, అక్కడికి
కుత్ర? - ఎక్కడ?
ఇదానీం - ఇప్పుడు
తదా - అప్పుడు

కదా? - ఎప్పుడు?

అద్య - నేడు, ఈరోజు

నక్తం - రాత్రి

దివా - పగలు

శనైః - మెల్లిగా , నెమ్మదిగా

శీఘ్రం - తొందరగా

# ప్రశ్నావాచకములు

కః ఎవడు?

కా - ఎవతె?

కిం - సది, ఏమిటి, ఎందుకు?

కుత్ర - ఎక్కడ?

కదా - ఎప్పుడు?

కథం - ఎటు? ఎలా?

సంస్కృత భాషయందు క్రియా పదము (Applied Verb) లన్నింటినీ ధాతువు (Root Verb) నుండి గ్రహించవలెను. ధాతువును మొట్టమొదటగా వర్తమాన కాల, ప్రథమ పురుష, ఏకవచనములో గుర్తించి దాని నుండి ఇతర రూపములను ఏర్పరచుకోవలెను. అది తేలిక పద్ధతి.

# క్రియా పదములు

వర్తమాన కాల, ప్రథమ పురుష, ఏకవచన క్రియా పదములు. స్త్రీ పురుష వాచకములు రెండింటికీ యివి వర్తిస్తాయి.

ఉదా : అగుచున్నాడు, అగుచున్నది. ఇదే విధముగా మిగిలినవన్నీనూ.

భవతి – అగుచున్నాడు

పఠతి – చదువుచున్నాడు

లిఖతి – వ్రాయుచున్నాడు

వదతి – మాట్లాడుచున్నాడు

చలతి – నడచుచున్నాడు

పతతి – పడుచున్నాడు

ఉత్పతతి – ఎగురుచున్నాడు

ధావతి – పరిగెత్తుచున్నాడు

నయతి – తీసికొనిపోవుచున్నాడు

ఆనయతి – తీసికొనివచ్చుచున్నాడు

దదాతి – ఇచ్చుచున్నాడు

గృహ్ణాతి – తీసికొనుచున్నాడు, పుచ్చుకొనుచున్నాడు

ఖాదతి – తినుచున్నాడు

పిబతి – త్రాగుచున్నాడు

పశ్యతి – చూచుచున్నాడు

గచ్ఛతి – వెళ్ళుచున్నాడు

ఆగచ్ఛతి – వచ్చుచున్నాడు

ఆరోహతి – ఎక్కుచున్నాడు

అవరోహతి – దిగుచున్నాడు

తాడయతి – కొట్టుచున్నాడు

మారయతి – చంపుచున్నాడు

క్రీడతి – ఆడుచున్నాడు

కరోతి – చేయుచున్నాడు

క్రందతి – ఏడ్చుచున్నాడు

హసతి – నవ్వుచున్నాడు

నిద్రాతి – నిద్రించుచున్నాడు

జానాతి –తెలిసికొనుచున్నాడు

స్మరతి – స్మరించుకొనుచున్నాడు

విస్మరతి – మరచిపోవుచున్నాడు

తరతి – దాటుచున్నాడు

సూచన : వీటిద్వారా మధ్యమ పురుష ఏకవచనం, ఉత్తమ పురుష ఏకవచనం రూపములు తయారుచేసుకోవచ్చు. ఎలాగంటే మధ్యమ పురుషకి 'సి' అనియు, ఉత్తమ పురుషకి ''అమి'', లేదా ''యామి'' అనియు కలుపుకుంటే సరిపోతుంది.

ఉత్తమ - ఉదా : భవామి (అగుచున్నాను), పఠామి (చదువుచున్నాను), ఆరోహయామి (ఎక్కుచున్నాను)

మధ్యమ - భవసి (అగుచున్నాడు, దదాసి (ఇచ్చుచున్నాను) హససి (నవ్వుచున్నావు)

సంస్కృత భాష తేలికగా వ్రాయడానికి గాని, మాట్లాడడానికి గాని, ముందుగా ఈ సర్వనామములు అవ్యయములు బాగా గుర్తుంచుకోవాలి. నిత్యం వాడుకునే కొన్ని క్రియా పదములను కూడా గుర్తుంచుకోవాలి. దానికి ఈ క్రింది విధంగా అభ్యాసం చేసుకుంటూ ఉండాలి.

# అభ్యాసం - I

## చిన్న వాక్యములు

### పుంలింగము :

అహం రామః - నేను రాముడను

త్వం శివః - నీవు శివుడవు

సః కృష్ణః - వాడు (అతడు) కృష్ణుడు

ఏషః - గోవింద - వీడు (ఇతడు) గోవిందుడు

సః వృక్షః - అది వృక్షము

ఏషః సూకరః - ఇది పంది

(వృక్షము సూకరము వంటి మాటలు సంస్కృతంలో పుంలింగవములు ఇలాంటి కొన్ని శబ్దములు తర్వాత తర్వాత తెలుసుకుందాం)

### స్త్రీ లింగం :

అహం సీతా - నేను సీతను

త్వం రాధా - నీవు రాధవు

సా శ్రీవల్లీ - ఆమె శ్రీవల్లి

ఏషా దేవసేనా - ఈమె దేవసేన

సావీణా - అది వీణ

ఏషా డోలా - ఇది ఊయల

(వీణా, డోలా వంటి మాటలు సంస్కృతంలో స్త్రీ లింగములు)

### నపుంసక లింగము :

తత్ పుష్పమ్ - అది పుష్పమ్

ఏతత్ ఫలమ్ - ఇది పండు

అహం, త్వం, సః, ఏషః, సా, ఏషా, తత్, ఏతత్‌లను ఉపయోగించి, వెనక యిచ్చిన నామవాచక శబ్దములతో పైవిధముగా చిన్న చిన్న వాక్యాలను అభ్యాసం చెయ్యండి.

# BHARATHISM



*Namaste Sarade Devi, Veena Pustaka Dharini,*
*Tvamaham Prarthaye nityam, Vidyadanam pradehi me.*

*Dr. JayaVenugopal*

## Padma Purana



It has
Six Skandas
and
55000
verses.

## Varaha Purana

Story by Varaha .
It describes places and mantras.
It has 14000 verses.



## Puranas based on Brahma

Brahma purana
Brahmanda purana
Brahma Vaivarta purana



Markan-deya purana
Bhavisya purana
Vamana purana

## Brahma Purana



Teachings of Brahma to Daksa.
It has 25000 verses.
It is called Adi Purana

## Brahmanda Purana

Origin of universe as told by Brahma.
It has 12000 verses.
It is called Uttama Purana.



## Markendeya Purana



Story of Indra, Surya, Agni.
There are praises of Durga.
There are 9000 verses.

## Bhavisya Purana

Surya narrated it to Manu.
There are statements about future.
There are praises about Surya, Agni and Naga.
There are 14000 verses.

## Vamana Purana



Similar to Varaha.
It describes Siva and Parvathi marriage.
It has 10000 verses.

## Puranas based on Siva

Vayu purana
Linga purana
Skanda purana



Agni purana
Matsya purana
Kurma purana

## Vayu Purana

Told by Vayu
Composed in 5th or 6th century AD.
There are praises of Siva
There are 14000 verses.



# Linga Purana



Instructions of Siva onDharma, sitting in the form of Linga.

28 forms of Siva are described.

There are 12000 verses.

# Skanda Purana

It is narrated by Skanda
It narrates the story how Taraakasura was slained by Skanda.
There are 8 4 000 verses.



# Agni Purana

Agni deva instructed sage Vasistha.
It speaks about Sivalinga and Durgadevi.
This book deals with arts and science, astronomy, and architecture.
It contains 12000 verses.






# Kurma Purana

Kurma narrated to Indradyumna.
Speaks of seven islands, and 7 oceans



# THANK YOU
# PACT



# హోలీ పండుగ

సూర్యనారాయణ

హోలీ అనగానే ముందుగా గుర్తుకు వచ్చేవి రంగులు. ఈరోజున జనులంతా పిల్లలూ పెద్దలూ అనే భేదం లేకుండా, ఆడామగా భేదం లేకుండా ఒకరిపై ఒకరు రంగులు చల్లుకుంటూ ఆనందిస్తారు.

ఫాల్గుణ పౌర్ణమీ దినాన ఈ పండుగ జరుపుకోవడం ఆచారంగా వస్తోంది. ఇంచుమించు యావద్భారతదేశంలోనూ ఈ పండుగను జరుపుకుంటున్నా, ఇది ఉత్తర భారతదేశంలోనే అధిక ప్రాచుర్యం పొందింది. ఈ పండుగనే వసంతోత్సవమని, డోలికోత్సవమనీ కూడా పిలుస్తారు. హోలిక అనే రాక్షసిని తృప్తిపరచేందుకు చేసే ఉత్సవంగా కూడా చెప్తారు. కామదహనమనీ అంటారు.

## కామదహనం

దక్షయజ్ఞంలో సతీదేవి త్యాగం చేసిన తరువాత ఆమె హిమవంతుని కుమార్తె పార్వతిగా మళ్లీ జన్మించింది. పరమశివుని మనస్సును పార్వతి పైకి మళ్లించాలనే తలంపుతో దేవతలు మన్మథుణ్ణి పిలిచి దేవకార్యం నెరవేర్చామని కోరారు. పార్వతీదేవి శివునికి సపర్యలు చేస్తున్న సమయంలో రతీ మన్మథులు అక్కడకు వస్తారు. మన్మథుడు తన పూలబాణం ప్రయోగించి, ఆత్మధ్యానమగ్నుడైన ఈశ్వరుని మనస్సును కామ వికారానికి లోను చేస్తాడు. ఈ విషయాన్ని తెలుసుకున్న పరమశివుడు తన మూడవ కన్ను తెరచి కాముణ్ణి భస్మం చేస్తాడు. రతీదేవి దుఃఖించి శివుణ్ణి వేడుకొనగా ఆయన మన్మథుడు శరీరం లేకున్నా సజీవుడై ఉండే వరం ఇస్తాడు. ఈ కామదహనాన్నే జనులు ఫాల్గుణ పౌర్ణమీ దినమున పండుగగా జరుపుకోవడం ఆచారంగా వచ్చింది.

## డోలికోత్సవం

మన దేశంలో బెంగాలు రాష్ట్రంలో హోళీనాడు శ్రీకృష్ణుని విగ్రహాన్ని ఉయ్యాలలో వేసి ఊపి, పూజించే ఆచారం ఉంది. ఈరోజుననే శ్రీకృష్ణుడు డోలికలో ఎక్కినట్లు శాస్త్రవచనం.

## వసంతోత్సవం

ఈ పండుగకు వసంతోత్సవమని కూడా పేరుంది. దీన్ని గురించి 'నిర్ణయ సింధువు'లో ఈవిధంగా ఉంది.

**ప్రవృత్తే మధుమాసే తు ప్రతిపద్యుద్యతే రవౌ ।**
**కృతా చావశ్యకార్యాణి సంతర్ప్య పితృదేవతాః ॥**

వందయేద్హోలికా భూమిం సర్వదుఃఖోపశాంతయే.

మధుమాసం అంటే చైత్రమాసం. ఉత్తర దేశాచారం ప్రకారం మాసాంతం పౌర్ణమితో అవుతుంది. ఆ తరువాత దినం చైత్ర పాడ్యమి. ఆరోజున పితృదేవతలను సంతృప్తి పరచి హోలికా భూమికి నమస్కరించితే సర్వ దుఃఖాలు తొలగుతాయట.

అంతేకాక సర్వ లోకాల్లో ఉండేవారి మనస్సులలో నివసించే వాడగు కాముని రతీదేవితో సహా చైత్రోత్సవ దినాన పూజిస్తే సౌభాగ్యం, రూపం, సంతానం, సౌఖ్యం కలుగుతాయని భవిష్యత్పురాణంలో చెప్పబడింది.

## హోలిక

ఈ కథ భవిష్యత్పురాణంలో చెప్పబడింది. కృతయుగంలో రఘునాథుడనే సూర్య వంశపు రాజు ఉండేవాడు. అతడు అనేకమంది దుర్మార్గులను శిక్షించి జనరంజకంగా పరిపాలన సాగిస్తున్నాడు. అకస్మాత్తుగా హోలిక అనే పేరుగల రాక్షసి అతని రాజ్యంలోని పిల్లలను బంధించడం ప్రారంభించిందట. ఈ విషయాన్ని ప్రజలు రాజుగారితో మొరపెట్టుకున్నారు. ఆ సమయంలో అక్కడికి వచ్చిన నారదుడు ''హోలికను ఫాల్గుణ పౌర్ణమి రోజున పూజించినచో శిశువులకు ఏ విధమైన ఆపదలూ రావని'' శలవిచ్చాడు. అది విన్న రఘునాథుడు నారదుడానతిచ్చిన విధంగా చెయ్యమని ప్రజలను ఆదేశించాడట. అప్పటినుండి ఈ ఉత్సవం చేయబడుతోంది.

ఈ హోలికా పూజ రాత్రి కాలంలోనే చేయాలి. అంతేకాదు హోలి రోజు రాత్రి శిశువులను ఇండ్లలోపలనే ఉంచి జాగ్రత్తగా చూసుకోవాలి. ఇది పురాణ వచనం.

ఈ హోలిక హిరణ్యకశిపుని చెల్లెలనీ, ప్రహ్లాదుని అగ్నిలో త్రోయించినప్పుడు ఈమె కూడా ప్రహ్లాదునితో పాటు అగ్నిలో ప్రవేశించినదని, అప్పుడు హోలికయే భస్మమయిందని ఆనాటినుండి పిల్లల రక్ష కొరకు హోలికను పూజించే ఆచారం వచ్చిందని ఒక కథ ఉంది.

ఈ పండుగను గురించి వాత్స్యాయన మహర్షి తన కామసూత్రాల్లో కూడా వివరించాడు. ఆనాడు ప్రజలు పిచికారీలతో రంగులు చిమ్ముకుంటూ, రంగుల పొడిని చల్లుకుంటూ వినోదించేవారని ఆయన చెప్పారు.

ఈ పండుగను ఎవరు ఏవిధంగా ఆచరించినా ఆధునిక కాలంలో హోళీ ఉత్సవం రకరకాల నీచపు చేష్టలతో వెర్రితలలు వేస్తున్నా, ఈ పండుగను జరుపుకోవడం వెనుక ఉన్న భావం అలౌకికమైనది. ఈ పండుగ ప్రేమాదరాలకు ప్రతీక. అలౌకిక ప్రేమకు ప్రతీక. కరుణాతిశయానికి ప్రతీక.

ఎగసిపడ్డ ఎర్రని పొడితో ఆకాశం అరుణను దాల్చిందని హోళీని వర్ణిస్తూ అన్నాడో కవి. అసలు హోళీలో ఈ రంగులేమిటి? ఆ రంగుల్లో సమస్త జగత్తు రంగులీనడమేమిటి?

సమస్త జగత్తు ఆ పరమేశ్వరిని స్వరూపమే. మామూలు కంటికి అందులోని భౌతికత మాత్రమే గోచరిస్తుంది. ఆమె సింధూరారుణ విగ్రహ. అరుణవర్ణం కరుణాతిశయానికి ప్రతీక. అందుకే ఆమెను ''అరుణాం కరుణా తరంగితాక్షీం'' అని ప్రార్థిస్తారు. ఎగసిపడ్డ సింధూరపు పొడితో జగత్తు అరుణవర్ణం దాల్చడమంటే ఆ అమ్మ ఈ భౌతిక ప్రకృతిలో ప్రకటన మవడమే. సమస్త జగత్తు ప్రేమ, కరుణ రసాల్లో మునిగిపోతుందన్న మాట.

శ్రీకృష్ణుడు కరుణాస్వరూపుడు. ఆయన జీవులను తమ తమ కర్మ ఫలాలనుభవించడానికి ఈ సంసారాన పడవేసినా, వారిపై కరుణ కలిగి, వారు తనను తిరిగి చేరుకోవడానికి సాధనంగా ప్రేమను ఇచ్చాడు. ప్రేమ ప్రతి ప్రాణిలోనూ ఉంది. మనుష్యులు, దేవతలు, రాక్షసులు, పశుపక్ష్యాదులు - అన్నింటా ఉంది. ఆ ప్రేమ ఎంత అద్భుతమైనదంటే - అది ఉన్నచోట అంతరాలుండవు. ఏవిధమైన భేదభావం కల్పనామాత్రంగా కూడా ఉండదు.

హోళీ పండుగ ప్రేమకు, కరుణకు ప్రతిరూపం. అందుకే ఆరోజున ఎంతటి శత్రుత్వాలు కూడా చెరగిపోతాయి. సమస్త భేద భావాలు చెరిగిపోతాయి. ధనికుడు - బీదవాడు, శత్రువు - మిత్రుడు ఈ భేదాలన్నీ చెరిగిపోతాయి. ప్రతి వ్యక్తి ఎదుటివాణ్ణి ప్రేమతో ఆలింగనం చేసుకుంటాడు.

'హోళీ' సమస్త శత్రుత్వాల్ని వదులుకోవలసిన రోజు. సమస్త భేద భావాల్ని దూరం చేసుకొని అఖండ బ్రహ్మాత్వభావం కలిగించుకునే రోజు. ✦

# ఆయుర్వేద ప్రతిభ

చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్, న్యూఢిల్లీ వారు జాతీయస్థాయిలో నిర్వహించిన "15th Competetion for Writers of Childrens Books"లో ప్రముఖ ఆయుర్వేదవైద్యురాలు డా॥ గాయత్రీ దేవికి బహుమతి లభించింది. చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్ వివిధ విభాగాలలో బాలల పుస్తకాలకై పోటీ నిర్వహిస్తోంది. 'పాపులర్ సైన్స్' విభాగంలో డా॥ గాయత్రీదేవి రచించిన "Why of Herbs" పుస్తకానికి బహుమతి లభించింది.

పాపులర్ సైన్స్ విభాగంలో ఆధునిక విజ్ఞానానికి సంబంధించిన విషయాలే ప్రచురింపబడుతూండడం గమనించిన డా॥ గాయత్రీ దేవి నిత్య జీవితంలో ఉపయోగపడే విజ్ఞానమంతా పాపులర్ సైన్స్‌గా గుర్తించబడాలని భావించారు. శతాబ్దాల క్రితం మానవ ఆరోగ్య రక్షణ కొరకు ఆవిర్భవించిన ''ఆయుర్వేదం'', నేటికీ ప్రజల ఆరోగ్య సమస్యల పరిష్కరణలో సత్ఫలితాలనిస్తోంది. కొంతకాలం క్రితం వరకూ ఆయుర్వేదంలోని ఎన్నో ఆరోగ్య సూత్రాలను భారతీయులంతా అనుసరించే వారు. రకరకాల మూలికలతో చిన్న చిన్న వైద్యాలను ఎవరికి వారే చేసుకునే వారు. ఇప్పటి తరంలో తమచుట్టు పక్కల ఉన్న మూలికల అద్భుత గుణాల గురించి పరిజ్ఞానం లేదు. పిల్లలకి అటువంటి పరిజ్ఞానం కలిగించాలనే ఉద్దేశ్యంతో డా॥ గాయత్రీదేవి రచించిన "Why of Herbs" పుస్తకానికి చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్ వారి బహుమతి లభించింది. చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్ త్వరలో ఈ పుస్తకాన్ని ప్రచురించి విడుదల చేస్తుంది.



ఇంతకుపూర్వం సిబిటి నిర్వహించిన పోటీలో డా॥ గాయత్రీదేవి రచించిన "Aryavaidyasala, an Institute of Ayurveda" పుస్తకానికి కూడా బహుమతి లభించింది. భారత ప్రభుత్వపు వయోజన విద్యాశాఖవారు నిర్వహించిన జాతీయ స్థాయి పోటీలో ఈమె రచించిన ''పుట్టబోయే బుజ్జాయి కోసం'' (గర్భిణీ స్త్రీలు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి) పుస్తకానికి బహుమతి లభించింది.

డా॥ గాయత్రీదేవి కథలూ, వ్యాసాలూ రాస్తూంటారు. ఆకాశవాణి చెన్నై కేంద్రం నుండి ఆమె రాసిన నాటికలు ప్రసారమవుతుంటాయి.

నాగార్జున విశ్వవిద్యాలయం నుండి ఆయుర్వేదంలో పట్టభద్రురాలయిన (బి.ఎ.యం. ఎస్) డా॥ గాయత్రీదేవి ప్రస్తుతం చెన్నైలో ప్రాక్టీస్ చేస్తున్నారు.

పాఠశాలలో చిన్నప్పటి నుండి విద్యార్థులకి మిగిలిన విజ్ఞానంతో పాటుగా ఆయుర్వేదం లోని ఆరోగ్య సూత్రాల గురించి, మూలికల ప్రత్యేకత గురించీ బోధించాలనీ, అప్పుడే మన దేశీయ వైద్యం పట్ల విద్యార్థులకి ఆసక్తి కలుగుతుందనీ, ఆమె అన్నారు. ఆయుర్వేదం పేరుతో వ్యాపారం ఎక్కువగా జరుగుతోందనీ, ఏది అసలయిన ఆయుర్వేదం అనే అవగాహన ప్రజలలో కలగాలనీ ఆమె అన్నారు.

# ''శివ సంకల్పమస్తు''

దశిక కృష్ణమోహన్

సనాతన ధర్మానికి భారతీయ సంస్కృతికి మూలాధారం వేదం. అది ప్రపంచంలోనే అతి ప్రాచీనమయినది. సర్వ ప్రథమమయినది. మానవజాతికి సాంసారిక పారమార్థిక అభ్యుదయం ప్రసాదించేది వేదం. అది అలౌకిక జ్ఞానానికి సాధనం. ''**ఇష్టప్రాప్త్యనిష్ట పరిహారయోః అలౌకిక ముపాయం యోగ్రంథో వేదయతి సవేదః**'' అని సుప్రసిద్ధ వేదభాష్యకారుడు సాయణాచార్యుడు తనభాష్యంలో ఉద్ఘాటించాడు. ''**వేదోనామ వేద్యన్తే జ్ఞాప్యన్తే ధర్మార్థకామ మోక్షాః అనే నేతి వ్యుత్పత్యా చతుర్వర్గ జ్ఞానసాధన భూతో గ్రంథవిశేషః**'' అంటే చతుర్విధ పురుషార్థాల యొక్క పరిపూర్ణ జ్ఞానం కలగడానికి సాధన భూతమయిన గ్రంథవిశేషమే వేదమని '**ఆర్యవిద్యా సుధాకరం**' అనే గ్రంథం నిర్వచించింది.

వేదాలు పరమేశ్వర నిశ్వాస రూపములైనవి కాబట్టి, వాటికి కర్త ఎవరూ లేరు. వానిని అందుకే అపౌరుషేయము లన్నారు.

**''యస్య నిశ్వసితం వేదా**
**యో వేదేభ్యోఽఖిలం జగత్ ।**
**నిర్మమే తమహం వన్దే**
**విద్యాతీర్థం మహేశ్వరమ్ ॥''**

అని భాష్యంలో సాయణాచార్యుడు వివరించాడు. అలాంటి వేదంలోలేని విషయమేమీలేదు. ''**భూతం భవ్యం భవిష్యంచ సర్వం వేదాత్ ప్రసిద్ధ్యతి**'' అని ప్రసిద్ధి. వేదం ప్రధానంగా రెండు భాగాలుగా ఉంటుంది. 1. సంహితాభాగం 2. బ్రాహ్మణ భాగం. ఈ రెంటికీ కలిపి (మంత్ర బ్రాహ్మణయో ర్వేద నామధేయమ్) వేదం అని పేరు. బ్రాహ్మణ భాగం లేనిదే వేదంలోని మూలమంత్రార్థం సుబోధం కాదు. '**వేదోఽఖిలో ధర్మ మూలం**' అని మనుస్మృతి తెలియజేస్తోంది. అట్టి మూలభూతమయిన, ఏకరాశీభూత మయిన వేదాన్ని వేదవ్యాసమహర్షి నాలుగు భాగాలుగా విభజించాడు. ''**అస్యమహతో భూతస్య నిశ్శ్వసిత మేతద్య దృగ్వేదో యజుర్వేదః సామ వేదోఽథర్వాంగిరసః**'' అని బృహదారణ్యకోపనిషత్తు నాలుగు వేదాలను తెల్పుతోంది.

ఋగ్వేదం 10 మండలాలు, వేయి సూక్తాలు. (1017 సూక్తులని ఒక మతం) ప్రతి మండలానికి ద్రష్టలయిన ఋషులున్నారు. 1, 10 మండలాలకు చాల మంది ఋషులు. 2 నుండి 9 మండలా లకు ఒక్కొక్క ప్రధాన ద్రష్ట ఉన్నారు.

యజుర్వేదం రెండు విధాలుగా ఉంది. కృష్ణ యజుర్వేదం, శుక్లయజుర్వేదం, ఇందు కృష్ణ యజుర్వేదానికి 86 శాఖలుండేవి. అందు నేడు లభిస్తున్నవి తైత్తిరీయ, మైత్రాయణీయ, కఠ, కపిష్ఠలు శాఖలు నాలుగు మాత్రమే. శుక్లయజుర్వేదానికి 15 శాఖలుండేవి. అందు వాజసనేయ, కాణ్వశాఖలు మాత్రమే ప్రస్తుతం లభిస్తున్నాయి. వాజసనేయ సంహితకే మాధ్యందిన సంహిత అనే నామాంతరం కూడా ఉన్నది. ఈ సంహితలో 40 అధ్యాయాలున్నాయి. ఇందలి 34వ అధ్యాయ ఆరంభంలో మొదటి 6 మంత్రాల భాగం ''శివసంకల్పోపనిషత్తు''గా ఉన్నది. దీని భావాన్ని తెలుగులో అందించడమే ఈ నా ప్రయత్నం.

భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపజేసే ఆధ్యాత్మిక తత్త్వంలోని ప్రధాన విషయం ఏమిటంటే, ఆత్మజ్ఞానాన్ని సంపాదించాలనుకున్న సాధకుడు ముందుగా మనస్సును తన వశంలోనికి తెచ్చుకొనుట. మనసే అన్నిటికి ముఖ్యం. ''**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః**'' అని భగవద్గీత ఉద్బోధిస్తోంది. శరీరంలో సమస్త అవయవాలు మహత్త్వపూర్ణమయినవే. దేని ప్రాధాన్యం దానికున్నది. చిటికెన వ్రేలుకూడ ముఖ్యమయినదే. ఇక మనస్సు యొక్క ప్రాముఖ్యం వేరే చెప్పాలా? ''**ఇంద్రియాణాం మనశ్చాస్మి...**'' అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు 'ఇంద్రియాలలో మనసును నేను' అని చెప్పాడు. ఈ మనస్సుకొక విలక్షణమయిన శక్తి ఉన్నది. మానవుడు పొందే సుఖ దుఃఖాలన్నీ దీని అధీనంలోనే ఉంటాయి. మనస్సు పోలేని చోటు లేదు. గ్రహించలేని విషయం లేదు. ఇంద్రియాలు కూడ ఎక్కడెక్కడకు పోలేవో, ఏమేమి చూడలేవో అట్టి చోట్లకు కూడ మనస్సు చేరుకొని సమస్తం అనుభవిస్తుంది. ఆత్మ సాక్షాత్కారం చేసుకోవాలంటే మనస్సే నేత్రమవుతుంది. 'మనో నేత్రంతో చూచాడు' అంటారు. ''మనసైవా నుద్రష్టవ్యం'' అనివేదం వచిస్తోంది. మనస్సే ఇంద్రియాలను శాసిస్తున్నది. మనసు యొక్క ప్రమేయం లేకుండా ఇంద్రియాలు తమ తమ పనులు చేయలేవు. ఎప్పుడు ఇంద్రియాల యొక్క ప్రవర్తన – నివర్తనలు

మనస్సుపై ఆధారపడి ఉంటాయో, ఎప్పుడు కర్మసంపాదన ఇంద్రియ ప్రవృత్తికి అధీనమై ఉంటుందో, ఎప్పుడు అభ్యుదయప్రాప్తి కర్మ సంపాదనపై ఆధారపడి ఉంటుందో, అప్పుడు మన అభ్యుదయం మన మనస్సు యొక్క శుభసంకల్పం మీదనే ఆధారపడి ఉంటుందని గ్రహించాలి. అందుచేతనే మంత్రద్రష్టలైన ఋషులు ఈ శివసంకల్ప సూక్తం ద్వారా ఈవిధంగా ప్రార్థిస్తున్నారు - తమ మనస్సుల ఎల్లవేళల శుభసంకల్పాలతో నిండి ఉండాలని, మానవులందరి మనస్సులు కూడ ఇలాగే కోరుకోవాలని అంతరార్థం. ఇక ఈ సూక్త భావాలను చూద్దాం-

**1. యజ్జాగ్రతో దూరముదైతి దైవం**
**తదు సుప్తస్య తథైవైతి ।**
**దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం**
**తన్మే మనః శివసంకల్పమస్తు! ॥**

జాగ్రదవస్థలో చూచుటకు వినుటకు ఎంత దూరమైనా పరుగులు తీసేది, అట్లే సుషుప్త్యవస్థలో తిరిగి తన స్థానానికి చేరు కొనేది, జ్యోతి స్వరూపమయిన ఆత్మను గ్రహించే ఏకైక సాధనం కావడం వలన దైవమని చెప్పబడేది (మనసే దైవం), భూత భవిష్యద్వర్తమానాలన్నిటిని గ్రహించే సామర్థ్యం కలిగినది, దూరగామి, అనేకానేక విషయాలను ప్రకాశింపజేసే జ్యోతులకు (ఇంద్రియాలకు) ఏకైక జ్యోతి అయిన ఆ నా మనస్సు శుభసంకల్పములను కలిగి యుండుగాక!

**2. ''యేన కర్మాణ్యపసో మనీషిణో**
**యజ్ఞే కృణ్వన్తి విదథేషు ధీరాః ।**
**యదపూర్వం యక్షమన్తః ప్రజానాం**
**తన్మేమనః శివసంకల్పమస్తు'' ॥**

కర్మ నిష్ఠులు ధీరులు అయిన విద్వాంసులు ఏ మనస్సువల్ల యజ్ఞ సంబంధ మయిన జ్ఞానాన్ని పొంది యజ్ఞకర్మలను విస్తరింపజేస్తున్నారో, ఏ మనస్సు సంకల్ప వికల్పరహిత మయి, సాక్షాత్తుగ ఆత్మరూపమే అవుతున్నదో, పూజ్యమైనది అవుతున్నదో, సర్వప్రాణి శరీరాంతర్గతము అవుతున్నదో, ఆ నా మనస్సు కల్యాణకారకములు, భగవత్సంబంధములు అయిన సత్సంకల్పములను కలిగియుండు గాక!

**3. ''యత్ప్రజ్ఞాన ముత చేతో ధృతిశ్చ**
**యజ్జ్యోతిరన్తరమృతం ప్రజాసు ।**
**యస్మాన్న ఋతే కించన కర్మక్రియతే**
**తన్మేమనః శివసంకల్పమస్తు''॥**

ఏ మనస్సు ప్రజ్ఞానమును అనగా విశేష రూప జ్ఞానాన్ని కలిగిస్తున్నదో, పదార్థ విజ్ఞానాన్ని కలిగిస్తున్నదో (అనగా సామాన్య విశేష జ్ఞానకారకమో), ధైర్యరూపమయినదో, సమస్త ప్రాణులలోను ఉండి అంతర్జ్యోతులను అంటే ఇంద్రియములను (లేక) ఆభ్యంతర పదార్థాలను ప్రకాశింపజేస్తూ ఉంటుందో, స్థూల శరీరం మరణించిన పిమ్మట కూడ ఏది అమరమై ఉంటుందో (మనసే ఆత్మ), అట్లే దేనియొక్క సహాయం, అను కూల్యం లేకుండ ఏపనీ కూడ సుసంపన్నం కాదో, అట్టి నా మనస్సు శుభ సంకల్పయుతమై ఉండుగాక!

**4. ''యేనేదం భూతం భువనం భవిష్యత్**
**పరిగృహీత మమృతేన సర్వం ।**
**యేన యజ్ఞ స్తాయతే సప్తహోతా**
**తన్మే మనః శివసంకల్పమస్తు'' ॥**

ఏ మనస్సు ద్వారా భూతభవిష్యద్వర్తమాన సర్వస్వాన్ని స్పష్టంగా తెలుసుకొన వీలవుతుందో, సంకల్ప వికల్ప రహితమై ఏ మనస్సు అమృతమయమైనదో, అంటే శాశ్వతమైనదో, శ్రద్ధాయుక్తమైన ఆరోగ్యవంతమయిన ఏ మనస్సుతో ఏడుగురు హోతలు కలిగిన అగ్నిష్టోమయజ్ఞం నిర్వహింపబడుచున్నదో, అట్టి నా మనస్సు శుభసంకల్ప యుతమగు గాక!

**5. ''యస్మిన్నృచః సామ యజూంషి యస్మిన్**
**ప్రతిష్ఠితా రథనాభావివారాః ।**
**యస్మింశ్చిత్తం సర్వమోతం ప్రజానాం**
**తన్మే మనః శివ సంకల్పమస్తు ॥**

ఏ మనస్సున రథచక్రం యొక్క ఇరుసునకు గల ఆకులవలె ఋగ్యజుస్సామ రూపమయిన వేదత్రయి అదే రూపంలో స్థిరంగా ప్రతిష్ఠితమై ఉన్నదో, దేనియందు సమస్త ప్రాణుల యొక్క లోక విషయక మయిన జ్ఞానం పటము (వస్త్రము)లో తంతువుల (దారాలు) వలె ఓతప్రోతమై (పడుగు - పేక - అల్లిక) ఉన్నదో అటువంటి నా మనస్సు శుభ సంకల్ప యుతమై ఉండుగాక!

**6. ''సుషారథి రశ్వానివ యన్మనుష్యా**
**న్నేనీయతే உభీశుభి ర్వాజిని ఇవ ।**
**హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం**
**తన్మే మనః శివసంకల్పమస్తు'' ॥**

నేర్పరియైన రథసారథి కళ్ళెమును చేత బట్టుకొని గుఱ్ఱాలను తోలుతూ, రథాన్ని గమ్యానికి చేర్చే విధంగా ఏ మనస్సు మనుష్యులను తన వశంలో పెట్టుకొని సన్మార్గంలో నడిపిస్తున్నదో, ఏ మనస్సు ప్రాణులయొక్క హృదయసీమలలో ప్రతిష్ఠితమై జరాభావం (వార్థక్యం) లేకుండ జవిష్ఠమై (మిక్కిలి వేగవంతమై) ఉంటుందో అట్టి నా మనస్సు శివ సంకల్పయుతమై ఉండుగాక!!

దీనినిబట్టి మానవుని మనస్సు ఎటువంటిది అయి ఉండాలో తెలుస్తుంది. అది ఎల్లప్పుడు శుభసంకల్పాలనే కలిగి ఉండాలని, మానవుని సన్మార్గంలోనే నడిపించాలని, వాంఛించడం ఇందులోని విశేషం. అంటే మనస్సు యొక్క పవిత్రతయే మనిషి నడవడికి మూలం కాబట్టి మనస్సును ఎప్పుడూ నిర్మలముగా, పవిత్రంగా ఉంచుకొని సత్సంకల్పాలతో జీవనాన్ని కొనసాగించాలి అనేది వైదిక ఆకాంక్ష. ✦



బాలశిక్ష

# కాలం విలువ
## (కథ)

కాలం అమూల్యమైనది. ఒక క్షణం గడిస్తే తిరిగి సంపాదించుకోలేనిది. అటువంటి కాలాన్ని మనం వృథా చేస్తున్నాం. దాని విలువ ఇంత అని తెలియకుండా చేజేతులా నాశనం చేసుకుని నష్టపోతున్నాం. ఇందుకు ఉదాహరణగా ఒక కథ...

ఒకసారి ఒక మహారాజు ఒక అడవి ప్రాంతానికి వెళ్లాడు. అక్కడ ఒక వయోవృద్ధుడు కట్టెలు కొట్టుకుంటూ, కష్టపడుతూ వుండడం చూసి, జాలిపడి యోగక్షేమాలు విచారించాడు.

ఆ వృద్ధుడు, ఈ వృద్ధాప్యంలో తనని చూసే వారెవరూ లేరనీ, భార్యనీ, తననీ పోషించుకోవడం కోసం యిలా కష్టపడుతున్నాననీ చెప్పగా, విని, జాలిపడి ఇకమీద అతను అలా కష్టపడకుండా, అక్కడికి కొంచెం దూరంలో వున్న రెండు ఎకరాలని ఆ వృద్ధునికి దానంగా యిచ్చాడు.

ఆ రెండు ఎకరాలలో పెద్ద పెద్ద చందన వృక్షాలున్నాయి.

రెండు సంవత్సరాలు గడిచాయి. రాజుగారు ఏదో పనిమీద అవైపు వచ్చి, మళ్లీ కట్టెలు కొట్టుకుంటూ, కష్టపడుతున్న వృద్ధుడిని చూసి, విస్తుపోయారు. భటుల చేత ఆ వృద్ధుని తన చెంతకు రప్పించి వివరా లడిగాడు.

''ఏమయ్యా! నేను నీకు రెండు ఎకరాలు దానం చేశాను కదా అదంతా రెండు సంవత్సరాలలోనే ఏం చేసావు? అని ప్రశ్నించారు.. దానికతను, ''మహారాజా! అన్ని చెట్లు నరికి ఆ కట్టెలు అమ్ముకోవడం చాలా కష్టమైన పని అన్పించింది. అందుకనే ఆ చెట్లన్నీ కాల్చి బొగ్గులుగా మార్చి అమ్మివేసేను. ఆ డబ్బు లన్నీ ఖర్చయిపోగా యథాప్రకారం కట్టె లమ్ముకుని, జీవిస్తున్నాను'' అన్నాడు. ఆ సమాధానానికి రాజుగారికి ఏమనాలో తోచలేదు.

కొంతసేపటికి తేరుకుని, ''అయ్యో అవి ఏమనుకుంటున్నావు? వెలలేని చందన వృక్షాలు. ఒక్కొక్క చెట్టూ కొన్ని లక్షలు విలువ చేసేది. ఒక్క చెట్టు అమ్ముకున్నా, నీ జన్మ దరిద్రమంతా తీరిపోనే! అదంతా అలా పాడు చేశావే'' అని బాధపడ్డాడు.

అలాగే భగవంతుడనే మహారాజు, మనకి కాలమనే వెలలేని చందన వృక్షాలని అనుగ్రహించాడు. మనమూ ఆ వృద్ధుని లాగే ఆ కాలాన్ని వృథా చేసుకుంటూ జీవించకుండా నలుగురికీ పనికివచ్చే విధంగా ఉపయోగించుకోవాలి.

– ఎం. సత్యవతి

(శ్రీ కృపానందవారియర్ చెప్పినకథ మూలం)

## 'విజ్ఞానం పోటీ – 8' ఫలితాలు

గత సంచిక (ఫిబ్రవరి '2000) లోని 'విజ్ఞానం పోటీ - 8'కి వచ్చిన సమాధానాలలో, అన్నివిధాలా సరిగ్గా వ్రాసిన 1. శ్రీసాదనం (వేములవాడ), 2. జె. యామిని, (కడప) లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ.100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు.

– సంపాదకుడు

సరియైన సమాధానాలు :

1. లోపాముద్ర 2. వసిష్ఠుడు 3. గదాధరుడు 4. సంపాతి, 5. శ్యామశాస్త్రి 6. కాళిదాసు, 7. శ్రీకృష్ణదేవరాయలు 8. పోతన 9. గోదావరి 10. మహారాష్ట్ర

## కంఠస్థం చేయదగిన శ్లోకం

***మూకం కరోతి వాచాలం***
***పంగుం లంఘయతే గిరిమ్ ।***
***యత్కృపాతమహం వందే***
***పరమానంద మాధవమ్ ॥***

''*మూగవానికి వాచాలునిగా (మాటలాడువానినిగా)* చేసి, *కుంటివాని చేత కొండలెక్కించే కృప మాధవునిది. ఏ మాధవుని కృప చేత ఈ కార్యములు జరుగుతున్నాయో ఆ పరమానంద స్వరూపుడైన మాధవునకు నమస్కారం.''*

మనచేత పలికించి, నడిపించి, చూపించి జీవింపజేసే చైతన్యమే భగవత్కృప. అసాధ్యాను సైతం సాధ్యం చేసే ఆ కృపామయుడైన మాధవుని గ్రహించి, ఆరాధించడం జీవిత సార్థక్యం.

# విజ్ఞానం పోటీ – 9

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ –9'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/–లు చొప్పున (రూ. 100/–) నగదు బహుమతి పంపుతాం. 15 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు ఏప్రియల్ 20వ తారీఖులోపు పంపాలి.

1. నాలుగు వేదాల పేర్లు ఏమిటి?
2. 'భగవద్గీత' ఏ గ్రంథంలోనిది?
3. విశ్వామిత్రుని యజ్ఞ భంగం చేయడానికి మారీచునితో పాటు వచ్చిన మరొక రాక్షసుడు?
4. గోదావరీ నదీ తీరంలో సీతారామలక్ష్మణులు నిర్మించుకున్న ఆశ్రమం?
5. అమరావతీ క్షేత్రంలోనున్న ఈశ్వరుని పేరు?
6. 'గురువాయురప్ప' క్షేత్రం ఏ రాష్ట్రంలో ఉంది?
7. 'భాగీరథి' అనే పేరు ఏ నదికి ఉంది?
8. యోగ సూత్రాలు రచించిన మహర్షి.
9. 'రామచరితమానస్' రచించిన హిందీ భక్త కవి?
10. భగవద్రామనుజాచార్యుడు స్థాపించిన మతం?

# హితవచనం

కృషితో నాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకః।
మౌనినః కలహోనాస్తి
న భయం చాస్తి జాగ్రతః॥

''కృషి చేసేవారికి కరవు ఉండదు.
జపం చేసేవారికి పాతకం ఉండదు.
మౌనంగా ఉండేవారికి కలహం ఉండదు.
జాగ్రతలో ఉండేవారికి, మేలుకుని ఉండేవారికి భయం ఉండదు.''

నిత్యం కృషి, దైవనామ జపం, మాటనీ మనసునీ నిగ్రహించుకోవడం, జాగ్రత్తగా, ఏమరుపాటు లేకుండా ఉండడం మనిషికి ముఖ్యం. ఇవి ఉన్నవారికి సర్వత్ర విజయమే.

# మహాభారత ప్రశ్నోక్తి – 5

నిర్వహణ :
**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

11. పాండవుల పెద్ద కొడుకు ఎవరు?
12. అర్జునుని చేత సారథ్యం చేయించుకొన్న గౌరవం దక్కిన వీరుడెవరు?
13. అర్జునుని శంఖము పేరేమి? దానిని ఎవరు ఇచ్చారు?
14. దేవయాని ప్రేమించిన దెవరిని? పెండ్లియాడిన దెవరిని?
15. అర్జునుని కిరీటాన్ని పడగొట్టడానికి యత్నించిన వీరుడు ఎవరు? దేనితో?
16. శతశృంగం నుండి వచ్చేటప్పటికి ధర్మరాజు వయస్సెంత?
17. శమీవృక్షం మీద ధనుర్బాణాలు పెట్టి వాటిని ధర్మరాజు ఏమని ప్రార్థించాడు?
18. సర్పయాగము చేయుమని జనమేజయుని పురికొల్పిన దెవరు?
19. సంస్కృత శ్రీమహాభారతంలోని శ్లోకాల సంఖ్య సుమారుగా ఎంత?
20. భీష్మ పరశురాముల యుద్ధానికి కారణం ఎవరు?

(జవాబులు 60వ పేజీలో చూడండి)

# మిరియాలు

శుంఠి, మిరియాలు, పిప్పళ్ళు - మూడింటినీ కలిపి త్రికటుకాలు అంటారు. గత సంచికలో అల్లం/శుంఠి గురించి తెలియజేశాను. మిరియాలు కూడా మన వంటింటిలో నిత్యం వాడే ద్రవ్యమే. ఆహార పదార్థాల రుచినీ, వాసననీ వృద్ధి చేయడానికి మిరియాలు వాడుతూంటారు. మిరియాలు - జీర్ణశక్తిని పెంచుతాయి. జున్నులో ఎక్కువ ప్రోటీన్లుంటాయి, తేలికగా అరగదు. అందుకే అందులో మిరియాలు తప్పనిసరి. వసంతఋతువులో వచ్చే శ్రీరామనవమి ఉత్సవాలలో బెల్లం పానకంలో మిరియాలు దర్శనమిస్తాయి. (వసంత ఋతువులో కఫ దోషం ప్రకోపిస్తుంది. మిరియాలు కఫాన్ని శమింపజేస్తాయి).

మిరాయాలని - ''సుగంధ ద్రవ్యాలలో రాజు'' అంటారు. ఇది అతి ప్రాచీన మైన సుగంధ ద్రవ్యం.

★ మిరియాల పొడిలో బెల్లం చేర్చి తీసుకోవడం వలన జీర్ణశక్తి పెరుగుతుంది.

★ అర చెంచాడు మిరియపు పొడి, సమానంగా జీలకర్ర పొడి, మజ్జిగలో కలిపి తాగడం వలన కడుపు ఉబ్బరం తగ్గుతుంది.

★ జలుబు తగ్గడానికి, 10 గ్రా మిరియాల పొడిని పాలలో కలిపి మరిగించి, తరువాత కొద్దిగా (చిటికెడు) పసుపు కూడా కలిపి రెండు పూటలా తాగాలి.

★ గొంతులో మంట వలన దగ్గు వస్తూంటే నాలుగు మరియపు గింజలు, ఒకటి - లేదా - రెండు పలుకులు రాతి ఉప్పు కలిపి నమిలి మింగుతూంటే - వెంటనే ఉపశమనం కలుగుతుంది.

★ కీళ్ళ నొప్పులు, కండరాల నొప్పులు ఉన్నప్పుడు - మిరియాల పొడిని నువ్వుల నూనెలో మాడేవరకూ వేయించి, ఆ ముద్దని నొప్పి ఉన్న చోట రాయడం వలన, ఉపశమనం కలుగుతుంది.

★ పంటినొప్పి అన్నప్పుడు మిరియాల పొడిని, లవంగ నూనెతో కలిపి, పుచ్చు పన్నులో పెట్టడం వలన నొప్పి తగ్గిపోతుంది.

★ మిరియాల పొడి, ఉప్పు కలిపి దంతధావనం చేసుకుంటే - నోటి దుర్వాసన పోతుంది, చిగుళ్ళ నుండి రక్తం కారదు, పుచ్చు పళ్ళు రాకుండా కాపాడుతుంది. పళ్ళకి తీపి, చల్లదనం తగిలినప్పుడు కలిగే నొప్పి కూడా తగ్గుతుంది. (పొడి చాలా మెత్తగా చేసుకోవాలి. అందుకోసం పొడిని వస్త్రగాలనం - అంటే, మెత్తని బట్టలో వేసి జల్లించాలి).

★ చెంచాడు మిరియాలు పొడి చేసి, ఒక కప్పు నీళ్ళలో కలపాలి. దానిలో ఒక వెల్లుల్లి చేర్చి మరిగించి, చల్లారిన తరవాత తేనెతో సేవించాలి. ఇలా రోజుకి మూడుసార్లు తీసుకోవడం వలన, మూత్రం సాఫీగా కాని వారికి సాఫీగా అయ్యి శరీరం తేలికవుతుంది.

★ గొంతు నొప్పి, టాన్సిలైటిస్ - సమస్యలున్నప్పుడు - మిరియాల కషాయంలో ఉప్పు చేర్చి పుక్కిలించడం వలన, ఆ బాధలు త్వరగా తగ్గుతాయి.

మిరియాలు అనేక ఆయుర్వేద ఔషధాలలో వాడతారు. జీర్ణ సంబంధమయిన వ్యాధుల ఔషధాలలోనూ, కఫజ వ్యాధుల ఔషధాలలోనూ మిరియాలు ప్రధాన ద్రవ్యం. త్రికటు చూర్ణం, అష్ట చూర్ణం తాలీశాది చూర్ణం, సితోపలాది చూర్ణం మొదలైన చూర్ణాలలో మిరియాలు ఉంటాయి.

మరిచతైలం (మరిచ అంటే మిరియాలు) - పైన రాయడం వలన దద్దుర్లు తెల్ల మచ్చలూ తగ్గుతాయి. బొల్లి ప్రారంభ దశలోనే - ప్రతిరోజూ మరిచ తైలాన్ని ఆ తెల్ల మచ్చల మీద రాస్తూంటే, రంగు మారుతుంది. ✸

# పాఠకస్వరం

ఏకత్వంలో భిన్నత్వాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని మన భారత దార్శనికులు, మహర్షులు, తత్త్వవేత్తలు ఎప్పుడో బోధించారు. ప్రతి భారతీయుడూ ఆస్తికుడై తన దైవపూజ చేసిన తర్వాత ''లోకాస్సమస్తాః సుఖినో భవంతు'' అని మంగళకర భావన ప్రకటించుకుని చిత్త శుద్ధితో ముగిస్తున్నాడు. ఈ శుభకర భావనను కోరుకునే గొప్ప విశాల భావం మనకున్నది.

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, సీత, రుక్మిణి మొదలైన దేవతలు, సావిత్రి, అరుంధతి, దమయంతి మొదలైన పతివ్రతా శిరోమణులు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, నారదుడు మొదలైన మహర్షులు, ఇంకా ఎందరో భగవద్భక్తులు తమ జీవితాలను సందేశాత్మకంగా మనకు అందించారు. ఎన్నో గ్రంథాలు, లౌకిక సాహిత్యం కొంత కాలానికి కనుమరుగైపోతాయి, కానీ శ్రీరామాయణం, భారత, భాగవతాలు - భగవద్గీత శాశ్వత గ్రంథాలు.

ఒకసారి భగవద్గీత గ్రంథంపైన ఇతర గ్రంథాలను ఎవరో పెట్టి ''చూశారా! మా మత గ్రంథాలకన్నా ఎంత అడుగున ఉందో మీ మతగ్రంథం'' అని, స్వామి వివేకానందతో హేళనగా అన్నారు. అందుకు మేఘ గంభీర స్వరంతో స్వామీజీ ఇచ్చిన సమాధానం...

''అవును మరి! మా భగవద్గీత అనే గొప్ప బలమైన పునాది పైననే ఇతర గ్రంథాలు ఆధారపడి ఉన్నాయి.''

ఆ స్వామీజీ వాక్కులోని అంతరార్థం అవగతం చేసుకుని ఒక్కసారి ఆత్మావలోకనం చేసుకుంటే చాలు మన కర్తవ్యం ఏమిటో స్పష్టంగా తెలుస్తుంది.

కె.రాఘవపతి, సికింద్రాబాదు

# దారిద్ర్యమోచన స్తోత్రమ్
# శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామాలు

''విద్యావారిధి'', అద్వైతసిద్ధిరత్నాకర
డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి

(గత సంచిక తరువాయి)

**4. అనుగ్రహపరాం బుద్ధిం**
**అనఘాం హరి వల్లభామ్ ।**
**అశోకాం అమృతాం దీప్తాం**
**లోకశోకవినాశినీమ్ ॥**

## 30. అనుగ్రహపరాయై నమః

అనుగ్రహించుటయే లక్షణముగా గల తల్లి - అనుగ్రహపరా. దీనికి 'అనుగ్రహప్రదా' (అనుగ్రహాన్ని ప్రసాదించునది), 'అనుగ్రహాత్మదా' (అనుగ్రహ స్వరూపురాలు) అని పాఠాంతరాలు కూడా ఉన్నాయి. మోక్షకారణమైన జ్ఞానమే అనుగ్రహం. ఆ అనుగ్రహాన్ని అంద జేసేదేవి లక్ష్మి.

## 31. బుద్ధ్యై నమః

సమస్త దేహమును శాసించునది బుద్ధి. సర్వమునూ నిశ్చయించు 'బుద్ధిశక్తి' ఆదిశక్తి స్వరూపమే. ధీశక్తి స్వరూపిణి గనుక అంబను 'బుద్ధి' అన్నారు.

**యా దేవీ సర్వభూతేషు**
**'బుద్ధి' రూపేణ సంస్థితా ।**
**నమస్తస్యై నమస్తస్యై**
**నమస్తస్యై నమోనమః ॥**

అని 'చండీ సప్తశతి' లోని అంబాస్తుతి. సర్వ ప్రాణులయందు ''బుద్ధి'' రూపముగా నున్నది దేవి.

## 32. అనఘాయై నమః

'అఘ' అనగా పాపము.

పాపరహితురాలు - అనఘా.

పాపవాసనలేవీ సోకని శుద్ధస్వరూపురాలు లక్ష్మి.

పరమశుద్ధస్వరూపిణి అని భావం. ''అపహత పాప్మా'' (ఛాం 7-1) అని ఛాందోగ్య ఉపనిషత్తు జగన్మాతను వర్ణిస్తోంది.

## 33. హరివల్లభాయై నమః

శ్రీమహావిష్ణువునకు ప్రియురాలు (ఇష్టురాలు) - హరివల్లభా.

**''విష్ణోరేషానపాయినీ''** - అని విష్ణుపురాణవచనం. విష్ణువును ఏనాడూ వీడని, అవిభాజ్యవైష్ణవీ శక్తి. ''హరియే వల్లభుడు (ప్రియుడు)గా గలది - హరివల్లభా'' అని అర్థం కూడా చెప్పవచ్చు.

## 34. అశోకాయై నమః

శోకములేని స్థితి 'అశోకం'. ఆ స్థితియే అమ్మస్వరూపం. అంటే కేవల 'ఆనంద స్వరూపిణి' అని భావం.

## 35. అమృతాయై నమః

మృతముకానిది 'అమృతం'. సర్వకాల సర్వావస్థలయందు శాశ్వతమైన బ్రహ్మయే అమృతము. ఆ పరబ్రహ్మమే అమ్మ. కనుక 'అమృతా' అని పేరు.

★'అమృతం' అంటే 'వేదవిద్య'



(బ్రహ్మవిద్య) అని అర్థం కూడా ఉంది. 'సా హి శ్రీరమృతాసతాం' - అనే శ్రుతి వాక్యమే ప్రమాణం.

## 36. దీప్తాయై నమః

'చైతన్య స్వరూపురాలు' అని అర్థం.

పాఠాంతరమున్నది. 'క్రీడించునది' అని 'దివ్య' అని కూడా ఈ శబ్దానికి ఒక అర్థం. ఒక లీలగా జగమును నడుపునది కనుక 'దివ్య'. లౌకికమునకు అతీతురాలై ఉన్నశక్తి 'దివ్య'.

## 37. లోకశోక వినాశిన్యై నమః

లోకమునకు కలిగిన శోకమును నశింప జేయునది లోకశోకవినాశిని.

అనేక మారులు అరిష్టాలవలన, దుష్ట దానవులవలన లోకం క్షోభించినపుడు అవతరించి ఆ అరిష్టాలనూ, పీడలనూ నశింపజేసి, ఆనందాన్ని కలిగించే శక్తి కనుక 'లోకశోకవినాశిని'. ✦

# నవరత్న ప్రభావం

**వైడూర్యము:**

దీనిని ''కేతుప్రియంవము'' ''ఏవ సూత్రము'', ''ఖరాబ్జాంకురము'', ''పిల్లి కన్నురత్నము'' ''విదూరజము'', ''బాల సూర్య'' వంటి పేర్లు కూడా ఉన్నాయి. ఇది గచ్చకాయ రంగు, గోధుమరంగు, బంగారు రంగు, నలుపు, తెలుపు మొదలైన అనేక రంగులలో దొరుకుతుంది. నల్లనిది ''కృష్ణ వైడూర్యం'' అనీ, బంగారు రంగుది ''కనక వైడూర్యం'' అనీ పిలువబడుతుంది.

చీకటి గదిలో పిల్లి కన్ను ఎలా మెరుస్తుందో, అలా మెరిసే వైడూర్యం పరమోత్తమమైనది. దీనిలోపల దారంలాగా సన్నని చార కూడా కనబడుతుంది. చిన్నదిగా ఉండి, ఎక్కువ బరువుగా ఉండేది మంచి వైడూర్యం.

వైడూర్యములలో ప్రధానంగా ఐదు రకాల దోషాలు చెప్తారు.

కర్కరము : గువ్వరాయి లాగా కనిపిస్తుంది. దీనిని ధరిస్తే కలహములు సంప్రాప్తిస్తాయి.

కర్కశము: చేతితో తాకి చూస్తే నున్నగా ఉండకుండా గరుకుగా తోస్తుంది. దీని వలన మానసిక అశాంతి కలుగుతుంది.

త్రాసము: బద్దలైనట్టు, లోపల ముక్కలైనట్టు కనబడుతుంది. దీనిని ధరించడం సర్వనాశన హేతువు.

దేహము: లోపల మలినంగా ఉండి, కాంతివిహీనంగా ఉంటుంది. దీనిని ధరిస్తే దరిద్రం కలుగుతుంది.

కలంకము: తెలుపు నలుపు, ఎఱుపు నీలం యిలా విరుద్ధమైన రంగులతో కనిపిస్తుంది. దీని వలన సర్వ దరిద్రం కలుగుతుంది. వైడూర్యానికి అధిపతి కేతువు. అందుకే ఈ రత్నాన్ని ''కేతుప్రియంవము'' అనీ, ''కేతురత్నం'' అనీ పిలుస్తారు. మంత్రతంత్ర శాస్త్రాల్లో ఈ రత్నానికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. దీనిని ధరిస్తే భూత ప్రేతపిశాచ బాధలు ఉండవు. ఈ నమ్మకం భారతీయుల లోనే కాక, భూమండలం లోని అన్ని దేశాలలోనూ, అన్ని మతాలలోనూ ఉంది. ఇతరులు ప్రయోగించే మంత్రతంత్రాలు, ఈ రత్నాన్ని సశాస్త్రీయంగా ధరించే వారి మీద పనిచేయవు.

**వైడూర్యము వలన ఉపయోగాలు:**

దీనిని ఉంగరంలో గాని, కంఠహారంలో గాని ధరించవచ్చు. దివ్యశక్తి, మనశ్శాంతి కలుగుతాయి. సర్వజన వశీకరణ కలుగుతుంది. మీద పడి చంపడానికి వచ్చిన పిశాచాలే కాక, మానవులు కూడా, ఈ రత్న ప్రభావం చేత మనసు మార్చుకుని వెనక్కు తిరుగుతారట.

దీనిని ధరించడం వలన క్షయ, ఉబ్బసం, బొల్లి వంటి వ్యాధులు క్రమంగా తగ్గిపోతాయి. అజీర్ణాన్ని నశింపజేసి, జీర్ణశక్తిని పెంపొందిస్తుంది. నీటి గండములు తొలగిపోతాయి. తేలు, పాము, వంటి విషజంతువు[illegible] దరిచేరవు.

ప్రసవించే స్త్రీలకు ఇది చాలా మంచిది. ప్రసవ సమయములో, నీళ్ళలో గాని, నేతిలో గాని మంచి వైడూర్యాన్నుంచి - ఆ నీళ్ళని గర్భిణీ స్త్రీ సేవిస్తే - తేలిగ్గా ప్రసవమౌతుంది. వైడూర్యపుహారం, లేదా ఉంగరం, గర్భిణీ స్త్రీలు ధరిస్తే - ప్రసవ సమయంలో సామాన్యంగా వచ్చే ఏ ఇబ్బందులూ రావు.

మఖ, మూల, అశ్వని నక్షత్రాలలో జన్మించిన వారు ఈ రత్నాన్ని ధరించడం మంచిది. కేతుదశలో కష్టాలు పడుతున్నప్పుడు దీనిని ధరిస్తే శుభప్రదం. జాతకములో కేతువు ఉండకూడని స్థానాల్లో ఉంటే, ఈ రాయి ధరించడం మంచిది.

నవరత్నపుటుంగరం: దీనిని గురించి ''కాశ్యపస్మృతి'' లో చెప్పబడింది. అనేక గ్రహదోషాలకి, విడివిడిగా ఉంగరాలు ధరించడం కుదరకపోవచ్చు. ఆ సమయంలో దీనిని తయారు చేయించి ధరిస్తే, అదే ఫలితం కలుగుతుంది.

నవరత్నపుటుంగరంలో పొదిగే రాళ్ళు అన్నీ ఒకే ప్రమాణంలో సమానంగా ఉండాలి. ఒకటి పెద్దదీ, ఒకటి చిన్నదీ ఉండకూడదు. మంచి రోజు చూసుకుని, తారాబలం చంద్ర బలం చూసుకుని ఉంగరం ధరించాలి. ఏ మాత్రం వీలైనా, ఆ రోజున దేవాలయంలో ఇష్టదేవతా పూజ, నవగ్రహ ప్రదక్షిణ, దానధర్మ శాంతులు చేయించాలి.

ఈ నవరత్నపుటుంగరంలో ఏఏ రత్నం ఎక్కడెక్కడ ఉండాలో రత్నశాస్త్రంలో చెప్పబడి ఉంది. ఆ వివరం, రేఖా పటం దిగువచూడండి.

మధ్యలో - రవి - కెంపు (మాణిక్యము)
తూర్పు - శుక్రుడు - వజ్రం
ఆగ్నేయం - చంద్రుడు - ముత్యం
దక్షిణం - కుజుడు - పగడం
నైఋతి - రాహువు - గోమేధికం
పడమర - శని - నీలం
వాయువ్యం - కేతువు - వైడూర్యం
ఉత్తరం - గురువు - పుష్యరాగం
ఈశాన్యం - బుధుడు - పచ్చ (మరకతం)

| మరకతము | వజ్రము | ముత్యము |
|---|---|---|
| పుష్యరాగము | మాణిక్యము | పగడము |
| వైడూర్యము | నీలము | గోమేధికము |

**ఆదిత్యాయచసోమాయ మంగళాయ బుధాయచ**
**గురుశుక్ర శనిభ్యశ్చ రాహువ కేతవే నమః**

సంపూర్ణమ్

శ్రీమతి వి.వి.యల్. నజ్ఞశాస్త్రి ఎస్.వి.

మాసఫలం

శ్రీమతి ఎ.బి.ఎ.ఎల్. రాజేశ్వరి, ఎం.ఏ

## మేషం



- భరణి - ప్రథమ పాదం.)

కుటుంబము నందు శాంతి, సౌఖ్యముండును. సంపద వృద్ధి చెందును. వాహన సౌఖ్యముండును. దైవ భక్తి చూపుతారు. కళాకారులకు, రచయితలకు మేలు జరుగుతుంది. సోదర సోదరీలు, స్నేహితుల సహాయ సహకారము లుంటాయి. ఖర్చులు సక్రమంగా జరుగుతాయి. ఆదాయం బాగుంటుంది. ప్రయాణాలు అనుకూలిస్తాయి. ఆరోగ్యం బాగుంటుంది. పిల్లల ఆరోగ్యాలు బాగుంటాయి. వాక్చాతుర్యంతో, వ్యవహారాలు నేర్పుగా నిర్వహించినందువలన గౌరవ ప్రతిష్టలు పెరుగుతాయి. ఉద్యోగ వ్యాపారస్థులందరికీ సామాన్య పరిధిని మించి బాగుంటుంది. 15వతారీఖు నుండి పిల్లల విషయములో జాగ్రత్త అవసరం. అందుకొరకు ఆదిత్య హృదయం, సుబ్రహ్మణ్యపూజ చేసుకోండి.

## వృషభం



(కృత్తిక 2,3,4 - రోహిణి, మృగశిర 1,2)

ఈ మాసములో సంతానవృద్ధి, సంతానమునకు అభివృద్ధి కలదు. కార్యసాఫల్యత కలుగును. ప్రభుత్వ లావాదేవీలలో మేలు జరుగుతుంది. విద్యార్థులకు విద్యలో మంచి కాలము నూతన వస్త్రలాభము జరుగును. గృహము నందు శాంతి సౌఖ్యములుండును. వాహన సౌఖ్యము కలదు. సంగీత సాహిత్య నృత్యాది కళాకారులకుప్రోత్సాహముంటుంది. ఖర్చులు సక్రమ రూపంలో జరుగుతాయి. దైవపూజలు జరుపుతారు. ప్రభుత్వ ఉద్యోగులు అధికారులు ఆదరణ పొందుతారు. కళత్రమునకు కొద్దిగా అనారోగ్యము, తల్లిగారికి కూడ కొద్దిగా అనారోగ్యము చేయును. ఋణ బాధలు కొంచెము తగ్గును. మృగశిర నక్షత్రమున వీరికి మానసికశాంతి తగ్గును. వీరు ప్రయాణములలో, వ్యవహారములలో మరి కొంత జాగ్రత్త చూపవలెను. వీరు సూర్యాష్టకము, సుబ్రహ్మణ్య షోడశనామ స్తోత్రము చేసికొనవలెను. రాత్రి కాలమునందు జన్మించిన వారు బియ్యమును దానము చేయవలెను.

## మిధునం



(మృగశిర 3,4 - ఆరుద్ర, పునర్వసు 1,2,3)

మానసికోల్లాసము, శాంతి ఉండును. నూనె, ఇనుము, ప్రత్తి వ్యాపారస్థులకు మంచి లాభాలు కలుగును. వైద్య, వాణిజ్య, వ్యవసాయదారులకు మేలు జరుగును. ప్రయాణాలు లాభించును, అధికారుల ఆదరణ లభించును. పిల్లలకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. భారీ పరిశ్రమలు బాగుండును. కుటుంబంలో సుఖశాంతులుండును. మృగశిర, పునర్వసుల వారు, ఆరోగ్యమును జాగ్రత్తగా చూచుకోవాలి. కళత్ర ఆరోగ్యము కూడ జాగ్రత్త. ప్రభుత్వ ఉద్యోగులు, వారి వృత్తి అనుకూలమైన సాహసము చేసి అధికారుల మన్నన పొందుతారు. ఆరుద్ర నక్షత్రకులు ఇంకా మంచిరోజులు. వీరు బియ్యం దానం చేయాలి. చంద్రునికి రోజూ నమస్కారము చేసికోండి.

| కు | గు శ | | |
|---|---|---|---|
| ర బు | మార్చి 2000 | | రా |
| కే శు | | | |
| చ | | | |

## కర్కాటకం



(పునర్వసు 4 - పుష్యమి - ఆశ్లేష)

వీరికి 15వ తారీకు వరకు కొద్దిగా అనారోగ్యంగా ఉంటుంది. భోజన సౌఖ్యం ఉండదు ప్రయాణములు 15 తరువాత అనుకూలిస్తాయి. సంసారసుఖము కలుగును. అధికార వృద్ధి, వ్యాపారములయందు, వ్యవహారముల యందు మేలు కలుగును. రాజకీయ నాయకులకు, ప్రభుత్వ ఉద్యోగులకు, ఆ సంస్థల యందు సామాన్య అనుకూల్యత కలదు. సినీ పరిశ్రమల వారికి, గాయకులకు నటులకు కళాకారులకు సామాన్యమైన మేలు జరుగుతుంది. గృహములో నూతనవస్తుప్రాప్తి కలుగుతుంది. దేవభక్తి పెరుగును. విష్ణుపాసన చేస్తారు. పునర్వసువారు ఆదిత్య కవచం చేసుకోవాలి.

## సింహం



(మఖ - పుబ్బ - ఉత్తర 1)

ఈ మాసమంతయూ వీరికి కొద్దిగా అనారోగ్యంగా ఉంటుంది. 10వ తారీకు తరువాత అనుకున్న పనులు కొంచెం సానుకూలమగుతాయి. ఈ మాసంలో వీరు స్థిరాస్తులు కొనే అవకాశం ఉంది. (15 తరువాత) వాహనాలు కూడ కొనగలరు. ప్రయాణాలు అనుకూలించి ధనవృద్ధి కలుగుతుంది. పిల్లలు అభివృద్ధిలో ఉంటారు. అధికారులతో జాగ్రత్తగా మాట్లాడటం మంచిది.

ఎక్కువగా ప్రయాణాలు చేయకండి. దానివలన ఆయాసము, దుఃఖము కలుగును. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలు 15 నుంచే అనుకూలిస్తాయి. ఋణదాతల వత్తిడి ఎక్కువగా ఉంటుంది. హృదయతాపము ఎక్కువ. మొత్తము మీద ఈ నెల అంతయూ చికాకులు ఎక్కువకనుక రవి, బుధ, శుక్ర, కుజులకు శాస్త్రోక్తంగా జపహోమ దానాదులు చేసుకోవలెను. తిరుమల వేంకటేశ్వరుని గానీ, శ్రీశైల ఈశ్వరునిగాని ఈ నెలలో దర్శనం చేసికొంటే బాగుంటుంది.

## కన్య



(ఉత్తర 2,3,4 - హస్త - చిత్త 1,2.)

గురు భక్తి, దైవభక్తి నెరపుదురు. కులాచారములు సాగించెదరు. అధికారుల ఆదరణ ఉంటుంది. ప్రయాణములు అనుకూలించును. సాహస వ్యాపారాలలో మేలు జరుగుతుంది. సేవకుల సహకారం లభిస్తుంది. ఆరోగ్యం బాగుంటుంది. భారీ పరిశ్రమల వారికి అనుకూలంగా ఉంటుంది. సినీ కళారంగాల వారికి మాత్రం అనుకున్నంతగా పనులు జరుగవు. చిత్త నక్షత్రంవారు జాగ్రత్తగా వ్యవహరిస్తే మంచిది. కళత్రమునకు, సంతానమునకు అనారోగ్యం. మాసాంతము చేయు వృత్తి వ్యాపార, ఉద్యోగములలో చెప్పుకో గలిగినంత అనుకూలత లేదు. రవి, శని, గురు, శుక్ర కుజులు ఈ మాసం యోగకారకులు కారు. అందుచేత వారికి జపదానాదులు చేసుకోవలెను. వీలైనంతవరకు తోటకూర శాకదానము చేసికోవలసినది.



## తుల

(చిత్త – 3,4 – స్వాతి – విశాఖ – 1,2,3.)

స్వబుద్ధితో ఆలోచించుట చాల ముఖ్యం, చెప్పుడు మాటలు వినవద్దు, కళత్రమునకు అనారోగ్యము కలదు. కుటుంబమునందు చికాకులు కలగుతాయి. ఓర్పు వహిస్తే అవే సద్దుకుంటాయి. ధనధాన్యలాభము, శత్రు క్షయము కలుగును. ఆదాయము పెరిగి తృప్తి కలుగును. వస్త్రలాభము కలదు. పిల్లలు ఆరోగ్యంగా అభివృద్ధి కలిగి ఉంటారు. 15వ తారీకు తరువాత ధన ధాన్య పశువాహన వృద్ధి, సుఖ, సౌఖ్యములు కలుగును. స్థాన చలనమునకు అవకాశంకలదు. అనుకున్న పనులు సాధించగలరు. ప్రభుత్వ లావాదేవీలు నెరవేరును. శనికుజులు అనుకూలంగా లేనందున వారికి జపహోమ దానాదులు చేసుకొనుట మిక్కిలి ముఖ్యము.



## వృశ్చికం

(విశాఖ–4 – అనూరాధ – జ్యేష్ఠ)

వేళ తప్పి భోజనము చేయుదురు. ప్రభుత్వ ఉద్యోగ వైద్య రంగముల వారికి మేలు ఫలితములు కలుగవు. 15వ తారీఖు తరువాత మంచి ఆలోచనలు కలిగి సద్గ్రంథ పఠనము, విద్వానులతో పరిచయాలు కలుగును. రచయితలకు అనుకూలత కలుగును. సంతానాభివృద్ధి, సంతానవృద్ధి కలుగును. నూతన వస్తుప్రాప్తి కలుగును. భూముల యందు లాభముండును. శస్త్రవిద్య యందుండు వారికి, శాస్త్రకారులకు, పోలీసు, మిలటరీ శాఖలలోని ఉద్యోగులకు, ఈ మాసాంతము చాలా అనుకూలమైనది. ధన లాభము కలుగును. భూములయందు,. పంటల యందు, వ్యాపారాలందు అన్ని వృత్తుల యందు మేలు జరుగును. లాభముండును.

వనదుర్గ జపం చేసుకోండి. విశేష లాభ ముండును.



## ధనుస్సు

(మూల – పుర్వాషాఢ – ఉత్తరాషాఢ)

గృహమునందు సౌఖ్య ముండును. సోదర సహకారముంటుంది. సంగీత సాహిత్య నృత్య, శిల్ప కళాకారులకు అనుకూలంగా జరుగును. వ్యాపారస్థులకు మంచి లాభములు కలుగును. ఆరోగ్యము సక్రమ రీతిగా ఉండును. గృహము నందు ఆనందము కలిగి శుభకార్యములు జరుగును. ప్రభుత్వ వ్యవహారము సానుకూల పడును. 15వ తారీఖు తరువాత వ్యాపారము వలన ధనవ్యయం జరుగును. ప్రయాణములు కష్టతరంగా ఉంటాయి. మాసాంతములో బంధువులతో భేధాభిప్రాయములు కలుగును. ఋణదాతల ఒత్తిడి ఎక్కువగా ఉంటుంది. శని కుజులకు జపం చేసుకొని నువ్వులు, కందులు దానం చేసికోవాలి.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 – శ్రవణం – ధనిష్ట 1,2)

నూతన ప్రయత్నములు ఫలించును. కుటుంబ సౌఖ్యం కలుగును. వ్యాపారాలలో లాభాలు కలుగును. గృహమందు నూతన వస్తు లాభం కలదు. ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలు అనాయాసంగా చేస్తారు. లాభాలు కలుగుతాయి. ప్రభుత్వ లావాదేవీలు అనుకూలిస్తాయి. పెద్దల ఆదరణ కలుగుతుంది. బాకీలు వసూలు అవుతాయి. ఋణాలు కొంతవరకు తీరతాయి. కళాకారులకు మంచి రోజులు. గుర్తింపు కలుగుతుంది. వాహన సుఖం ఉంటుంది. మొత్తం మీద ఈ మాసమంతయు మీకు అనుకూలమైన రోజులు.



## కుంభము

(ధనిష్ట 3,4 – శతబిషం – పూర్వాభాద్ర 1,2,3.)

ప్రభుత్వ వ్యవహారాలలో అనుకూలత స్వల్పంగా ఉంటుంది. కళత్ర వివాదం. వ్యాపారాలలో స్వల్ప లాభాలు వచ్చును. 15వ తారీఖు తరువాత ధనలాభం, ఆరోగ్యం, ఇష్టమైన వస్తువు అమర్చుకొనుట, అధికారవృద్ధి మొదలయినవి అన్ని సుఖములు కలుగును. సంతానవృద్ధి కలదు. సంతానము లేనివారికి సంతానయోగ్యత కూడా కలదు. స్వబుద్ధిచే మొదలుపెట్టిన పనులు సానుకూలత చెందును. స్వస్థాన ప్రాప్తి ఉంటుంది. విదేశ విద్యలు, విదేశ వ్యాపారాలు, ఇనుము, నూనె, ప్రత్తి వ్యాపారులకు మంచి యోగ కాలము.



## మీనం

(పూర్వాభాద్ర 4 – ఉత్తరాభాద్ర – రేవతి)

మీరు ఈ మాస మంతయూ యుక్తిగా సంచరించవలసి యున్నది. ఉష్ణాధిక్యత, అనారోగ్యత హృదయతాపం కొద్ది కలుగును. స్వల్పంగా భోజనము చేయవలెను. సోదర సోదరీలతో భేధాభిప్రాయాలు కలిగే అవకాశం ఉంది. ఆయుధ బాధలు శస్త్రచికిత్సలకు అవకాశం కలగదు. జాగ్రత్తగా ఉండాలి. వీరికి ఏలినాటి శని 3 నెలల్లో అయిపోతుంది. అందుచేత శనికి తైలాభిషేకం చేయించుకోవాలి. చోర భయము కలదు. అన్నింటికీ ఏలినాటి శనియే కారణము. అధికారుల ఒత్తిడి అసంతృప్తి కలుగును. మీరు జూన్ వరకు ప్రతిరోజూ విష్ణుసహస్రనామం గాని శివ సహస్రనామం గాని చేసుకోవలెను. మృత్యుంజయ స్తోత్రము (మార్కండేయ మహర్షి విరచిత) తప్పక చదువుకోవలసి యున్నది. నువ్వులు, కందులు దానం చేసుకోవాలి. ఎక్కువ సమయము దైవచింతనలోనే గడుపవలెను. రెండవసారి ఏలినాటి శని దశ నడుస్తున్నవారు మరీ జాగ్రత్తగా వ్యవహరించవలెను. ✦





# 'పరిశోధక పంచానన'
# శ్రీ కపిలవాయి లింగమూర్తి రచనలు

## సోమేశ్వర క్షేత్ర మహాత్మ్యం

వెల: రూ.20/-

కృష్ణాతీరంలోనున్న శైవక్షేత్రాలలో ప్రసిద్ధి చెందినది సోమేశ్వర క్షేత్రం. ఈ క్షేత్రంపై ఇది సమగ్ర అవగాహన కలిగించే పుస్తకం. రచయిత పరిశోధనానైపుణ్యం, విషయాన్ని విoగడించే తీరు చక్కగా ఉంది. కృష్ణాతీరంలో వున్న అగస్త్యేశ్వరం, కపిలేశ్వరం, సంగమేశ్వరం, సిద్ధేశ్వరం, సోమేశ్వరం.... అనే పంచేశ్వరాల వివరాలూ ఇందులో ఉన్నాయి.

'సోమేశ్వరక్షేత్రం' స్థల పురాణం, చారిత్ర కవిశేషాలు, ఇతర దేవాలయ వైభవాలు, శిల్పసంపదలు మొదలైన ఎన్నో ఆసక్తికర అంశాలు వివరించారు. ✦

## కావ్యగణపతి - అష్టోత్తరం

వెల: రూ.40/-

తొలి పూజలందు కొనే గణపతి యొక్క వివిధ రూపాలు, ఆగమాది శాస్త్ర ప్రోక్తాలైన విశేషాలు వివరించిన ఈ గ్రంథంలో, గణపతి మూర్తులు, ఆలయాలు, కొన్ని స్త్రీ రూపగణ పతుల్ని కూడా తెలియజేశారు.

ఈ పుస్తకానికి ఉన్న గొప్ప వైశిష్ట్యం నన్నెచోడుడు మొదలుకొని, ప్రసిద్ధులైన తెలుగు కవులంతా వారి వారి కావ్యాలలోని దేవతాస్తుతులలో భాగంగా రచించిన గణపతి స్తుతి పద్యాలను, వాఖ్యానంతోసహా అంద జేశారు. ఎందరు కవులు ఎన్ని కావ్యాలు వ్రాశారో తెలియడంతో పాటు, వారి కవితా వైఖరి, గణపతి వైభవం కూడా స్పష్టమయ్యేలా వివరిస్తుందీ గ్రంథం. ✦

## నాగర్ కర్నూలు పాండురంగ విఠ్ఠల శతకం
## తెల్లరాళ్ళపల్లి తిరుమలేశ శతకం

వెల రూ.30/-

స్వర్గీయ శ్రీ చిక్కేపల్లి రామచంద్రరావు గారి శతజయంతి సందర్భంలో, వారి స్మృత్యర్థంగా పునరుద్రీతమైన గ్రంథమిది. తెలుగువారి ప్రత్యేకంగా మిగిలిన ప్రక్రియ 'శతకప్రక్రియ' ఆ ప్రక్రియలోని మంచి శతకాలు ఈ రెండు లోకరీతులు, దైవలీలలు కలగలిసిన రచన చక్కని శైలిలో జాలువారింది.

ప్రతులకు: శ్రీ కపిలవాయి లింగ మూర్తి,
వాణీ సదనం, 17110,
విద్యానగర్ కాలని, నాగర్ కర్నూలు - 509209.

## మేరుతంత్రం

రచన: శ్రమేడవరపు సంపత్‌కుమార్

వెల: రూ.50లు. మేలు ప్రతి రూ.60లు.

జైమిని జ్యోతిషకేంద్రం(కాకినాడ) వారి ప్రచురణ ఇది. తంత్ర శాస్త్రగ్రంథాలలో తలమానికమైన 'మేరుతంత్రం'కి చక్కని తెలుగు అనువాదమిది. ఒక ఉద్యమ స్ఫూర్తిగా, దేశం మారుమూలల సంస్కృతం, హిందీవంటి వివిధ భాషల్లోని తంత్రగ్రంథాలను పరిశీధించి, సరళశైలిలో అందించాలనే రచయిత ప్రయత్నం - ఈ మొదటి ప్రచురణలో సఫలీకృత మయ్యింది. 'తాంత్రికగ్రంథావళి - 1'గా ప్రచురింపబడిన ఈ గ్రంథం చూసిన తరువాత, ఇతర గ్రంథాలు కూడా వెలువడితే బాగుండునని పించక మానదు. ప్రతులకు: శ్రీ ఎం. సంపత్‌కుమార్, 13-3-8, ఆరిళ్ళ అగ్రహారం, చాణుక్య సైకిల్ గేటు, ఎదుటవీధి, కాకినాడ! ✦





# వాగ్గేయ వైభవం

పల్లవి:
ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు
అంరాంతరములెంచి చూడ(బిండంతే నిప్పటియన్నట్లు

చరణాలు:
కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవుడనుచు ॥

సరినెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిశనములు మిము నానావిధులను తలపుల కొలదుల భజింతురు
సిరుల మిమ్మునే యల్పబుద్ధి దలచిన వారికి నల్పం బవుదువు
గరిమల మిమునే ఘనమని తలచిన ఘనబుద్ధులకు ఘనుడవు
నీవలన గొరతేలేదు మరి నీరుకొలది తామరవు
ఆవల భాగీరథిదరి బావుల ఆ జలమే ఊరినయట్లు
శ్రీవేంకటపతి నీవైతే మము జేకొనివున్న దైవమని
యీవల నే నీ శరణనియెదను యిదియే పరతత్వము నాకు ॥

పదకవితాపితామహుడు, సంకీర్తనా చార్య రచించిన సంకీర్తన ఇది.

''ఓ వేంకటపతీ!

నీవు పరతత్వమవు. ఎవరు ఎంత తలచితే, అంత. పిండికొద్దీ రొట్టె (పిండంతే నిప్పటి).

వైష్ణవులు విష్ణుడని కొలుచుకుంటారు. వేదాంతులు పరబ్రహ్మమని పలుకుతారు. శైవులు నిన్ను శివుడని తలంచుతారు. కాపాలికులు ఆదిభైరవుడని ఆనందంతో కీర్తిస్తారు. శాక్తేయులు శక్తిరూపంగా భావిస్తారు.

ఇలా వివిధ దర్శనాలలో వారి వారి తలపుకొద్దీ నిన్ను భజిస్తారు. అల్పబుద్ధితో తలచితే అల్పం. ఘనబుద్ధితో తలచితే ఘనం.

నీ వలన కొరత లేదు. నీరుకొలది తామ రవు. తామరదుంప ఏ పరిమాణపు జలంలో వేస్తే, ఆ జలాశయమంతా అంత పరిణామం లోనూ వ్యాప్తమౌతుంది. అదేవిధంగా తలపు కొద్దీ దైవం.

భాగీరథి జలముల చెంత ఆ జలాలే ఊరుతాయి. నా సర్వస్వమైన పరతత్వమని నిన్ను భావించి శరణు వేడుతున్నాను.''

అలా స్వామిదగ్గర ఏ తలపుతో చేరితే, ఆ తలపు కొద్దీ తానవుతాడు.

శ్రీ వేంకటేశ్వర స్వామిని అనేకమంది అనేక విధాలుగా కొలిచినట్లు చారిత్రక ఆధారాలు ఉన్నాయి. ఇప్పటికీ శక్తి అనీ, శివుడనీ, విష్ణువనీ, సుబ్రహ్మణ్యమనీ భావించేవారున్నారు.

ఏమని భావించినా పరతత్వమొక్కటే. అది అఖండ దివ్యానంద ధామం.

**యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ॥**

''ఎవరెవరు నన్ను ఏ ఏ విధంగా ఆశ్రయిస్తున్నారో, వారిని ఆయా విధంగా అనుగ్రహిస్తున్నాను'' అని పరమాత్మ వచనం.

సర్వదేవతల సమాహారమూర్తిగా వేంకటపతిని దర్శించి, కీర్తించిన గొప్ప కీర్తన ఇది. ✦

# నిరోధించదగునా...?

డా॥ గాయత్రీదేవి

నిద్ర నుండి మేల్కొన్న వెంటనే - కాలకృత్యాలు, అంటే మలమూత్ర విసర్జన చేయాలి. విసర్జన అయిపోవడం వలన శరీరం తేలికయ్యి ఉత్సాహం కలుగుతుంది. మలమూత్ర విసర్జన అవసరం కలిగినప్పుడు విసర్జించకుండా ఆపకూడదు. అలా ఆపడం వలన శరీరానికి అనేక విధాలయిన అనారోగ్యాలు కలిగే అవకాశం ఉంది.

మూత్రం విసర్జించకుండా ఆపడం వలన - మూత్రాశయం, మూత్ర విసర్జనావయవాలలో నొప్పి, తలనొప్పి, కింది కడుపు ఉబ్బరించటం మొదలయిన లక్షణాలు కలుగుతాయి. తరువాత మూత్రం విసర్జించే టప్పుడు నొప్పి కలుగుతుంది. పదే పదే మూత్ర వేగాన్ని ఆపడం వలన, కొంత కాలానికి మూత్ర సంబంధమయిన ఇతర వ్యాధులు వచ్చే అవకాశం ఉంది.

మలవిసర్జన చేయకుండా ఆపినట్లయితే - ప్రేగులలోని రకరకాల భాగాలలో నొప్పి, మలబంధం, అపానవాయువు ఎక్కువ కావడం కడుపు ఉబ్బరించడం, తొడలలో నొప్పి రావడం - మొదలయిన బాధలు కలుగుతాయి. పదే పదే మలవిసర్జనని నిరోధించడం వలన, మలబద్ధకం వస్తుంది. మలబద్ధకం రకరకాల ఉదర సంబంధమయిన వ్యాధులకీ, మూలశంక వ్యాధికీ కారణ మవుతోంది. కొన్ని సమయాలలో క్యాన్సర్ వ్యాధికి దారితీస్తుంది. అందువల్ల అతి సామాన్య విషయాలని అశ్రద్ధ చేయకుండా ఆరోగ్య రక్షణ చేసుకోవాలి.

ఆయుర్వేదంలో ''అగ్ని'' చాలా ప్రధానమైనది. అగ్ని అంటే - ఆకలి సక్రమంగా ఉండాలి, తిన్నది పరిపూర్ణంగా జీర్ణం కావాలి. ప్రతిరోజూ సాఫీగా విరేచనం కావాలి. ఇవి ఆరోగ్య లక్షణాలు.

ఆధునిక జీవన విధానం, ఆహారంలో మార్పుల వలన చాలామంది మలబద్ధంతో బాధపడుతున్నారు. అనేక ఆధునిక యంత్రాలు శరీరానికి శ్రమ లేకుండా చేస్తున్నాయి. Fast Foods, refined ఆహార పదార్థాల వలన శరీరానికి అవసరమయిన పీచు పదార్థం అందడం లేదు. సుఖ విరేచనానికి పీచు పదార్థం అవసరం. వీలయినంత వరకూ మందుల మీద ఆధారపడకుండా, ఆహార విహారాలలో మార్పులతో సుఖ విరేచనం అయ్యేలా చూసుకోవాలి.

★ నీళ్ళు ఎక్కువగా తాగాలి. ఉదయం లేవగానే చెంబెడు మంచి నీళ్ళు, వీలయితే గోరువెచ్చగా తాగాలి. (రాత్రి పూట రాగి చెంబులో నీరు పోసి ఉంచి, అవి ఉదయాన్నే తాగడం ఆరోగ్యకరం).

★ ఎక్కువగా ఆకుకూరలు తినాలి.

★ పళ్ళు తినాలి (పళ్ళరసాలు కాదు)

★ ద్రాక్ష, అరటి, ఖర్జూరం పళ్ళు సుఖ విరేచనానికి మంచివి. 'అతిగా కాఫీలు, టీలు సేవించకూడదు.

★ శంక కలగగానే మలవిసర్జన చెయ్యాలి తప్ప, నిరోధించకూడదు, రాని సమయంలో బలవంతంగా వెళ్ళే ప్రయత్నమూ చెయ్యకూడదు.

## సుఖ విరేచనం కోసం

ఖర్జూరాలు 2-3
వెన్న 1-2 చెంచాలు
మిరియాలు 4-5 గింజలు - మూడింటినీ కలిపి, ఉండలా చేసుకుని, రోజూ ఉదయాన్నే చప్పరించి తినాలి. తిన్న తరవాత గ్లాసు పాలు తాగాలి.

★ ఆమలకీ చూర్ణం (ఉసిరి పొడి) 1-2 చెంచాలు. వెన్న 1-2 చెంచాలు. చక్కెర కొద్దిగా కలిపి భోజనానికి ముందు తీసుకోవాలి.

★ గుప్పెడు ఎండుద్రాక్ష పళ్ళు, రాత్రిపూట ఒక కప్పు నీళ్ళలో నానబెట్టి ఉదయాన్నే పాలల్లో కలుపుకుని తాగాలి.

## నిరోధించకూడదు

ఆయుర్వేద శాస్త్రం 13 వేగాలని నిరోధించకూడదు, అని చెబుతోంది. అవి: 1. మూత్రము 2. మలము 3. శుక్రము 4. అపానవాయువు 5. వాంతి 6. తుమ్ము 7. త్రేన్పులు 8. ఆవులింతలు 9. ఆకలి 10. దప్పిక 11. కన్నీరు 12. నిద్ర 13. శ్రమవల్ల కలిగే ఆయాసం.

వీటిలో దేనినయినా ఆపడం వలన, ఆయా భాగాలకి సంబంధించిన వ్యాధులు వచ్చే అవకాశం ఉంది.

ఒక్కమాట, మలమూత్ర శుక్ర వేగాలు నిరోధించకూడదని శాస్త్రం చెబుతోంది కనక, ఎక్కడపడితే అక్కడే ఆ కార్యక్రమాలు చేసెయ్యకూడదు (విర్జన ప్రదేశాలలోనే చెయ్యాలని కూడా శాస్త్రం చెబుతోంది).

## నిరోధించాలి

★ మానసికమైన - లోభ, శోక, భయ, క్రోధ, అహంకార, నిర్లజ్జత, ఈర్ష్య, అతిరాగము (ప్రేమ), అభిధ్య (పరులధనాన్ని తన స్వంతం చేసుకోవాలనే కోరిక) -

★ 'వాక్' కి సంబంధించిన - కఠినమైన మాటలు, అబద్ధాలు, అకాలయుక్త, అసందర్భమైన మాటలు -

★ కాయ (శరీర) సంబంధమయిన - ఇతరులను హింసించే పనులు, పరస్త్రీ లోలత్వము, చౌర్యము . ✦

# పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు

డా॥ గాయత్రీదేవి

**శ్రీరామ్మూర్తి** — **బొంబాయి**

ప్ర : మజ్జిగ అంటే ఏమిటో వివరిస్తారా? పెరుగుకి చేర్చవలసిన నీళ్ళకి ఏదయినా లెక్క ఉందా?

జ : మంది ఎక్కువయినంతకొద్దీ పలచనయ్యేది కాదు మజ్జిగ. మజ్జిగని సంస్కృతంలో తక్రం అంటారు. ఒక భాగం పెరుగుకి, 4 భాగాలు నీరు కలిపి, చిలికి తయారుచేసేది మాత్రమే తక్రం. మజ్జిగ తేలికగా జీర్ణమవుతుంది. ఆకలిని, జీర్ణశక్తిని కలిగిస్తుంది. మలబంధం లేకుండా చేస్తుంది. మూలవ్యాధిగ్రస్తులకి మజ్జిగ ఉత్తమం. మూత్రం విసర్జించడానికి కష్టపడుతున్నవారు మజ్జిగ [illegible]స్తుంటే – మూత్రం సాఫీగా అవుతుంది. అతిసార వ్యాధి, అమీబియాసిస్ వంటి సమస్యలతో బాధపడే వారు ప్రతి రోజూ రెండు గ్లాసుల మజ్జిగ తాగడం అవసరం.

**లక్ష్మి** — **విజయవాడ**

ప్ర: నా వయసు ముప్ఫై సంవత్సరాలు. పాదాలు పగిలాయి. ఆ పగుళ్ళు బాగా లోతుగా ఉండి, నెప్పి పెడుతున్నాయి. దీనికి ఆయుర్వేదంలో ఏదయినా పరిష్కారం చెప్పగలరు.

జ : ఎక్కువ సమయం నీళ్ళల్లో పని చేసేవారి లోనూ, శరీరంలో వేడి ఎక్కువయినపుడూ కాళ్ళ పగుళ్ళు ఏర్పడుతూంటాయి. చాలా మందికి ఈ సమస్య ఉంటూనే ఉంటుంది. పగుళ్ళు, ఆరంభదశలో ఉన్నట్లయితే- ''పిండ తైలము (ఆయుర్వేదం మందుల షాపుల్లో దొరుకు తుంది) పాదాలకి బాగా రాసి, గంటవరకూ అలాగే ఉంచుకుని, తరవాత కొంతసేపు పాదాలను, వేడినీటిలో ఉంచాలి. ఇలా రోజూ చేస్తూంటే పగుళ్ళు తగ్గుతాయి. మీరు రాసినట్లు, పగుళ్ళు లోతుగా ఉంటే, పిండ తైలం రాసిన తరువాత, వేడినీటిలో కొంచెం ఒళ్ళు రుద్దుకునే సబ్బు కలిపి, కాళ్ళని ఆ నీళ్ళలో ఉంచుకోవాలి. అప్పుడు పగుళ్ళ దగ్గర ఉన్న నిర్జీవ చర్మం మెత్తబడుతుంది. దాన్ని మెత్తటి టూత్ బ్రష్‌తో (Tooth Brush) శుభ్రం చెయ్యాలి. ''ఆరోగ్యవర్ధిని'' మాత్రలు పూటకి ఒకటి చొప్పున మూడుపూటలా, శారిబాద్యా సవం 20 ml. (20 ml నీటితో కలపాలి) అను పానంగా నెలరోజులు వాడండి. పాదాలు మామూలు స్థితికి వస్తాయి.

**స్వర్ణ** — **చెన్నై**

మా అబ్బాయికి 10 సం.లు. కడుపులో పాములున్నాయి. చిన్న చిన్న నులిపురుగులు కూడా పడుతున్నాయి. అప్పుడప్పుడూ పురుగులు పోయే మందులు వేస్తున్నాం. పూర్తిగా తగ్గడం లేదు. ఈ సమస్యకి ఆయుర్వేదంలో మందులు ఉంటాయా?

జ : ఆయుర్వేదంలో అన్ని ఆరోగ్య సమస్యలకీ మందులున్నాయి. కడుపులో నులి పురుగులు వంటివి అంత తేలికగా శరీరాన్ని వదలవు. కొన్ని ఆరోగ్యపు అలవాట్లు చేసుకోవాలి, మందులూ వాడాలి. మలవిసర్జన తరువాత – చేతులు శుభ్రంగా సబ్బుతో తోమి కడుక్కోవాలి. చేతివేళ్ళ గోళ్ళని శుభ్రంగా ఉంచుకోవాలి, ఎప్పటికప్పుడు కత్తిరించుతూ ఉండాలి. గోళ్ళు కొరికే అలవాటుకి పూర్తిగా స్వస్తి చెప్పాలి. కలుషితమైన నీరుతాగకుండా, జాగ్రత్తపడాలి. ఈ మార్గాల ద్వారానే కడుపులో చేరే కొన్ని రకాల పురుగుల గుడ్లు శరీరంలో ప్రవేశిస్తాయి. Tape worm అనబడే పాము (సాధారణ భాషలో పాము అంటాము, వైద్య పరిభాషలో కృమి అంటాము) – కలుషితమైన పందిమాంసం ద్వారా మానవ శరీరంలోకి చేరుతుంది. ఇది బాగా అపాయకరమైనది. కడుపులో చేరిన క్రిములు పోవడానికి మందులు వాడుతూ, మళ్ళీ శరీరంలోకి ప్రవేశించకుండా, పైన చెప్పిన జాగ్రత్తలు తీసుకోవాలి.

వాయువిడంగాల చూర్ణం- 1-2 గ్రాములు తేనె లేదా గోరువెచ్చని నీళ్ళు అనుపానంగా, ప్రతిరోజూ రాత్రి, భోజనా నంతరం, 40 రోజులపాటు వాడాలి.

లేదా ''కృమి ముద్గరసము''- అనే ఔషధాన్ని 100-200 మి.గ్రా.శొంఠి కషాయం అను పానంతో కనీసం రెండు వారాలపాటు వాడాలి. రోజూ మన వంటలలో వాడే ఇంగువ, మెంతులు, మిరియాలు, శొంఠి వీటన్నింటిలోనూ క్రిములని పెరగనీయకుండా చూసే లక్షణం ఉంది. ✦

# అర్థవంతమైనది మన కాలమానం

పోలిశెట్టి బ్రదర్స్

**1. విషువత్ రేఖ**

భూమి ఉత్తరధ్రువ అక్షానికి సూటిగా ఆకాశంలో ఉన్న ధ్రువ నక్షత్రాన్ని ఆధారం చేసుకుని, ఆకాశాన్ని తూర్పు పడమరలుగా విడదీస్తున్నట్లు గీసుకుంటూ వెళ్తే, ఆ రేఖ తిరిగి ధ్రువతారను చేరుతుంది. ఈ వృత్తాకారపు ఊహా రేఖనే 'విషువత్ రేఖ' అంటారు. ఇది ఊహా జనితమైన ఖగోళ మధ్యరేఖ. (విషువత్ రేఖ ఉత్తర దక్షిణ దిశలను కలుపుతూ ఉండే ఊహా రేఖ. రాశిచక్రం దానికి వ్యతిరేకంగా తూర్పు పడమరలుగా ఉంటుంది. రాశిచక్రాన్ని ఈ విషువత్ రేఖ ఖండించే రెండు స్థానాలనూ ''వసంత విషువత్, శరత్ విషువత్'' అని అంటారు.)

**2. నక్షత్ర రాశులు (లేదా) రాశిచక్రం**

సూర్యుని చుట్టూ గ్రహాలు తిరిగే మార్గంలో స్పష్టంగా కన్పించే 27 అతి పెద్ద నక్షత్రాలను (అశ్వని మొదలు రేవతి నక్షత్రం వరకూ) యుగయుగాల క్రితమే హిందువులు గుర్తించారు. సూర్యుని చుట్టూ గ్రహాలు తిరిగే బాటను 12 రాశులుగా విభజించారు. ఒక్కొక్క రాశిలోని నక్షత్ర సముదాయాన్నీ ఒక్కొక్క రూపంలో ఉన్నట్లుగా ఊహించి ఆ రాశులకు ఆయా రూపాల పేర్లను పెట్టారు. మేక ఆకారంలో అమరి ఉన్న నక్షత్రరాశికి 'మేషరాశి' అనీ, ఎద్దు ఆకారంలో అమరి ఉన్న నక్షత్రరాశికి 'వృషభరాశి' అని... ఇలా మొత్తం 12 రాశులకూ పేర్లను ఏర్పరచారు. సూర్య కుటుంబంలోని గ్రహాలు, ఈ 12 రాశుల మీదుగానే సంచారం చేస్తుంటాయి. అందు వల్లనే ఈ రాశులను బట్టి, భూమిపై ఉన్న మనకు జ్యోతిషాలు గణించబడతాయి. ఈ కారణంగా 12 రాశుల చక్రాన్నీ 'జ్యోతిష చక్రం' అని కూడా అంటారు. మన భూమి ఈ 12 రాశులనూ చుట్టి రావాలంటే, 1 సంవత్సర కాలం పడుతుంది. భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూండడం వల్ల మన దృష్టికి, సూర్యుడు కూడా వరుసగా ఒక్కొక్క రాశిమీదుగా సంచారం చేస్తున్నట్లు కన్పిస్తాడు. (దీన్నే సూర్యుడే ఒక్కొక్కసారి ఒక్కొక్క రాశిలో ఉన్నట్లు మనం భావిస్తుంటాం) సూర్యుడు ఒక్కొక్క నక్షత్ర రాశిలో సుమారు నెల రోజులు ఉండునట్లు కన్పించుననీ, అదేవిధంగా మొత్తం సంవత్సర కాలంలో 12 రాశుల్లోనూ ఉన్నట్లుగా కన్పించడం జరుగుతుందనీ మన పూర్వీకులు లెక్కించారు. సూర్యుడు ఏ క్షణంలో ఏ నక్షత్ర రాశిలో ప్రవేశించినట్లు కన్పించేదీ వారు లెక్కించి – ఆ విషయాలను పంచాంగాల్లోనూ, జ్యోతిష శాస్త్రాల్లోనూ పొందుపరిచారు. సూర్యచంద్రులను ఆధారం చేసుకుని లెక్కలు కట్టడం ప్రాచీన హైందవులకు బాగా తెలుసు.

3. సూర్యసహోదయం :

ఏదయినా ఒక నక్షత్రం లేదా కొన్ని నక్షత్రాలు సూర్యునితో జతగా కలసి ఉదయించడాన్ని ''ఆ నక్షత్రం యొక్క లేదా ఆ నక్షత్రాల యొక్క సూర్యసహోదయం'' అంటారు. దీన్ని మొట్టమొదటగా గమనించినవారు ఋగ్వేద కాల ఋషులు. హిందూ పండుగలు ఇంచుమించుగా చాలావరకూ ఈ నక్షత్ర సూర్య సహోదయాన్ని అనుసరించే నిర్ణయించబడ్డాయి.

## వాడుకలో ఉన్న కాలమానాలు

దైనందిన జీవితంలోని బాహ్యజీవన విధుల్లో బ్రిటీషువారు మనపై రుద్దిన ఆంగ్ల కాలమానాన్ని మనం వాడుతున్నాం. ప్రపంచ దేశాలన్నింటితో సహజీవన సౌలభ్యం కోసం దాన్ని ఆచరిస్తున్నాం. మన పండుగలు, మత సంబంధ కార్యక్రమాలు, మంచి చెడ్డల ముహూర్తాలూ, జనన ఉపనయన వివాహాది కార్యక్రమాలూ, శ్రాద్ధ కర్మలు మొదలైన వాటన్నింటినీ హిందూ కాలమాన ప్రకారమే చేసుకుంటున్నాం. ఇందులో కూడా హిందువులంతా ఒకే కాలమానం వాడినా, అందులో కొద్ది తేడాలున్నాయి. అవి తెలియాలంటే ముందుగా శాస్త్రబద్ధమైన కాలమానాన్ని గురించి తెలుసుకోవాలి.

ఖగోళశాస్త్ర ఆధారంగా కాలమానం ఏర్పడిందని చెప్పుకున్నాం కదా! ఖగోళంపై ఆధారపడిన ప్రముఖ కాలమానాలు మూడింటిని గూర్చి ఇప్పుడు తెలుసుకుందాం.

1. చాంద్రమానం 2. సౌరమానం 3. చాంద్రసౌరమానం

**1. చాంద్రమానం**

పూర్ణిమ నుండి పూర్ణిమకు సుమారు 29.53 రోజులు. ఇలా చంద్రకళల ఆధారంగా మాసాలను లెక్కించే పద్ధతి ఇది. ఇందులో 12 నెలలకు 354.36 రోజులు. అంటే చాంద్రమాన సంవత్సరానికి సుమారు 354 రోజులన్న మాట. ఈ మానం వల్ల

చంద్రుని గూర్చిన విజ్ఞానం తెలుస్తుంది గాని, సూర్య సంబంధమైన ఋతు విజ్ఞానం తెలియదు. ప్రపంచాన ముస్లింలంతా ఈ చాంద్రమాన పద్ధతిని వాడుతున్నారు.

**2. సౌరమానం**

సూర్యుణ్ణి ఆధారం చేసుకుని ఏర్పరచుకొన్న కాలమాన పద్ధతి ఇది. ఇందులో మళ్ళీ ఈ రకాలున్నాయి.

(1) విదేశీ పద్ధతి (2) హిందువుల పద్ధతి

### 1. విదేశీయుల సౌరమాన పద్ధతి

భూమి సూర్యుని చుట్టూ ఒకసారి తిరిగేందుకు సుమారు 365 $^1/_4$ రోజులు పడుతుంది. కాబట్టి ఏదో ఒకనాడు మనకు నచ్చిన రోజున సంవత్సరాన్ని ఆరంభించి నెలకు 30 లేక 31 లేక 28..... చొప్పున రోజులను కేటాయించి, 12 నెలలకూ 365 రోజులను సరిపెట్టి సంవత్సరాన్ని పూర్తి చేస్తారు. ఈ పద్ధతిలో 4 సంవత్సరాల కొకసారి లీపు సంవత్సరం ఏర్పాటు ఉంటుంది. జనవరి 1వ తేదీతో ప్రారంభించే ప్రస్తుత ఆంగ్ల సంవత్సరం ఇదే! ఇందులో 365 $^1/_4$ రోజులకొకసారి భూమి సూర్యప్రదక్షిణ చేస్తుందనే విజ్ఞానాంశం తప్ప, మరో ఖగోళ విజ్ఞానమేమీ లేదు.

### (2) హిందువుల సౌరమాన పద్ధతి

సూర్యుడు ప్రయాణించినట్లు కన్పించే బాటలోని నక్షత్రాలను 12 రాశులుగా మన పూర్వీకులు విభజించినట్లు తెలుసుకున్నాం కదా! ఆ 12 రాశుల్లోనూ సూర్యుడు ప్రయాణించే కాలం 365 1/4 రోజులు .... అనగా 1 సంవత్సరం. (సూర్యుని చుట్టూ భూమి తిరుగుతూండడం వల్ల - సూర్యుడు అలా ప్రయాణిస్తున్నట్లుగా కన్పిస్తాడనే విషయాన్ని మనం ఎప్పుడూ మరచిపోకూడదు. 'సూర్యుడు ప్రయాణించడం, సూర్యుని నడకలు' అని చెప్పబడినప్పుడల్లా ఈ విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. మరో విషయం కూడా మీకిక్కడ ముందుగానే చెప్పాలి. 'ఫలానా నక్షత్రరాశిలో సూర్యుడున్నాడనీ, ఫలానా నక్షత్ర రాశిలో చంద్రుడున్నాడనీ' అనేక సందర్భాలలో వాడడం మీకు కన్పిస్తుంది. ఎక్కడో అనంత దూరాల్లో ఉన్న నక్షత్ర రాశుల్లోకి సూర్యుడూ, చంద్రుడూ ఎలా వెళ్తారని ప్రశ్నించకండి. నిజానికి సూర్యుడూ, చంద్రుడూ ఆ రాశుల్లోకి వెళ్లరు. భూమిపైనుండి చూస్తున్న మనకు ఆయా నక్షత్ర రాశుల్లో సూర్యుడు, చంద్రుడు ఉన్నట్లుగా కన్పిస్తుంటారని దీని భావం). సూర్యుడు ఒక నక్షత్ర రాశిలో చేరడాన్ని ''సంక్రమణం'' అంటారు. ఒక రాశిని విడిచి సూర్యుడు తర్వాత రాశిలోకి చేరడానికి సుమారు 1 నెల రోజులు పడుతుంది. ఆవిధంగా 12 రాశుల్లో 12 నెలల కాలం ప్రయాణించి, 1 సంవత్సరం పూర్తి చేస్తాడు సూర్యుడు.

మేషరాశిలో సూర్యుడు చేరిన రోజును ''మేష సంక్రమణం'' అంటాం. అలాగే ఏ రాశిలో చేరితే ఆ రాశి పేరుతో సంక్రమణం అని (వృషభ సంక్రమణం... మకర సంక్రమణం... ఇలా) అంటాం. సౌరకాలమానాన్ని వాడుకునే హిందువులు తమ సంవత్సరాన్ని 'మేష సంక్రమణం'తో ఆరంభించి, చివరి రాశి అయిన 'మీన సంక్రమణం'తో ముగిస్తారు. మళ్ళీ మేష సంక్రమణంతో క్రొత్త సంవత్సరాన్ని మొదలెడతారు. (మన పంచాంగ కర్త అయిన వరహమిహిరుని కాలంలో విషువత్‌రేఖ 'మేష రాశి'లో ఉండేది. అందువల్ల ఆయన మేషరాశితో రాశిచక్రం ఆరంభించాడు. ఈనాడు విషువత్ రేఖ 'మీనరాశి'లోకి మారింది. అయినా పాత అలవాటు ప్రకారం మేష సంక్రమణంతోనే ఇప్పటికీ వీరు సంవత్సర ఆరంభం చేసుకుంటున్నారు) ఈవిధమైన సౌరమాన పద్ధతి వలన సంవత్సరానికి 365 1/4 రోజులు ఉంటాయనే విజ్ఞాన విషయంతో పాటూ, సూర్యుడు ఎప్పుడు ఏ రాశిలో ఉంటున్నాడనే ఖగోళాంశం మరియూ ఋతు విజ్ఞానం తెలుస్తాయి. ప్రస్తుతం ఈ సౌరమాన పద్ధతిని తమిళనాడు, కేరళ, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల్లోని హిందువులు వాడుతున్నారు.

**3. చాంద్ర సౌరమానం**

చంద్రుని నడకలను అనుసరించి మాసాలను లెక్కించడం, సూర్యుని నడకలను అనుసరించి సంవత్సరాన్ని లెక్కించడం ఈ పద్ధతిలోని విశేషం. చాంద్రమానం ప్రకారం సంవత్సర కాలానికి సుమారుగా 354 రోజులు. సౌరమానం ప్రకారం సంవత్సరానికి 365 1/4 రోజులు. ఈ రెండు లెక్కలనూ కలిపి సరిపెట్టేందుకు అవసరమైనప్పుడల్లా ''అధిక మాసాలనూ'', అప్పుడప్పుడూ ''లుప్త మాసాలనూ'' ఏర్పరచడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత! తమిళనాడు, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలోని హిందువులు తప్ప, మిగతా భారతదేశంలోని హిందువులంతా ఈ పద్ధతినే హెచ్చుగా పాటిస్తున్నారు. (మనం కూడా ఈ పద్ధతినే వాడుతున్నాం)

- సశేషం

# 'శర్వాణీ సంగీతం



సుమారు 14 సంవత్సరాల క్రితం కర్ణాటక సంగీతాభివృద్ధి నిమిత్తం కొందరు తెలుగు మహిళలు ఒక బృందంగా ఏర్పడి, చెన్నై నగరంలో ప్రారంభించిన సంస్థ పేరే శర్వాణి సంగీత సభ. సంగీత విద్వాంసులైన సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్, బాలమురళి, ఎమ్మెస్ సుబ్బులక్ష్మి పట్టమ్మాళ్ వంటి వారి ఆశీర్వచనాలతో, సంగీత ప్రియులైన టీటీ వాసు, ఓబుల్‌రెడ్డి, వాగుల్ వంటి పెద్దల సహకారంతో ఇటీవలే 14వ వార్షికోత్సవాలను సంగీత కచ్చేరీలతో ఈ సంస్థ ఘనంగా నిర్వహించింది.

వార్షికోత్సవాలతో పాటే త్యాగరాజ ఆరాధనోత్సవాలనూ నిర్వహించడం కార్యక్రమాలకు మరింత శోభనిచ్చింది. ఈ సందర్భంగా జరిగిన ఆంధ్ర, తమిళనాడు రాష్ట్రాలకు చెందిన గాత్ర, వాద్యకళాకారుల కర్ణాటక సంగీత కచేరీలలో ఆద్యంతం త్యాగయ్య విరచిత కీర్తనలు మాత్రమే చోటు చేసుకొని త్యాగయ్య హృదయంలోని ఆధ్యాత్మిక, భక్తి భావతత్వాన్ని తెలుసుకొనే అవకాశం కలిగించాయి.

ఆంధ్రప్రదేశ్ నుంచి హైదరాబాదుకు చెందిన లలిత, హరిప్రియలు, విశాఖకు చెందిన మండా సుధారాణిలు రాగాలాపన, స్వరకల్పనతో పాటు భావయుక్తమైన గాత్రం, ఉచ్చారణతో తమిళనాడుకు చెందిన పలువురు జాతీయస్థాయి కళాకారులకు తీసిపోని విధంగా గానం చేసి శ్రోతలను ముగ్ధులను చేశారు. ఇంకా వేణువుపై సిక్కిల్ కుంజుమణి, నీల, మాలల త్రయం... యువ కళాకారులుగా చక్కని ప్రతిభతో పేరు ప్రఖ్యాతులు ఆర్జిస్తున్న అరుణ్, సంజయ్ సుబ్రమణ్యంలు తమ కచేరీలతో భేష్ అనిపించుకున్నారు. చంద్రమౌళి, హేమలత, వరదరాజన్‌లు ప్రధాన కళాకారులకు చక్కని వాద్యసహకారం అందించారు. అలాగే తాళ వాద్యాలైన మృదంగం, ఘటలంపై గణపతి రామన్, మన్నార్గుడి ఈశ్వరన్, భువరాగన్, అరుణ్ ప్రకాష్‌లు, మురళి, సుబ్రహ్మణ్యం, గోవిందరాజన్, రాజారామ్‌లు తన్యావర్తనంలో లయకు జీవం పోశారు.

చక్కని నిర్వహణతో శర్వాణి సభవారు ఆహూతుల మన్ననలందుకున్నారు. శర్వాణి సభవారు గత 14 ఏళ్లుగా 500కు పైగా నెలవారీ కచేరీలు జరిపారు. ఏటా అన్నమయ్య, రామ దాసు వంటి వాగ్గేయకారుల జయంతులతో పాటు జయదేవ అష్టపదులు, ప్రత్యేక నాలుగు గంటల కచేరీలనూ నిర్వహిస్తూ, సంగీత నగరంగా పేరొందిన చెన్నైలో సుస్థిర స్థానం సంపాదించుకున్నారు. అలాగే ఆంధ్ర ప్రదేశ్‌కు చెందిన కళాకారులను ప్రోత్సహించే నిమిత్తం ఏటా నాలుగు రోజుల పాటు కేవలం ఆంధ్రకు చెందిన వర్ధమాన కళాకారుల కచ్చేరీలు ఏర్పాటు చేస్తున్నారు. విశేషమేమంటే శర్వాణీ సంగీత సభవారు నిర్వహించే అన్ని సంగీత కార్యక్రమాలకు టికెట్ లేదు. కేవలం సంగీత ప్రియులు, పోషకుల విరాళాలు, సహకారంతో ప్రేక్షకుల అభిరుచులకు అనుగుణంగా కచేరీలు అందిస్తూ ముందుకు సాగుతున్న మహిళా సంగీత సంస్థ ఇది.

'ఈనాడు',



## ''స్తోత్ర రత్నావళి'' గ్రంథావిష్కరణ

''స్తోత్ర రత్నావళి'' గ్రంథావిష్కరణ సభలో - ఆవిష్కరించిన కుమారి ఎం. శర్వాణి, గ్రంథ సంపాదకులు శ్రీ పురాణ పండ రాధాకృష్ణమూర్తి తదితరులు. సర్వదేవతా స్తోత్రాలను సేకరించి చక్కని ముద్రణతో, మంచి గెటప్‌తో ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. రాజమండ్రి భాగవత మందిరంలో జరిగిన ఆవిష్కరణోత్సవ సభలో శ్రీ చెన్నాప్రగడ వెంకట సుందరరామారావు, శ్రీ కె. సత్యనారాయణ మొదలైనవారు పాల్గొన్నారు.



గానం : పి.శ్రీనివాసశర్మ, వయొలిన్ : ప్రసన్నలక్ష్మి, మృదంగం : పి.దుర్గాకుమార్

## త్యాగరాజ ఆరాధనోత్సవం

జనవరి 24, 25వ తేదీలలో ''శ్రీ సరస్వతీ సంగీత విద్యాలయము'' న్యూనల్లకుంట ఆధ్వర్యంలో బాగ్‌లింగంపల్లి సుందరయ్య కళానిలయంలో ఎంతో ఘనంగా ''శ్రీ త్యాగరాజస్వామి'' వారి ఆరాధనోత్సవములు జరిగినవి. చివరగా శ్రీమతి వాసుకీదేవిచే నాట్యప్రదర్శన జరిగింది. ముఖ్య అతిధిగా విచ్చేసిన కేంద్రమంత్రి శ్రీ బండారు దత్తాత్రేయ, ప్రత్యేక అతిధి ఇన్‌కంటాక్స్ ఛీఫ్ కమీషనర్ శ్రీ సి.వి.పద్మనాభన్, శ్రీ కె.ఎ. భాస్కరరావు మరయు ప్రత్యేక అతిధి బి.జె.పి. నాయకులు వి.సుధాకర శర్మలు ప్రసంగించారు.

# నక్కతోక పట్టుకుని...

స్కూటరాపి లోపలికొస్తున్న మా పెద్దవాడు, "మామా! నీ మాట వింటే నక్కతోక పట్టుకుని గోదావరి ఈదినట్లే" అని అన్నాడు మా బావమరిదితో.

"ఒరేయ్! నా మాట వింటే విన్నావ్, లేకపోతే లేదుగానీ, అనవసరంగా సామెత మార్చకు" అన్నాడు మా బావమరిది.

"సామెత ఏమిటి?' అని అడిగాడు మా చిన్నవాడు.

"ఏమిటా?... కుక్కతోక పట్టుకుని గోదావరి ఈదినట్లు..." అని జవాబిచ్చాడు మా బావమరిది.

"కొందరు, 'గేదె తోక పట్టుకుని గోదావరి ఈదినట్లు..." అని అంటారుగదా! అదేమిటి మరి?" అని అడిగింది మా బావమరిది

"అంతేనా? ఇంకా ఘోరంగా దిగజార్చిన పాఠాంతరాలూ ఉన్నాయి" అన్నాడు మా చిన్నవాడు.

"పాఠాంతరాలా? ఏమిటవి?" అని అడిగింది అది, అమాయకంగా.

"ఎందుకులే! చెప్తే అసహ్యంగా ఉంటుంది" అన్నాడు వాడు.

"ఇంతకీ ఏ తోక కరెక్టంటావ్?" అని అడిగింది మా చిన్నది.

"తోక ఏదన్నది తర్వాత. గోదావరి మాత్రం అలాగే ఉంది. అది గుర్తించాలి ముందు." అన్నాడు మా పెద్దవాడు.

అంతలో మా చంటివాడు సందర్భశుద్ధిగా గళం ఎత్తి, "నారాయణ నారాయణ నక్కతోక! నారాయణ పెళ్ళాం కుక్కతోక!" అని పాడటం మొదలు పెట్టాడు.

"ఆహా! నక్కబావకే కాక, నక్కతోకకి కూడా బాలసాహిత్యంలో ఎంత ప్రాధాన్యం!" అంది మా పెద్దది, వాళ్ళాయన్ని చూసి నవ్వుతూ.

అత డేదో అనబోయేంతలో, మా బావమరిది కూతురు, "బావ నక్క అయితే, మరి అక్క ఎవరో?" అని చేతులు కట్టుకుని, వినయంగా వంగి అడిగింది.

"మరీ అంతలా వంగకు. నక్క వినయం అంటారు." అన్నాడు మా చిన్నవాడు.

పంట డబ్బు నా చేతికిస్తున్న మా రైతు నవ్వుతూ, "బాబూ! 'నక్కవినయం' అనీ; 'నక్క ఎక్కడ, నాగలోక మెక్కడ' అనీ; 'నక్క ఒకచోట ఊళవేసి, మరొకచోట గౌరీకల్యాణం పాడుతుందా' అనీ; – రక రకాలుగా పెద్దలు నక్కని ఆడిపోసుకుంటారు గానీ, పిల్లలు చూడండి, నారాయణుడిని నక్కతోకతో పోల్చేసి, ఎలా హాయిగా పాడేసుకుంటున్నారో?" అన్నాడు.

"ఔను. నారాయణుడు నక్కతోకలాగా మహ చమత్కారి గదా!" అంది మా పెద్దది.

"నిజమే! ఈ నారాయణ నిజంగా వైకుంఠవాసి అయిన నారాయణుడే అయితే, ఆయన పెళ్ళాం మాత్రం నిశ్చయంగా కుక్కతోకే! ఎన్నడూ ఒకచోట తిన్నగా నిలబడదుగదా?" అని అన్నాను నేను.

"అందుకే కాబోలు, కుక్కకన్నా నక్క ఎదురొస్తే మంచిదన్నారు పెద్దలు!" అంది మా చిన్నది.

"నక్కను తొక్కితే, ఇంకా మంచిదట!" అంది మా బావమరిది కూతురు ఓరగా చూస్తూ.

"ఆ తొక్కేదేదో ఒడుపు చూసి తొక్కు. లేదా కుక్కకి మల్లే 'యాంటి రాబిస్' ఇంజక్షన్లు చేయించుకోవాల్సివస్తుంది" అన్నాడు మా చిన్నవాడు.

"నక్క కరిచినా, 'యాంటి రాబిస్' ఇంజక్షనే చేయించుకోవాలా?" అని అడిగింది మా బావమరిది కూతురు.

"ఎండా వానా కుక్కల నక్కల పెళ్ళి– అన్నారు గదా! ఎండకీ వానకీ, కుక్కలకీ నక్కలకీ, అంత దగ్గర సంబంధం ఉన్నప్పుడు, వాటి కాటుకీ మందులికీ మాత్రం ఉండదా?" అన్నాడు మా చిన్నవాడు.

అంతవరకు ఏదో ఆలోచిస్తున్న మా అల్లుడు, "మందులు అంటే ఒక విషయం గుర్తొస్తోంది. 'నక్క దోసకాయ', 'నక్కతోక బియ్యం' కడుపు శుభ్రం చేస్తాయట! 'నక్క నరం' అని ఒక దినుసువేరు ఉంది. అలాగే 'నక్కకొమ్ము' అనే మూలిక కూడా ఉంది. 'నేలపొన్న' చెట్టుని 'నక్కతోక పొన్న' అని కూడా పిలుస్తారు" అంటుండగా–

లోపల్నించి మా ఆవిడ, "అల్లుడు చెప్పినట్టు, బోటనీలోకి వెళితేగాని, ఆ నక్కతోక సామెత అర్థంకాదు" అంటూ బయటికి వచ్చింది.

"అయితే ఆ సామెతలోని తోక నక్కతోకే నంటావా?" అన్నాడు మా బావమరిది.

"ఆహా! నిస్సంశయంగా. పాపికొండల దిగువన గోదావరీ ప్రాంత అడవుల్లో ఒకరకమైన గడ్డి దుబ్బు పెరుగుతుంది. దాన్ని అక్కడివాళ్ళు 'నక్కతోక' అని పిలుస్తారు. గోదావరికి ఏమాత్రం వరదనీరొచ్చినా, అది నీళ్ళమీద తేలుతూ కొట్టుకొస్తూ ఉంటుంది. దాని బరువుకాక, వేరే అరవీసం బరువుపడినా, అది భరించలేదు. బుడుంగున మునిగి ఊరుకుంటుంది. ఆ బరువు వదిలిపోంగానే, మళ్ళీ నీటిమీద తేలుతూ, హాయిగా లాహిరి లాహిరి లాహిరిలో అనుకుంటూ సాగిపోతుంది. గోదావరి చాలా విశాలమైన నది. జీవనది. దానిలో, ఎన్నో చెట్లూ, కొమ్మలూ, దుబ్బులూ నిత్యం కొట్టుకొస్తూనే ఉంటాయి. గోదావరికి అడ్డంపడి ఈదేవాళ్ళు, అప్పుడప్పుడు వాటిని ఆధారంగా పట్టుకుని, తేలుతూపోతూ ఉంటారు. అలా ఎవరైనా పొరపాటున, ఈ 'నక్కతోక దుబ్బు'ని ఆధారంగా పట్టుకుని పోదాం అనుకున్నారా– అంతే సంగతులు. ఈ రహస్యం తెలియని ఇతరులు వాళ్ళ వాళ్ళ వీలుగా తోకలు మార్చారుగానీ, గోదావరిని మార్చలేక పోయారు. కారణం ఈ సామెత అక్కడ పుట్టింది కాబట్టి. అదీ సంగతి" అని ముగించింది మా ఆవిడ.

(వచ్చే నెల – "చన్నీళ్ళకి వేణ్ణీళ్ళు...")

సుధాలహరి

గొట్టుముక్కల రామకృష్ణమూర్తి

వ్యాసము – 2

# వేదమే ప్రమాణం

ఇంతవరకు మనం, జీవుడు అజ్ఞానంవల్ల సంసార దుఃఖం అనుభవిస్తున్నాడు అనీ, వేదాంత విచారజన్యజ్ఞానమే అజ్ఞానాన్ని నశింపజేసి మోక్షప్రదమౌతుందనీ తెలుసుకున్నాము. అయితే దీన్ని అంగీకరించడం అంత తేలికైన విషయంకాదు. ఎందుకంటే ఇక్కడ ఒక గొప్ప ప్రశ్న ఉత్తుంగ పర్వతంవలె అడ్డు తగులుతున్నది!

ఎట్లంటే-

సరేనయ్యా! వేదాంత జ్ఞానంవల్లనే మోక్షమంటున్నావు, ఈ వేదాంతములు కూడా వేదభాగం కనుక వేదమే అవుతుంది. వేద ప్రమాణంవల్లనేగదా, జ్ఞానమే మోక్షదాయకమంటున్నావు? అసలు వేదమునకు ప్రమాణత్వమెట్లు? లోకములో ఎన్నో గ్రంథములున్నవి. 1 వానిలో ఆయాశాఖలకు సంబంధించి ఎంతో విజ్ఞానం నిక్షిప్తమై ఉన్నది. మరి ఆ గ్రంథములన్నీ ఆయా శాస్త్రకారులచే రచింపబడినవే! అయితే ఈ శాఖలందలి విజ్ఞానం పరస్పరభిన్నాభిప్రాయాలతో ఖండనలతో, విభిన్నరూపములతో, ఉన్నది.

ఉదాహరణకు ''ఒక్క తత్త్వమునందే – సృష్టికి మూలకారణమేది? అనే విషయంలో 'సాంఖ్యులు' ప్రధానమనీ', వైశేషికులు 'పరమాణువులనీ, మీ మాంసకులు 'కర్మ' యని భిన్నకారణాలూ, అట్లే చార్వాకాదులు చెబుతున్నారు. సృష్టికి బ్రహ్మయే కారణమనే వేదాంతసిద్ధాంతం కూడా అలాంటి ఒక సిద్ధాంతమేగదా! దర్శనాలు వేనికవే ప్రమాణము మేమని చెప్పుకొంటున్నాయి. అట్లే వేదము కూడా పురుషబుద్ధి నిర్మితమైన గ్రంథము. తక్కినవానికి లేని ప్రామాణ్య విశిష్టత వేదమునకెట్లు వస్తుంది?'' ఇట్లుండగా మొదట వేదమే సర్వోత్కృష్ట ప్రమాణమని ముందు తేలితేగదా, వేదాంత నిర్ణయం నిలిచేది?–

దీనికి సమాధానమిది– ఈ ప్రశ్న అత్యంత పురాతనమైనది. సాంఖ్యవైశేషికనైయాయికాదులందరికీ వేద సిద్ధాంత మేమి? అను విషయంలో అభిప్రాయమున్నదే గాని, ఆస్తిక దర్శనములన్నీ వేద ప్రామాణ్యాన్ని అంగీకరించి బహు విధముల సమాధానం చెప్పినవి. వాని సారాంశాన్ని మనం ఈవిధంగా గ్రహింపవచ్చును.

వేదాంతములు గూడా వేదభాగమే. కాబట్టి వేదప్రామాణ్యమే వేదాంతములకు కూడా వర్తిస్తుంది. సకల దర్శనము లన్నింటిలో వేదాంతములే పరమ ప్రమాణం ఈ విషయం తెలుసుకొనేముందు, ''వేద'', ''ప్రమాణ'' శబ్దార్థములను గూర్చి విచారింపవలసి ఉంది. వేదశబ్దమునకు–

**''ప్రత్యక్షేణాను మిత్యావా, యస్తూపాయో నవిద్యతే ఏదంతితానివేదేన తస్మాత్ వేదస్య వేరతా!''**

అనినిర్వచనం. అంటే ప్రత్యక్ష ప్రమాణంచే గానీ, అనుమాన ప్రమాణముచే గానీ తెలియరాని దానిని వేదంచే, తెలుసుకొంటున్నాం. అని అర్థం. అనగా ప్రత్యక్ష ప్రమాణముచే గాని, అనుమాన ప్రమాణము (తార్కికమైన ఊహ)చే గాని మనము ఆయా పదార్థముల జ్ఞానం పొందుతున్నాము. శబ్ద స్పర్శ రూప రసగంధ విజ్ఞానమును శ్రోత్రాది పంచేంద్రియముల ద్వారా గ్రహించడం– 'ప్రత్యక్ష ప్రమాణం' కంటితో చూచిన వస్తువునో, చెవితో వినిన శబ్దమునో, 'ఇది యిది', అని స్పష్టంగా గ్రహింపగలుగుతాం. తక్కిన విషయాలు కూడా ఇట్లే, ప్రత్యక్షం గాకపోయినా, తర్క బద్ధమైన ఊహచే వస్తు నిర్ణయం చేయడం అనుమానం. పొగను చూసి కంటితో చూడకపోయినను, ఆ ప్రదేశంలో అగ్ని కలదనే నిర్ణయం అనుమాన ప్రమాణముచే జరుగుతుంది. అయితే ఈ అనుమానం కూడా ప్రత్యక్ష ప్రమాణంమీదనే ఆధారపడి ఉంటుంది. కనుక, ఆప్తవాక్యమై, శబ్దస్వరూపమైన వేదము ప్రమాణంగా అంగీకరింపబడుతున్నది.

వేదము బోధించు కర్మ, పుణ్య పాపములు, ఆత్మ స్వరూపము, మున్నగు మహా విషయములు ప్రత్యక్షాది ప్రమాణము లకు దొరకవు కనుక వేదమే శరణ్యం అయితే, ఈ వేదమనేది మహర్షులు వ్రాసిన శాస్త్ర గ్రంథముల వంటిదిగాదు.

కపిలుడు, కణాదుడు మున్నగు వారి దర్శనములు ఆయా శాస్త్రకారులచే రచింపబడినవి. విశిష్ట మేధా సంపన్నులైన పురుష

లచే నిర్మింపబడినవి. ఇవి పౌరుషేయములు వేదము అపౌరుషేయం. అంటే పురుషుని చేత రచింపబడినదిగాదు. ఈశ్వర విశ్వాస రూపముగా సహజ వినిర్గతమైనది. ఎంతటి యోగీశ్వరుడైనా, మేధాసంపన్నుడైనా పురుష బుద్ధి, భ్రమ ప్రమాద దోష దూషితమై ఉంటుంది. వారు దర్శించిన సత్యం అసమ గ్రమూ, అశాశ్వతమూ అయి ఉంటుంది. దీనికి నిదర్శనంగా ఈనాటి విజ్ఞాన శాస్త్ర పరి శోధనలను చెప్పవచ్చును. ఒక మహాశాస్త్రవేత్త కనుగొనిన ఒక భౌతికసత్యము, కాలాంత రమున మరియొకనిచే తిరస్కరింపబడు తున్నది. నూతనసత్యం వెలుగులోనికి వస్తుంది. ఉదాహరణకు - పరమాణువు విషయం తీసుకొనండి. Atom is indivisable, (అణువు భేదింపరానిది) అని చాలా కాలము విశ్వసింపబడినది. నేడది పరాస్తము. 'Atom is divisable' అని తేలినది. ఇట్లెన్నోగలవు.

వేద మట్టిదిగాదు. వేదములందు కన్పించు మహర్షుల పేర్లనుబట్టి అయా వేద శాఖలు వారిచే రచింపబడినవనీ, మూడువేలో, నాలుగువేలో సంవత్సరముల క్రితం వేదము పుట్టినదని కాలనిర్ణయం చేస్తూ, ఆధునికులు వేదములు పౌరుషేయములే అని వాదించు చున్నారు. అనాగరకదశనుండీ, క్రమంగా వేద నాగరకత వికసించింది అని కూడా సిద్ధాంత ములు గలవు. గ్రంథములు గలవు. కళాశాల లలో, విశ్వవిద్యాలయాలలో భారతీయ సంస్కృతి పేరిట ఇట్టి బోధయే జరుగుతున్నది. కానీ ఇది యెంత పొరపాటైన విషయమో, ఎంత వేదమునకు అపకారం జరుగుతున్నదో పలు వురు మహానుభావులు వివరించియే యున్నారు. ('ఋషిపీఠం జులై '99 ''అపౌరుషేయాలు'' రచన పరిశీలించండి'). కనుక సారంశమేమంటే వేదము అనాది, వేదము నుచ్చరించుచు జగత్సృష్టిని, సృష్టికర్త చేసినట్లున్నది. కనుక వేదము ఈశ్వరవాక్కు, అపౌరుషేయము అయా ఋషులు అయా వేదశాఖలను దర్శించినవారు. వినినవారు. కనుకనే శ్రుతమగుటచే వేదమునకు శృతి యని పేరు వచ్చింది. అసలు ఋషియను శబ్దము నకే, 'దర్శనాత్ ఋషిః'' (సత్యమును దర్శించి నందువలన ఋషి) అని అర్థము. ధ్యానస్థితిలో అతీంద్రియమైన వేదనాదమును శ్రవణము

**సూర్యుడు సమస్త పదార్థములను తాను ప్రకాశింపజేయును. కానీ**

**మరియొక పదార్థములేదు. చరాచర జగత్తునంతా వేద విజ్ఞానమే ప్రకాశింప జేస్తున్నది.**

జేసి, వేదార్థ విచారముచే, సత్యదర్శనము జేసినవారు, ఋషులు! సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ'' అని బ్రహ్మానుభవము పొందినవారు ఋషులు! అంతేగాని, కాళి దాసాదుల రఘువంశాది రచనలవలె వేదము పురుషబుద్ధి వినిర్గతమైన గ్రంథముకాదు.

ఇట్టి నేరము, ఈ కారణముచే స్వతః ప్రమాణము, అనగా తనకు తానే ప్రమా ణము. తన ప్రామాణ్యం మరియొక దానిపై ఆధారపడి యుండదు. శంకర భగవత్పాదులు ఇట్లనిరి. ''వేదస్యహి స్వార్థే ప్రామాణ్యం నిరపేక్షం, రవేరివ రూపవిషయే సూర్యుడు తన ప్రకాశమునకు తానే ప్రమాణమైనట్లు, వేదము తనకుతానే ప్రమాణమని ఈ వాక్యతాత్పర్యము. సూర్యుడు సమస్త పదార్థములను తాను ప్రకాశింప జేయును. కానీ సూర్యుని ప్రకాశింపజేయు మరియొక పదార్థములేదు. చరాచర జగత్తు నంతా వేద విజ్ఞానమే ప్రకాశింపజేస్తున్నది. నిత్య జ్ఞానస్వరూపమైన వేదభాగములే బ్రహ్మ విజ్ఞానంకంటె పరమ పురుషార్థంలేదని బోధిస్తున్నది.

ఇంకొక విషయం - మాటవరసకు వేదము పౌరుషేయమే అని అంగీకరించి ననూ, తదంతర్గతమైన వేదాంతము తప్పక నిలు స్తుంది. వేదాంతేతరములైన, సమస్త ఆస్తిక నాస్తిక సిద్ధాంతములన్నీ వేదాంత తర్కముచే సిద్ధాంతములచే ఓడింపబడినవే. అది ఎట్లో మనం క్రమంగా పరిశీలిస్తాం.

బ్రహ్మసత్యత్వమునకు వేదాంతములే గాక తర్కం, విద్వదను భవంకూడా ప్రమాణ ములే. కనుక వేదాంత ప్రమాణములచే జనించిన బ్రహ్మజ్ఞానమే మోక్షము ప్రసాదిం చును. అయితే ఈ బ్రహ్మ సత్యత్వము వేదాంత ప్రమాణముచే మాత్రమే తెలియ దగినది. తర్కముకూడ దానికి సహాయకంగా అంగీ కరింపవచ్చు. కాబట్టి నైయాయిక మీ మాంస కాదిమతములు, వేదప్రామాణ్యము, నాస్తిక మతఖండనమూ, జీవుని స్వభావమూ, మున్నగునవి బోధించినను, పారమార్థిక సత్య మును, సంపూర్ణ దుఃఖనివృత్తి పూర్వక మైన, ఆనందప్రాప్తిరూపమైన బ్రహ్మాత్వ విజ్ఞానమును బోధించడంలేదు. నిత్యత్వప్తం, నిరవయవం, సర్వభూతాంతరాత్మకం, స్వయంజ్యోతి స్వభా వం, అద్వితీయం, అయిన పరబ్రహ్మతత్త్వం కేవలం ఉపనిషత్తుల వలననే, అనగా వేదాంత ముల మూలముననే ప్రతిపాదింపబడుతోంది.

*(సశేషం)*

## సందేహాలకు సమాధానాలు




నిర్వహణ: ఋషిపీఠం

ఏ.రాజరత్నం అమలాపురం

ప్ర. 'నాసాగ్ర దృష్టి'తో ధ్యానం చేయమని భగవద్గీతలో ఉంది. 'నాసాగ్రం' అంటే 'ముక్కుకొన' అని అర్థమా? లేక భ్రూమధ్యమా (కనుబొమల నడిమి)? నాసాగ్రే నవమౌక్తికం' అనేటప్పుడు 'ముక్కు కొనలో ముత్యమ'నే అర్థం కదా?

జ. శ్రీకృష్ణుని సౌందర్యాన్ని వర్ణిస్తూ చెప్పిన ''నాసాగ్రే నవమౌక్తికం'' అంటే ''ముక్కు కొనపై అలంకరించుకున్న ముత్యం'' అనే అర్థం. కానీ ధ్యాన విషయంలో చెప్పేటప్పుడు మాత్రం 'నాసాగ్ర దృష్టి' అంటే 'కనుబొమల మధ్య (భ్రూమధ్యం) దృష్టి'' అనే అర్థం.

ఎందుకంటే - రెండూ నాసానికి 'అగ్రాలే' (కొనలే). కానీ ధ్యానంలో అధోదృష్టి కూడదు. ఊర్ధ్వ దృష్టే ముఖ్యం. పైగా - యోగశాస్త్రంలో భ్రూమధ్య దృష్టినే ధ్యానానికి ముఖ్యంగా చెప్పారు. ''అవిముక్తోపాసన'' అని ఉపనిషత్తులలో ప్రత్యేకించి చెప్పబడింది. ''భ్రూఘ్రాణంబుల సంధి అవిముక్తం'' అని అక్కడ నిర్వచించారు. కాశీ/లేదా అవిముక్త క్షేత్రం మన శరీరంలో కనుబొమల నడుమ ఉంది. అక్కడ బిందు (జ్యోతి) రూపంగా నున్న పరమాత్మను ధ్యానించడమే. అవి ముక్తోపాసన అని చెప్పారు. ఇలా అనేక యోగ శాస్త్రాలలో 'నాసాగ్రం' అనే పదానికి, 'భ్రూమధ్యం' అనే చెప్పబడింది. కనుక గీతలో చెప్పబడిన 'నాసాగ్ర దృష్టి'కి భ్రూమధ్య మనే అర్థం.

టి.సురేంద్ర తాడిపత్రి

ప్ర. 'సంధ్యా కాలం' చాలా పవిత్రమైనదని, ఆ సమయంలో భగవద్ధ్యానం మంచిదనీ అంటారు. సంధ్యాకాలం అంటే సరిగ్గా ఏ సమయం? 'సకాలం'లో సంధ్యావందనం చేయాలి కదా? ఆ 'సకాలం' ఏమిటి?

జ. రోజుకి మూడు సంధ్యలు శాస్త్రంలో చెప్పబడ్డాయి. 1. ప్రాతః సంధ్య, 2. మధ్యాహ్న సంధ్య 3. సాయం సంధ్య. ఇవికాక కొన్ని ఉపాసనలకు చెప్పబడ్డ సంధ్య - తురీయ సంధ్య. ఇది నాలుగవది. దీని సమయం అర్ధరాత్రి.

**1. ఉత్తమా తారకోపేతా**
**మధ్యమా లుప్త తారకా ।**
**అధమా సూర్యసహితా**
**ప్రాతఃసంధ్యాత్రిధా మతా ॥**

తెల్లవారుఝామున నక్షత్రాలుండగా ప్రాతః సంధ్యావందనానికి ముఖ్యకాలం. ఇదే సకాలం. తారకలు లేని ప్రాతఃకాలం మధ్య కాలం, సూర్యుడుదయించిన తరువాత సంధ్యావందనానికి అధమ కాలం, సకాలంలో చేయడమే సర్వ శ్రేష్ఠం. అలా కుదరనప్పుడు, మానేయడం మంచిది కాదు కనుక, ''ముఖ్య కాలాతిక్రమణ దోష పరిహారార్థం'' అధిక అర్ఘ్యప్రదానంతో సంధ్యోపాసన చేయాలి.

**2. ఉత్తమా సూర్యసహితా**
**మధ్యమా లుప్త భాస్కరా ।**
**అధమా తారకోపేతా**
**సాయం సంధ్యా త్రిధా మతా ॥**

సాయంవేళ సూర్యుడుండగా చేసే సంధ్యావందనం ముఖ్య కాలం, సకాలం. సూర్యుడస్తమించినప్పుడు మధ్యమం. నక్షత్రోదయం తరువాత చేయడం అధమం. కానీ 'సకాలం' దాటిపోతే, ప్రాతః సంధ్యకు లాగానే, 'ముఖ్య కాలాతిక్రమణ దోష పరిహారార్థం' అధిక అర్ఘ్య ప్రదానం చేయాలి.

'మధ్యాహ్న సంధ్య' అంటే మధ్యాహ్నం 11 గంటల తరువాత నుండి సాయంత్రం లోపల చేయాలి.

జి.శ్రీనివాస్ పూనూరు

ప్ర.శని దోష నివారణకు ఏదైనా స్తోత్రముంటే తెలియజేయండి.

జ. ప్రతి శనివారం వీలును బట్టి ఉపవాసం గానీ, లేదా ఒంటిపూట గానీ చేసి, శివాభిషేకం చేయించడం మంచిది. నిత్యం ఈ దిగువ స్తోత్రం చదువుకోండి :

**నమస్తే కోణ సంస్థాయ పింగలాయ నమోస్తుతే ।**
**నమస్తే బభ్రురూపాయ కృష్ణాయ చ నమోస్తుతే ॥**
**నమస్తే రౌద్ర దేహాయ నమస్తే చాంతకాయ చ**
**నమస్తే యమ సంజ్ఞాయ శనైశ్చర నమోస్తుతే ।**
**ప్రసాదం మమ దేవేశ దీనస్య ప్రణతస్య చ ॥**

ఎల్.శక్తి కాళహస్తి

ప్ర. ఆంజనేయుడు 'సంజీవని' తేవడానికి వెళ్లినప్పుడు సమయం దాటి వెళ్లేలా చేయాలని 'కాలనేమి' అనే రాక్షసుడు సాధువేషం ధరించి రామభజన చేశాడనీ, అది చూసి హనుమంతుడు మైమరచి పోయి తానూ రామభజన చేశాడనీ ఒక కథ విన్నాను. భక్తి మైకంలో పడి కర్తవ్యం మరచిపోవడం మంచిదేనా?

జ. ఈ కాలనేమి కథ వాల్మీకి రామాయణంలో లేనే లేదు. తరువాతి కాలంలో పుట్టింది. భక్తి ఏనాడూ మైమరపో, మైకమో కాదు. పైగా - రామసోదరుడు బాధితుడై ఉన్నప్పుడు, సాక్షాత్తూ రాముడే శోకతప్తుడై ఉన్నప్పుడు, వారి క్షేమం కోసమని బయలుదేరిన హనుమంతుడు ఆ కర్తవ్యం మరచిపోతే ఇంక రామభక్తి ఏమిటి? భక్తి తనని తాను మైమరచి పోకుండా, నిత్య జాగృతం చేసే శక్తి. కాబట్టి ఎవడో రామభజన

చేస్తూ వుంటే, యుక్తా యుక్త విచక్షణ కోల్పోయి తానూ భజన చేస్తూ కూర్చొని కర్తవ్యాన్ని విస్మరించడం బుద్ధిమం తుడి లక్షణం కాదు. ఆంజనేయ స్వామి బుద్ధి మంతులలో అగ్రగణ్యుడు. **బుద్ధిమతాం వరిష్ఠం.**

కె.శ్రీనివాసాచార్య తిరుమతి

ప్ర.'రుద్రనమక మంత్రాలు' యజుర్వేదంలో 'చిత్యగ్ని హోమోక్తి' అనే భాగంలో చెప్పబడ్డాయి. అంటే అగ్నిచయన దీక్షలో చెప్పిన మంత్రాలే కదా అవి. మరి రుద్రాభిషేకంలో ఎందుకు ఆ మంత్రాలు ఉపయోగిస్తారు. కేవలం ఒక హోమ మంత్రాలను అనేక విధాలుగా జప, అభిషేకాదులకు ఉపయోగించాలని ఎక్కడ చెప్పారు?

జ. యజుర్వేదంలో 'చిత్యగ్ని హోమోక్తి'లోనే రుద్రనమకం చెప్పబడింది. నిజమే. కానీ సమస్త వేద విద్యలో హృదయ స్థానంలో నున్నది యజుర్వేదం. దానికి మధ్యభాగంలో నున్నది నమకం. అంటే వేదం యొక్క సమగ్ర సారం ఒకచోట చేరితే అది రుద్రం. వేదం 1. కర్మకాండ, 2. జ్ఞానకాండ, 3. ఉపాసన కాండ - అని మూడు విధాలు. కనుక వేద మధ్య భాగంలో నున్న 'మంత్ర భాగం' ఈ మూడు లక్షణాలతో ఉన్నదే కావాలి. కాబట్టి రుద్ర మంత్రాలు కర్మ, జ్ఞాన, ఉపాసనాత్మ కాలు.

వేదమంత్రాల ప్రయోగ విధులను తెలియజేసే శాస్త్రం 'కల్పం'. ఇది షడంగాలలో ఒకటి. (షడంగాలు : 1. శిక్ష, 2. వ్యాకరణ, 3. ఛంద, 4. నిరుక్త, 5. జ్యోతిష, 6. కల్ప). బోధాయన మహర్షి మొదలైన వారు ఈ 'కల్ప' శాస్త్ర కర్తలు. వారు రుద్ర, మంత్ర ప్రయోగ విధులు తెలియ జేస్తూ, జప, హోమ, అర్చన, అభిషేకాదు లకు నమక మంత్రాలు ఉపయోగించే విధానం తెలియజేశారు.

అంతేకాక 'రుద్ర నమకం' ఉపనిషత్తుగా కూడా ఇతర ఉపనిషత్తులలో పేర్కొనబడింది.

'మేరు తంత్రం' వంటి తంత్ర శాస్త్ర గ్రంథాలలో 'రుద్రనమక మంత్రాల'లో ఒక్కొక్క మంత్రాన్నీ ఏవిధంగా జపించాలీ, ఏవిధంగా పురశ్చరణ చేయాలి అనే విషయాలు వివరించబడ్డాయి.

ఈవిధంగా జ్ఞానబోధకమైన తత్త్వశాస్త్రం గానూ, యజ్ఞాది కర్మలలో ప్రయోగింపబడే కర్మకాండగానూ, ఉపాసనపరమైన తంత్రం గానూ 'రుద్ర నమక మంత్రాలు' శాస్త్ర సమ్మతంగా ఉపయోగింపబడుతున్నాయి.

కుమార్ భీమవరం

ప్ర. భస్మధారణ కేవలం శైవులకేనా? వైష్ణవులకు లేదా?

జ. శైవం, వైష్ణవం అనే మతభేధాలు మధ్యలో వచ్చినవి. వాటిబట్టే ఈ తేడాలు కనిపించేది. నిజానికి భస్మధారణ అనేది వేదమతం. అగ్ని హోత్ర, కర్మానంతరం ఆ భస్మాన్ని 'అగ్ని సారం'గా భగవత్ప్రసాదంగా నొసట ధరించ డం వేద పద్ధతి. అది ఎవరికైనా అవసరమే. ఇందులో శైవ వైష్ణవ భేదం లేదు.

ఈ భస్మధారణ వల్ల సూక్ష్మజగత్తులో నున్న అరిష్టాలు, దృష్టి దోషాదుల భీతి ఉండదు. దైవరక్ష లభిస్తుంది. ఆ దైవం శివుడన్నా, విష్ణువన్నా, అగ్ని అన్నా... ఏదన్నా ఒక్కటే.

పి.వైదేహి నెల్లూరు

ప్ర. బ్రహ్మకు నాలుగు తలలుంటాయి ఎందుకు? అతడ్ని ఎప్పుడూ ముసలివాడుగానే చూపిస్తా రెందుకు?

జ. దేవతలకు ముఖాలు వరుసగా (పంక్తిగా) ఉండవు. వర్తులాకారంలో ఉంటా యి. అన్ని కోణాలలో, అన్ని వైపులా దర్శించే సర్వతో ముఖత్వానికి చిహ్నమిది. చతుర్వేదాల స్వరూపుడు కనుక బ్రహ్మ చతుర్ముఖుడు, ఒక ముసలివాడుగా చూపించడం మన చిత్రకారుల, సినిమావాళ్ల ఊహ తప్ప, దేవతలు వృద్ధులు కారు.

జె.ప్రసూన విజయవాడ

ప్ర. ఎవరైనా ముత్తయిదువలు ఇంటికి వస్తే తాంబూలం, పళ్లు, పసుపు, కుంకుమ, రవికల గుడ్డ ఇస్తూ ఉంటాం. వాటిని వారు తిరిగి వారింటికి వచ్చే ముత్తయిదువలకు ఇవ్వవచ్చా?

జ. అలా ఒకరిచ్చిన వాటిని ఇంకొకరికి ఇవ్వడం తప్పు. ముత్తయిదువులలో లక్ష్మీ భావన, గౌరీ భావన చేసి ఇచ్చిన తాంబూ లాదులు మళ్లీ ఇంకొకరికి యివ్వకూడదు. ఒకసారి పూజ చేసిన పువ్వులతో మళ్లీ దేవుడికి పూజ చేయం కదా!

ఆర్.మురళి గుడివాడ

ప్ర.ఏ ఆసనం మీద కూర్చుని జపం చేయాలి?

జ. కర్ర, రాయి, పచ్చిక నేల, ఇటుకలు... వీటిపై కూర్చుని జపం చేయకూడదు. కంబళి, దర్భ, జింకచర్మం, పులి చర్మం ఆసనాలుగా ఉండడం మంచిది. కంబళి - దుఃఖ విమోచనం, పులి చర్మం - సిద్ధిదాయకం, జింక చర్మం - జ్ఞాన కారకం, దర్భాసనం - సర్వాభీష్ట ప్రదాయకం.

ఎన్.మూర్తి శ్రీకాకుళం

ప్ర.''ధనమూలమిదం జగత్'' అంటారు కదా! ఇది ఏ సందర్భంలో చెప్పారు? ధనానికి అంత ప్రాధాన్యమిచ్చారా?

జ. **''వేదమూల మిదంజ్ఞానం**
**కృషిమూల మిదం ధాన్యం**
**భార్యామూల మిదంగృహం**
**ధనమూల మిదం జగత్॥''**

- ఇది జీవితంలో మనిషికి ముఖ్యమైన విషయాలు చెప్పే ప్రాచీన నీతి శ్లోకం. లౌకిక విషయాలు క్రమంగా సాధించి, పరాన్ని పొందాలి. ఉపాధి నిలవడానికి అవసరమైన భౌతిక ప్రయోజనాలకు ధనం ముఖ్యం. ఇల్లు నిలవడానికి ఇల్లాలు హేతువు. ధాన్యానికి కృషి ప్రధానం. జ్ఞానానికి వేదం మూలం.

ఇలా దేనికి ఏది మూలమో చెప్తూ వివరించిన సందర్భమిది. ✦

# స్త్రీల సౌభాగ్యాన్ని కాపాడే స్తోత్రం

సర్వ మానవాళి క్షేమం కోసం, వివిధ అభీష్టాల సిద్ధి కోసం, వేద, పురాణ, తంత్ర శాస్త్రాలు అనేక మార్గాలు సూచించాయి. స్థూలంగా కనిపించే జగత్తుని ప్రభావితం చేసే సూక్ష్మ ప్రపంచం ఎంతో ఉంది. వాటిని సవ రించితే, స్థూల జగత్తుని బాగుచేయవచ్చు.

సూక్ష్మ ప్రపంచంలోని దైవిక శక్తులను ప్రసన్నం చేసుకొని, వాటిద్వారా దుష్కర్మల ప్రభావం నుండి బయటపడి, వాంఛిత ఫలాలను పొందేందుకు మంత్ర, స్తోత్రాది "శబ్ద ఔషధాలు" మన శాస్త్రాలు అందిం చాయి.

స్త్రీల సౌభాగ్యాన్ని కాపాడే అనేక నోములు, వ్రతాలు చెప్పిన సనాతన ధర్మ శాస్త్రం, కొన్ని స్తోత్రరత్నాలనూ అందించింది.

పతి ఆయుష్మంతుడై ఉండేందుకు, ఇతర ఐశ్వర్యాభివృద్ధి సాధించేందుకు మహిమాన్వితమైన ఒక స్తోత్రం "బ్రహ్మవైవర్త పురాణం"లో ఉంది.

**నమః కాంతాయ భర్త్రే చ**
**శిరశ్చంద్ర స్వరూపిణే।**
**నమశ్శాంతాయ దాంతాయ**
**సర్వ దేవాశ్రయాయ చ ॥**

**నమో బ్రహ్మ స్వరూపాయ**
**సతీప్రాణపరాయ చ।**
**నమస్యాయ చ పూజ్యాయ**
**హృదాధారయ తే నమః ॥**

**పంచ ప్రాణాధిదేవాయ**
**చక్షుషస్తారకాయ చ।**
**జ్ఞానాధారాయ పత్నీనాం**
**పరమానంద రూపిణే ॥**

**పతిర్బ్రహ్మ పతిర్విష్ణుః**
**పతిరేవ మహేశ్వరః।**
**పతిశ్చనిర్గుణాధారో**
**బ్రహ్మరూప! నమోస్తుతే ॥**

**క్షమస్వ భగవన్! దోషం-**
**జ్ఞానాజ్ఞానకృతం చయత్।**
**పత్నీబంధో! దయాసింధో**
**దాసీ దోషం క్షమస్వమే ॥**

**ఇతిస్తోత్రం మహాపుణ్యం**
**సృష్ట్యాదౌ పద్మయాకృతం।**
**సరస్వత్యా చ ధరయా**
**గంగయా చ పురావ్రజ ॥**

**సావిత్ర్యాచ కృతం పూర్వం**
**బ్రహ్మణే చాపి నిత్యశః।**
**పార్వత్యా చ కృతం భక్త్యా**
**కైలాసే శంకరాయ చ॥**

ఈ మహిమాన్వితమైన స్తోత్రం సృష్ట్యాదిలో లక్ష్మీదేవి చేసినది. ఆ తరువాత సరస్వతి, భూదేవి, గంగ, సావిత్రి, పార్వతి ఈ స్తోత్రాన్ని జపించారని పురాణోక్తి.

కుటుంబ వ్యవస్థనీ, దాంపత్య ధర్మాన్నీ కాపాడుకుంటే ధర్మవ్యవస్థ కాపాడబడు తుంది.

కుటుంబాన్ని, వారి సర్వశ్రేయస్సునీ రక్షించే మహారాణి స్త్రీ. అందుకు దైవ సహాయాన్ని కూడా తీసుకురాగలిగే శక్తి స్త్రీకి ఉంది. అందుకే స్త్రీని గౌరవించాలి. స్త్రీ గౌరవింపబడే చోట సర్వ ఐశ్వర్యాలు వర్ధిల్లుతాయి.

## మహాభారత ప్రశ్నోక్తి – 5 కి జవాబులు

11. ఘటోత్కజుడు
12. ఉత్తరుడు (ఉత్తరగోగ్రహణం ముందు ఉత్తరునికి బృహన్నల రూపంలో ఉన్న అర్జునుడు సారధ్యం చేశాడు)
13. దేవదత్తము ఇచ్చినవాడు అగ్ని
14. కచుని ప్రేమించునది, యయాతిని పెళ్ళి చేసుకొన్నది. కచుని ప్రేమిస్తే అతడు "గురువులకు శిష్యులు పుత్రసమానులు. అందుచేత నీవు సోదరి వవుతావు." అని తిరస్కరించాడు. అపుడు కచుని "నీకు మృత సంజీవని విద్య పనిచేయదు" అని దేవయాని శపించినది. అతడు "నిన్ను బ్రాహ్మణుడు వివాహమాడకుండు గాక" అని శపించాడు. అందుకే రాజైన యయాతిని చేసుకొన్నది. ఆది 3-131.
15. కర్ణుడు - నాగాస్త్రంతో కృష్ణుడు రథాన్ని అయిదు అంగుళాలు భూమిలోకి దించివేశాడు. దానితో ఆ నాగాస్త్రం అర్జునుని కిరీటాన్ని కొట్టిపోయింది. కర్ణ 3-3-319
16. పదునారు సంవత్సరాలు.
17. నాకూ అర్జునునకూ తప్ప ఎవరికీ కనపడరాదనీ, భీమునికి అసలు కనపడరాదనీ ప్రార్థించాడు. 4-1-177
18. ఉదంకుడు : పౌష్యమహాదేవి కుండలాలు తెస్తున్న ఉదంకుని మోసగించి తక్షకుడు కుండలాలు హరిస్తాడు. అందుకే ఉదంకుడు జనమేజయుని సర్పయాగం చేయుమన్నాడు - తన తండ్రి కూడా పాము కాటువల్లనే చనిపోయాడని జనమేజయుడు సర్పయాగం చేశాడు. ఆది 1-121
19. లక్ష శ్లోకాలు.
20. అంబ కాశీరాజు కూతుళ్లు అంబ, అంబిక, అంబాలిక. ముగ్గురినీ తీసుకు వచ్చి భీష్ముడు తన తమ్ముడు విచిత్రవీర్యునికి పెళ్ళి చేయాలనుకుంటే అంబ తాను సాల్వరాజును ప్రేమించానంది. అప్పుడు భీష్ముడు అంబను సాల్వుని దగ్గరకు పంపాడు. కాని సాల్వుడు తిరస్కరించాడు. తిరిగి వచ్చి అంబ భీష్ముని చేసుకొమ్మంది - భీష్ముడు కుదరదన్నాడు. అప్పుడు అంబ పరశురాముని ఆశ్రయించింది. అతడు భీష్మునితో అంబను చేసుకొమ్మన్నాడు - కాదన్నాడు భీష్ముడు. అప్పుడు ఇరువురూ తలపడ్డారు. 5-4-315

**5 మార్చి 2000 నుండి**
**5 ఏప్రిల్ 2000 వరకు**

# ఈనెల విశేషాలు

శ్రీ ఎస్. రామమూర్తి శర్మ

(శ్రీ ప్రమాధి నామ సంవత్సర మాఘ బహుళ చతుర్దశి మార్చి 5వ తేదీ మొదలు విక్రమనామ సంవత్సర పాడ్యమి (ఏప్రిల్ 5) వరకు)

## ముఖ్యదినాలు

మార్చి 2000

7 ఫాల్గుణ మాసారంభం

14 మీన సంక్రమణం

17 అన్నమాచార్య వర్ధంతి

19 ఫాల్గుణ పూర్ణిమ – హోలీ పండుగ

31 సర్వ ఏకాదశి

ఏప్రిల్ 5 విక్రమ నామ సంవత్సరాది – ఉగాది

### ✷ 7 ఫాల్గుణ మాసారంభం

ఈ మాసాన వస్త్ర, ధాన్య, గోదానాలు గోవిందునికి ప్రీతికరాలు, అరిష్టపరిహారాలు, ఈ రోజునుండి 12 రోజులు ''ప్రయో వ్రతం'' అనే పేరుతో శ్రీకృష్ణునకు క్షీర, వేదనము మొదలైన విధులను భాగవతం చెప్తోంది.

### ✷ 14 మీన సంక్రమణ

ఈరోజున సూర్యభగవానుడు మీన రాశిలో ప్రవేశిస్తాడు. ఈ సంక్రమణ పుణ్యవేళ జపతపాలు, విష్ణుసహస్రనామ పారాయణ, దానాలు వంటి పుణ్యకార్యాలు విశేష ఫలాన్నిస్తాయి.

### ✷ 19 హోలీ పండుగ

ఫాల్గుణ పూర్ణిమనాడు వచ్చే ఈ పర్వదినాన్ని వసంత శోభకు స్వాగతంగా నిర్వహిస్తారు.



''హోళికా'' అనేది ఒక దేవత. ఎండిన కర్రలు, ఆవుపేడ పిడకలు రాశిపోసి అగ్ని నంటించి, అందులో ''హోళికా'' దేవతలను ఆహ్వానించి షోడశోపచారాలతో పూజించడం ఆచారం, రాక్షసబాధానివారణకు, భయపరిహారానికి ఈ పూజ విధింపబడింది.

**వందితాసి సురేంద్రేణ**

**అతస్త్వం పాహినో దేవి**
**భూతే భూతిప్రదాభవ ॥**

అని ప్రార్థించి, హోళికను ఆవాహ్య చేసిన అగ్నికి ముమ్మారులు ప్రదక్షిణచేసి, బంధుమిత్రాది గ్రామస్థులంతా కలిసి పరిహాసాలతో, స్వేచ్ఛగా ఆటపాటల్లో వినోదించాలి.

హోళికా దేవతారాధనవల్ల ఈ పూర్ణిమకు 'హోళికా పూర్ణిమ' (హోళీ పూర్ణిమ) అని పేరు వచ్చింది.

✷ ఫాల్గుణ పూర్ణిమనాడు ఊయెల శ్రీకృష్ణ ప్రతిమను ఉంచి అర్చించాలి అని కూడా ధర్మశాస్త్రం చెప్తోంది. కాబట్టి 'డోలా పూర్ణిమ' అనిసైతం పిలుస్తారు. ఇప్పటికీ ఉత్కళ, వంగ రాష్ట్రాలలో ఈ ఉత్సవాన్ని నిర్వహిస్తుంటారు. (డోల- అంటే ఊయెల)

**నరా డోలా గతం దృష్ట్వా**
**గోవిందం పురుషోత్తమమ్ ।**
**ఫాల్గున్యాం ప్రయతో భూత్వా**
**గోవిందస్యపురం వ్రజేత్ ॥**

ఫాల్గుణ పూర్ణిమనాడు 'డోల'లోనున్న గోవిందుని దర్శించేవారు – వైకుంఠవాసాన్ని పొందుతారని ధర్మశాస్త్ర వచనం.

### 17 అన్నమాచార్య వర్ధంతి

'సంకీర్తనాచార్యుడు' అన్నమయ్య వైకుంఠధామం చేరిన దినమిది. శ్రీ వెంకటేశుని వైభవాన్ని స్తుతిస్తూ 32 వేల కీర్తనలు రచించిన ఈ మహానుభావుడు, వేంకటేశుని వివిధవిధాలుగా సేవిస్తూ– ''ఒక్క సంకీర్తనే చాలు ఒద్దికై మము రక్షింపగ'' అని పలికి స్వామిలో ఐక్యమయ్యాడు.

తెలుగువారు గర్వించదగ్గ ప్రప్రథమ వాగ్గేయకారుడీయన.

### ✷ ఏప్రిల్ – 5 ఉగాది.

ఈ రోజున విక్రమనామ సంవత్సరం ప్రారంభం.

ప్రాతఃకాలాన లేచి అభ్యంగన స్నానంతో రోజు ప్రారంభించాలి. ✦

# ఆప్తవాక్యం

## క్రతో స్మర క్లిబే స్మగ కృతంస్మర

**శుభకర్మలను గుర్తుంచుకో. నీ సామర్థ్యాన్ని గుర్తుంచుకో, ఇతరులు చేసిన మంచిని (కృతజ్ఞత) గుర్తుంచుకో** – *యజుర్వేదం*

లోకశ్రేయస్సుకై చేసే శుభ కర్మను 'క్రతువు' అంటారు. వాటి ఏనాడూ విడువ కూడదు.

అదేవిధంగా స్వశక్తినీ, స్వసామర్థ్యాన్నీ విస్మరించరాదు. మనమేమిటో, మనశక్తి ఏమిటో గుర్తించాలి. ప్రతి వ్యక్తీ ఈ విశ్వశ్రేయస్సు అనే మహాయజ్ఞ నిర్వహణకి సాధనగా మారాలి. అందుకు తన సామర్థ్యాన్ని వినియోగించుకోవాలి.

ఈ శరీరమనే శక్తిమంతమైన సాధన భగవంతుడు మనకిచ్చిన గొప్ప వరం. దీనికి ఉన్న సమర్థతని నిరంతరం తెలుసుకొని, దానిని వినియోగించాలి.

శరీరశక్తి, బుద్ధిశక్తి – రెండింటినీ వినియోగించమని మనవేదమతం చెప్తోంది. ఆలోచన, మేధస్సు, ప్రణాళికాబద్ధమైన కార్య నిర్వహణ ఇవన్నీ 'శ్రేయస్సు' అనేలక్ష్యంతో సమర్థవంతంగా సాగాలి. మనం అసమర్థుల మనే భావనే రాకూడదు. సమర్థులుగా మనల్ని మనం మలచుకోవాలి.

ఈ విశ్వచక్రంలో ప్రత్యణువూ ప్రధానమే. ప్రతిదీ సమర్థవంతమే. కనుక ఆత్మన్యూనతా భావం పనికిరాదు. సోమరి తనం, బద్ధకం విడిచిపెట్టాలి. ఈ భావమే 'క్లిబేస్మగ' – అనే చిన్న వాక్యాల్లో ఇమిడి వుంది.

దైవాన్ని విశ్వసిస్తూనే, స్వశక్తిని వినియో గించడం అనేది భారతీయ మతంలోని ప్రత్యేకత.

అయితే మన కార్య నిర్వహణకి ఎందరి సహాయమో అనివార్యంగా తీసుకుంటాం. అంతేకాదు మన అవసరాలకీ, జీవనగమనా నికీ ఇతరుల చేయూత, సహకారం లేకుండా బ్రతకలేం. కానీ అలా మనకు సహాయపడ్డ వారిని మరువరాదు. కృతజ్ఞతా భావంతో ఉండాలి. ఈ ''కృతజ్ఞత'' అనేదానికి వేదమతం విశేష ప్రాధాన్యమిచ్చింది. చేసిన దానిని మరచిపోవడం ''కృతఘ్నత'' మహా పాపమనీ, దీనికి నిష్కృతే లేదని వైదిక శాస్త్రాలు వివిధ ఉపాఖ్యానాల ద్వారా కూడా చెప్పాయి.

'మనిషి'కి ఉండే వైయుక్తికమైన, సామా జికమైన బాధ్యతలు ఎన్నో. అవి సక్రమంగా నడవాలంటే ఈ మూడు వాక్యాలూ ప్రధానం.

మొదటిది – మంచి పనులు చేయడం, రెండవది – మన్మై మనం విశ్వాసంతో మన సామర్థ్యాన్ని వినియోగించుకోవడం, మూడవది ఇతరులు చేసిన మేలుని మరువకపోవడం, ఈ మూడింటిగన్నా జీవిత సార్థక్యం ఇంకేముం టుంది!

'కృతజ్ఞత' అనేది సాటి మనిషి పట్లే కాదు. మన చుట్టూ ఉన్న ప్రకృతి కూడా మన జీవితా నికి అపారమైన ఆధారమవుతోంది, పోషి స్తోంది. ఆ ప్రకృతిని 'జడం'గా భావించరాదు. ప్రతిదీ భగవత్ చైతన్యంతో దీపిస్తున్నదే. కాబట్టే ఆ ప్రకృతిని కూడా క్షోభపెట్టకూడదు. అలాగే మననీ, మనచుట్టూ విశ్వాన్నీ నడిపే దైవీ శక్తులను కూడా విస్మరించరాదు.

వీటిలో వేటి పట్ల కృతఘ్నత చూసినా మహాపాపమే, స్వసామర్థ్యానికి ప్రాధాన్య మిచ్చారుగానీ, 'స్వసుఖా'నికి కాదు, కృత ఘ్నతతో సుఖపడితే ఆ సుఖం దుష్పరిణామా లకే దారితీస్తుంది. కాబట్టి ఈ మంత్రంలో అంతిమ వాక్యంగా ''కృతం స్మర'' – అని కృతజ్ఞతకి పెద్ద పీట వేసింది వేదం. మొదటి వాక్యం – ''సత్కర్మాచరణ.''

అంటే సత్కర్మాచరణకీ, కృతజ్ఞతకీ మధ్యనే ''తన సామర్థ్యం''. దీని అర్థం – మన సామర్థ్యం ఈ రెండింటి కోసమే వినయోగింప బడాలి – అని. ✦

# MEMBERSHIP FORM

*Please fill in capital letters and mail to...*

**RUSHI PEETHAM PUBLICATIONS**

'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be a member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) ☐ 3 Years Rs 360/- (US $90) ☐

5 Years Rs 600/- (US $125) ☐ Donations Rs ..........................

Iam paying by cheque/D.D.No.............................................drawn on
.......................................................................for Rs...........................
date...............Favouring Rushi Peetham Publications.

Name : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

Sex : Male ☐ Female ☐ Age ☐

Address : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

City : ☐☐☐☐☐☐☐☐☐☐☐ Pin : ☐☐☐☐☐☐

Education : School ☐ College ☐ Graduate/Post Graduate ☐

Business ☐ Employed ☐ Retired ☐

P.T.O.

Please mention Addresses or E-mail of your Nearest & Dearest who have interest in Rushi Peetham, Bharatheeya Manasa Patrika

1.

2.

3.

4.

5.

6.

7.

8.

9.

10.

11

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

Owned & Published by : **UPADRASTA SIVAPRASAD** From From : No.3, Kamarajasalai, Ashok Nagar, Chennai - 600 083.
Printed By : **V.C. Chermakani, Sakthi Process**, No. 21F Kumballamman Koil St., Chennai - 600 081. Edited by : **SAMAVEDAM SHANMUKHA SARMA**

# ‘ఋషిపీఠం’ సంస్కృతి సంఘం
## - నిర్వహణకు ఆహ్వానం

ఆర్ష (ఋషి) విద్యావ్యాప్తికి మాస పత్రిక నిర్వహణతోపాటూ, ఇతర ప్రచురణలు, ఆడియోలు వెలువరించడమే కాక – ఊరూరా సనాతన సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని వివిధ కార్యక్రమాల ద్వారా తెలియజేయాలని ఈ సంస్కృతి సంఘం సంకల్పం.

మన సనాతన భారతీయ ధర్మానికి వారసులైన, చిత్తశుద్ధి కలిగిన, ఆసక్తిపరులు తమ వివరాలను, పూర్తి చిరునామాను తెలియజేస్తూ ‘ఋషిపీఠం’కి వ్రాయండి. వారిలో ఎంపిక చేసిన వారిని ఆ ప్రాంతానికి ‘‘ఋషిపీఠం సంస్కృతి సంఘ ప్రతినిధి’’గా గౌరవించి, సంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ బాధ్యతను ‘‘ఋషిపీఠం’’ – అప్పగిస్తుంది.

ఆ సంఘంలో సభ్యులను చేర్పించడం ‘ఋషిపీఠం’ లక్ష్యాలను చిత్తశుద్ధిగా, బాధ్యతాయుతంగా వ్యాప్తి చేయడం, కార్యక్రమ నివేదికలను క్రమం తప్పకుండా మాకు పంపడం ప్రతినిధికి తప్పనిసరి బాధ్యత.

ఈ సంస్కృతి సంఘ అభ్యున్నతికి వలసిన సహాయాన్ని అందజేసేవారు ఆ ప్రతినిధికిగానీ, ‘ఋషిపీఠం’కి నేరుగా గానీ విషయం తెలియజేయవచ్చు. ఋషిసంస్కృతిపట్ల నిష్ఠ, ధర్మదృష్టి, చిత్తశుద్ధి – ఇవే ఈ సంస్కృతి సంఘం ప్రాతినిధ్యానికి కనీసార్హతలు.

ఉత్సాహవంతులైన వారు ‘‘ఋషిపీఠం – భారతీయ మానస పత్రిక ’’ చిరునామాకు వివరాలతో సహా ఉత్తరం వ్రాయండి.

*- సంపాదకుడు*

RNI. No. : TNTEL/1999/92
Postal Regn.No. TN/Chief Pmg-30/2000

రామా! మ్రొక్కులు నీ సునామమునకున్ రమ్యాంఘ్రి పద్మాలకున్

శ్రీ మన్మంజులమైన మేనికి, దనుర్లీలా కళాకేళికిన్

నీ మర్యాదకు, ధర్మనిష్ఠకు, రసోద్వేగమ్ము నీ గాథకున్,

ప్రేమన్ నీ పరివారులెల్లరుకు శౌరీ! రామచంద్రప్రభూ!

- సామవేదం షణ్ముఖశర్మ



పాఠక మహాశయులకు, ఏజంట్లకు,

ప్రకటనకర్తలకు శ్రీరామ నవమి శుభాకాంక్షలు.

– ఋషిపీఠం



# నమసు

**రామో రాజమణిస్సదా విజయతే రామం రమేశం భజే**
**రామేణాభిహతా నిశాచరచమూ రామాయ తస్మై నమః।**
**రామన్నాస్తి పరాత్పరం పరతరం రామస్య దాసోస్మ్యహం**
**రామే చిత్తలయస్తదా భవతు మే భో రామ! మాముద్ధర ॥**

*''రాముడు అంటే రాజశేష్ఠుడు (ప్రథమా విభక్తి) సర్వదా విజయము నొందుగాక!*
*లక్ష్మీపతి (రమేశుడు) అయిన రాముని (ద్వితీయా) భజించుచున్నాను*
*రాముని చేత (తృతీయా) రాక్షస సమూహం సంహరింపబడింది.*
*ఆ రామునకై (చతుర్థీ) నమస్కారము.*
*రాముని కంటె (పంచమీ) గొప్పదీ, పరాత్పరమూ లేదు.*
*నేను రాముని యొక్క (షష్ఠీ) దాసుడను.*
*రాముని యందే (సప్తమీ) నా చిత్తము లీనమగుగాక!*
*ఓ రామా! (సంబోధన ప్రథమా) నన్ను ఉద్ధరించు.''*

*భాషలో (విభక్తులు) అని ఉన్నాయి. మనం వాడే వాక్యాలన్నీ ఈ ఎనిమిది విభక్తులతోనే ఉంటాయి. వాటిని రాముని పరంగా చెప్పిన ఈ స్తుతి... ప్రతి పలుకూ రామమయంగా దర్శించేందుకై చేసినది.*

ఋషిపీఠం
ఏప్రియల్ 2000

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

ఏప్రియల్ 2000

సంపుటి 1 సంచిక 9

సంపాదకుడు : సామవేదం షణ్ముఖశర్మ

ప్రచురణకర్త ఉపద్రష్ట శివప్రసాద్


**ధారావాహికలు :**



**బోధన :**



**శీర్షికలు**



**ప్రత్యేక రచనలు :**






చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై-600 017. ఫోన్ : 8281159

# నీది కానిది నీకు విషతుల్యాం

''మా గృధః కస్యస్విద్ధనమ్'' - ఇతరుల ధనాన్ని ఏమాత్రం కూడా తీసుకోకు అని ఉపనిషత్తు బోధిస్తోంది. ఆత్మకు ఇతరమైన - అంటే అనాత్మ అయిన అవిద్యా విషయాలనూ, మనోవృత్తులనూ విడచి, ఆత్మానుభవాన్ని సంపాదించమనే పారమార్థిక సత్యమే ఈ మహావాక్యానికి ప్రయోజనం. అయినప్పటికి లౌకికమైన ధర్మం చేయకుండ, శుద్ధి కాని చిత్తంలో పారమార్థిక వాసన పిసరంతైనా అంటదు.

సాధారణంగా - అవినీతి అన్నా, అక్రమార్జన అన్నా మనం రాజకీయ రంగంవైపే చూస్తాం. దానినే విమర్శిస్తాం. సమంజసమే. ప్రజాధనమంతా అక్కడే ఉంటుంది గనుక, దానిని వారు అక్రమంగా భోంచేస్తే ''కుంభకోణాలు'' గా చర్చిస్తాం. పాలనా వ్యవస్థలోని అవినీతి, అక్రమం... దేశం మొత్తానికే ప్రమాదకరం. సందేహం లేదు.

కానీ అవినీతి, అక్రమం అనేది ఎవరి పరిధిలో వారు చేస్తూనే ఉన్నారు.

ధర్మంలో సత్యం, అహింస, అస్తేయం, శౌచం... ఈ నాలుగూ ప్రధానమన్నారు. ధర్మమనే వృషభానికి ఈ నాలుగూ పాదాలని శాస్త్రకారులు వ్యాఖ్యానించారు. ''భూతహిత యథార్థ భాషణం - సత్యం''... భూతహితానికి ప్రథమ ప్రాధాన్యమిచ్చే యథార్థభాషణని 'సత్యం'గా, త్రికరణాలతో (మనసూ, మాటా చేతలతో) ఎవరినీ బాధింపక పోవడం 'అహింస'గా, అంతర్ బహిశ్శుద్ధిని 'శౌచం'గా నిర్వచించారు.

'అస్తేయం' - అంటే 'దొంగతనం చేయకపోవడం, మనసా వాచా కర్మణా పరద్రవ్యాన్ని ఆశించకూడదు - అని దీని భావం. 'దొంగతనం' అంటే వృత్తిపరమైన చౌర్యమే కాదు. అక్రమంగా ఆర్జించిన ప్రతిద్రవ్యమూ దొంగ సొమ్మే. అక్రమంగా, అన్యాయంగా ఇతర ద్రవ్యాన్ని తీసుకోవడం చౌర్యమే.

దోపిడీకి గురవుతున్న శ్రామిక వర్గం అనబడేవారు కూడా, సదుపాయం వెతుక్కుని దోపిడీ చేస్తున్నారు. మీటర్ మీద ఎక్కువ అడగని ఆటోవాడూ, బరువుతో బండి దిగినవాడిని ఎక్కువ సొమ్ము అడగని కూలీ ఉన్నారా? ఏ పుణ్యక్షేత్రానికి వెళ్లినా పుణ్యకర్మలు చేస్తామని అన్నివిధాలా పీడించే వారిని మొదలుకొని ఎందరెందరో మోసగాళ్లే ఎదురౌతుంటారు. ఒక టెలిఫోన్ బాగుచేయించుకోవాలన్నా, అక్రమంగా ఆ శాఖవారికెవరికీ లంచం యిస్తేగానీ పని కాదు. ఇలా అన్ని శాఖల్లోనూ, అన్ని స్థాయిల్లోనూ 'స్తేయం' విస్తరించి వుంది. ఎవరి పరిధిలో వారు, అవకాశం చూసుకొని దోచుకుంటూనే ఉన్నారు. అబద్ధాలూ, మోసాలూ పెట్టుబడిగా సాగే వ్యాపారం కూడా 'స్తేయం' క్రిందకే వస్తుంది.

అంతేకాదు - మనిషిలోని పాపభీతినీ, దైవభక్తినీ తెలివిగా వినియోగించుకొని, యంత్ర మంత్రాల ఎరలు వేసే ఆధ్యాత్మిక వ్యాపారస్థులు కూడా భారతీయ సనాతన ధర్మం చెప్పిన ''అస్తేయా''న్ని విసర్జించిన వాళ్లే.

చాలామంది, ఎంత పాపం చేస్తున్నా, ఏ దేవాలయానికో మొక్కుబడి చెల్లించో, ఏ వ్రతమో పూజా పునస్కారమో చేసో పాపఫలాన్ని పోగొట్టుకున్నట్టు భ్రమిస్తారు.

సక్రమ మార్గంలో వెళుతూ, నిత్యం తనని తాను ఆత్మ పరిశీలన చేసుకుంటూ, ధర్మ మార్గంలో అర్థ సంపాదన చేసేవారు మాత్రమే - 'తెలియక ఏ అధర్మపు సొమ్మో కలిస్తే వచ్చే పాపాన్ని పోగొట్టుకోవాల''ని ద్రవ్యశుద్ధి చేసుకుంటారు. సత్పాత్రదానం, దైవకర్మలకు వినియోగం ద్రవ్యాన్ని శుద్ధి చేస్తుంది.

అస్తేయాన్ని వదిలిపెట్టి దైవానికి ఎన్నిసార్లు దండాలు పెట్టినా ప్రయోజనం లేదు. ఇహమూ పరమూ దుఃఖభాజనం కావడమే అక్రమార్జనకి అంతిమ ఫలం.

లంచగొండితనం, శ్రమకి మించినదానిని బలవంతంగా మోసంగా సంపాదించడం వంటివన్నీ స్తేయకర్మలే. ఎంత సంపాదించామనే దానికన్నా, ఎలా సంపాదించేమనే దానికే ప్రాధాన్యం.

యజ్ఞాలకు (దైవకార్యాలకు) శుద్ధమైన ద్రవ్యాన్ని మాత్రమే వాడాలని శాస్త్ర నియమం. ''ఉత్తమం స్వార్జితం విత్తమ్'' - అని సక్రమంగా స్వార్జితమైన దానినే దైవకార్యాలకు వినియోగించాలని, అలా కానప్పుడు విపరీత ఫలాలు లభిస్తాయని శాస్త్రం హెచ్చరిస్తోంది.

అక్రమార్జనపరులైన నాయకమ్మన్యులకు పూర్ణకుంభ స్వాగతాలు దేవస్థానం వారు పలికినా, దేవుడు పలకడు, దైవం ధర్మపక్షపాతి. కాలం కలిసిరాక, ధర్మం అరణ్యంపాలైనా తాను ధర్మం వైపే ఉంటాడు. అధర్మం రాజరాజైనా పట్టించుకోడు.

ఉత్తముల లక్షణాలను చెప్తూ ''పరధనే, పరయోషిషు చాస్పృహా'' - పరధనాలయందు, పరస్త్రీలయందూ స్పృహ లేకపోవడం మంచి మనుషుల లక్షణంగా భర్తృహరి పేర్కొన్నాడు.

పరస్త్రీ మోహంతో నశించిపోయిన రాక్షసుని కథను 'రామాయణం' మనకు గుణపాఠంగా అందిస్తే, పరధన మోహంతో

ఋషిపీఠం

కులనాశనం చేసుకున్న దుర్యోధనుడి జీవితాన్ని 'మహాభారతం' మనకు హెచ్చరికగా చూపించింది.

పశ్చాత్తాపంతో దైవాన్ని ఆశ్రయిస్తే, గత పాపం నుండి క్షమాపణ కలిగిస్తుందేమో కానీ, పాప కర్మ చేస్తూ దేవునికి టోపీ పెట్టాలనుకొని దేవతా పూజలు చేసేవానికి నిష్కృతి లభించదు.

''నేను ఎలాగూ ఆధ్యాత్మికతనే ప్రచారం చేస్తున్నాను గనుక, ఏం మోసం చేసినా ఫరవాలేదు'' అనుకొనే ఆధ్యాత్మిక దోపిడీదార్లు అసలు విషయాన్ని గమనించడం లేదు. మామూలు అక్రమార్జన కన్నా, ఆధ్యాత్మికతని ఆధారం చేసుకుని చేసే దోపిడీకి కోటి రెట్లు అధికంగా పాప ఫలం లభిస్తుంది.

దోచే వర్గం, దోపిడీకి గురయ్యే వర్గం - అనే రెండు వర్గాలు వేరువేరుగా లేవు. వారు వీరూ కూడా మనుషులే. అవకాశం బట్టి దోచుకోవడం 'స్వభావ' విషయం మాత్రమే. కనుక మానవ స్వభావాన్ని సంస్కరించుకోవాలి. శ్రమ లేకుండా ఏదైనా లభిస్తే ఆశపడటం ప్రాథమిక స్థాయిలోని పాశవిక మనస్సుకి సహజం. దానిని ధర్మశిక్షతో మలచుకొని, ధర్మం పునాది మీద అర్థ కామ సంపాదన చేసి 'మానవ' శబ్దాన్ని సార్థకం చేసుకోవాలి.

మామూలుగా - ఏ మంచి మాట విన్నా మనం సుభాషితంగా ఇంకొకరి దగ్గర ఉటంకించడానికో, లేదా ఇతరుల విషయంలో విమర్శించడానికో వాడుకుంటాం. అంతేగానీ మనల్ని మనం తరచి చూసుకోవడానికి ఉపయోగించం.

''ఆ.... ఈరోజుల్లో అస్తేయం, ధర్మం అంటూ మడి కట్టుకుంటే ఎలాగండి! అంతా సక్రమంగా ఉండడం కుదరదు. అధర్మం అంతో యింతో చేయక తప్పదు -'' అని లౌక్యంగా మాట్లాడినట్లు సమర్థించుకునే వాళ్లూ ఎందరో ఉన్నారు. అంతో యింతో అధర్మం చేయక తప్పదు - అనుకుంటే - అంతో యింతో దాని విపరీత పరిణామాలనీ ఎదుర్కొనక తప్పదు.

సామవేదం షణ్ముఖశర్మ

# ఏజెంట్లకు

'ఋషిపీఠం' భారతీయ మాసపత్రికకు పాఠకాధరణ అనూహ్యంగా లభిస్తోంది. అయితే సుస్థిర భవిష్యత్తులో ఈ పత్రికను సువ్యవస్థితం చేసేందుకు, ఏజెంట్ల సహకారం అవసరం.

మే నెల నుండి డిపాజిట్లు కట్టే ఏజెంట్లకు మాత్రమే 'ఋషిపీఠం' ఏజెన్సీ ఇవ్వబడుతుంది. కనుక ఆసక్తి గలవారు వెంటనే 'ఋషిపీఠం' చిరునామాను సంప్రదించండి.

- సర్క్యులేషన్ మేనేజర్
ఋషిపీఠం

# పాఠకులకు గమనిక

'ఋషిపీఠ

భారతీయ మాసపత్రిక
మీ ఊరిలో లభ్యంకాని యెడల, వెంటనే చందాదారులుగా చేరి, క్రమం తప్పకుండా పత్రికను అందుకోండి!

- సర్క్యులేషన్ మేనేజర్



# ధర్మబోధకుడు "కణ్వమహర్షి"

*సత్సంగశ్చ వివేకశ్చ నిర్మలం నయనద్వయం*

సత్సంగమూ, వివేకమూ... ఈ రెండు మాత్రమే స్వచ్ఛమైన నేత్రాలు. వీటితోనే సత్యదర్శనమవుతుంది.

**వ్యాసమహర్షి**

'కణ్వ మహర్షి' పేరు వినగానే మహాకవి కాళిదాసుని 'అభిజ్ఞాన శాకుంతలం' నాటకం గుర్తుకొస్తుంది. మహాభారతం, పద్మ పురాణాలలో చెప్పబడ్డ శకుంతల కథను అద్భుత నాటకంగా మలచాడాయన.

ఆ నాటకంలో శకుంతలను పెంచిన 'ధర్మపిత'గా కణ్వుడు ప్రసిద్ధి. ఆయన తపోవనం, ఆశ్రమ ప్రదేశం తపః పునీతమై శాంత దివ్యధామమై ప్రకాశిస్తోంది. శకుంతలను అత్త వారింటికి పంపుతూ కణ్వుడు చెప్పిన మాటలు, స్త్రీ ధర్మ ప్రతిబోధకంగా ఉన్నాయి. అంతేకాక - వనస్పతులతో, వృక్షాలతో ఆయన పలికిన పలుకులు ప్రకృతిలో ఆత్మబంధాన్ని, ఆర్ష జీవన వైభవాన్ని పట్టి చూపుతాయి.

వేద వాఙ్మయంలో చూస్తే - కణ్వుని జ్ఞానం, తపశ్శక్తి, మంత్రజ్ఞానం, అధ్యాత్మిక శక్తి వంటివి ప్రత్యేకంగా కనిపిస్తాయి. 103 సూక్తాలున్న ఋగ్వేదంలో ఎనిమిదవ మండలంలో అధిక భాగం మంత్రాలు కణ్వుని ద్వారా, అతని వంశజుల ద్వారా గోత్రజుల ద్వారా దర్శింపబడినవే.

'ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి' అన్న మాట ప్రకారం ఎనిమిదవ మండలానికి కణ్వునే ద్రష్టగా చెప్పవచ్చు. ఋగ్వేదంతో పాటు శుక్లయజుర్వేదంలోని మాధ్యందిన శాఖ, కణ్వ శాఖలలో రెండవది 'కాణ్వసంహిత'కి వక్త కూడా కణ్వుడే. ఈయన పేరు మీదే అది 'కాణ్వ సంహిత'గా ప్రసిద్ధి పొందింది.

కణ్వ వంశజులు కూడా ప్రసిద్ధ యాజ్ఞికులుగా వేదాలలో వివరించారు. కణ్వ గోత్రజుడైన దేవాతిథి ఋషి తన యజ్ఞ కర్తృత్వ, తపశ్శక్తితో రాజులను సక్రమ మార్గంలో నడిపినట్లుగా, వారి మన్ననలు పొందినట్లుగా చెప్పబడింది.

మేనకా విశ్వామిత్రుల తనయ శకుంతలను లాలించి పెంచి పోషించిన కణ్వుని కారుణ్య దృష్టి తపోజీవనుల మనస్సంపదని పట్టి చూపిస్తుంది. కణ్వుడు ఆశ్రమంలో లేని సమయాన దుష్యంతుని రాక, శకుంతల గాంధర్వ విధిని దుష్యంతుని, వివాహమాడడం మొదలైన విషయాలు - తిరిగి ఆశ్రమానికి వచ్చాక తెలుసుకున్న కణ్వుడు - 'హుతమైన ఆజ్యం, హోమాగ్నిలో పడింది - శకుంతల యోగ్యునే వివాహమాడింది' అని సంతోషిస్తాడు.

ఆశ్రమంలో శకుంతల గర్భవతియై భరతుని కంటుంది. పసిభరతుని కణ్వాశ్రమ వాసులే లాలిస్తారు. ధర్మ నిర్వహణలో కణ్వుని నిష్ఠ 'శాకుంతలం' నాటకంలో కాళిదాస మహాకవి అద్భుతంగా చిత్రీకరించారు. ఒక మహా వంశానికి మూలపురుషునిగా ప్రఖ్యాతి చెందిన భరతుడు కణ్వుని ఆశ్రమంలోనే శైశవ శిక్షణ పొందాడు.

శ్రుతి మంత్రద్రష్టగానే కాక, స్మృతిని రచించిన ధర్మశాస్త్ర వేత్తగా కూడా కణ్వమహర్షి ప్రసిద్ధుడు. ఆయనరచించిన ధర్మశాస్త్రం 'కణ్వ స్మృతి' పేరుతో ప్రఖ్యాతి చెందింది. కణ్వుని ద్వారా, ఆయన సంబంధీకుల ద్వారా దర్శింప బడిన మంత్రాలలో లౌకిక జ్ఞాన విజ్ఞానాలు, అనిష్టనివారణకై ఉపయోగించే మంత్రాలు చెప్పబడ్డాయి. ఉదాహరణకు **'యత్ ఇంద్ర మహామహే'** అనే మంత్రం దుఃస్వప్న నివారణకు, కపోలశక్తికి ఉపయోగింపబడేది.

గోమాతని స్తోత్రించే మంత్రాలు కూడా ఇందులో ఉన్నాయి. గోప్రార్థనకి సంబంధించిన మంత్రం

***మాతా రుద్రాణాం దుహితా వసూనాం***
***స్వసాదిత్యానా మమృతస్య నాభిః ।***
***ప్రను వోచం చికితుషే జనాయ మా***
***గామనా గామదితిం వధిష్ట ॥***

గోమహిమని తెలియజేసే దివ్య శబ్దాలివి.

"రుద్రుల మాత, వసువుల దుహిత, ఆదిత్యుల సోదరి, అమృతమునకు మూలం. గోవును హింసించరాదు."

విశ్వ శ్రేయస్సును కాంక్షించి, అదే లక్ష్యంగా సాగించిన తపోదృష్టితో అనేక రహస్యాలను దర్శించి, మనకు ప్రసాదించిన మహర్షులలో ఒకనిగా కణ్వుడు మనకు ఆరాధ్య ఋషి. ✦

# సనాతన మహాసామ్రాజ్య పట్టాభిషేకం

చల్లా విశ్వనాథశాస్త్రి

''ఈరోజున మావంటి హిందూ సన్యాసులం నిర్భయంగా రాజవీధులలో తిరుగాడగలుగుతున్నామంటే, అది శివాజీ మహరాజా పెట్టిన భిక్షే. భారతీయ సంస్కృతి, చరిత్రలపై సమగ్రమైన అవగాహన ఉన్న కంచి మహాస్వామి వారు, శివాజీ పటమునకు తామే స్వయంగా జరీశాలువా అలంకరించి పలికిన వాక్యాలు ఇవి.

మొగలాయి చక్రవర్తుల మతదౌష్ట్యానికి, అసహనమునకు పరమావధి, ఔరంగజేబు. ఆతడు యావద్భారతమును ఏకచ్ఛత్రముగా పాలించిన చక్రవర్తి. శివాజీ 36 గ్రామాలకు అధిపతి అయిన అతి చిన్న జమీందారు. ''నేను ప్రాచీన సార్వభౌములనందరినీ నాశనం చేసే సందర్భంలో, స్వయంగా సార్వభౌమత్వాన్ని ఏర్పాటు చేసుకొన్న ప్రతిభాశాలి అతడు. నా సైన్యాలు పందొమ్మిది సంవత్సరాల పాటు అతడిని వెంటాడుతూనే ఉన్నా అతని రాజ్యం పెరిగిపోతూనే ఉన్నది.'' శివాజీ గురించి ఈ మాటలు అన్నది సాక్షాత్తు ఔరంగజేబే.

శివాజీ బీజాపూరు నవాబులను, మొగలాయిలను ముప్పతిప్పలు పెట్టి తన సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేసుకోవడమే కాదు, తాను పోయిన తరువాత కూడా తాను ప్రోదిచేసిన మరాఠా ఆత్మగౌరవం రూపంలో పావు శతాబ్దం పాటు ఔరంగజేబును ఎదుర్కొన్నాడు.

ఈ దేశంలో హైందవ ధర్మాన్ని కాలరాయాలని బద్ధకంకణుడయిన ఔరంగజేబుకు తుదికి మిగిలిందేమిటి? తన సైన్యం పీనుగుల పెంటగా, తన తన రాజ్యం బంజర్లుగా, బీడుగా, నాలుగు సంవత్సరాల ప్లేగు వ్యాధితో లక్షల మంది చనిపోగా, వెన్నుచూపి ఆగ్రా చేరుకుందామని పారిపోతున్న తనను వెంటపడి మరాఠ సైనికులు కుళ్ళబొడుస్తుంటే మనోవేదనతో తుదిశ్వాస తీసుకోవలసి వచ్చింది. పావు శతాబ్దం రాజధాని ముఖమే చూడలేని చక్రవర్తి రాజ్యం ఎలా ఉంటుంది? ఛిన్నాభిన్నమయిపోయింది. రాజపుత్రులు తిరిగి స్వతంత్రులయ్యారు. ఔరంగజేబుకు ఇరవయి అయిదేళ్ళ ఈ సంఘర్షణే లేకపోతే యావద్భారతంలో హిందూధర్మం లవలేశమైనా లేకుండా తుడిచిపెట్టుకొని పోయి ఉండేదంటే అతిశయోక్తి కాదు. మహాస్వామివారు పలికిన వాక్యాలకు ఇంత అర్థం ఉంది. హిందూ జాతికి శివాజీ అందువలన పరమ ఆరాధ్య పురుషుడు.

అదృష్టవశాత్తూ, శివాజీ ప్రసాదించిన మరాఠా ఆత్మగౌరవాన్ని కించబరచడానికి భయపడి ఊరుకొన్నారు కానీ, శివాజీని ఒక దొంగల ముఠానాయకునిగా, కాకతాళీయంగా రాజ్యాన్ని స్థాపించినవానిగా చిత్రించడానికి ప్రయత్నాలు జరిగినాయి. అదే సమయంలో హిందువులపై పన్నులువేసి, బలవంతంగా వత్తిడితో మతం మార్పించి, హైందవ దేవాలయాలను కూలద్రోయమని అధికారికమైన ఫర్మానాలను జారీచేసిన ఔరంగజేబు పరమ సాధుపుంగవునిగా చిత్రించబడుతున్నాడు. మీరు విన్నారా? ఔరంగజేబు పండాల దౌష్ట్యాన్ని నిరోధించడానికి, అక్కడేదో ''అపవిత్ర కార్యం'' జరిగినందున కాశీవిశ్వేశ్వరాలయాన్ని పడగొట్టించాడట. వారి ప్రార్థనా స్థలాలు నిర్మించుకోవడానికి అలాటి ''అపవిత్ర'' స్థలాలే అవసరం కాబోలు. అక్కడే మసీదు కట్టబడింది. మరి మధుర దేవాలయం ఎందుకు పడగొట్టాడట. అక్కడ మసీదు ఎందుకు కట్టాడట. అయినా తలనొప్పి వస్తే తల త్రుంచుకొనేంతటి మూఢుడా ఔరంగజేబు? మన చరిత్రకారుల ఈ హైందవ వ్యతిరేకతను గురించి వీలయితే ఇంకెప్పుడైనా చర్చించు కుందాం!

వామపక్ష చరిత్రకారులు ఏమైనా చెప్పనీయండి. ముఖ్యంగా 300 సంవత్సరాల పరిపాలన కాలంలో మహమ్మదీయ రాజులు హిందూజాతిపై జరిపిన అత్యాచారాలు అతిహేయమయినవి. పై పెచ్చు ఆ రాజులు వారు వ్రాసుకొన్న స్వగతాల్లో, వారి చరిత్ర

కారులు వ్రాసిన చరిత్రలో ఈ హేయకార్యాన్ని ఎంతో ప్రశంసా పూర్వకంగా చెప్పుకొన్నారు. మీరనవచ్చు... అయిపోయిన చరిత్ర చెప్పి ఒక జాతిపై ద్వేషభావాన్ని ఎందుకయ్యా రగులుస్తావు అని. కానీ ఇది ద్వేషభావాన్ని రగిల్చే ప్రయత్నం కాదు. ఈ చరిత్ర చెప్పకోకపోతే హిందువుల్లో పుట్టి హిందూత్వాన్ని మాత్రమే కించపరచడం ద్వారా తమ పబ్బం గడుపుకోవాలనుకునే ఈ వామపక్షీయులు.

ఈ చరిత్ర చెప్పకోకపోతే ఈ వామపక్షీయులు మన కృష్ణదేవరాయలనూ, మన ప్రతాపరుద్రునీ, మన శివాజీని ప్రతినాయకులుగా మార్చివేస్తారు. ఎంతో ఆత్మగౌరవంతో స్మరించుకోవలసిన మన జాతి చరిత్రను సిగ్గుతో తలుచుకొనేలా చేస్తారు. అంతేకాదు! చరిత్రకు పునరావృతమయ్యే లక్షణముంది. పాఠాలు నేర్చుకొని మన జాగరూకతతో మనం ఉండక పోతే ''కార్గిల్'' వంటి ప్రమాదాలు వస్తాయి. నేను ఖురాన్ మూల గ్రంథం చదవలేదు. అయితే ప్రముఖ ముస్లిం చరిత్రకారులు, ముస్లిం చక్రవర్తులు, వారి మత సిద్ధాంతంగా దేనిని చెబుతున్నారో, దాంట్లో ఈషణ్మాత్రము పరమత సహనం లేదు. అప్పటి విషయం ఎందుకు? హిందూ ముస్లిం సఖ్యత కోసం పాటుబడుతూ పాడుబడిన మసీదులో కూర్చుని ధర్మాన్ని బోధించిన సాయిబాబాకు అప్పుడు గానీ, ఇప్పుడు గానీ ఎంతమంది ముస్లిం శిష్యులున్నారు? సిలువ, చంద్రుడు, ఓం కారము పెట్టుకొని నాకు మతమే సంబంధం లేదు. కేవలం ''స్పిరుట్యుయాలిటీ'' బోధిస్తానసే స్వామీజీ దగ్గరకు ఎంతమంది ముస్లిం ''స్పిరిట్యుయల్ సీకర్స్'' వస్తున్నారు? ప్రతిదర్గాలోనూ చాదర్ పట్టుకొని బయలుదేరేది మనమే. మనం మొదటినుంచి వారిలో దూరిపోవాలనే అనుకున్నాం. వారు మనం మతం మార్చుకొని చేరితే కానీ చేరనీయరు. వారు మనలో చేరరు. హిందువులు జాగరూకులుగా లేక పోతే ఎప్పటికయినా వారితో ప్రమాదమే అనే విషయం చెదురు మదురు సంఘటనల ద్వారా తెలుస్తూనే ఉంది.

మన ఆదర్శ పురుషుడైన శివాజీ ఒక్క



మసీదును కూడ కూలదోయలేదు. ఒక్కసారి గూడా ఖురాన్ గ్రంథానికి అవమానం చేయలేదు. ఒక్క ముస్లిం స్త్రీని కూడ చెరబట్టలేదు. పైపెచ్చు సమ్మానము చేశాడు. అలాగని మన ఇళ్లలోంచి మనస్త్రీలను చెఱబట్టుకొని పోతూంటే, మన నమ్మకాలను అవమానం చేస్తుంటే చూస్తూ ఊరుకోలేదు. ఇదీ శివాజీ చరిత్ర ద్వారా చెప్పదలచినది.

**''ధర్మస్థాననే చేనర్! తే ఈశ్వరా చే అవతార్''** నీతిస్థాపన, ధర్మస్థాపన కేవలం రాజ్యస్థాపన ద్వారా మాత్రమే సాధ్యపడుతుందనీ అట్టి ధర్మస్థాపన ఈశ్వరాంశగల పురుషులకే సాధ్యపడుతుందనీ, అట్టి ఈశ్వరాంశ గల మహాపురుషులు అనేకులు ఇంతకు ముందు ఉద్భవించారనీ, ముందుకూడా ఉద్భవిస్తారనీ, అలాటి వారిని ప్రసాదించడము ఈశ్వర అనుగ్రహ విశేషమనీ సమర్థ రామదాస స్వామి చెబుతున్నారు. అలాంటి ఈశ్వర కృపా విశేషమే ఛత్రపతి శివాజీ మహరాజా.

శివాజీ జనన కాలంలో బహమనీ రాజ్యం అహ్మదునగరంలో నిజామ్ శాహి, గోలుకొండలో కుతుబ్ షాహి, బీజాపూరులో అదిల్‌శాహి అని మూడు ముక్కలుగా చీలిపోయింది. శివాజీ తండ్రి శహాజీ అహ్మదునగర నవాబు సేవలో జాగీర్దారుగాను, సేనాపతిగానూ ఉండేవాడు. ఆ రాజ్యంలో ఇంకా ముఖ్యమైన స్థితిలో ఉన్న లఖోజీ యాదవ్ కూతురు జీజాబాయిని వివాహమాడాడు. కొంతకాలానికి లఖోజీ యాదవ్ మొగలుల సేవలో చేరగా శహాజీ అహ్మదు నగర రక్షణకై నిరంతరము మొగలాయిలతో తలబడుతూ ఉండేవాడు. ఎంతో శౌర్య పరాక్రమా లతో మొగలులను నిలవరించి అహ్మదు నగర రక్షణ చేశాడు. అయితే చివరలో షాజహాన్ కాలంలో పూర్తిగా జయించబడి, మహారాష్ట్ర నుండి వెలివేయబడి, బీజాపూరు చేరి అక్కడి నవాబులవద్ద సేనాధ్యక్షునిగా చేరి బెంగుళూరు, తంజావూరు మొదలగు కోటలను నవాబుకు లోబడి పాలించుకుంటూ ఉండేవారు.

శహాజీ జీజాబాయిలకు ఆర్గురు సంతానము. వారిలో శంభాజీ పెద్దవాడు.

ఆరవవాడు శివాజీ మాత్రమే జీవితులుగా ఉన్నారు. శివాజీని గర్భమునందు తాల్చి ఉండగా, అహ్మదునగర, మొగలాయి పోరాటంలో తన తండ్రి లఖోజీ యాదవ్ సైనికుల చేతిలో చిక్కిందట జీజాబాయి. లఖోజీ కాన్పుకు తన ఇంటికి తీసుకొని వెళతానని ఎంత బ్రతిమాలినప్పటికీ పరమ పతివ్రత అయిన ఈమె తన భర్త అధీనంలో ఉన్న శివనేరి దుర్గంలోనే ఉండిపోయింది. అక్కడే 1627 ఏప్రియల్ ఆరవ తేదీన శివాజీ జన్మించాడు.

శివాజీ బాల్యమంతా తండ్రికి మొగలాయిలతో జరిగే యుద్ధాల వల్ల గ్రామ గ్రామంగా తిరగ వలసివచ్చింది. లేకుంటే షాజహాన్ సేనలు పట్టివేస్తాయని భయం. ఒకసారి జీజాబాయి పట్టుబడింది. అయితే ఆ మహాతల్లి ఎంతో సమయస్ఫూర్తితో శివాజీని వేరొక గ్రామంలో ఉంచడాన రక్షించబడినాడు. ఆమె పెద్ద జుల్మానా కట్టుకొని వెలికి వచ్చింది. 1636లో శహాజీకి మొగలాయిలకు జరిగిన సంధికారణంగా పూనాజాగీరు శహాజీ స్వంతం చేయబడింది. అయితే అతడు మహారాష్ట్రలో ఉండటానికి వీలులేదు.

శహాజీ బీజాపూరు సేవకు పోయేటపుడు జీజాబాయి ఆయనతో కలసివెళ్లలేదు. కారణం సతారాలోని జాగీరు విషయాలను చూసుకోవడానికని కొందరు చెబుతారు. మరికొందరు తన భర్త మహమ్మదీయ సేవ చేయడం ఇష్టం లేకపోవడాన అని చెబుతున్నారు. అయినా అయిఉండవచ్చు. షాజహాన్ కాలంలో హిందువులకు జరిగిన అవమానాలు, తన తండ్రిని, బాబాయిలను, అన్నలను బట్టబయట హత్య చేయించిన అహ్మద్‌నగర రాజు దౌష్ట్యము, రాజా బాలాజీ నింబాల్కర్ మతాన్ని బలవంతంగా మార్పించిన బీజాపూరు నవాబు హిందూ ద్వేషము ఆమె ఎఱుగనిది కాదు. కారణం ఏదయినా ఈ ఎడబాటు శివాజీ మహాపురుషునిగా ఎదగడానికి కారణం అయింది.

శహాజీ తన భార్యను, రెండవ కుమారుని తనకెంతో ముఖ్యుయిన దాదాజీ కొండదేవ్ సంరక్షణలో ఉంచి తన మొదట పుత్రుడయిన శంభాజీని తోడ్కొని బీజాపూరు వెళ్ళాడు. అక్కడ బీజాపూరు నవాబుల సామంత జాగీర్దారయి మొహితే చెల్లెలు తుశాబాయిని వివాహమాడాడు. వారికి వెంకోజీ అనే పుత్రుడు కలిగాడు.

ఆరోజులలో జాగీర్దారులకు కోటలు ఉండేవి కావు. కోటలు సైన్యాధిపతుల చేతులలో ఉండేవి. కొండదేవ్ జీజాబాయి శివాజీల నివాసానికి పెద్దభవంతి నొకదానిని కట్టించినాడు. తరువాత కాలంలో ఇది 'లాల్ మహల్'గా ప్రసిద్ధి చెందింది.

# శివాజీ సంస్కారం



శివాజీ ముస్లింల యెడల ద్వేషభావము చూపలేదు. అతనివద్ద నున్న ముస్లిం సర్దారులు అతనికి చివరివరకు ఎంతో విశ్వాసంతో సేవ చేశారు. అతడి ఆంతరంగిక కార్యదర్శి ముల్లా హైదర్ ముస్లిం. హిందూ దేవాలయాలను ముస్లిం పాలకులు పడగొడుతున్న సమయంలో శివాజీ రాయగఢ్‌లో తన పాలనలో ఉన్న ముస్లింల కోర్కెలపై మసీదు కట్టించి ఇచ్చాడు. ముస్లింలు పాలించే రాజ్యాలపై ముట్టడి చేసినప్పుడు కూడా సాధరణ ప్రజల జోలికి ఎప్పుడూ వెళ్లలేదు. తన పోరాటాలలో దొరికిన ముస్లింల పవిత్ర గ్రంథాన్ని ఎంతో ఆదరంతో తన ముస్లిం అనుచరుల ఉపయోగానికి, ఆరాధనకి సమర్పించేవాడు. అంతెందుకు, ఇళ్ళల్లో జొరబడి స్త్రీలను ఎత్తుకుపోయి అవమానించే ముస్లిం ప్రభువుల కాలంలో శివాజీ శీలాన్ని ఈ క్రింది ఉదంతం తెలియజేస్తుంది.

ఇది జావళీ విజయానంతరం శివాజీ కొంకణ ప్రాంతంలోని కళ్యాణ్‌దుర్గంపై దండెత్తినప్పుడు జరిగిన సంఘటన. ఆ దుర్గంలో బీజాపూరుకు పంపబడుతున్న ధన రాసులు శివాజీ సైనికులు కైవసం చేసు కున్నారు. దుర్గాధిపతిని ఖైదు చేశారు. అతని కోడలు ఎంతో అందమైనది. సేనా నాయకుడైన అంబాజీ సోనేదేవుడు ధనరాసులతో ఆమెను కూడా పల్లకి ఎక్కించుకొని తీసుకొని వచ్చాడు. ధనరాసులను పర్యవేక్షిస్తున్న శివాజీకి సోనేదేవుడు పల్లకీలో ఉన్న స్త్రీకి సమర్పించి యుద్ధ కానుకగా స్వీకరించమని ప్రార్థించాడు.

చెవులు మూసుకొన్న శివాజీ పరస్త్రీలను తల్లివలె చూచే సంప్రదాయమునకు చెందిన మనము ఇలాటి చేష్టలు చేయవచ్చునా అని సోనేదేవుని మందలించి, భయపడుతున్న ఆ స్త్రీ దగ్గరకు వెళ్లి, ''అమ్మా! మా సేవకుల తప్పిదానికి క్షమించు. వీరిని, నన్ను స్వంత కొడుకులు తప్పు చేస్తే మన్నించే తల్లివలె మన్నించ''మని కోరి ఎంతో గౌరవంతో తన స్వంత అంగరక్షకులు కావలిగా ఆమె గృహానికి పంపివేశాడు. ముస్లిం పాలకుల చరిత్రలో ఇలాటి ఔదార్యము మనకెక్కడా కన్పించదు.

జీజాబాయి జీవితమంతా పోరాటాల మధ్య సాగింది. తండ్రి లఖోజీ యాధవ్ అహ్మదునగర సేనాధ్యక్షుడుగా ఉండి మొగలాయిలతో పోరినవాడు. భర్త శహాజీకి నిరంతరం మొగలాయిలతో సంఘర్షణే. వస్తుతః హిందూ మతౌన్నత్యాన్ని ఎరిగి ఉన్నది. ముస్లింల దురాగతాల్ని, అత్యాచారాల్ని దగ్గర్నుంచి చూసింది. తానే బంధింపబడినది కూడా!

ఎప్పటికయినా తనజాతి ఈ బానిసత్వాన్నించి వెలువడుతుందనే భావనతో శివాజీకి ధైర్యాన్ని, ఆత్మాభిమానాన్ని, దేశ ప్రేమను మతౌన్నత్యాన్ని ఉగ్గుబాలతో రంగరించి పోసింది.

ఏరోజుకారోజు... అక్కడ బ్రాహ్మణుల శిఖకోసి గోమాంసం నోట్లో పెట్టారు. ఇక్కడ దేవాలయం పడగొట్టి విగ్రహాలు పగలకొట్టి పాద పీఠాలుగా మార్చివేశారు, ఫలానా చోట హైందవ స్త్రీలను, పసి బాలురను చెరబట్టి బానిసలుగా పట్టుకొనిపోయారు అనే వార్తలతో దిక్కులు మార్మోగిపోతున్నాయి. ఈ వార్తలన్నింటికీ కంపించిపోతున్న జీజాబాయి తన పుత్రుని విజృంభణానికై ఎదురు చూస్తూ ఉండేది. వేయి దేముళ్ళకు మొక్కుతూ ఉండేది. శివాజీకి తగిన ఉపదేశాలు చేస్తూ ఉండేది. శివాజీకి రామాయణ భారతాది కథలు బోధించబడ్డాయి. గణిత శాస్త్రంలో శిక్షణ ఈయబడింది. అయితే ఎక్కువ కాలం కొడుకులు కూర్చుని ఈ హిందూ దైన్యాన్ని పారద్రోలడానికి అనేక ప్రణాళికలు వేసి కొంటూ ఉండేవారు. దీనికి విశ్వాస పాత్రుడయిన కొండదేవుని కొండంత అండ ఉండేది.

శివాజీ ప్రకృతి ఒడిలో చదువుకొన్నాడు. ఎండ, వాన, చలి ఎరగక అక్కడి ప్రజలతో కలిసి కొండకోనల్లో జలపాతాల్లో తిరుగుతూ వారి జీవిత సరళిని అర్థం చేసుకొన్నాడు. వారి బడుగు జీవనం, ఆచారాలు, అలవాట్లు, ఆశలు, సుఖ దుఃఖాలు ఒకటేమిటి, సాధారణ ప్రజలగురించి సమస్తం అర్థం చేసుకొన్నాడు. తనతోటి బాలురతో సాహచర్యం చేస్తూ, తన ప్రజలలో పరంపరాగతంగా వస్తున్న సాముగరిడీలు, కుస్తీలు, ఖడ్గ విన్యాసాలు, గుఱ్ఱపు స్వారీలు నేర్చుకొని వారికి నాయకుడయ్యాడు.

ఆతడికి సహ్యాద్రిలోని కొండత్రోవలన్నీ పరిచయమే. ఏప్రదేశం రక్షణ పరంగా దిట్టమైనది. ఏ ప్రదేశంలో గుహలు బాగుంటాయి అనే విషయాలన్నీ ఆతడికి కొట్టిన పిండి. మారువేషం అత్యంత సామర్థ్యంగా వేయగలడు. పక్షిలా కూయగలడు. జంతువులా గర్జించగలడు. ఒకటేమిటి రక్షణ కవసరమైన కళలన్నిటిలోనూ పరిపూర్ణుడ య్యాడు. దీనికి తోడు ఈతనికి ఎదిరినయినా మెప్పించగల చక్కటి వాక్పటిమ ఉండేది.

శివాజీని ఒక నాయకునిగా మలచడానికి కొండదేవుడు అహరహము శ్రమించాడు. మంచిక్రమశిక్షణ, ప్రజలతో వ్యవహరించే తీరునేర్పాడు. ఆ ప్రాంత పంచాయతులన్నిటికీ తనతో పాటు తీసుకొని వెళ్ళి ప్రజలు తమ ప్రతి అవసరానికి శివాజీ వంకకు చూడ సాగారు. ప్రజల రక్షణకు సైన్యం ఏర్పాటు చేయబడింది. క్రూరమృగాల నుండి, ప్రజలకు పంటలకు రక్షణ కూర్చబడింది. భూమి పన్ను వసూలు చేయడానికి, చక్కటి పరిపాలన అందచేయడానికి పటిష్ఠమై రాజ్యాంగము ఏర్పాటు చేయబడింది. ఆ చిన్న జాగీరులో ఈ రకంగా ఒక ప్రజాహిత అసనము నెలకొల్పబడింది. 16 ఏళ్ల వయ స్సుకు సకల గుణాభిరామునిగా పరిణతి చెం దిన శివాజీ ప్రజల మనోభిరాముడయినాడు.

జీజాబాయి, శివాజీ కలలు గంటున్న హిందూ రాజ్యావిష్కారానికి పరిశ్రమించవలసిన సమయమాసన్న మయింది. శివాజీ తన ఉద్దేశ్యాన్ని క్రింది సందేశం ద్వారా స్పష్ట పరిచాడు. ''ముస్లిం పాలకులు పడేసే ఎంగిలి కూటితో మనం ఎందుకు తృప్తిపడాలి? మనం హిందువులం. మనదైన ఈ రాజ్యాన్ని విదేశీయులు ఆక్రమించారు. వారు మన దేవాలయాలను పడగొడుతున్నారు. మన పవిత్ర దేవతా విగ్రహాలను పగలగొడుతున్నారు. మన సంపదను దోచుకొంటున్నారు. బలవంతంగా మనలను వారి మతంలోనికి మార్చుకొంటున్నారు. మన పిల్లలనూ, స్త్రీలనూ చెఱబట్టి ఎత్తుకొని పోయి బానిసలుగా చేసుకొంటున్నారు. మన పరమ పవిత్రమైన గోమాతను వధించి దాని నెత్తురు త్రాగుతున్నారు. ఇంకా వేలకు వేలు చెప్పనలవి గాని అత్యాచారాల్ని చేస్తున్నారు. ఈ అత్యాచారాల్ని మనం ఇకపై భరించం. మన కండలలో బలం ఉంది. మన మతాన్నీ, దేశాన్నీ విదేశీయుల చెఱ నుండి రక్షించుకుందాం! మన పూర్వీకుల రక్తం మనలో ప్రవహిస్తోంది. వారి శౌర్యసాహసాలు మనకు లేవా! మన పవిత్ర మత రక్షణకై, మన మాతృదేశపు విడుదలకై ఖడ్గం దూసి ముందుకు ఉరుకుదాం! రండి! ఈ పవిత్ర కార్యం ఇప్పుడే ఆరంభించుదాం! భగవంతుని అండ మనకెప్పుడూ ఉంటుంది.''

తన ప్రియతమ నాయకుని ఈ సందేశం విన్న ప్రజలిక ఆగుతారా! తమ ప్రాణాలు సైతం పాదాల వద్ద అర్పణ చేయడానికి సిద్ధంగా ఒక ప్రజా వెల్లువ శివాజీ ముందు మోహరించింది. సైనిక గూఢచారి విభాగాల్లో శిక్షణ ఆరంభమయింది. ఈ ఉద్యమానికి ధనం అవసరం. శివాజీ తమ ప్రక్కనున్న తురుష్క జాగీరుదార్ల దోచుకొని దాచుకొన్న

ధనం, ప్రభుత్వ ధనం కొల్లగొట్ట నారంభించాడు. డబ్బున్న రహస్య స్థావరాల్ని శివాజీకి భవానీదేవి స్వయంగా చెప్పేదంటారు. ఆయనకు హిందూ ధర్మ రక్షణకై ఖడ్గం ప్రసాదించిందని కూడా చెబుతారు.

బీజాపూరు నవాబుకు పూనా పరిపాలనా వ్యవస్థ కొరుకుడు పడలేదు. ప్రక్క జాగీర్లలో దొంగతనాలు, దోపిడీలు. పూనా సంస్థానంలో శాంతి భద్రతలు - సైన్యశిక్షణ, విప్లవ ధోరణి ఇదంతా అర్థం కాలేదు. శహాజీపై వత్తిడి తీసుకొని రానారంభించాడు. జీజాబాయికి, శివాజీకి కూడా శహాజీ ధోరణి నచ్చలేదు. అతని అధ్వర్యంలో పెక్కు దేవాలయాలు దోచబడి ధనరాసులు ప్రభుత్వ ఖజానాకు చేర్చబడుతున్నాయి. శహాజీకి తన జాగీరులోని ఈ ఉద్యమానికి కారకుడు శివాజీ అనేది నమ్మబుద్ధి కాలేదు. క్రొత్త కోడలిని చూసే నెపంతో దాదాజీని, జీజాబాయిని, శివాజీని కోడలును బెంగుళూరు రప్పించాడు. అన్నట్లు 13 ఏళ్ల వయస్సులో నింబాల్కరు వంశానికి చెందిన సయీబాయితో శివాజీ వివాహమయింది.

బెంగుళూరు చేరిన శివాజీ తన తండ్రితో, అన్నగారితో కొంతకాలము ఉన్నాడు. శహాజీ శివాజీ ప్రవర్తన వలన తనకు కలిగే విపత్తుల గురించి చర్చించసాగాడు. జీజాబాయి తీర్థయాత్రా నెపంతో అక్కడకు దక్షిణాన ఉన్న దేవాలయ సందర్శనకు వెళ్ళిపోయింది. శివాజీ తన వాదనా పటిమతో తండ్రిగారినే తన దారికి తెచ్చుకొన్నాడు. శహాజీ తాను స్వయంగా సహాయం చేసినటుల కనబడదు కానీ, శివాజీ సహాయానికి అనుభవశాలురు నమ్మకస్తులయిన అధికారులను ఏర్పాటు చేశాడు. వెంటనే కావలసిన యుద్ధసంభారాలకు డబ్బు చేకూర్చాడు. మరాఠా దేశపు బీజాపూరు రాజ్య సామంతులలో తనకు మిత్రులయిన వారిని శివాజీ సహాయానికై అర్థించాడు. తాను మాత్రం బీజాపూరు సేనలో ఉండిపోయాడు. బహుశః బీజాపూరు సేన వదిలి పెడితే తన భుజబలంతో సాధించిన బెంగుళూరు నుండి తంజావూరు వరకూ ఉన్న కోటలపై ఆధిపత్యం వదిలి వేయవలసి వస్తుందనే భయం కారణం కావచ్చు.

శహాజీ ద్వంద్వనీతి ఆదిల్‌షాకు కొంచెం అవగతమయినట్లున్నది. శివాజీతో సహా కొలువులో హాజరు కావలసినదిగా ఆదేశించాడు. అక్కడ శివాజీ ప్రవర్తన గురించి శహాజీ ఎంతో సంజాయిషీ ఇవ్వవలసి వచ్చింది. అతడు బీజాపూరు అధికారానికి లోబడే ఉన్నాడనీ, కొండప్రాంతపు ఆర్థిక స్థితి మెరుగుపరచడానికి, పరిపాలన పటిష్ఠం చేయడానికి చర్యలు తీసుకొంటున్నాడని నమ్మబలికాడు. శివాజీ ప్రవర్తన మాత్రం అందుకు భిన్నంగా ఉంది. దర్బార్ లో నవాబ్‌కు సలాం చేయలేదు. మంత్రి మురారిరావు కలగ చేసుకొని చిన్నతనమని సర్ది చెప్పి పంపివేశాడు.



## శివాజీ – సమర్థ రామదాసస్వామి

బీజాబాయి పెంపకంలో పెరిగిన శివాజీకి చిన్నతనం నుంచే సాధుసంతులంటే విపరీతమైన భక్తి శ్రద్ధలు. పూనాలో ఉన్న కాలంలో తుకారాంను జ్ఞానోపదేశానికై అర్థిస్తే ఆయన శివాజీకి తగిన గురువు సమర్థ రామదాస స్వామి అని అభంగ వృత్తంలో వ్రాసి పంపారట. అప్పట్నుంచీ రామదాస స్వామిని పట్టుకోవడానికి బహు ప్రయత్నం చేశాడు శివాజీ. రాజధానికి వచ్చి జ్ఞానోపదేశం చేయమని ప్రార్థిస్తే ఇప్పుడు నీవు చేసేదే బహుశ్లాఘ్యంగా ఉన్నదని బదులు పంపారట. ఎట్టకేలకు 1649లో సమర్థ రామదాసుని ఒక చిన్న గ్రామములో దర్శించి మంత్రోపదేశంతో పాటు జ్ఞానోపదేశం పొందారు.

శివాజీ కోర్కెను కాదనలేక సతారా దగ్గర సజ్జన్‌గఢ్‌లో శివాజీ కట్టించిన మఠంలో చాలా కాలం ఉన్నారు. తరచు గురుశిష్యుల సమా వేశం జరుగుతూ ఉండేది. రామదాస స్వామి ప్రతిరోజు భిక్షాన్నము స్వీకరిస్తారు. ఒకరోజు రామదాస దర్శనానికై సతారులో విడిచి చేసి ఉన్న శివాజీ భవనం ముందుకు వచ్చి నుంచొని ''జయ జయ రఘువీర సమర్థ'' అంటూ మేఘ గంభీర స్వరంతో భిక్ష అడిగారు. శివాజీ తన యావద్రాజ్యాన్ని రామదాసస్వామి పేర వ్రాసి దానిపై తన రాజముద్ర వేసి సమర్పిం చారు. రామదాస స్వామి తన తరపున ధర్మరక్షణ చేయవలసినదని ఎంతో ఆనందంతో ప్రసన్న చిత్తంతో పలికి రాజ్యం తిరిగి ఇచ్చారు. ఇది సూచించడానికే మరాఠుల జెండా కాషాయ రంగులో ఉంటుంది. శివాజీ ఎల్లప్పుడూ రామదాసస్వామి పాదుకలను ఎదురుగా ఉంచుకొని రాజ్యపాలనము చేశాడు.

రామదాసస్వామి శివాజీ రక్షణకై చేసిన భవానీ ప్రార్థన అత్యంత ప్రసిద్ధమైనది. శివాజీ గతించిన పిదప రామదాస స్వామి ఎక్కువ కాలము మౌనముతోనూ, సమాధిగతునిగనూ ఉండి గదిలో నుండి బయటకు కూడా ఎక్కువ రాకుండా కాలం గడిపారు. 1681 ఏప్రియల్ మాసంలో సిద్ధి పొందారు.

అయితే బీజాపూరులో శివాజీ శీలాన్ని, తన సిద్ధాంతానికి రాజీబడని మనస్తత్వాన్ని అపరితమైన ధైర్యసాహసాన్ని సూచించే సంఘటన ఒకటి జరిగింది. శివాజీ రాజ వీధిలో పోతున్నపుడు ఆవును కట్టివేసి మెడ నరక బోయే దృశ్యాన్ని చూసి చెంగని బండి దూకి, నరకబోయే మహమ్మదీయుని చావ దన్ని, ఆవును విడుదల చేసి వేశాడు. ఆ రోజుల్లో ముస్లిం సామ్రాజ్యములో, ఒక ముస్లిం ఆవును చంపబోతుంటే, ఒక హిందువు ఆపడం సామాన్యమైన అపరాధం కాదు. శ్రేయోభిలాషుల సలహాపై ఖైదు చేయబడక ముందే కుటుంబంతో సహా తన జాగీరు చేరుకున్నాడు. స్వతంత్ర భారతంలో కోట్లాది హైందవుల కళ్లముందు లక్షలాది గోవులు కబేళాలకు తోలబడుతుంటే రక్షించే ధైర్యం ఒక్కగానొక్కనికైనా లేదే! ఒక్క శివాజీ పుట్టరాదా?

బీజాపూరు నుంచి తిరిగి వచ్చిన శివాజీ ఇనుమడించిన ఉత్సాహంతో తన ఉద్యమాన్ని కొనసాగించాడు. అనేకమంది మరాఠీ ప్రముఖులు తమ సహాయాన్ని బేషరతుగా అందజేశారు. శహాజీ స్నేహితుడైన కన్హోజీ సహాయంతో 12 కోటలను జయించాడు. తోరణ, చకన, రోహిడా, సింహగడ వంటి దుర్గాలను గట్టి బరచి తగిన ఆయుధ సామాగ్రి చేర్చాడు. రాజధాని కోసమై అభేధ్యమైన ప్రదేశంలో రాయగడ దుర్గాన్ని కట్టనారంభించాడు. ఇది విన్న బీజాపూరు నవాబు శహాజీని అవమానించాడు. కన్హోజీని నరకవేదనలపాలు చేశాడు. శివాజీ మాత్రం తాను బీజాపూరు నవాబుకు విశ్వాస పాత్రుడిగానే ఉన్నానని చెబుతూనే తన ప్రధానోద్దేశ్య సాధనకు అవిరళమైన కృషి చేస్తు వచ్చాడు. శివాజీ కృషికి దైవ సహాయం అదిల్‌షా పక్షవాతం వచ్చి మంచాన పడే రూపంలో వచ్చింది.

1647 ప్రాంతంలో మహాత్ముడు దాదాజీ కొండదేవుడు మరణించాడు. శివాజీ స్వతంత్రించి తన స్వాతంత్ర్యానికి ప్రాతిపదిక వేయసాగాడు. మొదటగా తన మిత్రులైన పురందర్ పురాధిపతులను బీజాపూరు సేన వదిలి తన ఆధిపత్యాన్ని అంగీకరించడానికి రాజీ చేశాడు. తన ఆధిపత్యాన్ని అంగీకరించని సవితి మేనమామపై రాత్రికి రాత్రి దండెత్తి, దుర్గం స్వాధీనం చేసుకొని, అతనిని బెంగుళూరు పంపివేశాడు. శివాజీకి తన గురువు ఆదేశమైన ప్రజాక్షేమం, ధర్మస్థాపనము ప్రధానము. అందువల్లనే తన రాజ్యములో సరిఅయిన పరిపాలనా వ్యవస్థ, న్యాయవ్యవస్థ ఏర్పాటు చేయడానికి ప్రాధాన్యత ఇచ్చాడు. తను రక్షించుకోవడానికి వీలయినంత వరకే తన సరిహద్దులను నిర్ణయించుకొన్నాడు. 1648లో తనదైన రాజముద్ర అన్ని ముఖ్య పత్రాలపై ముద్రింపించడం ద్వారా తన సార్వభౌమత్వాన్ని స్పష్టంచేశాడు. ముద్ర సంస్కృత భాషలో ఈ క్రింది శ్లోకరూపంలో ఉంది.

**ప్రతి పచ్చంద్ర రేఖేవ వర్ధిష్ణు: విశ్వ వందితా ।**
**శాహ సూనో శివస్యైషా ముద్రా భద్రాయ రాజతే-॥**

శివాజీ స్వాతంత్ర్యము బీజాపూరు ప్రభువులకు ఆందోళన కలిగించింది. ఆదిల్‌షా ఆజ్ఞతో జింజికోటకు ఎదురుగా బీజాపూరు పక్షాన యుద్ధం చేస్తున్న శహాజీని ముస్తాఫా ఖాను ఖైదు చేసి బీజాపూరు ప్రభువు ముందు హాజరు పరిచాడు. నవాబు బెంగుళూరు, సింహఘడ్ కోటలు తిరిగి ఇచ్చే ఏర్పాటు చేయవలసిందిగా శహాజీని ఆదేశించాడు. అలా చెబుతూనే ఆ రెండు ప్రదేశాలకు సేనలను పంపాడు. బెంగుళూరులో శంభాజీ, సింహఘడ్‌లో శివాజీ బీజాపూరు సేనలను పరాసులను గావించారు. అయితే శహాజీ పరిస్థితిపై ఆందోళన పడుతున్న తల్లి కొఱకై శివాజీ సింహఘడమును బీజాపూరునకు దత్తం చేశాడు. నవాబు కొలువులో ఉన్న తన తండ్రికి ఆపద కలగకుండా ఏ విధంగా బీజాపూరు నవాబుల కీచమడచవలెనా యని యోచిస్తున్న శివాజీకి మంచి అవకాశం దొరికింది.

మొగలాయిల పక్షాన దక్కను గవర్నరుగా ఔరంగజేబు నియమించబడ్డాడు. అతడు బీజాపూరుతో కడువైర భావంతో దండెత్తుతున్నాడు. ఔరంగజేబు నుండి రక్షించుకోవడానికి బీజాపూరు నవాబుకు శహాజీ సహాయం అత్యంత అవసరం. శివాజీ ఔరంగజేబుతో సఖ్యత కుదుర్చుకొని బీజాపూరు కోటలను కొల్లగొట్టడానికి ఆతని అనుమతి తీసుకొన్నాడు. బీజాపూరు నవాబుల పని అడకత్తెరలో పోక చందంగా అయింది.

మహాబలేశ్వరు సమీపంలోని జావ్లీ దుర్గంలో బీజాపూరు సామంతులైన మోరేలు ఉన్నారు. వారు శివాజీ ఆధిపత్యాన్ని అంగీకరించక సరిహద్దులో కంటకంగా ఉన్నారు. శివాజీ సామదానభేదోపాయాలతో ప్రయత్నించాడు. మరాఠా ప్రాంతాలలో పోరుకు ఎక్కువ ఇష్టపడడు శివాజీ. తప్పని సరిగా 1656లో ముట్టడి చేసి ఆ కోట ముఖ్యుడిని చంపివేసి మిగిలిన ముగ్గురుని సంధికి పిలిపించాడు. శివాజీ నయానా భయానా చెప్పినా వారు లొంగలేదు. మరణ దండన విధించాడు. చివరి తమ్ముడు తప్పించుకొని చివరి దాకా శివాజీకి కంటకంగానే మిగిలిపోయాడు. అక్కడ కట్టిన ప్రతాప్‌ఘడ్ కోట రక్షణావసరాల పరంగా ఎంతో ప్రాముఖ్యమయినది.

(ముగింపు వచ్చే సంచికలో)



# ఉభయభారతి

## విశ్వనాథ పావనిశాస్త్రి

### జరిగిన కథ

మండనమిశ్రుడు పూర్వమీమాంసలో నిధి. ఆయన భార్య ఉభయభారతి శాస్త్ర చర్చల్లో మండనమిశ్రుడిని ఓడించడానికి ఆదిశంకరులు వస్తున్నారని వాళ్ళకి తెలుస్తుంది.

కోట్లకి పడగలెత్తిన వ్యాపారి సమరసేనుడు. తన మిత్రుడైన లవణగుప్తునితో వెళుతుండగా, ఆదిశంకరుల వారిని చూడడం తటస్థించింది. వారితో సంభాషించి, పరివర్తన చెంది, మహిష్మతి వైపు ప్రయాణం సాగిస్తాడు.

**ధారావాహిక నవల**

పుట్టిన వింధ్యపర్వతపు పట్టు వదిలిన నర్మద, దూకుడు మాని మైదానాన్ని చేరి గంభీరంగా ప్రవహించే సరిహద్దులో ఉంది మాహిష్మతీ రాజ్యం. దాని రాజధాని మాహిష్మతీనగరం. నర్మదకి నర్మసఖి అయిన ఆ మాహిష్మతికి రాజు అమరుకుడు.

మాహిష్మతి చాలా చిన్న రాజ్యం. రాజ్యం చిన్నదయినా - దానినిండా జ్ఞానులైన పండితులూ, పండితులైన కళాకారులూ, కళ కలిగిన కర్షకులూ, కృషి తెలిసిన ఉద్యోగులూ, యోగవంతులైన వ్యాపారులూ, పాఠం తెలుసుకోగోరే విద్యార్థులూ, అర్థదాహంలేని అధికారులూ ఉండటంచేత; రాజుకీ ప్రజలకూ మధ్య అగాధం లేదు. ఆ కారణంగా అమరుకునికి పరిపాలనా సమస్యలు శూన్యమనే చెప్పాలి.

అనేక విద్యలలోని ఆంతర్యాలూ, మర్మాలూ తెలుసుకోవడానికి; దేశం నలుమూలల నుంచీ ఎంతోమంది రాజకుమారులూ, ధనవంతుల బిడ్డలూ, పండితుల పిల్లలూ మాహిష్మతీ పండితుల దగ్గరికి వస్తారు. ఆవిధంగా దేశం నలుమూలలా ప్రముఖ శిష్యులు గల మహిష్మతికి శత్రుభయం కూడా లేదనే చెప్పాలి.

ఈ రెండు కారణాల వలన అమరుకునికి రాజ్యపాలనా భారం చాలా తక్కువ. అందుచేత ఎక్కువకాలం, వినోదాలతో, విలాసాలతో గడుపుతాడు. అలాగని కవిపండిత గోష్ఠులూ, చారచక్షుస్త్వమూ విడనాడలేదు. శత్రుభయం లేకపోవడంతోనూ, రాజ్యదాహం లేకపోవడంతోనూ-క్షత్రియులకు అవసరమైన నిత్యవ్యాయామాల యందూ, యుద్ధవిద్యల యందూ ఎక్కువ శ్రద్ధ చూపించడు. కాని శారీరకంగా మహబలశాలీ, సహజంగా వీరుడూ అయిన అతనిలో ఆ లోటు కనబడదు.

నిత్యతాంబూల, మధుపాన, స్త్రీలోలత్వాల వలన అతడి కళ్లు ఎప్పుడూ అరవిరిసిన ఎఱ్ఱకలువల లాగా ఉంటాయి. అతడి స్త్రీలోలత్వం భార్యలవరకే పరిమితం. అతడికి పదిమంది భార్యలు.

పట్టమహిషి 'మాయాదేవి' ఆంధ్రరాజ దుహిత. మగధ సమ్రాట్ అయిన అరిష్టశాతకర్ణికి దాయాది కుమార్తె. సంగీత సాహిత్యాల లోతులు, రాజనీతిలో ఎత్తులు ఎరిగిన పడతి. బౌద్ధ మతాభిమాని. అమరుకుడిని బౌద్ధుడిగా మార్చి, మాహిష్మతిని బౌద్ధకేంద్రంగా చెయ్యాలని ఆమె సంకల్పం.

రెండవరాణి 'గంధర్వసేన' కాశ్మీర రాజకన్య. సంగీత సరస్వతి. పలకరిస్తేనే పులకరించిపోయే వెన్నెలగీత, బంగారు తీగ

ఆమె సాహచర్యం అమరుకుడికి ఒకపాల. అమరుకుడి సాంగత్యం ఆమెకొక జోల.

మూడవరాణి 'నాగేంద్రవల్లి'. మహారాష్ట్రమహిళ. ఆమె తండ్రి గొప్ప ధనురాచార్యుడు. ఒకసారి గోకర్ణంలో జరిగిన ధనుర్విద్యా ప్రదర్శనానికి, అమరుకుడు న్యాయనిర్ణేతగా వెళ్ళాడు. నాగేంద్రవల్లి ధనుర్విద్యా నైపుణ్యానికీ, శరీర లావణ్యానికీ ముగ్ధుడైపోయాడు. అతడి సునిశిత దృష్టికి ఆమె వశమైపోయింది.

నాల్గవరాణి 'జలంధర'. ఆమె సింధురాజ సహోదరి అమరుకుడికి మేనమామ కూతురు. జలక్రీడలలో ఆమెకి ఆమే సాటి. జలక్రీడలో అమరుకుడి ప్రతిభ అమోఘం. వారి క్రీడా గంథం ప్రణయబంధంగా మారింది.

అయిదవరాణి 'వైఖరి'. ఆమె తండ్రి కాంచీపుర సైన్యాధ్యక్షుడు. ఒకప్పటి కాంచీపుర యువరాజైన బోధిధర్ముడు ముష్టియుద్ధంలో మహాయోధుడు. చీనా దేశానికి బౌద్ధమతంతో పాటు, ముష్టియుద్ధాన్ని అందించినవాడతడే! ఆ యుద్ధ సంప్రదాయంలో వైఖరి ఆరితేరిన అంగన. మాయాదేవికి చిన్ననాటి స్నేహితురాలు. ఒక రాజ్యానికి రాణి కావాలని కోరి, అమరుకుణ్ణి భర్తగా వరించింది. ఆమె శిక్షణలో మహిష్మతీ సైన్యం అదనంగా పదును తేలింది. అమరుకుడు సమ్రాట్టు కావాలనీ, భారతదేశ రాజధాని మగధనుంచి మాహిష్మతికి మారాలనీ ఆమె కల.

ఆరవరాణి 'అరుణలోచన', ఏడవరాణి 'నీలలోచన'ల కాంభోజరాజకుమార్తెలు. కవలలు. ఒక్కసారి చూసి తమలో ఎవరెవ్వరో పోల్చి నిరూపించిన సుందరుణ్ణి వివాహ మాడుతామని స్వయంవరం ప్రకటించారు. పోలికా, నడకా, ఆకారమూ, కంఠ స్వరమూ అన్నీ అచ్చుగుద్దినట్టు ఒకేలాగా ఉన్న ఆ యిద్దరిలో ఎవరెవరో, ఎవరూ కనుక్కోలేకపోయారు. కనురెప్పలార్పుతున్నప్పుడు, అరుణలోచన ఎడమకంటి పైరెప్పమీద ఉన్న ఎఱ్ఱని పుట్టుమచ్చ ఆధారంగా ఆ తేడా కనుక్కున్నాడు అమరుకుడు. ఒకరిని విడిచి ఒకరు ఉండలేని ఆ కవలలతో కలయిక అమరుకుడి కొక విచిత్రం.

ఎనిమిదవరాణి 'అనంగలేఖ'. అంగరాజకుమారి. అంగదేశానికి అనాదిగా అలవాటైన ఒకానొక క్షామంలో, అమరుకుడు ఆ రాజకుటుంబాన్ని ఆదుకున్నాడు. అప్పుడామె అమరుకుడికి మనసా దాసి అయింది. రాజుని చూడంగానే, పద్మవల్లే వికసిస్తుంది. రాజుభ్రమరవౌతారు.

తొమ్మిదవరాణి 'మధ్యమ'. రాజ్యాలు పోయి, రాచనెత్తురు ఉడిగి, వర్తకంలోకి దిగినకొద్దిమంది క్షత్రియులలో ఆమె తండ్రి ఒకడు. రాణివాసాలకు ''కంచిపట్టు'' చీరలు పంపిణీ చేసి కోట్లు గడించాడు. చిన్నతనం నుంచీ; పట్టుచీరల నేతలో, రంగుల అద్దకాలలో, గళ్ళ విన్యాసాలలో తండ్రికి ఎన్నో సలహాల నిచ్చేది



మధ్యమ. ఆ విన్యాసాలకు అమరుకుడు వాఖ్యానం చేసేవాడు. ఆ విషయం సమరసేనుడి ద్వారా తెలుసుకున్న మధ్యమ ముగ్ధయై పోయి, అమరుకుడికి మనసిచ్చింది.

పదవరాణి 'పరానిష'. గాంధర రాజపుత్రిక. మ్లేచ్ఛులూ, అనాగరకులూ అయిన ఆనాటి యవనులతో భారతీయులకు వివాహ సంబంధాలు లేవు. కాని గాంధారులకు అనాదిగా తమ పొరుగున ఉన్న యవనులతో స్నేహం ఉంది. ఆ కారణంగా, పొరుగున ఉన్న చిన్న యవనరాజ్యాధిపతితో స్నేహం ముదిరి, అతని సోదరిని వివాహమాడాడు గాంధార రాజు. వారి కుమార్తె పరానిష. ఖడ్గవిద్యలో గాంధారరాజ కుమారుడూ, అమరుకుడూ సతీర్థ్యులు. వారి అభ్యాసవేళ ఏకైక సాక్షి పరానిష. అభ్యాసదశ లోనే అసాధారణప్రజ్ఞ కనబరచిన అమరుకుడిని ఆమె ఆనాడే వరించింది. తరువాత చాలాకాలానికి వారి వివాహమైంది. పరానిష ముమ్మూర్తులా తల్లిపోలిక. ఆమె సౌందర్యమూ, విన్యాసమూ, వేషధారణా, విచిత్ర భాషణా, దేహకాంతీ, భావక్రాంతీ, అన్నీ అద్భుతమే అమరుకుడికి. సురాపానంలో ఆమె అతనికి తీసిపోదు.

శరీరంలో ప్రాణవాయువు పదివిధాలుగా కదులుతూ ఉంటుంది. వాటినే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము లనే పంచప్రాణములు గానూ; నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములనే పంచ ఉపప్రాణములుగానూ అభివర్ణించారు. అగ్ని స్వరూపమైన జీవశక్తి, ఈ పదివాయువుల సహాయంతో, నిత్యం జ్వలిస్తూ శరీరాన్ని చైతన్యవంతంగా ఉంచుతుంది.

పదివాయువుల్లాటి తన పదిమంది రాణులతోనూ, శృంగారమనే శరీరంలో జీవశక్తిలాగా అమరుకుడు ఆనందిస్తున్నాడు. కాని ఆ అందాలు అందివ్వని మరేదో ఆనందాన్ని పొందాలని అతని ఆవేదన. అదేమిటో, ఎలా పొందాలో అంతుచిక్కడంలేదు.

★ ★ ★

ఆ రోజు త్రయోదశి. ధనూరాశి దాదాపు నడిమింటికి చేరింది. అంతుచిక్కని ఆ ఆనంద స్వరూపాన్ని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు అమరుకుడు. ఆ రాత్రికి తాను వస్తున్నట్లు ఏ రాణికీ కబురు పంపలేదు.

అంతలో దౌవారికుడు వచ్చి, ''ప్రభువులకు జయము'' అన్నాడు. అమరుకుడు అతడివైపు చూశాడు.

''సమరసేనులవారూ, లవణగుప్తులవారూ తమ దర్శనార్థమై వస్తున్నారు ప్రభూ!'' అన్నాడు దౌవారికుడు.

అమరుకుడి ముఖంలో హఠాత్తుగా ఒక వికాసం తోచింది. ''వెంటనే ప్రవేశపెట్టు'' అని ఆనతిచ్చాడు.

మరులిప్తలో సమరసేన లవణగుప్తులిద్దరూ లోపలికి ప్రవేశించారు. వస్తూనే రాజుకి గౌరవవందనం చేశారు. ఆ వందనాన్ని అందుకోకుండానే రాజు లేచి చరచరా వారి వద్దకు వచ్చాడు. ఇద్దరి భుజాలమీద చెరో చెయ్యి వేసి నిలబడ్డాడు.

అమరుకుడు రాజు; సమరసేనుడతని పౌరుడు. అమరుకుడు రాజేకాని, రాజ్యం అంతా అమరుకుడి ఆస్తికాదు. రాజ్యంలో నాల్గవవంతు మాత్రమే వంశపారంపర్యంగా అమరుకుడి ఆస్తి. ఆ రాజ్యంలో దాదాపు ఎనిమిదవవంతు సమరసేనుడి ఆస్తి. అదికాక ప్రతిరాజ్యంలోనూ సమరసేనుడికి ఆస్తులున్నాయి. అవ్వన్నీ కలిపితే, అతను అమరుకుడికన్నా ఆరింతలు ధనవంతుడు. రాజమండలాల్లో తప్ప, అమరుకుడెవరో యితర రాజ్యాలలో ఎవరికీ తెలియదు. అనేక వృత్తుల వారిచేతా, కళాకారులచేతా అనేక వస్తువులు చేయించి సమరసేనుడు తన ముద్రతో అమ్ముతూ ఉంటాడు కాబట్టి, ఏ రాజ్యంలోనూ అతని పేరు ఎరగనివారు లేరు. కాని అమరుకుడు రాజు. సైన్యం అతని చేతిలో ఉంది. ధర్మాసనానికి అతడు అధిపతి. శిక్షాస్మృతి ననుసరించి, ఒక రాజ్యప్రజలు అతని రక్షణలో ఉన్నారు; అతనికి భక్తులై ఉన్నారు. సమరసేనుడెంత ధనవంతుడైనా, మాహిష్మతి పౌరుడే. రాజభక్తి పరాయణుడే; కాని అమరుకుడు, సమరసేన లవణగుప్తుల్ని పౌరులుగాకన్న మిత్రులుగానే ఎక్కువ మన్నిస్తాడు.

వ్యాపార సంచారానికి వెళ్ళినప్పుడల్లా, సమరసేనుడు ఏవో చిత్ర విచిత్రమైన వస్తువులు సంపాదిస్తాడు. వాటిలో అపురూపమైనవాటిని తెచ్చి రాజుకి కానుకగా సమర్పిస్తూ ఉంటాడు. అమరుకుడు కూడా ఆ కానుకలను సాదరంగా స్వీకరిస్తాడు.

కాని ఈసారి సమరసేనుడు కానుకలు సమర్పించేలోపలే అమరుకుడు, ''ఇలా ఇన్ని దినాలు మీరిద్దరూ కనబడకుండా పోతే మేమేమైపోవాలి? సమరసేనా! నువు చేసిన ఈ నేరానికి, మేము నిలుచుని ఉండగా, మా ఆసనంపై నువు అరగడియసేపు మాట్లాడకుండా కూర్చునే శిక్షవేశాము'' అన్నాడు గంభీరంగా.

''ప్రభూ...'' అని సమరసేనుడేదో చెప్పబోయాడు.

# వ్యాస తాత్పర్య నిర్ణయం

ఇప్పటికి నూరేళ్ల క్రితం, పై పేరు గల పుస్తకం శ్రీరంగవాణీ విలాస ప్రెస్సు ద్వారా ముద్రించ బడినది. దీనిని వ్రాసినది తిరువిసైనల్లూరు శ్రీధర అయ్యావాళ్ శిష్యులు అయ్యన్న దక్షితులు గారు.

వేదాంత శాస్త్రములో ముఖ్యముగా మూడు సిద్ధాంతాలు ఇప్పుడు బహుళ ప్రచారంలో ఉన్నాయి. ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత సిద్ధాంతాలు. ఈ మూడు సిద్ధాంతాలూ, కర్తలూ బాదరాయణుని వేదాంత సూత్రాలను ప్రమాణంగా తీసుకొని, తమ తమ సిద్ధాంతానికి అనుగుణంగా వ్యాఖ్యానం చేశారు. ముగ్గురూ తమ సిద్ధాంతానికి వ్యాసుని సమ్మతి ఉన్నదంటున్నారు. అసలు వ్యాసుని ఉద్దేశ్యం ఏమిటి? శంకరులు అనవసరంగా సూత్రభాష్యం వ్రాసి వేదాంత శాస్త్రమును మూడు చెక్కలుగా చేశారనే విమర్శ ఈమధ్య వినవచ్చింది. అది నిజమా? ఈ ప్రశ్నలకు సమాధానం ఈ పుస్తకంలో ఉన్నది.

శంకరుల కాలం ముందే సాంఖ్య, మీమాంసా, న్యాయదర్శనములు ప్రసిద్ధిలో ఉన్నాయి. అవైదికములైన జైన బౌద్ధ మతాలు ఉన్నాయి. కాశ్మీరశైవము మొదలైన శైవ సిద్ధాంతాలు, వైష్ణవ సిద్ధాంతాలు ఉన్నాయి. వీరందరూ వ్యాసకృతమైన బ్రహ్మ సూత్రాలను విమర్శించిన వారే. ఏదైనా సిద్ధాంతాన్ని ఖండించే ముందు, ఆ సిద్ధాంతాన్ని పూర్తిగా అర్థం చేసుకొని, ప్రతిపాదించి తరువాత ఖండించాలి. పై దర్శనములను ప్రతిష్ఠించిన పెద్దలు, వ్యాస మతము లేక వేదాంతదర్శనంగా దేనిని ప్రతిపాదించారో, వారి గ్రంథాల నుంచే ఎత్తి చూపి, అవన్నీ అద్వైతమునే చెబుతున్నాయని నిరూపించారు గ్రంథకర్త. అంతేకాదు, రామానుజుల కాలం ముందు వరకూ అన్ని గ్రంథాల లోనూ వేదాంతం అంటే అద్వైతాన్ని గురించే చెప్పారని అనేక శ్లోకములు ఉట్టంకించి తెలిపారు. శంకరులకు వేదాంత శాస్త్రంలో విశిష్టాద్వైతము, ద్వైతము అనే సిద్ధాంతాలు ఉన్నాయని తెలియదనీ, అలాటివి వస్తాయని ఆయన ఊహించను కూడా లేదనీ సోదాహరణంగా ఋజువు చేశారు.

ఉపనిషత్తుల నుండీ, విష్ణు పురాణం నుండీ, భాగవతం నుండీ అద్వైతార్థం వినా వేరొక అర్థం చెప్పడానికి వీలు లేదని అనేక వాక్యాలు ఎత్తిచూపి, బహుకాలము జీవించిన ఆ సిద్ధాంతకర్తలు ఉపనిషద్భాష్యం ఎందుకని వ్రాయలేదని ఆశ్చర్యపడ్డారు.

దీనివల్ల మనకు వేదాంత సూత్రాలలో వ్యాసులవారు ప్రతిపాదించినది అద్వైతమేననీ, దానినే శంకరులు అత్యంత సమర్థవంతంగా సుష్ఠుపరిచారనీ అర్థమవుతోంది. అందువల్లనే శంకరులు ఖండించిన ఇతర వైదిక దర్శనములన్నీ వేదాంతానికి అంగాలయ్యాయి. ఈ విధంగా శంకరులు వైదిక ధర్మ ఐక్యత సాధించారు.

**- చల్లా విశ్వనాథశాస్త్రి**

''మాట్లాడటానికి వీల్లేదు. ఇది మా ఆజ్ఞ!'' అంటూ అతని భుజం మీద చెయ్యి తీశాడు అమరుకుడు.

సమరసేనుడు చేసేది లేక, బిడియపడుతూనే రాజాసనంలో ఒదిగి కూర్చున్నాడు.

రాజు ''లవణగుప్తా! నువు వ్రాసిన కవిత్వం ముందుగా వినిపించాలి. ఆ తర్వాతనే ఆసన స్వీకారం. అదే నీకు శిక్ష.'' అన్నాడు తిరిగి.

''అంతకన్న అదృష్టమా ప్రభూ! అంటూ లవణగుప్తుడు, ''ప్రయాగ నుండి వస్తూ దారిలో నర్మదా నది ఒడ్డున వ్రాశాను. వ్రాయలేదు. అశువుగా వచ్చింది వినిపిస్తాను ''అని ఒక సంస్కృత శ్లోకం చదివాడు :

**తవాలయ గిరిపాదే**
**స్థితోహం దర్శనోత్సుకః**
**నాల్పం మమపాద శక్తిః**
**నాల్పం చారోహణ పంక్తిః**
**తథాప్యశక్తోహం ప్రభో**
**సోపానా స్సోపానో నాస్తి**
**అర్ఘ్య ప్రధానార్థం నతా**
**ఋషి శీర్ష మాలికేవ**

దీని భావం ఇది.

''ప్రభూ! చిన్ని గుట్టపై ఉన్న
నిన్ను చేరాలని

నీ పాదపద్మ సమీప
సోపానాల వద్ద నిలిచాను.
సోపానాలు ఎక్కువా లేవు,
నా పాదాల సత్తువ తక్కువా కాదు
కాని దేవా! అవి సోపానాలో
నీకు అర్ఘ్యమీయడానికి
వంగిన ఋషుల శిరస్సులో
మన్నించు దేవా, అశక్తుడిని
ఆ సోపానాలు ఎక్కి
నిన్ను చేరలేను.''

లవణగుప్తుడి రెండు భుజాల మీదా రెండు చేతులూ వేసి వింటున్న అమరుకుడి ఆశ్చర్యానికి అంతు లేదు. శతపత్ర పద్మ దళాలల్లే ఒత్తుగా పేరుకుపోయిన ఆ ఆశ్చర్యపు పొరలు విడిపోవడానికి ఆయనకు చాలాసేపు పట్టింది. అంతసేపూ, చేతులు జోడించి నిలబడిన లవణగుప్తుడూ, ఆసీనుడై ఉన్న సమరసేనుడూ, చుట్టూ వాతావరణం - అంతా నిశ్శబ్దం.

చివరకు అమరసేనుడే తేరుకుని, ''ఆశ్చర్యం! అద్భుతం! ఏమిటీ విచిత్రం సమరసేనా! సంస్కృతంలో లవణగుప్తుడు కవిత్వం చెప్పడమా? అందులోనూ ఋషులను గౌరవిస్తూనా, భగవంతుని స్తుతిస్తూనా? అసలు అన్నిటినీ మించి, ఆ భావం ఎంత రమణీయంగా ఉంది!'' అన్నాడు.

లేచి నిలబడిన సమరసేనుడు, ''మహారాజా! అది శ్రీ శంకర భగవత్పాదుల అనుగ్రమం. దారిలో ఆ మహానుభావుల దర్శనం అయింది. వారు మాహిష్మతి వస్తున్నారు. నేడు మానవజన్మ ఎత్తినందుకు పరమార్థం ఆ మహానుభావుల దర్శనమే!'' అన్నాడు అని జరిగినదంతా వివరించాడు.

''ఓహ్! వారి గురించి మేమూ విన్నాము. మీ యిద్దరినీ చూస్తుంటేనే తెలుస్తోంది వారెంతవారో! వారు మాహిష్మతి రావడం మన అదృష్టం. మా మాయాదేవికి వారి దర్శనం చేయించాలి. మాహిష్మతిని బౌద్ధ కేంద్రంగా చెయ్యాలని కదా ఆమెగారి సంకల్పం'' అన్నాడు అమరుకుడు.

ఆ తరువాత అమరసేనుడు వారితో మరికొంతసేపు ముచ్చట లాడాడు. అంత రాత్రివేళ ఇళ్ళకు కూడా వెళ్ళకుండా, సరాసరి తన దగ్గరికే వచ్చిన ఆ యిద్దరినీ త్వరగా పంపించి వేశాడు. తాను నీలారుణలోచనల అంతఃపురానికి కదిలాడు.

లవణగుప్తుడి కవిత్వం ఆయనను ఉక్కిరి బిక్కిరి చేసింది. అందులో నుంచి బయటపడాలంటే, అంతకన్న ఉక్కిరి బిక్కిరై పోవాలి. అలా చేయగలవారు విచిత్ర కవలలే: ఇంద్రధనుస్సు లోని సప్తవర్ణాలలో యిరుచివరల నున్న 'అతి నీల - అరుణ' వర్ణాలు వారే! మధ్యనున్న తన పంచేంద్రియ వర్ణాలను వారితో కలిపితేగాని, మహాశ్వేతమైన ఆ వెలుగు వెలికి రాదు. ఆ తరువాత ప్రశాంత చిత్తంతో గంధర్వసేనని చేరాలి.

అప్పటికి ధనూరాశి బాగా పడమరకి తిరిగింది. ఆర్ద్రా నక్షత్రం ఇంకా ఉదయించలేదు. ధనూరాశి మన్మధుడికి చిహ్నం. ఆర్ద్రా నక్షత్రం శంకరుని మూడో కన్ను. ఆకాశపుటంచున అటు ఆర్ద్రా నక్షతం ఉదయిస్తూంటే, ధాత్రీతలాన యిటు ధనూరాశి అస్తమిస్తుంది. అదే మన్మథ దహనం. ఇదొక పురాణ ఖగోళ రహస్యం.

ఆర్ద్రా నక్షత్రం యింకా ఉదయించలేదు. అమరుకుడు నీలారుణలోచనల అంతఃపురం చేరుకున్నాడు.

★ ★ ★

ఆరోజు ఆషాఢ శుద్ధ పాఢ్యమి. తరువాత ఉద్ధృతంగా కురవబోతూ, ముందుగా గిరిశిఖరం మీద చిన్నగా కనిపించే నీల మేఘం లాగా - మాహిష్మతీ నగర సరిహద్దులలో శిష్యగణంతో సహా అడుగుపెట్టాడు శంకరాచార్యుడు.

ఎప్పటికప్పుడు, ఆయన ఎంత దూరం వచ్చాడో తెలుసు కుంటున్న సమరసేనుడు పూర్ణకుంభ స్వాగతం యిచ్చాడు. ఆచార్యుని ఆజ్ఞ మేరకి, ఆర్భాటాలేమీ లేకుండా, కేవలం సతీసుత పరివారంగా వచ్చారు సమరసేన లవణగుప్తులు. లేకపోతే రాజపరివారంతో సహా మాహిష్మతి నంతా నగర ప్రాకారం దగ్గర నిలబెట్టేవాడే సమరసేనుడు!

అర్ఘ్యపాద్యాలందుకున్న ఆచార్యుడు, ఊరి చివరనున్న అమర లింగేశ్వరాలయంలో విడిది చేశాడు. శివార్చన కాగానే శిష్యగణంతో సహా బయలుదేరాడు.

అందరినీ పంపి, యిద్దరు పరిచారకులతో అక్కడే ఉన్న లవణగుప్తుడు, ''స్వామీ! ఇప్పుడే గదా ప్రయాణం చేసి వచ్చారు. రాగానే అర్చనే సరిపోయింది. ఎండగా కూడా ఉంది. భిక్ష చేసి, కొంతసేపు విశ్రాంతి తీసుకుని, నగర సంచారం సాయంత్రం చేయవచ్చు గదా!'' అన్నాడు.

''లవణా! దేనికి విశ్రాంతి? ఆత్మకా, దేహానికా? దేహానికి విశ్రాంతి మృత్యువే గదా! ఆత్మకి విశ్రాంతి ఉండదు గదా! ఇక మిగిలింది మనస్సు. అది అంతఃకరణం యొక్క అధీనంలోనిది.

నువ్వనే ఆ లౌకికమైన విశ్రాంతి తీసుకొనేటంత సమయం ఈ అంతఃకరణానికి లేదయ్యా! వెంటనే మండనమిశ్రుణ్ణి చూడాలి'' అని మాట్లాడుతూనే నడక సాగించాడు ఆచార్యుడు. ఆయన వెంట శిష్యులందరూ బయలుదేరారు.

ఆచార్యుని ఓపికకే కాక, ఆయన శిష్యుల ఓపికకి కూడా ఆశ్చర్యపోయాడు లవణగుప్తుడు. 'అలుపు లేని కార్యదీక్ష కలవారే గదా దివ్యపురుషులంటే' అని అనుకున్నాడు.

★ ★ ★

మాహిష్మతీ నగరం నర్మదకి ఉత్తరాన ఉంది. అక్కడితో వింధ్య పర్వత మహాశ్రేణి అయిపోయినట్టే! నదికి ఎగువ భాగాన అమరేశ్వరాలయం ఉంది. అక్కడ అన్నీ రకరకాల వృక్షాలతో నిండిన తోటలు! తోటలకు దిగువగా, పడమర వైపున రాజభవనాలున్నాయి. వాటికి మరింత పడమరగా నగరం ఉంది. నగరమంతా తూర్పు నుంచి పడమరకి పొడుగ్గా నది ఒడ్డునే ఉంది. నగరానికి ఉత్తరంగా 'మహామార్గం' ఉంది. దక్షిణాన నది ఒడ్డున 'రాజమార్గం' ఉంది. ఆ రాజమార్గం, ఎగువకి రాజ ప్రాసాదాల దాకా సాగి, అక్కడ ప్రాసాదాలనూ నగరాన్నీ వేరు చేస్తూ ఉత్తరంగా తిరిగి, మహామార్గంలో కలుస్తుంది. అలాగే దిగువకి కూడా సాగి, నగరం చివర, ఉత్తరవాహిని అయిన నర్మదతో పాటు తాను కూడా మలుపు తిరిగి, పడమర వైపున మళ్ళీ మహామార్గంతో కలుస్తుంది. ఈవిధంగా నగరం చుట్టూ రాజమార్గ వలయం ఉంది. తూర్పున బయలుదేరిన నర్మద, నగరానికి దక్షిణంగా ప్రవహించి, పడమటి చివర ఉత్తరానికి తిరిగి, నగరానికి ఒక చిత్రమైన ద్వీపకల్పన చేస్తోంది. కొండలలో కైలాసమల్లే, అమరగంగ ఒడ్డున అమరావతి మల్లే, యోగులతో భోగులతో మిహిష్మతి విరాజిల్లుతూ ఉంది. మాహిష్మతిలోని ప్రతి వాడా, పేటా నది ఒడ్డునే ఉన్నాయి. ప్రతి యింటి ఆవరణా మనోహరమైన వృక్షాలతో, లతలతో, పిట్టలతో ప్రకృతి శోభనంతా తనలోనే నింపుకున్న వసంతుడిలా ఉంది.

రాజప్రసాదాల చుట్టూ తిరిగి, నగరంలోకి ప్రవేశించి వీధుల వెంట నడుస్తున్న ఆచార్యునికీ, ఆయన శిష్యులకీ దారిలో ఎక్కడా ఒక బిచ్చగాడు కూడా కనిపించలేదు. ఒక్క దీనముఖం కూడా కనిపించలేదు. కనిపించిన కొందరు బౌద్ధులు భిక్షకులల్లే లేరు.

'కాషాయ దండ మాత్రేణ యతిః పూజ్యతే' అని అనుకున్న ప్రతివారూ దూరం నుంచే ఒదిగి నమస్కరిస్తున్నారు. బౌద్ధులు కూడా ఆ దివ్యపురుషుని తేజస్సు చూసి వినమ్రులౌతున్నారు. నాస్తికులు కూడా, ఆ మహాపురుషుని వర్చస్సు చూసి ఆశ్చర్యపోతున్నారు.

అందరికన్న ముందు సమరసేనుడి అనుచరుడొకడు నడుస్తున్నాడు. అతని వెనక లవణగుప్తుడు నడుస్తున్నాడు. ఆ వెనక ఆచార్యుడూ, శిష్యగణం నడుస్తున్నారు. అంతా మండనమిశ్రుడి యింటి ముందు ఆగారు. **(సశేషం)**

# పదహారు కళల

# శ్రీరామచంద్రుడు

శ్రీ మద్రామాయణ మహాకావ్యానికి నాందీ నారద వాల్మీకుల సంభాషణ.

వాల్మీకి జిజ్ఞాస. బ్రహ్మర్షి గనుక ఆయన జిజ్ఞాస సామాన్యమైనది కాదు. ఆయన వద్దకు నారదమహర్షి రాగానే - తన జిజ్ఞాసను బైట పెట్టాడు. ఒక మహాకావ్య రచనకి కావలసిన తపస్సు పండగా, ఉదయించిన ప్రశ్నలివి.

''ఓ నారదా!

ఇప్పుడు లోకంలో - ఈ లక్షణాలున్న వాడున్నాడా?

1. గుణవంతుడు, 2. వీరుడు, 3. ధర్మజ్ఞుడు, 4. కృతజ్ఞుడు, 5. సత్యవాక్య పాలకుడు 6. దృఢవ్రతుడు, 7. ఉత్తమ చరిత్ర కలవాడు, 8. సర్వభూతముల హితాన్ని కోరేవాడు, 9. విద్వాంసుడు, 10. సమర్థుడు, 11. ప్రియదర్శనుడు (చూడ డానికి ప్రియమైనవాడు) 12. ఆత్మవంతుడు (ఆత్మజ్ఞాని. తాను దేహము కాననే సత్య స్పృహగలవాడు), 13. జితక్రోధుడు (క్రోధాన్ని జయించినవాడు), 14. ద్యుతి మంతుడు (తేజోవంతుడు), 15. అన సూయుకుడు (అసూయ లేనివాడు) 16. ఎవరి కోపాన్ని చూసి దేవతలు కూడా భయ పడతారో అటువంటివాడు.

ఇటువంటి లక్షణాలున్న నరుని గూర్చి వినాలని కుతూహలంగా ఉంది. మహర్షీ! అటువంటి వానిని తెలుసుకోగలిగే సమర్థుడవు నీవే కదా!!

*కోన్వస్మిన్ సాంప్రతం లోకే*
*గుణవాన్ కశ్చ వీర్యవాన్.*
*ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ*
*సత్యవాక్యో దృఢవ్రతః.*
*చారిత్రేణ చ కోయుక్తః*
*సర్వభూతేషు కో హితః.*

*విద్వాన్ కః కస్సమర్థశ్చ*
*కశ్చైక ప్రియదర్శనః।*
*ఆత్మవాన్ కో జితక్రోధో*
*ద్యుతిమాన్ కోఽనసూయకః॥*
*కస్య బిభ్యతి దేవాశ్చ*
*జాత రోషస్య సంయుగే।*
*ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం*
*పరం కౌతూహలం హి మే।*
*మహర్షే! త్వం సమర్థోసి*
*జ్ఞాతుమేవం విధం నరమ్॥*

ఈ పదహారు లక్షణాలూ ఒక్క చోట వుండడం ఆ కాలం లోనూ అరుదే. అటువంటి అరుదైన వాడు పురుషోత్తముడే. ఆయన కోసం అన్వేషణ. అదే వాల్మీకి తపన. కవిగా అవత రించబోయే తాపసికి ప్రథమ వేదన.

ఈ జిజ్ఞాస మామూలు మానవుని జిజ్ఞాస కాదు.

కాలక్షేపం కోసం సాగించే చర్చకాదు.

ప్రచేతస మహర్షి పుత్రుడైన వాల్మీకి మహర్షి మనసున కలిగిన మథన. అడిగినది కూడా తపస్వి,



వాగ్విదాం వరుడూ అయిన నారదుని. సమస్త మానవజాతికీ ఆదర్శంగా నిలబడదగ్గ మహాత్ముని దర్శించి, దర్శింపజేసే ఋషి దర్శన శక్తి విస్ఫురిస్తున్న సందర్భమిది.

నిజానికి ఇవి ఉత్తమ మానవుని లక్షణాలుగా మాత్రమే కనిపిస్తున్నా - ఈ జిజ్ఞాస 'బ్రహ్మజిజ్ఞాస' గా సాక్షాత్కరించక మానదు.

16 కళలున్న పూర్ణచంద్రునిలా - 16 గుణాలతో పరిపూర్ణ నరచంద్రునిగా అవత రించి శ్రీమహావిష్ణువే 'రామచంద్రుడు'

ఈ గుణాలను దృష్టిలో పెట్టుకొని చూస్తే శ్రీరాముడు అర్థమౌతాడు.

ఈ 16 గుణాలున్న పురుషోత్తముడు శ్రీరాముడేనని నిర్ధరించి చెప్పాడు నారదుడు. అంతేకాక-

***రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా***
***రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చరక్షితా,***
***వేదవేదాంత తత్త్వజ్ఞః...***
***సర్వలోక ప్రియస్సాధుః...***
***సర్వదాభిగతః సద్భిః సముద్ర ఇవసింధుభిః,***
***ఆర్యః సర్వ సమశ్చైవ...***
***విష్ణునా సదృశః వీర్యే...***
***కాలాగ్ని సదృశః క్రోధే...***
***క్షమయా పృథివీ సమః...***
***తమేక గుణసంపన్నం రామం సత్యపరాక్రమం...***

అని నారదుడు మరికొన్ని విశేషణాలు పలికాడు. సర్వసముడు, సర్వరక్షకుడూ, వేద వేదాంత తత్త్వజ్ఞుడు, సర్వలోక ప్రియుడు... మొదలైనవి.

రాముని గురించి చెప్పిన ఏ శబ్దం కూడా సామాన్యం కాదు.

ప్రతి విశేషణం బరువైనదే, దివ్యమైనదీ.

ధర్మమయుడైన వానికి బలమూ, సత్యమూ, దృఢవ్రత నిష్ఠ, విద్వత్తు, సర్వభూతహిత కాంక్ష... వీటితో పాటూ, క్రోధం... గొప్పవే.

'జితక్రోధః' (కోపాన్ని జయించిన వాడు) అంటూనే, 'కోపమొస్తే దేవతలే భయపడేటంతటివాడు' - అని వాల్మీకి ఎందుకన్నాడు? అంటే మనోవికారజనితమైన క్రోధాన్ని జయించాలి. అదే సమయంలో, ధర్మాగ్లాని కలిగించే అధర్మశక్తుల పట్ల ఆగ్రహం చూపించాలి. అటువంటి ఆగ్రహం ప్రదర్శించితే అది కాలాగ్ని సదృశమే. క్షమయా పృథివీ సమః - భూమితో సమానమైన సహన శక్తి గల వానికే, కాలాగ్నితో సమానమైన కోపం శోభిస్తుంది. అది అధర్మాన్ని నశింపజేసే ఆయుధమవుతుంది. అటువంటి వాని కోపాన్ని చూస్తే సముద్రుడు కూడా గడగడ లాడతాడు.

ధర్మజ్ఞత, కృతజ్ఞత, సత్యవాక్పాలన -వంటి శుభలక్షణాలుండడం చేతగాని తనమనో, లేదా 'సౌమ్యం'గా చతికిలబడ డమో కాదు కదా! పరాక్రమం, వీరత్వం కూడా ఆ ధర్మలక్షణాలకు జతకలిశాయి. ఆ పరాక్రమం -''సత్యపరాక్రమం''. ఎంత గొప్పమాట! సత్యంకోసం పరాక్రమం. సత్య మైన పరాక్రమం. అది వృథాపోదు. లక్ష్యాన్ని సాధించితీరుతుంది.

రాజైన వానికి అవసరమైనది ''ఆత్మ నిత్యత్వ జ్ఞానం.'' అది ఉన్నప్పుడు, భోగ లాలసత ఉండదు. దానికోసం అధికార దుర్వినియోగాదులు జరుగవు. కాబట్టి 'ఆత్మవంతుడ'వడం మహాగుణం.

ఇలా ఒక్కొక్కగుణంలో ఎంతో లోతు దాగివుంది.

అది గ్రహించి శ్రీరాముని పరిశీలిస్తే - ఆ పరంధాముని దైవంగా ఉపాసిస్తాం. మన జీవితాన్ని తీర్చిదిద్దే పురుషోత్తమునిగా అనుసరిస్తాం. ✦

## మహాభారత ప్రశ్నోక్తి - 5

నిర్వహణ :

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

21. ఘోష యాత్రకు వెళ్లడంలో దుర్యోధనుని అభిప్రాయం ఏమిటి?
22. ధర్మవ్యాధుడెవరు? అతడెవ రికి ధర్మబోధ చేశాడు?
23. ధర్మరాజు చేతులు తగలబెడ తానన్నాడు తమ్ముడొకడు. ఎవరతడు? ఎప్పుడు?
24. ప్రాతికామి ఎవరు? ఏమి చేశాడు?
25. అగ్నిని సర్వభక్షకుడవు కమ్మని శపించినదెవరు?
26. దుష్యంతుని కొడుకు భరతుని మొదటి పేరేమి?
27. విరాటుని కొలువులో చేరే ముందు పాండవులకు సేవా ధర్మాలు చెప్పినదెవరు?
28. ధృతరాష్ట్రుని కొడుకు ఒకడు యుద్ధం తరువాత బ్రతికి ఉన్నాడు? అతడెవరు?
29. జరాసంధుడనే పేరు అతనికి ఎలా వచ్చింది?
30. సభలో వికర్ణుని వారించిన దెవరు?
31. అర్జునునకు పార్థుడనే పేరు ఎందుకు వచ్చింది?
32. గాలి కంటే వేగం కలది ఏది?

(జవాబులు 42వ పేజీలో చూడండి)

# అన్నమయ్య పదాలలో శాస్త్ర రహస్యాలు

డా॥ ముదివేడు ప్రభాకరరావు

*(గత సంచిక తరువాయి)*

మాలదాసరి, బ్రహ్మరాక్షసిని సైతం ఉద్ధరించినట్లు, అన్నమయ్య ఆత్మ విమర్శ (Self-introspection)తో బాటు, బ్రహ్మ రాక్షసి వంటి సంఘంలో మానవుని దుర్భర జీవితాన్ని కూడ 'విమర్శించడం' (Criticism of Society) చూస్తే, ఆయన సంఘాన్ని సంస్కరించాలని పాటుపడిన ''సామాజిక కవి వాగ్గేయకారుని'' గా మనకు ప్రత్యక్షమౌతాడు!

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాయికా నాయక శృంగారాన్ని అలంకారశాస్త్ర సమ్మతంగానే నిరూపిస్తూ, జీవేశ్వరుల శృంగారాన్ని 'మధుర భక్తి'గా వ్యాఖ్యానిస్తాడు. అధ్యాత్మ సంకీర్తనల్లో జీవేశ్వరుల అనాది సంబంధాన్ని భగవంతునికి జ్ఞాపకం చేస్తూ, 'అంతర్యామి'గా అందరిలో వున్న నీవే, అర్చామూర్తిగా వెలసిన ఆ వేంకటేశ్వరస్వామివని రూఢిగా పలుకుతాడు.

తనయొక్క రచనాసూత్రాన్ని, కవితా రహస్యాన్ని అన్నమయ్య స్పష్టంగా చెప్పనే చెప్పాడు. అంతర్యామి యొక్క అవ్యక్తతత్త్వాన్ని అనుభూతి దశలోనికి తెచ్చుకొని అనితర సాధ్యంగా అభివ్యక్తీకరించిన ఈ పాట చదవండి-

**పరమాత్ముడు సర్వపరిపూర్ణుడు**
**సురలకు నరులకు చోటయి యున్నాడు॥**
**పల్లవి ॥**

**కన్నులగంటానే, కడు మాటలాడు తానే**
**తన్నుగాని వానివలె దాగి వున్నాడు**
**అన్నియు వింటానే అట్టే వాసన గొంటానే**
**వన్నెల నూనె కుంచమువలె నున్నాడు**
**॥ పర ॥**

**తనువులు మోచియు, తలపులు దెలిసియు**
**యెనసియు నెనయక యిట్లున్నాడు**
**చెనసి మాయకు మాయై, జీవునికి జీవమై**
**మొనసి పూసలదారమువలె నున్నాడు**
**॥ పర ॥**

**వేవేలు విధములై విశ్వమెల్లా నొకటై**
**పూవుల వాసనవలె (బొంచియున్నాడు**
**భావించ నిరాకారమై, పట్టితే సాకారమై**
**శ్రీ వేంకటాద్రి మీద శ్రీపతై యున్నాడు**
**॥ పర ॥**

-(అధ్యాత్మ II - 232)

'పల్లవి' లోని 'పరమాత్ముడు సర్వపరిపూర్ణుడు' అనేపాదం

**యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా।**
**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః॥**

అనే శ్లోక భావాన్ని ప్రతిపాదిస్తూవుంది. ''మనకు ఈ సర్వజగత్తులో ఏది కనబడుతున్నదో, ఏది వినబడుతున్నదో వాటి లోపలా, బయటా కూడ వ్యాపించి వున్నవాడు ఆ నారాయణుడే!''

'సురలకు, నరులకు చోటయివున్నాడు' అనడంచేత, దేవతలకు అతడే దిక్కు, దిక్కు లేనివారికి అతడే దిక్కు- అంటూ మానవులే కాదు, దేవతలుసైతం ఉపాసించేదైవం ఆ పర మాత్ముడని సందేహనివృత్తి చేశాడు.

ఒక కొలపాత్రలోని నూనె ఆకాశాది ప్రతిఫలనం చేత రంగులీనుతూ, ఆ పాత్రయందంతట వ్యాపించేటట్లు భగవంతుడు తటస్థంగానే ఉంటూ, సర్వాంతర్యామిగా, సర్వవ్యాపకుడుగా లోపల, వెలుపల ఎలా నిండి వున్నాడో తెలిపాడు.

దేవుడు - మాయకుమాయగా, జీవునికి జీవమై ఉన్నాడట! తానే మాయ, తానే జీవుడు. అంటే, జీవుని ఆదరించిన మోహపు పొరయైన మాయగాను, 'జగత్తును పరివేష్ఠించిన వైష్ణవ మాయగాను తానున్నాడు. ఈ చరణం చివరి పాదం చాల ముఖ్యమైంది. ''పూసల దారము వలె'' నున్నాడు- అనే మాట భగవద్గీతలోని శ్లోకాన్ని స్ఫురింపజేస్తున్నది.

**మత్తఃపరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణిగణా ఇవ॥**

- విజ్ఞానయోగం (7-7)

ఓ ధనంజయా! నాకంటే ఉత్కృష్టమైనది వేఱొకటి లేదు. పూసలు దారంలో గుచ్చబడినట్లు ఈ భూతజాలమంతా నాయందు గుచ్చ బడివుంది. పూసలు నిలవడానికి అందులో కాన రాకుండా ఉండే సూత్రం ఆధారమైనట్లు, వ్యక్తమైన ఈ ప్రాణికోటిలో అవ్యక్తంగా నేను వ్యాపించి యున్నాను.''

తన అంతర్యామితత్త్వాన్ని గురించి గీతలో భగవంతుడే చెప్పిన మాటయిది. దీనినే, అన్నమయ్య పై కీర్తనలో స్థాపించి, తనదైన ప్రతి భను చిట్టచివరి చరణంలో ఇలా ప్రదర్శించాడు.

**''భావించనిరాకారమై పట్టితే సాకారమై**
**శ్రీ వేంకటాద్రిమీద శ్రీపతై ఉన్నాడు''**

అనే చివరి పాదాలలో అన్నమయ్య ఆధ్యాత్మిక జిజ్ఞాసకు శాశ్వత పరిష్కారం లభించింది.

1) భగవత్తత్త్వం అనుభూతిదశలో 'నిరాకారము'
అభివ్యక్తిదశలో 'సాకారము'

2) ఉపాసన లేక భక్తి రెండు విధాలు

1. నిర్గుణోపాసన
2. సగుణోపాసన
ఉపాసనాపరంగా పరిశీలిస్తే -
నిరాకారము- 'నిర్గుణోపాసన' కు
సాకారము - 'సగుణోపాసన'కు చెంది నవి.

అద్వైతం నిర్గుణం, నిరాకారం అవ్యక్త మైన తత్త్వానికి ప్రాధాన్యమీయగా విశిష్టాద్వైతం సగుణం, సాకారం వ్యక్తమైన తత్త్వానికి ప్రాధాన్య మిచ్చింది.

ఇప్పుడు వైష్ణవ మతపరంగా దీనికి సమన్వయం చెబితే-

భగవంతుడు అనుభూతిదశలో 'అంతర్యామి' - నిరాకారుడు, నిర్గుణుడు, అవ్యక్తుడు

అభివ్యక్తిదశలో 'అర్చామూర్తి' - సాకారుడు, సగుణుడు, వ్యక్తుడు

ఈవిధంగా, అద్వైతం చెప్పిన నిర్గుణత్వాన్ని 'విశిష్టాద్వైతం' తనలో యిముడ్చుకొంది. ఈ విధంగా అభివ్యక్తీకరింపబడిన ''పరమాత్మ శ్రీ వేంకటాద్రిమీద శ్రీపతై ఉన్నాడు'' అని అన్నమయ్య స్పష్టీకరించాడు.

ఈ బాహ్యాభ్యంతర సమన్వయ సూత్రాన్ని పట్టుకొన్న అన్నమయ్య హేలగా, అవలీలగా వేలకొలది సంకీర్తనలు సంతరించినాడంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

దీనివెంటనే ఉన్న సంకీర్తన ఇలావుంది.

**ఇట్లానే యోగలక్ష్య మెఱిఁగికొంటే ఫలించు**
**యెట్లయినా గురువాక్య మేమఱకుడీ!**

- అధ్యాత్మ ( II - 234)

ఇక్కడ 'యోగలక్ష్య' మంటే జ్ఞానయోగంచేతగానీ, భక్తి యోగంచేత గానీ, లేదా కర్మయోగంచేతగానీ సాధింపబడే 'ముక్తి' అనే లక్ష్యం. దీనికి 'గురువాక్యము'-'మార్గదర్శి'.

గురువాక్యమంటే - గీతగురువైన శ్రీ కృష్ణభగవానుని వాక్యమని అర్థం. ఇక్కడ 'గురు' శబ్దానికి రెండర్థాలు.

1. శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆచార్య రూపమైన అవతరణం భగవంతునికి ఆరవ స్థితి. ఆయన గీతాచార్యుడుగా అవతరించాడు. 'గీతా గురువు'నే అన్నమయ్య 'గురువాక్య' మని చెప్పాడు.

2. లఘువు కానిది గురువు. అంటే మహత్తరమైన అర్థసంపదగల జ్ఞాన వాక్యం. ఆ వాక్యమేమిటి?

**''ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి''**

''సర్వేశ్వరుడనైన నేను సకలజీవుల హృదయాలలో నివసిస్తున్నాను''. అని గీతా గురువు చెప్పిన వాక్యాన్ని ఎప్పుడూ మరువకండి! అని హెచ్చరిస్తున్నాడు అన్నమయ్య. ఇది అంతర్యామి లక్షణం.

పై పాట చివరి చరణంలో అన్నమయ్య దానినెలా సమన్వయిస్తున్నాడో చూడండి.

**''చిక్కి శ్రీ వేంకటేశుడు జీవుల కంతర్యామి**
**ఇక్కు వెతిగితే నీడకిదే సూత్రము!''**

''జీవుల కంతర్యామి శ్రీ వేంకటేశుడు'' అనే సిద్ధాంతవాక్యాన్ని చాటి చెప్పడమే కాదు. ''ఇక్కు వెతిగితే నీడ కిదే సూత్రము'' అంటున్నాడు.

'ఇక్కువ' అంటే ఉనికి, కళాస్థానం, జాడ అనే అర్థాలున్నాయి. అధ్యాత్మపరంగా 'ఉనికి' 'కీలకం' 'కిటుకు' 'జాడ' అనే అర్థాలు చెబితే, శృంగారపరంగా - కళాస్థానం, మర్మం అనే అర్థాలు చెప్పాలి.

అన్నమయ్య పద ప్రయోగాలన్నీ ఇలాగే వుంటాయి. అవి శృంగార ముఖంగా వెలువడినా, అధ్యాత్మ ముఖంగా వెలువడినా రెండు క్షేత్రాలకు తగిలి వచ్చేట్లుగా ఉంటాయి. ఈ సంకీర్తన యొక్క పూర్వచరణాలను పరిశీలిస్తే పై చివరిపాదం యొక్క పరమార్థం మనకు స్పష్టమౌతుంది.

**కాంతఁదలఁచుకొంటేనే కామోద్రేకము పుట్టు**
**యింతలో గూడెనా? యేడకేడ సూత్రము!**
**చింతకాయ తొక్కు చూచితేనే నోరూరు**
**యెంతకెంతదవ్వు? యేడ కేడ సూత్రము!**

మానవుడు ప్రాపంచిక విషయాలలో నిమగ్నుడై, కాంతాజన సంయోగం లోనే కాలం గడిపేస్తుంటే, ఏకాంతంగా మననం చేయవలసిన అధ్యాత్మ చింతనతో కూడిన గురు వాక్యము - యోగలక్ష్యము- ఎక్కడ వాడికి జ్ఞాపకం ఉంటాయి? అందుకే, అధోగతికి పోతున్న మానవుల్ని అన్నమయ్య ''ఏమాఱకుడీ!'' అని హెచ్చరిస్తున్నాడు.

పై ఉపమానాల అంతరార్థమేమంటే- మానవుడు జీవసహజమైన లక్షణాల నుండే ఇంకా బయటపడలేకపోతున్నాడుకదా! దీనికి సమాధానమేమి? అని మౌలికమైన ప్రశ్న వేస్తున్నాడు అన్నమయ్య.

'కామోద్రేకం' కల్గించేవి 'కళా స్థానా' లని కామశాస్త్రం చెబుతోంది. ఇందుకే, 'ఇక్కువ' అనేమాట పాట చివరలో ప్రయోగించాడు అన్నమయ్య.

**1. కామోద్రేకానికి 'కళాస్థాన' మెంత కీలకమో**
**2. 'యోగసిద్ధి'కి 'లక్ష్యము' 'గుతి'అంతే కీలకం.**

ఈ రెండర్థాలకు స్థానమైంది 'ఇక్కువ' అనే పదం. అన్నమయ్య పదప్రయోగం ఇంత సునిశితంగా, సార్థకంగా, అన్వర్థంగా ఉంటుంది.

చింతకాయపచ్చడి చూస్తూనే లాలాజలాన్ని అణచుకోలేనివాడు, ఇంద్రియ నిగ్రహంతో కూడిన యోగాన్ని ఎలా అనుష్ఠించ గలడు? యోగ సిద్ధిని ఎలా సాధించగలడు? కాబట్టి, ఇంద్రియాలకు దాసులైన మానవులు, భగవద్దాసులుగా కూడా ఉండాలని మన స్ఫూర్తిగా కోరుకొంటే - యోగ గురువైన శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన అంతర్యామి సూత్రాన్ని మరచిపోకుండా జ్ఞాపకం పెట్టుకోవాలి. ఆ సూత్రమిది-

**''మయిసర్వమిదం ప్రోతం సూత్రేమణి గణా ఇవ''**
**''ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి''**

''పూసలు దారంలో గుచ్చబడి నట్లు ఈ భూతజాలమంతానాయందు గుచ్చబడి వుంది. అలా వ్యక్తమైన ప్రాణికోట్లలో అవ్యక్తంగా నేను వ్యాపించివున్నాను. సర్వజీవుల హృదయాలలో సర్వేశ్వరుడైన నేను నివసిస్తున్నాను''

''ఈ 'అంతర్యామి'నే అన్నమయ్య 'అర్చ'గా ప్రాదుర్భవించిన 'శ్రీ వేంకటేశ్వరుడ'ని నిష్కర్షించినాడు.

ఈ లోపల వెలుపలగానున్న ఏకైక సత్యాన్ని విస్మరించక నిరంతరం గుర్తుంచుకొని భయభక్తులతో ప్రవర్తిస్తే చాలు! ఉపచారాలు చేయకపోయినా, ఈ అభిజ్ఞ చేత అపచారాలు చేయకుండా, సంసార చేతనులైన జీవులు తరిస్తారని అన్నమయ్య మనకందించిన మహత్తర సందేశం! ✸

# పిలుపులు

'**చా**రు' కొడుక్కి నామకరణం, తప్పకుండా రావలసిందిగా ఆహ్వానిస్తూ ఉత్తరం రాశారు పిన్ని, బాబాయ్. మా 'చారు' అసలు పేరు 'చారులత' అయినా 'చారు' అనే ముద్దు పేరుతో పిలవబడుతోంది.

మా అమ్మమ్మ పేర్లని ఇలా సగం చేసి పిలిస్తే కోప్పడేది. పిల్లలకి దేవుడి పేర్లే పెట్టాలని, ఆ పేర్లు నోరారా పిలవడం వల్ల భగవంతుని స్మరించినట్లు ఉంటుందని, ఇదే పేర్లు పెట్టడం, పిలవడంలోని ఆంతర్యం అని చెబుతూ ఉం డేది. పెద్ద మావయ్యని నాయనా సత్యనారాయణ అని. చిన్న మామయ్యని నాయనా నరసింహమూర్తి అని చక్కగా పిలిచేది.

ఆరోజుల్లో నరసింహం, ఆంజనేయులు, సత్యనారాయణ, సుభద్ర, సుబ్బలక్ష్మి కనకమహాలక్ష్మి లాంటి ఎన్నో పేర్లు పిల్లలకి పెట్టేవారు. ఎటొచ్చీ ముద్దుగా పిలిచేటప్పుడు ఆపేర్లు కాస్తా మారిపోయేవి. నరసింహాన్ని నర్సిగాడని, ఆంజనేయులు అంజిగాడని, సత్యనారాయణని సత్తిగాడని, సుభద్రని సుబ్బి అని, సుబ్బలక్ష్మిని సుబ్బులు అని గోముగా పిలిచేవారు.

ఇవన్నీ నామకరణం తర్వాతి ముద్దు పేర్లయితే, పిల్లలు పుట్టినప్పట్నుంటే బుజ్జిగాడు, బుజ్జి, చిన్న, చిట్టి, అమ్మలు, బుజ్జాయి లాంటి రకరకాల ముద్దుపేర్లతో పిలవబడేవాళ్ళు. కొంతమందికి అసలు పేరు ఏదయినా, వ్యవహారనామం మాత్రం బుజ్జిగాడనో, చిట్టి గాడనో ఉండిపోయేది. మా పెదనాన్న కొడుకు ఇప్పటికీ నాకు బుజ్జన్నయ్యే. ఈ పిలుపులు ఎంతటి ప్రభావాన్ని చూపించేవంటే ఈ ముద్దు పేర్ల వాళ్ళ అసలుపేరు ఏమిటో కూడా తెలియకుండా ఉండిపోయేది. ఇదే ఆ పిలుపుల్లో ఉండే గమ్మత్తు.

కాలక్రమేణ మారుతున్న కాలం, మారుతున్న నాగరికత పేర్ల మీద కూడా తమ ప్రభావాన్ని చూపాయి. ఒక్కదేవుడి పేర్లే కాక, వారివారి అభిరుచికి తగినట్లుగా పేర్లు పెట్టసాగారు. ఇప్పుడు ఈ ఆధునిక యుగంలో కూడా చాలా శ్రద్ధ తీసుకొని, ఓపిగ్గా పేర్ల పుస్తకాలు కాస్తా తిరగేసి, క్రొత్తక్రొత్త పేర్లు పెడుతున్నారు.

కాలం ఎంతగా మారినా, కాలంతో పాటు పేర్లు మారినా మన తెలుగు వాళ్ళ ముద్దుపేర్లు మాత్రం ఇప్పటికీ మారలేదు. పేరు పెట్టేవరకు చంటిపిల్లలంతా బుజ్జాయిలు, బుజ్జిగాళ్ళే. మరి మా చారులత తన కొడుక్కి ఏం పేరు పెడుతుందో చూడాలి.

నామకరణానికి ఒక రోజు ముందుగా బయల్దేరాను. బస్‌లో కూర్చుని, కళ్ళు మూసుకొని, పాత జ్ఞాపకాలు ఏవో నెమరు వేసుకొంటున్నాను. ''అక్కా'' కొంచెం జరుక్కో ''అక్కా'' అన్న పిలుపు వినిపించి ఉలిక్కిపడి, కళ్ళు విప్పిచూశాను. ఓ పల్లెటూరి పడుచు. సర్దుకొని చోటిచ్చాను. కృతజ్ఞతా పూర్వకంగా నావంక చూచి కూర్చుంది.

''ఏ ఊరుపోవాలక్కా'' అనడిగింది. చెప్పాను. ''మీదే ఊరక్కా'' మళ్లీ ప్రశ్నించింది. ప్రతి మాటకీ అక్క, అక్క అంటూ పిలుస్తూ ఉంటే ముచ్చటగా అనిపించింది. ఆ పిలుపులో ఏదో తెలియని ఆత్మీయత, అనుభూతి. ఒక్క పిలుపులో కోటి అర్థాలు స్ఫురించే ఇలాటి మన పిలుపులకు నోచుకొని ఎన్నేళ్ళయిందో! ఎక్కడ చూచినా మమ్మీ, డాడీ, అంకుల్, ఆంటీ అంటూ పిలుపుల్లో కూడా పాశ్చాత్య వ్యామోహం.

అత్త ఎవరో, పిన్నిఎవరో, మామయ్య ఎవరో, చిన్నాన్న ఎవరో తెలియని వింతైన పిలుపులు. ఆ పిలుపులకే ఇప్పుడు మక్కువ, విలువ.

మనసంప్రదాయంలో అమ్మ, నాన్న, అక్క, చెల్లి, అన్న, తమ్ముడు, తమ్ముడు లాంటి ఎన్నో పిలుపులు చుట్టరికాన్ని తెలపడమే కాక, ప్రతి పిలుపు మనసులో దాగి ఉన్న మమతల్ని తట్టిలేపుతూ, ఆత్మీయతల్ని కూడా గుర్తుకు తెస్తాయి.

'అమ్మ' అని తలచుకొంటే చాలు అమృతమూర్తిగా, కరుణామూర్తిగా కళ్ళ ముందు సాక్షాత్కరించినట్లనిపిస్తుంది. ప్రతిస్త్రీ అమ్మ అనే పిలుపుకోసం తపించిపోతుంది. ఆ పిలుపులో అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతుందా తల్లి. మనవలు, మనవరాళ్ళు తాత, అవ్వ అనిపిలిస్తే మురిసిపోని పెద్దలుంటారా? అదే పిలుపుల్లో ఉండే మహత్తరశక్తి.

పసి పిల్లలు ఈ పిలుపులతోనే భాషను నేర్చుకొంటారు. పాపాయి మొట్టమొదట అత్త అని పలికితే ఐశ్వర్యం అని చెబుతారు పెద్దలు. తతత అని చెప్పిస్తూ ''అత్త'' అని పలికేలా చూస్తారు. మెల్లగా అమ్మ, నాన్న, అక్క అంటూ నేర్పిస్తూ బంధుత్వాలకి పరిచయం చేస్తారు. వచ్చీరాని ముద్దుమాటలతో పిల్లలు పిలుస్తూ ఉండే ఎన్ని సార్లు విన్నా తనివి తీరదు. పాపాయి నోట తేనెలొలికే తియ్యటి పిలుపులు పలికింప జేస్తూ చిన్నపిల్లలు సైతం చేతులుపడుతూ సంబరపడుతూ ఉంటారు.

ఈ పిలుపులు కేవలం రక్తసంబంధాలకే పరిమితం కాలేదు. ఆ రోజుల్లో ఇరుగు పొరుగువాళ్ళు జాతిమత భేదం కేకుండా వయో భేదాన్ని బట్టి ఒకరినొకరు అన్నయ్యగారు, అక్కయ్యగారు, వదినగారు, బామ్మగారు, తాతయ్యగారు అంటూ వరుసలు కలిపి, అభిమానంతో పలకరించుకొనేవాళ్ళు.

ఈ రోజుల్లో పదహారేళ్ళ పడుచుపిల్ల అరవైఏళ్ళ వృద్ధురాలిని 'ఆంటీ' అంటుంది,

ముప్పయ్యేళ్ళ యువతిని 'ఆంటీ' అంటుంది. ఇంతకీ 'ఆంటీ' అన్న పిలుపుకి అర్థం ఏమిటా అని అప్పుడప్పుడు ఆలోచిస్తూ ఉండిపోవడం కూడా కద్దు.

ప్రతి పిలుపు మనిషికీ, మనిషికీ మధ్య అనుబంధపు వారధి. చక్కటి మన భాషని వదలి, మనదికాని భాషపై మోజెందుకో?

అంతులేని ఆలోచనలకి అంత రాయం కలిగిస్తూ బస్ ఆగింది. ఊరు వచ్చి నట్లుంది. అదుగో బాబాయ్ ఇటువైపే వస్తున్నారు. ఇంట్లో అడుగుపెడుతూనే పిన్ని, తమ్ముళ్ళు, చెల్లాయిలు ఆప్యాయంతో చుట్టుముట్టారు. గదిలోనుంచే చారులత ''హాయ్ ఎలా ఉన్నావ్'' అంది ఆనందపడిపోతూ.

స్నానంచేసి, బాబుని చూడాలని గదిలో అడుగుపెట్టాను. చారులత బాముని ఎత్తుకొని, ''నిన్ను చూడ్డానికి ఎవరొచ్చారో చూడు బుజ్జీ ఆంటీ వచ్చింది'' అంటూ నవ్వుతూ పసివాణ్ణి నాచేతి కందించింది.

నీ ఇంగ్లీషు బంగారంగాను, ఇదేం చోద్యమే? నోరారా పెద్దమ్మ అని చెప్పకుండా అన్నింటికీ ఆ ఆంటీ ఏమిటే? ఏం కాలమో ఏ మనుషులో అంటూ పిన్ని కోప్పడింది. బాబెలా ఉన్నాడక్కా? నా పోలికా, వాళ్ళ డాడీ పోలికా?'' అడిగింది చారు. ''అచ్చు నీ పోలికే గాని ముందు వీడికేం పేరు పెట్టదలచుకొన్నారో చెప్పు'' అన్నాను.

''అంత త్వరగా చెప్పేస్తే ఎలా? రేపటి దాకా ఓపిక పట్టాలి మరి. మరీ ఓ క్లూ ఇస్తాను మన తెలుగు వాళ్ళ పేరు మాత్రం కాదు'' అంది బాబుని ముద్దాడుతూ.

''ఏమిటోనమ్మా అల్లుడుగారు అమెరికా వెళ్ళే విషయం నీకు తెలుసుగా! ఆదేశానికి తగినట్లు, ఆదేశంలో వాళ్ళు సులభంగా పలకగలిగేలా, పేరుపెడతారట. లక్షణంగా మనపేర్లు మనం పెట్టుకోవడానికి ఆ ఇంగ్లీషువాళ్ల మాటెందుకో అర్థం కావటం లేదు. వీళ్ళ ధోరణి నాకేమాత్రం నచ్చటంలేదు చూడు'' అంటూ బాధతో గొణిగింది పిన్ని.

ఒక్కసారి బాబు వంక చూశాను. ఇదేదీ నాకు తెలియదన్నట్లు నా ఒడిలో వెచ్చగా పడుకొని, హాయిగా నిద్రపోతున్నాడు ''చిట్టి తండ్రీ తెలుమాట నువ్వు స్పష్టంగా పలకాలి. తెలుగు పిలుపులోని మాధుర్యం నీనోట వినాలి. తెలుగుపాట నువ్వు సుస్వరంతో పాడాలి రా నాన్న'' ఇవన్నీ నీకు నేర్పాల్సిన తెలుగునాట పాశ్చాత్యుల మాట, పాట. ఏ దేశానికి వెళ్ళినా, మనల్ని మన సంస్కృతి, సంప్రదాయాల్ని మనం గౌరవించుకొంటేనే, ఆదేశంలో మనకి గౌరవం.

తెలుగుదేశం నాది, తెలుగుజాతి నాదన్న భావన ప్రతి మమ్మీ, డాడీ హృదయాల్లో అంతర్గతంగా భద్రంగా దాగి ఉంది. ఇది నిజం. ఇప్పుడు కాకపోయినా, తెలుగు వాణ్ణి నేనని గర్వంగా ఎలుగెత్తి చాటేరోజు తప్పక వస్తుంది. మనసు పడుతున్న ఆరాటాన్ని ఆశీస్సుగా అందిస్తూ చిట్టితండ్రి తలని ఆప్యాయంతో నిమిరాను. ✦

# మన పద్యం



**శ్రీ రఘురామ! చారుతులసీదళదామ! శమక్షమాది శృం**
**గార గుణాభిరామ! త్రిజగన్నుత శౌర్యరమాలలామ! దు**
**ర్వారకబంధ రాక్షస విరామ! జగజ్జన కల్మషార్ణవో**
**త్తారకనామ! బ్రోవగదె దాశరథీ! కరుణాపయోనిధీ!**

ఇది కంచర్ల గోపన్న (రామదాసు) రచించిన దాశరథీ శతకంలోని పద్యం. మహారామభక్తుడైన ఈయన రచించిన కీర్తనలు ప్రసిద్ధాలు. ఉత్పలమాల, చంపకమాల వృత్తాలతో రచించిన శతకమిది. శ్రీరాముని నామ, గుణ, రూప వైభవాలను భక్తిభావస్ఫోరకంగా రచించిన ఈ శతకంలోని పద్యాలు ఒకనాటి తెలుగునాట ప్రతినోట పలికేవి.

శతక ప్రారంభంగా - మంచి శబ్దాలంకారంతో రాముని స్తుతించిన ఈ పద్యంలో తనను బ్రోవమని చెప్తూ, రాముని ప్రశస్తిని సంబోధనల రూపంలో తెలియజేశాడు.

లక్ష్మీ సహిత రఘురామా! అందమైన తులసీదళ మాల ధరించిన స్వామీ! ఇంద్రియ నిగ్రహాది అందమైన గుణాలతో ప్రకాశించువాడా! ముల్లోకాలలోనూ కీర్తింపబడే శౌర్యలక్ష్మీ సహితుడైన వాడా! అజేయులైన కబంధాది రాక్షసులను నాశనం చేసినవాడా! జగజ్జనులను కల్మష సముద్రం నుండి తరింపజేసే నామంగలవాడా! దశరథతనయా! కరుణా సముద్రా! నన్ను బ్రోవుమా.''

ఋషిపీఠం

# ఆచారం - శాస్త్రీయం

## స్వామీజీ-చార్వాకరావు

విశ్వనాథ పావనిశాస్త్రి

మహాలక్ష్మీ ఫౌండేషన్ వారు ప్రతి సంవత్సరం ''విశిష్ట వ్యక్తి పురస్కారం'' బహుమతి ప్రదానం చేస్తారు. అందులో వివిధ రంగాల్లో కృషి చేసిన యిద్దరు ప్రముఖ వ్యక్తులకి సన్మానం చేస్తారు. వాళ్ళు ఏ కులస్థులైనా, ఏ మతస్థు లైనా, ఏ దేశస్థులైనా కావచ్చు. ఆ ఫౌండేషన్ సలహా సంఘ ప్రధాన సభ్యులలో రాబర్ట్ ఒకడు.

అతడి సలహా మేరకు ఈ ఏడాది సన్మానించే యిద్దరిలో ఒకరు భారతీయుడు. మరొకరు అమెరికన్. భారతీయ పండితుని పేరు హరీశశాస్త్రి. అమెరికన్ పండితుని పేరు హారిస్ సార్త్రే (Harris Sartre).

హరీశశాస్త్రిగారు వేదాంగవైన ... మహా పండితుడు.

హారిస్ సార్త్రే మైక్రో బయోలజీలో ప్రొఫెసర్.

ఆ పురస్కార బహుమతి ప్రదానం స్వామి సత్యానాథానందగారి చేతుల మీదుగా జరగు తుంది. సాయంత్రం సభ. మధ్యాహ్నం స్వామి వారి ఆశ్రమంలో అందరికీ భోజన సదుపాయాలు జరుగుతాయి.

శాస్త్రిగారికీ, సార్త్రేగారికీ విడివిడిగా విడిది ఏర్పాట్లు జరిగాయి. శాస్త్రిగారు భార్యతో సహా వచ్చారు. సార్త్రేగారు భార్యని తీసుకుని రాలేదు. ఆయన అసలు ఈ బహుమతి కోసం రాలేదు. వేరే పనిమీద వచ్చాడు. ఆయన వచ్చాడు గదా అని రాబర్ట్ ఈ అవకాశాన్ని ఉపయోగించుకోమని సలహా యిస్తే, ఫౌండేషన్ వారు, సార్త్రే గారిని బహుమతి స్వీకరించమని కోరారు. ఆయన ఒప్పుకున్నాడు. ఆయన ఒప్పుకోవడానికి మొదటి కారణం రాబర్ట్. రాబర్ట్ ఆయన శిష్యుడు. రెండవది స్వామివారి యందు సార్త్రేగారికి ఎంతో అభిమానం.

భోజనాల సమయానికి చార్వాకరావు మహా దూకుడుగా వచ్చాడు, ''అందుకే ఈ వేద పండితులంటే నాకు చిరాకు'' అంటూ. స్వామి వారు చదువుతున్న గ్రంథం అరలో పెడుతూ, ''ఏం జరిగింది?'' అని అడిగారు నవ్వుతూ.

''ఏం జరిగిందేమిటి స్వామీ! హరీశ శాస్త్రి గారు మాతో పాటు భోజనం చెయ్యడట! స్వహస్త పాకంట. భార్య వండితేనే తింటాడట! అది కూడా విడిగా ఆయనకిచ్చిన విడిదిలోనే తింటాడట!'' అన్నాడు.

''తిననీ! నీకేం నష్టం?'' అని అడిగారు స్వామివారు.

''అందరం కలసి భోజనం చేస్తున్నప్పుడు విడిగా వండుకుని తింటాననడం, మిగిలిన అందరినీ అవమానించడం కాదా?'' అన్నాడు చార్వాకరావు.

''మీ అందరితో కలిసి భోజనం చేస్తానని ఆయనేమైనా ఒప్పందం మీద సంతకం చేశాడా?'' అని అడిగారు స్వామి.

''లేదనుకోండి'' అన్నాడు చార్వాకరావు.

''మరింకేం? యిందులో మిమ్మల్ని అవమానించిందేముంది? అదీ కాక భోజనం అనేది పూర్తిగా ఎవడికి వాడికి వ్యక్తిగత విషయం. అందులో ఎవడి నిబంధనలు వాడికి ఉంటాయి. ఒకడు పదిమందితో కలిసి తినడానికి యిష్టపడతాడు. ఒకడు నలుగురిలో తినడానికి మొహమాటపడతాడు. ఒకడికి నువ్వు వండే పదార్థం, ఆ తీరూ నచ్చదు. మరొకడికి నువ్వు వడ్డించే తీరు నచ్చదు. ఒకడికి మాంసాహారం యిష్టం. ఒకడికి శాఖాహారం యిష్టం. ఆ శాఖాహారుల్లోనే ఒకడికి కాకరకాయ రుచించదు, మరొకడికి వంకాయ సహించదు. పక్క వాడు తినే తీరు చూస్తే, మరొకడికి ముద్ద దిగదు. ఒకడు మెల్లిగా తింటాడు, ఒకడు వేగంగా తింటాడు. మెల్లిగా తినేవాడికి, వేగంగా తినేవాడి వల్ల యిబ్బంది. వాడు తినేసి, లేచి వెళ్ళిపోతే, వీడు తింటూ కూర్చోవడానికి సిగ్గు పడతాడు. పోనీ వాడు కూర్చుంటే, వాణ్ణి అలా కూర్చోబెట్టి వీడు తింటూ ఉంటానికి యిబ్బంది పడతాడు. అంతేకాదు, వేగంగా తినేవాడికి కూడా ఆ స్థితి యిబ్బందే! తన భోజనం అయిపోయి, చెయ్యి ఎండిపోతూ, వీడు ఎక్కువసేపు కూచోలేడు. లేచి వెళ్ళిపోతే, అసహ్యంగా ఉంటుంది. అందుకనే ''వడ్డన కలవాలి'' అని కొందరు సాంప్రదాయజ్ఞులు సామూహిక భోజనాలలో అంటూ ఉంటారు. ఈ బాధలు పడలేక కొందరు నైష్ఠికులు ''స్వహస్తం'' అని యితరులకు యిబ్బంది

లేకుండా, తమ బాధ ఏదో తాము పడుతున్నారు. అదీకాక ఆ ''స్వహస్తం''లో ఇంకా చాలా శాస్త్రీయమైన కారణాలున్నాయి. గాంధీ గారి ఆత్మకథ చదువు. తెలుస్తుంది. ఒకసారి గాంధీ గారికి – జైల్లో ఉండగా – తాను తన తల్లిని హత్య చేసినట్లు కల వచ్చిందట. 'అంత ఘోరమైన కల ఎందుకు వచ్చిందా' అని ఆయన ఆరా తీశాడట. ఆ రోజున జైల్లో వంట చేసినవాడు, తల్లిని చంపిన నేరం మీద జైలు కొచ్చిన వాడట! మహాత్ముడు కాబట్టి, ఆ ప్రభావం ఆయన మీద వెంటనే పనిచేసింది. కాబట్టి, వంటవాడి మనస్తత్త్వం ప్రభావం వంట మీద పడుతుందన్న మాట. ఇలా చెపితే, ఇంకా తట్టెడు కారణాలు చూపించవచ్చు. ఆ కారణాలు కొన్ని ఉపాసనాపరమైనవి. నీకు అర్థం కావు. కాబట్టి ఎవ్వరైనా, ఎప్పుడైనా విడిగా భోజనం చేస్తానన్నా, వండుకుంటానన్నా వాడి నిష్ఠకు సంతోషించు. అటువంటి వాడిని బల వంతం చేసినా, ఎద్దేవా చేసినా – నిజానికి నువ్వు వాడిని అవమానించినట్లవుతుంది'' అన్నారు స్వామివారు.

చార్వాకరావుకి చిరాకు తగ్గలేదు. ''మీరేదో సమర్థిస్తారు గాని మేం యిచ్చిన నీళ్లు కూడా పనికిరావా స్వామీ!'' అన్నాడు.

''ఎందుకు పనికిరావు? పనికొస్తాయి. కాని ఒక్కటి ఆలోచించు. నువ్వు ఎక్కడ పడితే అక్కడ తిరిగి, ఆ చేతులతోనే, ఆ బట్టలతోనే నీళ్ళు యిస్తావు. నీళ్ళు యిచ్చే ప్రతిసారీ చేతులు శుభ్రంగా కడుక్కుని యివ్వగలవా? ఒక్కొక్క సారి తాగిన గ్లాసే, బిందెలో ముంచుతావు. పెదవులు తగిలేటట్లు సీసాతో నీళ్ళు తాగి, తిరిగి ఆ సీసానే ''ఫ్రిజ్''లో పెడతావు. మంచి నీళ్ళు పట్టేటప్పుడు స్నానం చేసి పడతావా? పాచి మొహంతోనే నీళ్ళు పట్టుకొస్తావు. అది ఆరోగ్యకరమా? నిన్నెలా పరీక్షించడం? పరీక్షిస్తే బాధపడతావు గదా! అందుకని ఆయన యిబ్బందేదో ఆయన పడుతున్నాడు. అది కూడా నీకు బాధాకరమైతే, ఇక ఆ దైవమే నిన్ను రక్షించాలి., నీకేమో ఆ దైవం ఉన్నాడా లేడా అని సందేహం'' అని అన్నారు స్వామి.

అంతలో హారిస్ సార్జెగారిని తీసుకుని రాబర్ట్ వచ్చాడు. చార్వాకరావు ఆయన్ని చూస్తూనే షేక్‌హాండ్ యివ్వబోయాడు. ఆయన నవ్వుతూ యింగ్లీషులో యిలా అన్నాడు, ''సారీ! షేక్‌హాండ్స్ చేసీ చేసీ నా చేతులు నొప్పి పడుతున్నాయి. ఒక్కొక్కడు ఒక్కొక్క రకంగా హేక్‌హాండ్ యిస్తున్నాడు. అందుచేత నేను తలవంచి విష్ చేస్తున్నాను'' అని తలవంచి అభివాదం చేసి కూర్చున్నాడు.

కూర్చుని యింకా యిలా అన్నాడు, ''అదీగాక కరచాలనం చేసినప్పుడు ఎదుటి వ్యక్తి యొక్క మానసిక తరంగాలు మనమీద పని చేస్తాయి. అవి మన శరీరం మీద ప్రభావం చూపిస్తాయి. అందుచేత కూడా నేను షేక్‌హాండ్ యివ్వడం మానేశాను. అందుకనే కాబోలు భారతీయులు షేక్‌హాండ్ ఇవ్వరు. యిస్తే ప్రాణ స్నేహితుడికే యిస్తారు. రామాయణంలో ప్రాణస్నేహితుడైన సుగ్రీవుడితోనే రాముడు కరచాలనం చేస్తాడు'' అని స్వామి వారి వైపు చూశాడు సార్జెగారు.

స్వామివారు ఔనన్నట్టు నవ్వారు. నవ్వి, ''మీ భోజన సదుపాయాలు బాగా జరుగుతున్నాయా?'' అని అడిగారు.

రాబర్ట్ నవ్వి, ''ఆయన భోజన ఏర్పాట్లు నేను చూస్తున్నాను స్వామీ! అన్నీ సక్రమంగా అందుతున్నాయి. వారి ఆరోగ్య రీత్యా కావలసిన వన్నీ వండి పెట్టడానికి ఆయన ''పర్సనల్ కుక్'' ఉన్నాడు గదా! మంచినీళ్ళు ఎలాగూ ''మినరల్ వాటరే! మిగిలిన వాటికి మన ఆశ్రమంలో ఏ యిబ్బందీ లేదు'' అన్నాడు.

స్వామివారు ప్రశ్నార్థకంగా చార్వాకరావు వైపు చూశారు. చార్వాకరావు నోరు తెరుచుకుని ఆకాశం వంక చూస్తూ ఉండిపోయాడు. ✦

## రామాయణ మహిమ

యస్య రామాయణం వక్త్రే
యస్య రామాయణం శ్రుతే,
నైతాభ్యామపలో ధన్యో।
విద్యతే భువన త్రయే॥

''ఎవరి నోట రామాయణం పలుకబడుతుందో, ఎవరి చెవిలో రామాయణకథ మ్రోగుతుందో వారికన్నా ధన్యులు ఈ ముల్లోకాలలోనూ ఉండరు''

## సీతారాములు

సీత శ్రీరామచంద్రుని చిత్తపదము
రామచంద్రుడు జానకీ ప్రాణపదము
రామ సర్ప ఫణామణి రమణి సీత
ధరణిజా జీవితాతప తరణి స్వామి

తెలుగులో వచ్చిన మహాకావ్యాలలో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం' తెలుగువారి భాగ్యఫలం. లోతైన భావాల ఆ కమనీయ కావ్యంలో ఒక చిన్న ముత్యమిది.

''శ్రీరాముని చిత్తస్థానం సీత. జానకి యొక్క ప్రాణం రాముడు. రాముడనే సర్పము యొక్క పడగపైమణి సీత. సీత జీవితమనే ఎండకి సూర్యుడు రాముడు.''

# మా ఊరి దేవుడు

**(జగతిమెట్ట - జగధీశ్వర ఆలయం)**

"కొండపైన ఉంటూ, నిత్య పూజలందుకుంటు, భక్తుల కల్ప తరువుగా, కోరికలు తీర్చే జగధీశ్వరుడిగా వేంచేసియున్న 'జగతి' మెట్ట శ్రీకాకుళం జిల్లా టెక్కలి పట్టణానికి అత్యంత సమీపాన గల శ్యాంసుందరాపురం గ్రామం వద్ద జాతీయ రహదారికి ఆనుకొని ఉంది. ఈ దేవస్థానం కొండ చివరనుంటూ చూపురలకు ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. ఈ ప్రాంతమంతా చెట్లతోనూ, పెద్ద బండరాళ్లతోనూ ప్రశాంతంగా, ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది. శివరాత్రి పర్వదినాన, కార్తీకమాసంలోను, పండగ రోజులలోను ప్రత్యేక పూజలు, సాంస్కృతిక కార్యక్రమాలు, వన భోజనాలు జరుగుతుంటాయి. పికినిక్‌ల కోసం సుదూర ప్రాంతాల నుండి ఇక్కడికి వస్తూ ఉంటారు. ఒకప్పుడు శ్రీకాకుళం జిల్లా కలెక్టర్‌గా పనిచేసిన శ్రీ అనిల్ చంద్రపునేఠా ఈ ఆలయ విశిష్ఠత తెలుసుకొని సుమారు 11సార్లు వచ్చి పూజలు జరిపారు. ఇంతటి విశిష్ఠత, ప్రత్యేకతలు కల్గిన ఈ జగతిమెట్ట పూర్వపరాలు పరిశీలించినట్లయితే...

సుమారు 18వ శతాబ్దపు చివర దశకంలో దట్టమైన చెట్లతో నిండిన ఈ కొండపై 'భైరా' అనే సాధువు కొంతమంది యోగులతో నివాసం ఉంటూ, కాలం వెలిబుచ్చారని, వారు ఏర్పరచుకొన్న చిన్న దైవమందిరం కాలక్రమేణ చిదిలమైందని వాదన. (కొండపై ఉన్న భైరాగి గుహను పరిశీలించినట్లయితే ఈ వాదనలు ఘాడిపరచవచ్చు). గ్రామానికి చెందిన చిన్నారులు కొండపై గడ్డిని, ఇటుకులను త్రవ్వుచుండగా లింగాకారంగా గల చిన్న రాయి బయల్పడగా, 1949 - 50 ప్రాంతంలో తిర్లంగి గ్రామానికి చెందిన నందేష్, జంగయ్యను తెప్పించి పూజలు జరిపించి, చిన్న పందిరిని గ్రామస్తులు ఏర్పాటుచేశారు. తర్వాత గ్రామానికి చెందిన లక్కోజి, అమ్మన్న తన బంగారాన్ని అమ్మి, అక్కడ పునాది వేయిగా, చల్లిపేడ గ్రామానికి చెందిన మక్కదాసు అనే వ్యక్తి కొంతవరకు నిర్మాణం చేయగా, అసంపూర్తిగా ఉన్న ఈ ఆలయ నిర్మాణాన్ని, శ్యాంసుందరాపురం గ్రామానికి చెందిన గుంట రామన్న పర్లాఖిమిడి (ఒరిస్సా)కి చెందిన "మారన" అనే చిత్రకారుడిచే అనేక విగ్రహాలుతో ఆలయాన్ని పూర్తిచేశారు. జగతిమెట్టపై వెలసి ఉన్నందున ఈ ఈశ్వరునికి జగధీశ్వరుడని నామకరణం చేశారు.



**కొండపై మరికొన్ని విశిష్ఠ ప్రదేశాలు :**

ఈ కొండలో తూర్పు వైపున ఏ ఆధారం లేకుండా నిలువెత్తు రాళ్ళు నిలబడి వుండడం ఆశ్చర్యపరుస్తూ ఉంటాయి. జగతిలో సత్యం నిలుచున్నన్నాళ్ళు ఈ రాళ్ళు అలాగే ఉంటాయని చెప్తూ, వాటిని 'సత్యం రాళ్ళు' అని పిలుస్తుంటారు. అదేవిధంగా బల్లపరు పైన రాళ్ళ మధ్యలో నిత్యం నీరు నిల్వ ఉండడం, ప్రక్కనే గల 'గొల్లగొండి' చెరువుతో దీనికి కలపబడి ఉంటుందని చెప్తూ ఉండటం వలన ఈ గనిని జగధీశ్వర గని అని పేరు వచ్చింది. అయితే 1984లో టెక్కలి డిగ్రీ కళాశాల నిర్మాణానికి కె.యమ్.సి.వారు ఈ గనిని కొంత దుర్వినియోగపరచటంతో ఇప్పుడు 'ధార' వలె మాత్రమే నీరు నిల్వ ఉంటుంది.

**చూపరుల దృష్టి – ప్రత్యేక అభివృద్ధి :**

ఆలయం విశిష్టతపై ఆధారాలు లభించటం, జాతీయ రహదారికి, టెక్కలి పట్టణానికి ఆనుకొని ఉండటం చూపుల దృష్టి మరింత పడింది. సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణకై శాశ్వతంగా 'జగధీశ్వరా కళామందిరాన్ని' గ్రామానికి చెందిన గుంటి బాబూరావు నిర్మించారు. ఇటీవల కాలంలో టెక్కలి చెందిన కొంతమంది దాతలు ముందుకు వచ్చి లక్ష రూపాయల వ్యయంతో కొండపైకి మెట్ల నిర్మాణం ఛేపట్టారు.

**భక్తులు ఆప్తుడు – జగధీశ్వరుడు :**

ఈ ప్రాంత వాసులు, గ్రామస్తులు ఇక్కడి 'జగధీశ్వరునుకి' ఎంతో భక్తి శ్రద్ధలతో కొలుస్తూ ఉంటారు. తమ కోర్కెలు తీర్చే ఆప్తుడిగా భావిస్తుంటారు. 'జగధీశ్వరుని' పేరుతో గల యువజన సంఘం అనేక అభివృద్ధి, సేవా, సాంస్కృతిక కార్యక్రమాలు చేపట్టి ఈ జగధీశ్వరునుని ఖ్యాతిని జిల్లాలో మరింత చాటి చెప్పడంలో తన వంతు పాత్ర నిర్వహిస్తున్నారు.

– జి. లీలావరప్రసాద్



# భద్రాన్ని ప్రసాదించే క్షేత్రం

- చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి

''శ్రీరాములవారి చరణస్పర్శ చేత పవిత్ర మైనది ఈ గోదావరీ తీరం. ఈ తీరాన వెలసి ఉన్నది భద్రగిరిక్షేత్రం. ఈ క్షేత్రమెప్పటికీ భద్రంగా వుండాలి. నిత్యకళ్యాణంగా, మంగళకరంగా, శుభంగా వుండాలి. ఇక్కడ నివసించే వారు, ఇక్కడకి వచ్చి దేవుని దర్శించే వారు అందరూ భద్రంగా వుండాలి. ఈ క్షేత్రంలో వేంచేసి వున్న శ్రీరామభద్రుని అనుగ్రహంచేత ప్రపంచమంతా భద్రంగా వుండాలి.''

''శ్రీరాములవారి చరణస్పర్శ చేత పవిత్రమైన గోదావరీ తీరము. ఇక్కడికి అనతి దూరంలో వున్న పర్ణశాల సీతారాములు వాసం చేసిన స్థలం. చిత్రకూటంలో కొంత కాలం గడిపిన పిమ్మట సీతారాములు గోదావరీ తీరానికి వచ్చారు. ఇంచుమించు పది సంవత్సరాలకు పైగా ఇక్కడే వుండి వుంటారు. అప్పుడు చాలా దూరం గోదావరీ తీరమున సంచారం చేయడం చేత ఈ తీరమంతా వారి చరణస్పర్శ చేత పవిత్రమైనది.''

## రామభద్రుడు :

శ్రీరామునికే ''రామభద్రుడు'' అని పేరు.

''రామాయ రామభద్రాయ. రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ. సీతాయాః పతయే నమః''

ఇక్కడ ఈ క్షేత్రంలో ఆయన భద్రాద్రి రాముడైనాడు, రామభద్రుడు భద్రరాముడైనాడు. ఇక్కడినుంచే ప్రపంచమంతటినీ భద్రంగా చూస్తున్నాడు.

ఎవరికెట్టి ఆపద సంభవించినా, తన యందు నిజమైన నమ్మకం గలవారిని కాపాడడానికి తాను వారికి దాసుడనౌతానన్నాడు. రామదాసు శ్రీరామునికి దాసుడు కావడమే కాదు, రామదాసుకే శ్రీరాముడు దాసుడైనాడు. రామలక్ష్మణులు రామసింగ్, లక్ష్మణ్ సింగ్ అనే రూపాలు దాల్చి, రామదాసు భటులమని చెప్పుకోలేదా?

## దాసులకు దాసుడు :

తనపట్ల అచంచలమైన విశ్వాసం వుంచితే చాలు, ఎట్టి ఆపదలనుంచి అయినా, ఎవరినైనా రక్షించగలడు. అతడు సంకల్పించితే ఎట్టి క్రూరులైనను ప్రభువులైన వారిలో సైతం భక్తిని కలుగజేసి, దాసులకు దాసుడూ, దాసానుదాసుడుగా కూడ తాను అవుతాడు. 'నాయందు నమ్మకముంచిన వారికి నేను దాసుడనౌతాను' అన్న నిదర్శనం చూపించాడిక్కడ శ్రీరాముడు.

**''విశ్వాసఫలదాయకః''**

కృష్ణావతారంలో కూడా భగవంతుడు అర్జునునకు దాసుడైనాడు, సారథి అయినాడు. దేవునిపైగానీ, పెద్దలపైగానీ, మిత్రుల యందే గానీ ఎవరియందో ఒకరియందు నమ్మకం గలవాడు కృతార్థుడు కాగలడు. అట్టి వానికి దుఃఖమే వుండదు. ఒకరు చెప్పినట్లు మనం నడుచుకుందామనే నమ్మకం గనుక వుంటే మన పూచీ అంతా వారిపైన వుంటుంది. ఒకవేళ వారు తప్పు చేస్తే ఆ నష్టం మనం తలచే తలంపే. తప్పుగా వుండి, దానివల్ల నష్టం కలిగితే-అప్పుడు మనం చేయగలిగినదేమున్నది? అందుచేత, వారి బుద్ధే మన బుద్ధి అనుకోవాలి. ఆవిధంగా మన భారం వారిపైన వుంచాలి. ఆ భారాన్ని మిత్రులపైన వుంచినప్పటికీ మన మనస్సు తేలిక అవుతుంది. మనకు కష్టం వుండదు: నమ్మి మనం చెడినా బాధ లేదు. ''విశ్వాసః ఫలదాయకః'' అని పెద్దల వాక్యం. కొందరు మిత్రుల పట్ల విశ్వాసం కలిగి వుంటారు. మరికొందరు దేవుని యందు విశ్వాసం కలిగి వుంటారు. రామదాసు భగవంతునియందు శ్రీరామునియందే సర్వభారమూ మోపినాడు.

మన పురాణాలు చూచేట్టయితే సుఖంగా జీవించిన వాళ్ళు ఎక్కువమంది లేరు. హరిశ్చంద్రుడు, నలమహారాజు, పంచపాండవులు, రామదాసు - మొదలైన వారంతా కష్టాలనుభవించినవారే. ''మనమే అనేక కష్టాలు పడుతున్నాము, ఎన్నో తంటాలు పడుతున్నాము. భగవంతుడు మనలను పరీక్ష చేస్తున్నాడు'' అని ఏమేమో

అనుకుంటాము. మన పురాణాల్లోని కథలను గమనిస్తే వాళ్లంతా మన కంటె ఎన్నో రెట్లు కష్టాలనుభవించినట్టు తెలుస్తుంది. అయితే ఎంత కష్టమొచ్చినా, భగవంతుని నమ్మిన పక్షంలో, అతడు మనకు దాసానుదాసుడై మన కష్టాలన్నిటిని నివృత్తి చేయగలడని మనకు రుజువవుతుంది.

### ''భద్రాన్ని ప్రసాదించే స్థలం'' :

భద్రమనే శబ్దానికి నిఘంటువు ఇలా అర్థం చెప్పింది. ''స్వశ్రేయసం శివం భద్రం కళ్యాణం మంగళం శుభం.''

''భద్రమనేది మధ్యలో వున్నది : ఈ క్షేత్రం పేరు భద్రగిరి. ఇదెప్పుడూ భద్రంగా ఉండాలి. కళ్యాణంగా వుండాలి, నిత్య కళ్యాణంగా, మంగళకరంగా, శుభంగా వుండాలి, ఇక్కడ నివసించేవారు, ఇక్కడికి వచ్చి దేవుని దర్శించేవారు అందరూ భద్రంగా వుండాలి. ఈ క్షేత్రంలో వేంచేసి వున్న శ్రీరామ భద్రుల అనుగ్రహం చేత ప్రపంచమంతా కూడా భద్రంగా వుండాలి. ఒక్క జీవుడు, ఒక్క కుటుంబం, ఒక వూరు వీటిని కాపాడడానికి మాత్రమే కాదు, పరమేశ్వరుడు భద్రుడు అను పేరు వహించింది - ప్రపంచమంతటికీ భద్రాన్ని అనుగ్రహించే స్థలమిది. ఇది ఉత్తరోత్తరా ఇంకా అభివృద్ధి కావాలి.

రామాయణంలో ముఖ్య పాత్ర సీతామహాలక్ష్మి 'మా జానకీ చెట్టబట్టగా మహారాజువైతివి' - అని త్యాగరాజు రాముని గూర్చి అన్నాడు. శ్రీరాముడిక్కడ సీతను వామ భాగంలో పెట్టుకుని ఆవిర్భవించాడు. ప్రపంచంలో మనమందరం ఆ మహాతల్లి బిడ్డలమే. ఆ తల్లే మనలనందరిని సృష్టించింది, సీతారామప్రసాద సిద్ధిరస్తు.

('సాధన' గ్రంథమండలి)

# వాగ్గేయ వైభవం

**పల్లవి:**

**పిబరే రామరసం**
**రసనే! పిబరే రామరసం ॥**

**చరణాలు:**

**జనన మరణ భయ శోక విదూరం**
**సకలశాస్త్ర నిగమాగమ సారమ్ ॥**

**పరమహంస శుద్ధ ఆశ్రమ గీతం**
**శుక శౌనక కౌశిక ముఖ పీతమ్**

''ఓ నాలుకా! (రసనే!) రామరసాన్ని పానం చేయి.

ఈ రామరసం జనన మరణాత్మకమైన సంసార భయాన్నీ శోకాన్నీ దూరం చేస్తుంది.

ఇది సకల శాస్త్రాల, వేదాల మంత్రాల సారం.

శుద్ధమైన పరమహంసల ఆశ్రమాలలో గానం చేయబడే గీతమీ రామరసం.

శుక శౌనక విశ్వామిత్రాది మహర్షులు పానం చేసే దివ్యరసమిది.''

యోగిగా ప్రసిద్ధుడైన 'సదాశివ బ్రహ్మేంద్ర స్వామి' రచించిన ప్రసిద్ధ సంస్కృత గీతమిది.

రామనామం, రామకథ, రామ తత్త్వం... ఇవన్నీ 'రామరసం' అనే మాటతో చెప్పబడింది.

రామావతారం దివ్యమైన ఉపాసనకే కాక, ఆదర్శంగా అనుసరించాల్సిన మానవీయ ఔన్నత్యానికి కూడా లక్ష్యం, 'రామ' నామం మంత్ర శాస్త్రంలో తారక మంత్రంగా పేర్కొనబడింది. కాబట్టే జన్మరాహిత్యానికీ, మోక్షానికీ కారణమైన మంత్రమది. కేవలం కైవల్యానికి వినియోగించే మంత్రాన్నే తారకమంత్రం అంటారు, అందువల్ల అది ''జనన మరణ భయశోక విదూరం'' అనిపించుకుంటుంది.

సప్తకోటి మహామంత్రాల సారం 'రామ' నామమని ఉపనిషత్తులు చెప్తున్నాయి. 'రామ తాపినీ ఉపనిషత్తు'లో ప్రణవార్థమంతా (ఓంకార అర్థం) 'రామ' నిబిడమై ఉందని స్పష్టంగా చెప్పబడింది.

రామోపాసన ఆత్మజ్ఞాన సాధనమని గ్రహించి పరమహంసలు శుద్ధతత్త్వాన్ని 'రామం'గా దర్శించారు.

రామకథకి ముఖ్యం ఋషులు. విశ్వామిత్రుడు, వసిష్ఠుడు, అగస్త్యుడు, భరద్వాజుడు, వాల్మీకి వంటి మహర్షులంతా రామాయణంలో ప్రధాన ఋషులు. వారందరూ రామునిలోని శ్రీమహావిష్ణువును దర్శించారు.

ద్రష్టలైన మహాత్ములంతా రామనామ, రామకథా వైభవాలని నిత్యం మననం చేసి తరించారు.

'రసం' అంటే మహానందమయమైన దివ్య స్థితి. ఆ స్థితి రామతత్త్వం వల్లనే లభిస్తుంది. 'రామ' శబ్దమే ఆనందానికి పర్యాయ పదం. సత్యశివసుందరాత్మకమైన పరబ్రహ్మమే 'రాముడు'.

అందుకే 'శ్రీరామరామ' అంటూ రాముని యందే రమిస్తున్నాను... అని శంకరుడు పలికాడు.

**శ్రీరామరామ రామేతి**
**రమే రామే మనోరమే ।**
**సహస్రనామ తత్తుల్యం**
**రామనామ వరాననే ॥** ✦




## వాక్య నిర్మాణమ్

1. రామః పుస్తకం పఠతి
   రాముడు పుస్తకమును చదువుచున్నాడు.
2. సీతా ఖేలతి
   సీత ఆడుచున్నది.
3. భిక్షుకః ధనం గృహ్ణాతి
   బిచ్చగాడు ధనం పుచ్చుకొనుచున్నాడు.
4. త్వం కుత్ర గచ్ఛసి?
   నీవు ఎక్కడకు వెళ్ళుచున్నావు?
5. అహం ఉద్యానవనం గచ్ఛామి
   నేను ఉద్యానవనమునకు వెళ్ళుచున్నాను

## - 2

## ప్రశ్నార్థకములు

| | |
|---|---|
| అహం కః | నేను ఎవడిని? |
| త్వం కః | నీవు ఎవడివి? |
| సః కః | వాడు ఎవడు? |
| ఏషః కః | వీడు ఎవడు? |

| | | |
|---|---|---|
| రామః కః | – | రాముడు ఎవడు? |
| వృక్షః కః | – | వృక్షము ఏది? |
| సూకరః కః | – | పంది ఏది? |
| అహం కా | – | నేను ఎవతెను? |
| త్వం కా | – | నీవు ఎవతెవు? |
| సా కా | – | ఆమె ఎవతె? |
| ఏషాకా | – | ఈమె ఎవతె? |
| సీతా కా | – | సీత ఎవరు? |
| డోలా కా | – | ఊయల ఏది? ఏది ఊయల? |
| వీణా కా | – | ఏది వీణ, వీణ ఏది? |
| పుష్పం కిం | – | పుష్పము ఏది? ఏది పుష్పము? |
| తత్ కిం | – | అది ఏమిటి? అది ఏమి? |
| ఏతత్ కిం | – | ఇది ఏమిటి? – ఇది ఏమి? |

ఈ విధంగా మరికొన్ని ప్రశ్నలు అభ్యాసం చెయ్యండి. ఈ రెండు అభ్యాసాల వలన ప్రశ్న వేయుట, సమాధానం చెప్పుట సాధన అవుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా : | 1) అహం కః | – | నేను ఎవడిని? |
| | అహం రామః | – | నేను రాముడిని |
| | 2) అహం కా | – | నేను ఎవతెను? |
| | అహం సీతా | – | నేను సీతను |
| | 3) తత్ కిం | – | అది ఏమిటి? |
| | తత్ పుష్పమ్ | – | అది పుష్పము |

కా – ఎవతె (స్త్రీ లింగం), కః – ఎవడు? (పుంలింగం), కిం – ఏమిటి (నపుంసక లింగం)

## అభ్యాసం - 3

ఇప్పుడు క్రియా పదాలతో వాక్య నిర్మాణం నేర్చుకుందాం.

**పుంలింగము :**

| | | |
|---|---|---|
| సః పఠతి | – | అతడు చదువుచున్నాడు |
| ఏషః పఠతి | – | ఇతడు చదువుచున్నాడు |
| రామః పఠతి | – | రాముడు చదువుచున్నాడు |

| | |
|---|---|
| కః పఠతి | ఎవడు చదువుచున్నాడు? |
| త్వం పఠసి | నీవు చదువుచున్నావు |
| అహం పఠామి | నేను చదువుచున్నాను |

### స్త్రీ లింగము

| | |
|---|---|
| సా పఠతి | ఆమె చదువుచున్నది |
| ఏషా పఠతి | ఈమె చదువుచున్నది |
| సీతా పఠతి | సీత చదువుచున్నది. |
| కా పఠతి | ఎవతె చదువుచున్నది? |
| త్వం పఠసి | నీవు చదువుచున్నావు |
| అహం పఠామి | నేను చదువుచున్నాను. |

లిఖతి, చలతి వంటి మిగిలిన క్రియా పదాలలో ఈవిధంగానే చిన్న చిన్న వాక్యాలు నిర్మించండి.

ఇప్పుడు అవ్యయాలు కూడా కలిపి వాక్య నిర్మాణం చేద్దాం. అవ్యయాలకి లింగ వచన విభక్తి భేదాలు లేవని తెలుసుకున్నాం గదా!

| | | |
|---|---|---|
| 1) | సః తత్ర పఠతి | వాడు అక్కడ చదువుచున్నాడు |
| | ఏషః అత్ర పఠతి | వీడు ఇక్కడ చదువుచున్నాడు |
| | రామః కుత్ర పఠతి | రాముడు ఎక్కడ చదువుచున్నాడు? |
| 2) | త్వం ఇదానీం పఠసి | నీవు ఇప్పుడు చదువుచున్నావు |
| | అహం తదా పఠామి | నేను అప్పుడు చదువుచున్నాను |
| 3) | సా నక్తం పఠతి | ఆమె రాత్రి చదువుచున్నది |
| | ఏషా అద్య పఠతి | ఈమె ఈరోజు చదువుచున్నది |
| | సీతా దివా పఠతి | సీత పగలు చదువుచున్నది |
| 4) | కః శనైః పఠతి? | ఎవడు నెమ్మదిగా చదువుచున్నాడు? |
| | కా శీఘ్రం పఠతి? | ఎవతె తొందరగా చదువుచున్నది? |
| | రామః కిం పఠతి? | రాముడు ఏమి చదువుచున్నాడు? |
| | కదా సీతా పఠతి? | సీత ఎప్పుడు చదువుచున్నది? |

త్వం కుత్ర పఠసి? – నీవు ఎక్కడ చదువుచున్నావు?

అహం కథం పఠామి? – నేను ఎలా చదవను?

మిగిలిన క్రియా పదాలతో, ఇదే విధంగా వాక్య నిర్మాణం అభ్యాసం చేయండి.

# ప్రశ్న పత్రమ్ 1

కొన్ని తెలుగు వాక్యాలు ఈ క్రింద యిస్తున్నాం. వీటిని పై పాఠాల ఆధారంగా సంస్కృతంలోకి అనువాదం చేయండి.

1) అతడు ఏమి వ్రాయుచున్నాడు?

2) ఆమె ఏమి మాట్లాడుచున్నది?

3) నేను నెమ్మదిగా నడచుచున్నాను

4) పండు తొందరగా పడుచున్నది

5) కాకి ఎగురుచున్నది.

6) రాముడు ఇక్కడకు వచ్చుచున్నాడు

7) కృష్ణుడు అక్కడకు పోవుచున్నాడు

8) సీత ఎక్కడ నిద్రపోవుచున్నది?

9) రాధ ఏమి తీసికొని వెళ్ళుచున్నది

10) వీడు ఎప్పుడు తీసుకొని వస్తున్నాడు?

11) గోవిందుడు ఇచ్చుచున్నాడు.

12) మనోహరుడు పుచ్చుకొనుచున్నాడు.

13) షణ్ముఖుడు చూచుచున్నాడు.

14) రవిశంకరుడు పరిగెత్తుచున్నాడు.

15) మిత్రుడు ఏమి తినుచున్నాడు?

# ప్రశ్న పత్రమ్ - 2

కొన్ని సంస్కృత వాక్యాలు ఈ క్రింద యిస్తున్నాం. వీటిని తెలుగులోకి అనువాదం చేయండి.

1) బాలః అత్ర క్రందతి

2) మనోహరః జానాతి

3) మార్కండేయః శీఘ్రం ధావతి

4) మాలా అద్యతాడయతి
5) మార్జాలః కిం మారయతి?
6) బాలికా శనైః స్మరతి?
7) బాలః శీఘ్రం విస్మరతి
8) శ్రీనివాసః అద్య ఆరోహతి
9) రేఖా ఇదానీం ఖాదతి
10) మిత్రమ్ కథం ఆగచ్ఛతి?
11) శకటం కుత్ర గచ్ఛతి?
12) సర్పః దివా చలతి
13) సుధాకరః నక్తం కిం ఖాదతి?
14) అహం అద్య కిం కరోమి
15) త్వం కుత్ర గచ్ఛసి?

# ప్రశ్న పత్రమ్ - 3

**1) ఈ దిగువ ఖాళీలను పూర్తిచేయండి :**

1. సః జలం ..................................
2. అహం పుస్తకం ..................................
3. ............................... ధనం దదాతి
4. సః ఫలం ..................................
5. ...................... పత్రం లిఖసి

**(2) ఈ క్రింది పదములకు అర్థం వ్రాయండి.**

1. మార్జాలః 2. అహం, 3. లేఖినీ 4. అత్ర 5. అద్య

**(3) ఈ దిగువ పదాలను సరియైన విధంగా జోడించి వాక్యాలను నిర్మించండి.**

| | | |
|---|---|---|
| సా | సర్పం | ఆరోహయతి |
| కృష్ణః | సీతా | పశ్యతి |
| త్వం | వృక్షం | పఠసి |
| గోపాలః | పుస్తకం | విద్యాలయం |
| అహం | గచ్ఛామి | |

**(4) ఈ క్రింది పదాలను ఉపయోగించి వాక్యాలు నిర్మించండి.**

1. గోవిందః 2. వనం 3. పత్రం 4. ఏషా 5. పశ్యతి 6. గచ్ఛామి

# సంస్కృతం వాక్శక్తి

– డా॥ డేవిడ్ ఫ్రాలీ

సంస్కృతం వేదభాష. శబ్దానికి గల దివ్యశక్తి ద్వారా దీనిని దర్శించిన మహర్షుల, మంత్ర ద్రష్టల ద్వారా మనకు సంక్రమించిందీ భాష. సృజనాత్మక విశ్వ చైతన్య స్పందనను (దేవ భాష) మానవభాష లోనికి ప్రవేశపెడుతుందని చెప్ప బడింది. విశ్వంలోని సమస్త శబ్దాలను తనలో ఇముడ్చుకున్న దివ్యనాదం – ఓం కారం – నుండి జనించింది సంస్కృతం.

సంస్కృత భాష యొక్క ప్రాథమిక రూపాలు, సూత్రాలు పురాతనమయిన ఋగ్వేదంలో ఉన్నాయి. దీనిని వైదిక సంస్కృతం అంటారు. దీని నుండి హిందూ, బౌద్ధ, జైన పవిత్ర సాహిత్యా నికి మూలభాష అయిన శాస్త్రీయ సంస్కృతం రూపుదాల్చింది. ఆవిధంగా సంస్కృతం ఆధ్యాత్మిక జ్ఞానభాష.

ఎన్నో ఆధ్యాత్మిక బోధనలు, మరెన్నో విభిన్న ఆధ్యాత్మిక భావనలు – అనుభవాలు మరే ఇతర భాషలోనూ లేనంతగా సంస్కృత భాషలో కనపడతాయి. అందుచేతా, అంతే కాక గతకాలపు ఆధ్యాత్మిక జ్ఞానానికి అదే ఆధారం కనుక, యావద్విశ్వాన్ని జాగృత పరచే ఏకైక భాషకు, ఆధ్యాత్మిక శాస్త్రపు భవిష్యత్ భాషకు మంచి పునాది సంస్కృతం. సంస్కృతం అనేక ముఖ్యమైన, అసమానమైన విలువలను కలిగి ఉంది.

మొదటిగా, ప్రపంచంలోని అధిక భాష లకు, అధిక సంఖ్యాకులు మాట్లాడే ఇండో – యూరోపియన్ భాషలకు ప్రాచీన రూపం, మూలం సంస్కృతం. వీటిలో ఐరోపా ఖండపు ముఖ్య భాషలు, భారతీయ భాషలు, అనేక ఇరాపియన్ – మధ్య ప్రాచ్య భాషలు ఉన్నాయి. అంతేకాదు, ప్రాచీన ఈజిప్టియన్, సుమేరియన్ వంటి భాషలతో, వ్యాకరణ భేదాలున్నా, ఉమ్మడి మూలం కలిగి ఉంది. సుదూరంలో హవాయే భాష వరకు ఉన్న అనేక తూర్పు దేశ భాషలకు సంస్కృత మూలం కన్పిస్తుంది. మధ్య ఆసియాకు చెందిన స్కిథియన్ భాష వంటి అనేక భాషలు వస్తుతః ఇండో – ఇరానియన్ భాషలే.

ద్వితీయ పక్షంలో – ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీనమై, నిరంతరంగా వాడబడిన భాష కావడం వల్ల సంస్కృతం అతి పురా తనమూ, అత్యంత సహజమూ అయిన మానవ భాష అయి ఉండాలి. ఈ భాష క్రీ.పూ. 6000 సంవత్సరాలకు ముందే వాడుకలో ఉండేదని కొందరు అంటే, క్రీ.పూ. 1500 నుండి మాత్రమే వాడుకల్లో ఉండేదని సాంప్రదాయ వాదులు అంటు న్నారు. బుద్ధుని కాలంలో నివసించినట్లు చెప్పబడుతున్న పాణిని కాలం నుండీ శాస్త్రీయ సంస్కృతం ఒకే మౌలిక ఒరవడిని అనుసరిస్తూ వస్తోంది.

మూడవ పక్షంలో, యితర భాషల్లో కంటే ఎక్కువ సాహిత్యం సంస్కృ తంలో ఉంది. ప్రపంచంలోని అతి పెద్ద మతా లైన హిందూ, బౌద్ధ మతాల పవిత్ర సాహి త్యంతో పాటు అగణితమైన సంఖ్యలో ఆధ్యాత్మిక,

# సంస్కృతం భారతీయాత్మ

'సాహితీ విశారద' 'మాతృశ్రీ' చౌడూరి నరసింహారావు

'సంస్కృతం నామ దైవీవాక్ అన్వాఖ్యాతా మహర్షిభిః' సంస్కృతం దేవతలు మాట్లాడిన భాషగా మహర్షులు కీర్తించిరని దండి మహాకవి తమ 'కావ్యాలంకార దర్పనం లో పేర్కొన్నారు. కవి వల్లభరాయడు తమ క్రీడాభిరామమందు ''జనని సంస్కృతంబు సకల భాషలకు'' అని సంస్కృత భాషా వైశిష్ట్యాన్ని, ప్రాశస్త్యాన్ని వివరించారు.

దేశీయ భాషా వ్యాకరణాల మీద సం స్కృత భాషా వ్యాకరణ ప్రభావం అత్యధికంగా ఉండి, రసభావాదులను సంగ్రహంగానూ, వ్యంగ్యం గానూ, శక్తిమంతం గానూ వ్యక్తీక రింపగల సామర్థ్యం, ఒక్క సంస్కృతానికే తప్ప అన్య భాషల కెంతమాత్రమూ లేదంటే అతిశయోక్తి కాదు.

మోనియర్ విలియమ్స్ 'హిందూ యిజమ్' అను గ్రంథంలో సంస్కృతభాషను, దాని ప్రాచీనతను గూర్చి తెలుపుతూ, ''భారత దేశంలో సుమారు అయిదు వందల దాకా ప్రాంతీయభాషలున్నప్పటికీ సంస్కృ తం ఒక్కటే సనాతన, నిత్య నూతన భాష. ఉచ్ఛ, నీచ, ప్రాంత, మత, భేదాలేవీ అంటని స్వచ్ఛతగల భాష. అందుకే యావద్భార తీయులు సంస్కృత భాషను గౌరవిస్తారు. సంస్కృత భాష వేదాంతాది న్యాయశాస్త్ర పురాణేతిహాసాలకు వాహకము. సనాతన సాహిత్య సాంప్ర దాయాలు 'సంస్కృత దర్పణం' లో సుస్పష్టంగా గోచ

అధి భౌతిక, పౌరాణిక రచనలు సంస్కృతంలో ఉన్నాయి. ఇక పద్యకావ్యాలు, నాటకాలు, వేదాంత రచనలు - కాల గర్భంలో అనేకం కలిసిపోయినా - ఇంకా కోకొల్లలు మిగిలున్నాయి.

నాల్గవ పక్షంలో సంస్కృతం అత్యంత శాస్త్రీయమైన భాష. నోటిలో శబ్దోత్పత్తి స్థానాల మీద ఆధారపడి నిర్మించబడిన ఏకైక భాష సంస్కృతం. తత్ఫలితంగా పందొమ్మిదవ శతాబ్దపు ఆధునిక భాషోత్పత్తి శాస్త్రాలలో అనేకం సంస్కృత భాషను పునరధ్యయనం చేయడం ద్వారా జనించినవే. వ్యాకరణం (Grammer), భాషాతత్త్వ శాస్త్రం, శబ్ద లక్షణ శాస్త్రం (Philology)లు (Etymology) మరే ఇతర భాషలో కంటే సంస్కృతంలో ఎక్కువగా వికాసం పొందాయి. ప్రపంచంలోని అత్యధిక భాషలు అనేక భాషల - ప్రాదేశికాల మిశ్ర రూపాలయితే, సంస్కృతం మాత్రం అత్యంత ఆత్మ సారూప్యత కలిగిన సజాతీయ భాష.

ఈ కారణాల వల్ల ప్రపంచ సంస్కృతిలో నవశకపు భాష కావడానికి కావలసిన అన్ని అర్హతలతో సంస్కృతం తనకు తాను ముందు కొస్తోంది. **భవిష్యత్తులో – ఎంతకాలం అని చెప్పలేము కానీ – మానవజాతి యావత్తు సంస్కృతాన్ని తిరిగి స్వంతం చేసుకుంటుంది.**

కనీసం తన ఆధ్యాత్మిక భాషగానో లేక జ్ఞాన సముపార్జనా భాషగానో.

మరే ఇతర భాషలలో కన్నా ఎక్కువగా సంస్కృతంలో దివ్యత్వాన్ని విశదీకరించే పదాలున్నాయి; జాగృత స్థితిని సిద్ధాంతీకరించడానికి, ధ్యానానుభవాల్ని విశదీకరించడానికి మరిన్ని నిర్దుష్టమైన పదాలున్నాయి. సంస్కృతం అతీంద్రియమనో (Higher Mind) భాష కావడం వల్ల దాని నియమాలను, స్పందనా రీతులను తెలుసుకోవడానికి దోహదం చేస్తుంది. దేవతల, అతీంద్రియ మనోస్థితుల భాషగా ఆయా స్థితులను, శక్తులను పొంద జేస్తుంది. తెరుస్తుంది. దేవతల - అతీంద్రియ మనస్థితుల - భాషగా ఆయా స్థితులను, శక్తులను పొందే మార్గం సుగమం చేస్తుంది.

## సంస్కృత భాష రూపం

సంస్కృతం ఐదు ప్రాథమిక బీజాల నుండి వ్యుత్పన్నమౌతోంది. అవి అ, ఇ, ఉ అనే మూడు అచ్చులు, ఋ,     అనే అర్ధాచ్చులు. ఈ ఐదు బీజాలు తమవైన మూల గుణాలు, అర్థాలు, శక్త్యాత్మక ప్రభావాలు కలిగి వున్నాయి.

ఈ ఐదు ప్రాథమిక బీజాలు ఐదు శ్రేణుల హల్లులను సృష్టిస్తాయి. ఆయా శ్రేణులు సంబంధిత ప్రాథమిక బీజాల అర్థాలకు లక్షణాలను ప్రతిబింబించి విస్తృత పరుస్తాయి.

అ నుండి : క, ఖ, గ, ఘ, ఙ (కంఠము నుండి ఉచ్చరించబడి కంఠవ్యములు అనబడతాయి)

ఇ నుండి : చ, ఛ, జ, ఝ, ఞ (తాలువు నుండి జనించి తాలవ్యములు అనబడతాయి)

ఉ నుండి : ప, ఫ, బ, భ, మ (పెదవులతో ఉచ్చరించబడి ఓష్ఠ్యములు అనబడతాయి)

ఋ నుండి : ట, ఠ, డ, ఢ, ణ (మూర్ధము నుండి జనించి మూర్ధ్యములు అనబడతాయి)

ఌ నుండి : త థ, ద, ధ, న (దంతములచే పలుకబడి దంతవ్యములు అనబడతాయి)

ఈ విధంగా ఐదు ప్రాథమిక బీజాల నుండి 25 హల్లులు జనించాయి.

సంస్కృతంలో 16 అచ్చులున్నాయి. అ, ఇ, ఉ లకు హ్రస్వ, దీర్ఘ రూపాలున్నాయి. దీర్ఘ రూపాలు ఆ, ఈ, ఊలు, కంఠవ్యములు, తాలువ్యములు కలిసి జనించిన శబ్దాలు ఎ,

---

రిస్తాయి. సంస్కృతం సంస్కృతి గని. గని నుండి కావలసిన పదార్థాలను వెలికి తీసి వాడుకొనునట్లుగా, దేశభాష లెన్నింటినో అభివృద్ధి పరచుకొనవచ్చును.'' అని సంస్కృత భాషావైశిష్ట్యాన్ని వివరించాడు.

మన సంస్కృతికి మూలకందమైన ప్రాచీన వాఙ్మయ రహస్యాలను, సౌందర్యాన్ని బాగా గ్రహించాలంటే సంస్కృత భాషా పరిజ్ఞానం అత్యంతావశ్యకమైయున్నది. వివిధ విషయాలందు పరిజ్ఞానమునకు ఎన్నో అనువాద గ్రంథాలున్నప్పటికినీ, ఆయా విషయాలందు నిక్షిప్తమైయున్న అంశాలను సహజ సౌందర్యాలను ఆస్వాదించుటకు మూల గ్రంథాలను పఠించడం అత్యావశ్యమైయున్నది. ఈ వాస్తవాలను గుర్తించే కీత్, మ్యాక్స్ ముల్లర్ మొదలైన పాశ్చాత్య భాషా పండితులు ఈ దేశానికి వచ్చి ఇక్కడి భాషయైన సంస్కృతాన్ని బాగా అధ్యయనం చేసి, సంస్కృత భాషా సారస్వత వ్యాసంగానికే తమ జీవితాలను ధారపోశారు.

బోధనాశక్యంగాని భావాలను సైతం వ్యక్తీకరింపగల సౌలభ్యం, వివిధ పద జాలాలతో కల్గిన పరిపూర్ణత్వం, సుదీర్ఘోన్నత భావాలను సైతం సంక్షిప్తీకరించి చెప్పగల సౌకుమార్యం, భావపుష్టికై నిత్యనూతన పదజాలాలను సృష్టించుకొన జాలిన సామర్థ్యం మొదలైన ఉన్నత భాషకుండవలసిన లక్షణాలన్నీ సంస్కృతభాషకున్నవి.

ఈ వైశిష్ట్యాన్ని తెలుసుకొన్నందువల్లనే 1786లో సర్ విలియమ్ జోన్స్ అనే పాశ్చాత్య భాష కోవిదుడు, "సంస్కృతభాష - దాని ప్రాచీనత ఎంతటిదైనప్పటికీ ఆశ్చర్యకరమైన నిర్మాణం కలిగియున్నది. ఈ భాష గ్రీకు కన్న నిర్దుష్టతనూ, లాటిన్ కన్న పరిపూర్ణతనూ కల్గియున్నది. లాటిన్ గ్రీకు భాషలకన్నా పరిపక్వతను సంతరించుకున్నది.'' అని కీర్తించాడు.

యావత్ ప్రపంచం నాగరికతకు నోచుకోని కాలంలోనే భారతీయులు అత్యుత్తమ

ఏ, ఐ, ఒ, ఓ, ఔలు ఆరు. ఇవికాక ఋ, ల దీర్ఘరూపాలు ఋ, లు రెండు. ఇవి సాధారణంగా ఉపయోగంలోకి రావు. ఇవికాక ముక్కుతో పలికే, అం, ఒత్తి పలికే అః శబ్దాలున్నాయి.

అచ్చులకు, హల్లులకు మధ్య తొమ్మిది అర్ధాచ్చులు, ఒత్తక్షరములు ఉన్నాయి. అవి య, ర, ల, వ, హ, స, శ, ష, క్షలు.

ఈ 50 అక్షరములు కుండలినీ దేవి కంఠహారంగా తయారవుతాయి. అదే వాక్ శక్తి. ఈ 50 అక్షరములు అంతఃశరీరంలోని వివిధ చక్రాలలో నివశిస్తాయి.

ఉపనిషత్తుల అనుసారం - అచ్చుల శ్రేణి ఆత్మ లేదా జీవుని (Indra)కి ప్రాతినిధ్యం వహిస్తాయి. హల్లులు ఒక అవధికి లోబడి, అచ్చుల సహకారం లేకుండా పలుకబడవు కాబట్టి, అవి భౌతిక పదార్థానికి లేదా మృత్యువుకు ప్రాతినిధ్యం వహిస్తాయి. అర్ధాచ్చులు, ఒత్తక్షరాలు ప్రజాపతికి - ఆత్మను పదార్థంగా మార్చే సృజనాత్మక శక్తికి ప్రాతినిధ్యం వహిస్తాయి. **(సశేషం)**

---

సంస్కృతీ సంపన్నులుగా వెలిగారు. భారతీయుడు తన మనస్సును సృష్టి రహస్యాలపై మరలించి తన విమర్శనా జ్ఞానశక్తితో దర్శించిన తత్త్వములను 'మంత్ర' రూపమున వెలయింప జేసినాడు. ఆ మంత్ర సముచ్చయములే క్రమంగా వేదములైనవి. సాయణాచార్యుల వారు వేదములకు సమగ్ర భాష్యములను రచించి వానిని సులభ గ్రాహ్యముగా తీర్చిదిద్దారు.

సంస్కృతం ధాతుజన్య భాష. ఇందు రెండువేలకు పైగా ధాతువులు మనకు కనిపిస్తాయి. ఇవి కేవలం వ్యవహారమున మాత్రమే. వైదిక భాషకు సంబంధించినవి సౌత్రములై నట్టివి ఇంకనూ రెండువేల ధాతువులుండ వచ్చునని ప్రాజ్ఞుల ఉవాచ. ఇన్ని వేల మూల ధాతువులున్నట్టి భాష ఈ జగత్తులో మరేది లేదు. ఈ ధాతువులనుండి చిత్రవిచిత్రములగు ఎన్నో రూపాలను కల్పించుకునే అవకాశముండుటవల్లనే ఇది 'శబ్దవైశాల్యత' కల్గియున్నది.

కాలక్రమేణా సంస్కృత భాషలో కొంత మార్పు కలిగింది. ఈ భాషను సంస్కరించుటకై ఐంద్రము, చాంద్రము మొదలైన నూతన వ్యాకరణము లేర్పడినవి. ఈ వ్యాకరణములలో ఉత్తమోత్తమంగా నిల్చింది పాణినీయ వ్యాకరణము. ఇది కేవలం శబ్దశాస్త్ర గ్రంథముగనే గాక, నాటి భారతీయ సంస్కృతీ సాహిత్యాలను ప్రతిబింబింపజేసే గ్రంథంగా వెలసింది. సోవియట్ దేశానికి చెందిన ప్రొఫెసర్ స్కెర్ బాట్స్కై ''పాణినీయ వ్యాకరణ - మానవ ప్రతిభ సృష్టింపగల విషయాలలో అత్యున్నతమైనది.'' అని ప్రశంసించెను.

ఈ భాషకున్నట్టి నిర్దుష్టతను, పరిపూర్ణతను, హేతువాద నిబద్ధతను చూచి జర్మన్ భాషా పరిశోధకులు సంస్కృత భాషాధ్యయనమునకు పూనుకొని తమ దేశంలో ఈ భాషాధ్యయన శాఖను ప్రత్యేకంగా ఏర్పరచుకున్నారు.

అయితే కొందరు సంకుచితులు సంస్కృతం జీవద్భాష కాదని, ఇది పాణిన్యాది వైయ్యాకరణులు సూత్రబద్ధ మొనరించి నిరోధించుట చేనేడిది జనసామాన్యంలో లేనందున మృతభాషగా మారినది అభిప్రాయపడుతున్నారు. కాని ఇది ఎంతమాత్రమూ అంగీకార యోగ్యం కాదు. పాణిని తర్వాత కాలమున కూడా సంస్కృతభాష అనంతంగా పెంపొందింది. ఈయన పిదప నూటాయేబది సంవత్సరాలకు 'వరరుచి' యను వ్యాకరణవేత్త తన 'వార్తికము'ల ద్వారా పాణినీకృత వ్యాకరణమును సంస్కరించాడు. ఇతని అనంతరం 'పతంజలి మహర్షి' దీనికి సమగ్రభాష్యమును రచించెను. ఈ మహర్షి కృతమైన భాష్యమే 'మహాభాష్యము'ను పేర జగత్ప్రసిద్ధిగాంచినది. అందుకే ''महा भाष्यं वा पठनीयं महा राज्यं वा पालनीयं'' (మహాభాష్యం పఠింపదగినది లేదా మహా రాజ్యం పాలింపదగినది) అనే ఆర్యోక్తి ప్రచారమున ఉన్నది. మునిత్రయముగా గణుతికెక్కిన పాణిని, పతంజలి, వరరుచి వ్యాకరణవేత్తలు నాటి సంస్కృతానికి సమగ్రరూపాన్నిచ్చి మనకు కానుకగా బహూకరించారు.

ఈ సందర్భంగా మన తొలి ప్రధాని పండిట్ నెహ్రూగారి అభిప్రాయాన్ని తెలుసుకొందాం.

"If I was asked what is the greatest treasure which India posses? and what is her heritage? I would answer inharitatinly it is the Sanskrit language and literature that it contains."

(ఒకవేళ నన్నెవరైనా భారతదేశపు గొప్ప సంపద ఏది? మరియు దాని యొక్క గొప్పదనమేమి? అని ప్రశ్నిస్తే. దానికి ''సంస్కృత భాష మరియు సంస్కృత సాహిత్యము'' అని, ఖచ్చితంగా సమాధానమిస్తాను.)

విశ్వజనీనతకు ఆధారం భారతీయత, భారతీయతకు మూలాధారం సంస్కృత భాషా సాహిత్యాలు. నాడు అఖండభారతాన్ని నిలబెట్టిన సంస్కృతమే నేడు దేశ ప్రజలందరినీ జాతి, కుల, మత, వర్గ, భాషా వైషమ్యాలకతీతంగా ఏక సూత్ర బద్ధులను చేయగలదనడంలో ఎంతమాత్రమూ సందేహంలేదు. సంస్కృతం కేవలం భాష మాత్రమే కాదు. అది వ్యక్తి సంస్కారానికి ప్రథమ సోపానం. జాతీయ సమైక్యతను సాధించే ఏకైక సాధనం. యావత్ భారతీయతకు ఆత్మవలె వెలుగొందుచున్నట్టి సంస్కృత భాషా వ్యాప్తికై అందరం సమైక్యంగా కృషిచేద్దాం. సంస్కృతం ద్వారా సనాతన భారత జాతిని మరల గురు స్థానంలో నిలబెడదాం. ✦

# విశ్వశక్తిని జాగృతం చేసి అద్భుతాలు సాధించే 'రేకీ'

'రేకీ నిపుణులు' మధురకవి శ్యామలరావు

ఈమధ్య కాలంలో రేకీ అనే మాట చాలా మంది నోటెంట వినబడుతూంది. రేకీ ద్వారా చాలామంది శారీరక, భావోద్రేక, మానసిక వ్యాధులు నయమవుతున్నాయని, పిల్లలు బాగా చదువు సంధ్యలలో గురి చూపుతున్నారని, కుటుంబాలలో ఆనంద ఆరోగ్యాలు, మనశ్శాంతి లభిస్తున్నాయని వగైరా వింటున్నాము.

అవును. నిజమే. రేకీ అంటే విశ్వ వ్యాప్తమై, శక్తిమంతమై దివ్యభావనా తరంగాలను వెదజల్లే విశ్వ చైతన్య భగవత్‌శక్తి!

'రేకీ' అనే మాట జపాను భాష. దీని అర్థం ఇలా ఉంటుంది... 'రే' అంటే విశ్వ వ్యాప్తమై ఉన్న జీవశక్తి, 'కి' అంటే మొదటి మాటలోని శక్తే, కంపనాపూరితమైనది అనుకోవచ్చు. అంటే రేకీ అన్నది భగవంతుని శక్తి, ప్రతి జీవకణాల్లో ఉన్న అద్భుత ప్రాణశక్తి, ప్రేమశక్తిగా అనుకోవచ్చు. ఇది ఒక భూగ్రహానికే కాక విశ్వంలో ఉన్న శక్తి. ఈ 'కి'నే చైనా భాషలో 'చై' అని, 'ప్రాణ' అని మనం, Bio-Plasmic Energy అని రష్యాలో 'క' అని ఈజిప్ట్ దేశవాసులు, పాళీభాషలో 'ఏకాంకర్' అని అంటారు.

మానవుడు పుట్టిన దగ్గర నుండి జీవితంలో సుఖసంతోషాల కోసం మనశ్శాంతి కోసం పోరాడుతూనే వున్నాడు. జవర నుండి, రోగాలు, రుగ్మతల బారి నుండి ఎలాగైనా తప్పించుకుని హాయిగా ఉండాలని తపన పడుతూనే ఉన్నాడు. కొందరు సిద్ధులు, గురువులు, జ్ఞానులు, ద్రష్టలు మానవాళిని ఉద్ధరించే ప్రయత్నంలో అనేకమైన మార్గాలు చూపెట్టారు. కానీ సామాన్య మానవునికి అవి అర్థం కాక, ఆచరణ తెలీక తికమక పడుతున్నాడు. వైద్యులు, మత గురువులు మనిషి శారీరక, మానసిక, భావోద్రేక జనిత రోగాలని నయం చేస్తున్నా, మనిషి తృప్తికరంగా లేదని భావిస్తున్నాడు. పురాణ కాలంలో, (ఈ రోజుల్లో అక్కడక్కడ) జరిగిన అత్యద్భుత స్పర్శ, భావనా శక్తులతో రోగ నిర్మూలన చేసే ప్రక్రియలు మనకు ఆశ్చర్యం కల్గించుతాయి.

అలాంటి శక్తులు ఏమిటి? అవి అందరికీ సాధ్యమా? అసలు ఆ ప్రక్రియ ఏమిటి?

అదే భగవద్వర ప్రసాదమైన రేకీ శక్తి. ఎవరైనా సరే మనస్ఫూర్తిగా ప్రార్థిస్తే వారికి లభించే "విశ్వ చైతన్య శక్తి."

రేకీ పుట్టు పూర్వోత్తరాలు ఎవరికీ తెలియవు. నమ్మినా, నమ్మకపోయినా (చాన్ లింగ్) అనుసంధానం ద్వారా తెలుసుకోడానికి ప్రయత్నిస్తే, రేకీ పుట్టుక భూమితోనే నని, సహస్ర బాహువులతో అనేకమైన దేవతలు అదే సమయంలో ఉద్భవించారని, ఇవన్నీ శివుని ప్రభావం వలన కలిగాయని, ఆయనకి మనం ఈ అద్భుత శక్తి ప్రసాదించినందుకు సర్వదా ఋణపడి, కృతజ్ఞతా భావం చూపాలని, మానవుడు భూమిమీద అవతరించినప్పుడు రేకీ శక్తి అతని శరీరంలో అనుసంధానించబడిందని, దానివలన అతను రేకీకి హక్కుదారుడని చెప్ప బడింది.

జీవరాసులలో రేకీ ఉంది. రేకీ లేనిదే జీవం లేదు. శక్తి లేదు. అదే ప్రాణశక్తి, ప్రేమ శక్తి.

అలా ఆవిర్భవించిన రేకీని పూర్వం "ము" (mu) అనే నాగరీకులు పాఠశాలలో, విద్యా లయాల్లో బోధించేవారని, చాలామంది గురు వులు ఉండేవారని తెలుస్తుంది. ఆ నాగరికత భూమికి కలిగిన సహజ పరిస్థితుల మార్పు వలన, నశించిపోయింది. ప్రజలు వలసలుగా వివిధ దేశాలు చేరారు. ఏవో కొందరి గురువుల దగ్గర మాత్రం నిక్షిప్తమై అతి రహస్యంగాను, పవిత్రంగానూ రేకీ ఉండిపోయింది.

ఆ రేకీ శక్తిని గత శతాబ్దంలో వెలికితీసి మానవాళి సుఖ శాంతుల కోసం అందించిన ఘనత జపాను దేశస్థుడయిన "డా॥ మికావ్ ఉసైకి దక్కుతుంది. ఆయనకి శత సహస్ర నమో వాకములు.

## క్లుప్తంగా ఆయన చరిత్ర :

జపాను క్యోటో విశ్వ విద్యాలయంలో డా. ఉసై 1800 శకం చివరి భాగంలో పని చేసేవాడు. ఒకరోజు విద్యార్థులు ఆయనని ఒక ప్రశ్న వేశారు. హిందూ, టిబెట్ దేశాలలో యోగులు కొందరు ఏ శక్తి ద్వారా స్పర్శ మాత్రంతోనే రోగులను విముక్తులుగ చేసే వారు అని. దానికి జవాబు డా॥ ఉసై దగ్గర లేదు. దీర్ఘంగా ఆయన ఆలోచించేడు. 'అవును, ఏమిటా ఆ శక్తి?' స్వయంగాము తెలుసుకోదలచి ఆయన ఉద్యోగానికి

రాజీనామా చేసి అనేక సంవత్సరాలు బౌద్ధ గురువులతోను, మత ప్రవక్తలతోను చర్చలు జరిపాడు.

అమెరికాలో 7 సం॥ పాటు మతాల్ని పరిశోధించాడు. ఎవరికీ ఏదీ ఇతమిత్థంగా తెలిసినట్లు చెప్పలేదు. పవిత్ర హిందూ, టిబెట్ గ్రంథాలు సంస్కృత భాషలో ఉండడం వలన ఆయన సంస్కృతం నేర్చుకున్నాడు. చైనా, టిబెట్, ఉత్తర హిందూ దేశంలోని గురువులతో చర్చలు జరిపాడు. గ్రంథాలన్నీ తిరగేసాడు. చివరకు జపాను చేరి అతి పురాతనమైన బౌద్ధ సూత్రాలని నిశితంగా పరిశీలించాడు.

చివరికి భగవత్కృప కలిగింది. అంత వరకు అన్వేషిస్తున్న విషయాలు ఆయనకు కొన్ని సంస్కృత గ్రంథాలలో కన్పించాయి. కొన్ని సూత్రాలు, చిహ్నాలు అతి సూక్ష్మంగాను, సులువుగాను ఉన్నాయి. బుద్ధ భగవానుడు వాటిని ఉపయోగించే మానవుల రుగ్మతలని నిర్మూలించేవాడు. కానీ ఒక చిక్కు వచ్చింది. ఆ చిహ్నాలు, సూత్రాలు ఎలా ఉపయోగించాలి? శక్తివంతంగా ఎలా చెయ్యాలి అనే విషయాలు చెప్పబడలేదు. డా॥ ఉసై గురువుల సలహాలతో ఆ విషయాలు తపస్సు ద్వారానే లభిస్తాయని గ్రహించాడు.

దగ్గరలో ఉన్న పవిత్ర పర్వతం 'కొరియామా'ని ఎక్కి అక్కడ 21 రోజులు ఉపవాస దీక్షతో తపస్సు చేసాడు. అది 21వ రోజు. ఉదయం, ఇంకా చీకటిగానే ఉంది. ఆయన ధ్యానం చేసేలోపల తూర్పు దిశలో ఒక కాంతి రేఖ కన్పించింది. అది అతి త్వరగా పెద్ద గోళాకృతి పొంది తనవైపే ప్రయాణించింది. ఆయన మొదట్లో దానిని చూచి భయం చెంది పారిపోవాలనుకున్నాడు. ఆ కాంతి అతని ముందు నిలబడి ఉంది. తను ధైర్యం పొందాడు. ఇన్నేళ్ళ అన్వేషణకి ఫలితం వచ్చిందనుకున్నాడు. అంతలో ఆ కాంతి ఆయన ఆజ్ఞా చక్రాన్ని దూసుకుని లోపలికి ప్రవేశించింది. కొంచెంసేపు ప్రాణం పోయిందనుకున్నాడు. తెలివి వచ్చేసరికి ఆయన చుట్టూ అద్భుతమైన కాంతి నిండి ఉంది. అతని శరీరం అనంతమైన ఆనందంతో ఆ కాంతిలో తేలుతోంది. తన చుట్టూ ఇంద్రధనుస్సు రంగులతో లక్షలాది వెలుగు బుడగలు నాట్యమాడేయి.

తర్వాత ఆయన సూత్రాలలో చూచిన సంస్కృత చిహ్నాలు ఒక్కొక్కటి ఆయన ముందు ఆవిర్భవించాయి. అవి మెరుస్తూ కాంతివంతంగా బంగారు రంగులో ఉన్నాయి. ''అవును అవే నేను చూచినవి'' అనుకున్నాడు. ఆ చిహ్నాలన్నీ ఆయన మస్తిష్కంలో ధృవపరచబడే వరకూ ఉండి, ఉపయోగ మార్గం తెలిసేంత వరకు కన్పించాయి.

ఈ చిహ్నాలు గ్రహించు. మరువవద్దు. పోగొట్టుకోవద్దు'' ఎవరో చెప్పినట్లు ఆయనకు తోచింది. ఆయన ఆనందాతిశయంతో అన్నాడు. 'అవును. నేనన్నీ ఆస్వాదించాను. వీటిని మరువను, పోగొట్టుకోను'' అన్నాడు. అలా చాలాసేపు ఆనందంలో ఉన్నాడు. తెలివి వచ్చి చూచేసరికి సూర్యుడు నడినెత్తి మీదకి వచ్చాడు.

ఆయనలో అద్భుతమైన శక్తి చైతన్యంతో నిండింది. 21 రోజులు ఉపవాసపు ప్రభావం ఏమీ లేదు.

అదే ప్రప్రథమ రేకీ ఉపదేశం. అదే ఆయన ద్వారా పునరుద్ఘాటం చెయ్యబడిన రేకీ శక్తి!

తర్వాత ఆయన నూతనోత్సాహంతో కొండ క్రిందికి దిగసాగాడు. కాలి బొటనవ్రేలు రాయికి తగిలి చితికి రక్తం కారడం జరిగింది. ఆయన బాధతో దాన్ని చేతితో అదిమి పట్టుకున్నాడు. ఆశ్చర్యం. అది వెంటనే నయమయ్యింది. అది ఆయన రేకీ ద్వారా జరిగిన మొదటి అలౌకిక ఘటన (Miracle).

త్రోవలో ఒక చోట ఆగి ఆహారం భుజింప సాగాడు. అందరూ ఆయన్ని చూచి 21 రోజుల ఉపవాసానంతరం అలా ఆహారం తినడం ప్రమాదం అన్నారు. ఆయనకేమీ అలాంటిది జరగలేదు. అది రెండవ అద్భుతం. ఆ వసతి గృహపు యజమాని మనుమరాలు పంటి నొప్పితో అమితంగా బాధపడుతోంది. డా॥ ఉసై గారి హస్త స్పర్శ వలన ఆమె ముఖం వాపు తగ్గి పన్ను నొప్పి పూర్తిగా తగ్గడం ఆరంభించింది. అది ఆయన చేసిన మూడవ అద్భుతం. ''తాతా! ఈయన సాధారణ బౌద్ధ భిక్షువు కాదు సుమా'' అంది ఆమె.

తర్వాత ఆయన జపానులోని 'క్యోటో' పట్టణానికి చేరాడు. అక్కడున్న అనేకమందికి వ్యాధి నిర్మూలన చేసాడు.

బిచ్చగాళ్ళ నిలయానికి వెళ్ళి వాళ్ళ బాధలను చూచి జాలిపడ్డాడు. తనకు ఉన్న విద్యతో, శక్తితో వాళ్ళందరి బాధా నివృత్తి చేసాడు. అలా కొంత కాలం గడిపాడు.

కొన్నాళ్ళకు వీళ్ళలో కొంతమంది బిచ్చగాళ్ళు తిరిగి వచ్చారు. డా॥ ఉసై వాళ్ళని ప్రశ్నించాడు, ఎందుకు తిరిగి వచ్చారని. దానికి వాళ్ళు అన్నారు కదా ''మీరు మమ్మల్ని నయం చేసారు. మాకు రోగాలు పోయాయి. ఇళ్ళకు వెళ్ళిపోయాము. కాని అక్కడ భార్య, పిల్లలు, పనులు ఆ సంసార బాధలు మాకొద్దు. ఈ బిచ్చగాళ్ళ కేంద్రమే మాకు బాగుంది. అసలు ఇంతకీ మాకు చికిత్స చెయ్యడానికి మీకు ఎవరు హక్కునిచ్చారు?'' అని ప్రశ్నించారు.

ఆ జవాబులు విని డా॥ ఉసై ఆశ్చర్యపోయాడు. విలపించాడు. మనుషులను నయం చేసేటప్పుడు రేకీ ప్రక్రియలో ముఖ్యమైన కృతజ్ఞత, బాధ్యతా భావాలు వాళ్ళకి చెప్పలేదు. ఆయన అప్పటినుండి కొన్ని నిశితమైన నిబంధనలని, సూత్రాలని తయారు చేసాడు. అవి 'రేకీ' గురువులందరూ తప్పనిసరిగా పాటించాలని నిర్దేశించాడు.

(సశేషం)

# గ్రహములు - గుణములు పట్టికలు

గత సంచికలలో, నవరత్నాలు వాటి అధిపతులు, మిత్ర శత్రు క్షేత్రాలలో వాటి శుభా శుభాలు తెలుసుకున్నాం. అసలు, ఏ గ్రహానికి ఏ క్షేత్రం ఎటువంటి గుణం కలదో తెలుసుకుందాం.

స్వక్షేత్రం అంటే సొంత యిల్లు అన్న మాట. సామాన్యంగా సొంత యింట్లో ఎవరైనా ఎంత సుఖంగా, బలంగా ఉంటారో ఆయా గ్రహాలు తమ స్వక్షేత్రంలో అంత బలంగా ఉంటాయి. ఉచ్ఛ క్షేత్రాలలో ఉన్న గ్రహాలు స్వక్షేత్రంలో ఉన్నదానికన్నా బలంగా అధికారికంగా ఉంటాయి. (ఒక అధికారి తన యింట్లో కన్నా తన ఆఫీసులో ఇంకా ఎక్కువ బలవంతుడయినట్లుగా) నీచక్షేత్రంలో ఉన్న గ్రహం బలహీనుడు. మిత్ర క్షేత్రం, శత్రు క్షేత్రం అన్న మాటల అర్థం స్పష్టంగానే ఉంది గదా! ఆ క్షేత్రాలలోని గ్రహాలు బలవంతులు. అవ్వన్నీ తెలియాలంటే ఈ క్రింది పట్టికలు జాగ్రత్తగా గమనించండి.

## గ్రహములు - క్షేత్రములు పట్టిక

| గ్రహములు | స్వక్షేత్రము | ఉచ్ఛక్షేత్రము | నీచక్షేత్రము | మిత్రక్షేత్రము | శత్రు క్షేత్రము |
|---|---|---|---|---|---|
| రవి | సింహము | మేషము | తుల | ధనుస్సు, మీనము | వృషభము, మిధునము, కర్కాటకము కన్య, వృశ్చికము, మకరము, కుంభము |
| చంద్ర | కర్కాటకము | వృషభము | వృశ్చికము | మిధునము, కన్య, ధనుస్సు, మీనము | మేషము, సింహము, తుల, మకరం, కుంభం |
| కుజుడు | మేషము వృశ్చికము | మకరము | కర్కాటకము | వృషభము, మిధునము కన్య, తుల | సింహము, ధనుస్సు కుంభము, మీనము |
| బుధుడు | మిధునము కన్య | కన్య | మీనము | మేషము, వృషభము, కర్కాటకము, తుల వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము | సింహము |
| గురువు | ధనుస్సు మీనము | కర్కాటకము | మకరము | వృషభము, మిధునము సింహము, కన్య, తుల, కుంభము | మేషము, వృశ్చికము |
| శుక్రుడు | వృషభము తుల | మీనము | కన్య | మేషము, మిధునము వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము | కర్కాటకము సింహము |
| శని | మకరము కుంభము | తుల | మేషము | వృషభము, మిధునము, కన్య, ధనుస్సు మీనము | కర్కాటకము సింహము వృశ్చికము |
| రాహువు | కన్య | వృషభము | వృశ్చికము | మిధునము, కన్య, తుల, ధనుస్సు మకరము, మీనము | మేషము, కర్కాటకము సింహము, కుంభము |
| కేతువు | కుంభము | మీనము | కన్య | మిధునము, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరం, మీనం | మేషం, కర్కాటకం సింహం |

శ్రీమతి ఎ.వి.ఎల్. లక్ష్మి ఎస్.వి.

| | స్వనక్షత్రములు | వింశోత్తరీ దశాసంవత్సరములు | మిత్రగ్రహములు | శత్రు గ్రహములు | సమగ్రహములు | ధాన్యము | రత్నము | అధిదేవత |
|---|---|---|---|---|---|---|---|---|
| రవి | కృత్తిక, ఉత్తర ఉత్తరాషాడ | 6 | చంద్రుడు, కుజుడు గురువు | శుక్రుడు శని | బుధుడు | గోధుమలు | కెంపు | అగ్ని |
| చంద్ర | రోహిణి హస్త శ్రవణం | 10 | రవి బుధుడు | ----- | కుజుడు, గురువు శుక్రుడు, శని | బియ్యము | ముత్యము | వరుణుడు |
| కుజ | మృగశిర చిత్త ధనిష్ఠ | 7 | రవి, చంద్రుడు గురువు | బుధుడు | శుక్రుడు, శని | కందులు | పగడము | కుమారస్వామి |
| బుధ | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి | 17 | రవి, శుక్రుడు | చంద్రుడు | కుజుడు, గురువు శని | పెసలు | పచ్చ | విష్ణువు |
| గురు | పునర్వసు విశాఖ పూర్వాభాద్ర | 16 | చంద్రుడు కుజుడు | బుధుడు శుక్రుడు | రవి శని | శనగలు | పుష్యరాగము | శుక్రుడు |
| శుక్ర | భరణి పుబ్బ పూర్వాషాఢ | 20 | బుధుడు శని | రవి చంద్రుడు | కుజుడు గురువు | అలచందలు | వజ్రము | శని |
| శని | పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర | 19 | బుధుడు శుక్రుడు | రవి చంద్రుడు కుజుడు | గురువు | నువ్వులు | నీలము | బ్రహ్మ |
| రాహు | ఆరుద్ర స్వాతి శతభిషం | 18 | ---- | ---- | ----- | మినుములు | గోమేధకము | ------- |
| కేతు | అశ్వని మఖ మూల | 7 | ---- | ----- | ---- | ఉలవలు | వైఢూర్యం | |

ఒకడు నుయ్యి తవ్వనారంభించాడు. నాలుగైదు బారలలోతు తవ్వి నీరు పడక మరోచోటు నిర్ణయించి అక్కడ యింకా లోతుగా తవ్వాడు. కాని అక్కడా నీరు పడకపోవటంతో మరో తావును నిర్ణయించి అక్కడా మరింత లోతుగా తవ్వాడు. కాని ఫలం కలుగలేదు. చివరకు విసిగి వేసారి ఆ పనినే విడిచి పెట్టేశాడు. ఈ మూడు నూతుల లోతూ కలిపి పాతిక బారలకు కాస్త తక్కువగా వుంటుంది. ఒకచోటు విడిచి మరోచోట తవ్వనారంభించడానికి బదులు తాను పడ్డ శ్రమలో సగమైనా ఓపికతో మొదటి నూతికే వినియోగించి వుంటే అతడికి నీరు లభించేది. ఈ మతం కాదని ఆ మతం, ఆ మతం కాదని మరో మతం - యీ విధంగా మతధర్మాలను ఊరక మార్చుకొనేవారి విషయంకూడ యిలాటిదే. ఏదైనా ఒక్క మతాన్ని నమ్ముకొని దాన్నే శ్రద్ధాభక్తులతో సాధన చేస్తే విజయం తప్పక చేకూరుతుంది.

**- శ్రీరామకృష్ణ పరమహంస**



బాలశిక్ష

# మన గమ్యం
## (కథ)

క్షణం వృథా చేయకుండా, కాలాన్నీ, సమయాన్నీ, ఉపయోగించుకోవాలని చెప్పుకున్నాము. సరే ఆ కాలాన్ని ఎలా గడపాలి? వ్యర్థ ప్రసంగాలతో కాకుండా, భగవన్నామంతో, మనకి నిర్దేశింపబడిన ధర్మము ఆచరిస్తూ, మోక్షానికై ప్రయత్నించాలి.

అలాగే ఎందుకు వుండాలి, యింకో విధంగా ఎందుకు గడపకూడదు? అన్న ప్రశ్నకి సమాధానంగా ఒక కథ చెప్తాను.

సముద్ర తీరంలో ఒక నౌక బయలు దేరడానికి సిద్ధంగా వుంది. ఆ నావ తెరచాప కొయ్యపై ఒక పక్షి వ్రాలి కూర్చుంది. ఇంతలో నావ పయనించడం ప్రారంభించింది. కొంత సేపయ్యాక, ఆ పక్షి ఎగరాలనీ చూసింది. తూరుపు దిక్కుగా ఎగిరింది. ఎటు చూసినా సముద్రమే. తిరిగి వచ్చి ఆ కొయ్య మీదే కూర్చుంది. ఈసారి పడమర దిక్కుగా ఎగిరింది. ఎటుచూసినా సముద్రమే!

చేసేదేమీ లేక, మళ్లీ ఆ కొయ్య దగ్గరికే వచ్చి కూర్చుంది. ఇంకోసారి ప్రయత్నించి, యింకోవైపు ఎగిరింది. ఎటు తిరిగినా అంతూ దరీ లేని సముద్రం. ఇక లాభం లేదనీ, ఎగిరే ప్రయత్నం మాని ఆ కొయ్య మీదే కూర్చుంది. కొంతసేపటికి నావ తీరం చేరింది. పక్షి స్వేచ్ఛగా ఎగిరిపోయింది.

మనమూ అంతే. సముద్రంలోని పక్షి ఎంత ఎగిరినా తీరం చేరక తప్పదు. మనం కూడా మోక్షమనే తీరం చేరక తప్పదు. సముద్రంలో పక్షిలాగా ఎంతో ప్రయత్నించినా అది సాధ్యమూ కాదు. అందుకనే భగవంతుడనే నావపై, భగవన్నామమనే కొయ్యని ఆశ్రయిస్తే ఆ నావే మనల్ని ఏ మాత్రం శ్రమపడకుండా తీరం చేర్చుతుంది.

(ఈ కథకి ఆధారం విష్ణు సహస్ర నామ పారాయణ సందర్భంలో ఒక భక్తుడు చెప్పినది)

**ఎం. సత్యవతి**

## 'విజ్ఞానం పోటీ – 9' ఫలితాలు

గత సంచిక (మార్చి '2000) లోని 'విజ్ఞానం పోటీ-9'కి వచ్చిన సమాధానాలు మే సంచికలో ప్రకటించ బడును. పాఠకుల కోరిక మేరకు ఈవిధముగా మార్పు చేయబడినది.

– *సంపాదకుడు*

## జానపదం - రామపదం

కోతులు పుట్టిందెందుకురా?
కొమ్మలు విరిచేటందుకురా.
కొమ్మలు విరిచేదెందుకురా?
వారధి గట్టేటందుకురా.
వారధి గట్టేదెందుకురా?
లంకకు పోయేటందుకురా.
లంకకు పోయేదెందుకురా?
రావణు గొట్టేటందుకురా?
రావణు గొట్టెదెందుకురా?
సీతను తెచ్చేటందుకురా.
సీతను తెచ్చేదెందుకురా?
రామునికిచ్చేటందుకురా

*(ప్రాచీన జానపద గీతం)*

## కంఠస్థం చేయదగిన శ్లోకం

***శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయం***
***సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం।***
***ఆజానుబాహుమరవింద దళాయతాక్షం***
***రామం నిశాచరవినాశకరం నమామి॥***

*"లక్ష్మీసహితుడైన రాఘవుని, దశరథుని కుమారుని, అప్రమేయుని (కొలత కందని వానిని), సీతాపతిని, రఘువంశంలో రత్నదీపంలా ప్రకాశించిన వానిని, ఆజాను బాహుని, పద్మదళము వలె విశాలమైన కన్నులు కలవానిని, రాక్షసులను నశింప జేసిన వానిని – శ్రీరామచంద్రుని నమస్కరించుచున్నాను."*

ఈ శ్లోకంలో రామవంశం, రాముని రూపవైభవం, దనుజ భావాలను నశింప జేసే వీరత్వం (అవతార లక్ష్యం) చెప్ప బడింది.

పిల్లలు కంఠస్థం చేయదగిన సాంప్రదాయ శ్లోకాలలో ఇది ఒకటి.

# విజ్ఞానం పోటీ - 10

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -10'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 15 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు మే 20వ తారీఖులోపు పంపాలి.

1. 'విష్ణు సహస్ర నామ స్తోత్రం' ఏ గ్రంథంలో చెప్పబడింది?
2. దక్షయజ్ఞ వినాశనం కోసం శివుని జట నుండి ఉద్భవించిన వాని పేరు?
3. నటరాజస్వామి ఏ క్షేత్రంలో నున్నాడు?
4. నారదుడు ఎవని కుమారుడు?
5. ఉగాది పండుగ ఏ తెలుగు మాసాన, ఏ తిథిని వస్తుంది?
6. శ్రీకృష్ణుడు పుట్టిన తిథి?
7. 'హేరంబుడు' అనే పేరు ఏ దేవునికి ఉంది?
8. సీతాదేవి తండ్రి పేరు?
9. 'వైనతేయుడు' అని ఎవరిని అంటారు?
10. శ్రీరామకృష్ణ పరమహంస పూజారిగా కొలిచిన దేవి పేరు?

# హితవచనం

సంసార విషవృక్షస్య
ద్వేఫలే అమృతోపమే ।
కావ్యామృతరసాస్వాదః
సజ్జనైస్సహ సంగమః ॥

"ఈ జీవితమనే బాధల విషవృక్షానికి రెండే రెండు అమృత ఫలాలున్నాయి. ఒకటి కావ్యామృత రసాస్వాదం, రెండు - మంచి వారితో సాంగ్యతం."

మంచి పుస్తకాలని చదివితే - మంచి ఆలోచనలు, స్పందనలు కలుగుతాయి. మంచివారి స్నేహం మనపై మంచి ప్రభావాన్ని చూపించి, జీవితాన్ని సక్రమంగా, ఆనందమయంగా ఉంచుతుంది.

మంచి మంచి కావ్యాలు చదవడం బాల్యం నుంచి అలవాటు చేయాలి. కనీసం మహాకవుల పేర్లు, వారి కావ్యాల పేర్లు, అందులో విశేషాలు చిన్నప్పటి నుండీ పరిచయం చేస్తూ, ఆసక్తి కలిగిస్తే... క్రమంగా పిల్లలు వాటిని అర్థం చేసుకోగలిగే స్థితికి వెళతారు.

ఉత్తమ భావాలున్న కావ్యాలు చదివి, ఆలోచించి పొందే ఆనందం 'రసానందం' అంటారు. అది మంచి సంస్కారాలనిచ్చి, ఉన్నత జీవనాన్ని సమకూర్చుతుంది.

## మహాభారత ప్రశ్నోక్తి - 6కి జవాబులు

21. తన వైభవం చూసి పాండవులూ ద్రౌపదీ మనసులో కుమిలిపోవాలని అర - 5-350
మిత్రజన మోదంబును శత్రుజన భేదంబును గదా
సంపదలకు దగియెడు ఫలంబు అని కర్ణుడు ప్రేరేపిస్తాడు.
22. మాంసం అమ్ముకొనే బోయవాడు : కౌశికునకు పతివ్రత పంపితే కౌశికుడు ధర్మవ్యాధుని దగ్గరకు వెళ్ళి ధర్మములు వింటాడు.
23. భీముడు : జూదమాడినందుకు. అపుడు అర్జునుడు వారించారు. సభా - 2-223.
24. దుర్యోధనుని సేవకుడు : ద్రౌపదిని సభకు తీసుకురావడానికీ అనుద్యూతానికి ధర్మరాజుని తీసుకురావడానికీ ఇతడే వెళ్ళాడు.
25. భృగుడు : గర్భవతి అయిన తన భార్య పులోమను అగ్నిప్రజ్వరిల్లజేయమని భృగుడు నదికి వెళ్ళాడు. ఇంతలో పులోముడనే రాక్షసుడు వచ్చి ఆమెను చూశాడు. "ముని ఉన్నారా?" అని అగ్నిని అడిగాడు. లేదని అగ్ని సమాధానం చెప్పాడు. వెంటనే ఆ రాక్షసుడు పులోమను ఎత్తుకొని పోయాడు. అపుడు భృగుడు అగ్నిని సర్వభక్షకుడవు కమ్మని శపించాడు. ఆది 1-139
26. సర్వదమనుడు : అతడు అడవిలోని జంతువులన్నిటినీ దమించేవాడు (అణచి ఉంచేవాడు) అందుచేత సర్వదమనుడయ్యాడు.
27. ధౌమ్యుడు : ఇతడు పాండవుల పురోహితుడు. 4-1-117
28. యుయుత్సుడు.
29. జర అనే రాక్షసిచే సంధింపబడినవాడు.
30. కర్ణుడు :
ఎల్లవారు నెఱుగనొల్లని ధర్మువు
బేల! నీకు చెప్పనేల వలసె?
చిఱుతవాని కింత తఱుసంటి పలుకులు
సన్నె వృద్ధజనములున్నచోట
అని వారించాడు. సభా 2-228
31. పృథ యొక్క కొడుకు కనుక : సంస్కృతంలో పార్థ శబ్దః పాండవులందరికీ ప్రయోగించారు.
32. మనస్సు : గాడ్పు కంటె మనసు కడు శీఘ్రగతి అరణ్య 7-434

# పిప్పళ్ళు

త్రిఫలాల వలెనే, సమాన లక్షణాలున్న మరో మూడు ద్రవ్యాలను ఒకటిగా చేర్చి, ''త్రికటు కాలు'' అని నామకరణం చేశారు, ఆయుర్వేద సంహితకారులు. అవి శొంఠి, మరీచం (మిరియాలు), పిప్పలీ (పిప్పళ్ళు). ఈ సంచికలో పిప్పళ్ళ గురించి పరిచయం చేస్తాను. సంస్కృతంలో పిప్పళ్ళని - ''పిప్పలీ'' అంటారు. ఆధునిక వృక్షశాస్త్రం పిప్పళ్ళని మిరియాల జాతిలో చేర్చింది. (పిప్పలిని - Botanicalగా Piper Longum అనీ, మిరియాలని Piper Nigrum అనీ అంటారు.)

పిప్పలి వీర్యపరంగా మిరియాల కంటె మృదువయినది. తీగకి కాసిన ఎండుకాయల్ని ప్రధానంగా ఔషధంగా వాడతారు. దీని వేరుని 'పిప్పలీమూలం' అనే పేరుతో మందుల్లో చేర్చుతారు.

- శొంఠి, మిరియాలలాగానే, పిప్పళ్ళు కూడా ఆకలిని కలిగేలా చేస్తాయి. జీర్ణశక్తిని పెంచుతాయి.
- ఉబ్బసం (Bronchitis) ఉన్నవారు పిప్పళ్ళతో కషాయం కాచి తాగడం వలన ఉపశమనం కలుగు తుంది.
- 'అకారణం'గా శరీరం శుష్కించిన వారు రోజూ రెండు పూటలా, గ్లాసుడు ఆవు పాలలో దాదాపుగా ఒక చెంచాడు పిప్పలీ చూర్ణం కలుపుకుని తాగుతూన్నట్లయితే, నెమ్మదిగా శరీరం సామాన్య స్థితికి వస్తుంది. పిప్పలీ చూర్ణం వలన, తాగిన పాలు జీర్ణమయి శరీరానికి శక్తినిస్తాయి.
- కీళ్ళనెప్పులతో బాధపడేవారు పిప్పలీ చూర్ణం ఒక గ్రాము ప్రతిరోజూ రెండు పూటలా గోరువెచ్చని నీటితో రెండు నెలల పాటు వాడాలి.

ప్రసవించిన స్త్రీలలో రక్తస్రావం అధికంగా కాకుండా ఉండడానికి - పిప్పళ్ళతో తయారయిన లేహ్యాలూ మొదలయినవి వాడడం సాధారణ విషయం.

రోగి ప్రకృతిని, రోగ ప్రకృతిని అనుసరించి, పిప్పళ్ళని తేనె, నెయ్యి, చక్కెర, సైంధవ లవణం - మొదలయిన ద్రవ్యాల అనుపానంతో వాడతారు. పిప్పళ్ళని వాతాహరంగా వాడవలసినప్పుడు శొంఠిలో కలిపి; కఫహరంగా వాడాలంటే మిరియాలతో కలిపి వాడుతూంటారు.

పిప్పళ్ళు - 'పిప్పలీ చూర్ణం'గా వాడకం తక్కువ. పిప్పలీ ఆసవం, గుడపిప్పలి అనే పేర్లతో లభిస్తోంది. రకరకాల లేహ్యాలలో, ఆసవ అరిష్టాలలో, మాత్రలలో పిప్పలి తప్పనిసరిగా ఉంటుంది.

## త్రికటుకాలు

శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు - విడి విడిగా కంటె మూడింటినీ కలిపి (త్రికటు కాలు), వాడడం వలన మరింత ప్రయోజన కరంగా ఉంటుంది.

శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు - సమాన భాగాలలో తీసుకోవాలి. శొంఠి, పిప్పళ్ళు - మందాగ్ని మీద వేయించి, చూర్ణం చేయాలి. మిరియాలని, ఎండబెట్టి పొడి చెయ్యాలి. మూడింటినీ కలిపి వస్త్ర గాలనం చేసి ఉంచుకో వాలి. (త్రికటు చూర్ణం మార్కెట్లో రెడీగా కూడా దొరుకుతుంది).

త్రికటు చూర్ణం - ఆకలి పెంచుతుంది. జీర్ణ శక్తిని పెంచుతుంది. ఒక గ్రాము చూర్ణం, ప్రకృతిని అనుసరించి తేనెతో కానీ, పంచ దారతో కానీ, వేడినీళ్ళతో కానీ తీసుకోవచ్చు.

ఏ వ్యక్తి అయినా స్పృహ తప్పి పడిపోయి నట్లయితే, కొద్దిగా త్రికటు చూర్ణాన్ని నీళ్ళతో నూరి, వడబోసి, ఆ నీటిని నాలుగు చుక్కలు రెండు నాసారంధ్రాలలోనూ వేసినట్లయితే, స్పృతిలోకి వస్తారు. (తీవ్ర వ్యాధుల వలన కాక, సాధారణ కారణాల వలన స్పృహ కోల్పోయినప్పుడు మాత్రమే, ఈ చుక్కల వలన ప్రయోజనం ఉంటుంది).

పిత్త ప్రకృతి కలవారికి, త్రికటు చూర్ణం అనువయిన ఔషధం కాదు. ✦

డా॥ గాయత్రీదేవి

## రామనామం



రమన్తే యోగినోஉనన్తే
సత్యానన్దే చిదాత్మని।
ఇతి రామ పదేనా సౌ
పరం బ్రహ్మాభిధీయతే॥

సత్య చైతన్య ఆనందమయమైనది పరబ్రహ్మ. యోగులందరూ తమ సాధనలకు ఫలంగా ఆ బ్రహ్మమునందే రమిస్తున్నారు (ఆనందిస్తున్నారు). అందుకే ఆ పరబ్రహ్మాన్ని 'రామ' అన్నారు. 'రామ' అంటే పరబ్రహ్మమే.

–అధ్యాత్మరామాయణం

# దారిద్ర్యమోచన స్తోత్రమ్
## శ్రీలక్ష్మి అష్టోత్తర శతనామాలు

"విద్యావారిధి", అద్వైతసిద్ధిరత్నాకర
డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి

**ధర్మనిలయాయై నమః**

ధర్మమున్న చోటుండునది. ధర్మమే జగత్తునకు ప్రతిష్ఠ. మానవులకు గల్గు సుఖములు ధర్మము యొక్క ఫలములే. ధర్మమన్నది వేదము మానవులకు సుఖము కల్గుటకై బోధించునవి.

ధర్మము మానవులకు రక్ష. శ్రీరాముడు అడవికి వెళ్ళినప్పుడు ఆయన తల్లి కౌసల్య చెప్పిన మంచి మాట – శ్రీరామా! ఏ ధర్మమును నీవు పాలించుచున్నావో, అనుష్ఠించుచుందువో ఆ ధర్మము నిన్ను ఎల్లప్పుడు కాపాడునుగాక. "ధర్మో రక్షతి రక్షితః" అని నానుడి. రక్షింపబడిన ధర్మము మనల కాపాడునని అర్థము.

ఆ ధర్మమే తనకు వాసస్థలముగా యున్నది. శ్రీమహాలక్ష్మి. అంతేకాక జగన్మాత అనుగ్రహించిన వారికే ధర్మానుష్ఠానము సాధ్యమగును. ధర్మమార్గమున యుండవలెనని చాలమంది సంకల్పింతురు. కాని ధర్మమును అనుష్ఠించుట జగన్మాత యనుగ్రహము వలననే కల్గుననుట నిక్కచ్చి.

**కరుణాయై నమః**

కరుణయనగా తనకన్న తక్కువ పరిస్థితి యందున్న వారిపై కల్గు మనోభావము. వారికి మనవల్ల వీలైనంత వఱకు సహాయపడవలెనను కోర్కె. ఇది ఆత్మగుణములలో చాలా ముఖ్యమైనది. దీనినే దయ యనియు అందురు.

మైత్రి, ముదిత, కరుణ మొదలగు గుణములు మానవునికి ఆధ్యాత్మిక మార్గమున ముందంజ వేయించునవి. యోగ సూత్రకారులకు పతంజలి ఈ గుణములను అవశ్యము ప్రతి యోగియు అలవరచుకొనవలెనని బోధించిరి. ఈ గుణములు అతిశయముగ గల్గినది లోకమాత. ఆమె ధ్యానము వలనను, ఆమెను పూజించుట వలనను మానవులకా గుణములు నిశ్చయముగ లభించును.

**లోకమాత్రే నమః**

జగమునకు తల్లి. ప్రపంచమందున్న చరాచరములు జీవరాశులు ఈ తత్వమందుండే వచ్చినవి. "యతో వా ఇమాని భూతాని జాయంతే" (తై.ఉ) యను ఉపనిషద్వచనము దీనినే తెల్పుచున్నది. ప్రతి మానవుని తన తల్లి ఎలా ప్రేమతో వాత్సల్యముతో పెంచునో ఆ విధముగనే జగన్మాతయు మనల వాత్సల్యముతో కాపాడగలదు.

"యా దేవీ సర్వ భూతుషు మాతృ రూపేణ సంస్థితా" అని మార్కండేయ పురాణ వచనము. జగన్మాతయే అంధఱకు తల్లిగాగలదని తెల్పును. లోకములను కొల్చునను అర్థమును ఈ నామమునకు కలదు. మాతా యనగా కొలబద్ధయని భావము. ప్రతివానికి ఎంత పుణ్యము గలదు అని చూచి దానికి తగినంత ఫలములనొసగునది యని అర్థము. వైషమ్య భావములు లేక ప్రతివానికి వాని కర్మకు తగినంత ఫలము నొసగునది శ్రీమాత.

**పద్మప్రియాయై నమః**

పద్మమని తామర పుష్పమునకు పేరు. తామర పుష్పము లక్ష్మీదేవికి చాలా ప్రియమైనది. ఎల్లప్పుడు పుష్పమును చేతుల యందు ధరించును. తామర పుష్పము మన హృదయమునకు ప్రతీక. తామరపుష్పము సూర్య కిరణములు సోకగా వికసించును. ఆ విధముగనే మన హృదయమును తల్లి యందలి భక్తియు, ఆమె ప్రసాదించు జ్ఞానము సంబంధించిన క్షణమే వికసించును.

హృదయము పరిపక్వమై మోక్షమునకు దారినిచ్చును. అందులకే హృదయవాసిని జగన్మాత. ఆమె మహావిష్ణువు యొక్క వక్షస్థలమందు, ఆయన హృదయ పద్మమందు శాశ్వతముగ వసించును. ఆమె ఆసనమును తామరయే. వికసించిన తామరయందు తాను కూర్చొని తామరను చేత ధరించి తామర పుష్పము వలె మన మనస్సు నుంచు కొనవలెనని సూచించుచుండును జగన్మాత.

**పద్మహస్తాయై నమః**

ఎల్లప్పుడు చేతులయందు తామర పుష్పమును ధరించునదని అర్థము. తామర నీటియందు పుట్టును. నీటివలననే పెరుగును నశించినదియు నీటియందే. కాని ఆ తామరాకునకు నీటిబిందువులు అంటవు. "పద్మ పత్రమిదాంభసా" అని గీతావచనము. అట్టే మానవులు సంసారమందున్నప్పటికి, ఆ సుఖ దుఃఖములతో సంబంధించక సాక్షి స్వరూపముగా యుండవలెనని వేదములు బోధించును. అట్టి మనః పరిపాకమును తాను ఇవ్వగలదని సూచించుటకే లక్ష్మీదేవి తన చేతి యందు పద్మమును ధరించును.

**పద్మాక్ష్యై నమః**

పద్మము వంటి కళ్ళు గల్గినది శ్రీదేవి. పద్మము యొక్క రేకులు దీర్ఘముగను, తెలుపుతో కలిసిన ఎఱుపుగను యుండును. ఆవిధముగనే జగన్మాత కండ్లు సైతము సువిశాలముగ చెవుల వఱకు యుండును. అవి ఆమె సౌందర్యమును అపురూపముగా చేయును. ఆమె కడకంటి చూపు అరుణ వర్ణమై ఎవరిపై ప్రసించునో వారు సకల సంపదలతో విలసిల్లగలరు. అంతేగాక సకల సద్గుణములకాటపట్టై లోకోత్తరముగ అందఱిచే కొనియాడబడిగలదన్న భావమును పద్మాక్షియను నామము తెల్పును. ✦

యు.యస్.మూర్తి

# భారతదేశ చరిత్ర - VII

మెగస్తనీసు 'ఇండికా'లో ఇంకా ఇలా అన్నారు -

''డయోనిసోస్ ఇండియాను వదలి వెళ్తూ తన సహచరుడయిన 'స్పాటెంబస్' (Spatembus)ను రాజుగా చేశాడు. అతడు 52 సంవత్సరాలు పరిపాలించాడు. ఆ తరువాత అతని కుమారుడు బౌడ్యాస్ (Boudyas) రాజై ఇరవై సంవత్సరాలు పాలించాడు. అలా అనేక తరాలు రాజరికం సాగింది.''

''హిరాకిల్స్ నిజానికి భారతీయుడే. ఇతనిని సౌరసెనోయ్ (Sourasenoi), మేథోరా (Methora), క్లీసోబారా (Cleisobara) ప్రజలు ప్రత్యేక గౌరవాలతో చూశారు. ఇతని ఏకైక కుమార్తె పండయ్యా (Pandaia). ఆమె పాలించిన ప్రాంతానికి కూడా ఆమె పేరే వచ్చింది. హిరాకిల్స్ సముద్రం నుండి మార్గరిత (Margarita) అని పిలువబడే ముత్యాన్ని కనుగొని దాన్ని కుమార్తెకు కానుకగా ఇచ్చాడు.

''పండయ్యా హిరాకిల్స్‌కి జీవిత చరమాంకంలో పుట్టింది. అతడు తన అవసాన దశలో, తన కుమార్తెకు తగిన వరుడు లభించకపోవడం వల్ల - తన వంశం దేశంలో నిలపాలని - తానే ఆమెతో సంగమించాడు. (ఆమెకు ఏడు సంవత్సరాల వయసులో).''

''డయోనిసోస్ నుండి సాండ్రకోట్టస్ వరకు 153 మంది రాజులు 6042 సంవత్సరాలు పాలించారు. ఈమధ్యకాలంలో ప్రజా ప్రభుత్వాలు మూడు వచ్చాయి. ఒకటి - సంవత్సరాలు, ఒకటి 300 సం॥లు, మరొకటి 120 సం॥లు.

''భారతదేశంలో 118 రకాల తెగల ప్రజలు ఉన్నారు. పాలిబోత్ర తరువాత స్థానం (బలంలో) ఆంధ్రులది.''

★ ★ ★

మెగస్తనీసు చెప్పినట్లు పై చరిత్రకారులను ఒకసారి వివరంగా పరిశీలిద్దాం.

1) మెగస్తనీసు గ్రీకు దేశీయుడు. అతడు వ్రాసినట్లు చెప్పబడిన 'ఇండికా' నుండి ఎత్తి వ్రాశామని చెప్పిన వాళ్లందరూ గ్రీసు దేశీయులే.

2) గ్రీసు దేశ చరిత్ర పరిశీలిస్తే, మనం ఇప్పుడు గ్రీకులని పిలిచేవాళ్లు, నిజానికి అక్కడి అసలు నివాసీయులు కాదు. అక్కడ క్రీ.పూ. 3వ సహస్రాబ్దిలో ఏజియన్ (Agean) నాగరకత ఉండేది. అదే కాలంలో ఈజిప్టును 12వ వంశం రాజులు పాలించారు. క్రీ.పూ. 1300 చుట్టుప్రక్కల గ్రీకును ఏఖియన్ (Achaean)లు ఆక్రమణ ఆరంభమైంది. ఏఖియన్‌లు ఆర్యభాష మాట్లాడేవారట. వారు గ్రీకుకు పశ్చిమోత్తర ప్రాంతం ''బాల్కన్ ద్వీపకల్పం'' (Balkhan Peninsula) నుండి వచ్చారట. ఆ తరువాత అదే ప్రాంతం నుండి అయోనియన్ (Ionian)లు, థెస్సాలియన్ (Thessalian)లు, బొయెటియన్ (Boiotian)లు, డోరియన్ (Dorian)లు క్రమంగా దాడిచేసి ఆక్రమించుకున్నారు. ఇది క్రీ.పూ. 800 వరకు సాగింది. ఈ మధ్య కాలంలోనే హోమర్ (Homer), ఇలియడ్ (Iliad) గ్రంథాలు వ్రాయబడ్డాయి. ఇలా వచ్చి ఆక్రమించుకున్నవారి యుద్ధ నాయకులనే వారు దేవతలుగా పూజించారు. డయోనిసోస్, హిరాకిల్స్‌లు అటువంటి గ్రీకు దేవతలే. గ్రీకు దేవతలకు మూల పురుషుడు జియస్ (Zeus). డయోనిసోస్ జియస్ తొర నుండి పుట్టాడని అంటారు. డయొనిసోస్‌నే బేకస్ (Bachehus) అంటారు.

3) గ్రీకులు ఆరాధించే బేకస్, డయోనిసోస్, హిరాకిల్స్ మొదలైన పేర్లు మెగస్తనీసు ''ఇండికా''లో కనబడడం చూస్తే, మెగస్తనీసుకు మన ప్రాచీన భారతీయ పండితులు చెప్పిన పేర్లు మార్చి వ్రాయబడ్డాయని అర్థం అవుతుంది. మెగస్తనీసుకు భారతీయ భాషలేవీ తెలియవు. మన దేశంలోని వాళ్లే ఒక ప్రాంతం వారి పేర్లను మరో ప్రాంతం వాళ్లు పలికేటప్పుడు ఎంతో వికృతంగా పలకడం చూస్తున్నాం. మరి మరో దేశం నుండి వచ్చిన మెగస్తనీసు తనకు చెప్పబడిన భారతీయ చారిత్రక నాయకుల పేర్లను ఎంత వరకు సరిగ్గా అర్థం చేసుకుని పలకగలిగాడో అర్థం చేసుకోవడం కష్టం కాదు. ఇక ఆయన గ్రంథం నుండి ఎత్తి వ్రాశామని చెప్పిన వాళ్లం దరూ ఆయన వ్రాసిన పేర్లకు ఒక్కొక్కరూ ఒక్కొక్కలా వ్రాశారు. అందువల్ల మెగస్తనీసే మనవాళ్లు చెప్పిన పేర్లను గ్రీకు దేవుళ్ల పేర్లుగా మార్చి ఉండవచ్చు. లేదా ఆయన తదనంతరం వచ్చిన వాళ్లైనా మార్చి ఉండవచ్చు.

సశేషం

## మేషం



(అశ్విని - భరణి - కృత్తిక ప్రథమ పాదం.)

ఆరోగ్యం, మనశ్శాంతి కలదు. గాయకులకు, కళాకారులకు అనుకూలమైన రోజులు. వ్యవసాయదారులకు, శిల్పకారులకు, జ్యోతిష్య కారులకు అనుకూలత లేదు. 15వ తారీఖు నుండి అనుకున్న పనులు జరుగును. స్నేహితుల వలన భయము, అసంతృప్తి, అకారణ వైరములు కలుగును. ధన వ్యయము జరుగును. మాసము చివర అనారోగ్యము కలుగును. వీరు మహాలక్ష్మి పూజ, ఆదిత్య హృదయము చేసుకొనవలెను.

## వృషభం



(కృత్తిక 2,3,4 - రోహిణి, మృగశిర 1,2,

కుటుంబములో శాంతి, సౌఖ్యము, ధన లాభము, కీర్తి ప్రాప్తించును. కళాకారులు, వ్యవసాయదారులు, వ్యాపారస్థులు అందరికీ అనుకూలమైన రోజులు. సంతాన వృద్ధి, బంధు మైత్రి, పెద్దల ఆదరణ, అధికార వృద్ధి కలు గును. మంచి ఆలోచనలతో వ్యవహరించగలరు. నాటక రంగ, సినీ రంగంలో ఉన్నవారికి మేలు జరుగును. గృహమందు వివాహాది శుభకార్యములు జరుగును. ఉద్యోగాలలో వృద్ధి కలుగును. కళత్రముతోను, బంధువులతోను వైరములు నిదానముగా ఆగును. ప్రయాణం వలన అలసట కలుగును.

## మిధునం



(మృగశిర 3,4 - ఆరుద్ర, పునర్వసు 1,2,3)

ఆరోగ్యము బాగుండును, గృహము నందు శాంతి సౌఖ్యములుండును. అనుకున్న పనులు నెరవేరును. వృత్తిలో మేలు కలుగును. ప్రభుత్వ, కోర్టు వ్యవహారములలో మేలు కలుగును. చతుష్పాద, జంతు వ్యాపారస్తులకు అనుకూలము. శత్రువులు అణగి వుండురు. వాహన సౌఖ్యము కలుగును. ప్లాస్టిక్. ఇనుము వ్యాపారస్తులకు లాభాలు వచ్చును. వేద పండితులకు మేలు కలుగును. కులాచారాలు పాటిస్తారు. సంసార సంతాన సుఖములు కలుగును. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి.

| ర బు | గు కు శ | | |
|---|---|---|---|
| చ శు | ఏప్రిల్, 1 2000 | | రా |
| కే | | | |
| | | | |

## కర్కాటకం



(పునర్వసు 4 - పుష్యమి 1,2,3,4 - ఆశ్లేష - 1,2,3,4)

కుటుంబము నందు మంచి జరుగును. గౌరవాభిమానములు పెరుగును. సంప్రదాయ సిద్ధముగ శుభకార్యములు జరుగును. వ్యవసాయ, పరిశ్రమలు, లాభముగా ఉండును. వైద్య వృత్తికి లాభము కలుగును. కోర్టు, ప్రభుత్వము, రాజకీయము, వీటియందు లాభముండును. వస్త్ర లాభము ఉండును. నూతన వస్తువులు కొందురు. పోలీసు, రక్షణ శాఖల వారికి గణిత శాస్త్రజ్ఞులకు మంచి కాలము. ఈ మాసమంతయు ఈ రాశి వారు సర్వతోముఖాభివృద్ధిగా వుందురు.

## సింహం



(మఖ 1,2,3,4 - పుబ్బ 1,2,3,4-ఉత్తర 1)

గృహమందు సౌఖ్యము, మనశ్శాంతి, బంధుమైత్రి, ధన ఆదాయము, ఆరోగ్యము, స్వల్ప స్థాయిలో నుండును. వివిధ రూపములుగా ధన వ్యయము జరుగును. ఉద్యోగ, వ్యాపార, విద్యా ప్రయాణాల యందు సాహసము చేయవచ్చు. ఆరోగ్యము సామాన్యముగా ఉండును. ఋణములు చేయవలసి రావచ్చును. ఉద్యోగ, వ్యాపారము లందు నూతన ప్రయత్నము ఫలించదు. బంధు మిత్ర విరోధములు, వియోగములు కలుగును. మాసాంతములో నెమ్మదిగా అనుకూలత కలుగుట ప్రారంభించును. రవి, శుక్ర, బుధలకు, జపము, దానము చేయించుకొనుట అత్యవసరము.

## కన్య



(ఉత్తర 2,3,4 - హస్త - చిత్త 1,2.)

కుటుంబము నందు ధన నష్టము, అశాంతి ఋణములు తీరకపోవుట, సేవకుల అసహకారము కలవు. కష్ట జీవనము, కళత్రానికి అనారోగ్యము. కళాకారులకు సామాన్య ఫలితములు, ప్రయాణాలు అనుకూలించవు. అధికారుల అనాదరణ. ప్రభుత్వ ఉద్యోగులకు, భారీ పరిశ్రమలకు అనుకూలత లేదు. ఈ మాసాంతము నుండి కొద్ది కొద్దిగా అన్నివైపుల నుండి అనుకూలత కలుగును. వీరికి దరిదాపు మాసమంతా ఏవిధముగా చూచినా చెప్పుకోగలిగినంత అనుకూలత లేదు. రవి, కుజ, శనులకు జపము, దానము అత్యంత అవసరముగా చేసుకొనవలెను.



## తుల

(చిత్త - 3,4 - స్వాతి - విశాఖ - 1,2,3.)

వృత్తి వ్యాపారముల యందు అనుకూలత స్వల్పముగా వుండును. శత్రు పీడ, ఋణ బాధ, జాతి విరోధము, భార్యా సంతానముల వల్ల ఆయాసము కలుగును. అధికమైన ఋణములు చేయవలసి వచ్చును. ప్రయాణములు అనుకూలించవు. అనారోగ్యము, మనో ఉద్రేకత కలుగును. కోర్టు, ప్రభుత్వ వ్యవహారములు ఫలించవు. ధన వ్యయము అధికము. సోదర, సోదరీలతో కలహము. శస్త్ర చికిత్స కలుగు అవకాశము కలుగును. ఏవిధముగా చూచినను ఈ రాశి వారిలో ఎవ్వరికీ చెప్పుకోదగ్గ అనుకూలత లేదు. రవి, శుక్ర, బుధులకు జప దానాదులు చేయించుకొనుట ఆవశ్యకము.



## వృశ్చికం

(విశాఖ-4 - అనూరాధ - జ్యేష్ఠ)

ధన ధాన్యాభివృద్ధి, సుఖభోజనము, సేవక సౌఖ్యము కలదు. అనుకున్న పనులు నెరవేరుతాయి. వాహన సౌఖ్యం కలదు. యజుర్వేదము నందు కృషి చేయువారికి మేలు జరుగుతుంది. కళాకారులకు, గణిత శాస్త్ర జ్ఞులకు అనుకూలత తగ్గును. ప్రభుత్వ ఉద్యోగులకు మేలు జరుగును. నూతన వస్తు వస్త్ర లాభము కలదు. విద్యావృద్ధి, శాస్త్రపరిశోధనలో వ్యాపారములో ధనలాభము కలదు. రచయితలకు అనుకూలము. ఆరోగ్యం బాగుండును. బంధు జన సమాగమము, శుభకార్య నిర్వహణలు కలవు. సంతానవృద్ధి కలదు.



## ధనుస్సు

(మూల - పూర్వాషాఢ - ఉత్తరాషాఢ)

అకాల భోజనము, తాపము, మనోవేదన కలుగును. ఫ్యాక్టరీలలో వృత్తి వ్యాపారస్థులకు మాత్రము అనుకూలమైన రోజులు. ధనధాన్యవృద్ధి, బంధుమిత్ర లాభం కలదు. శుభకార్యములు జరుగును. వినోద, విహార యాత్రలు చేయుదురు. మాసాంతము నందు ఆరోగ్యము, మనోల్లాసము, శత్రు జయము, కార్యానుకూలత కలుగును. ప్రయాణములు అనుకూలించును. వీరు శని, కుజులకు శాంతి చేయించుకోవాలి. (నవగ్రహ స్తోత్రము నందలి శని, కుజ శ్లోకములు 108 సార్లు చొప్పున పఠించాలి. మూడు రోజులు).



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 - శ్రవణం - ధనిష్ఠ 1,2)

వ్యాపారమునందు, భారీ పరిశ్రమలకు, కళాకారులకు అనుకున్నంత లాభముండదు. రాజ కోపము, బంధు విరోధము, మనస్తాపము కలుగును. నూతన ప్రయత్నములు ఫలించవు. ప్రభుత్వ వ్యవహారములు సామాన్యంగా ఉండును. 15 తరువాత గృహమునందలి ఛిద్రములు శాంతించును. బంధు వృద్ధి కలుగును. వైద్య, ఉద్యోగ, వ్యాపార రంగముల వారికి లాభించును. ఆరోగ్యము కుదుటపడును. విష్ణుసహస్ర నామమును రోజుకు రెండుసార్లు మాసాంతము వరకు చదువుకోండి.



## కుంభము

(ధనిష్ఠ 3,4 - శతభిషం - పూర్వాభాద్ర 1,2,3.)

ఆరోగ్యము బాగుండును. నూతన వస్త్రలాభము కలుగును. ఉద్యోగము నందు వృద్ధి కలుగును. వాహన వ్యాపారములు చేయువారికి మంచి లాభములు కలుగును. భారీ పరిశ్రమలు బాగుగా ఉంటాయి. సజ్జన సద్గోష్ఠులలో పాల్గొంటారు. కళాకారులకు, గాయకులకు సినీ నాటక రంగాల వారికి మేలు కలుగును. గౌరవాదరములు కలుగును. వ్యాపారాలలో అధిక మేలు ప్రాప్తించును. ఈ మాసమంతయు మీకు అత్యంత అనుకూలమైన రోజులు.



## మీనము

(పూర్వాభాద్ర 4 - ఉత్తరాభాద్ర - రేవతి)

ద్రవ్య లాభము, విద్యాభివృద్ధి మొదలైన శుభఫలితములు కలుగును. నూతన వస్త్ర వస్తువులు సేకరిస్తారు. వ్యాపారము లాభదాయకంగానే ఉంటుంది. సాహసవ్యాపారములుఫలించవు. వ్యవసాయము నందు సామాన్య ఆదాయము కలుగును. సజ్జన సాంగత్యము కలుగును. ప్రభుత్వ ఉద్యోగులకు మంచి కాలము. ట్రాన్స్‌ఫర్స్, ప్రమోషన్లు కలిగే అవకాశము కలదు. విద్యా, ఉద్యోగ, వ్యాపారస్థులకు మేలు కలుగును. విద్యార్థులు మాత్రము విష్ణుసహస్ర నామం చేసుకోండి. ✦




## సౌందర్యలహరి

వివరణకర్త : డా.. జి.ఎల్.ఎన్. శాస్త్రి
ఋషిపీఠం పాఠకులకు డిస్కౌంట్ : 25%
వెల : రూ.120/-

జగద్గురువులు ఆదిశంకరుల 'సౌందర్యలహరి' ప్రసిద్ధ దేవీస్తోత్ర గుచ్ఛం. ఈ మంత్ర, కావ్య, యోగ మర్మాన్వితమైన గ్రంథానికి అనేక భాష్యాలు వచ్చాయి. ఈ నూతన గ్రంథం సరళ సుబోధకంగా, ఎంతో ఉపయుక్తంగా రూపొందించబడింది. ప్రతి శ్లోకానికీ, పద్యానువాదంతో పాటూ, వివరణ రూపంలో విజ్ఞాన శాస్త్రాన్నీ, యోగశాస్త్రాన్నీ, దేవీ వైభవాన్నీ సమన్వయిస్తూ, వ్యాఖ్యానించిన తీరు ఎంతో ఔచితీమంతంగా ఉంది.

మంత్ర శాస్త్ర రహస్యాలను విశదీకరించడం కూడా మంచి శాస్త్ర విజ్ఞాన పుష్టిని స్పష్టపరిచింది. స్వానుభవంలోకి వచ్చిన ఉపాసనా విషయాలు ఇందులో ఉండడం వల్ల స్వతంత్రాముద్ర ఇందులో ద్యోతకవౌతోంది. అమ్మవారి పట్ల శ్రద్ధాభక్తులు కలవారు అవశ్యం పఠించదగ్గ సద్గ్రంధ మిది. ముద్రణలోనూ, పుస్తకాన్ని తీర్చిదిద్దడంలోనూ ప్రత్యేకత, ఆకర్షణ కూడా జత కలిసింది.

ప్రతులకు : ది వరల్డ్ టీచర్ ట్రస్ట్,
డా. జి.యల్.ఎన్. శాస్త్రి,
మైత్రి నిలయం, 5-10-4, 2/9,
బ్రాడీపేట, గుంటూరు - 2.




## అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము

తెనుగు నేత : డా.. విద్వాన్ శివశ్రీ
వెల : రూ.18/-

శ్రీ వ్యాసమహర్షి ప్రణీతమైన అష్టాదశపురాణాలలో ముఖ్యమైన కొన్ని కథలను, ఆసక్తికరమైన అంశాలను సేకరించి డా.. విద్వాన్ శివశ్రీ పుస్తకాన్ని వెలువరించారు. మొదట పురాణాల గురించి వివరణనిచ్చి, వాటిలో ఉన్నం సార్వకాలిక సార్వజనీన విలువల్ని తెలియజేసి, అనేక పూజా విధాలను, ఉపాసనా విషయాలను అందజేశారు. నేటి సమాజ స్వరూపాన్ని బాగా అవగాహన చేసుకొని, ఉత్తేజకరమైన ధోరణిలో పురాణ విజ్ఞానాన్ని సంక్షిప్తంగా, సుబోధకంగా అందించిన తీరు ప్రశంసనీయం.

ప్రతులకు : శివశ్రీ పబ్లికేషన్స్ 9-268, శివశ్రీనివాస్, నబీ కోట, కడప - 516 003.




## మనసా స్మరామి

సంకలనకర్త : పురాణపండ శ్రీనివాస్

నిత్య పారాయణ యోగ్యమైన అనేక స్తోత్రాలను ఆకర్షణీయమైన శైలిలో అందించిన గ్రంథమిది.




## కలియుగ ధర్మాలు

సంపాదకుడు, అనువాదకుడు : దశిక కృష్ణమోహన్
వెల : ఉచితం

మహాభారతంలోని 'అరణ్య పర్వం'లో - ధర్మరాజుకి మార్కండేయుడు చెప్పిన ''కలియుగ ధర్మాలు'' మూల శ్లోకాలతో పాటూ, తేట తెనుగు అనువాదాన్ని శ్రీకృష్ణమోహన్‌గారు సులభగ్రాహ్య శైలిలో అందించారు.

వ్యాసమహర్షి భవిష్య ద్వీక్షణాన్ని పరిశీలిస్తే అబ్బురమనిపిస్తుంది. నేటి సమాజ స్వరూపం, నాటి భారతంలోని భావి కాలగాథలో ఇంత స్పష్టంగా చెప్పబడడం మన మహర్షుల తపోదృష్టిని పట్టి చూపుతోంది.

# చన్నీళ్ళకి వేణ్ణీళ్ళు

''ఏరా! నిన్న సాయంత్రం అటుగా వెళ్తూ, మీ ఇంటికి వచ్చాను. తాళంవేసుంది. ఏం, మీ ఆవిడ ఊళ్ళో లేదా?'' అని అడిగాను దార్లో కనబడిన మా బావమరిదితో.

''లేదు బావా! తను కూడా నాలుగు రోజుల క్రితమే ఉద్యోగంలో చేరింది'' అన్నాడు వాడు.

''అలాగా!'' అన్నాను నేను కొంచెం ఆశ్చర్యంగా.

''నీకు తెలియందేముంది బావా! పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. ఖర్చులు పెరిగి పోయాయి. ఏదో వేణ్ణీళ్ళకి చన్నీళ్ళుగా ఉంటుందని జేరింది'' అని వాడు అంటుండ గానే మా యింటికి చేరాము.

అంతలో మా రైతు, గుమ్మంలో ఎదు రయ్యాడు. అందరం లోపలికి వెళ్ళాం. ఒక చిన్న మామిడిపళ్ళ బుట్ట లోపల పెట్టి కూర్చు న్నాడు మా రైతు.

''ఈ మామిడిపళ్ళు ఏమిటి?'' అని అడిగాను.

''వేసవి కాలంలో పనేమీ ఉండటం లేదు బాబూ! పైగా మనవళ్ళూ, మనవరాళ్ళూ అంతా పెరిగి పెద్దవాళ్ళయ్యారు. కాలక్షేపంగా ఉం టుందని మా చిన్నాడి చేత, సెలవుల్లో మామిడి పళ్ళ వ్యాపారం పెట్టించాను. సీజన్ అయిపోయే టప్పటికి పది రూపాయలు మిగులు తున్నాయి. ఏదో చన్నీళ్ళకి వేణ్ణీళ్ళు'' అన్నాడు.

నాకెందుకో వెంటనే మనస్సు సామెత మీదికి పోయింది.

మా బావమరిది యిందాక 'వేణ్ణీళ్ళకి చన్నీళ్ళు' అన్నాడు. ఇప్పుడు మా రైతు ''చన్నీళ్ళకి వేణ్ణీళ్ళు'' అంటున్నాడు. ఇందులో ఏది రైటు? రచయిత అయిన మా బావమరిదిని తప్పందామా, పల్లెటూరి సంప్రదాయాలు తెలిసిన మా రైతుని తప్పందామా?

నాకేమీ తోచక ఆ ప్రశ్నే బయటికి అన్నాను. ఎవ్వరూ మాట్లాడలేదు.

మా బావమరిది కూతురొచ్చి, ''వేడివేడి నీళ్ళు పోసుకోవడం కష్టం గదా! అందుకని సుఖం కోసం చన్నీళ్లు కలుపుకుంటాం. అలాగే కష్టంగా ఉన్న రోజుల్లో వచ్చే మరొక చిన్న సంపాదనని 'వేణ్ణీళ్ళకి చన్నీళ్ళు'గా అభి వర్ణించుకున్నాం'' అంది.

''నేనొప్పుకోను'' అని అందుకున్న మా చిన్నవాడు, ''ఈ సామెత తెలుగువాళ్ళది. తెలుగువాళ్ళు ఎక్కువగా చన్నీళ్ళే అభి లషిస్తారు. ఎందుకంటే మన దేశం ఉష్ణ మండలం. అయితే ఎక్కువ ఉష్ణత్వానికి అలవాటయిన మనవాళ్ళు మరీ చలి కూడా భరించలేరు. అందుచేత నడి చలి కాలంలో చన్నీళ్ల పోసుకోలేక, కాసిని వేడినీళ్ళు కలుపుతారు. అందుచేత తాత్కాలికమైన ఆ చన్నీళ్ళు కష్టం తీరి, సుఖంగా ఉంటుంది. అందుచేత ఆ సామెత ''చన్నీళ్ళకి వేణ్ణీళ్ళు'' అని అన్నాడు మా చిన్నవాడు.

''అదీకాక - మానవుడు సహజంగా తొలుతగా నదుల, చెర్వుల, బావులలోని నీళ్ళతోనే స్నానం చేసి ఉంటాడు గదా! తరువాత తరువాత గజా నాగరికత బలిసి వేడినీళ్ళు స్నానం మొదలుపెట్టి ఉంటాడు. కాబట్టి మొదటివి చన్నీళ్ళే. దానికే వేడినీళ్ళు కలిసినై'' అన్నది మా చిన్నది.

''పసి పిల్లలకి వేడినీళ్ళు స్నానం చేయిస్తారా, చన్నీళ్లు చేయిస్తారా?'' అని ఓరగా అడిగింది మా బావమరిది కూతురు.

''వేడినీళ్ళే'' అంది మా చిన్నది.

''మరి ఆ వేడివేడి నీళ్ళకి, తూకం చూసు కుంటూ చన్నీళ్ళు కలుపుతారా, చన్నీళ్ళకి వేడి నీళ్ళు కలుపుతారా?'' అని అడిగింది మా బావమరిది కూతురు నవ్వుతూ.

''నీ తర్కం బాగానే ఉందిగాని, యిక్కడ మరొక విషయం మర్చిపోతున్నావు. కాగులోంచి నీళ్ళు బక్కెటులోకి వంచేటప్పుడు, మన పెద్దవాళ్ళు ఏమంటారు? ముందు బొక్కెనలోని కాసిని చన్నీళ్ళు పోసి, తర్వాత వేణ్ణీళ్ళు నింప మంటారు. అవునా?'' అన్నాడు మా చిన్నవాడు.

మా బావమరిది కూతురు మెల్లిగా, ''ఔను'' అంది.

''ఎందుకని?'' అన్నాడు వాడు.

''నువ్వే చెప్పు'' అంది అది.

''ఎందుకంటే, ఖాళీ బక్కెటులోకి వేణ్ణీళ్లు వంచితే, అవి చింది మనమీద పడతాయి. ఒళ్ళు చుర్రుమంటుంది. అలాగే, వేడినీళ్ళలోకి చన్నీళ్ళు పోసినా, పైనుంచి పడే చన్నీళ్ళ వేగానికి, క్రింది వేడినీళ్ళు చింది మనమీద పడతాయి. అప్పుడూ యిబ్బందే. అందుకని పసిపిల్లలకి ప్రధానంగా వేడినీళ్ళు పోసినా, ఆ వేడి నీళ్ళు పెద్ద కాగులోంచి చిన్న బిందెలోకో, బక్కెటులోకో వంచేటప్పుడు చన్నీళ్ళకే కలుపుతారు. కాబట్టి అక్కడ చన్నీళ్ళకే వేణ్ణీళ్ళు'' అన్నారు.

అంతలో మా ఆవిడ నవ్వుతూ, ''వేడివేడి దాని వాదన చల్లని నీ సిద్ధాంతాల్లో కలిసిపోతు న్నది గదా! అందుకని చన్నీళ్ళకే వేడినీళ్ళు'' అంది.

మా బావమరిది కూడా నవ్వుతూ, ''ఔన్లేలే అక్కయ్యా! ఎలాగైనా, అది మీ యింటికి వచ్చి చేరేదేగదా!'' అన్నాడు.

(వచ్చే నెల 'పిల్లి తల')

# దంత 'సిరి'

డా॥ గాయత్రీదేవి

శరీర పోషణకీ, ఆరోగ్య రక్షణకీ ఆహారం ప్రధానం. తీసుకుంటున్న ఆహారం సక్రమంగా జీర్ణమై శరీరానికి శక్తినివ్వాలి. జీర్ణక్రియ నోటిలో ప్రారంభమవుతుంది. ఆహారాన్ని దంతాలతో నమలడంతో జీర్ణక్రియ ప్రారంభమవుతుంది. అందుకోసం ఆరోగ్యవంతమయిన దంతాలు అవసరం. అనారోగ్య దంతాలు రకరకాల వ్యాధులకి దారితీస్తాయి. దంతాలలో, చిగుళ్ళలో సూక్ష్మ జీవులు చేరి ఇన్ఫెక్షన్ వచ్చినట్లయితే, అవి శరీరంలోని మిగిలిన భాగాలకు కూడా చేరి - ఆ భాగాలలో రోగాలు కలుగజేస్తాయి.

కాబట్టి దంతాలను పరిశుభ్రంగా ఉంచుకోవాలి. మనం తినే ఆహార పదార్థాలలోని చక్కెర భాగం, పిండి పదార్థాలు పళ్ళ మధ్యలో చేరి ఉండిపోతాయి. అందువల్ల సూక్ష్మజీవులు ఉండడానికి అనువైన వాతావరణం తయారవు తుంది. ఆ సూక్ష్మజీవులు పళ్ళు, దంతాలని నాశనం చేస్తాయి. సూక్ష్మజీవులు దంతాల మధ్య చేరకుండా శ్రద్ధ తీసుకోవాలి. అంటే దంతాలు శుభ్రంగా ఉంచుకోవాలి.

ఉదయం నిద్ర నుండి మేల్కొనగానే, రాత్రి నిద్రపోయే ముందు పళ్ళు శుభ్రంగా తోమాలి. ఎప్పుడు ఆహారం తీసుకున్నా నోటిలో నీళ్ళు పోసుకుని శుభ్రంగా పుక్కిలించాలి.

## Herbal Tooth Brushes

దంతధావనానికి వగరు, కారం, చేదు రసాలు గల కాష్ఠాలు (చెట్ల పుల్లలు) వాడాలని ఆయుర్వేదం చెబుతోంది. వేప, మఱ్ఱి, వేగిస మొదలయిన కాష్ఠాలని వాడవచ్చు.

పళ్ళు తోముకోవడానికి వాడే పుల్లని, పరిశుభ్రమైన ప్రదేశాలలో పెరిగిన చెట్ల నుండి 'మాత్రమే' గ్రహించాలి.

ఆ పుల్ల వంకరగా ఉండకూడదు. నిలువుగానే ఉండాలి. కణుపులు ఉండకూడదు. చిటికెన వేలుతో సమానమైన లావు కలిగి ఉండాలి. 12 అంగుళాల పొడవు ఉండాలి. పచ్చిగా ఉన్న పుల్లే వాడాలి తప్ప, ఎండిన దానిని వాడకూడదు. క్రిమికీటకాలు లేకుండా పరిశుభ్రంగా ఉండాలి. ఈ లక్షణాలన్నీ పరిశీలించి, దంత ధావనానికి సరయిన కాష్ఠాన్ని గ్రహించాలి. పుల్ల చివరి భాగాన్ని నమిలి మెత్తని కుచ్చులా తయారు చేసి దానితో పళ్ళు తోమాలి.

ఇలా పళ్ళు తోమడం వలన - నోటిలోని సూక్ష్మక్రిములు నశించడమే కాకుండా, నోటిలోని కఫం శమిస్తుంది. రకరకాల గ్రంథులు ప్రేరేపింపబడి, నోటికి రుచి కలుగుతుంది. జీర్ణక్రియకి సహాయకంగా ఉంటుంది.

## Herbal Tooth Powders

ప్రతివారూ దంత కాష్ఠాలని వాడకూడదు. అజీర్ణము, వాంతి, పగ్గు, జ్వరము, నోటిపూత, చిగుళ్ళ నుండి రక్తం కారడం - ఇటువంటి ఆరోగ్య సమస్యలున్న వారు - పుల్లలతో పళ్ళు తోమకూడదు.

దాల్చిని
ఏలక్కాయలు
తమాల పత్రాలు
సైంధవ లవణం

సమాన భాగాలుగా తీసుకుని పొడి చేసి, వస్త్రగాలనం చేసి, (బుట్టలో జల్లించినట్లయితే - సున్నితమైన, మెత్తని చూర్ణం తయారవు తుంది) పళ్ళు తోమడానికి వాడాలి. ఈ పొడి లోనే తేనె కలిపి పేస్టులాగా కూడా వాడవచ్చు.

## దంతాల ఆరోగ్యానికి...

★ ప్రతిరోజూ ఉదయం 2-4 చెంచాల నల్ల నువ్వులు నమలడం మంచిది.

★ చెఱకులాంటి గట్టి, పీచు ఉన్న పదార్థాలు నమలడం వలన పళ్ళ చిగుళ్ళు గట్టిపడతాయి.

★ ప్రతిరోజూ నువ్వుల నూనెతో చిగుళ్ళని మసాజ్ చేయడం వలన చిగుళ్ళు గట్టిపడతాయి. (మసాజ్ చేయడానికి నువ్వుల నూనెలో త్రిఫలా చూర్ణం కూడా కలిపి వాడవచ్చు.)

★ ఎక్కువ పిండి పదార్థాలు, పంచదార, స్వీట్లు తినడం వలన పళ్ళు పుచ్చిపోయే అవకాశం ఉంటుంది. ఎక్కువ చల్లగా, వేడిగా, పుల్లగా ఉన్న పదార్థాలు పళ్ళకి మంచివి కావు.

★ ఎప్పుడు ఆహారం తీసుకున్నా, నోటిలో నీళ్ళు పోసుకుని పుక్కిలించడం అవసరం. పుక్కిలించడానికి - త్రిఫలా, చంద్ర, మద్ది వీటితో తయారయిన కషాయాన్ని వాడవచ్చు.

# పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు

డా॥ గాయత్రీదేవి

వి.బి.యస్.ప్రసాద్ రేలంగి

ప్ర: డాక్టర్‌గారూ, మీ తృతీయా, త్రిఫలా వ్యాసం బావుంది. త్రిఫలా చూర్ణానికి సంబంధించి నాకు కొన్ని సందేహాలున్నాయి.

• త్రిఫలా చూర్ణం మంచిదా? లేక టాబ్లెట్లు కూడా వాడవచ్చా? టాబ్లెట్లలో గమ్ కలుస్తుందనీ, అందువల్ల టాబ్లెట్లు కాక చూర్ణం వాడడం మంచిది, అని అంటున్నారు.

త్రిఫలా చూర్ణంగా వాడడం శ్రేష్ఠం. టాబ్లెట్లు కూడా వాడవచ్చు. ఔషధాన్ని శాస్త్రీయంగా తయారుచేసే వారెవ్వరూ గమ్ కలపరు. అందు వల్ల స్టాండర్డ్ బావుండే ఫార్మసీ వారిది వాడడం అవసరం. (చూర్ణాలు సాధారణంగా మూడు నెలలకి, శక్తిహీనమవుతాయి. రియాక్షన్లు రావు. కాన, ఆశించిన ఫలితావు రావు).

• త్రిఫలా టాబ్లెట్లు **Impcops** వారు తయారు చేస్తున్నారా?

తయారుచేస్తున్నారు.

• త్రిఫలా ఏ కాలంలోనయినా వాడవచ్చా? **Side Effects** ఉండవా? **B.P.** ఉన్నవారు కూడా వాడవచ్చా?

త్రిఫలా ఏ కాలంలోనైనా వాడచ్చు. (''ఆయురారోగ్య అభివృద్ధి రస్తు'' వ్యాసంలో త్రిఫలా రసాయనం అనీ, ఏడాదిపాటు ప్రతిరోజూ వాడాలి అనీ రాశాను) Side Effects ఏమీ లేవు. బి.పి. త్రిఫలా వాడకానికి అడ్డు రాదు. వ్యాధి నిరోధక శక్తి పెంచే మందుగానూ, రకరాల వాధులను నయం చేసే మందుగానూ త్రిఫలా మాత్రలని 6 రూపాయిలకి ఇక్కడ కొని, అమెరికాలో రూ.500/-కి అమ్ముతున్నారు.

సంధ్య తణుకు

ప్ర : అమ్మా, మీరు, ఆయుర్వేదంలో ఇస్తున్న ఆరోగ్య సలహాలు బావున్నాయి. మా సమస్య లకి పత్రికాముఖంగా సలహా ఇస్తారని ఆశిస్తున్నాము. నా వయసు 45 సం॥లు. మధుమేహం ఉంది. దాంతో నీరసం, చర్మ రోగాలు వస్తాయి. చంద్రప్రభావటి వాడొచ్చునా లేక వేరే ఏమి వాడాలో తెలియచేయగలరు?

జ : ప్రస్తుత కాలంలో జ్వరానికి, తలనొప్పి వగైరాలకి సాధరణంగా వాడే ఇంగ్లీషు మందుల పేర్లు చాలామందికి పరిచితం. అదే విధంగా క్రిందటి తరం వారికి, ఆయుర్వేద ఔషధాలు సుపరిచితం. ఇప్పటికీ కేరళ, మహారాష్ట్రలలో సామాన్యంగా వచ్చే అనారోగ్యాలకీ, ప్రసూతులకీ ఏయే ఆయుర్వేద ఔషధాలు శ్రేష్ఠమో ఎక్కువమంది ప్రజానీకానికి తెలుసు. ఆయుర్వేదం పట్ల పాశ్చాత్య దేశాల మక్కువ ఎక్కువై, మనవారికి కూడా రకరకాల ఆధునిక ఔషధాల వల్ల కలుగుతున్న Side Effects తెలిసే ఆయుర్వేదం మళ్ళీ నిత్య జీవితంలోకి వస్తోంది. చంద్రప్రభావటి వాడవచ్చు. మూడు పూటాలా ఒక్కొక్క మాత్ర చొప్పున వాడండి. ప్రతిరోజూ మూడు పూటలా - నానబెట్టిన చెంచాడు మెంతులు నమలండి. మధుమేహం ఉన్న వారికి ''నడక'' ఉత్తమ వ్యాయామం. మీ శక్తిని అనుసరించి రెండు పూటలా 15-20 నిమిషాల పాటు వేగంగా నడవండి. Blood Sugar Controlలో ఉన్నంత వరకూ, తత్సంబంధిత ఇతర వ్యాధులు రావు. (మీరు మీ Blood Sugar ఎంత ఉన్నదీ వివరంగా తెలియచేస్తే - సరయిన ఔషధాలు సూచించవచ్చు. అలాగే మీ జీవిత విధానం, వృత్తి వివరాలు కూడా తెలపండి) మధుమేహానికి ఆహార నియమాలు తప్పనిసరి.

కె.రాఘవేంద్రరావు కావలి

దయచేసి డా॥ గాయత్రీదేవి గారి ఇంటి అడ్రస్ తెలుపవలసిందిగా కోరుతున్నాను. కొన్ని వైద్య సలహాలకు వారిని సంప్రదించవలెను.

జ : ఆరోగ్యపీఠానికి మీరు రాసే ఉత్తరాలు నేరుగా నాకే చేరుతాయి. ఏ కారణంగానయినా పాఠకులకి తమ పేరు ప్రచురించడం ఇష్టం లేనట్లయితే వ్యక్తిగతంగా జవాబులివ్వడం వీలు కాదు కదా. అవసరం అని నాకు తోచినట్లయితే జవాబివ్వగలను.

క్లినిక్ చిరునామా :

**Dr. GAYATRI DEVI, B.A.M.S.,**
Kairali, 139, North Usman Road,
T.Nagar, Chennai - 600 017.
e-mail : drgayatri@epatra.com

# అర్థవంతమైనది మన కాలమానం

పోలిశెట్టి బ్రదర్స్

శుక్ల పాడ్యమి నుండి అమావాస్య వరకూ ఒక మాసం. అలాంటివి 12 మాసాలు కలిపి 1 సంవత్సరం. చాంద్రమాన సంవత్సరం అంటే ఇదే కదా! దానికి 354 రోజులు. కానీ సౌరమాన సంవత్సరానికి 365 1/4 రోజులు కదా! ఈ రెండు మానాలకూ తేడా 11 1/4 రోజులు. ఈ తేడాను సవరించేందుకు మన పూర్వీకులు ఒక పని చేసేవారట. చాంద్రమాన సంవత్సరం పొడవునా రోజుకొక యజ్ఞం చేసే వారట. అలా 354 యజ్ఞాలు పూర్తయ్యాకా, సౌర మాన సంవత్సర కాలం పూర్తయ్యేవరకూ (11 1/4 రోజుల తేడాకు గానూ) 12 రోజులు యజ్ఞ వాటికకు సెలవు ఇచ్చేవారట. (ఆ 12 రోజులనూ ''ద్వాదశా వహములు'' అనేవారని వేదాలు చెప్తున్నాయి) 13వ రోజు నుండి క్రొత్త సంవత్సరాన్ని మొదలెట్టేవారు. అయితే ఇలా చేసినా కూడా తేడా తప్పలేదు. 12 రోజుల యజ్ఞవాటిక సెలవుతో సౌరమాన సంవత్సర తేడాను పూరించగలిగారు. కానీ ఈలోగా చంద్రుని నడకలతో చాంద్రమాన సంవత్సరం ఆగదు కదా! అది ముందుకు పోతూనే ఉంటుంది. ఈ అంతరాన్ని అధిగమించడానికి పద్ధతిని మార్చారు మన పూర్వీకులు. చంద్రమాన సంవత్సరానికీ, సౌరమానసంవత్సరానికీమధ్య తేడా 11 1/4 రోజులు కదా! ఆ తేడా 3 సంవత్సరాలకు 33 3/4 రోజులు అవుతాయి. ఆ రోజుల్ని సరిపెట్టేందుకు 30 రోజులతో '1 అధిక మాసం' ఏర్పాటు చేసేవారట. మరింకా 3 3/4 రోజుల తేడా మిగిలి ఉంది కదా! అవి ప్రతి సంవత్సరం ప్రోగుపడి 24 సంవత్సరాలకు 30 రోజులవుతాయి. అప్పుడు వరుసగా 'రెండు అధిక మాసాల్ని' ఏర్పరచడం ద్వారా ఆ తేడాను సవరించేవారు. ఇంకా ఖచ్చితమైన సవరింపు కోసం అనగా గంటలు, నిముషాలతో సహా తేడా రాకుండా ఉండడానికి కొన్నేళ్ళకోసారి ''లుప్త మాసాన్ని'' ఏర్పాటుచేసే విధానాన్ని పెట్టారు. లుప్తమాసం అంటే 1 మాసం లోపించడం అన్న మాట! అంటే ఆ సంవత్సరములో 11 మాసాలే ఉంటాయి. ఇది చాలా అరుదు. చాలా కాలానికి గాని రాదు. (లుప్తమాసాలు సాధారణంగా 141 సంవత్సరాలకూ లేదా ఒక్కొక్కప్పుడు 122 సంవత్సరాలకూ వస్తుంటాయి. శక సంవత్సరం 974లో లుప్తమాసం వచ్చిందనీ, మళ్ళీ 1115, 1256, 1378 సంవత్సరాల్లో లుప్తమాసాలు వస్తాయనీ మన ప్రాచీన గణిత, ఖగోళ శాస్త్రవేత్త భాస్కరాచార్యుడు వ్రాశాడు. ఆవిధంగా వచ్చాయి కూడా!)

హెచ్చుమంది హిందువులు పైన తెలిపిన చాంద్రసౌరమానాన్నే పాటిస్తున్నారు. ఈ పద్ధతి మనకు వేదకాలంనుండీ అమలులో ఉంది. అయితే ఈ పద్ధతిని మొట్టమొదటగా బాబిలోనియన్లు కనుగొన్నారనీ, అనంతర కాలంలో దాన్ని భారతదేశం, చైనా, గ్రీసు వారు అనుసరించారనీ కుహనా మేధావులు ఒక తప్పుడు ప్రచారం చేస్తుంటారు. మన తర్వాత బాబిలోనియన్లు తదనంతర కాలంలో అధిక మాసాల్ని వాడడం కన్పిస్తుంది గాని, లుప్తమాసాన్ని వాడినట్లుగా చరిత్రలో లేదు. (మేధావులమని భ్రమించే కొంతమంది మన ప్రాచీన విజ్ఞానాన్ని, ''విదేశీ విజ్ఞానం''గా చాటుతూ ఉంటారు. నేటి మన దేశ దౌర్భాగ్యం అది!)

ఖగోళ ఆధారితమైన ఈ చాంద్ర సౌర మానం అత్యంత విజ్ఞానవంతమైనది. మనం వాడుకుంటున్న పంచాంగం ఈ పద్ధతిపై ఆధారపడినదే! పూర్వీకుల విజ్ఞానంపై ఉన్న నమ్మకంతోనూ, గౌరవంతోనూ ఈ విధానాన్ని నేటికీ మనమంతా ఆచరిస్తున్నాం. ప్రపంచ దేశాలతో సహజీవన సౌలభ్యం కోసం విదేశీ క్యాలెండరును వాడినా, మన స్వంత విషయాలకు మాత్రం మన పంచాంగాన్నే వాడుకుంటున్నాం. మన పూర్వీకులు మేరుపర్వత నివాసీయులుగా (ఉత్తర ధ్రువ వాసులుగా) ఉన్నప్పటి నుండీ కూడా ఈ శాస్త్రీయ అంశాల్ని అనుసరించినట్లుగా వేదాలు సాక్ష్యమిస్తున్నాయి. ఖగోళ శాస్త్రంలో ప్రముఖ పాత్ర వహించే ''విషువత్ రేఖ' గురించి విదేశీయులకు చాలా కాలం వరకూ తెలియదు. మనకయితే విషువత్ రేఖ ప్రస్తావనలు వేదాల్లో కొల్లలుగా కన్పిస్తు న్నాయి. అప్పటికి ఈ విదేశీ

జాతులేవీ లేనే లేవు. అనంతర కాలంలో ఏర్పడిన ఈ జాతులు మెల్లగా కాలక్రమేణా కళ్ళు తెరిచాయి. మన ప్రాచీనుల నుండి విజ్ఞానాన్ని నేర్చిన విదేశీయు లకు విషువత్ రేఖా విషయం - 'సిరియస్' అనే నక్షత్రంతో 'విషువత్ రేఖ' కలిసి ఉన్నప్పటి నుండే తెలుసు. విదేశీయులు - 'సిరియస్' నక్షత్రాన్ని 'కుక్క' అని అంటారు. మన వేదాలు చెప్పిన ద్వాదశవహాలను (12 రోజులనూ) విదేశీయులు ''కుక్క రోజులు'' అని వ్యవహ రిస్తూ, సంవత్సరం లెక్కలో వాటిని విడిచిపెట్టేసే వారు. చాంద్రమాన సంవత్సరం పూర్తి అయ్యాకా, సూర్యుడు, ఈ కుక్క నక్షత్రం (సిరియస్)పై ఉన్న విషువత్ రేఖను చేరేవరకూ గల 12 రోజులూ 'కుక్క రోజులని' వారి భావం.

యజ్ఞాలను చేయడం హిందువులకు అలవాటు. యజ్ఞాలతో సంవత్సరాన్ని లెక్క చూడడం వల్లనే సంవత్సరానికి ''యజ్ఞం'' అని మరో పేరు కూడా వచ్చింది.

## హిందూ పద్ధతుల్లో సంవత్సర ఆరంభం

వేదకాలంలో సంవత్సర ఆరంభం లెక్కించడానికి సూర్యసహోదయాన్ని పరి గణనలోకి తీసుకునేవారు. అనగా విషువత్ రేఖపై గల ఒక ప్రముఖ నక్షత్రం సూర్యునితో కలిసి ఉదయించే రోజును సంవత్సరా రంభంగా గుర్తించేవారు. మళ్ళీ సూర్యుడు అదే నక్షత్రంతో కలసి ఉదయించేది ఆ తర్వాత సంవత్సరాదికే!

## వరాహమిహిరుని పంచాంగం:

ఇప్పుడు మనం వాడుకుంటున్న పంచాంగాన్ని వ్రాసిన ఖగోళ శాస్త్రజ్ఞుడు వరాహమిహిరుడు. విషువత్‌రేఖ మేషరాశిలో ఉండగా ఆయన పంచాంగాన్ని వ్రాశాడు. అందువల్ల మేషరాశిలో సూర్యుడు చేరి విషు వత్ రేఖపై ఉదయించే రోజు సంవత్సరాది అయింది. మేషంతో రాశిచక్రాన్ని ఆరంభించి పంచాంగం వ్రాశాడాయన. ఆయన కాలంలో విషువత్ రేఖ మేషరాశిలో ఉండగా, సూర్యుడు ఆ రాశిని ప్రవేశించగానే సంవత్స రాదిని జరుపుకునేవారు. ఇలా మేషరాశిలో సూర్యుని ప్రవేశదినాన్ని సంవత్సరాదిగా పాటించడం పూర్వకాలాన ఒక ప్రముఖ సంఘటనలో కూడా మనకు కన్పిస్తుంది. క్రీ.పూ.3102లో శ్రీకృష్ణపరమాత్మ దేహ త్యాగం చేసిన తర్వాత ద్వాపరయుగం ముగిసి, కలిగయుగం ఆరంభమయింది. ఆ రోజున నవగ్రహాలు ఒకే రేఖపై చేరి మేష రాశిలో ఉన్నాయట. ప్రతీ యుగ ఆరంభం లోనూ ఇలాగే ఉంటాయట. సృష్టి ఆరంభం నుండి ఇలాగే జరుగుతుందని పురాణ వచనం. (ఈ సందర్భంలో చెప్పబడిన నవగ్రహాలు జ్యోతిషశాస్త్ర ప్రకారం మన పూర్వీకులు చెప్పే నవగ్రహాలని మనం గ్రహించాలి. (అవి సూర్యుడు, బుధుడు, శుక్రుడు, చంద్రుడు, రాహువు, కేతువు, కుజుడు, గురుడు, శని) ఈ నవగ్రహాలూ మేషరాశిలో ఒకే రేఖపై చేరినప్పుడే యుగా రంభం అవుతూ ఉంటుంది) అలాగే, ప్రస్తుత కలియుగం కూడా ఆరంభమయింది. యుగారంభం అంటే ఎలాగూ క్రొత్త సంవత్సర ఆరంభంకూడా అదే అవుతుంది కదా! ఒక యుగానికే ''ఆది దినం'' కనుక ఆరోజును 'యుగాది' అన్నారు. అదే కాల క్రమేణా 'ఉగాది'గా మారింది. అదే సంవత్సరాది. సౌరమానాన్ని పాటించే హిందు వులు, అప్పటినుండీ సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే రోజును సంవత్సరాదిగా పాటిస్తూ వస్తున్నారు. (పైన తెలిపిన నవగ్రహాలూ తిరిగి మేషరాశిలో ప్రవేశించేది మరో యుగా రంభానికే!)

కాలక్రమేణా విషువత్ రేఖ స్థానం మారుతూ వచ్చింది. ప్రస్తుతానికి అది మీనరాశిలో ఉంది. అయితే సౌరమానాన్ని పాటించే హిందువులు (తమిళనాడు, కేరళ, ఒరిస్సా, పశ్చిమబెంగాల్ రాష్ట్రాల హిందు వులు) మేషరాశిలో సూర్యుడు ప్రవేశించిన రోజునే ఇప్పటికే సంవత్సరాదిగా జరుపు కుంటున్నారు. వీరు విషువత్ చలనాన్ని పట్టించుకోలేదు. చాంద్రసౌరమానం వాడు తున్న మిగతా హిందువులంతా చంద్రుని నడకలను బట్టి చైత్రమాస శుద్ధ పాడ్యమి నాడు సంవత్సరాదిని జరుపుకుంటున్నారు. (ఇదే మన ఉగాది) ఈ రెండు విధానాలూ కూడా ఖగోళశాస్త్రబద్ధమైనవే! చంద్రసౌర మానం వాడుతున్న మనం చంద్రుని నడకలను అనుసరిస్తూ కూడా, విషువత్ రేఖ ఉన్న రాశిలోనే సూర్యుడుండగా 'సంవత్స రాది'ని జరుపుకుంటున్నాం. ఇదో విశేషం!

అయితే చాంద్రమానం, సౌరమానం, విషువత్ అన్ని విధాలా సరిపోయేలా పం చాంగ రచన జరగాలంటే మరో వరాహ మిహిరుడు రావాలి. అంతవరకూ ఇప్పటి పంచాంగాలను కొనసాగించడమే!

మన దేశంలో పై విధమైన రెండు సంవత్సరాదులు ప్రస్తుతం కన్పిస్తున్నాయి.

(సశేషం)

సుధాలహరి

వ్యాసము - 3

# కర్మ జ్ఞానం

గొట్టుముక్కల రామకృష్ణమూర్తి

వేదాంతాలు ఆత్మతత్త్వాన్ని బోధిస్తాయి. జ్ఞాన వల్లనే మోక్షం. మోక్షప్రాప్తియే పరమ పురుషార్థం. జీవుడు బ్రహ్మస్వరూపుడే! ఈ బ్రహ్మత్వ స్ఫురణయే మోక్షం. అనగా స్వస్వరూపానుసంధానము. విశిష్టమైనవేదాంత జ్ఞానము ఇతర ప్రమాణములకు అందదు. ఇట్టి వేదము అపౌరుషేయమై స్వతఃప్రమాణమగుచున్నది - మనమింతవరకు గ్రహించిన విషయములివే!

పరిస్థితి ఇట్లుండగా ఇక్కడొక విశేష ప్రశ్న ఉదయిస్తుంది. ఈ బ్రహ్మప్రాప్తి రూప మోక్షమనునది, భక్తి, కర్మ, జ్ఞానములలో దేనివలన సిద్ధిస్తుంది? అని అయితే భక్తి అనేది కూడా మానసికమైన కర్మయే గనుక కర్మ మార్గమునందే చేరును భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు ''లోకేస్మి ద్వినిధానిష్ఠా....'' అన్న చోట జ్ఞానకర్మయోగములనురెంటినే చెప్పెను. కనుక సారాంశముగా'' మోక్ష ప్రాప్తికర్మ వలననూ? లేక జ్ఞానమువలనన? లేకరెండింటి వలననా? అనునదే ప్రశ్న. ప్రస్తుత విచారానికి విషయమిదే!

కర్మ అంటే ఏమిటి? జ్ఞానమంటే ఏమిటి? అనే చర్చ ముమ్ముందుగా కొంచెం లోతుకు దిగి చేయవలసి ఉంది. ఈ చర్చకు ఆధారాలు ప్రస్థానాలు. ఇవి మూడు - ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత. ఈ ప్రస్థానత్రయమునకు ఆచార్య శంకరులు భాష్యం వ్రాశారు. బ్రహ్మసూత్రములు, భగవద్గీత ఉపనిషత్తుల సిద్ధాంతసారములై పలువురు మహామహులచే వ్యాఖ్యాతములైనవి. శ్రీరామానుజ మధ్వాచార్యాది ప్రసిద్ధుల వ్యాఖ్యానాలు అనే కాలున్నాయి. ఇంకను పలువురు చేసిన వ్యాఖ్యానాదులకు వివరణములు, టీకలు - ఇట్టి వాఙ్మయ మంతా ఒక మహాసముద్రమై కర్మ జ్ఞానాలను చర్చించి, తత్త్వామృతాన్ని వెలువరించడానికి ప్రయత్నించింది. అమృత ప్రాప్తికై క్షీరసాగరమును దేవ దానవులు మథించారు. ఏమిపుట్టినది? మొదట హాలాహలము, తర్వాత, లక్ష్మి చంద్రుడు ఐరావతాదులు పుట్టాయి. అమృతము చివరకు లభించినది. అట్లే తత్త్వసాగరాన్ని మథించినపుడు ఏవేవోసిద్ధాంతములు పుట్టాయి. తాము చెప్పినదే పరతత్త్వమనిరి. మరి అమృతమును పుట్టించిన సిద్ధాంతమేది? శ్రీ శంకర భగవత్పాదుల ప్రస్థానత్రయ భాష్యగత అద్వైతమే అట్టి అమృతమని సమ్యగ్విచారణాంతరం, విద్వదనుభవదృష్ట్యాలు పెద్దలు నిర్ణయించారు. ఇట్లు కర్మ జ్ఞానములను గూర్చి మనం సంగ్రహంగా గ్రహించవలసి వుంది.

చేయబడేది అంతా కర్మ. మనం, మనస్సుతో ఆలోచిస్తాం, వాక్కుతో భావాలు వెలువరిస్తాం; దేహేంద్రియాలతో పనులు చేస్తాం. ఇదంతా కర్మయే.

''నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్'' అని గీతాచార్యులు చెప్పినట్లుగా, ఒక క్షణమైనా ఏకర్మా చేయకుండా ఉండడం సాధ్యంకాదు. కనుక ప్రతివారు కర్మపాశ బద్ధులే. అయితే ఈ దేహంలో కర్మ ఎవరు చేస్తున్నారు? జీవుడే చేస్తున్నాడా? లేక దేహేంద్రియాలు చేస్తున్నాయా? అనే ప్రశ్నకూడా ఇక్కడ ఉదయిస్తుంది. క్రమంగా దీనికి సమాధానం అన్వేషిస్తారు. ఇట్టి కర్మలు, వర్ణాశ్రమ ధర్మాలను బట్టి వేదబోధితములై వైదికకర్మలుగా చెప్పబడుతున్నవి. యజ్ఞాలు, హోమాలు, జపతపాదులు యిట్టివి. దేవాలయ తటాక నిర్మాణాది కర్మలు లౌకికములు. స్నాన, పాన భోజనాది సామాన్య కర్మలు కూడ అనేకములున్నవి. ఇవి మరల పుణ్యకర్మలు, పాపకర్మలనీ రెండు విధములుగా ఉంజదమూ ప్రసిద్ధమే. ఈ పుణ్యాపాప కర్మలకు వేదశాస్త్రాలూ ఆచారాలు మున్నగునవి ప్రమాణములు. చేయవలసినవి ''విధి'' అనీ, చేయకూడనివి ''నిషిద్ధకర్మ'' కనీ చెప్పబడుచున్నవి. పుణ్యపాప కర్మలకు ఎపుడో ప్రాప్తించే సుఖదుఃఖాలే ఫలములు.

గృహస్థ ధర్మంలో కర్మాచరణమునకు, సన్యాసి ధర్మంలో కర్మ త్యాగానికీ ప్రాధాన్యం ఉంది. కర్మ ఫలానికీ, జ్ఞానఫలానికీ చాలా తేడా ఉంది. కర్మఫలం కర్మానంతరం ఎప్పుడో లభిస్తుంది. జ్ఞానఫలమైన మోక్షం వెంటనే లభిస్తుంది. ఈ కర్మలు ఆగామి, సంచితము, ప్రారబ్ధము అని మూడు విధములు. భవిష్యత్తులో ఫలమునిచ్చే కర్మలు 'ఆగామి' అనీ, ఫలోన్ముఖములై యున్న కర్మలు 'సంచితము' లనీ, ఫలారంభకములైన కర్మలు ప్రారబ్ధములనీ చెప్పబడుచున్నవి. కర్మపర తంత్రు పై కర్మల వల్లనే మోక్షమని వాదించుచు,

వేదమంతయు కర్మనే బోధించునని మీమాంసకులు చెప్పుదురు. జైమిని మహర్షి వ్రాసిన మీమాంసా శాస్త్రము వీరికి ప్రమాణము. స్థూలముగా ఇది కర్మ విషయము.

ఇక జ్ఞానమంటే ఏమిటి? అనే విషయంలో భిన్నాభిప్రాయములున్నవి. అసలు అన్నిటికీ మూలమైన చర్చ ద్వైతము సత్యమా? అద్వైతము సత్యమా? అనునది. ద్వైతము అంటే రెండుగానున్నది. జీవుడు, ఈశ్వరుడు ఇద్దరూ రెండు భిన్న పదార్థములు. ఎప్పుడూ వేరు వేరు పదార్థములు గానే వుంటాయి గాని, ఒకటే కాజాలదు ఇది ద్వైతం. జీవేశ్వరులిరువురూ ఒక్కటే భేదము ఉపాధిని బట్టియేగాని, వాస్తవముగాదు. ఈశ్వరుడే బ్రహ్మ జీవబ్రహ్మైక్యమే మోక్షము. ఇట్లు జీవేశ్వరులొక్కటే అని బోధించునదే అద్వైతము. బ్రహ్మ ఒక్కటే సత్యము. రెండవ పదార్థము లేదు. కనుక జ్ఞానమంటే అద్వైత జ్ఞానమే. ప్రపంచమును గూర్చి, పరమేశ్వరుని గూర్చి ఉన్న ద్వైతజ్ఞానములన్నీ మిధ్యాజ్ఞానాలే. ద్వైత భ్రాంతియేగాని, జ్ఞానం కాదు.

కానీ ద్వైతులట్లు చెప్పరు. భగవంతుని స్వరూపమును బోధించు జ్ఞానమే జ్ఞానమందురు. ఆ భగవంతుడు సగుణుడు. అనేక కళ్యాణ గుణ రత్నాకరుడు. ఆ భగవంతుడే నారాయణుడని వైష్ణవులూ, పరమశివుడని శైవులూ, తదితరులు తమతమ అనిమాన దేవతలే పరతత్త్వమనీ చెప్పుదురు. కాన ద్వైతమందు బహుసిద్ధాంతములుగలవు. ఇందులో ఏది సత్యము? ఎవరి సిద్ధాంతము నిర్దుష్టము అన్నచో, ఎవరికివారే వాదోపవాదములు లేవదీసి తమ సిద్ధాంతమే పరమసత్యమని చెప్తారు. కానీ సత్యం ద్వైతమందు తేలదు. ఈ దృష్టితోనే భగవద్గీతయందు ''బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో. వ్యవసాయినామ్'' లని స్పష్టము చేయబడినది.

కనుక తేలినదేమంటే జ్ఞానమంటే ఆత్మ స్వరూపజ్ఞానమే ఆత్మయే బ్రహ్మ. ఆత్మ జ్ఞానము లేక బ్రహ్మజ్ఞానమే సంసార దుఃఖనివృత్తి జేసి ముక్తి ప్రదమౌతుంది. జ్ఞానమంటే తెలుసుకొనడం దేనిని తెలుసుకొనడం? అంటే ఏది నీకు తెలియదో దానిని తెలుసుకొనదమని చెప్పాలి. ఆ తెలియనిది ఏది? అది ఒక పదార్థమా? అనేక పదార్థములా? ఒకపదార్థమైతే దానిని తెలుసుకొంటే చాలు, జ్ఞానము సిద్ధించినట్లే. అనేక పదార్థములైతే, మనకు తెలియనివి లోకములో ఎన్నో ఉన్నవి. అనేక పదార్థములైతే, అసలు తెలుసుకోవలసినవి, మొత్తము ఎన్ని పదార్థములో ఆ జాబితా తేల్చుకోవలసి ఉంది. అది ఎప్పటికి తేలే విషయం కాదు. మనకు తెలియనివి లోకములో ఎన్నో ఉన్నవి. ఒక విషయమునందే గల అనేకానేక భేదముల వల్ల, ఎన్ని ఏండ్లు పరిశోధన జేసినా, తెలుసుకోవలసినవి ఇంకా ఎన్నో మిగిలిపోతాయి. ఏదో కొంత జ్ఞానం సంపాదించేటప్పటికే పురుషుని జీవితం అంతమైపోతుంది. ఉదాహరణకు, ఒక వృక్షమునే తీసుకొందము. మొత్తమువృక్ష జాతులెన్ని? దాని భేదలక్షణములేవి? నిర్మాణ క్రమమెట్టిది? అందలి గుణదోషములేవి? ఈ భేదములెట్లేర్పడినవి? ఇట్లు ప్రశ్నిస్తూపోతే, 'వృక్షము' అనే ఏకవస్తువును గూర్చి ఏవ్యక్తీ తన జీవిత కాలంలో సంపూర్ణ పరిజ్ఞానాన్ని సాధింప లేడు. ఇది యిట్లుంటే ఇక పంచభూతాలు, రత్నాలు, మాణిక్యాలు, ఆభరణాలు, ఆయుధాలు, జంతువులు, పక్షులు, యక్ష రాక్షస గంధర్వాదులు, ధాన్యములు, క్రిమికీటకములు, రసాయనములు, -మున్నగు లక్షల పదార్థాల విజ్ఞానం ఎప్పుడు పూర్తవుతుంది? ఎవరు సర్వజ్ఞుడు కాగలడో చెప్పగలమా? ఇందులో ఒక విషయాన్ని గూర్చి సంపూర్ణ జ్ఞానం సాధించినా, తక్కిన విషయములను గూర్చి తెలియద్దు గనుక 'జ్ఞానవంతుడు' అని ఎవరిని చెప్పలేము. ఒకవేళ సమస్త విశ్వాంతరాళ జ్ఞానమును సాధించినా, తనస్వరూపమేమో తెలియదు గనుక అప్పటికీ 'అజ్ఞాని' అని చెప్పవలసి యున్నది.

కనుక పరిస్థితి ఇట్లుండగా, సమస్త దర్శనములు జ్ఞానమును గూర్చి చెప్పడం, ముఖ్యంగా వేదాంతములు జ్ఞానంవల్లనే మోక్షమని సిద్ధాంతీకరించడం ఏమిటి? ఇదంతా అసంబద్ధ ప్రేలాపమేనా? అన్నచో ఎంత మాత్రముకాదు. అది ఎట్లో మనము పరిశీలించి నిర్ణయించుకోవలసి ఉంది. (సశేషం)

# కాలతంత్రం

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ పాడ్యమినాడు ఉగాది పండగ జరుపుకోవటం తెలుగు దేశంలో అనాది కాలం నుండీ వస్తున్న ఆచారం. ఐతే అన్ని భాషాప్రాంతాలలోనూ ఇది ఒకే రకంగా లేదు. తమిళుల సంవత్స రాదివేరు. ఉత్తరాది రాష్ట్రాలలోను కన్నిచోట్ల వేరే. ఆయా ప్రాంతాలలో అక్కడి పంచాంగ గణన పద్ధతిని బట్టి ఉగాది పండుగ జరుపుకొంటున్నారు. ప్రాచీన కాలంలో కూడా ఇది ఒకే రకంగా లేదు. ఇంచు మించు రామాయణ కాలంలో జ్యేష్ఠ మాసం సంవత్స రాదిగా భావించబడినట్లు కన్పిస్తుంది. భారతకాలంలో వైశాఖమాసంలో ఉగాది వచ్చేదని తెలియవస్తున్న ఇప్పుడు మనం చైత్ర శుద్ధ ప్రథమదినాన్ని ఉగాదిగా జరుపు కుంటూ ఉన్నాము. నిజానికి చైత్రమాసం వచ్చేసరికి ఎండలు బాగా కాస్తున్నాయి. చైత్ర వైశాఖ మాసములు వసంత ఋతువు అని చదువుకోవటమే తప్ప అందులోని వైశాఖము ఎప్పుడో 'వేసగి' అనే తద్భవరూపాన్ని పొంది ఎండా కాలం అన్న అర్థాన్ని ఇస్తున్నది. అంతే కాదు ఫాల్గుణ మాసం వచ్చేసరికి చెట్లు చిగిర్చి వేప పూత మొదలైనవి ధారళంగా దొరకటం మొదలవుతున్నది. ఇటీవలైతే కొన్ని ఉగాదు లకు వేప పువ్వు దొరకటం లేదు కూడా. పూతకాలం అయిపోవచ్చునన్న మాట.

మొత్తం మీద తేలిన ఆంతర్యమేటంటే నిజ మైన ఉగాది ఫాల్గుణ మాసానికి జరిగిందని చెప్పవచ్చు.

పూర్వకాలంలోనైతే ఋషులు మొదలైన మహానుభావులుండే వాళ్లు, వాళ్ళేదన్నా అది శాసనంగా చెలామణి అయ్యేది. ఋతువును ఒక నెల వెనక్కు జర పండి అంటే అది జరపబడేది. ఎందుకంటే ప్రకృతిలో జరిగిన ఒక మార్పును గుర్తించ టమే కనుక. ఇవాళ ప్రజా హృదయాలను అంతగా శాసించగల శాస్త్రకారులు, ఋషులూ లేరు. కనుకనే వెనుకటిలాగా జ్యేష్ఠమాసం నుంచి వైశాఖమాసం, వైశాఖం నుంచి చైత్రం మారినట్లుగా చైత్రం నుంచి ఫాల్గుణానికి మారే అవకాశం కనపడ టం లేదు. ఎంతో ఆలోచించి క్రీస్తు శకాన్ని తొలగిద్దామని శక సంవత్సరాన్ని ప్రవేశపెడితే ప్రజలచేత దాన్ని పాటింపజేసే శక్తి ప్రభుత్వా నికి లేకపోయింది. ఇప్పుడు ప్రభుత్వ రంగా లలో కూడా శక సంవత్సరాల క్యాలండర్‌కు విలువ పోయింది.

యుగాది శబ్దమే ఉగాదిగా పరిణ మించిందని భాషా శాస్త్రవేత్తల అభిప్రాయం. యుగాలు మారుతున్నప్పుడల్లా ఋతుగమ నంలోనే కాదు సృష్టిలోని సర్వ చరాచర ప్రకృతి లోను అపూర్వమైన మార్పువస్తున్నట్లు మన వాఙ్మయంలో ఆధారాలు కన్పిస్తవి. దీనికి మూలం కాలతంత్రమని భాగవతంలో చెప్పబడింది. ఈ అనంతసృష్టిలో అనూ హ్యములైన పరిణామాలను తీసుకురాగలిగిన ప్రభావం కాలతంత్రానికుందని ఘంటా ఘోషంగా పురాణాలు చెపుతున్నాయి. భాగవతంలోని ఈ పద్యం చూడండి.

**వాయువశంబులై యెగసి వారిధరంబులు మింట కూడుచున్**
**పాయుచు నుండు కైవడి ప్రపంచము సర్వము కాలతంత్రమై**
**పాయుచు కూడుచుండు నొకభంగి చరింపదు కాల మన్నియున్**
**జేయుచు నుండు కాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్**

పంచభూతముల సంయోగ నియో గములకు కాలమే కారణమనీ దాని మార్గము నెవరునూ గుర్తింపలేరని ఎంత వారికిని అది దుస్తరమని చెపుతూ పాండవుల జీవితాన్ని అక్కడ ఉదాహరణగా ఇవ్వటం జరిగింది. ధర్మజుడు రాజట! సురరాజసుతుడు ధన్వియట! శాత్రవోద్వేజకమైన గాండీవము విల్లట! మరి సార ధియో సర్వభద్ర సం యోజకుడైన చక్రియట! ఆ అజికి ఉగ్ర గదాధుడైన భీముడు తోడు వచ్చునట! అయిననూ ఆపదలు తప్పలేదు. దేవాంశ సంభూతులే కాదు దేవతలైనను కాలతంత్ర శక్తిని కాదని నిలువ లేరు.

అర్జునుడంతవాడు, శివునితో ద్వంద యుద్ధము చేసి పాశుపతాస్త్రమును పొందిన మహావీరుడు. అంత భారత సంగ్రామమున విజయము సాధించిన మహాయోధుడు కృష్ణ నిర్యాణము పిదప ద్వారక మునిగిపోవునని అందలి జనులను తీసుకువస్తూ దోవలో బోయవాళ్ళచేత భంగపడ్డాడు. ఒక్క అస్త్రం గుర్తుకు రాలేదు. అక్షయ తూణీరాలలో బాణాలు లేవు. అటువంటి మహాపురుషుడికే ఆ గతి పట్టింది. ఈ ప్రభావము ఎంత మహా

ద్భుతమైనది చూడండి.

యుగాలు మారినప్పుడల్లా కాల ములో వచ్చే మార్పులు చిత్ర విచిత్రంగా ఉంటవి. కృతయుగం నుండి త్రేతాయుగ, త్రేతాయుగం నుండి ద్వాపరం, ద్వాపరం నించి కలియుగం మారే సంధికాలంలో కొత్త లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తవి. త్రేతా ద్వాపర సంధిలో జరిగిన పరశురామకృత సర్వక్షత్రియ సంహారాన్ని పురాణాలు ప్రత్యే కంగా వర్ణించినవి. అలాగే భారతయుద్ధం ద్వాపరాంతాన జరిగిన భయంకర మారణ హోమం. సప్తర్షులు మఖా నక్షత్రంలో ఉం డగా జరిగిన యీ భీషణ మత్యుహేల మళ్లీ రెండు వేల యేడువందల సంవత్సరాల తర్వాత అదే స్థితి అంతరిక్షంలో వచ్చే సరికి మళ్ళీ అంతటి సంహారకాండ జరిగింది. మహానందుడు ద్వితీయ భార్గవుని వలె సర్వక్షత్రాంతకుడయినాడని నాటి విశేషాలను భవిష్యాది పురాణాలు వర్ణించినవి. కాల చక్రం గిర్రున తిరిగేప్పటికి యమదండం ప్రచండ పాటవాన్ని ప్రదర్శించింది.

పూర్వపూర్వ యుగాలలోని జీవులే ఉత్తరోత్తయుగాలలోనూ వస్తుంటారు. కలి యుగంలో నిరంతర ధర్మబద్ధులైన వాళ్లే కలి యుగం వచ్చే సరికి అధర్మపరులవుతుం టారు. అంటే మానవ జీవితలను నడిపేది ఆ జీవుల కర్మమాత్రమే కాక కాలం కూడా నన్నమాట. భారతంలోనే దీని కొక చక్కని ఉదాహరణ ఇవ్వబడింది. ధర్మరాజు రాజ్యం చేస్తుండగా ఇద్దరు రైతులు వివాదంతో వచ్చారు. ఒక రైతు పొలం మరొకరైతు కొన్నాడు. అందులో ఒక నిధి దొరికింది. కొన్నవాడు నేను పొలం కొన్నాను. కాని నిధి కొనలేదని అది పూర్వ కర్షకునిదే అన్నాడు. రెండవ వాడు పొలం అమ్మేశాడు కనుక అందులో ఏది వచ్చినా కొన్నవాడిదే నంటాడు. ఈ వివాదం ఎలా తీర్చాలో ధర్మ రాజుకు తోచలేదు. పక్కనే ఉన్న కృష్ణుడు తీర్పు ఒక నెల వాయిదా వెయ్యమని సలహా ఇచ్చాడు. ధర్మరాజు సరేనన్నాడు. ఈ నెల రోజుల్లో కలి యుగం వచ్చింది. వాయిదా రోజుకు రైతు లిద్దరో వచ్చారు. అయితే, ఈ సారి నిధి నాదంటే నాదని పోట్లాడుకుంటూ వచ్చారు. ధర్మరాజు వాళ్లిద్దరి బిడ్డలకు ఒక రైతు కొడుకును, రెండో రైతు కూతురికి పెళ్లి చేయించి, నిధి వాళ్లకు చెందేలా తీర్పు చెప్పాడు. ఇదే ఇప్పడైతే తీర్పు కూడా అట్లా ఉండదు. నిధి నిక్షేపాలన్నీ ప్రభుత్వానివి. ఆ స్థల యజమానివి కావు. ఇవన్నీ కలికాల ప్రభావం చేత వచ్చిన ఆలోచనా ధోణులు. కాలానికి గుణముల మీద కూడా ప్రభావాన్ని చూపించే శక్తి ఉన్నదంటానికి దీన్ని ఉదహరించాను.

ఒక్క గుణాలమీద నేమిటి! సమస్త వస్తుజాలం మీద, జీవ నిర్జీవ పదార్థాల మీద కాలం తన ప్రభావాన్ని చూపిస్తుంది. కృష్ణుడు భారతయుద్ధంలో అర్జునుడితో "కాలోస్మి లోక క్షయకృత్ ప్రవృద్ధః" అన్నాడు. లోక నాశనానికి వచ్చిన కాలుణ్ణిసుమా అంటూ భీష్మ, ద్రోణాది సర్వ శాత్రవులూ నాచేత ఇది వరకే చంపబడ్డారు. కేవలం నీవు నిమిత్త మాత్రుడివిగా బాణాలు వెయ్యి అంటాడు. నీ బాణాలలో శక్తిని ప్రవేశపెడుతాననో, నీచేత చంపిస్తాననో అనక నేనిదవరకే వారిని చంపాను అనటంలో ఒక గొప్ప కాలతంత్ర రహస్యం ఇమిడి ఉంది. ప్రతి మనిషికీ పంచభూతాత్మక మైన యీ శరీరం కాక, ఆకాశ చరమైన మరొక శరీరం ఉంటుంది. మానవునకి రావలసినవి, కావలసినవి, ముందు ఆ ఆకాశ శరీర, మీద కర్మ ప్రభావం చేత కనిపిస్తవి. తరువాత ఈ పార్థివ శరీరానికి దిగుమతి అవుతవి. కృష్ణుడు కాలస్వరూపుడు కనుక, ఆ ఆకాశ శరీరాలను ఖండించాడు. దానివల్ల ఈ భౌతిక శరీరాలు అర్జునుడు బాణాలు వేసినా, వెయ్యక పోయినా, కూలిపోక తప్పదు. అయితే ఆ క్రియకు అర్జునుడు నిమిత్తమాత్రుడు కావలసిన యోగం ఉన్నది గనుక, అయి నాడు. ఆకాశ శరీరాలమీద కని పించే విశేషాలు ఈ భూశరీరాల మీద కన్పించడానికి మధ్య కొంత వ్యవధి ఉంటుంది. కనుకనే కృష్ణుడు వాళ్లను తాను చంపానని చెప్పినా రణరంగం మీద వాళ్లంతా ఎదురుగా నిలబడే ఉన్నారు.

**మయై వేతే నిహతాః పూర్వ మేవ**
**నిమిత్తమాత్రం భావసత్యసాచిన్**

అన్న గీతా శ్లోకంలో ఇంత తాంత్రిక రహస్యం ఇమిడి ఉంది. ఆ ఆకాశ శరీరాలకు ఆ భూశరీరాలకు మధ్య ఒక అదృశ్య రజత సూత్రం ఇన్విజిబుల్ సెల్వర్ కోర్ అనుబం ధంగా ఉంటుంది. రెండు దేహాల మధ్య అనుభవాల రాకపోకలు ఒక విచిత్ర పద్ధతిలో సాగుతూ ఉంటవి.

సరే! అది అలా ఉంచుదాం. కాలం కలిరూపదారియైన తన విలాసాలు చూప టంలో కూడా ఒక పద్ధతి ఉంది. కొ,త అంతర దృష్టిలేక దివ్యదృష్టి కలిగితే కాని ఇందులోని విశేషాలు బోధపడవు. ఒక మహాశక్తి లోకాన్ని ఆవరించేటప్పుడు అదృశ్య తేజరూపంలో అంతరిక్షం నిండి సర్వలోకాన్ని ఆక్రమించ టమూ జరుగుతుంది. సూక్ష్మతరమైన దార్శనిక శక్తి ఉంటేగాని దీన్ని ప్రత్యక్షంగా తెలుసు కోవడం సాధ్యం కాదు.

సుప్రసిద్ధుడైన ఈ శతాబ్దపు టిబెటిన్ దార్శనికుడు లోబ్‌సాంగ్ రాంపా ఒక విచిత్ర విషయం వ్రాశాడు. శ్వశానాలలో అర్ధరాత్రి వేళ జాగ్రత్తగా జాగ్రత్తగా చూస్తే నీలాకారపు కాంతి వలయాలు పూడ్చి పెట్టబడిన మానవ దేహాలనుండి పైకి వెళ్లడం చూడవచ్చు నంటాడాయాన. అవి జీవులు దేశాల నుండి నిర్గమించడం కాదు. జీవి ఎప్పుడో దేశాన్ని వదిలి వెళ్లినా ప్రతి జీవుడికి శరీరమును ఆశ్ర యించుకొని ఉండే తేజోవలయం చచ్చిన వెంటనే వదలక, నెమ్మదిగా వదిలిపోతుంది. ప్రతిమానవుడికి వాడిచుట్టూ ఉండే స్వీయ తేజోవలయమే ఇతర మానవులతో, జీవులతో వాడికి కలిగే ఆకర్షణ, వికర్షణలకు మూలం. ఈ మృతజీవులు ఆ జీవుల తేజోవలయాల శ్మశాన సాధకులైన తాంత్రికులకు అమూల్య మైన ఉపకరణాలు. బహుసిద్ధి కారణాలు.

ఏ విధంగానైతే జీవుల తేజోవలయా వరణలు బహు కార్యములకు నిమిత్తము లవుతూ ఉంటవో, అదే విధంగా యుగ స్వరూపుడైన కాలుని తేజోవలయం ప్రకృతి ఆవరణను ఆక్రమించి, విక్రమించి, ప్రతి జీవిడిమీద తన ప్రభావం చూపిస్తుంది. అందు చేతనే అంతకుముందు పరమ ధర్మ భవుకుడైన వ్యక్తి కూడా అదర్మపరుడై దుష్కర్మ పరాయణుడు కావడం జరుగుతుంది.

తెలుగుదేశంలో ఒక చమత్కార కథ ప్రచారంలో ఉంది. మన సీమలో అడుగు పెట్టగానే అరణ్యవాసానికి సీతా రములతో వచ్చిన లక్ష్మణుడు ''మీకు నేనెందుకు సేవచేయాలి? మీ సామాను మీరేమోసుకోండి. నేను వెనక్కు పోయాను'' అన్నాడట. కొంత దూరందాక రాముడేమీ మాట్లాడలేదట. తర్వాత మళ్లీ సహజస్థితికి వచ్చిన పిదప అది రాక్షసులు తీవ్ర తపస్సు చేసిన చోటు వాళ్ళ భావతరంగాలు ఇంకా అక్కడ ప్రసరిస్తుండ డం వల్ల నీ మనస్సులో అలాంటి ఆలోచనలు పుట్టినవి రాముడు తమ్ముణ్ణి సమాధాన పరిచాడట.

ఒక ప్రదేశానికే అంత శక్తి ఉంటే, మరి ఈ యుగాదినాడు కాలాన్ని ఆక్రమిం చిన కాలప్రభావం ఎంతటిదో చెప్పగలమా? ముందు యుగాలలో లేని అన విక్రయం, విద్యా విక్రయం, దేహ విక్రయం, కలి యుగంలో ఉంటుందని మునులు చెపితే ఆనాటివాళ్లు నమ్మలేక పోయినారు. ఈనాటి వాళ్ళం మనం ఆ నాటి పరిస్థితులను నమ్మ లేము. అందుకే వ్యాస మహర్షి ''కాలప్రభా వంబు నెవ్వరూ తప్పించుకోలేరు. ఒకవేళ తప్పించుకోవాలన్న తీవ్రకాంక్ష వుంటే బదరికావనానికి వెళ్లండి. నరనారాయణుల తపఃప్రభావం వలన కలి అక్కడ ప్రవేశించ లేదు.'' అని చెప్పినా ఎంతమంది బదలి వెళతారు? తపస్సు చేస్తారు? యుగ ప్రభా వాన్ని తప్పించుకోగలుగుతారు? సర్వ ప్రపంచమూ కలియుగాది నాటి కాలతంత్ర మును వశమైనది. వేల యేండ్ల కొక్కడు, కోట్ల మందిలో నొకడు యుగాది కాలతంత్రమును జయించి దేవలోకమునకు వెలుగు బాటలు తీస్తాడు. మిగిలిన వారంతా వట్టి యుగాది పండుగలు చేసుకునే సామాన్యపామర జనము. ✦

## స్వామీ వివేకానందులు - 1894 ఫిబ్రవరి డెట్రాయిట్ ప్రసంగం

ఈ సందర్భంలో వివేకానందుల ప్రసంగాన్ని మనం గుర్తు చేసుకుందాం.

మీరు 'శిక్షణ ఇచ్చి, చదివించి, మనుష్యులకు ధనమిచ్చి పంపుతారు - ఎందుకు? నా దేశానికొచ్చి, నా దేశాన్ని, నా పూర్వీకులను, నా మతాన్ని, నాకు సంబంధించిన అన్నిటినీ నిందించేం దుకు. ఎప్పుడైతే మీ ప్రచారకులు మమ్ములను విమర్శిస్తారో, వారిది గుర్తుంచుకోవాలి సుమా!

భారతదేశమంతా ఒక్కటిగా నిలబడి, హిందూ మహాసముద్రం అడు గున గల మన్నునంతా పాశ్చాత్య దేశాలమీద గ్రుమ్మరించినా, మీరు మాకు చేస్తున్న దాంట్లో, మేం లవలేశం చేసినట్లు కూడా కాదు సుమా! అసలిదంతా ఎందుకు?

పాశ్చాత్య దేశాల్లో ఒక్కరిని మతం మార్చేందుకన్న మేమెప్పుడన్నా ఒక్క మిషనరీనైనా పంపామా? మేం మీతో చెప్పిందిది: మీ మతంలో మీరు సుఖంగా ఉండండి. కాని మా మతంలో మేమూ అట్లా ఉండేటట్లు అనుమతించండి.

'తరువాత శ్రీ వివేకానందులు క్రైస్తవ మత ప్రచారకులకు చెప్పిందిది. 'మీ కోతలు, గప్పాలు అలా ఉంచితే, ఖడ్గం సహాయం లేకుండా క్రైస్తవం ఎక్కడ విజయవంతమైనది. (with all your brag and boasting, where has your Cristianity succeeded without the sword?)

## సందేహాలకు సమాధానాలు



# జిజ్ఞాస

నిర్వహణ: ఋషిపీఠం

**పి.నవీన్ చంద్రగిరి**

ప్ర. బలి వామనునికి దానం చేస్తున్న సమయంలో, శుక్రాచార్యుడు పురుగుగా మారి కలశధారకి అడ్డు వచ్చాడనీ, దానితో వామనుడు దర్భ పుల్ల తీసుకుని శుక్రాచార్యుడి కన్ను పొడిచాడనీ కథ ఉంది కదా! వామనుడు అలా చేయడం న్యాయమా?

జ. నిజంగా ఈ కథ – 'వామన చరిత్ర' ఉన్న మూల భాగవతంలో లేదు. పోతనగారి భాగవతంలో కూడా కొన్ని ముద్రణలలో కనబడడం లేదు. తరువాతి వారెవరో కల్పించి ఉంటారు. దాన సమయంలో కులగురువుగా అసలు విషయాన్ని చెప్పడం బాధ్యత కనుక శుక్రాచార్యులు హెచ్చరించారు. అయినా సరే, విష్ణువని తెలిసి ఇంకా భక్తితో బలి సిద్ధమయ్యాడు. దానమిచ్చాడు. అంతే – మధ్యలో శుక్రాచార్యుడు పురుగుగా మారడం లేదు.

**సి.రామకృష్ణ గుంటూరు**

ప్ర. వాల్మీకి దారి దోపిడీ దొంగ అని ఒకచోట, బోయవాడనీ పక్షి జంటలో ఒక పక్షిని కొట్టగా మరో పక్షి శోకం చూసి శ్లోకం చెప్పాడనీ ఇంకోచోట చదివాను. ఏది నిజం. వాల్మీకి ఎవరి పుత్రుడు!

జ. వాల్మీకి ప్రచేతస మహర్షి కుమారుడు. కనుక ''ప్రాచేతనుడు'' అంటారు. ప్రచేతసుని పదవ పుత్రుడు – అని రామాయణంలో చెప్పబడింది. నారదుని ద్వారా రామచరిత్ర విన్నాక, వాల్మీకి మహర్షి భరద్వాజాది శిష్యులతో తమ నదీతీరానికి వెళతాడు. అక్కడ ఒక బోయవాడు క్రౌంచ పక్షుల జంటలో మగపక్షిని బాణంతో చంపుతాడు. అది చూసిన వాల్మీకి, కరుణతో చలించి, ఆ బోయవానిని నిందిస్తూ, వేదనతో శ్లోకం చెప్తాడు. అంతేగానీ వాల్మీకి బోయవాడు కాదు. అయితే – అధ్యాత్మ రామాయణం ప్రకారం, ప్రచేతసుని కుమారుడైన ప్రాచేతసుడు పసితనంలోనే దైవవశాత్తు, తప్పిపోయి ఒక దొంగల గుంపుకి కనబడతాడు. వారు అతడ్ని పెంచి పోషిస్తారు. అతడూ దొంగగా పెరుగుతాడు. కొంత కాలానికి సప్తర్షుల వల్ల, సత్యం తెలుసుకొని, రామనామోపదేశం పొంది, ఆ నామజపంతో మహాతపస్సు చేసి, తనచుట్టూ వల్మీకం (పుట్ట) ఏర్పడి, తిరిగి తపస్సు ఫలించాక పుట్ట నుండి దివ్యతేజస్సుతో వెలువడి, బ్రహ్మర్షియై, 'వాల్మీకి' (పుట్ట నుండి పుట్టినవాడు) అయ్యాడు. ఇది ప్రసిద్ధ రామాయణం కథే కనుక 'వాల్మీకి' పేరుకున్న ప్రశస్తిని బట్టి దీనిని ప్రమాణంగా భావించవచ్చు.

**చిన్నికృష్ణ వేటపాలెం**

ప్ర. శ్రీకృష్ణుడు పదహారు వేలమంది గోపికలను వివాహమాడాడా?

జ. పదహారువేలమంది 'గోపికలు' కారు. వారు నరకాసురుని వల్ల చెరలో బంధితులైన రాచ కన్యలు. నరకధానంతరం, వారిని శ్రీకృష్ణుడు బంధవిముక్తులను చేశాడు. వారంతా శ్రీకృష్ణునే పతిగా భావించారు. వారి భావనానుకనుగుణంగా 16 వేల రూపాలతో శ్రీకృష్ణుడు వారిని ధార్మికంగా వివాహమాడాడు. ఎవరికి వారికే కృష్ణుడు. ఆ లీలామయ చరిత్రను నారదుడు తిలకించి, ఏ ఇంటికి వెళ్లినా, ఆ ఇంటి గృహస్థుగా శ్రీకృష్ణుని ధార్మిక కృత్యాలను చూసి, ఆ యోగీశ్వరేశ్వరుని తత్త్వానికి ఆశ్చర్య చకితుడయ్యాడు.

**రాధాదేవి నాగాయలంక**

ప్ర. శ్రీరాముడిగా పాటించిన ధర్మం, శ్రీకృష్ణునిగా పాటించలేదేమి? రెండు అవతారాలలో తేడా ఎందుకు?

జ. అవతారాలలో తేడా ఉందేమో గానీ, ధర్మాచరణలో లేదు. శ్రీకృష్ణుడు కూడా శ్రీరాముని లాగే పితృవాక్య పాలకుడు, సత్యవ్రతుడు, ధర్మజ్ఞుడు, ధర్మప్రతిష్ఠాత. రెండింటి లీలలూ వేరు. లక్ష్యం, లక్షణం ఒకటే. ధర్మస్థాపన లక్ష్యం, ధర్మమయ జీవనం లక్షణం. అందుకు కృష్ణ కథ మూల భాగవతం, భారతం చదివితే అంతా స్పష్టమౌతుంది.

**టి.కల్యాణి కర్నూలు**

ప్ర. విష్ణు సహస్రంలో 'మహర్షిః కపిలాచార్యః' అని ఉంది కదా? అంటే కపిల మహర్షి విష్ణువు అవతారమని అర్థమా? ఎవరీ కపిల మహర్షి?

జ. కపిల మహర్షి నారాయణాంశ సంభవుడు. కర్దమ ప్రజాపతికీ, దేవహూతికీ జన్మించినవాడు. ఈ కపిలాచార్యుడు తల్లికి తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించిన మహాత్ముడు. ఈ మహర్షి 'సాంఖ్య మతానికి' ఆది.

**జె.రామబాయి ఆదోని**

ప్ర. ఆమధ్య 'ఋషిపీఠం'లో ''ఆ నగరం 22వ మహానరకంలా ఉంది'' అన్నారు. అంటే 21 నరకాలు ఉన్నాయని అర్థమా? ఆ 21 మహా నరకాలు ఏమిటి? అవి ఎక్కడ పేర్కొనబడ్డాయి?

జ. అది వివిధ పురాణాదుల్లో చెప్పబడ్డాయి. చిన్న చిన్న భేదాలున్నా, అన్నీ ఇంచుమించు ఒక పేర్లని చెప్పాలి. వాటి వివరాలు :

**ఏకవింశతి (21) మహా నరకములు**

| యాజ్ఞవల్క్యస్మృతి | భాగవత పురాణం | మనుస్మృతి | గరుడపురాణ |
|---|---|---|---|
| తామిస్రము | తామిస్రము | తామిస్రము | తామిస్రము |
| లోహశంకువు | అయఃపసానము | లోహశంకువు | లోహకుండము |
| మహానిరయము | మహారౌరవము | మహారౌరవము | మహారౌరవము |
| శాల్మలి | వజ్రకంటక శాల్మలి | శాల్మలి | శాల్మలి |
| రౌరవము | రౌరవము | రౌరవము | రౌరవము |
| కుడ్మలము | విశసనము | కుడ్మలము | కుడ్మలము |
| పూతిమృత్తికము | పూయోదము | ప్రతిమూర్తికము | పూతిమృతిక |
| కాలసూత్రకము | కాలసూత్రము | కాలసూత్రము | కాలసూత్రము |
| సంఘాతము | సందశము | సంఘాతము | సంఘాతము |
| లోహితోదము | సూకరముఖము | లోహదారకము | లోహితోదము |
| సవిషము | కృమిభోజనము | నది | సవిషము |
| సంప్రతానము | అంధకూపము | సంప్రతానము | సంప్రతానము |
| మహానరకము | వైతరణి | మహానరకము | మహానిరయము |
| కాకోలము | వాలాభక్షము | సకాకోలము | కాకోలము |
| సంజీవనము | ప్రాణరోధము | సంజీవనము | సంజీవనము |
| నదీపథము | సారమేయాదనము | పథము | మహాపదము |
| అవీచి | వీచి | మహావీచి | అవీచి |
| అంధతామిస్రము | అంధతామిస్రతము | అంధతామిస్రతము | అంధతామిస్రము |
| కుంభీపాకము | కుంభీపాకము | ఋజీషము | కుంభీపాకము |
| అసిపత్రవనము | అసిపత్ర వనము | అసిపత్రవనము | అసిపత్ర వనము |
| తపనము | తప్తోర్మి | తపనము | తపనము |

కె.సాయికృష్ణ నెల్లూరు

ప్ర. ఒక సామాన్య రజకుని మాట పట్టించుకొని సీతమ్మను అడవులపాలు చేయడం రాముని వంటి వానికి తగునా?

జ. రామాయణం ప్రకారం – 'సామాన్య రజకుని మాట' – అనే కథ లేదు. పట్టాభిషేకానంతరం శ్రీరాముడు సీతతో చాలాకాలం సుఖ జీవనం సాగించాడు. ఆ తరువాత ఆమె గర్భవతి అయ్యింది. ఒక రాత్రివేళ వారు సుఖాసీనులై మాట్లాడుకుంటూండగా, తనకు వాల్మీకుల వారి ఆశ్రమం చూడాలని వుందనీ, అక్కడ కొంత కాలం నివసించాలని వుందనీ – గర్భవతిగా నున్న సీతమ్మ కోరుకుంటుంది. ఆ సమయంలో – సభా భవనంలో పురజనుల అభిప్రాయం తెలుసుకునే సమావేశం జరగనుంది. శ్రీరాముడు సీతతో సంభాషించాక, ఆ సమావేశానికి వెళ్లాడు. అక్కడ అయోధ్య మంత్రి అయిన భద్రుడు, ఎంతో రామప్రేమ ఉన్నప్పటికీ, ప్రభుత్వ ధర్మపాలనలో భాగంగా, అయోధ్య ప్రజల అభిప్రాయాన్ని చెప్తాడు. అందరూ, శృంగాటకముల (జంక్షన్స్) దగ్గర కూడా ''సీతమ్మ ఏడాదిపాటు లంకలో ఉన్నప్పటికీ శ్రీరాముడు ఏలుకున్నాడు. ఎంతటి విమోహి?'' అని అనుకుంటున్నారన్న విషయం చెప్పాడు. 'దీనికి పరిష్కారంగా మీ అభిప్రాయమేమిట'ని రాముడు న్యాయవేత్తల్ని ప్రశ్నిస్తాడు. దానికి వారు మౌనంగా ఉంటారు. అది అర్థం చేసుకున్నాడు రాముడు. ఆ రోజుల్లో ప్రజాభిప్రాయం ఎలాంటిదైనా దానికి విలువ నివ్వాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. రాజుకి వ్యక్తిగత జీవితం కన్నా, ప్రజల వద్ద బాధ్యతగా స్పందించాల్సి వుంది. ఇది రాజధర్మం. సమావేశం చాలించి, లక్ష్మణుని పిలిచి, గుండె రాయి చేసుకొని, సీత వాల్మీకుల వారి ఆశ్రమం చూడాలని అంది కనుక, మరురోజు సకల మర్యాదలతో ఆశ్రమానికి తీసుకువెళ్లమ'ని ఆజ్ఞాపిస్తాడు. అంతేగానీ అడవుల్లో వదిలి రమ్మన లేదు. సీతమ్మను తాను శంకించలేదు. రామో విగ్రహవాన్ ధర్మః. లక్ష్మణుడు వాల్మీకి ఆశ్రమానికి తీసుకువెళ్లి, ఆశ్రమవాసుల రక్షణలో అమ్మవారిని ఉంచాడు. అడవిలో ఒంటరిగా వదల్లేదు.

బి.బద్రిరాజు కొవ్వూరు

ప్ర. మనసులో భక్తి ఉంటే చాలదా? గుళ్లూ గోపురాలూ వెళ్లాలా? అంటూంటారు చాలామంది. నిజమేనా?

జ. మనసులో భక్తి ఉన్నవాళ్లెవరూ ఇలా అనరు. మనసులోనూ, బయటా కూడా భగవత్ ధ్యాస లేనివాళ్లు మాత్రమే, తప్పించుకునేందుకు ఇలా అంటూంటారు లోకంలో. అయినా దేవాలయాలు మనసు కోసం మాత్రమే కాదు. మనసూ, దేహమూగల జీవుడు తనకే తెలియని పాశాలతో, పాపాలతో చుట్టుకుని ఉంటాడు. వాటిని నిర్మూలించగలిగే శక్తి – దేవతా శక్తులు నిక్షిప్తమైన చోట ఉంటుంది. మనకు మామూలు కంటితో చూడలేని సూక్ష్మ ప్రపంచం అనంతంగా ఉంది. దాని ప్రభావం మనపై ఉంది. వాటికి సంబంధించిన విషయమిది. ✦

# ఈనెల విశేషాలు

**6 ఏప్రిల్ 2000 నుండి**
**5 మే 2000 వరకు**

## శ్రీ ఎస్. రామమూర్తి శర్మ

(శ్రీ విక్రమ నామ సంవత్సర చైత్ర శుద్ధ విదియ (ఏప్రిల్ 6) నుండి; వైశాఖ శుద్ధ పాడ్యమి (మే5) వరకు)

**ముఖ్యదినాలు**

ఏప్రిల్ 2000

| | |
|---|---|
| 12 | శ్రీరామనవమి |
| 13 | మేష సంక్రమణం |
| 18 | చైత్రశుద్ధ పూర్ణిమ |
| 24 | గురుమౌఢ్య ప్రారంభం |
| 30 | ఏకాదశి |

### ✵ 12 శ్రీరామనవమి

చైత్రశుద్ధ నవమినాడు, పునర్వసు నక్షత్రాన మధ్యాహ్న సమయం, కర్కటక లగ్న మందు శ్రీరామచంద్రుడు ఆవిర్భవించాడు. సూర్యుడు మేషంలోనూ, ఐదు గ్రహాలు ఉచ్చ స్థానంలో ఉండగా శ్రీ మహావిష్ణువు శ్రీరాము నిగా అవతరించాడు. కనుక ఈరోజు మహా పర్వదినం. మధ్యాహ్నవ్యాప్తి అయిన నవమి శ్రీరామనవమి. ఈరోజు ఉపవాసం, శ్రీరామార్చన సర్వ శ్రేష్ఠం. అదే విధంగా లోక కల్యాణార్థం సీతారామ కల్యాణం జరపడం కూడా విశేషం.

ఆదిదంపతులైన లక్ష్మీనారాయణులే సీతారాములు. రామారాధన ఇహపర సౌఖ్య సంధాయకం. ఈరోజున రామాయణ శ్రవణం, పఠనం, రామకథాగానం మొదలైనవి విశేష ఫలప్రదం.



ఉగాది (ఏప్రిల్ 5) నుండి ఈనాటి వరకు 'శ్రీరామ నవరాత్రులు'గా తొమ్మిది రోజులు రామార్చన, రామాయణ పారాయణ జరపడం సంప్రదాయం.

అదేవిధంగా ఉగాది నుండి ఈ నవమి వరకు 'వసంత నవరాత్రులు'గా జగదంబా రాధన చేయడం కూడా సంప్రదాయం. సంవత్సరం మొత్తంమీద - ఆశ్వయుజంలోని 'శరన్నవరాత్రులు', చైత్రంలోని 'వసంత నవరాత్రులు' దేవీ ప్రీతికరం.

వారి వారి శక్త్యనుసారం అమ్మవారిని ఈ తొమ్మిది రోజులు పూజించితే ఆయురారోగ్య ఐశ్వర్యాలు, అమ్మ అనుగ్రహం లభిస్తాయి. తొమ్మిది రోజులూ చేయలేనప్పుడు ఈ నవమి నాడైనా అమ్మవారిని పూజించాలి.

అమ్మవారు, రాముడు - వైష్ణవీ శక్తి రూపాలు. ''యా ఉమా సా స్వయం విష్ణుః'' - నారాయణి అయిన ఉమాదేవే నారాయణుడు. అంతేకాక లలితోపాఖ్యానంలో అమ్మవారి పురుషరూపంగా శ్రీరాముని (విష్ణువును) వర్ణించారు.

కాబట్టే ''శ్రీనాథ సోదరి''గా గౌరిని పేర్కొన్నారు. కారణం - ఇరువురిలోనూ ఉన్న స్థితి కారక వైష్ణవశక్తి.

### ✵ 13 మేష సంక్రమణం

సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే కాలం. ఈరోజున విష్ణు సహస్ర నామాదుల పారాయణం, భగవదర్చన మంచి ఫలాన్నిస్తాయి.

### ✵ 18 చైత్ర శుద్ధ పూర్ణిమ

శివ, విష్ణు, అంబికారాధనలకు ప్రసిద్ధి. ఈరోజున శివపార్వతుల కల్యాణం జరిపిన వారికి సంతాన ప్రాప్తి తథ్యమని పెద్దలంటారు. దశరథుడు ఈరోజున శివపార్వతుల కల్యాణం జరిపించాడని, అందుకే శ్రీరాముని కన్నాడని కూడా ప్రసిద్ధి. ✦

**న కాష్ఠే విద్యతే దేవో,**
**శిలాయాం న కదాచన ।**
**భావేహి విద్యతే దేవః**
**తస్మాద్భావం సమాచరేత్ ॥**

దేవుడు కఱ్ఱలోనో, శిలలోనో ఉండడు. భావంలోనే ఉంటాడు. కాబట్టి భావమే ప్రధానం.

# ఆప్తవాక్యం

## శ్రద్ధయా సత్యమాప్యతే

### శ్రద్ధ చేతనే సత్యం లభిస్తుంది. – యజుర్వేదం

'సత్యం' అనేది త్రికాలాలలోనూ నశించనిది. అదే పరతత్త్వం, ఆత్మతత్త్వం. దానిని సాధించాలంటే 'శ్రద్ధ' ముఖ్యం. ఏ గొప్ప విషయాన్ని సాధించాలన్నా ఈ శ్రద్ధ ప్రధానం.

**'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం'** - అని భగవద్గీత(శ్రద్ధావంతునికేజ్ఞానం లభిస్తుంది).

'శ్రద్ధ' అంటే - చేసే పనియందు ఏకాగ్రత, సంపూర్ణ అవగాహన, ఆసక్తి, శక్తివంచన లేకుండా ఆచరించుట... అని అర్థం.

శ్రద్ధా విశ్వాసాలు రెండూ భక్తిలో ప్రధానమని తులసీదాసు పేర్కొన్నాడు. వాటిని భవానీ శంకరులుగా భావించాడు. అంటే పార్వతీ పరమేశ్వరులు ఎంత అవిభాజ్యులో, అలా శ్రద్ధావిశ్వాసాలు వీడకుండా ప్రధానమై ఉండాలని భావం.

**భవానీ శంకరౌ వందే**
**శ్రద్ధా విశ్వాస రూపిణౌ ।**
**యాభ్యాం వినా నపశ్యంతి**
**సిద్ధాః స్వాతంస్థ మీశ్వరమ్ ॥**

''శ్రద్ధా విశ్వాస రూపిణులైన భవానీ శంకరులకు నమస్సు. వారు లేనిదే సిద్ధులు హృదయంలో నున్న దైవాన్ని దర్శించలేరు.''

**నకర్మణా నతపసా**
**నజపైర్న సమాధిభిః ।**
**నజ్ఞానేన నచాన్యేన**
**వశ్యోహం శ్రద్ధయావినా ॥**

అని 'శివపురాణం'లో శివుడు పార్వతికి చెప్పిన మాటలు. ''నేను కర్మల చేత గానీ, తపముల చేతగానీ, జపముల చేతగానీ, సమాధుల చేతగానీ, జ్ఞానం చేతగానీ వశ్యుడను కాను. నేను కేవలం శ్రద్ధకే వశ్యుడను.''

**శ్రద్ధామయ్యస్తి చేత్పుంసాం**
**యేన కేనాపి హేతునా ।**
**వశ్యః స్పృశ్యశ్చ దృశ్యశ్చ**
**పూజ్య స్సంభాష్య ఏవచ ॥**

''నాపై శ్రద్ధ నుంచిన వారికి వశ్యుడనవుతాను. అంతేకాక - శ్రద్ధావంతుడు నన్ను స్పృశించగలడు, చూడగలడు, పూజించగలడు, సంభాషించగలడు'' అని 'సత్య' స్వరూపుడైన పరమేశ్వరుని మాట.

సత్యానుభవం కావాలంటే శ్రద్ధ ప్రధానమని శాస్త్రాలన్నీ స్పష్టీకరిస్తున్నాయి.

**సాధ్యా తస్మాన్మయి శ్రద్ధా**
**మాం వశీకర్తు మిచ్ఛతః**
**శ్రద్ధా హేతుస్స్వధర్మస్య**
**రక్షణం వర్ణినా మిహ ॥**

''కనుక నన్ను వశం చేసుకోడానికి శ్రద్ధను ఆవలంబించాలి. శ్రద్ధకు స్వధర్మ రక్షణమే కారణం.''

కాబట్టి స్వధర్మరక్షణం ప్రధానం.

ధర్మనిర్వహణ లేనిదే దైవం కూడా సాధ్యం కాదు.

ధర్మాన్ని విడచి ఎన్ని జపతపాలు చేసినా దైవం అనుగ్రహించడు. సత్య సాక్షాత్కారం జరగదు. 'ధర్మ నిర్వహణమే శ్రద్ధ' అని కూడా భావం. ✦

**రామో విగ్రహవాన్ ధర్మః । రామః సత్య పరాక్రమః ॥**

# MEMBERSHIP FORM

*Please fill in capital letters and mail to...*

**RUSHI PEETHAM PUBLICATIONS**

'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be a member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) ☐ 3 Years Rs 360/- (US $90) ☐

5 Years Rs 600/- (US $125) ☐ Donations Rs ..........................

Iam paying by cheque/D.D.No.............................................drawn on

.......................................................................for Rs...........................

date...............Favouring Rushi Peetham Publications.

Name : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

Sex : Male ☐ Female ☐ Age ☐

Address : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

City : ☐☐☐☐☐☐☐☐☐☐☐ Pin : ☐☐☐☐☐☐

Education : School ☐ College ☐ Graduate/Post Graduate ☐

Business ☐ Employed ☐ Retired ☐

P.T.O.

Please mention Addresses or E-mail of your Nearest & Dearest who have interest in Rushi Peetham, Bharatheeya Manasa Patrika

1

2.

3.

4.

5.

6.

7.

8.

9.

10.

11

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

---

Owned & Published by : **UPADRASTA SIVAPRASAD** From : No.6, 4th Floor, No.85, G.N.Chetty Road, T.Nagar, Chennai - 600 017.
Printed By : **V.C. Chermakani, Sakthi Process,** No. 21F Kumballamman Koil St., Chennai - 600 081. Edited by : **SAMAVEDAM SHANMUKHA SARMA**

# 'ఋషిపీఠం' సంస్కృతి సంఘం
## నిర్వహణకు ఆహ్వానం

ఆర్ష (ఋషి) విద్యావ్యాప్తికి మాస పత్రిక నిర్వహణతోపాటూ, ఇతర ప్రచురణలు, ఆడియోలు వెలువరించడమే కాక – ఊరూరా సనాతన సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని వివిధ కార్యక్రమాల ద్వారా తెలియజేయాలని ఈ సంస్కృతి సంఘం సంకల్పం.

మన సనాతన భారతీయ ధర్మానికి వారసులైన, చిత్తశుద్ధి కలిగిన, ఆసక్తిపరులు తమ వివరాలను, పూర్తి చిరునామాను తెలియజేస్తూ 'ఋషిపీఠం'కి వ్రాయండి. వారిలో ఎంపిక చేసిన వారిని ఆ ప్రాంతానికి ''ఋషిపీఠం సంస్కృతి సంఘ ప్రతినిధి''గా గౌరవించి, సంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ బాధ్యతను ''ఋషిపీఠం'' – అప్పగిస్తుంది.

ఆ సంఘంలో సభ్యులను చేర్పించడం 'ఋషిపీఠం' లక్ష్యాలను చిత్తశుద్ధిగా, బాధ్యతాయుతంగా వ్యాప్తి చేయడం, కార్యక్రమ నివేదికలను క్రమం తప్పకుండా మాకు పంపడం ప్రతినిధికి తప్పనిసరి బాధ్యత.

ఈ సంస్కృతి సంఘ అభ్యున్నతికి వలసిన సహాయాన్ని అందజేసేవారు ఆ ప్రతినిధికిగానీ, 'ఋషిపీఠం'కి నేరుగా గానీ విషయం తెలియజేయవచ్చు. ఋషిసంస్కృతిపట్ల నిష్ఠ, ధర్మదృష్టి, చిత్తశుద్ధి – ఇవే ఈ సంస్కృతి సంఘం ప్రాతినిధ్యానికి కనీసార్హతలు.

ఉత్సాహవంతులైన వారు ''ఋషిపీఠం – భారతీయ మానస పత్రిక'' చిరునామాకు వివరాలతో సహా ఉత్తరం వ్రాయండి.

*- సంపాదకుడు*

శ్రీమత్పయోనిధినికేతన! చక్రపాణే!

భోగీంద్ర భోగ మణిరంజిత పుణ్యమూర్తే!

యోగీశ శాశ్వత శరణ్య! భవాబ్ధి పోత!

లక్ష్మీనృసింహ! మమదేహి కరావలంబమ్ ॥



"శ్రీమంతమైన క్షీరసాగరాన్ని నివాసంగా చేసుకున్న చక్రహస్తా! సర్ప రాజమణులచే ప్రకాశిస్తున్న పుణ్యమూర్తీ! (నరసింహునికి గొడుగులా సర్పరాజు పడగలుంటాయి.) వాటి మణుల ప్రకాశాల నడుమ దీపిస్తున్న మూర్తీ! యోగీశ్వరులు శాశ్వతంగా శరణు వేడే స్వామీ! సంసార సముద్రాన్ని దాటించే నావ వంటి వాడా! లక్ష్మీనృసింహా! నాకు చేయూతనీయుమా". ఇది ఆదిశంకరులు విరచించిన 'లక్ష్మీనృసింహ కరావలంబన స్తోత్రం' లోనిది.

# నమస్సు

**నమోస్తు విష్ణవే తస్మై యస్యాఽభిన్నమిదం జగత్ ।**
**ధ్యేయః స జగతామాద్యః స ప్రసీదతు మేఽవ్యయః ॥**
**యత్రోత మేత త్ప్రోతం చ విశ్వమక్షరమవ్యయమ్ ।**
**ఆధారభూతః సర్వస్య స ప్రసీదతు మే హరిః ॥**
**ఓం నమో విష్ణవే తస్మై నమస్తస్మై పునః పునః ।**
**యత్ర సర్వం యతః సర్వం యః సర్వం సర్వసంశ్రయః ॥**

'' ఈ జగత్తు ఎవనికి అభిన్నమో ఆ విష్ణువునకు నమస్సు.

సర్వజగత్తుకీ ఆది కారణమై, సర్వ యోగులకూ ధ్యేయమైన అవ్యయుడు (తరుగుదల లేనివాడు) నా యెడల ప్రసన్నుడగుగాక.

ఎవనినుండి విశ్వమంతా సృష్టిస్థితి లయాదులతో ప్రవాహరూపంగా జరుగుతోందో. ఆ అక్షర (నాశరహితుడు), అవ్యయ తత్వమైన నారాయణుడే సర్వమునకూ ఆధారభూతుడు. ఆ హరి నా ఎడల ప్రసన్నుడగుగాక!

సర్వం ఎక్కడవుందో, ఎక్కడినుండి ఉన్నదో, సర్వమూఏదో, దేని నాశ్రయించి వుందో అదే హరితత్వం, ఆ విష్ణువునకు నమస్సులు. పలుమార్లు నమస్సులు.

(విష్ణుపురాణం)

# ఋషిపీఠం

భారతీయ మాసపత్రిక

మే 2000

సంపుటి 1 సంచిక 10

వ్యవస్థాపక సంపాదకుడు :
**సామవేదం షణ్ముఖశర్మ**

ప్రచురణకర్త
**ఉపద్రష్ట శివప్రసాద్**





చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై-600 017. ఫోన్ : 8281159

# మనకి 'శుభ్రత' మరొకరు బోధించాలా!

మన భారతదేశంలో 'శుభ్రత' అనేది శూన్యం. పరిసరాలు కలుషితం చేసుకోవడం మనకలవాటు. దీనితో విదేశస్థుల్లో కొందరు మనదేశాన్ని ''ప్రపంచదేశపు చెత్తబుట్ట'' (Dustbin of the World) అని అన్నవాళ్లూ ఉన్నారు. ఒక కోణంతో చూస్తే దాన్ని సమర్థించవచ్చు - విదేశీ సంస్కృతిలోని చెత్తనంతా మనం పోగుచేసుకుంటున్నాం కనుక.

అదలావుంచితే - ఈ 'అపరిశుభ్రత' మనకి సంప్రదాయం కాదు, శుభ్రతగురించి, పరదేశస్థులు చెబితే గ్రహించాల్సిన దౌర్భాగ్యస్థితికి చేరుకున్నామంటే ఎంత పతనావస్థలో ఉన్నామో స్పష్టమౌతోంది. శుభ్రత విషయం సమగ్రంగా ప్రపంచదేశాలకు తెలియాలి అంటే - భారతీయ సనాతన ధర్మగ్రంథాలని చదవాలి. పరదేశాల పాలనలో మ్రగ్గిపోయి, వారి పశు నాగరికతా ప్రభావంచేత మనకీ దుస్థితి దాపురించిందేమోగానీ - 'శుభ్రత గురించి' ప్రపంచానికి బోధించడంలోనూ మన ఋషి సంస్కృతే జగద్గురు స్థానం వహిస్తుంది.

మనకి పుణ్యనదులు చాలా ఉన్నాయి. వాటి స్నానఘట్టాల దగ్గరకి, స్నానం చేద్దామని వెళితే సర్వభ్రష్టంగా, పరమ అసహ్యంగా ఉంటాయి. ఇంచుమించు అన్ని పుణ్యనదుల్లోనూ ఇదే పరిస్థితి. కానీ నదీస్నానం ఎలా చేయాలో మన సంస్కృతి చెప్పింది. అది గమనించాలి.

నదుల్లో స్నానానికి అవసరమైనంత మేర స్వల్పంగా ఈత కొట్టడంవేరు. అంతేగానీ ఈతకోసం నదీజలాలను ఉపయోగించ కూడదు. నగ్నంగా స్నానం చేయకూడదు.

నదులలో, నదీతీరాలలో మలమూత్రవిసర్జన, ఉమ్మివేయడం మహాపాతకం. అంతేకాదు స్నానం చేసిన తడిబట్టనీరు సైతం నది నీటిలోకి వెళ్లేలా పిడవకూడదు. కొంత దూరం వచ్చి, ఏదైనా రాతిప్రాంతం చూసి అక్కడే పిడవాలి.

అలాంటిది మనం బట్టలూ అక్కడే ఉతికి, ఉమ్మివేస్తూ, షాంపూ స్నానాలు చేస్తూ ఎంత పాపం చేస్తున్నాం. అలాంటి స్నానాలు చేస్తే పుణ్య నదీస్నానపుణ్యఫలం లభించదు సరికదా, శాస్త్రవిరుద్ధంగా అశౌచంగా ప్రవర్తించిన ఘోరపాతకఫలాన్ని అనుభవించ వలసి వస్తుంది.

నదిని దేవతగా, తల్లిగా భావించిన ఈ సంస్కృతిలో అమ్మను అవమానించడం ఎంత విచారకరం! నదీ స్నాన సమయంలో చేయకూడనివి ఈ వేద మంత్రం చెప్తోంది.

**నాఽప్సు మూత్రపురీషం కుర్యాత్**
**ననిష్ఠీవేత్ న వివసనస్స్నాయాత్ ..** (అరుణం)

అలాగే ధ్యానం, పూజ, వంట మొదలైనవి చేసే స్థలంలో పరిశుభ్రత చాలా అవసరం. మరో సంస్కృతికి తెలియనిదీ, మన సంస్కృతికే తెలిసినదీ మరొకటి వుంది - అది ''శౌచం''.

శౌచం - అంటే బాహ్యప్రపంచ శుభ్రతతోపాటు, సూక్ష్మప్రపంచ ప్రభావం... భారతీయఋషి దర్శించి ఏనాడో ప్రబోధించాడు. స్థూలప్రపంచం మాత్రమే చూసే సంకుచిత దృష్టికి ఆ రహస్యం బోధపడక, ఎన్నో శౌచాచారాలు దూరంగా వెళ్ళిపోయాయి.

ఉభయ సంధ్యల్లో స్నానం, అభ్యంగన స్నానం, మంగళ స్నానం మొదలైన వివిధ స్నానాలు మనకి ఉన్నాయి. నిత్యకర్మలకీ, దైవకర్మలకీ, ఆహారసేవనానికీ కూడా స్నానం ముఖ్యం. స్నానం చేయకుండా అవి చేయడం పాపం కూడా. విజ్ఞానశాస్త్ర ప్రకారం - ఒక రాత్రి నిద్రలో మన శరీరంలో ఎన్నో నిర్జీవకణాలు చర్మం ద్వారా, శరీర రంధ్రాల ద్వారా బయట పడతాయి. అటువంటి ఒంటితో వంట, దైవ పూజవంటివి చేస్తే అంతా రోగక్రిమిమయమై, అనారోగ్య కేతువౌతుంది.

భౌతిక విజ్ఞాన దృష్టితో ఈ మాత్రమే వ్యాఖ్యానించవచ్చు. కానీ ఇంతకుమించిన సూక్ష్మప్రపంచ దృష్టితో, దేవతా శక్తులు (Positive forces) నిత్యశుద్ధాలు. క్షుద్రమైన విపరీత శక్తులు (Negative Powers) అశుభ్రతని ఆశ్రయించుకుంటాయి. కాబట్టి శబ్దశక్తితో, భావనాశక్తితో మనస్సునీ, మనిషినీ, సూక్ష్మప్రపంచాన్నీ శుద్ధిచేసే ప్రక్రియని మనసంప్రదాయం ప్రవేశపెట్టింది. అందుకే దైవనామ స్మరణ, దైవభావన, 'అఘమర్షణ మంత్రోచ్చరణ' మన స్నానాలలో ఉన్నాయి. అంటే 'బాహ్య - అభ్యంతరశుభ్రత' ఇక్కడ ప్రధానం. శుభ్రత విషయంలో కూడా విదేశీయులకన్నా ఎన్నో మెట్లుపైన ఉంది మన ఋషిసంప్రదాయం.

కానీ దానిని విస్మరించడం, ప్రచారం చేయకపోవడం మన అపరాధం ప్రతి నదీ తీరంలో, క్షేత్రాలలో స్వచ్ఛంద సంస్థలు పూనుకొని ఒక ఉద్యమంలా ప్రజలకి ఈ విషయాలు చెప్పి వాటి పావిత్ర్యాన్ని కాపాడాలి. శుభ్రతని భంగపరచే వారిని కఠినంగా శిక్షించే పద్ధతులు అమలు పరచాలి.

ఇదిలా వుండగా - 'మడి' అనేది శౌచంలో ప్రధానం. మడిగా

వండి, దేవునికి నివేదించడం వల్ల దైవీశక్తి (Positive Power) వలన ద్రవ్యగత దోషం, విపరీత శక్తుల ప్రభావం లేకుండా ఆహారం శుద్ధమవుతుంది. ఆ ఆహార శుద్ధివల్ల, సత్త్వశుద్ధి, తద్వారా చిత్తశుద్ధి, క్రమంగా కైవల్యం. అందుకే నిరంతరం శౌచానికి ప్రాధాన్యమిచ్చారు. ఈ శౌచం ఏ ఒక్క జాతికో, ఏ ఒక్క వర్గానికో పరిమితం కాదు. అందరికీ అవసరం.

అయితే ఈ 'వండి' అనే దానిపట్ల కూడా అవగాహన కోల్పోయాం. తడి బట్టలతో వండడం, పరిసరాలన్నీ పరమ అసహ్యంగా ఉంచుకొని వండడం శౌచం కాదు. తడి బట్టలతో వంట వండడం కూడా అపరాధంగా చెప్పింది శాస్త్రం.

తడిపాక బాగా ఆరిన వస్త్రాన్నే కట్టుకోవాలి. అలాగే భోజనం చేయడంకూడా. ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ తినరాదని చెప్పారు. అయితే దీనిని చాదస్తం కింద పారేస్తాం. ఉచ్ఛిష్టాలు (ఎంగిళ్ళు), అపరిశుభ్రత వంటివున్నచోట తినడం అనారోగ్యానికి హేతువని అందిరికీ తెలిసిందే. అంతేకాక వండేవారి మనఃప్రవృత్తుల ప్రభావం వంటమీద ఉంటుందని ఇటీవల చాలామంది విజ్ఞాన శాస్త్రవేత్తలు ఘోషించారు. మరి వీటిని ఏనాడో దర్శించిన ఋషి సంస్కృతి మాటని ఏమంటాం? మంచి భావాలతో, దైవభావనతో వండాలనీ, ఒకచోట కూర్చుని, దైవస్మరణతో భుజించాలని మన సంప్రదాయం. అంట్లు, ఎంగిళ్లు కలపడం పనికిరాదని అంటారు. వండిన వంట ఆ సమయంలోనే శుద్ధం. తరువాత ఒక్కమెతుకు బైటవున్నా అది బాక్టీరియాకి కారణమౌతుంది. కాబట్టి నిలవవంటల్ని తినడం 'అశౌచం' అన్నారు. భారతీయుడీ మాట చెప్తే మనం 'చాదస్తం' అంటాం. విదేశస్థుడు చెప్తే 'సైన్స్' అంటాం. ఎలాపడితే అలా ఒళ్లో కంచాలు పెట్టుకొని తినడం, మంచాలపై తినడం, తినే చేత్తోనే వండిన పాత్రల్ని ముట్టుకోవడం, ఎప్పుడు పడితే అప్పుడు తినడం, తిన్న తరువాత ఆ చోటుని నీటితో శుద్ధి చేయకపోవడం ఇవన్నీ అసలైన అనాగరిక చిహ్నాలు. కానీ మన సంప్రదాయప్రకారం తినే పద్ధతి ఎంత అభివృద్ధిచెందిన నాగరికమో ఆలోచించుకోండి.

పరిశీలించి వైజ్ఞానికంగా చూస్తే, కళ్లు మిరుమిట్లుగొలిపే ఆర్షవిజ్ఞాన దీధితికి నమస్కరిస్తాం. ఇంకా సూక్ష్మప్రపంచ దృష్టితో చూస్తే మరింత నమ్రులమై ఈ సంస్కృతికి భక్తులమవుతాం.

లోపలదరిద్రాన్ని దాచి, బైట అందమైన 'ప్యాకింగ్' చేసే 'పైపైమెరుగుల సంస్కృతి' మనదికాదు. లోపలా, బయటా కూడా శుద్ధత్వాన్నే ఉంచిన 'శౌచసంస్కృతి' మనది.

అందుకే ధర్మంలో శౌచానికి ప్రాధాన్యం ఇచ్చారు. సత్యం, అహింస, శౌచం, అస్తేయం... ఈ నాలుగు ధర్మవృషభానికి నాలుగు కాళ్ళు.

అయితే మన సంస్కృతిని ఇప్పుడు దూరం చేశాం. ఒక వైపు అవగాహనారాహిత్యం, మరోవైపు మనసంస్కృతిని మనమే గౌరవించని నెత్తికెక్కిన అహంకారం, పరవ్యామోహం... ఇవన్నీ ఆదివ్యసంప్రదాయ ప్రకాశాన్ని మనం కోల్పోతున్న అవస్థకి కారణాలు. మంచినీళ్లని కూడా కొనుక్కొని తాగవలసి వచ్చిన ఈ కలికలుషానికి ఇవే హేతువులు.

కలుషితమైన పుణ్యనదిలాంటి భారతీయసంస్కృతి వాహినిని వినిర్మలం చేసేందుకు త్రికరణశుద్ధిగా కృషిచేసే సంకల్ప బలాన్ని మనకు ఆ దైవం ప్రసాదించాలని ప్రార్థిద్దాం.

సామవేదం షణ్ముఖశర్మ.

## ఏజెంట్లకు గమనిక!

'ఋషిపీఠం' భారతీయ మానసపత్రికకు పాఠకాదరణ అనూహ్యంగా లభిస్తోంది. అయితే సుస్థిర భవిష్యత్తులో ఈ పత్రికను సువ్యవస్థితం చేసేందుకు, ఏజెంట్ల సహకారం అవసరం.

మే నెల నుండి డిపాజిట్లు కట్టే ఏజెంట్లకు మాత్రమే 'ఋషిపీఠం' ఏజెన్సీ ఇవ్వబడు తుంది. కనుక ఆసక్తి గలవారు వెంటనే 'ఋషిపీఠం' చిరునామాను సంప్రదించండి.

- సర్క్యులేషన్ మేనేజర్
ఋషిపీఠం

## పాఠకులకు గమనిక

## ఋషిపీఠం'

భారతీయ మానసపత్రిక మీ ఊరిలో లభ్యంకాని యెడల, వెంటనే చందాదారులుగా చేరి, క్రమం తప్పకుండా పత్రికను అందుకోండి!

- సర్క్యులేషన్ మేనేజర్



# సూర్యాది దేవతాశక్తులను దర్శించిన
# "వామదేవ మహర్షి"

ఋషులలో ప్రాముఖ్యమున్న వామదేవుని ప్రసక్తీ, ప్రశస్తీ ఋగ్వేదంలోనూ, పురాణాల్లోనూ కనబడుతోంది.

గౌతమ మహర్షికుమారుడైన వామదేవుడు 'గోత్రకర' ఋషులలో ప్రముఖుడు. తపస్సు, స్వాధ్యాయం, అనుష్ఠానం, ఆత్మనిష్ఠలలో గణనీయమైన ప్రసిద్ధిని సాధించాడు.

ఇంద్ర, అగ్ని, సవితా దేవతల ఉపాసకుడు. ఆయన జీవితంలో శౌచం, అపరిగ్రహం (ఇతరుల నుండి ఏమీ స్వీకరించక పోవడం), పరహితం వంటి ఉదాత్తభావాలు ప్రతిష్ఠితమయ్యాయి.

తపస్స్వాధ్యాయ ఆధ్యాత్మసాధనల బలంపై ఆయన మంత్రశక్తి దర్శనం సాధ్యమయ్యింది.

రామాయణాదుల్లో కూడా ఆయన వైశిష్ట్యాన్ని పేర్కొన్నారు. దశరథుని ప్రధాన ఋత్విక్కుల్లో ఒకనిగా వాల్మీకి రామాయణం పేర్కొంది. రవికుల పురోహితుడైన వసిష్ఠునితో పాటూ ఈ మహర్షిని ప్రస్తావించింది రామాయణం.

**ఋత్విజౌ ద్వావభిమతౌ**
**తస్యాస్తాం ఋషిసత్తమౌ।**
**వసిష్ఠోవామదేవశ్చ**
**మంత్రిణశ్చతథాపరే॥**

(వాల్మీకి రామాయణం)

ఋగ్వేదంలోని ఒక మండలానికి ద్రష్ట అయిన వామదేవుడు - సహజజ్ఞాన శోభితుడని వాయుపురాణం చెప్తోంది. 'జ్ఞానతో ఋషితాంగతః' - జ్ఞానమువలన ఋషిత్వాన్ని పొందాడని ఆ పురాణవాక్యం.

ఋగ్వేదంలో ఆయన పరిచయం లభిస్తోంది. గర్భగతుడై ఉన్నప్పుడే బ్రహ్మవిద్యామయునిగా, ఆత్మజ్ఞానిగా దీపించినట్లు ఆ వేదవృత్తంలో స్పష్టమౌతోంది.

గర్భంలో ఉన్నప్పుడే ఆయన జ్ఞానబోధచేస్తూ, జన్మవేదన లేకుండా, ఒక పక్షివలె వెలుపలికి వచ్చాడు. ప్రకృతికి విరుద్ధంగా జరిగిన ఈ పనికి ఇంద్రుడు కోపగించుకున్నాడు. దాంతో దివ్య వాక్కులతో ఇంద్రుని ప్రసన్నం చేసుకున్నాడు. ఆ సూక్తములతో శాంతిపొంది, ఇంద్రుడు వామదేవుని అనుగ్రహించాడు.

గర్భస్థుడై ఉన్నప్పుడు వామదేవుడు చెప్పిన ఆత్మవిద్యావచనాలు కూడా లోతైన అవగాహనతో కూడిన తాత్త్విక ప్రకాశాన్ని పట్టి చూపిస్తాయి.

కొంతకాలానికి - కాలవశాత్తూ దారిద్ర్య పీడితుడైనప్పుడు, దివ్యసూక్తాలతో ఇంద్రుని స్తుతించగా, ఇంద్రానుగ్రహంచేత సంపన్నుడైనట్లుగా ఋగ్వేదంలో చెప్పబడింది.

'దేవతలలో శ్రేష్ఠుని'గా ఇంద్రుని తత్త్వాన్ని ఆ సూక్తాలు వ్యాఖ్యానించాయి.

విశ్వామిత్రుని ద్వారా దృష్టమైన 'సంయాతసూక్తం' వామదేవుడే ప్రచారంలోకి తీసుకువాచ్చాడు.

వామదేవుని యజ్ఞానికి ఇంద్రుడు స్వయంగా రక్షకుడై ఉన్నాడు.

గాయత్రి దివ్యశక్తికి ఉపాసకునిగా కూడా వామదేవుడు ఋషి శ్రేష్ఠుడయ్యాడు. 24 అక్షరాల గాయత్రిలో ఒక్కొక్క అక్షరానికీ ఒక్కొక్క ఋషీ ''ద్రష్ట''గా శాస్త్రం చెప్తోంది. అందులో 5వ అక్షరానికి వామదేవుడే ఋషి.

ఇంద్రతత్వంతోపాటూ అగ్నితత్వాన్ని కూడా తన సూక్తాలద్వారా ప్రత్యక్షంచేశాడీ మహర్షి.

'వామదేవ-మండలం' (ఋగ్వేదీయం) లో వామదేవుడు దర్శించిన మంత్రాలలో రాజర్షికుత్సుని గాథ కూడా ఎంతో తత్త్వాన్ని అందిస్తోంది.

సౌరశక్తిని దర్శించి, ఆవిష్కరించడంలో కూడా వామదేవుని ఆర్షశక్తి ద్యోతకమవుతుంది. సూర్యభగవానుని సర్వాత్మగా, సర్వవ్యాపకునిగా, సర్వనియంతగా, సర్వాధారుడైన పరబ్రహ్మగా నిరూపించాడీ మహర్షి.

''హంసః శుచిషత్'' అనే ప్రసిద్ధ ఋగ్వేదమంత్రం ఈ మహర్షిచేత దర్శింపబడింది.

''ఆదిత్యమండలంలో, దాని మధ్యలో నున్న హిరణ్మయ పురుషుడు ద్యులోక ప్రతిష్ఠాత్మక ఉపాసితుడు. ఆ సూర్యుడే గార్హపత్యాగ్ని, లౌకికాగ్ని. జీవులలో చైతన్య రూపమైన అంతరాత్మగా భాసించే సత్య స్వరూపుడు సూర్యభగవానుడే. వ్యోమంలో, ఉదకంలో, రశ్ములలో ప్రకటింపబడేది ఆయన తేజమే. ఇతరదేవతలు కేవలం ఉపాసకులకే ప్రత్యక్షం. ఆదిత్యుడొక్కడే సర్వులకూ ప్రత్యక్షదైవం. విద్యుద్రూపంలో భాసించేదీ ఈ దైవమే. సర్వులూ ఉపాసించ దగ్గ బ్రహ్మతత్త్వము ఆదిత్యుడు'' - అని సౌరశక్తిని ప్రతిష్ఠించాడు వామదేవుడు.

ఈ మహర్షి దర్శించిన మంత్రభాగంలో వార్తాశాస్త్రం, కృషిశాస్త్రాలకు సంబంధించిన అనేక మంత్రాలు ఉన్నాయి. ఆజ్యసూక్తాదులు కూడా ఎంతో ఆర్షవిజ్ఞానాన్ని అందజేసే మంత్ర భాగాలు. పంచదేవతాపరమైన మంత్రాలు సైతం ఉపాసన విషయకంగా ఎన్నోరహస్యాలు తెలియజేస్తున్నాయి.

ఈ విధంగా ఋగ్వేదీయ చతుర్థ మండల మంత్రభాగాలను దర్శించిన వామదేవుని బ్రహ్మవిద్యాసంపత్తి వేదప్రసిద్ధం. ✷

ముఖచిత్ర కథనం

# శ్రీరామదూతం శిరసానమామి



***బుద్ధిర్బలం యశోధైర్యం***
***నిర్భయత్వ మరోగతా।***
***అజాడ్యం వాక్పటుత్వంచ***
***హనుమాన్ స్మరణాత్ భవేత్॥***

''హనుమంతుని స్మరణవల్ల బుద్ధి, బలం, యశస్సు, ధైర్యం, నిర్భయత్వం ఆరోగ్యం, చైతన్యం, వాక్పటిమ లభిస్తాయి.''

శ్రీమద్రామాయణ మహాకావ్యం మన భారతీయుల సనాతన ధర్మగ్రంథాలలో ప్రథమగణ్యమైనది. యావద్భారతమేకాక, యావత్ ప్రపంచం వేనోళ్లా కీర్తించే ఈ దివ్య కథని ఆదిగా వాల్మీకి కావ్యంగా రచించాడు.

మంత్రశక్తులను గర్భీకరించుకున్న శ్లోకాలతో ఆదినారాయణుని పూర్ణావతారమైన శ్రీరాముని కథను 'రామాయణం'గా రచించారు. ఇందులో మూడు రత్నాలు ఉన్నాయి. ఒకటి - విష్ణువు: రాముడు, రెండు - శక్తి: సీత, మూడు - రుద్రుడు: హనుమంతుడు. వీరు ముగ్గురు ఉపాస్యమూర్తులు.

రామాయణ కావ్యమున అవతార మూర్తులైన వీరు ముగ్గురూ ఆదర్శ మూర్తులుగా మానవజాతికి తమజీవితాన్ని మహోపదేశంగా చూపినవారు. ఎంత ఆదర్శ మూర్తులో, అంత ఆరాధ్యమూర్తులు.

మానవీయ ఆదర్శాలతో పాటూ, దైవీయ అనుగ్రహాన్ని కూడా ప్రకటించే వీరి తత్వాలను అనేక ఆగమ శాస్త్రాలు, రామాయణాలు, ఉపనిషత్తులు వివరించాయి.

హనుమంతుని వినయం, పాండిత్యం, ధీబలం, వజ్రాంగబలం, సచ్ఛీలత, యోగ శక్తి, వాగ్వైదుష్యం, భక్తిశక్తి, కార్యకౌశలం, దీక్ష, లక్ష్యసాధన, యుక్తి, సమయస్ఫూర్తి... వంటి గొప్పగుణాలు రామాయణకథలో చకచ్చకితంగా ప్రకాశిస్తున్నాయి.

ఆంజనేయుని దివ్యచరిత్ర రామాయణంలోనే కాక, స్కాంద, పాద్మ, అగ్ని, నారద, మార్కండేయాది పురాణాలలోనూ, పరాశరసంహిత, అగస్త్యసంహిత, శౌనకసంహిత, సుదర్శనసంహితమొదలైన మంత్ర శాస్త్ర గ్రంథాలలోనూ చాలా విస్తృతంగా వివరించారు.

***దుష్టానాం శిక్షణార్థాయ***
***శిష్టానాం రక్షణాయచ।***
***రామకార్యార్థ సిద్ధ్యర్థం***
***జాతః శ్రీహనుమాన్ శివః॥***

(పరాశరసంహిత)

సాక్షాత్తు శివుడే దుష్టశిక్షణకై, శిష్టరక్షణకై, రామకార్యార్థ సిద్ధికై హనుమంతునిగా అవతరించాడు.

***వైశాఖేమాసి కృష్ణాయాం***
***దశమీ మందసంయుతా।***
***పూర్వాభాద్రా కుంభరాశౌ***
***మధ్యాహ్నే కర్కటాంశకే।***
***కౌండిన్యవంశే సంజాతో***
***హనుమానంజనోద్భవః॥***

వైశాఖమాస, కృష్ణపక్ష దశమి, శనివారం నాడు పూర్వాభాద్ర నక్షత్రాన, కుంభరాశిలో, మధ్యాహ్నవేళ కర్కటాంశ యందు, కౌండిన్య వంశాన జన్మించాడు ఆంజనేయుడు.

శివుని అష్టమూర్తులలో ఒకడు వాయుదేవుడు.

కేసరి అనే వానరవీరుని భార్య అయిన అంజనాదేవి తపఃఫలంగా వాయువుద్వారా రుద్రతేజం అంజనలో ప్రవేశించింది. ఆ అంజనాదేవి గతజన్మలో ''పుంజికస్థల'' అనే అప్సరస.

రుద్రతేజస్స్వరూపుడైన ఆంజనేయుడు సకల దేవతాత్మకుడు.

***ఆంజనేయః పూజితశ్చేత్***
***పూజితా సర్వదేవతా***

ఆంజనేయుని పూజించితే, సర్వ దేవతలను పూజించినట్లే. బాల్యమందే ఫలమని భ్రమించి సూర్యమండలానికి ఎగసిన వీరాంజనేయుని సమస్తదేవతలు దీవించి తమ తమ శక్తులను ఆయన కిచ్చారు. ఏ అస్త్రశస్త్రాల చేతగానీ బాధింపబడకుండా ఉండేలా వరాలనను గ్రహించారు.

ఆయన బాల్యంలో చేసే అల్లరి భరించలేక 'అనవసరమైన వేళ వరకు తన బలం తనకు గుర్తుకాకుండా మహర్షులు శాసించారని కథ. అందుచేతనే వాలిని చంపకుండా, సుగ్రీవునితో పాటు పారిపోయాడని ఉత్తర రామాయణకథ.

అయితే రామకార్యం కోసమే అవతరించిన హనుమ, తదితర కార్యాల జోలికి

వెళ్లననే సంకల్పం చేతనే, సముద్ర లంఘనం వరకు తన విజృంభణని ప్రదర్శించలేదు. శ్రీరామదూతగా, రామకార్యసిద్ధి చేసేందుకై అవతరించాడు కనుక, ఆ వేళవరకు జాంబవంతుడు కూడా కనుమప్రతాపాన్ని తెలియజేయలేదు.

**రామాయణ మహామాలా రత్నం**
**వందేఽనిలాత్మజమ్ ॥**

రామాయణమనే మహామాలకు మణిపూసలా ప్రకాశించే దైవం హనుమ.

హనుమంతుడే ప్రధానదైవంగా నడిచిన 'సుందరకాండ' మహామహిమాన్వితమైన కాండగా పారాయణాది విధులకు వినియోగిస్తున్నారు. వాటివల్ల దివ్యఫలాలని పొందుతున్నారు. సుందరకాండలో ఆది నుండి అంతంవరకు హనుమంతుడు లేని ఘట్టం లేదు. ప్రతిచోటా ఆయనను అనుసరించి మనహృదయం ఆనందమయమవుతుంది.

పూర్తిశక్తితో విజృంభించి సముద్ర లంఘనంచేసి, యుక్తితో శక్తితో మైనాక, సురసలను దాటుకొని, సింహికని చంపి, లంకిణిని అణచి, సీతమ్మ జాడకనిపెట్టి, తన మహద్రూప ప్రదర్శనతో సీతమ్మచేత ప్రశంసలందుకొని, మహారాక్షస వీరుల్ని తుదముట్టించి, రావణుని హడలెత్తించి, లంకా దహనం చేసి, రాముని ఎదుటనిలిచిన ఆ మహా రుద్రుని గాథ దివ్యమై ఎన్నో మహిమలను కలబోసుకుంది.

స్వకీయమైన సహజతేజం రుద్రశక్తి, రామాజ్ఞచేత శ్రీరామావేశం, శ్రీరామభక్తులైన సర్వవానరుల ఆవేశం, సాగరమైనాక సురసాదేవీ మొదలైన దేవతా శక్తుల ఆవేశం, సీతాశ్వాసన వలన ఆ సీతా పరమేశ్వరీ శక్తి ఆవేశం.... ఇన్నీ కలసి సర్వదేవతామయుడయ్యాడు ఆంజనేయుడు.

***''ఏతాదృశ సర్వదేవతాశక్తి పూర్ణత్వమేవ సున్దరత్వమితిజ్ఞేయమ్''***

అని భాష్యకారుల వచనం.

ఈ దేవతాశక్తుల పూర్ణత్వమే సుందరత్వం. అందుకే ఆంజనేయుడు సుందరుడు. ఆయనపేరుమీదనే ''సుందరకాండ'' అనే నామం వచ్చింది.

పరాశరసంహితలో - హనుమంతుని పేరు 'సుందరుడు' అని పేర్కొన్నారు.

***''సుందరస్యచ మంత్రస్య వాల్మీకి ఋషిరుచ్యతే - ఆంజనేయోదేవతా చ***
***మారుతాత్మజ బీజకం, శక్తిశ్చ చాంజనాసూనుర్వాయు పుత్రేతికీలకం''***

అని 'సుందరహనుమన్మహామంత్రం' గురించి వివరణ ఉంది. ఆ మంత్రానికి ధ్యాన శ్లోకంలో కూడా-

**బాలార్కాయుత తేజసం త్రిభువన ప్రక్షోభకం ''సుందరం.''** అనిపేర్కొన్నారు.

సుందరహనుమన్మంత్రంలోని ప్రస్తావితమైన నామాలను మహర్షి వాల్మీకి సుందరకాండలో చాలా అద్భుతంగా నిబద్ధీకరించారు. సుందరకాండ మొదటి శ్లోకమైన ''తతో రావణ నీతాయా స్సీతాయాశ్శత్రుకర్శనః'', నుండి ''అభిషిక్తమయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవ'' - అనే శ్లోకం వరకు మధ్యలో నున్న శ్లోకాలలో ఆ మంత్రనామాలు నిబద్ధమై ఉన్నాయి.

ఇదీ సుందరకాండలోని మంత్ర రహస్యం.

సుందరకాండ అంతా హనుమత్కథే. రాముని వైభవం కూడా హనుమంతుని ద్వారా ప్రకటింపబడుతుంది ఈ కాండలో.

***''న రావణం సహస్రం మే***
***యుద్ధే ప్రతిబలంభవేత్''***

(వాల్మీకి రామాయణం)

''వేలకొలది రావణులు సైతం నా ముందు నిలువలేరు'' అని హనుమద్వచనం. రాముని చేతిలోనే రావణుడు చావాలి గనుక, రావణుని హనుమంతుడు విడిచిపెట్టాడు. సీతాదేవి ఆ విషయాన్నే హనుమంతునికి హెచ్చరించింది. మహాలక్ష్మీశక్తి అయిన సీతమ్మ, తన శాపాగ్నితోనే రావణుని దగ్ధం చెయ్యగలదు. కానీ రామసంకల్పం తెలిసి విరమించుకుంది. హనుమంతుని కూడా అందుకే హెచ్చరించింది.

అంత మహాబలశాలి అయిన హనుమ మహారామ భక్తుడై తన శక్తియుక్తులన్నీ రామాంకితం చేశాడు.

**''దాసోహం కోసలేంద్రస్య రామస్య''**

''శ్రీరాముని దాసుడనునేను'' అని ప్రకటించుకున్నాడు.

అభయాంజనేయ, దాసాంజనేయ, వీరాంజనేయ, పంచముఖాంజనేయాది వివిధ మంత్రాకృతులలో దేశమంతటా గణనకందని చోట్ల పూజింపబడుతున్నాడు హనుమస్వామి.

***వందే వానర నారసింహ ఖగరాట్***
***క్రోడాశ్వ వక్త్రాంచితం***
***నానాలంకరణం త్రిపంచనయనం***
***దేదీప్యమానం హరం ।***
***హస్తాబ్జైరసిఖేట పుస్తకసుధాకుంభాం***
***కుశాద్రీన్ హలం***
***ఖట్వాంగం ఫణి భూరుహౌ చ దధతం***
***సర్వారి గర్వాపహమ్ ॥***

- అని పరాశరసంహితలో వర్ణించారు.

వానర ముఖం, సింహముఖం, గరు

త్మంతుని ముఖం, అశ్వముఖం, వరాహ ముఖం - ధరించిన పంచముఖాంజనేయుని రూపవైభవమిది. పంచభూత తత్త్వాలకీ ప్రతీకలైన పంచమూర్తుల సమైక్యరూపం, పది చేతులలో ఖడ్గం, ఖేటం, పుస్తకం, అమృతకలశం, అంకుశం, పర్వతం, నాగలి, మంచంకోడు, సర్పం, వృక్షం - అనే పది ఆయుధాలు ధరించి ఉన్నాడు.

సగం జంతువు, సగం నరం - అయిన ఆకృతులు జగత్తత్వ, ఈశ్వరతత్వ సమన్వయ రూపాలుగా మంత్రశాస్త్రం చెప్తోంది. వీరు మహా దివ్య స్వభావంతో, క్షిప్రప్రసాదన (వెంటనే అనుగ్రహించే) లక్షణంతో భాసిస్తారు. అందుకే - ఈ దేవతల ఉపాసన ప్రసిద్ధిచెందింది. మహాగణపతికూడా ఈ దేవతావర్గమే.

అందువల్లనే త్యాగరాజు - "**శ్రీ గణనాథం భజామ్యహమ్**" అనే కీర్తనలో- "**అంజనేయావతారమ్**" అని ఒక మంత్రశాస్త్ర రహస్యాన్ని ద్యోతకం చేశారు. 'ఆద్యంత ప్రభు' నామంతో హనుమాంజనేయుల సమైక్యమూర్తి కూడా కొన్నిచోట్ల ఆరాధింపబడుతున్నాడు.

హనుమంతుని శక్తి సౌర సంబంధమైన సువర్చస్సు. శక్తిసహితునిగా పరబ్రహ్మను ఉపాసించినప్పుడు, పత్నీ స్థానంలో శక్తిని ఉపాసించడం మంత్రశాస్త్ర సంప్రదాయం. ఆ కారణం చేతనే సువర్చస్సు సువర్చలాదేవిగా, హనుమత్పత్నిగా పూజింపబడుతోంది. సంహితలలో, పురాణాలలో ఆమె సూర్య పుత్రిగా, హనుమంతుని భార్యగా వర్ణింపబడింది.

**యస్తుగేహే హనూమన్తం**
**భక్త్యానిత్యం ప్రపూజయేత్ ।**
**తద్గృహే తత్ప్రభావేన**
**నిత్యం లక్ష్మీ రచంచలా ॥**
**దీర్ఘమాయుర్లభేతైష**
**సర్వతో విజయీభవేత్ ..**
**మార్యాది భూత సంక్షోభః**
**తద్దేశేనైవ జాయతే ..**

"హనుమంతుని పూజించినచోట ఐశ్వర్యం సుస్థిరంగా ఉంటుంది. దీర్ఘాయురారోగ్యాలూ, సర్వత్రా విజయాలు లభిస్తాయి. మారి మొదలైన భూత సంక్షోభాలు ఉండవు" అని 'సుదర్శన సంహిత'లో చెప్పారు.

యుద్ధకాండలో కూడా హనుమద్విజృంభణని వాల్మీకాదులు అద్భుతంగా వర్ణించారు.

శివప్రసాదమైన కాలాయసత్రిశూలాన్ని కుంభకర్ణుడు రామాదులపై ప్రయోగించగా, దానిని మధ్యలోనే అందుకొని అవలీలగా విరచి, విసరి పారేశాడు శివావతారుడైన హనుమ.

సంజీవని తెచ్చి, మూర్ఛితుడైన లక్ష్మణునికి ప్రాణదానం చేశాడు. సీత జాడ కనిపెట్టి, లక్ష్మణుని బ్రతికించి రాముని ఆనందానికి కారణమయ్యాడు. సీతాశోక వినాశనకారకుడయ్యాడు. అందుకే వాయుపుత్రుని "శ్రీరామ హృదయానందం" అన్నారు.

పట్టాభిషేక సందర్భంలో సీతా మహాదేవి పరమ వాత్సల్యంతో ఆంజనేయ స్వామికి రత్నాలహారం ప్రసాదించింది.

ఈ విధంగా సీతారామ హృదయానంద కారియై, శత్రు భీకరుడై, శిష్ట శ్రీకరుడై దీపించే మహా రుద్రమూర్తి శ్రీ ఆంజనేయ స్వామి.

సంకటమోచన్, బజరంగబలీ (వజ్రాంగబలీ) మొదలైన అనేక నామాలతో పూజింపబడుతున్న ఆంజనేయునికి సిందూరపు పూత, నవనీతనివేదన, తమలపుటాకుల అర్చన విశేష ఫలప్రదం. ✷



# నమో నమో నారసింహ!

నారాయణుని పూర్ణావతారం శ్రీనృసింహ స్వామి. ఈ స్వామి తత్త్వం ఎంతో గంభీర మైనదీ, దివ్యమైనదీ.

దేహమంతా నరాకృతి, ముఖం సింహాకృతి. మాయాకారమైన జగత్తూ, మాయాతీతమైన పరబ్రహ్మతత్త్వం - రెండింటినీ తెలియజేసే విష్ణ్వాకృతి ఇది.

సర్వాంతర్యామి నారాయణుడని త్రికరణశుద్ధిగా అనుభవానికి తెచ్చుకున్న పరమభక్తశిఖామణి ప్రహ్లాదుడు, నారాయణుడెక్కడున్నాడని తర్జించే రాక్షసాగ్రణిహిరణ్యకశిపుడు.

సంధ్యా సమయాన ఆవిర్భవించాడు నృహరి. మేధస్సు ఎంత తెలివిగా ఉపయోగించి ప్రకృతిని జయిద్దామన్నా కుదరదు. మేధావులకు మేధావి నారాయణుడు. అతడి మేధస్సును ఊహించలేం.

మృత్యువును జయిద్దామని తెలివిగా అనేక షరతులు పెట్టిన హిరణ్యకశిపుని తెలివిని తలకిందులుగా చేస్తూ, ఊహాతీతమైన ప్రణాళికతో అతడిని అంతం చేశాడు నరకేసరి.

వృత్తికీ వృత్తికీ (మనోవృత్తికీ = ఆలోచనకీ) మధ్య ఉండే సూక్ష్మ సమయం సంధ్య. అదే ఈశ్వరుని స్థితి. ఆ నిర్వికార స్థితిలోనే ఈశ్వరావిర్భావం. ఆ మర్మమే ఈ సంధ్యావిర్భావం తెలియజేస్తుంది.

విశేషించి - నృసింహావతారం రక్షణనీ, శిక్షణనీ ఏకకాలంలో ప్రకటించే అవతారం. ప్రహ్లాదుని రక్షించడం, హిరణ్యకశిపుని శిక్షించడం.

*''ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన*
*నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన*
*కరుణావీరరస సంయుతుండును,*
*మహాప్రభావుండును నైన*
*శ్రీనృసింహదేవుండావిర్భవించిన...''*

-అని భాగవతం వర్ణించింది. కరుణా వీరరసాల సమైక్యమూర్తి నరసింహుడు.

తనలోని రుద్రత్వాన్ని తెలియజేస్తూ ఫాలనేత్రంతో ఆవిర్భవించాడా స్వామి.

ఆ స్వామి చేతి గోళ్ళను వర్ణిస్తూ పోతనగారు ఇలా అంటారు;

***స్ఫురిత విబుధజన ముఖములు***
***పరివిదళిత దనుజనివహపతి తనుముఖముల్***
***గురురుచి జిత శిఖి శిఖములు***
***నరహరికరనఖములమరు నతజనసుఖముల్.***

నరహరి చేతి గోళ్ళు (నఖములు) నతజనులకు సుఖప్రదములు. దేవతల ముఖాలను వికసింపజేసేవీ, రాక్షస ముఖములను ఛేదించేసేవీ, అగ్నిజ్వాలలను ఓడించేవీ స్వామి గోళ్ళు.

అవి రాక్షసుల పాలిటి వజ్రపు కొడవళ్ళు వలె, భక్తజనులకనులకు చలువల చంద్రవంకలవలె ఉన్నవి - అని భక్తకవివర్ణన.

నరసింహుని వైభవం వేదాలలోనే విస్తృతంగా చెప్పబడింది.

ఉపాసనకి సంబంధించిన ఉపనిషత్తులతో నృసింహతాపినీ ఉపనిషత్తు చాలా ప్రసిద్ధి. సృష్టిస్థితిలయకర్తగా నృసింహ స్వామిని ఉపాసించే విధానం ఈ ఉపనిషత్తు అందిస్తోంది. అష్టాదశపురాణాల్లో ''నృసింహ పురాణం'' విశిష్టమైనది.

వేదవేద్యుడు గనుక వేదాద్రి, వేదగిరి (యాదగిరి), వేదాచలం, అంతర్వేది - వంటి వేదసంబంధమైన పేర్లున్న ప్రాంతాలలో నృసింహస్వామి క్షేత్రాలు నెలకొని ఉన్నాయి. ఇవికాక సింహాద్రిలో వరాహలక్ష్మీనరసింహ స్వామి క్షేత్రం వంటివికూడా ప్రసిద్ధం. ఘటికాచలం క్షేత్రాన (షోలంగీర్) కూడా స్వామి వెలసి ఉన్నాడు.

యాదగిరి (వేదగిరి) గుట్టలో జ్వాలా నారసింహ, యోగానంద నారసింహ, గండభేరుండనారసింహ, ఉగ్రలక్ష్మీ నారసింహ, ప్రహ్లాదవరద నారసింహ - అనే పంచ నారసింహ రూపాలతో స్వామి నెలకొని ఉన్నాడు.

పంచక్రోశక్షేత్రమైన 'అహోబిలం' నృసింహక్షేత్రాలలో విశిష్టమైనది. ఇక్కడ ''నవనారసింహరూపాలు'' ఉన్నాయి.

1. కరండనృసింహ, 2. యోగానంద నరసింహ, 3. ఉగ్రనరసింహ, 4. వరాహ నారసింహ, 5. ప్రహ్లాద వరద నారసింహ, 6. ఛత్రవట నరసింహ, 7. మాలోలనరసింహ, 8. జ్వాలా నారసింహ, 9. పవన నారసింహ.

పాపనాశినీ (భవనాశిని) నదీ తీరంలోని దివ్యక్షేత్రమిది.

ఉపాసనామూర్తిగా లక్ష్మీనరసింహ స్వామి మూర్తిని ఈ విధంగా వర్ణించారు:

***సత్యజ్ఞాన సుఖస్వరూపమమలం***
***క్షీరాబ్ధి మధ్య స్థితం***
***యోగారూఢమతి ప్రసన్నవదనం***
***భూషా సహస్రోజ్జ్వలమ్।***
***త్ర్యక్షం చక్రపినాక సాభయకరాన్***
***బిభ్రాణ మర్కచ్ఛవిం***
***ఛత్రీభూత ఫణీన్ద్ర మిన్దుధవళం***
***లక్ష్మీనృసింహం భజే॥***

సత్యజ్ఞానందాల కలబోత నరసింహ రూపం. నిర్మలమైన క్షీరాబ్ధి మధ్యంలో, యోగారూఢుడై, ప్రసన్నవదనంతో, అనంతాలంకారములతో, మూడు కన్నులతో, చక్ర, పినాక, అభయాది హస్తాలతో, సూర్య తేజస్సుతో దీపిస్తూ లక్ష్మీసహితుడై ఉన్న నరసింహస్వామికి సర్పరాజు ఛత్రమువలె అమరి ఉన్నాడు.

***ఆనాభేర్బ్రహ్మణోరూపం***
***ఆగళాద్వైష్ణవం వపుః।***
***ఆశీర్షాద్రుద్రమీశానం***
***తదగ్రే సర్వతశ్శివమ్॥***

-అని నారసింహతత్త్వాన్ని ఆవిష్కరించారు మహర్షులు. ఆ దివ్యదేహంలో నాభివరకు బ్రహ్మతత్వం, అక్కడినుండి గళం వరకు విష్ణుతత్వం, అక్కడినుండి శీర్షం వరకు రుద్రఈశాన శివతత్వం సర్వతః వ్యాపించినది - నరసింహరూపం.

త్రిమూర్త్యాత్మకమైన ఆ ఉగ్రశాంత నారసింహమూర్తి సర్వదేవతాత్మకమై జగద్రక్ష జయుగాక! ✦



# ఉభయభారతి

## విశ్వనాథ పావనిశాస్త్రి

### జరిగిన కథ

మండనమిశ్రుడు పూర్వమీమాంసలో నిధి. ఆయన భార్య ఉభయభారతి శాస్త్ర చర్చల్లో మండన మిశ్రుడిని ఓడించడానికి ఆదిశంకరులు వస్తున్నారని వాళ్ళకి తెలుస్తుంది.

కోట్లకి పడగలెత్తిన వ్యాపారి సమరసేనుడు. తన మిత్రుడైన లవణగుప్తునితో వెళుతుండగా, ఆదిశంకరుల వారిని చూడటం తటస్థించింది. వారితో సంభాషించి, పరివర్తన చెందుతారు. మహిష్మతి మహారాజు అమరసేనుడు పదివంది భార్యలతో వినోదిస్తుంటాడు. మహిష్మతి రాజువద్ద సంస్కృతంలో దేవుని స్తుతిస్తూ కవిత్వం చెప్తాడు. సమరసేనుడు శంకరుని గూర్చి రాజు వద్ద వివరిస్తాడు. మహిష్మతి సరిహద్దులో శంకరునికి సమరసేనుడు పూర్ణ కుంభ స్వాగతం పలుకుతాడు.

**ధారావాహిక**

అది ఒక చిన్న భవనం. దానిచుట్టూ పెద్ద తోట, తోటలో పెద్ద పెద్ద వృక్షాలూ, లతలూ ఉన్నాయి. సమరసేనుడి సేవకుడినీ, లవణగుప్తుడినీ చూసిన ఒక బ్రహ్మచారి, ఆశ్చర్యంతో వీధి తలుపు తెరిచాడు. అంతా లోపలికి నడిచారు.

నడక దారికి అటూ యిటూ ఉన్న చిన్నచిన్న వృక్షాలకి తగిలించిన పెద్ద పెద్ద పంజరాలలో రకరకాల రంగు రంగుల చిలకలున్నాయి.

దగ్గరగా వచ్చిన ఆచార్యుడిని చూస్తూ, ఒక పంచవన్నెల చిలక, ''ధర్మో రక్షతి రక్షితః, ధర్మో రక్షతి రక్షితః'' అని రెక్క లల్లార్చింది. ఆచార్యుడు కళ్ళు విచ్చి చూశాడు. పక్కనే పండు కొరుకుతున్న పచ్చ చిలక, ''కః ధర్మః'' అంది. ఆచార్యుడు దానివైపు తల తిప్పాడు. మరో పొట్టి చిలక ముక్కుతో పొట్ట గోక్కుంటూ, ''ధర్మ స్స్వధర్మః'' అంది. ఆచార్యుడు చిఱునవ్వు నవ్వాడు. కూర్చున్న కఱ్ఱ మీద గిరికీలు కొడుతున్న మరో ముప్వన్నెల చిలక ''స్వధర్మే నిధనం శ్రేయః'' అని పలికింది. అవతల నుంచి మరో రెండు చిలకలు, ''కర్మణ్యే వాధికారస్తే'' అనీ, ''మాఫలేషు కదాచన'' అనీ అరిచాయి. ''కర్మఫలంతు మోక్షం'' అని ముచ్చటగా ముగించింది మరో చిలక.

ఆ చిలక పలుకుల మధ్య హంసగమనంతో నవ్వుతూ నడక సాగించాడు శంకరాచార్యుడు.

భవన సింహద్వారం మూసిఉంది. పంచాదిలో కూర్చుని అధ్యయనం చేస్తున్న విద్యార్థులు లేచి నిలబడ్డారు.

ఆరోజు మండనమిశ్రుడి తండ్రి ఆబ్దికం. ఆబ్దికం ముగిసే వరకూ సింహద్వారం తెరవబడదు.

మహాకర్మిష్ఠి అయిన మండనమిశ్రుడు పితృదేవతలనర్చిస్తుంటే, కవ్యాన్ని అందుకోవడానికి స్వయంగా వ్యాసజైమినులే భోక్తలుగా వస్తారని ప్రతీతి. కర్మత్యాగులైన సన్యాసులను ఆనాడు మండనుడు చూడడు. అందుచేత వారికి లోపలికి ప్రవేశం లేదు.

విషయం గ్రహించిన శంకరాచార్యుడు, అందరినీ అక్కడే నిలబడమని చెప్పి తాను యింటి వెనక్కి వెళ్ళాడు. పెరటి వసారాలో భోక్తల కాళ్ళు కడుగుతున్న మండనుడి కంటికి, హఠాత్తుగా శంకరుడు కనిపించి, క్షణకాలం ఆశ్చర్యపోయాడు. రెండో క్షణంలో విపరీతమైన కోపం వచ్చింది. ఈ సమయంలో సన్యాసిని ఇటు రానిచ్చిన వారెవరు' అని కేకలు పెట్టసాగాడు.

వెంటనే విశ్వదేవుడైన వ్యాసుడు, ''ఆర్యా, మండనమిశ్రా! ఇది పితృయజ్ఞం. యజ్ఞ సమయంలో ఆగ్రహం కూడదు. పితృదేవతల్లు మహా సిగ్గరులు. ఏ రూపంలో వస్తారో మనకు

తెలియదు. అతను సన్యాసి అయితేనేమి! అభ్యాగతః స్వయం విష్ణుః. ఆగ్రహించక ఆయనను కూడా అర్చించు'' అన్నాడు.

సమాధానపడిన మండనుడు, ''భగవాన్! మీరు భిక్ష స్వీకరించండి'' అని కాళ్లు కడగటానికి సన్నద్ధుడయ్యాడు.

శంకరుడు నవ్వుతూ, ''స్వీకరిస్తాను. కాని ఈ భిక్ష కాదు'' అన్నాడు.

మండనుడు ఆశ్చర్యపోతూ, ''ఏం కావాలి'' అన్నట్టు చూశాడు. శంకరుడు మరింత నవ్వాడు. ఆ నవ్వులోని అంతర్యాన్ని గ్రహించిన మండన పండితుడు, ఆయనే శంకరాచార్యుడని గ్రహించాడు.

తిరిగి తాను కూడా నవ్వుతూ, ''బాల యతీంద్రా! కొద్దిసేపు బయట వసారాలో విశ్రమించండి. పితృదేవతల నర్చించి పిండాలు నదిలో కలిపి వస్తాను'' అన్నాడు మండనుడు.

తన కేకలకి, అంతకు ముందే బయటికి వచ్చిన ఉభయ భారతితో ''ఈ యతీంద్రుడికి అర్ఘ్యపాద్యాలమర్చు'' అన్నాడు మండనుడు. శంకరాచార్యుడిని చూడగానే భారతీదేవికి ఏదో పూర్వ స్మృతి తగిలినట్లయింది. అర్ఘ్యపాద్యాలందుకున్న ఆచార్యుడు పంచాదిలో ఆసీనుడయ్యాడు.

★ ★ ★

'ఆసీమాంతం' ఆబ్దికం ముగించి వచ్చిన మండనుడు శంకరాచార్య నుద్దేశించి, ''చెప్పండి; మీకేం భిక్ష కావాలి?'' అని పంచాదిలో మరొకవైపున కూర్చున్నాడు.

శంకరాచార్యుడు ''వాదభిక్ష'' అన్నాడు.

''ఏమిటి మీ వాదం?'' అని అడిగాడు మండనుడు.

''జీవుడూ, బ్రహ్మ వేరు కాదు. కర్మబంధాలు త్రెంచుకున్న జీవుడే బ్రహ్మ'' అన్నాడు ఆచార్యుడు.

శరీరాన్ని విప్పారించి నిలిచి, తీవ్రంగా చూస్తూ, ''ఈ వాదనకి మీ ప్రమాణాలేమిటి?'' అని అడిగాడు మండనుడు.

''వేదములూ, ఉపనిషత్తులే!'' అన్నాడు శంకరాచార్యుడు శాంతంగా.

ఒక దీర్ఘనిశ్వాసం విడిచిన మండనుడు, ''వేదాలే ప్రమాణం అని అనకపోతే, నా దృష్టిలో నువ్వు మరో బౌద్ధుడి వయ్యేవాడివి. సరే, ఎల్లుండి తదియనాడు మన వాదన ప్రారంభం చేద్దాం. ఈపూటకి నేను పితృశేషం ఆరగించాలి'' అన్నాడు.

శంకరాచార్యుడు లేచి అమరేశ్వర సన్నిధికి కదిలాడు. రెండు 'పైడికంటి' పక్షులు ఆకాశాన గిరికీలు కొడుతూ ఆయనను అనుసరించాయి.

★ ★ ★

ఆషాఢశుద్ధతదియనాడు, మండనమిశ్రుడి విశాల గృహాంగణంలో ఒక ప్రక్కగా చిన్న వేదిక సిద్ధం చేయబడి ఉంది. ఆ ప్రాంగణం అంతా, ఆ క్రితం దినమే చక్కగా చదును చేసి, అవసరమైన చోట్ల పందిళ్ళు వేశారు. వేదికకి మూడువైపులా అనేక రత్నకంబళాలు పరిచి ఉన్నాయి.

సభలో వేదశాస్త్ర పండితులే కాక; సంగీతవిద్వాంసులూ, నాట్యకళాకోవిదులూ, ధనుర్విద్యాపారంగతులూ, కర్షకులూ మొదలైన పురప్రముఖులెందరో ఉన్నారు. అందరికీ మండన మిశ్రుడి అసామాన్య పాండిత్యం తెలుసు. శంకరాచార్యుడి అనన్య ప్రతిభ గురించీ విన్నారు.

వేదిక మీద – ముఖ్య శిష్యుడైన పద్మపాదుడితో శంకరాచార్యుడొక వైపున కూర్చున్నాడు. మరొకవైపున ముఖ్య శిష్యుడైన నందివర్ధనుడితో మండనమిశ్రుడు కూర్చున్నాడు.

వేదిక ప్రక్కన ఉన్నతమైన స్థలంలో రత్నాసనంపై మహారాజు అమరుకుడు ఆసీనుడై ఉన్నాడు. ఆప్రక్కనే తెరవెనుక రాణివాసానికి కూడా ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయబడ్డాయి.

దీపారాధన చేసి సభ ప్రారంభించిన అమరుకుడు ఇలా అన్నాడు, ''ఈనాడు ఈ సభను ప్రారంభించడం నా పూర్వజన్మ సుకృతం. ఈ మహాపండితుల వాదం, శ్రీకృష్ణ జాంబవంతుల యుద్ధమల్లే ఎన్నాళ్లు సాగుతుందో చెప్పలేము. రాచకార్యాల ఒత్తిడిలో అన్నాళ్ళూ రావడానికి నాకు కుదరకపోవచ్చు. వీరి వాదనలో చివరికి గెలుపెవ్వరిదో నిర్ణయించగల న్యాయనిర్ణేతలెవరు? ముందుగా ఆ విషయం నిశ్చయించి, తర్వాత సభ ప్రారంభిస్తే మంచిది. ఒకవేళ నేను నిత్యం రాగలిగినా, నాకా శక్తి లేదు.''

వెంటనే సభలో సన్నగా గుసగుసలు ప్రారంభమయ్యాయి. న్యాయనిర్ణేతలుగా ఉండగల శక్తి అక్కడ ఎవ్వరికీ లేదు. ఉన్నా, ఆ ధైర్యం అసలు లేదు. సభ కొంతసేపు అయోమయంలో పడిపోయింది.

చివరికి లవణగుప్తుడు లేచి, ''ప్రభువులు అనుమతిస్తే నాదొక మనవి'' అన్నాడు.

''మహాకవీ! మీ మనవిని మావి చెయ్యండి. విని మావిలా చిగురిస్తాం'' అన్నాడు అమరుకుడు.

''చిత్తం ప్రభూ! అన్ని విషయాలలోనూ మండన పండితులకు సరితూగగల విదుషీమణి ఉభయభారతీ దేవి. ఆవిడే న్యాయనిర్ణేతగా సమర్ధురాలని నా ఉద్దేశ్యం'' అన్నాడు లవణగుప్తుడు.

సభంతా ఔనన్నట్లు తలలూపారు. మహారాజు శంకర మండనుల వైపు చూశాడు. వారి ముఖాలలో అంగీకారం కనిపించింది.

లవణగుప్తుడు భార్యాసమేతుడై, ఉభయభారతిని సభకి ఆహ్వానించాడు. కాదనలేక సభలోకి వచ్చింది ఉభయభారతి.

పండితురాలైన ఆ మహాపతివ్రత సభలోకి వస్తూంటే, గౌరవ పురస్కరంగా సభంతా లేచి నిలబడింది. ఏమాత్రం అసహజత్వం కానరాకుండా, ఏదో పని ఉన్నట్లుగా, మహారాజు అంతకుముందే లేచి నిలబడ్డాడు.

మహారాజుకూ, సభకూ నమస్కరించింది ఉభయభారతి. ఆలోగా మరొక ఉచితాసనం ఆమె కొరకు సిద్ధంగా ఉంది. అంతా కూర్చున్నారు.

ఆమె కూర్చోకుండానే, కచ్ఛపీ నినాద సహోదరమైన తన కంఠస్వరంతో శంకర మండనులనుద్దేశించి, ''మహానుభావు లారా! ఒక సిద్ధాంతం మీద వాదోపవాదాలు చేస్తుంటే, చివరికి ఎవరో ఒకరు పైవాదం చెప్పలేని స్థితి వస్తుంది. పండిత చర్చల్లో ఆ స్థితి ఓడిపోవడమే! మీలో అలా ఓడిపోయినవారు, తమ ఓటమికి చిహ్నంగా ఏం త్యాగం చెయ్యబోతున్నారు? ఇది చాపల్యంతో పిల్లలో, దుష్టత్వంతో మ్లేచ్ఛులో వాదించడం కాదు గదా!'' అన్నది.

శంకరాచార్యుడు వెంటనే, ''అమ్మా! నేనోడిపోతే సన్యాసం వదలి సంసారాశ్రమం స్వీకరిస్తాను'' అన్నాడు.

సభ నివ్వెరపోయింది. సన్యాసి అయినవాడు తిరిగి సంసారంలో పడటం, ఆత్మహత్య కన్న ఘోరమైన పాపం!

మండనుడు కనుబొమలు ముడిచి నిశితంగా చూస్తూ, ''నేను ఓడిపోతే, సంసారం వదలి సన్యాసం స్వీకరిస్తాను. శంకరుని కోరిక కూడా అదే కదా!'' అన్నాడు.

''ఓడిపోయినవారు గెలిచిన వారి ఆశ్రమం స్వీకరిస్తారన్న మాట! బాగుంది'' అన్నాడు మహారాజు.

''మహారాజులు క్షమించాలి'' అంది ఉభయభారతి. మహారాజు మాటలలోని దోషమేమిటో ఎవరికీ అర్థం కాలేదు. శతవిధాల రాజభక్తి దానికి అడ్డం వచ్చిఉంటుంది.

ఉభయభారతి, ''శంకరుని ప్రతిజ్ఞ అద్వితీయం. కాని పండిత మండనుల ప్రతిజ్ఞలో శంకరుని ప్రతిజ్ఞకున్నంత తీవ్రత లేదు'' అంది.

ఆ మాటలకు లవణగుప్తుడు కళ్లు పెద్దవి చేసి, పెదవి కొరుక్కున్నాడు. మహారాజు కానరాకుండా నాలుక కరుచు కున్నాడు.

ఉభయభారతి, ''శంకరుడు తానోడిపోతే, సన్యాసం వదిలి సంసారాశ్రమం స్వీకరిస్తానన్నాడు. అంటే ఉత్తమమైన సన్యాసం వదలి, దానికన్న రెండు మెట్లు క్రింద ఉన్న సంసారంలో పడతానన్నాడు. కాని పండితమండనులు మరో రెండు మెట్లు ఎక్కుతామంటున్నారు. వారికి సన్యాసం మీద గౌరవం లేకపోవచ్చు గాని, అది సంసారస్థితికన్న ఉన్నతమైనదే! ఆ ఆశ్రమాన్ని స్వీకరించడం పరాజయం కాదు'' అంది తలవంచుని.

ఆ మాటలతో న్యాయనిర్ణేత్రిగా ఆవిడ ఎంత సమర్థురాలో అర్థమైంది.

''నిజమే తల్లీ! అయితే ఈ పందెం ఎలా ఉండాలో మీరే నిర్ణయించండి'' అన్నాడు మహారాజు.

''మహారాజుల మాట మాకు శిరోధార్యం!'' అన్నాడు మండనమిశ్రుడు.

వంచిన తల ఎత్తకుండానే, ''తమరు ఓడిపోతే శంకరా చార్యుల శిష్యరికం చెయ్యాలి. అది బ్రహ్మచర్యం వంటిదే కదా!'' అంది ఉభయభారతి.

''తప్పకుండా. శంకరుల వాదనతో నేనోడిపోతే ఆయన సిద్ధాంతం అంగీకరించి, వారి శిష్యుణ్ణవుతాను. అలాగే, పై వాదం చెప్పలేని నేను, వారి వాదనతో జ్ఞానోదయం కలిగి, సన్యాసానికి అర్హత కూడా సంపాదించిన వాడినౌతాను కదా! కాబట్టి నేనోడిపోతే శంకరుల శిష్యుడినై సన్యాసం స్వీకరిస్తాను. ఇది నా ప్రతిజ్ఞ!'' అన్నాడు మండనుడు.

# "ఏషా మనీషా మమ"

శంకరులు కాశీవాసం చేస్తున్న రోజులవి. దేశం నలుమూలల నుంచీ వేలాది పండితులు వారి భాష్యప్రవచనాన్ని వినడానికి కాశీవాసం చేస్తున్నారట. శంకరుల శిష్యులే ఆరువేలమంది ఉండేవారని శంకర విజయాలు చెబుతున్నాయి. వారు ఒకరోజు గంగా స్నానానికి కొంత మంది శిష్యులతో కలిసి మణికర్ణికా ఘట్టానికి వెళుతున్నారు. దారిలో ఒక ఛండాలుడు ఎదురయ్యాడు - వేదాలు నాలుగు కుక్కలుగా, గంగాదేవి కల్లు ముంతగా, పార్వతీదేవి ఛండాల యువతిగా శివుడే అలా వచ్చాడని శంకర విజయాలు చెబుతాయి. కథకు పురాణపు రంగు పూయడానికి అవవచ్చు - శంకరులు అలవాటుగా ఛండాలుని ప్రక్కకు తొలగమన్నారు. దానికి అతడు "నా శరీరం కూడా తమ శరీరం వలె అన్నమయమైనది. పంచభూతాలతోనే తయారు చేయబడింది. నాలోనూ తమ యందూ ఒకే చైతన్యం ప్రకాశిస్తోంది. స్వామీ! తాము తప్పుకో తప్పుకో అని దేనిని దూరం చేయాలని వాంఛిస్తున్నారు?" అని ప్రశ్నించాడు. శరీరాన్నయితే రెండింటికీ సార్థక్యము లేదు. చైతన్యమందామంటే ఉన్నది ఒకే చైతన్యం అని అతని భావం

తన వాదాన్ని మరింత వివరిస్తున్నాడు. పవిత్ర గంగా ప్రవాహం లోనూ, మాదిగ గూడెంలో తోళ్లను నానబెట్టుకొనే తొట్టిలోని నీళ్ళ లోనూ ఒకే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. నీరు ఇంకిపోతే మిగిలేది బింబమైన సూర్యుడొక్కడే. - దీనిని వేదాంత శాస్త్రంలో బింబ ప్రతి బింబవాదమంటారు - అలాగే బంగారు బిందెలోనూ మట్టికడవ లోనూ ఉన్నది ఒకటే ఆకాశం. ఆ బిందో, కడవో పగిలిపోతే ఏ ఆకాశ మైనా మహదాకాశంలో కలిసిపోతుంది. - దీనిని అవచ్ఛిన్న వాద మంటారు. అదే రకంగా సర్వ శరీరాలలోనూ ఒకే వస్తువు ప్రకాశిస్తోంది. అది నిస్తరంగ - సహజానంద - జ్ఞాన సముద్రమైన ఆత్మవస్తువు. (ఇక్కడప్రతి విశేషణానికి ఎంతో అర్థమున్నది.) అట్టి ఆత్మ యందు వీడు ఛండాలుడు, వీడు విప్రుడు అనే భేద దృష్టి - భ్రమ తమకెలా కలిగింది స్వామీ! తాము వేలాది పండితులకు వేదాంతాన్నుపదేశిస్తున్నారే! అని వాని ప్రశ్న.

అప్పటికి సభంతా నిశ్శబ్దమైపోయింది. పదహారేళ్ల సరిగా నిండని ఆ బాలసన్యాసికి, వృద్ధాప్యంలోకి అడుగిడబోతున్న ఈ మహాపండితుడు శిష్యుడా? వృద్ధుడైన పద్మపాదుణ్ణి చూస్తున్న సభంతా గంభీరమైపోయింది.

శంకరులు ఈ సంఘటనకు ముందు, తరువాతా కూడా తమ గ్రంథములన్నిటిలోనూ శాస్త్రవిధిగా కర్మానుష్ఠానం జరగవలెననే శాసించారు. దానిద్వారా చిత్తశుద్ధి, తద్వారా జ్ఞానం సిద్ధిస్తాయని వారి ఉపదేశం. కర్మానుష్ఠానం మార్గమే గానీ గమ్యం కాదు. గమ్యం చేరినవానికి కర్మానుష్ఠానంతో పని లేదు. ఈ నియమాలూ లేవు. అయితే ఎంత వరకూ ఈ నియమాలూ ఉండాలి? ఇంద్రియాలు కల్పన చేసిన వ్యత్యాసం ఉన్నంత వరకూ, ఒకదానిపై ఇచ్ఛ, వేరొక దానిపై అనిచ్ఛ మొదలైన భేదభావం ఉన్నంతవరకూ, ఇన్ని మాటలెందుకు. ఈ దేహభావం ఉన్నంత వరకూ నియమాలు, కర్మానుష్ఠానం అనుష్ఠించి తీరవలసినదేనంటారు శ్రీశంకరులు. ఒకరికి దేహభావం నష్టమయితే మహదాకాశమైన బ్రహ్మతో, బింబరూపమైన బ్రహ్మతో ఐక్యమైపోతారు.

ఇక్కడ ప్రశ్న జ్ఞానమార్గంలో ఉన్నది. దీనికి ధర్మశాస్త్రపరంగా సమాధానం చెప్పడం కుదరదు. అలాటిప్రశ్న వేయగలిగాడంటే ఆ పృచ్ఛకుడు జ్ఞాని అయి ఉండాలి. శంకరులు జ్ఞానమార్గంలోనే సమాధానం చెప్పారు. "ఏ విజ్ఞానము జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థల యందు అనవరతమూ ప్రకాశిస్తున్నదో, బ్రహ్మమొదలు చీమ వరకూ సర్వజీవుల యందూ వ్యాపించియున్నదో, సర్వసాక్షిగా ఉన్నదో - అట్టి విజ్ఞానము తానేయనెడి దృఢమైన అనుభవమెవరికి ఉన్నదో అతడు ఉపాధితో బ్రాహ్మణుడైనా ఛండాలుడైనా నాకు గురువే. ఇదే నా మనీష. అంటే నిశ్చయము. ఇలాటి అర్థంతోనే మరో నాల్గు శ్లోకాలలో వేదాంతశాస్త్ర ప్రతిపాదన చేస్తూ, అట్టి ఆత్మజ్ఞానులు తమకు గురువులే అని మరల మరల తమ నిర్ణయాన్ని తెలియజేశారు.

"బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అన్న ఉపనిద్వాక్యాన్ని అనుసరించి బ్రహ్మవేత్త బ్రహ్మే కాబట్టి అట్టి బ్రహ్మవేత్త ఎట్టి ఉపాధితో ఉన్ననూ పరమగురువులే అని శంకరులు చేసిన నిశ్చయము - మనీష వైదిక మతాను యాయులమైన మనందరకు ఇది అను శాసనము.

**- చల్లా**

తిరిగి ఉభయభారతి కంఠం ఇలా మ్రోగింది: "మహాసభకి మరో విన్నపం. నిజానికి ఈ మహావిద్వాంసుల వాదం విని, ఎవరు విజేతలో నిర్ణయించే శక్తి నాకూ లేదు. అదీకాక, పండిత మండనులు నా భర్త కావడం మూలానా, ఇప్పుడు వారు చేసిన

యీ తీవ్రప్రతిజ్ఞ మూలానా, నేను న్యాయనిర్ణేతగా ఉండే అర్హత కోల్పోయాను. అందుకని వారి గెలుపూ ఓటములు నిర్ణయించే అధికారం ప్రకృతికే వదిలేస్తున్నాను.''

'ఇంత దూరం వచ్చి యిదేమిటి?' - అని సభ ఆశ్చర్య పోయింది. సభలో తిరిగి గుసగుసలు ప్రారంభమయ్యే లోపలే, ''ప్రకృతికే అంటే - ఆ మహాపండితులలోని ప్రకృతికి అన్న మాట!'' అని లవణగుప్తుడి వైపు తిరిగి, ''కవీశ్వరా! రెండు పూ మాలలు తెప్పించగలరా?''అంది ఉభయభారతి.

కొద్దిసేపట్లో ఎలా వచ్చాయో, చిక్కగాఅల్లిన రెండు జాజిపూల దండలు వచ్చాయి. ఆషాఢంలో సన్నజాజులకేం కొదువ? అందులో మహారాజు సభలో.

''మహానుభావులారా! ఈ పూమాలలు చెరొకటీ ధరించి మీ వాదన ప్రారంభించండి. ఎవరి పూమాల ముందుగా వాడిపోతే, వారు ఓడిపోయినట్లు'' అంది ఉభయభారతి.

లవణగుప్తుడు చిఱు ఆశ్చర్యంతో, ''అమ్మా! నాకర్థం కాలేదు. ఈ పూమాలలను మీరేదైనా మంత్రించారా? ఎందు కంటే, రెండు మాలలలోని పూలు ఒకే తీగ నుంచి కోసినవి. ఒకేసారి మాలగా కూర్చబడినవి. వాడితే రెండూ ఒకేసారి వాడి పోతాయి. ఒకటి ముందుగా వాడిపోవడానికి వీలు లేదు'' అన్నాడు.

ఉభయభారతి చిఱునవ్వు నవ్వుతూ, ''కవీశ్వరా! నేను వాటిని మంత్రించలేదు, మరేదీ చెయ్యలేదు. చెప్పానుగదా, ఆ విద్వాంసులలోని ప్రకృతే వారికి న్యాయనిర్ణేత అని! ఎలాగంటే - వాదనలో విద్యా విషయమే గాని; ఆవేశమూ కోపమూ పనికిరావు. వాదిస్తున్న వ్యక్తి ఆవేశపడుతున్నాడంటే - అతనిలోని వాదనా పటిమా, విషయ నిర్ధారణా పాండిత్యాల ప్రాధాన్యం తగ్గుతోందన్న మాట! వ్యక్తిగతమైన అహంకారమూ, పట్టుదలా పెరుగుతున్నా యన్నమాట! అప్పుడు కోపం పెరుగుతుంది. ముఖ కవళికలలో తేడా వస్తుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో వేగం పెరుగుతుంది. శరీరంలో వేడి అధికమౌతుంది. దానివలన ఆ పూమాల త్వరగా వాడిపోతుంది. కాబట్టి ఎవరి పూమాల ముందుగా వాడిపోతే వారు ఓడిపోయినట్లే లెక్క. ప్రకృతిలోని ఈ పుష్పాలు, వానిలోని ఆ ప్రకృతికి అద్దం పడతాయి. మనకు నిర్ణయం సులభ మౌతుంది'' అంది.

అలా అని, మహారాజు వైపు తిరిగిన ఉభయభారతి, ''మహారాజా! అపరాహ్ణం వరకు వీరి వాదం ఎంత నడిస్తే అంత! ఆ తర్వాత అందరికీ దేవతార్చనాది కార్యక్రమాలుంటాయి గదా! తర్వాత సభ తిరిగి రేపు ఉదయమే! ఇలా ఎన్నాళ్ళు సాగితే అన్నాళ్ళూ శంకరులవారూ, వారి శిష్యులూ మీ అతిథులు. తమరు అనుమతిస్తే, వారి భిక్షాదులకు అవసరమైన పనులు చూసుకుంటాను'' అంది.

ఆవిడ పాండిత్యం గురించి ఎంత తెలిసినా, ఎప్పటికప్పుడే కొత్తగా చూస్తున్న అమరుకుడు లేచి చేతులు జోడించాడు. ఆయన వెంట సభంతా లేచి నిలబడింది.

''అమ్మా! మీ దయ వలన ఇవాళ మేమొక గండం గడిచాము. శంకరులూ, వారి శిష్యులూ మా అతిథులైతే, సభ లోని పండితులు మా అతిథులు'' అన్నాడు రాజు.

రాజుకీ, సభకీ నమస్కరించి, యింటివైపు నడిచింది ఉభయభారతి. సభంతా ఒదిగి నిలబడింది.

ఆవిడ యింట్లోకి వెళ్లంగానే సభ ప్రారంభమైంది.

★ ★ ★

ప్రతి విద్యకీ అధీతి, బోధ, ఆచరణ, ప్రచారము అనే నాల్గు దశలుంటాయి. 'అధీతి' అంటే నేర్చుకునే దశ. ఇందులో 'సిద్ధాంతమూ', 'అభ్యాసమూ' అని రెండు అంతర్దశలున్నాయి. అవి సాధించిన తర్వాతగాని దానికి సంబంధించిన 'బోధ' పూర్తి కాదు. బోధ అంటే నేర్చుకున్న దానిని యితరులకు చెప్పడం. బోధ అంటే అవగాహన అని కూడా అర్థం ఉంది. అందుకనే పెద్దలు ఏదైనా విషయం 'అర్థమయింది' అనడానికి 'బోధ పడింది' అని అంటారు. దాని తర్వాతది 'ఆచరణ'. నేర్చిన విద్యని ఉపయోగించడమే ఆచరణ. ఆ పైది 'ప్రచారము'. ప్రచారం అంటే, విద్యని నలుగురికీ సులువుగా బోధపడేట్టు నేర్పే శక్తి.

అధీతి దశలో సిద్ధాంతమూ, అభ్యాసమూ అనే రెండు విభాగలున్నట్టుగానే; ఆచరణ దశలో ప్రదర్శనమూ, ప్రయోగమూ అనే రెండు ప్రయోజనాలుంటాయి.

ఒకడు తను సాధించినవిద్యని ఒక పథకం ప్రకారం, ఒక వరుస క్రమంలో ప్రదర్శిస్తాడు. దాని వలన చూసేవాళ్లకు ఒక వింత అనుభూతి కలుగుతుంది - ఆ విద్య తామూ అభ్యసిస్తే

బాగుంటుంది - అనిపిస్తుంది. ఆ విద్యావేత్త యొక్క నైపుణ్యం వలన, ఆ విద్య సాధించడం చాలా తేలిగ్గా కూడా కనిపిస్తుంది.

సాము గరిడీలు గొప్పగా నేర్చిన ఒక వ్యక్తి కఱ్ఱ తిప్పుతుంటే, కత్తి ఝళిపిస్తుంటే, అతను ఆ విన్యాసాలు చాలా తేలిగ్గా చేస్తున్నట్టు కనిపిస్తుంది. మనమూ అంతేతేలిగ్గా ఆ విన్యాసాలు చేయగలమనిపిస్తుంది. కాని కత్తి పుచ్చుకున్న తర్వాత గాని తెలియదు. ఆ కష్టమూ, ఆ ప్రమాదమూ. ఆ విద్యావేత్త తన విద్యని ఒక వరుసక్రమంలో ప్రదర్శించడంలోని చమత్కారం అది. చూసేవాళ్ళలో ఆ స్పృహ కలిగించడానికే అతను ఆ ప్రదర్శన చేస్తాడు. చూసేవాళ్ళు స్పందించాలి, ఆనందించాలి. తన విద్యకి ఆదరణ పెరగాలి. తన జీవనం సుఖంగా సాగాలి.

అయితే ప్రయోగదశ వేరు. ప్రదర్శనలోని చమత్కారాలు ప్రయోగంలో ఉండవు. 'ప్రదర్శన' జీవనం కోసం చేస్తే, 'ప్రయోగం' జీవితం కోసం చేస్తాడు. తనని తాను రక్షించుకోవడానికి చేస్తాడు. ఆ స్థితిలో అతనేం చేస్తున్నాడో సామాన్యులకి తెలియదు. అనుభవమూ ప్రతిభా మిళితమైపోయిన ఆ తీవ్రతకి ఎదుటివాడు భయభ్రాంతుడైపోతాడు. ఆ సమయంలో ఆ విద్యావేత్త కోరేది కూడా అదే.

ఇద్దరు సంపూర్ణ విద్యావేత్తలు ఒకరినొకరు తీవ్రస్థాయిలో ఎదుర్కొన్నప్పుడు - వాళ్ళేం చేస్తున్నారో, ఒకరినొకరు ఎలా దెబ్బ తీస్తున్నారో, ఎదుటివారి దెబ్బనెలా తట్టుకుంటున్నారో - బయటినుంచి చూసేవారికి ఏమీ అర్థం కాదు. తిరిగి అంతటివాడు ఒకడు సాక్షిగా ఉంటే, అతను కూడా గొప్ప అవధాని అయితే, తర్వాత ఒక్కటొక్కటిగా గుర్తు తెచ్చుకుని వివరంగా చెప్పగలడు. లేదా ఒక మెలిక అర్థం అయ్యేలోపల పది మెలికలు గడిచిపోతాయి. తర్వాత లంకె కుదరదు.

శంకర మండనుల వాదం వింటున్న పురప్రముఖుల పరిస్థితి ఆనాడు సరిగ్గా అలా ఉంది. రాజు పని కూడా దాదాపు అలాగే ఉంది. కొందరు పండితులు కూడా అంకె అందని స్థితిలోనే ఉన్నారు.

అలా సాగినవారి చర్చ మొత్తం పదిహేడు రోజులు జరిగింది.

మండనమిశ్రుడు : శంకరా! జీవుడు, ఈశ్వరుడు అన్న రెండు మాటల్లోనే ఇద్దరూ వేరు అని అర్థం అవుతోంది గదా! ఈ ఇద్దరూ ఒకటే అని ఎలా చెప్పగలవు? దానికి ప్రమాణం ఏమిటి?

శంకరాచార్యుడు : మండనమిశ్రా! చూడగలగాలే గాని ఎన్నో ప్రమాణాలున్నాయి. ఛాందోగ్యోపనిషత్తులోని 'తత్త్వమసి' ఒక ప్రమాణం. బృహదారణ్యకోపనిషత్తులోని 'అహం బ్రహ్మాస్మి' మరొక ప్రమాణం.

మండనమిశ్రుడు : చంపావయ్యా బాలసన్యాసీ! మంత్ర శాస్త్రంలో, పాపాలు నశించడానికి 'హుమ్' - 'ఫట్' వంటి అక్షరాలను జపిస్తారు. అలాగే వేదాంత శాస్త్రంలో 'తత్త్వమసి' వంటి వాక్యాలను పాపనాశనం కొరకు జపిస్తారు. అంతేకాని, వాటికి నువ్వు చెప్పే అర్థం లేదు. అవి జీవ ఈశ్వర ఏకత్వాన్ని ప్రతిపాదించవు.

శంకరుడు : ఓయి వృద్ధపండితుడా! 'హుమ్', 'ఫట్' వంటి అక్షరాలకు కేవలం శబ్దశక్తి తప్ప, లౌకికమైన అర్థం లేదు. కాబట్టి - నువు చెప్పింది అక్కడ బాగానే ఉండవచ్చు. కాని 'తత్త్వమసి' వంటివి కేవలం అక్షరాలు కావు. చక్కని అర్థం కుదిరే వాక్యాలు. అర్థం కుదిరేవాటిని, కుదరని వాటితో ముడిపెట్టి అవస్థపడకు.

మండనమిశ్రుడు : అవస్థ కాదు బాబూ! ఆ తత్త్వమసి వాక్యానికి నువ్వు చెప్పే అర్థం అనుకోకుండా వచ్చి పడింది. మీరు అలా వ్యాఖ్యానం చేస్తున్నారు. నిజానికి అది అర్థవాదం, లేదా స్తుతివాక్యం. ఒక మహావిషయాన్ని నిర్ధారించడానికి ముందుగా చెప్పే స్థాపక వాక్యం... ఒక వ్యక్తిని, ఇంద్రుడూ చంద్రుడూ అని పొగుడుతాం. అలా అనంగానే ఆ వ్యక్తి ఇంద్రుడూ చంద్రుడూ అయిపోడు గదా! అది స్తుతి. అలాగే ఈ తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి వంటి వాక్యాలు - జీవుడు బ్రహ్మ అంతటివాడు అని చెప్పే స్తుతి వాక్యాలు యజ్ఞయాగాది కర్మలు అనుష్ఠించే జీవుడు ఈశ్వరుని వంటివాడు' అని చెప్పే స్థాపక వాక్యాలు.

శంకరుడు : అలా ఎందుకనుకోవాలి? ఇంద్రుణ్ణి చూపించి, ఈయనే ఇంద్రుడు, చంద్రుణ్ణి చూపించి ఈయనే చంద్రుడు అని అన్నాం అనుకో. అప్పుడది స్థాపక వాక్యం అవుతుందా?

(సశేషం)



# సనాతన మహా సామ్రాజ్య పట్టాభిషేకం

గత సంచిక తరువాయి

జావ్లీ విజయానంతరం కొంకణదేశం లోని కల్యాణ్‌ను ముట్టడించి బీజాపూరుకు పంప బోయే ధనపు రాసుల్ని స్వాధీనం చేసు కొన్నాడు. అక్కడ పరిపాలనకు తగిన చర్యలు తీసుకొని శీఘ్రగతిన డాబోల్ శ్రీరంగపురం, ప్రభావళి, రాజపూర్, కుడలి ప్రాంతాలను నౌకాస్థావరాలను ఏర్పాటు చేసుకొనే ఉద్దే శ్యంతో పరీక్షించాడు. అప్పటికి మొగలులు నౌకాసేన విశిష్ఠత ఎరుగరు. దూర దృష్టిగల శివాజీ యూరోపియన్ల సహాయంతో సువర్ణ దుర్గం, సింధు దుర్గం, కొలాబాలలో పటిష్ఠ మైన నౌకాస్థావరాలను ఏర్పాటు చేసు కున్నాడు. ఇంతలో బీజాపూరులో ఆదిల్ షాహ మృతి చెందాడు. తన పుత్రుని పక్షాన భార్య భారీ సాహిబా రాజ్యం చేయనారంభిం చింది. ఔరంగజేబు షాజహానుతో సింహాసనం కోసం పోరాడటానికై ఆగ్రా చేరాడు. 1657 లో శివాజీ మొగలాయిలను జునార్‌లోను, అహ్మదు నగరంలోను దోచుకొన్నాడు.

బీజాపూరు రాణి భారీసాహెబా మహా వీరుడైన, అఫ్జల్‌ఖాన్‌ను పిలిపించి శివాజీని జీవితునిగానో, మృతునిగానో పట్టితెమ్మని, అనంత మైన ధనరాసులను ఆశచూపి ప్రోత్స హించి పంపింది. ఆతడు పిల్లకాకి అయిన శివాజీ మీదకా నన్ను పంపేది అని బలో న్మత్తంతో బహు సైన్యాన్ని తీసుకొని, దారిలో ఉన్న హింధూ దేవాలయాలను కూలదోస్తూ, ప్రజలను ఊచకోత కోస్తూ శివాజీ రాజ్యంలో ప్రవేశించాడు. శివాజీ వాని ఆగమనాన్ని చారుల ద్వారా విని, తగిన అదను కోసం ప్రతాప్‌ఘడ్‌లో ఎదురు చూస్తున్నాడు. పరిస్థితులను కూలంకషంగా పరిశీలించిన శివాజీ యుద్ధంలో బహుజన నష్టమే కాక ఆ ప్రదేశమంతా నాశన మవుతుందని ఆలోచించి అతనిని సంధి కోసం తన పట్టణానికి రమ్మని ఆహ్వానించాడు. ఇద్దరి మధ్య అనేక మంది రాయబారులు తిరిగారు.

అందులో పంతోజీ గోపీనాథుడనే అఫ్జల్‌ఖాన్ రాయబారి శివాజీయందు ఆదరం కలిగిన వాడు. శివాజీ కోర్కెపై శివాజీ బలాన్ని, అక్కడ వున్న సైనికుల విశేషాన్ని తగ్గించి ఖాన్‌కు చెప్పాడంటారు. ఏమయినా బలోన్మత్తుడూ, మహాకాయుడు అయిన అఫ్జల్ ఖాన్ 1500 మంది సైన్యంతో ప్రతాప్‌ఘడ్ వచ్చి దుర్గం ఎదురుగా అలంకరించబడిన వేదిక పైకి వేంచేశాడు. అతని మనసులో శివాజీని చూడగానే పిట్టను పట్టుకొని నలిపినట్లు నలిపి వేయవచ్చని ఉంది. శివాజీ కూడా ఎందుకైనా మంచిదనే ఉద్దేశ్యంతో - తురుష్కుల కుతంత్రాలు పూర్తిగా తెలిసి ఉన్నవాడు కనుక - ఇనుప కంచుకం, శిరస్త్రాణం, చేతులకు పులి గోళ్లు, బాకు పట్టుకొని ఇవి కనబడకుండా పెద్ద అంగరఖా టోపీ ధరించి, భవానీ దేవికి మొక్కి తల్లి ఆశీస్సులు తీసుకొని వేదిక పైకి వచ్చాడు.

శివాజీని చూస్తూనే అఫ్జల్ ఖాన్, కౌగలించుకొని, ఎడమ చేత్తో గట్టిగా పట్టుకొని కుడి చేతితో బాకు పుచ్చుకొని శివాజీని పొడిచి వేయబోయాడు. సంసిద్ధంగా ఉన్న శివాజీ చెంగున పక్కకు దూకి, తన పులిగోళ్ళతో ఖాన్ కడుపు రెండుగా చీల్చి మట్టుబెట్టాడు. సిద్ధంగా వున్న శివాజీ సేనలు, నిర్ఘాంతపోయి ఉన్న 1500 మంది ఖాన్ సైనికులను సంహరించారు. అక్కడికి 25 కి..మీ దూరంలో వాయి అనే ప్రదేశంలో విశ్రాంతి తీసుకొంటున్న బీజాపూరు సైనికులు యావ న్మందీ శివాజీ సైన్యం చేతిలో హతులయ్యారు. ఇదంతా రాత్రికి రాత్రే జరిగిపోయింది. ఈ సంఘటన బీజాపూరు సింహాసనాన్ని కదిలించి వేసింది. శివాజీ ఎదురుబడే సాహసాన్ని సన్న గిల చేసింది. కనకగిరి కోటలో అన్యాయంగా శంభాజీని హత్య చేసిన అఫ్జల్ ఖాన్, పండరీపూర్, తుల్జాపూర్ దేవాలయాలు

కూలదోసిన అఫ్జల్‌ఖాన్ యొక్క మరణం మరాఠాలకు మహదానందాన్ని కలగజేసింది.

ఔరంగజేబు ఆగ్రాలో స్థిరబడిన తరువాత దక్కన్ గవర్నరుగా తన మేనమామ శ్రాయిస్తఖానుని పంపుతూ, శివాజీని అణిచి వేయవలసినదని ప్రత్యేక ఉత్తర్వులు జారీ చేశాడు. సామ్రాజ్య సేనలతో మహాబలంతో వచ్చిన శ్రాయిస్తఖానుడు శివాజీ పూనా స్థావరాన్ని స్వాధీనపరుచుకొని తన ఆవాసంగా మార్చుకొని అక్కడనుంచి ఒక్కొక్క కోటను స్వాధీన పరుచుకోనారంభించాడు. అజేయుడై వీరవిహారం చేస్తున్న శ్రాయిస్తఖానును పట్టశక్యం కావడం లేదు. శివాజీని దుర్గం దుర్గంగా పరుగులెత్తించాడు. చివరికి శివాజీకి వీనిని జయించడానికి కుతంత్రాన్ని ఆశ్రయించవలసి వచ్చింది.

పూనా కోట తనకు చిరపరిచితమైంది. అందువల్ల అర్ధరాత్రి బలహీనమైన ద్వారం నుండి సమర్థులైన యాభై మంది సర్దారులతో ప్రవేశించి చీకటిలో కత్తికి ఎదురు వచ్చిన వారినందరినీ చీల్చివేశాడు. సైనికులు, కుటుంబ సభ్యులు, పుత్రులు నిహతులయ్యారు. శ్రాయిస్తఖానుడే బొటనవ్రేలు తెగి ప్రాణాలతో బయటపడ్డాడు. మొగలాయి సైనికులు మ్రాన్పడి పోయారు. శివాజీ పేరు చెబితేనే కంపించి పోయారు. నిర్ఘాంత పోయిన చక్రవర్తి శ్రాయిస్త ఖానుని బెంగాలు బదిలీ చేశాడు.

శ్రాయిస్తఖానుడు వెనుతిరిగిన తరువాత శివాజీ దక్కన్ ప్రాంతాలలో ఎదురులేని మహా ప్రభువువలె సంచరించనారంభించాడు. మొగలాయిల సంపద ఎక్కడ దాచబడి ఉందో చారుల ద్వారా తెలుసుకొని, అది కొల్లగొట్టి కోటలు గట్టిపరచడానికి, సైనిక వనరులు పెంపొందించుకోవడానికి వినియోగించేవాడు. మొగలాయిల అనంతమైన సంపద సూరత్ పట్టణంలో ఉన్నదని విన్న శివాజీ రహస్యంగా బయలుదేరి హఠాత్తుగా సూరత్ కోట గుమ్మం వద్ద ప్రత్యక్షమయ్యాడు. అక్కడ గవర్నర్‌కు, వ్యాపారవేత్తలకు తాను కోరిన మొత్తం మరుసటి నాటి ఉదయానికల్లా సమర్పించాలని తాఖీదు లిచ్చాడు. వారు లక్ష్యపెట్టలేదు సరికదా శివాజీని హతం చేయడానికి ప్రయత్నించారు. కోపోద్రిక్తుడైన శివాజీ పట్టపగ్గాలు లేక సూరత్ పట్టణంలో ఉన్న అన్ని బీరువాలు బద్దలుకొట్టించి, ధనపు రాసులు తన గుఱ్ఱాలపై ఎక్కించుకొని ప్రభుత్వ భవనాలు కూలదోసి, తిరుగు



ప్రయాణం పట్టాడు. తనకు కోటలను సుష్ఠుపరుచుకోవడానికి డబ్బులు కావాలి. హిందువులకు దోచిన ముస్లిం కాఫర్‌ల నుంచి ఆ డబ్బు రావాలి. ఈ డబ్బులు రాయగఢ కోటను సురక్షితం చేయడానికి ఉపయోగించబడింది.

సూరత్ నుండి తిరిగి రావడంతోనే జనవరి 1664లో శివాజీకి తన తండ్రి మరణవార్త తెలిసింది. హరిహర్‌లో గుఱ్ఱపుస్వారీ చేస్తుంటే ప్రమాదవశాత్తూ పడిపోయి, చనిపోయాడని తెలిసింది. సహగమనము చేయకుండా జీజాబాయిని ఎంతో కష్టమ్మీద ఆపవలసి వచ్చింది. తండ్రి అపర కార్యాలు విధి కృత్తుగా పూర్తి చేయబడ్డాయి. షహాజీ శివాజీకి సామ్రాజ్య స్థాపనలో ఎంతో నైతిక బలాన్ని చేకూర్చారు. అదీకాక బీజాపూరు సంస్థానంలో ముఖ్యత్వం వహించి మరాఠా యోధులకు ఒక ఆత్మవిశ్వాసాన్ని కలిగించారు.

శివాజీ సూరత్ ముట్టడి ఔరంగజేబు అధికారానికి పెను సవాలుగా పరిణమించింది. శివాజీని వశపరుచుకొనేంతవరకు అతడి మనస్సుకు శాంతి లేని స్థితి ఏర్పడింది. శివాజీ బీజాపూరు సామంతులయిన గోర్పడేలను వధించి, ఖావస్‌ఖాన్‌ను వశపరచుకొని కొంకణ ప్రాంతాలలో నౌకాబలంతో విక్రమిస్తూ, కార్వార్ మీదుగా గోకర్ణం చేరేసరికి, ఔరంగజేబు పెద్ద సైన్యంతో దిలీర్‌ఖాన్ సహాయంగా రాజా జైసింగ్‌ను శివాజీని పరిమార్చే పనిమీద పంపాడని తెలిసింది. శివాజీ వెంటనే రాయగఢ్ చేరాడు.

జయసింగు పూనాలో బస చేసి శివాజీ వ్యతిరేకుల్నందర్నీ పోగు చేసి మరాఠా సామ్రాజ్యం నాల్గు వైపులనుండి ముట్టడి ప్రారంభించాడు. పరిస్థితి చేయిజారిపోయింది. అప్పటికి శివాజీ సైన్యం చక్రవర్తి సేనలను ఎదుర్కొనేంత పటిష్ఠంగా లేదు. జయసింగ్ హిందువు. అతడి హిందూ భావనలను రేకెత్తించడానికి ప్రయత్నం చేశాడు. ఔరంగజేబు హిందూ సర్దారులను నమ్మడు. జయసింగు విషయంలో కూడా ఒంటరిగా పంపకుండా దిలీర్ ఖాన్‌కు పంపిన కారణమే అది. జయసింగ్ శివాజీ కోటలన్నీ స్వాధీన మయ్యేదాకా సంధి గురించి మాట్లాడటానికి కూడా సిద్ధపడలేదు. ఎదుర్కొంటే జయాపజయాలు దైవాధీనాలే అయినా ఎంతో కష్టపడి సమకూర్చిన మరాఠ సేన కనుల ముందే నాశన

మయిపోతుంది. తల్లి, మంత్రుల సలహా తీసుకొని, జయసింగ్‌ను స్వయంగా కలుసుకొని, సాధ్యమైనంత మర్యాదగా ఈ ఇక్కట్టు నుండి బయటపడాలని నిర్ణయించుకున్నాడు.

నిర్ణయించినదే తడవుగా నిరాయుధుడై ధైర్యంగా జయసింగ్ బస చేసి ఉన్న పురందర్ కోటకు చేరాడు. ఆశ్చర్య పోయిన జయసింగు ప్రత్యుత్థానం చేసి గౌరవించాడు. జయసింగుకు తెలుసు. తానేదైనా ఒప్పుకుంటే ఔరంగజేబుకు నమ్మకం ఉండదు. దిలీర్‌ఖాన్‌తో సమావేశం ఏర్పాటు చేశాడు. శివాజీ యొక్క మధురమైన వాగ్ధోరణికి ఆకట్టబడిన దిలీర్‌ఖాన్ సంధికి తన సంపూర్ణ సహకారాన్ని అందజేశాడు. ముగ్గురు సమావేశమయి సంధి షరతులు వ్రాసుకున్నారు. దానిని బట్టి శివాజీ 12 కోటలు ఉంచుకొని మిగతావి ఔరంగజేబుకు వశపరుస్తాడు. మొగలాయి సామ్రాజ్యానికి విశ్వాసపాత్రుడుగా ఉంటాడు. దీని బదులుగా ఔరంగజేబు శివాజీని రాజాగా గుర్తించి తన జాగీర్ల లోనే కాక బీజాపూర్ రాజ్యంలో కూడా చౌత్ వసూలు చేసుకొనే అధికారం ఇస్తాడు. శివాజీ పుత్రుడైన శంభాజీకి జాగీరులు ఇచ్చి 5000 అశ్విక దళానికి అధిపతిని చేస్తాడు.

సంధి షరతులు ఔరంగజేబుకు తెలియబడ్డాయి. అతనికి ఇష్టం లేదు. అయితే దిలీర్‌ఖాన్, జయసింగ్, శివాజీ తమకు విశ్వాసపాత్రుడుగా ఉంటే ఎంత ఉపయోగమో నచ్చచెప్పగా, శివాజీని తన

హాని కలగచేయమనే హామీతో ఆహ్వానం పంపాడు. అక్కడ శివాజీకి "రాజా" బిరుదు ఇవ్వాలి. రాజాల వరుసలో కూర్చోబెట్టి గౌరవం చేయాలి. శివాజీ పోయి పోయి పులి నోట్లో తలపెట్టడమా అని తన వారందరితోనూ ఆలోచించాడు. శివాజీ ఔరంగజేబును ఎప్పుడూ నమ్మలేదు. అయితే రాజా జయసింగ్ యెడ శివాజీకి ఎందువలనో ఆదరభావం ఉన్నట్లు తెలుస్తోంది. జయసింగ్ తన మధురోక్తులతో ఔరంగజేబును అక్బర్ నడిచిన దారిలో నడిచి, మతవౌఢ్యాన్ని విడనాడడానికి ఒప్పించమని కోరగా, అది అయ్యే విషయం కాదని తెలిసినప్పటికి శివాజీ ఆగ్రా ప్రయాణమయ్యాడు. అంతకుముందే సంధి షరతుల ప్రకారం దుర్గములు మొగలాయిలకు అప్పచెప్పబడ్డాయి.

12.5.1666న పాదుషా కొలువులో శివాజీకి తగిన గౌరవం లభించలేదు. సామాన్యుల వరుసలో నుంచో పెట్టబడ్డాడు. అవమానం భరించలేని శివాజీ పరుష వాక్యాలు పలికి సభ నుండి నిష్క్రమించాడు. పాదుషాను సభలో ధిక్కరించడం అంత వరకూ ఎప్పుడూ జరుగలేదు. శివాజీని ఎక్కడికీ పోకుండా కట్టుదిట్టం చేసి జయసింగ్ పుత్రుడు రాంసింగ్ తోటలో విడిది చేయించారు. అప్పటికే శివాజీ రాజపుత్రులు తదితర హిందూ రాజులలో మంచి ప్రతిష్ఠ కలవాడు. ఆ సమయంలో అతనిని వధిస్తే విప్లవం రావచ్చుననే భయంతో శివాజీని నిర్జీవమైన రహస్య ప్రదేశానికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ఔరంగజేబు బుద్ధి శివాజీకి సుపరిచితమైనదే. మరి ఎవరెవరి సహాయాన్ని పొందాడో, అదీ లంచమిచ్చో లేక హిందూ భావనను ప్రోదిచేసో తెలియదు కానీ, శివాజీ తన సర్దారులందరినీ వేరే పనుల మీద పంపినట్లు సంకేత స్థలాలకు పంపివేసి, తానూ తన పుత్రుడు పళ్ళ బుట్టలలో కూర్చుని కావలివారికి తెలియకుండా బయటపడి, మధుర చేరి, పుత్రుని మోరోపంతు పింగళే బావమరిది ఇంట్లో ఉంచి, తాను అలహాబాదు మీదుగా 25 రోజుల తరువాత బైరాగి వేషంలో తల్లిని చేరి నమస్కారం చేశాడు. ఔరంగజేబు ఈ పరిణామానికి నిశ్చేష్ఠుడయి పోయాడు. అసలే తన నీడను తానే నమ్మని కుత్సితుడు. కావలివారికి మరణ దండన విధించాడు. రాంసింగ్‌ని అవమానపరిచాడు. జయసింగ్‌ను గవర్నర్ పదవి నుంచి తప్పించి వెనుకకు పిలవగా అవమాన భారంతో అతడు చనిపోయాడు. సంధి కారకుడయిన దిలీర్‌ఖాన్‌ను బదిలీ చేశాడు. ఈ సంఘటన ఔరంగజేబు స్వభావాన్ని లోకానికి తేటతెల్లం చేయడమే కాక శివాజీ అసమాన ధీవైభవాన్ని ఎఱుకపరిచింది. ఔరంగజేబు ఈ తప్పిదానికి జీవితంలో తనను తాను క్షమించుకోలేకపోయాడు. తన తుది విల్లులో "రాజ్యంలో జరిగే ప్రతి కదలిక గురించిన ఎఱుక ప్రభుత్వ నిర్వాహణకు మూలాధారం. ఒక చిన్న తప్పిదం ఏళ్ల తరబడి మనల్ని సిగ్గుతో కుమిలిపోయేలా చేస్తుంది. మన నిర్లక్ష్యం మూలంగా శివాజీ తప్పించుకోవడం, నా చివరి రోజు వరకూ సంఘర్షణగా ఎలా పరిణమించిందో చూడండి" అంటాడు. దీనిని బట్టి శివాజీ ఏర్పరచిన సామ్రాజ్యపు మహోన్నతి అర్థం అవుతున్నది కదా!

నాలుగు సంవత్సరాల పాటు శివాజీ ఎలాంటి దండయాత్రల జోలికి పోలేదు. జయసింగ్ తనను పెట్టిన యాతనను పాఠంగా తీసుకొని నాలుగేళ్ళ కాలంలో మరాఠా సైన్యాన్ని అత్యుత్తమమైనదానిగా రూపొందించాడు. మొగలాయిలతో, ఔరంగజేబు కుమా

రుడు మో-అజమ్ అతని మంత్రి యశ్వంత్ సింగులను మంచి చేసుకొని జయసింగు సంధి షరతులను అమలులోనికి తెచ్చాడు. వారిద్దరికీ లంచమిచ్చి తన సైన్యపు పెంపుదల కార్యక్రమం బయటకు పొక్కకుండా జాగ్రత్త పడ్డారు. గోల్కొండ, బీజాపూరు నవాబుల వద్ద చౌత్ వసూలు చేయడం మొదలు పెట్టాడు. శంభూజీని మాసబ్‌దారుగా ఔరంగాబాదులో మో-అజమ్ కొలువులో ఉంచబడ్డాడు. ఇక్కడే శంభూజీ సమస్త దురలవాట్లకు బానిస అయిపోయాడు.

ఈ రకంగా మొగలాయిలను ఎదుర్కొనేందుకు సర్వసన్నద్ధమైన సేనను సమకూర్చుకొంటుండగా ఔరంగజేబు మళ్ళీ హిందువులను అణచివేసే కార్యక్రమాలు మొదలు పెట్టాడు. ఏప్రిల్ 9.1669న హిందూ దేవాలయాలు, హిందూ పాఠశాలలకు మత పరమైన బోధనలు, యజ్ఞ యాగాది క్రతువులు నిలిపివేయాలని ఉత్తర్వులు జారీ చేశాడు. హిందూ పండుగలు జరుపుకోవడం, జాతరలు, మేళాలు నిషేధించబడ్డాయి. 1669లో కాశీవిశ్వేశ్వరాలయం, 1670లో మధుర కేశబ్‌దేవ్ ఆలయం కూలదోయడానికి ఉత్తర్వులు చేయబడ్డాయి. వాటి స్థానంలో ఈనాటికీ పెద్ద మసీదులు దర్శనమిస్తాయి. జీజాబాయి, శివాజీ ఈ వార్తలు విని చింతాక్రాంతులయ్యారు. భవానీ దేవిని, తమ గురువులను పూజించి, తల్లి ఆశీస్సులు తీసుకొని హిందూ ధర్మ పరిరక్షణార్థం మళ్లీ ఖడ్గం చేతబూనాడు శివాజీ.

1670 ఫిబ్రవరిలో తానే స్వయంగా మొగలాయిలకు ఆధీనం చేసిన సింహఘడ్ కోటను బహిరంగంగా ముట్టడించాడు. కోట రక్షకుడయిన ఉదయభానుని తుదముట్టించి కోట స్వాధీనపరచుకున్నాడు. మొగల్ సరిహద్దులపై దాడిచేసి కళ్యాణ్ దుర్గాన్ని స్వాధీనపరచు కున్నాడు. ఏప్రియల్‌లో మొగలు పట్టణాలపై దండెత్తి ప్రభుత్వ ధనాగారాలను లూటీ చేశాడు. అక్టోబర్‌లో ఏ సూరత్ పట్టణాన్ని లూటీ చేసినందుకు జయసింగు పంపపట్టాడో ఆ సూరత్‌ను మూడు రోజులు దోచి 65 కోట్ల రూపాయలు స్వాధీనం చేసుకొన్నాడు. మొగలాయి ప్రధాన దండనాయకులైన దౌడ్‌ఖాన్, ఇక్లాస్‌ఖాన్, మొహబ్బత్ ఖాన్ వంటివారు శివాజీని ఎదుర్కొని కన్నులొట్టబోయి వెనుదిరిగారు. గుజరాత్, కాందేష్ రాజ్యముల పాలనకు అత్యంత ఆవశ్యకమై సల్వేర్ కోట శివాజీ చేతబడటం మొగలాయిలకు తీరని దెబ్బ. బీజాపూర్ నవాబును ఎదుర్కొని పన్వాలా మొదలైన దుర్గాలు స్వాధీనం చేసుకొన్నాడు. హైందవ ధర్మానికి క్షతి కలిగించిన మొగలాయి సామ్రాజ్యాన్ని ఈ మూడు సంవత్సరాలు ముప్పు తిప్పలపాలు చేశాడు. శివాజీ చరిత్రలో ఈ మూడు సంవత్సరాలూ ఎంతో శ్రమతో కూడుకున్నవి. అయితేనేమి? శివాజీ నాయకత్వానికి, మరాఠుల స్వామి భక్తి, దేశభక్తి, మతంపై గల విశ్వాసానికి యావద్భారతం నివాళులెత్తిన సంవత్సరాలివి. ఔరంగజేబు శక్తి తెలిసి కూడా హిందూ ధర్మ రక్షణకై అతనితో తలబడిన శివాజీకి భవానీ కటాక్ష రూపంగా జయం వరించింది.

నలుదిక్కులలోను తన సార్వభౌమత్వాన్ని నిరూపించుకొన్న శివాజీకి సామ్రాజ్య పట్టాభిషేకం జరగాల్సి ఉంది. దాని కోసం ఉదయపూరు నుంచి తన పూర్వీకుల వివరాలు సేకరించనారంభించాడు. అయితే కాశీ పండితుడయిన విశ్వేశ్వర్ భట్ శివాజీ చరిత్ర అతని ఉత్తమ క్షత్రియత్వానికి లక్షణమని చెప్పి తానే స్వయంగా పట్టాభిషేకం జరిపించడానికి తరలి వచ్చాడు.

రాయగఢ్‌లో ప్రతి వీధి, ప్రతి ఇల్లు అలంకరించబడింది. ప్రజలు రామ పట్టాభిషేకానికి తరలివచ్చినట్లు తరలివచ్చారు. ఈ మరమత్తులకు, అలంకారాలకు, సింహాసనం తయారుచేయడానికి అయిదు కోట్ల రూపాయలు అయి ఉంటుందని అంచనా. జీజాబాయి కలలు ఫలించాయి. హిందూ మహా సామ్రాజ్యానికి శివాజీ పట్టాభిషిక్తుడవబోతున్నాడు. పట్టాభిషేక సందర్భంగా పదహారు వేల మొహరీలతో తులాభారం తూగిన శివాజీ దానిని వేద పారంగతులయిన పండితులకు దానం చేశాడు. లెక్కలేనంత ధనం బీద సాదలకు వస్త్రరూపంగానూ, గృహరూపంగానూ ఇవ్వబడింది.

1674, జూన్ నెల ఆరవ తేదీ ఆనంద నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి గురువారం నాడు "క్షత్రియ కులావతంస, సింహాసనాధీశ్వర, మహారాజా, ఛత్రపతి" శివాజీ మహారాజులుంగారిని ఎనిమిది మంది ఋత్విక్కులు వేదఘోష నడుమ గంగాది సకల పుణ్య తీర్థములతో అభిషేకించి పట్టాభిషిక్తుల్ని చేశారు. మహారాజా, శివాజీ సింహాసనా రూఢులయి, అష్ట మంత్రులతో ధర్మపాలన నారంభించారు.

అనతి కాలంలోనే పట్టాభిషేకం చూసిన ఆనందంతో, తృప్తితో జీజాబాయి పరమతృప్తి పదాన్ని పొందారు. శివాజీపై తల్లిగారి ప్రభావం మనం అనేకసార్లు చెప్పుకొన్నాం. అట్టి తల్లి ఉత్తరగతులకై శివాజీ ఏ రకంగా జరిపించి ఉంటాడో మనం ఊహించుకోవచ్చు.

(సశేషం)

త్యాగరాజ జయంతి సందర్భంగా

# సంగీత మూర్తుల జన్మక్షేత్రం



త్యాగరాజస్వామి దీక్షితులు శ్యామశాస్త్రి

యస్. ముత్తయ్య

కొన్ని శతాబ్దాలుగా, సంగీత, నాటక, నృత్య, సాహిత్యాలకి ఆలవాలమయిన ప్రాంతం, తమిళనాడులోని తంజావూరు. తంజావురుకి ఏడుమైళ్ళ దూరంలో తిరువాయూరు, తిరువాయూరు నుండి యాభై కిలోమీటర్ల దూరాన ఉన్న కుగ్రామం తిరువారూరు.

కొన్ని స్థలాలలో జన్మించిన వారు గొప్ప వారవుతారో, అటువంటి మహానుభావులు జన్మించిన కారణంగా ఆ స్థలం ప్రత్యేకతని సంతరించుకుంటుందో మరి! ఈ తిరువారూరు కుగ్రామంలోనే కేవలం ముప్పై సంవత్సరాల వ్యవధిలో, ఈనాడు మన కర్నాటక సంగీతం ఇంతటి ఉచ్ఛస్థితిలో ఉండడానికి కారకులయిన ముగ్గురు వాగ్గేయకారులు జన్మించారు. ఎనభై సంవత్సరాలపాటు వారి ముగ్గురి కలాలనుండి, గళాలనుండి జాలువారినదే నేటి సంపూర్ణ కర్నాటక సంగీతం!

ఒకే గ్రామంలో ముగ్గురు సంగీత సాహిత్యాలలో ఎదురులేని ఉద్ధండ పండితులు ముగ్గురు జన్మించడం అద్భుతం. ఆ గ్రామంలోని త్యాగరాజ స్వామి ఆలయ ప్రాంగణంలోని తామర కొలనులోని నీటికి అద్భుత శక్తులున్నట్లు భావిస్తారు, చుట్టు పక్కల ప్రాంతాల ప్రజలు. ఆ కొలనుని సందర్శించిన గర్భిణీస్త్రీలు, భవిష్యత్తులో గొప్పవారు కాబోయే పిల్లలని ప్రసవిస్తారని వారినమ్మకం. బహుశా అందుకు కారణం, నాదత్రిమూర్తులు అక్కడే జన్మించడం కావచ్చు.

త్యాగరాజస్వామి, ముత్తుస్వామి దీక్షితార్, శ్యామశాస్త్రి - ఈ ముగ్గురూ తిరువాయూరులోనే జన్మించారు.

## త్యాగరాజ స్వామి

శ్రీత్యాగరాజస్వామి క్రీ.శ. 1767లో మే నాలుగో తారీఖున జన్మించారు. జన్మించినది చోళ దేవాలయాలతోనూ, మరాఠరాజ్య న్యాయ సంస్థానాలతోనూ సత్సంబంధాలున్న విద్వాంసుల కుటుంబంలో, విద్వత్తు చూస్తే, చిన్నతనంలోనే విద్వాంసులను మించిపోయిన విద్వత్తు. కోరుకుంటే భోగభాగ్యాలతో తులతూగే జీవితం ఆయన పాదాక్రాంతమయ్యేది. కానీ పాదాల దగ్గరకి వచ్చిన సంపదలను కూడా గడ్డిపోచలా నిరాకరించారాయన.

త్యాగరాజస్వామికి ఐహిక ప్రపంచంపై ఏమాత్రం మమకారమూ లేకపోయింది. నిరంతరమూ భగవన్నామస్మరణే!

చిన్నతనంలోనే త్యాగరాజు తిరువారూరు వదిలి, తిరువాయూరు చేరారు. శేషజీవితం అంతా తిరువాయూరులోనే గడిచింది.

_ భగవంతుని ధ్యానంలో లీనమయిన త్యాగరాజస్వామి నోట అశువుగా కీర్తనలు వెలువడేవి. శ్రీరామచంద్రుణ్ణి తన సంగీతంతో భక్తి మార్గంలో సేవించడమే ఆయన జీవితం. ఆ కీర్తనలలో ఎక్కువభాగం తెలుగులోనూ, కొన్ని సంస్కృతంలోనూ రచించారు. ఆధ్యాత్మిక, వేదాంత, భక్తి భావాలతో నిండి ఉంటాయి కీర్తనలన్నీ.

తిరుమల వేంకటేశ్వరస్వామి దర్శనార్థం త్యాగరాజ స్వామి వెళ్ళిన సమయానికి, దేవాలయ ద్వారాలు మూసివేసి ఉన్నాయి. వ్యాకులపడ్డ త్యాగరాజస్వామి, ''తెరతీయగ రాదా'', అంటూ గానం చేయగా, దేవాలయ ద్వారాలు తెరుచుకుని, త్యాగరాజస్వామికి, శ్రీవారి దర్శన భాగ్యం కలిగింది. ఆయన సంగీతానికి అంతటి శక్తి ఉంది!

ఆ కాలంలో రాజ్యమేలుతున్న శరభోజా రాజు, తన ఆస్థాన విద్వాంసునిగా ఆహ్వానిస్తూ స్వర్ణాభరణాలు, ధనరాశులూ పంపితే తిరస్కరించారు త్యాగరాజస్వామి.

తనని కీర్తిస్తూ కృతులు రాయమంటే తిరస్కరించినందుకు కోపంతో శరభోజీ, సరస్వతీ మహల్ గ్రంథాలయంలో త్యాగరాజు కీర్తనలేవీ భద్రపరచటానికి వీలులేదని ఆజ్ఞజారీ చేశారు. అదృష్టవశాన త్యాగరాజు కీర్తనలు ఏడు వందలు మాత్రమైనా మనకి లభ్యమయ్యాయి.

ఆస్థాన విద్వాంసుడి పద విని తిరస్కరించి త్యాగరాజు సంగీతాన్ని సామాన్య మానవుల మధ్యకి తీసుకువెళ్ళి వారుకూడా సంగీతంలో తాదాత్మ్యం పొంద గలిగే అవకాశాన్ని కలిగించారు.



త్యాగరాజు నివసించిన ఇంటి లోపలి భాగము

తిరువాయూర్లులోని, తిరుమంజానం వీధిలోని చిన్న కుటీరం త్యాగరాజస్వామి నివాసస్థానం. ఈ కుటీరంలోనే ఆయన శ్రీరామచంద్రుణ్ణి భక్తి మార్గంలో, నిరంతరం తన సంగీతంతో సేవిం చారు. ఈ కుటీరంలోనే ఆయన తన నూట ఇరవైమంది శిష్యులకీ సంగీత శిక్షణ యిచ్చారు. ఆ శిష్యులు దక్షిణ భారతమంతటా త్యాగరాజ కీర్తనలను ప్రచారం చేశారు. ఇక్కడే 1847లో త్యాగరాజ స్వామి సిద్ధి పొందారు.



ముత్తుస్వామి దీక్షితర్ ఇంటి భాగములో నిర్మించిన మండపం

త్యాగరాజస్వామి సిద్ధి పొందిన ప్రదేశంలో ఓ మండపం నిర్మించారు. అక్కడ 1941 నుండి ఏటా జనవరి మాసంలో (పుష్యబహుళ పంచమి త్యాగ రాజు సిద్ధి పొందిన తిథి) ఒక వారం రోజులపాటు త్యాగరాజు ఆరాధనోత్సవాలు జరుపుతు న్నారు. సంవత్సరమంతా నిశ్శబ్దంతో నిద్రలో ఉన్నట్లుండే తిరువాయూరులో త్యాగరాజ ఆరాధనోత్సవాల సమయంలో నాద మయంగా తోస్తుంది. ఆ సమయంలో ప్రపంచ ప్రఖ్యాత సంగీత విద్వాంసులు ఏకకంఠంతో గానం చేసే త్యాగరాజ కీర్తనలు కలిగించే రసానుభూతి అనుభవించి ఆస్వా దించవలసిందే గానీ, వర్ణనలకి అందేది కాదు. ఏప్రిల్ నెలలో జరిగే త్యాగరాజ జయంతి (వైశాఖ శుద్ధషష్ఠి) ఉత్సవాలలో మళ్లీ ఇటువంటి సంగీతాంబుధిలో ఓలలాడే అవకాశం కలుగుతుంది.

## ముత్తుస్వామి దీక్షితార్

తిరువారూరులో జన్మించిన మరో వాగ్గేయకారుడు ముత్తు స్వామి దీక్షితార్. ఆయన 1776లో జన్మించారు. 1835 లోనే ఈ భౌతిక ప్రపంచాన్ని వది లారు. ముత్తుస్వామిగారి నివాసం కూడా, త్యాగరాజస్వామి ఇంటికి దగ్గరే.

ఈయన తన కృతులన్నీ సంస్కృతంలోనే రచించారు.

త్యాగరాజు కీర్తనలు - అందరికీ సులభ గ్రాహ్యమైన బాషలో ఉంటాయి. ముత్తుస్వామి దీక్షితార్ కృతులు అర్థం చేసుకోవడానికి శాస్త్ర పాండిత్యం అవసరం. వారి కీర్తనలలోని భావాన్ని అర్థం చేసుకోవడానికి, పదేపదే అధ్యయనం చేయడం అవసరం. కీర్తన లన్నింటిలో ఆధ్యాత్మిక, వేదాంత పరమైన భావాలు మంత్ర శాస్త్ర రహస్యాలు వ్యక్తమవుతాయి. దీక్షి తార్ కృతులు ఎక్కువగా ఉత్తర భారతదేశపు రాగాలలో ఉం టాయి. వీరి కాలంలోనే హిందు స్తానీ, కర్నాటక సంగీత రీతుల కలయికకి శ్రీకారం జరిగింది.

శ్రీముత్తుస్వామి దీక్షితార్ సంగీతానికి అద్భుతశక్తులు ఉండేవి అని తెలియజేసే ఓ సంఘటన - తంజావూరు జిల్లాలో కరువు విలయతాండవం చేస్తున్న సమ

యంలో, ముత్తుస్వామిదీక్షితార్ అమృతవర్షిణి రాగంలో ''ఆనం దామృతవర్షిణి అమృతవర్షిణి'' అనే కీర్తనతో కరిగిన దేవతలు, వర్షం కురిపించారు!

ప్రతిసంవత్సరం దీపావళి నాడు శ్రీముత్తుస్వామి దీక్షితార్ సంస్మరణ దినం జరుపు తున్నారు.



శ్యామశాస్త్రి నివసించిన ఇంటి లోపలి భాగము

తిరువారూరులో జన్మిం చిన మరో వాగ్గేయకారుడు శ్యామశాస్త్రి. 1762లో, భక్తికి మారు పేరయిన దేవాలయ పూజారుల కుటుంబంలో జన్మించారు.

అతి చిన్న వయసులోనే తమ ఇలవేల్పు కామాక్షీ అమ్మవారిని కీర్తిస్తూ కృతులు రచించారు. వారి కీర్తనలు క్లిష్టమైన తెలుగులో ఉంటాయి. ఆయన రచించిన కీర్తనలలో కేవలం యాభై మాత్రమే మనకి లభ్యమవు తున్నాయి.

**తిరువాయూరు, కావేరీ నదికి ఉపనది అయినె 'కుడమురుత్తి' తీరాన ఉన్నది. ఇక్కడి ''పంచనదీశ్వరాలయం'' ఒక సహస్రాబ్దిగా ఉన్న పురాతన దేవాలయం. కావేరీ, దాని నాలుగు ఉపనదులు, వడవారు, వెన్నారు, వెట్టారు, కుడ మురుట్టి - ఈ ఐదు నదులకీ వేలుపు - పంచనదీశ్వరుడు. ఈ దేవాలయం రాజేంద్రచోళుని అద్భుతమైన భవన నిర్మాణశక్తికి తార్కాణం. పంచనదీశ్వర దేవాలయానికి దక్షిణాన, ఉన్న తిరుమంజానం వీథిలో త్యాగరాజు స్వామి నివాసం.**

త్యాగరాజస్వామి శిష్యులు ఆయన సంగీతాన్ని దక్షిణాదిన అంతటా వ్యాపింప



దీక్షితర్ మండపంలో భాగం

దృష్టి సారించారు. శ్యామశాస్త్రి శిష్యులు స్వరకల్పనకారులు అయ్యారు.

భారతదేశంలో రెండు సంగీత రీతులున్నాయి - హిందుస్తానీ, కర్నాటక. రెండింటికీ మూలం వేదనాదమే. తరువాత కాలంలో ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రాగతాళాలు ప్రసిద్ధి చెందాయి - దక్షిణాదిన కర్నాటక సంగీతం, ఉత్తరాదిన హిందుస్థానీ సంగీతం అని రెండు రీతులు ఏర్పడ్డాయి.

సంగమయుగకాలం; 3వ శతాబ్దంలో ఆళ్వార్లకాలం, 7-8 శతాబ్దాలలో నాయనార్లకాలం, చోళరాజు కాలం, 12వ శతాబ్దంలో జయదేవుడి సమయం, 15-16 శతాబ్దాలలో అన్నమాచార్య, పురందరదాసుల కాలంలోనూ కర్నాటక సంగీతం ఉన్నత స్థితిలో ఉంది.

అయితే 18వ శతాబ్దంలో తిరువారూరులో జన్మించిన త్యాగరాజ స్వామి, ముత్తుస్వామి



పంచ నదీశ్వరాలయం

దీక్షితార్, శ్యామశాస్త్రిలే కర్నాటక సంగీతానికి అత్యున్నత స్థానాన్ని కల్పించారు.

తరువాత కాలంలోని వాగ్గేయకారు లందరికీ ఈ సంగీత విద్వత్త్రయమే మార్గ దర్శకులయ్యారు. వీరు ముగ్గురూ లేన ట్లయితే కర్నాటక సంగీత కచేరీయే లేదు. గత 200 సంవత్సరాలుగా కర్నాటక సంగీతం ఉచ్ఛస్థితిలో ఉండడానికి కారణం ఈ త్రిమూర్తులే. ✦

# మన సంప్రదాయాలు - బాల్యం

శ్రీమతి పరిమళా శ్రీధర్

ఎదురింటి ముందు స్కూటర్ చప్పుడయ్యింది. శారద ఆమె భర్త ఆఫీసుకు బయలుదేరుతున్నారు కాబోలు. పాప ఏడుపు వినిపిస్తోంది. టా, టా అంటూ ఆ దంపతులు చేతులూపుతూ వెళ్ళిపోయారు. పనిమనిషి ఏడుస్తున్న పాపనెత్తుకొని సముదాయిస్తూ, లోపలికి వెళ్ళి గేటు తాళం వేసింది. ఆ రెండేళ్ళ చిన్నారి ఏడుపు మాని, గేటు దగ్గర నిలబడి, వచ్చే పోయే జనాన్ని చూస్తూ, చేతులూపుతూ, తనకు తానే ఏదో మాట్లాడుకొంటూ వుంది. తల్లి ఇంటికి తిరిగి వచ్చేదాకా కాస్సేపు టి.వి., కొంతసేపు నిద్ర, మరికొంతసేపు బొమ్మలతో ఆడుకోవడంతో సమయం గడుస్తుంది.

సాయంత్రం మళ్ళీ ఆ గేటు ముందే నిలుచుకొని, కొండంత ఆశతో అమ్మ కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. తల్లిని చూడగానే ఒంటరితనం ఇంక భరించలేన్నట్లుగా అమాంతం వెళ్ళి తల్లి కాళ్ళకి చుట్టుకుపోతుంది. నిజంగా ఆ దృశ్యం చూడడానికి ఎంత అద్భుతంగా ఉంటుందో అంతగా మనస్సుని కదల్చి వేస్తుంది.

ఆఫీసు నుంచి వచ్చిన తల్లితో బోలెడు కబుర్లు తన ముద్దు మాటలతో చెప్పాలని ప్రయత్నించింది. కానీ, అలసి వచ్చిన తల్లి, మాటలు వినే ఓపిక లేక బిస్కెట్లు, చాక్లెట్లు, ఐస్‌క్రీంలు ఇచ్చి టి.వి. ముందు కూర్చోబెట్టి, పని చూసుకుంటూ ఉంటుంది. పోనీ నాన్నతో చెబుదామా అంటే తండ్రి టి.వి. వీక్షించడంలో లీనమై ఊ.... ఊ అంటూ ఊకొడతాడు తప్ప మాట్లాడడు. మారాం చేస్తే ఇద్దరూ కోప్పడతారు.

వంట పని ముగించి, అన్నం కలిపి తీసుకుని వస్తుంది తల్లి. తానూ టి.వి. చూస్తూ పాపకి అన్నం తినిపిస్తుంది. పాప మళ్ళీ టి.వి. చూస్తూ అలాగే నిద్రలోకి ఒరిగిపోతుంది. ఇక తెల్లవారినప్పట్నుంచి అమ్మా నాన్నలకి ఉరుకులు పరుగులు.

ఇప్పుడిప్పుడే ప్రపంచాన్ని చూస్తున్న ఆ పసిపాపకి మనసులోని భావాలకు మాటల రూపం ఇవ్వాలనే తపన. ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తాయి. ఆ ప్రశ్నలకి సమాధానం ఎవర్నడగాలి?

ఇది ఈనాటి యాంత్రిక యుగంలో అప్పుడే వికసిస్తున్న పువ్వుల వంటి పసిపిల్లల బాల్యం. ఓ ముప్పై సంవత్సరాల క్రితం ఉన్న భారతీయ సంస్కృతికి, ఇప్పటికీ ఎంత తేడా? ఇప్పటిలా పిల్లలకి మాటలొచ్చిందే తడవుగా నర్సరీలంటూ, ఎల్.కె.జి.లంటూ బడిలో చేర్పించేవారు కారు.

అసలు బాల్యం అంటేనే అందరికీ గుర్తుకు వచ్చేది ఆటలు, పాటలే. అదే రీతిలోనే పిల్లల పెంపకం ఉండేది ఆ రోజుల్లో. అన్నం తినిపించడానికి పాటలు, ఆటలాడించడానికి పాటలు, నిద్ర పుచ్చడానికి జోల పాటలు. పాపాయి మూడు నెలలకి ఆరు నెలలకి తండ్రిని గుర్తుపడుతుంది అని చెబుతారు పెద్దలు. అప్పట్నుంచి మొదలవుతాయి ఆటలు.

**తారంగం - తారంగం తాండవకృష్ణ తారంగం...** అంటూ అరచేతి బంతిలా తిప్పుతూ ఉంటే పాపాయి తల తిప్పుతూ చూసిందంటే సంబరం.

అమ్మమ్మలు, నాన్నమ్మలు, అత్తయ్యలు, పాపాయిని ఒళ్ళో కూర్చోబెట్టుకొని **''ఏనుగొచ్చిందేమగు, ఏ ఊరొచ్చిందేమగు''** అంటూ పాడుతూ ముందుకు వెనక్కి ఊగిస్తూ ఏనుగాట ఆడిస్తారు.

ఇంకాస్త పెద్దయితే తాతయ్యలు, మామయ్యలు, చిన్నాన్న, పెదనాన్నలు పోటీపడుతూ నేలమీద వంగి, తమ వీపుమీద పిల్లల్ని కూర్చోబెట్టుకొని ఏనుగుమీద ఊరేగింపు అంటూ ఆడించడం ఎంత సంరంభం. అసలు రాజుగారి పట్టపుటేనుగు కూడా ఈ ఏనుగు ముందు పనికిరాగలేదు. ఈ ఏనుగు మమతానుబంధాల ఏనుగు. వయస్సు మళ్ళిన తాతగారు కూడా తన వయస్సుని ఏమాత్రం లెక్కచేయకుండా, తన మనవళ్ళని మనవరాళ్ళని ఏనుగు మోస్తూ, వాళ్ళని ఆనందపరచడం నిజంగా అద్భుతం కాదూ!

ఇంకో ఆట కూడా ఉండేది ఆ రోజుల్లో. కాస్త పెద్ద పిల్లలు ఇద్దరిద్దరుగా చేరి ''అవ్వ - అప్పచ్చి'' అంటూ ఒకరినొకరు చేతులు కలుపుకొని పాపాయిని తమ చేతుల మీద కూర్చోబెట్టుకోవడం, ఆ పాపాయి ఇద్దరి భుజాల మీద చేతులు వేసి, గట్టిగా పట్టుకొన్న తరవాత ''దేవుడమ్మ దేవుడు - మాయదారి దేవుడు'' అని మిగతా పిల్లలంతా సరదాగా కేకలు పెడుతూ పాపాయిని ఊరేగించేవారు. ఇవన్నీ పిల్లలకి ఉల్లాసాన్ని కలిగించడంతో పాటు, వారిలో కలుపుగోలుతనాన్ని, వారి మధ్య అనుబంధాన్ని ఏర్పరచేవి.

ఇక పిల్లలకి రెండేళ్ళు వచ్చేసరికి, చెప్పింది అర్థం చేసుకోవడంతో పాటు చిన్న చిన్న మాటలు కూడా మాట్లాడడం మొదలు పెడతారు. పెద్దవాళ్ళు పిల్లలందర్నీ కూర్చో బెట్టి ఆడించే ఆటలు ఎన్నో.

**కాళ్ళాగజ్జె - కంకాళమ్మ**
**వేగులచుక్క - వెలగమొగ్గ**
**మొగ్గ కాదు - మోటకి నీరు**
**నీరు కాదు - నిమ్మలవాయి**
**వాయికాదు - వాకింటికూర**
**కూర కాదు - గుమ్మడిపండు**
**పండూ కాదు - పాపాయి కాలు**
**కాలూ తీసి - గట్టున పెట్టు**

అన్న ఆట, **గుడు గుడు గుంజం, గుళ్ళో రాగం** - అంటూ పిల్లలంతా ఒకరి నొకరు చెవులుపట్టి ఆడుకోవడం, ఇల్లంతా నవ్వుల పండుగే మరి.

ఇలా వయస్సుకి తగినట్లుగా రకరకాల ఆటలు, పిల్లలతో ఆడిస్తూ, వారితో పాటు పెద్దవాళ్ళు కూడా శృతి కలుపుతూ, వారిని ఆనందపరుస్తూ, తాము ఆనందించేవారు.

ఇవన్నీ ఒక ఎత్తయితే, ఇప్పటికీ ఈ ఆధునిక యుగంలో కూడా ప్రతి పాపాయికి నేర్పే ఆట ఒకటుంది. పాపాయి ఎంత ఏడుస్తున్నా ఆ ఆట పేరు చెబితేనే చాలు కళ్ళు తళుక్కుమంటాయి.

పాపాయి బుజ్జి చెయ్యి పట్టుకొని, అర చెయ్యిలికి ముగ్గేసి, ఆకేసి, పప్పేసి.... ఇలా చెబుతూ చివరికి, అమ్మకో ముద్ద, నాన్నకో ముద్ద, నీకో ముద్ద అంటూ అందరూ కలిసి, అందరికీ ఇచ్చి, భోంచెయ్యాలనే విషయాన్ని చిన్నప్పట్నించే ఆ చిన్నారి మేధస్సుకి అర్థ మయ్యేలాగా, తమాషాగా చెబుతూ ఆడించ డం, నిజంగా ఇంతటి చక్కటి సంస్కృతిని ఎక్కడ చూడగలం?

ఆటలు, పాటలతో పాటు, చిన్న చిన్న పద్యాలు కూడా నేర్పించేవారు. తొండమునేక దంతమును, తల్లీ నిన్ను దలంచి, నీవే తల్లివి, తండ్రివి లాంటి చిన్న చిన్న పద్యాలు ఎన్నిటినో కంఠస్థం చేయించేవారు. చేత వెన్న ముద్ద, చెంగల్వ పూదండ పద్యాన్ని అభినయిస్తూ వేరే చెప్పేవాళ్ళం. చిన్న చిన్న పదాలతో, చిన్ని సంగీతంతో ఉండే ఈ పద్యాలు పిల్లల చేత మనస్సులో భక్తి బీజాన్ని నాటడంతో పాటు, వారిలో నైతిక బలాన్ని పెంపొందించడానికి బాల్యంలోనే పునాది వేసేవి. చందమామ పాటలు, ఉడుత పాటలు లాంటివి చెప్పిస్తూ ప్రకృతికి పరిచయం చేసేవారు.

**ఆదివారము నాడు అరటి మొలచినది**
**శనివారము నాడు చక చక గెల కోసి**
**అందరికి పంచితిమి అరటి అత్తములు**
**అబ్బాయి అమ్మాయి అరటి పళ్ళివిగో**

అంటూ పాటతోనే వారముల పేర్లు నేర్చుకోవడం.

**వానా వానా వల్లప్పా**
**చేతులు చాచు చెల్లప్పా**
**తిరుగు తిరుగు తిమ్మప్ప**
**తిరగాలేని నరసప్పా** - ఇది వానపాట.

వానొస్తే పట్టపగ్గాలుండవు పిల్లలకి. ఆ సన్నటి వాన తుంపర్లలో చిట్టి చిట్టి చేతులు చాచి, బుజ్జాయిలంతా చేరి వానపాట పాడుతూ తిరుగుతూ ఉంటే ఆ ఆనందమే ఆనందం.

పెద్దగా వానొచ్చేస్తే పిల్లలంతా ఇంట్లోకి వెళ్ళి, పెద్దవారితో కాగితం పడవలు చేయించు కొని, వాన వెలసిన తరువాత వాననీళ్ళు, పడవలతో ఆడుకోవడం.

ఇవన్నీ కలకాలం స్మృతిపథంలో అలా భద్రంగా దాచుకొనే మధురానుభూతులు.

సాయంత్రం 5 గంటలైంది. ఎదురింటి గేటు ముందు మళ్ళీ పాపాయి నిలబడి చూస్తూ ఉంది. చెదిరిన జుట్టు, నలిగిన దుస్తులు, తనవాళ్ళు వస్తే చాలన్నట్లుగా చూపులు.

ఆ చూపుల్లోని భావాలు, ఆ పసి మనసులోని ఆశలు అర్థం చేసుకొనే ఓపిక, సమయం ఆ తల్లిదండ్రులకు లేదు. కాలం ఎంతగా మారినా అప్పటికి, ఇప్పటికి, ఎప్పటికి పిల్లలు కోరుకొనేది పెద్దవాళ్ళ ఆత్మీయత, అనురాగం. ఇందులో ఏ మార్పు లేదు.

ఇంతలో ఫోన్ మ్రోగింది. అర్జంటుగా పెద్దబాలశిక్ష కావాలని, చిన్నపిల్లలని ఆడించే ఆటలు, పాటలు అన్నీ రాసుకోవడానికి వస్తున్నానని మా అర్చన ఫోన్ చేసింది. ఈమధ్య ఓ ప్రముఖ పత్రికలో ఒక వ్యాసం చదివిందట. పిల్లల పెంపకంలో మన పెద్దవాళ్ళు అనుసరించిన పద్ధతులు ఈనాటికీ చాలా మంచివేనని, సాంకేతికంగా, వైజ్ఞానికంగా మనం ఎంత ముందంజ వేస్తున్నా, నైతికంగా, మానసికంగా మనిషిని చైతన్యవంతం చేయగల శక్తి, మన ప్రాచీన సంస్కృతి, సంప్రదాయాలవేనని ఆ వ్యాసంసారాంశం. అందుకే కాబోలు మూడు నెలల పాపతో అమెరికా వెళుతున్న అర్చన అంత ఆత్రంలో ఫోన్ చేసిందన్న మాట. ఇంకేం పాపాయిలంతా బంగారు బాల్యాన్ని చవిచూడగలిగే రోజులు మళ్ళీ దగ్గరపడుతున్నాయి. వారికా భాగ్యాన్ని కలిగించడానికి ఈరోజుల్లో మనకు కావలసింది మన సంప్రదాయాల పట్ల అవగాహన, గౌరవం, మన భాషపై అభిమానం, దాంతో పాటు కాసింత ఓర్పు, కూసింత నేర్పు అంతే. దాంతో టి.వి. చూసే సమయం దానంతట అదే తగ్గి, పిల్లలతో కాలక్షేపం చేస్తూ, అందులో అద్భుతత్వాన్ని అనుభవించ గలుగుతాం. తరతరాలకి మన సంప్రదాయాలు అటు పిల్లలకి, ఇటు పెద్దలకి చక్కటి అనుభూతుల్ని పంచుతాయనడంలో సందేహమేముంది? ✦

స్వామీజీ–చార్వాకరావు

# గజ బలం

విశ్వనాథ పావనిశాస్త్రి

స్వామి సత్యానాథానంద చదువుతున్న మహాభారతం మూశారు. ఆశ్రమంలోని పిల్లలంతా ఆయన చుట్టూ చేరారు.

''స్వామీ! ధృతరాష్ట్రుడు బలవంతుడా, భీముడు బలవంతుడా?'' అని అడిగాడు ఒక పిల్లవాడు.

''మీకు ఆ సందేహం ఎందుకు వచ్చింది?'' అని నవ్వుతూ అడిగారు స్వామివారు.

''ఇనప భీముడిని, ధృతరాష్ట్రుడు కౌగిలించుకుని ముక్కలు ముక్కలు చేసేశాడు గదా!'' అన్నాడు ఆ పిల్లవాడు.

''ఇనప భీముడినేగాని, నిజం భీముడిని కాదు గదా!'' అన్నాడు మరో పిల్లవాడు.

''నిజం భీముడిని ధృతరాష్ట్రుడు నలిపి చంపేస్తాడనే భయంతోనే కదా శ్రీకృష్ణుడు, ఇనప భీముడిని ముందుకు నెట్టింది!'' అని అన్నాడు మొదటి పిల్లవాడు.

''అదా మీ సందేహం? కూర్చోండి'' అని స్వామివారు అంటున్నంతలో రాబర్ట్ కూడా వచ్చి పిల్లల్లో జేరిపోయాడు.

స్వామివారు యిలా మొదలుపెట్టారు, ''ధృతరాష్ట్రుడు అసాధ్యమైన బలం కలవాడే! అందుకు సందేహం లేదు. కాని, అమానుష బలుడైన భీముడితో సాటి రాగల బలం కలవాడు మాత్రం కాదు. ఎందుకంటే భీమసేనుడు నాగాయుత బలసంపన్నుడు. 'నాగం' అంటే ఏనుగు. 'అయుతము' అంటే పది వేలు. భీముడు పదివేల ఏనుగల బలం కలవాడు అని అర్థం. మరి ఈ ఇనప భీమ ప్రహసనం ఏమిటి అని ప్రశ్న. అక్కడే ఉంది అసలు కిటుకు.

పాండవులంటే మొదటి నుంచీ ధృతరాష్ట్రుడికి ఆదరం లేదు. వాళ్ళని ఎలాగైనా తప్పించాలనే ఆలోచించాడు. కాని వాళ్ళ ప్రతిభ దినదినానికీ పెరిగిపోయింది. ధృతరాష్ట్రుడికి ఈర్ష్య పెరిగిపోయింది. అందుకనే, దుర్యోధనుడు చేసిన ప్రతి పనికీ నూనె పోసి వత్తి ఎగసనద్రోశాడు. అది చివరికి భగ్గుమని, ఆయన ఇంటినే దహించింది. తన కొడుకులందరినీ సంహరించిన భీముడంటే ధృతరాష్ట్రుడి మనస్సులో పట్టరాని కోపం పేరుకుపోయింది. ఆ భీముడిని చంపితే గాని ఆయన కసి సగం తీరదు. ఆ కారణంగా దగ్గరకు పిలిచి, తన కబంధ హస్తాలతో బిగించి చంపాలనుకున్నాడు. ఆ విషయం ఎవరికీ తెలియదుగానీ, జగన్నాటక సూత్రధారి అయిన శ్రీకృష్ణుడికి తెలియకుండా ఉంటుందా?

ధృతరాష్ట్రుడు నిజమైన భీముడినే కౌగిలించుకుంటే ఏం జరుగుతుంది? ఇనప విగ్రహం లాగా భీముడు చలనరహితంగా ఉండి ముక్కలైపోడు గదా? ధృతరాష్ట్రుడు తనని చంపే ప్రయత్నం చేస్తున్నాడని గ్రహిస్తాడు. విడిపించుకుంటాడు. విడిపించుకున్న తరువాత ఆగ్రహావేశాలతో ఏం చేస్తాడో? మానవతీత బలసంపన్నుడై యుద్ధోత్సాహంతో ఉన్న అతని వేగానికీ, ముష్టిఘాతాలకీ ధృతరాష్ట్రుడేమౌతాడో? గాంధారి ఏం శపిస్తుందో? నలుగురూ ఏమంటారో? చూసేవారికి భీమసేనుడు దుర్మార్గుడిలాగా కనిపిస్తాడు. ప్రేమతో కౌగిలించుకున్న పెద్ద తండ్రిని చంపాడన్న చెడ్డ పేరు వస్తుంది గాని ధృతరాష్ట్రుడి దుష్టబుద్ధి తెలియదుగదా! మరి ధృతరాష్ట్రుడి దుష్టబుద్ధి నిరూపించడం ఎలా?

సృష్టిలోని సర్వజీవుల అంతరంగం తెలిసిన అవతారపురుషుడైన శ్రీకృష్ణుడు, ఆ కారణం చేతనే ఇనప భీమ విగ్రహాన్ని ధృతరాష్ట్రుడి ముందుకి తెచ్చాడు. ధృతరాష్ట్రుడి దుష్టబుద్ధి బయటపడేలా చేశాడు.

అంతేగాని పదివేల ఏనుగుల బలం కలిగిన భీముడిని ధృతరాష్ట్రుడేదో చేస్తాడన్న భయంతో కాదు'' అని ముగించారు.

స్వామివారి ఉపన్యాసం మధ్యలోనే వచ్చిన చార్వాకరావు; ''ఆ విషయాలు అవతల పెట్టి – మీ పురాణాలూ, ఇతిహాసాలూ అంటే నాకు చిరాకు ఎందుకో తెలుసా? వాటిలో అన్నీ అతిశయోక్తులే. ఒక మనిషికి పదివేల ఏనుగల బలం ఎక్కడైనా ఉంటుందా?'' అన్నాడు.

''ఎందుకుండకూడదు?'' అన్నారు స్వామివారు.

''ఏదీ? ఉంటే, ఇప్పుడు ఒక్కడిని చూపించండి.'' అన్నాడు చార్వాకరావు.

''అంతటివాడు ఆ యుగాంతంలోనే లేడు, మళ్ళీ పుట్టడు అని చెప్తుంటే, ఇంకొకడిని చూపించమంటావేమిటి?'' అన్నారు స్వామివారు.

చార్వాకరావు వికటంగా నవ్వుతూ, ''మనవాళ్ళు భలే తెలివిగలవాళ్ళులెండి. తప్పించుకోవటానికి ఎన్నో మార్గాలు.

అందులో ఇదొకటి'' అన్నాడు.

రాబర్ట్ కూడా కొద్దిగా సందేహంగా స్వామివారివైపు చూశాడు.

స్వామివారు నిశితంగా చూస్తూ, ''సరే అయితే, దాదాపు ముప్పై ఐదేళ్ళ క్రితం 'మాక్స్' అని ఒక పాశ్చాత్య బలశాలి ఐదువందల గుఱ్ఱాల బలం ప్రదర్శించాడు. ఏదీ! అలాటివాణ్ణి ఇప్పుడొకరిని చూపించు'' అన్నారు.

చార్వాకరావు ఆశ్చర్యంగా, ''ఏమిటీ! ఐదు వందల గుఱ్ఱాల బలమా? నిజమే!'' అన్నాడు.

రాబర్ట్ సాలోచనగా తల ఊపాడు.

''నాకు తెలియదే!'' అన్నాడు చార్వాకరావు.

''మరి నీకు ఏం తెలుసని, ప్రతిదానికీ ఒంటికాలిమీద లేస్తావు?'' అన్నారు స్వామీ.

''నేను నమ్మలేను'' అన్నాడు చార్వాకరావు.

రాబర్ట్ అందుకున్నాడు ఈసారి. ''నిజమే 1964-65 ప్రాంతాల్లో 'మాక్స్' అని ఒక యూరోపియన్ స్ట్రాంగ్‌మాన్ అటూ ఇటూ రెండు విమానాలను గొలుసులతో కట్టి, కదలకుండా చేతులతో పట్టుకుని ఆపాడు. ఆ అద్భుతాన్ని ఆనాటి ప్రపంచ పత్రికలన్నీ ప్రకటించాయి. ఆ విమానాలు ఒక్కొక్కటీ రెండు వందల యాభై హార్స్ పవర్ కలవి'' అన్నాడు.

''హార్స్ పవర్ అంటే ఏమిటి?'' అని అడిగారు స్వామి.

''ఐదువందల యాభై పౌండ్ల బరువుని, ఒక సెకనులో అడుగు ఎత్తు ఎత్తడానికి కావలసిన శక్తి'' అన్నాడు చార్వాకరావు.

''పౌండు బరువంటే ఏమిటో, సెకండ్ అంటే ఏమిటో, దాన్ని అడుగు ఎత్తు ఎత్తడానికి కావలసిన శక్తి అంటే ఏమిటో అర్థం కాని ఒక సామాన్యుడికి ఆ విషయాన్ని ఎలా వివరిస్తావు?'' అని అడిగారు స్వామిజీ.

''ఒక గుఱ్ఱం లాగే శక్తి'' అని వివరిస్తాను అన్నాడు.

''మరి ఆ లెక్కన, ఆ మాక్స్ అన్న మహాబలుడికి ఐదువందల గుఱ్ఱాల బలం ఉందన్న మాటేగా!'' అన్నారు స్వామిజీ.

చార్వాకరావు ఆలోచనలో పడ్డాడు.

''అంత మాత్రం చేత ఐదు వందల గుఱ్ఱాలు ఒక్కసారి వచ్చి మీదపడితే వాటిని మాక్స్ పిడికెట్లో పట్టుకుంటాడని కాదు గదా! పారిభాషికంగా ఐదువందల గుఱ్ఱాల యాంత్రికశక్తి భీమసేనుడికి ఉందని ఆనాటి శాస్త్రవేత్తలు అంచనా వేశారు.

మన పురాణాలనీ, ఇతిహాసాలనీ అతిశయోక్తులంటూ తేలికగా కొట్టిపారేయకు. ఆధునిక దృక్పథంతో ఆనాటి విలువలని గుణించడం నేర్చుకో'' అని స్వామివారు లేచారు.

పిల్లలూ, రాబర్ట్టూ, స్వామివారికి నమస్కరించి లేచారు. చార్వాకరావు ఇబ్బంది ముఖం పెట్టి గుఱ్ఱంలాగా ఇకిలించాడు.

# తల్లికి కొడుకు

'సహస్రభారతి'

డా॥ గరికపాటి నరసింహారావు

'సాగర ఘోష' అని మహాకావ్యం రచనలో నిమగ్నమై ఉన్నాను. మానవ జాతి సాంస్కృతిక చరిత్రను భారతీయ తాత్త్విక చింతనా నేపథ్యంతో వివరించే కావ్యం ఇది. అందులోని శంకరాచార్య జీవిత ఘట్టంలోని ఒక సన్నివేశంలోని పద్యాలు ఇవి –

ఉ. విష్ణు సహస్రనామ జప వీథులలో విహరించుచుండి, త
ద్విష్ణు సహస్ర భాష్యమును విజ్ఞత వ్రాయుచునుండ స్వామికిన్
కృష్ణుని తల్లి పిల్పునొక కేక వినంబడె ఆత్మయోగ రో,
చిష్ణుడు పైకి లేచె తన శిష్యులు నచ్చెరువంది చూడగన్ 1

శా. కుఱ్ఱా, శంకర! ఎందు బోయితివిరా, గొంతెత్త లేకుంటిరా
మొఱ్ఱో యన్నను వింటివా, ఇతరులన్ ముక్తాత్ములన్ జేయగా
వెఱ్ఱింజేసితి నన్ను అంత్యదశలో వేధింపకన్ రమ్మురా
అఱ్ఱున్ జాచితి గోవు పోలికను వత్సారార! పాలింపరా! 2

శా. కాశీలో కనిపించె నీ కొడుకు, ఉద్గ్రంథమ్ములన్ వ్రాసినా
డాశీ వ్యాప్తము వాని కీర్తి కవిగా వ్యాఖ్యాతగా, వేత్తగా
ఈశానుం గడుపార కంటివని ఇందెవ్వారో పల్కంగ నే
నాశన్ జూచుచు నుంటి నీకొరకు నా కన్యాయముంజేసెదే! 3

ఉ. నీటిని మోసి తెచ్చుటకు నేను శ్రమంపడి పోతినంచు ఆ
ఏటిని మూట గట్టి మన ఇంటికి ముంగట పెట్ట లేదె! ఆ
నాటి విచిత్ర సంఘటన నన్నును మ్రాన్పడ జేసె; నేడు క
న్నీటిని మోయు చుంటిని కనీని కలండున, చూడరావుగా 4

ఉ. తండ్రి గతించి పోయె, పిన తండ్రులు పెద్దలు లేక పోయిరి
ల్లాంద్రను సూటి మాటలు కులాసగ నుండగ నీవు, లోకులే
మంద్రను మాటకేమి, పరమాత్మదయారసలబ్ధమైన నీ
గుండ్రని మోము చూచు నొక కోరిక నన్ మరణింపనీదురా! 5

చ. కడుపున కాయ కాచునని కన్నులు కాయలు కాయ చూచి నే
నుడుగక నోములున్ వ్రతము లూపిరి తీయక చేసి చేసి ఆ
వడకుల గుట్ట అల్లుని కృపన్ నిను గంటిని లేక లేక పు
త్రుడ! ఇటులుండియుండిఎద గ్రుచ్చెదె సన్న్యసనోగ్రశూలమున్ 6

ఉ. అమ్మయటన్న గొప్ప బిరుదాంకము నిన్గని పొందియుంటి ''రా
మమ్మ కుమారు పెండ్లియట, అంకమ కోడలి కానుపంట, సు
బ్బమ్మ యు మామ్మ అయ్యెనట'' అన్న శుభమ్ములు విన్న గర్భమున్
చుమ్మలు చుట్టెడిన్, కనులు శూన్యములన్ వెదుకంగనేగెడిన్ 7

మ. కలియో గంజియొ త్రాగి నా ఎదుట ఎక్కాల్జెప్పినన్ జాలు, వి
ద్యలు వేదమ్ములు తత్త్వ బోధనలు, మిథ్యా వాదముల్ భేదముల్
పిలకల్ పట్టుట లేల నీకు? మది బెంబే లెత్తెడిన్ నాకు, గొ
ప్పలు సన్మానము లందలాలు జననీవాత్సల్యమున్ మించునా! 8

ఉ. తల్లికి బోధ చేసిన వృథాయయి పోవునె కాలమెల్ల? ఈ
యెల్లరు కూడి విన్న భవదీయ సుధామయవాక్యధార నీ
తల్లి కొసంగ లేవె! బహుధా తపియింతును నాదు బిడ్డ మా
టల్లహరీమనోజ్ఞము లిటన్ ప్రవహించునె నాకు దక్కునే! 9

ఉ. లోకము నుద్ధరించు అతిలోకకుమారుని గంటివంచు ఈ
లోకులు పల్కరించుతరి లోపల నేదొ కలుక్కు మంచనున్
చీకటి జీవ యాత్రకిక చేతికి నూతము లేకపోయె నా
శోకము నుద్ధరింపగల సూనులు వేరెవరయ్య శంకరా! 10

ఉ. పాతబకాయిలున్నటుల పాఠములన్ ప్రవచించుచుంటి, ఈ
చేతుల నేమి చేసితిని సేవలు? పెండ్లియ, పేరటమ్మ? నా
చేతులు దాటి పోయితివి చెర్వు మొసళ్లని మాయజేసి నీ
చేతుల దాటి పోవగల శ్రీ కరమౌ స్థితి నిమ్ము పుత్రకా! 11

చ. తలచిన వత్తునంటివి వృథా! మొగమోటపు మాటగాని నిన్
తలవని వేళయుంగలదె? దర్శనమిచ్చిన జాడ లేదు నీ
వలచిన శాస్త్రముల్, నిగమ భాష్యములున్, దివిజాలయమ్ములున్
తలపగ నీవె నన్ను! జడ దారికి గుండెలు చెమ్మగిల్లవే. 12

మ. వ్యవధానమ్మొకయింత లేని రచనా వ్యాసంగ సంగంబులున్
జవనాశ్వంబన పాద యాత్రలును శాస్త్ర ప్రౌఢ వాదమ్ములున్
దివిజ స్థానము లెల్ల జూచు పనులందే వీలు లేకుండెనో
నవ మాసమ్ములు మోసి పెంచితిని నాన్నా, నేనురా, రమ్మురా. 13

య. అని యార్తింబలవించు తల్లియొడిలో ఆకాశ గంగాంతరం
గనవాబ్జంబన వ్రాలె శంకరుడహో! కన్నీటి మిన్నేటిలో
జననీ పుత్రులు ఒక్కరొక్కరిని కాంచన్ లేని ఆనందమున్
కనువారల్ తడి కన్ను లొత్తి కొనిరా గ్రామంబునం దెల్లరున్. 14

చ. కపిలుని పోల్కి గైకొని జగద్గురుడాత్మ పరాత్మ తత్త్వమున్
విపులముగా విశేషముగ వీనుల విందుగ తెల్పె, ఆ వృషా-
కపి అపరావతారమగు కన్న కుమారుని అంకమందు బ్ర
హ్మ పదము నందె తల్లి పరమాత్మ వియోగము సైచినందునన్ 15

ఉ. బాసెము పట్టుపెట్టి తలపాగలు చుట్టిన భట్టులెల్ల స
న్యాసికి కర్మ చేయుటకు హక్కు హుళక్కి యటన్న ''మీరుస
న్యాసు'' లటంచు శాపమిడి నాతిని చేతులపైన శంభుసం
వాసము జేర్చె శంకరుడు పావకుడున్ వడకెన్ భయంబునన్ 16

# ఉపాసనా మార్గం - జపమ్

**ధూళిపాళ అర్కసోమయాజి**

“భజ - సేవాయాం” అను ధాతువు నుండి “భక్తి” అనే పదం వచ్చింది. వేద మంత్రాలలో కూడా భక్తి శబ్దం ఉంది. భగవంతుని సేవించమని, భగవత్సేవ చేయమని ఋగ్వేదం చెబుతోంది. ప్రజలు ఏ దేవతను ఆరాధిస్తారో ఏ దేవుణ్ణి ఉపాసిస్తారో వారినే పూజించమని యజుర్వేదం చెబుతోంది. అయితే ఇక్కడ “ఉపాసన” అంటే సమీపంలో కూర్చోవడం అని అర్థం. దేనికి సమీపంలో? అనే ప్రశ్న వస్తుంది. భగవంతునికి దగ్గరగా అని చెప్పుకోవచ్చు.

ఉపాసనా మార్గాలలో జపం, తపం, పారాయణం అనేవి సులభంగా అనుష్ఠించడానికి సామాన్య మానవులకు అందుబాటులో ఉంటాయి. వీటిలో మొదటిదైన జపాన్ని గూర్చి తెలుసుకుందాం. ఈ జపోపాసన శృతి, స్మృతులందు, చతుష్షష్ఠి తంత్ర గ్రంథాల్లో వివరించబడింది. ఉదాత్త, అనుదాత్త, స్వర విశేషాలతో నిబద్ధమైన వైదిక మంత్ర జపంతో, దైవోపాసన చెయ్యవచ్చు. అయితే అసలు “మంత్రం” అంటే ఏమిటి? జపం అంటే ఏమిటి? అనేవి ముందుగా తెలియాలి.

*మకారం మననం ప్రాహుః తకారః స్త్రాణ ఉచ్యతే*
*మానన త్రాణ సంయుక్తో మంత్ర ఇత్యభిధీయతే*

అని మంత్ర శాస్త్రం చెబుతోంది. “మ” అంటే మననం చేయువానిని, “త్ర” అంటే రక్షించునది. మననం చేయువారిని రక్షించునది మంత్రం అనబడుతుంది. మరి జపం అంటే!

*“జకారో జన్మవిచ్ఛేదః పకారః పాప నాశకః*
*జన్మపాప వినాశత్వాత్ జప ఇత్యభిధీయతే..”*

“జ” అనగా జన్మ విచ్ఛేదం చేసేది. “ప” అనగా పాపాలను నశింపచేసేది. జపం అనబడుతుంది.

ఇలాంటి జపం చేయాలంటే విధి విధానం తెలియాలి. ఆ మంత్రాన్ని మన అధీనం లోకి తెచ్చుకోవాలి. దాన్ని గురుముఖంగానే నేర్చుకోవాలి.

*“గుశబ్దస్త్వన్ధకారస్యాత్ రుశబ్ద స్తన్నివర్తకః*
*అంధకార నిరాసిత్వాత్ గురురిత్యభిధయతే”*

“గు” అంటే అంధకారాన్ని, “రు” అంటే పారద్రోలేవాడు. కావున అట్టి గురువు నుండి మంత్రం గ్రహించకుండా స్వయంగా, అభ్యసించి జపించే మంత్రం, అంత శ్రేయోదాయకం కాదు. అందుకే గాయత్రీ మంత్రోపదేశానికి ఉపనయన ముహూర్తం నిర్ణయించేది.

అలా నేర్చిన మంత్రాన్ని గురుసన్నిధిలో మూడు రోజులుండి, అష్టోత్తర శత సంఖ్యగా జపిస్తూ, గురువు నుండి సంగ్రహించాలి. ఇలా చేయని పక్షంలో సంచారిణీ శక్తి గురువు వద్దకే చేరుతుంది.

మనం నేర్చిన ప్రతి మంత్రాన్ని క్రమం తప్పకుండా ప్రతి దినం మననం చేయాలి. అంటే జపం చేయాలి. ఈవిధమైన జపం చేసే ప్రదేశాన్ని బట్టి ఫలితం ఉంటుంది.

*“గృహే జపం సమం విద్యాద్గోష్ఠే శతగుణం భవేత్,*
*నద్యాం శత సహస్రంస్యాదనన్తం శివసన్నిధౌ ”*
*“సముద్ర తీరేచప్రాదే, గిరౌ దేవాలయే షుచ,*
*పుణ్యాశ్రయేషు సర్వేషు జపః కోటి గుణో భవేత్”*

గృహంలో చేసే జపం సమఫలాన్నిస్తే, గోశాలలో నూరు రెట్ల, నదీ తీరంలో నూరు వేల రెట్లు, శివ సన్నిధిలో అనంత ఫలితాన్నిస్తుంది. సముద్ర తీరాల్లో, పర్వత, దేవాలయ పుణ్యాశ్రమాలలో కోటి గుణిత ఫలాన్ని అందిస్తుంది.

జప సంఖ్యని ఏవిధంగా గణన చెయ్యాలో పరిశీలిద్దాం. గాయత్రీ మంత్రాన్ని కరమాల చేతనే లెక్కించాలి. ఇతర జపాలకు ఈ నియమం లేదు. ఎందుచేతనంటే...

*“పర్వభిస్తు జపేద్దేవీం, అన్యత్రానియమ స్మృతః।*
*గాయత్ర్యా వేదమూలత్వాత్, వేదః పర్వసు గీయతే॥”*

మూడు వేదాల నుండి మూడు పాదాలు స్వీకరించబడి, గాయత్రీ మంత్రమై, జపించబడుతున్నందున, వేదగానానికి ప్రధాన స్థానములగు పర్వములందే, గాయత్రీ మంత్రం జపించాలి.

జపం చేయవలసిన తీరు పరిశీలించినచో తన చెవులకు గూడా వినబడకుండా చేసేదా మానస జపం. తన చెవులకు వినబడునట్లు చేసేది ఉపాంశువు. పై వారికి గూడ వినబడునట్లు బిగ్గరగా ఉచ్చరిస్తూ చేసేది వాచిక జపం. వాచిక జపం కన్నా ఉపాంశువు నూరు రెట్లు, ఉపాంశువు కన్న మానస జపం వేయి రెట్లు ఫలితాన్నిస్తుంది.

ప్రతి దినం చేసే పూజతో బాటుగాడు మంత్రజపం త్రిసంధ్యల్లో 108 మారులైనా కనీసం చెయ్యాలి. పూజ లేకుండా చేసే జపం నిరర్థకం. హృదయమందు హస్తముంచి, చేతి వ్రేళ్లను అడ్డంగా చాచి వస్త్రంచే కప్పి జపం చేయాలి.

ప్రతి మంత్రానికి ఋషి, ఛందస్సు, బీజం, కీలకం, శక్తి, అంగన్యాసం, ధ్యానం అనే సప్తాంగాలు ఉంటాయి. మంత్రప్రవర్త ఋషిని శిరస్సునందు ఛందస్సును ముఖమందు, దేవతను హృదయమందు, బీజమును గుహ్యమందు, న్యాసం చేసి వినియోగం చెప్పాలి. తరువాత అంగన్యాస, కరన్యాస, ధ్యాన పంచపూజలతో, మూల మంత్రాన్ని జపించి, తేజోరూప భావనతో దైవానికి ధారాదత్తం చేయాలి. జీవం లేని దేహం ఏవిధంగా ఉంటుందో, పునశ్చరణ లేని మంత్ర విద్య గూడా కార్యసాధకం కాదు - సత్ఫలితాన్నివ్వదు.

- ఇతిశయ్ -




## విభక్తి రూపములు : వాక్యములు

**ప్రథమా విభక్తి** : పుంలింగము : రామః – రాముడు, రాముడను, రాముడవు

స్త్రీ లింగము : సీతా, సీత, సీతను, సీతవు

నపుంసక లింగము : అన్నమ్ – అన్నము

**ఉదాహరణ** : సః రామః – అతడు రాముడు

అహం రామః – నేను రాముడను

త్వం రామః – నీవు రాముడవు

సా సీతా – ఆమె సీత

అహం సీతా – నేను సీతను

త్వం సీతా – నీవు సీతవు

తత్ అన్నమ్ – అది అన్నము

**సంబోధనా ప్రథమా విభక్తి** : పుం లింగము – హే రామ = ఓ రామా!

స్త్రీ లింగము – హే సీతే = ఓ సీతా!

నపుంసక లింగము – హే జ్ఞాన = ఓ జ్ఞానమా!

హే రామ! త్వం కిం కరోషి?

(ఓ రామా! నీవేమి చేయుచున్నావు?)

హే సీతే! రమా కదా ఆగచ్ఛతి?

(సీతా! రమ ఎప్పుడు వస్తుంది?)

హే జ్ఞాన! తవస్వరూపం కిం?

(ఓ జ్ఞానమా! నీ స్వరూపం ఏమిటి?)

(గత మాసంలో ఉన్న పాఠం ఆధారంగా, యిలా చిన్న చిన్న వాక్యాలు తయారుచేయండి.)

**ద్వితీయా విభక్తి :** పుంలింగము – రామమ్ (రాముని)

స్త్రీలింగము – సీతామ్ (సీతను)

నపుంసకలింగము – అన్నమ్ – (అన్నమును)

కృష్ణః రామమ్ ఆనయతి

(కృష్ణుడు రాముని తీసుకొస్తున్నాడు)

రామః సీతాం పశ్యతి

(రాముడు సీతను చూచుచున్నాడు)

గోవిందః అన్నం ఖాదతి

(గోవిందుడు అన్నమును తినుచున్నాడు)

రాధా లేఖాం లిఖతి

(రాధ ఉత్తరమును వ్రాయుచున్నది)

**తృతీయా విభక్తి :** పుంలింగము – రామేణ (రామునిచేత, రామునితో)

స్త్రీలింగము – సీతయా (సీత చేత, సీతతో)

నపుంసకలింగము – జ్ఞానేన (జ్ఞానముచేత, జ్ఞానముతో)

**ఉదా :** లక్ష్మణః రామేణ గచ్ఛతి

(లక్ష్మణుడు రామునితో వెళ్ళుచున్నాడు)

రామః సీతయా ఆగచ్ఛతి

(రాముడు సీతలో వచ్చుచున్నాడు)

సః జ్ఞానేన పండితః భవతి

(అతడు జ్ఞానముతో పండితుడు అగుచున్నాడు)

మూషికః మార్జాలేన మారితః

(ఎలుక పిల్లి చేత చంపబడుచున్నది)

రామః బాణేన రావణం మారయతి

(రాముడు బాణముతో రావణుని చంపుచున్నాడు)

## [illegible]

| | ప్రథమా విభక్తి | ద్వితీయా విభక్తి | తృతీయా విభక్తి |
|---|---|---|---|
| (పుం) | సః – అతడు – వాడు | తం – అతనిని | తేన – అతనిచేత (తో) |
| | ఏషః – ఇతడు – వీడు | ఏతం – ఇతనిని, వీనిని | ఏతేన – ఇతనితో (చేత) |
| | కః – ఎవడు? | కం? – ఎవనిని? | కేన – ఎవనిచేత? |
| (స్త్రీ) | సా – ఆమె, అది | తాం – ఆమెను | తయా – ఆమెచేత (తో) |
| | ఏషా – ఈమె, ఇది | ఏతాం – ఈమెను | ఏతయా – ఈమెతో |
| | కా? – ఎవతె? | కాం? – ఎవతెను? | కయా? – ఎవతె చేత (తో) |
| (నపుం) | తత్ – అది | తత్ – దానిని | తేన – దానిచేత |
| | ఏతత్ – ఇది | ఏతత్ – దీనిని | ఏతేన – దీనిచేత (తో) |
| | కిమ్ – ఏది, ఏమి? | కామ్ – దేనిని? | కేన – దేనిచేత? |
| | అహం – నేను | మాం – నన్ను | మయా – నా చేత (తో) |
| | త్వం – నీవు | త్వాం – నిన్ను | త్వయా – నీచేత (తో) |

## అభ్యాసము

**ప్రథమా విభక్తి**

**రామ :** వనం గచ్ఛతి – రాముడు వనము వెడుతున్నాడు.

**గోవింద :** రామాయణం పఠతి – గోవిందుడు రామాయణమును చదువుతున్నాడు.

**అహం :** భరతం పశ్యామి – నేను భరతుని చూస్తున్నాడు.

**లక్ష్మీ:** పూజాం కరోతి – లక్ష్మి పూజను చేస్తోంది.

**తత్ అధ :** పతతి – అది క్రింద పడుతున్నది.

**సంబోధన**

హేరామ! త్వం కదా ఆగచ్ఛసి? – రామ నీవు ఎప్పుడు వస్తావు?

అహం ఇదానీం ఆగచ్ఛామి – నేను ఇప్పుడు వచ్చుచున్నాను.

బాలక! త్వంకిం పఠసి? – బాలుడా! నీవు ఏమి చదువుతున్నావు?

అహం పాఠమ్ పఠామి? – నేను పాఠము చదువుతున్నాను.

**ద్వితీయా విభక్తి :**

**సింహం** కిరాత : పశ్యతి – సింహమును కిరాతకుడు చూస్తున్నాడు.

రమా **గానం** కరోతి – రమ గానం చేస్తోంది.

సా కదా, కుత్ర గానం కరోతి? – ఆమె ఎప్పుడు ఎక్కడ గానం చేస్తుంది?

సానక్తం – తత్రగానం కరోతి? – ఆమె రాత్రి అక్కడ గానం చేస్తుంది.

తృతీయా :

శిష్యః అధ్యాపకేనసహ గచ్ఛతి – శిష్యుడు అధ్యాపకునితో సహా వెళ్ళుచున్నాడు.

కిరాత : బాణేన సింహం మారయతి – కిరాతకుడు బాణము చేత సింహమును చంపుతున్నాడు.

బాలక : లేఖిన్యా పాఠమ్ లిఖతి – బాలుడు కలముతో పాఠమును వ్రాస్తున్నాడు.

శాశ్వతగ్రంథాలు - 1

# ఆదికావ్యం - రామాయణం

ఎం. బాలవిశ్వనాథశర్మ

*సంస్కృతసాహిత్యంలో అద్భుతమైన గ్రంథాలెన్నోజన అసంఖ్యాకంగా ఉన్నాయి. ఋషితుల్యులైన మహాత్ములు రచించిన ఆ గ్రంథాలలో సర్వకాలములకూ, సర్వదేశములకు అవసరమైన శాశ్వత విలువలు ఉన్నాయి.*

*వివిధ శాస్త్రాలపై సంస్కృత వాఙ్మయం విస్తృతమైన విజ్ఞానాన్ని ఇచ్చింది.*

*ఆ శాశ్వతగ్రంథాలలోని కొన్నింటిని ఈ శీర్షికద్వారా పరిచయం చేస్తున్నాం.*

*ఈ శీర్షికకు పండితులెవరైనా రచనలు పంపవచ్చు. అయితే సాధికారికంగా, వ్యవహారబాషలో క్లుప్తంగా వ్రాసిపంపాలి. ప్రచురింపబడే రచనకు పారితోషికం ఉంటుంది.*

*-సంపాదకుడు.*

శ్రీమద్రామాయణమొక విశిష్టమైన కావ్యము. దీనిని రచించిన వాల్మీకి మహా తపస్వియైన మహర్షి. ఇతని పవిత్రమైన తపస్సంతయు ఈతని రచనయందు సంక్రమించినది. అందు చేతనే రామాయణమున ప్రత్యక్షరమునందు, ప్రతిపదమునందు, ప్రతివాక్యమునందు అనుస్యూతతను తప్పక అంతర్వాహినిగ నొక అనిర్వాచ్యమైన భగవత్పదార్థము పారాడు చున్నట్లగడుచుండును. అది తదారాధకులకు ఆత్మానందమును కల్గించును. వైదిక చ్ఛందమున నున్న రామకథను లౌకిక సంస్కృత వాఙ్మయచ్ఛందమున ప్రప్రథమమున అవతరింపజేసినవాడు వాల్మీకి. కథాకథనమున రుచికలవారి నీ రామాయణము తన్మయులజేయును. శాస్త్ర మర్యాద, తాత్త్వికచింతన కలవారీ రామాయణమును విడువలేరు. మంత్రోపాసకులకీ వాల్మీకి ప్రాతస్స్మరణీయుడు. తరువాతి కావ్యకర్తలకు, లాక్షణికులకు మార్గదర్శకుడగునట్లు కవితాసామాగ్రి తగినంతగ లేని రోజులలో వాల్మీకి కవిత చెప్పినాడు. అది ఆదికావ్యమైనది. వాల్మీకి ఆదికవి యైనాడు! సామాన్య జ్ఞానులకు కూడ అర్థమగు లలిత రీతిలో పల్కిన రామాయణము కూడ అర్థముకాని వారు లేకపోలేదు.

కావ్యమనగ నేమో తెలిసికొనుట, తెలిసిన దానిని చెప్పుట, చెప్పిన దానిని నామోదింపజేయుట ఈనాడు కష్టములైన పనులు! అయినను అవసరమైనప్పుడు చెప్పవలయునుగదా!

ప్రపంచమున కంతటికి వాల్మీకి ఆదికవి! ఆయనకంటె పూర్వము లోకమునందు కావ్యములు లేవు! ఉన్నవనుకొనినచో నది పొరబాటు! గుణాలంకార రీతులేవి లేకపోయినను కావ్యము యొక్క అస్తిత్వమునకు భంగములేదు. కాని కవి, రసమూ ఇవి రెండునూ లేనిచో కావ్యములేదు. కవికర్త; రసము ఫలము; ఈ రెండు పదములు చాల చిత్రములైనవి. బహుశ ఆదికవి యైన వాల్మీకి ఈ రెండు పదములను సృష్టించియుండెనేమో! కాదు, వాల్మీకి కూడ ఆ పదములకు సృష్టికర్తకాడు. కవిః - రసః ఈ రెండు పదములు అనాదిగ శ్రుతిగతములై వినపడు చున్నవి. ''కవిం కవీనా ముపమశ్ర వస్తమం'' ''ఆహార మజరః కవిః'' ''అనంత మవ్యయం కవిగ్ం'' ''రసోవైసః'' ''రసగ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి'' ఇత్యాది వేదవాక్యములలో కవి, రస పదములున్నవి. కాని ఇక్కడ ఈ పదములకు పరమాత్మ అని అర్థము. ఈ రసమును రుచిచూచినవాడే నిజమైన ఆనంద రసాయనమును గ్రోలినవాడని అర్థము. ఆనందమనగా నేమి? ''ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్'' ''ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే'' అను శ్రుతి వాక్యమానందము పరబ్రహ్మ మని ఘోషించు చున్నది. ఇట్టి విశిష్ట లక్షణ లక్షితమైన రసమే కావ్యమునకు ఫలముగ చెప్పినారు. ఇట్టి ఫలము నాస్వాదించిన వాని స్థితి ''యతో వాచో నివర్తంతే! అప్రాప్య మనసా సహ! ఆనందం బ్రహ్మణో విద్వాన్'' అన్నట్లుండును! ఆనందవర్ధన, అభినవగుప్తాదులు చేసిన ధ్వని సిద్ధాంతమిదేనేమో!

ఉత్తమ కావ్యమును పఠించు నప్పుడు శబ్దములు, వాని అర్థములు, రీతులు అలంకారములు, క్రమక్రమముగ బుద్ధి వృత్తినుండి చ్యుతములై తద్భిన్నమైన ధ్వని గోచరించి, మనస్సులరుంచును. ఈ తన్మయీభవన సమయమున మనస్సు

ఉనికిని కోల్పోవును. నిరాలంబనమైన మనస్సు లయించి స్వస్వరూప సాక్షాత్కార స్థితి నందుకొనును. ఇట్టి సమయమున కలుగు తాదాత్మ్యావస్థయే రసస్థితి! వాల్మీకి యొక్క కవిత సంస్కారవంతుడైన పాఠకునిట్టి రసస్థితికి తీసికొని పోవుననుటలో సందేహము లేదు. ఇట్టి రచనయే కావ్యమనిపించు కొనును. అట్టి కావ్యకర్తయైన కవి ధన్యుడు.

వేదశాస్త్ర పురాణ కావ్యాదులన్నియు పరమార్థసాధన కొఱకే యవతరించినవి. వేదముల కేది లక్ష్యమో, పురాణముల కేది గమ్యమో, శాస్త్రము లేమి చెప్పదలచినవో అది చెప్పుటకే కావ్యము కూడ అవతరించినది. మహానుభావులైన ఋషులు లోకకల్యాణైక పరాయణులై, యుగ యుగములనుండి తపమాచరించి కనుగొన్న నతిసారభూతమైన పదార్థమే ఆనందము. విద్యచేత, తపస్సుచేత పవిత్రాత్ముడైన వాడు వాల్మీకి. ఇతడు వ్రాసిన రామాయణమే మొదటి కావ్యము. ఇది మనస్సును లయింపజేయునట్టి ఆనందస్థితిని కలిగించును.

రామాయణమునకు ముందు కావ్యములు లేవు! కావ్యసామగ్రి ఉదయింపక మునుపే మహర్షి కావ్యము వ్రాసెను. అందుకే కాబోలు ''నానృషిః కురుతే కావ్య''మ్మను సూక్తి జనించినది. ఋషి కాని వాడు వ్రాసినది కావ్యము కాజాలదు.

అంతర్ముఖత, క్రాంతదృష్టి కలవాడే ఋషి! అతనికి కాలత్రయమునందు లోకత్రయమునందు గోచరము కానిదేదియు ఉండదు. ఇట్టివాడు రచించిన కావ్యమే రసానందమును, తాత్త్వికానందమును ఏకకాలమున వ్యక్తీకరించును. లౌకికాలౌకిక సౌందర్యముల కాలవాలమై

యలరారుచుండును. సంస్కృతమున వాల్మీకి రచించిన రామాయణ మట్టి కావ్యము. ఆదికావ్యముగ పరిగణింపబడుచున్న ఈ కావ్యము సంస్కృత వాఙ్మయమున కేకాక, సర్వవిధ వాఙ్మయములకు ఆది కావ్యమై వెలయుచున్నది.

ఒకనాడు నాగరికతలేదు, ఆనాడు భాషా సంప్రదాయములు తెలియవు. వాఙ్మయ పరిస్థితు లయోమయములై యుండెను. ఆనాడే భారతీయ మహర్షులు వేదమంత్రములను పరిశీలించి వాని సారములను సామాన్య భాషలో ప్రసరింపజేసినారు. మంత్రనిక్షిప్తములైన ధర్మనీతి తత్త్వములు సామాన్య జనుల కందుబాటులో లేనందున మహర్షివరేణ్యులు వానిని కథారూపమున లౌకిక సంస్కృత భాషలో రచించిరి. వేద వాఙ్మయము లౌకిక భాషారూపమున నవతరింపవలసి వచ్చినది. ఇందుకు కారణము ప్రధానముగ వేద ప్రతిపాదిత ధర్మ ప్రచార దృష్టియేయని చెప్పక తప్పదు. లౌకికచ్ఛందోరూపమైన వాఙ్మయమున శ్రీమద్రామాయణమే గుణములతో నగ్రగణ్యత నందుకొనినది. అప్పటికి ప్రపంచమున ఏయితర భాషలలోగానీ, కావ్య సృష్టి జరిగెననుటకు ఆధారములు లేవు.

ఇదియే తరువాతి కావ్యజగత్తుకు మూలభూతమైనది. భాస కాళిదాసాదుల కందరికి రామాయణ రీతి శరణ్యమై అనుసరింపదగినది అయ్యింది.

**''ప్రబంధానాం ప్రబంధౄణా మపి కీర్తి ప్రతిష్ఠయోః॥**
**మూలం విషయ భూతస్య వే తుర్గుణ నిరూపణమ్'' ॥**

కులు. పరబ్రహ్మ పదార్థమైన రామతత్త్వమును కథా కథన రూపమున చెప్పుట సామాన్యుల కలవిగాని పని. వాల్మీకి మహర్షి కనుక సీతారామ తత్త్వమును ధ్వని ప్రధానముగ ప్రతిపాదించినాడు వేదవేద్యుడైన పరాత్పరుడు దశరథాత్మజుడైన శ్రీరామచంద్రుడగ నవతరించినందున పరతత్త్వ ప్రతిపాదన ప్రవణమైన వేదము శ్రీమద్రామాయణముగ నవతరించినదని పెద్దలు చెప్పుదురు. కనుక వేదము, రామాయణము ఈ రెంటికి అభేద ప్రతిపత్తి స్వయంసిద్ధము.

రామాయణము స్థూలముగ పఠించువారందలి కథాసంవిధానమును మాత్రమే గ్రహింపగలరు. సూక్ష్మేక్షికతో పరిశీలించువారందలి వ్యంగ్యమర్యాదను, మంత్రశాస్త్ర మర్మములను పరాత్పరమైన బ్రహ్మానందానుభూతిని పొందగలరు. సామాన్య కవులు గుణాలంకారరీత్యాదులతో కావ్యమున కథాకథనమును నిర్వహింపగలరే గాని, గంభీర శాస్త్ర విషయ గర్భితముగ రచనను సాగింపలేరు. అనేక మంత్రతంత్ర యోగశాస్త్ర విషయముల, నంతర్వాహినులుగ జేసి ధ్వని ప్రధానముగ, రసస్ఫోరకముగ, కమనీయ కథాసంవిధాన సుందరముగ కావ్యమును సృష్టించు ప్రజ్ఞ వాల్మీకిదే యని చెప్పక తప్పదు! అందుచేతనే తరువాతి కవులకు కావ్యములకు నిది మార్గదర్శకమైనది. ఈ కారణములచేత వాల్మీకికృతమైన శ్రీమద్రామాయణము ప్రపంచమునందలి సర్వ విధములైన వాఙ్మయములకు ఆదికావ్యమని

బడినది. సీతారామ రూపమున నున్న లక్ష్మీనారాయణు లీకావ్యమున నాయికా నాయ

రబ్రహ్మమైన రామతత్త్వము,
, పౌలస్త్య వధ మూర్పబడినవి.
రాముడు ధర్మవీరుడు.

ఏకపత్నీవ్రతుడు. శరణుపొందినచో శత్రువునకు కూడ అభయమిచ్చునట్టి ఆదర్శ వీరుడు. దానము చేయుటయేగాని ప్రతిగ్రహమెఱుగనివాడు. అందుచేతనే వాల్మీకి ''రామో విగ్రహవాన్ ధర్మస్సాధు స్సత్య పరాక్రమః'' అని పలికినాడు. ఈ పురుషోత్తమునికి ధర్మపత్ని సీత! తన గుణముల చేత అరుంధతి, అనసూయ, లోపాముద్ర, సావిత్రి, దమయంతి మున్నగు మహాపతివ్రతలను మఱపించు మహాసాధ్వి, ప్రతినాయకుడైన రావణుడు కూడ అమేయములయిన బలపరాక్రములు గలవాడు అనంతమైన శక్తిగల ప్రకృతియే ఇతని బలమునకు మోకరిల్లినది. దేవతలు, దిక్పాలకులు ఇతనికి కింకరులైరి. ఇతని చరిత్ర కూడ రామాయణమునకు శోభనిచ్చినది.

వాల్మీకి విశ్వశ్రేయము నుపలక్షించి సమాజ మేమార్గమున నడచిన బాగుపడునో సదృష్టాంతముగ వివరించినాడు. ధర్మనిష్ఠ గలవాడు అర్థకామముల ననుభవింప గలడని, ధర్మముద్వారా లక్ష్యమైన మోక్షమును పొందగలడని చెప్పినాడు. ఆశ్రమ ధర్మముల వివరించి సమాజము సామాజిక కల్యాణము నెట్లు సాధింపవీలగునో వివరించినాడు! సమయము దొరికినపుడెల్ల సత్య మహత్వమును దృష్టాంతములతో సహా విశదీకరించినాడు. ధర్మమార్గము ననుసరించుట కొంత కష్టసాధ్యమైనను అది అభ్యుదయమునకు కారణమగుటచే అనుసర్తవ్యమని నొక్కి చెప్పినాడు. ఇక ఇంద్రియజయ మావశ్యకమని, కామక్రోధముల నదుపులో పెట్టనివాడెంత గొప్పవాడైనను పతితుడగు ననినాడు ఇట్టివాడు ఉభయవిధ శ్రేయములకు దూరుడై దుఃఖభాజను డగునను హితముపదేశించినాడు.

''ఆత్మానం నియమైస్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నతః ।
ప్రాప్యతే నిపుణై ర్ధర్మో నసుఖా ల్లభ్యతే సుఖమ్ ॥''

అను నిత్య సత్యోపదేశ వచనము లవిస్మరణీయములు.

ఇక కావ్య దృష్టితో పరిశీలించినను, నీ రామాయణ మనితరసాధారణమైన కావ్యము ఇందలి పాత్రపోషణము, రసస్పృష్టి, ఉదాత్తములైన ప్రకృతి వర్ణనలు, ప్రసన్నమైన ధార, కమనీయమైన కథాసంవిధానము, ఆఖ్యానోపాఖ్యానములు, ఈ కావ్యమును లోకోత్తరమును చేసినవి. తరువాతి భారతీయ సాహిత్యమంతయు నీ కావ్యముచేత ప్రభావితమైనది. వాల్మీకి రామాయణ కావ్యరచన ద్వారా లౌకికానందముతోబాటు ఆధ్యాత్మికానందమును, వ్యక్త్యభ్యుదయముతోబాటు సామాజికాభ్యుదయమును కూడ ప్రసాదించి మానవాళికి మహోపకార మొనరించినాడు.

అందుచేత క్రీస్తుశకారంభమునకు పూర్వమే శ్రీమద్రామాయణ ప్రశస్తి వివిధ ద్వీపములకు కూడ వ్యాపించినది. అప్రయత్నముగ వాల్మీకి మహర్షియొక్క ముఖకమలము నుండి

''మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీ స్సమాః ।
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్॥''

అను ఛందోబద్ధమైన వాక్కు వెల్వడినది.

శాపమిచ్చుటచేత తా నపవిత్రుడైనట్లు వాల్మీకి బాధపడుచుండెను. ఆ సమయమున లోక కర్తయైన బ్రహ్మదేవుడు స్వయముగ వాల్మీకి యాశ్రమమునకు వచ్చి తమసా నదీ తీరమున జరిగిన సంఘటనకు చింతింపవలసిన పనిలేదని, నీ ముఖము నుండి రామచరిత్ర లౌకిక సంస్కృతమున ఛందోరూపమై బహిర్గతము కావలయునని చెప్పి పరితపించుచున్న వాల్మీకి నోదార్చి యంతర్హితుడయ్యెను. అతని శోకము శ్లోకరూపమై దేవతా ప్రసాదమున ఆదికావ్యమయ్యెను.

*(సంస్కృతభాషా ప్రచారసమితి సౌజన్యం)*

***I cannot value freedom if it deprives us of Bhagavad Gita or uproots our millions from the faith with which they look upon temples and thereby destroys the texture of our lives.***

**K.M.MUNSHI**

**Central Cabinet Minister in Nehru Cabinet**
**in a letter to Nehru on Somanath Issue**

# సంస్కృతం - మంత్రశక్తి

## ఆధ్యాత్మిక బాటగా భాష, మాట!

మాట లేదా ఉచ్ఛారణకు గల శక్తిని వైదిక యోగం నొక్కి చెప్పింది. ఆ శక్తి వాగ్దేవత, వాణి లేదా సరస్వతిగా వర్ణించబడింది. వాక్కు అంటే నియంత్రణాశక్తిగా మాట. అనంత జ్ఞాన ప్రవాహానికి అధిదేవత సరస్వతి.

అనేక విభిన్న రూపాల శబ్దయోగాలు సంస్కృత వాఙ్మయంలో చెప్పబడ్డాయి. యోగ, సాంఖ్యపద్ధతిలో శబ్దమే మిగతా ఇంద్రియ సామర్థ్యాలన్నింటికీ మూలమని తెలుపబడింది. ఆదిభూతమైన 'ఈథర్'కి గల ఇంద్రియ గుణం శబ్దం. అందుచేత దీని ద్వారా భూతాలన్నింటిని నియంత్రించవచ్చు. 'మనస్సు' కూడా శబ్ద నిర్మితమే. మన మాటలు ప్రతిధ్వనులు, అవి ప్రాతినిధ్యం వహించే భావాలే మానస రీతుల్ని రూపొందిస్తాయి. కాబట్టి వివేక పూర్ణ శబ్ద వినియోగం మనస్సును నియంత్రించటమే కాక పరిశుద్ధం చేస్తుంది. భర్తృహరి ''శబ్ద బ్రహ్మ మంత్ర యోగం'' శబ్ద యోగాలన్నింటిలోనూ అతి ముఖ్యమైంది. శబ్దాన్ని అర్థం చేసుకోవడమే పరమోత్కృష్ట యోగమనీ, దైవాన్ని చేరుకోవడానికి అతి సరాసరి మార్గమనీ చెప్తోందీ యోగం.

ఈ శబ్దయోగాలు కేవలం ఉచ్చరించబడే మూల శబ్దాలకే సంబంధించినవి కావు. వైదిక, పౌరాణిక వాఙ్మయంలో నాలుగు శబ్ద స్థితులు గుర్తించబడ్డాయి. ''శబ్ద స్థితులు నాలుగు. గోప్యమైన మూడు స్థితులు అసాధ్యాలు. మర్త్యులు నాల్గవ స్థితిలో మాట్లాడతారు'' అని చెప్పింది ఋగ్వేదం (1.164. 45). ఈ నాల్గు స్థితుల్ని వరుసగా వైఖరి, మధ్యమ, పశ్యంతి, పర అని పిలుస్తారు. 'వైఖరి' గొంతుకలో నివసిస్తుంది. మనం బయటకు వినపడేటట్లు ఉచ్చరించే మాట ఇదే. 'మధ్యమ' హృదయంలో ఉంటుంది. ఇది మన మనోరీతి లేదా మాట వెనుక ఊహ. 'పశ్యంతి' అంటే చూడడం. దీని నివాసం నాభి చక్రం. ఇది శబ్దం యొక్క ప్రధాన అర్థం, దాని మూల రూపం. 'పర' అంటే సర్వోత్కృష్టం. సమస్త శబ్దాల సారం. ఇది మూలధారంలో నివసిస్తుంది. (శబ్ద స్థితుల నివాసక్రమం క్రమంగా పై చక్రాల నుండి క్రింది చక్రాలకు రావడం గమనించండి. దీని అర్థం ఆయా స్థితులు ఒకదానికంటె ఒకటి తక్కువ శక్తి గలవి అని కాదు. ఆయా స్థితులు క్రమంగా మన ప్రకృతిలోని మరింత లోతైన మరింత దుస్సాధ్యమైన స్థానాలను నియంత్రిస్తాయని అర్థం).

శబ్ద యోగం మనను ముడి శబ్దాల నుండి వాటి ''భావ'' స్థితికి, అక్కడనుండి అవి ప్రాతినిధ్యం వహించే శుద్ధ స్వరూపుడి వద్దకు తీసుకునిపోతుంది. శబ్దయోగం అంటే కేవలం మాటలను పునశ్చరణ చెయ్యడం, వాటి గురించి ఆలోచించడం కాదు. ధ్యానశక్తి ద్వారా శబ్దం యొక్క మూలాన్ని, అర్థాన్ని శోధించి తిరిగి జాగృత స్థితికి తీసుకువెళ్లే ప్రక్రియ ఇది.

సంస్కృతం మంత్రభాష. ఆధ్యాత్మిక శక్తి పొందిన శబ్దాల భాష. మన మనస్సులను చైతన్యవంతం చేస్తుంది. మంత్రానికి సంబంధం కేవలం శబ్దార్థంతోనే తప్ప ఆ శబ్దంతో కాదు. శబ్దయోగానుసారం జీవితానికి గల ఏకైక అర్థం. ''అహం బ్రహ్మాస్మి'. సమస్త వస్తువులూ బ్రహ్మమే. ప్రతి ఒక్క వస్తువు తనలో తాను ఒక బ్రహ్మాండానికి ప్రతీక. బ్రహ్మాండ భావాన్ని విడదీసి, ముక్కలు చేసి, అరలుగా విభజించి వాటికి ప్రాతినిధ్యం వహిస్తాయి మాటలు. ఏదైనా ఒక ప్రత్యేక వస్తువును గూర్చి తెలుసుకోవాలంటే మొదట దివ్యమైన దాని అస్తిత్వ కారణాన్ని గుర్తించాలి. అలా గుర్తించినప్పటికీ ఆ వస్తువును గూర్చిన ఆలోచన రావడానికి ముందే, ఆ వస్తువును ఎన్నిక చేసుకోవడానికి ముందే ఆ వస్తువు ఉందనే విషయాన్ని మనం పట్టించుకోము. వస్తువుల యొక్క ఈ ''అస్తిత్వ అవేదిత్వాన్ని' ఆ వస్తువుల యొక్క పరమార్థంగా ఒప్పుకున్న నాడు అన్ని వస్తువులూ అనంతానికి దారి చూపిస్తాయి.

సాధారణ భాషకు ఖచ్చితమైన,విభిన్నమైన అర్థాలు కావాలి. కానీ ఆధ్యాత్మిక భాషలు విపులమైన పూర్ణార్థాన్ని కోరుతాయి. అవి మాటలలో, మాటల నిరంకుశ సాంప్రదాయాలలో బందీగా చిక్కిన భావాన్ని విడుదల చెయ్యడానికి పూనుకుంటాయి. నిజానికి ప్రతి వస్తువూ అర్థరహితమైనదే. వస్తువు అంటే బ్రహ్మాండం అని అర్థం. ఈ బ్రహ్మాండ భావమే ఆయా వస్తువులకు ఖచ్చితమైన అర్థాలు ఏర్పడడానికి వీలు కల్గిస్తోంది. ఈ విధమైన 'అర్థ' విమర్శనమే శబ్దయోగసారం. మన మనస్సులను ప్రత్యేక శబ్దాలతో, పేర్లతో గల బంధాన్నుండి విడదీయడం ఈ యోగంలో భాగం. తాంత్రిక విధానంలో కూడా ఒక ముఖ్యమైన శబ్ద యోగం ఉంది. అభినవగుప్తుడి కాశ్మీర శైవ రచనలలో దీని గురించి విపులంగా చెప్పబడింది. యోగ శక్తి అయిన దేవత శరీరమే శబ్దం. ఆవిధంగా శబ్దం మనను అనంతం (పరమాత్మ) లోనికి తీసుకువెళ్ళగలిగే శక్తి ప్రవాహాన్ని సృష్టిస్తుంది.

(సశేషం)

# విశ్వశక్తిని జాగృతం చేసి అద్భుతాలు సాధించే 'రేకీ'

'రేకీ నిపుణులు' మధురకవి శ్యామలరావు

రేకీని అడిగితేగానీ ఎవరికీ చేయకూడదనీ, కర్మలను అనుభవిస్తూ ఋణవిముక్తులవుతున్న మనుషుల జీవితాలలో, రేకీ గురువులు 'తగుదునమ్మా' అని తలదూర్చరాదని, రేకీ అడగబడితే చేసి దానికి బదులుగా శక్తి వినిమయం చేయించుకున్న వాళ్ళ దగ్గర నుండి తృణమో ఫణమో తీసుకోవాలని, అలా చెయ్యకపోతే ఋణం ఉండిపోయి రేకీ ప్రవాహానికి అడ్డంకులు (Blocks) ఉండవచ్చునని, గురు - శిష్యులు, వైద్యుడు - రోగి అందరూ మంచి భావనలు / ఆలోచనలు ఉంచుకోవాలని - మొదలైన నియమాలని విధించాడు.

అలాగే ఆయన ఏర్పరచిన నైతిక సూత్రాలు క్లుప్తంగా ఇలా ఉన్నాయి.

- ఈరోజు (నుండి) ఏ విషయానికీ బాధపడవద్దు.
- ఈరోజు (నుండి) ఏ విషయంలో కోపం చెందవద్దు.
- తల్లిదండ్రులను, గురువులను, పెద్దలను గౌరవించు. కృతజ్ఞత ప్రదర్శించు.
- ధర్మమార్గంలో జీవనోపాధి గడించు.
- భగవంతుని సృష్టిలో ప్రతి వస్తువుని ప్రేమించు. 1920లో డాక్టర్ ఉసై సిద్ధి పొందేసరికి 18 మంది రేకీ ఉన్నత / ప్రధాన గురువులను (Grand Masters) తయారుచేసాడు. అతని ప్రథమ శిష్యుడు "చుజిరోహయాషి". ఆయన కూడా వేలాది మందికి రేకీ ద్వారా చికిత్సనందించి తన జీవిత కాలంలో 16 మంది గురువులను తయారుచేశాడు.

కాలక్రమేణ దేశ కాల పరిస్థితుల వలన రేకీ జపాను దాటి హవాయి, చైనా, ఇండియా, అమెరికా, కెనడా వంటి దేశాలకు ప్రాకింది. ప్రతి దేశంలోను వందలాది జనులకు రేకీ చికిత్స జరుగుతోంది. రేకీ గురువులు బోధిస్తున్నారు. చాలాచోట్ల రేకీ చికిత్సాలయాలు స్థాపించారు.

డా॥ ఉసై సిద్ధీకరించిన రేకీని సాంప్రదాయకమైన రేకీ (Traditional Raid) అని, తర్వాత కాలంలో ఆయన శిష్యులయిన కొందరు గురువులు ఆ సాంప్రదాయక రేకీలో కొన్ని క్రొత్త పద్ధతులను చేర్చి / క్రొత్త చిహ్నాలను జతచేర్చి సంప్రదాయేతర రేకీ (Non-Traditional) ని స్థిరీకరించారు. (కరుణా రేకీ, న్యూలైఫ్ రేకీ మొదలైనవి) ఏవి ఎలా ఉన్నా, ఉన్న శక్తి ఒక్కటే - డా॥ ఉసై బోధించిన రేకీ శక్తి.

ప్రస్తుత కాలంలో పైన చెప్పిన రెండు రేకీ శాఖలూ ప్రబలి ఉన్నాయి. మన దేశంలో ఢిల్లీ, బొంబాయి, మద్రాసు, కలకత్తా, హైదరాబాదు నగరాలలో ఇతర చోట్ల కూడా రేకీ విస్తృతం చెందుతూంది. మన దేశంలో గురువులే కాక పై దేశాలనుండి కూడా అనేకమంది మహానుభావులు రేకీ గురువులు, ప్రవక్తలు వచ్చి మన దేశంలో ఉపదేశిస్తున్నారు, బోధిస్తున్నారు.

నేడు రేకీ ముఖ్యమైన ప్రత్యమ్నాయ వైద్యం (Alternative Medicine) గా భావింపబడుతోంది. ప్రాణిక్ హీలింగ్ Vedic healing, Aacpressure, Aapressure Magnetic Therapy Magnified Healing Aroma Therapy, మొదలైన వైద్యాలలాగే రేకీకూడ ప్రజల్లో బాగా వ్యాపిస్తూంది.

రేకీ ఏవైద్య విధానానికి విరుద్ధంకాదు. మనిషికి ఏ వైద్యవిధానం నచ్చుతే దానిని అవలింబించవచ్చు. రేకీ చికిత్స కూడా దానికి జతపరుస్తే (ఆ వ్యక్తి ఇష్టపడితే) అనుకున్న దానికన్నా స్వల్పకాలంలో వ్యాధులు నయమవుతాయి. పెద్ద ఆపరేషన్ల ముందు, ఆపరేషన్ల తర్వాత రేకీ చేస్తే మంచి సత్ఫలితాలు ఇస్తాయని వైద్య నిపుణులు భావిస్తున్నారు.

రేకీ ఏ మతానికి గాని, వ్యక్తులను గాని సంబంధించినది కాదు. విశ్వశక్తికి ఇవన్నీ ఎలా వర్తిస్థాయి?

రేకీచికిత్స పొందదలచినవాళ్ళు కనీసం మూడు అతి సుళువైన సులభమైన అర్హతలని కలిగి ఉండాలి. ఒకటి: రేకీ అంటే నమ్మకం

లేకపోయినా (తెలియకపోయినా) అప నమ్మకం మాత్రం ఉండకుండా నిశ్చలమైన మనస్సు (open mind)తో స్వీకరించాలి. రెండు: అసలు ఆ శక్తి ఏమిటో అవగాహన చేసుకుందాం అన్న సద్భావం కలిగిఉండాలి. మూడు: ఆశక్తి ఏదైనాసరే కృతజ్ఞతాభావంతో స్వీకరించాలి. రేకీ ఎప్పుడూ ప్రేమ శక్తి కనుక అసలు ఎవరు కాదని అంటారు? ఇదికూడ ఒక ముఖ్యమైన ప్రశ్న.

కొన్ని సందర్భాలలో రేకీ చికిత్స వద్దని వ్యక్తులు అంటూ ఉంటారు. అలాంటి సంద ర్భాలు కూడ లేకపోలేదు. అప్పుడు రేకీ పని చెయ్యదు అన భావన కలుగుతూ ఉంటుంది. ఇది వరలో చెప్పినట్లు రేకీని అడు గుతే గాని చెయ్యకూడదు. ఎంత బాధ పడుతున్నా సరే వ్యక్తి ఇది నా కర్మ కాబోలు అని భావనతో ఉంటాడు. అలాంటి సమ యంలోనే కర్మను కూడ మార్చుకోగల శక్తి వ్యక్తులకుందని గ్రహించాలి. కర్మలను అను భవిస్తూ కూడా సుఖంగా ఉండగలందులకు రేకీ తోడ్పడుతుంది. భగవత్ప్రేమ శక్తికి తిరుగే ముంది? కొందరు ''సరేలెండి, అన్ని మందులు, వైద్యాలు అయ్యాయి ఇక ఇదొక్కటే మిగిలింది. కానీయండి అదీ చూస్తాను.'' అన్న చులకన భావంతో రేకీని ఆహ్వానిస్తే ఆ వ్యక్తికి గుణం కన్పించదు. ఎందుకంటే ఆవ్యక్తి తనజబ్బు ఇకనయం కాదనే ధృఢ నిశ్చయంతో ఉంటాడు. అందుచేత రేకీ శక్తిని అడ్డుతాడు తనలో ప్రబలివున్న బంధకాలు (blocks) ద్వారా. ఇది వరలో చెప్పినట్లు రేకీ ఏవ్యక్తి భావనలకి విరుద్ధంగా వెళ్ళదు. కొందరు స్త్రీలు, పిల్లలు పురుషుల దుర్భ్యాసాల కారణంగా హింసింప బడుతూ ఉంటారు. అలాంటి పురుషులకు రేకీ నచ్చదు. ఆ హింసించబడే వ్యక్తులు రేకీని ఆహ్వానిస్తే, వాళ్ళ సుఖసంతోషాలకోసం రేకీని చెయ్యవచ్చు. దానికి ప్రత్యేక పద్ధతు లున్నాయి. రేకీ ప్రభావం వలన ఆ బాధిస్తున్న వ్యక్తికి తనంతతానుగ పశ్చాత్తాపం చెంది బాగు పడే అవకాశాలను రేకీకల్పిస్తుంది.

ఇంకోరకం ఉదాహరణ. ఒక బాలుడు రోజూ స్కూలుకి వెళ్తూ, హోమ్‌వర్క్‌తో సత మతమవుతూ తల్లి,తండ్రి ఉద్యోగాలు, పను లలో ఊపిరితిరగనంత బిజీగా ఉన్నారను కోండి. ఆ పిల్లవాడికి ఒకసారి తీవ్రంగా జీవి తంలో ఏదో లోపించిందని పిస్తుంది. అది తల్లి దండ్రులప్రేమ. అది తన అంతరాలల్లో మస్తి ష్కంలో (subconsious) గాఢంగా ప్రభావి స్తుంది. ఆప్రేమని ఎలా భర్తీచెయ్యడం? అక స్మాత్తుగా ఆ పిల్లవాడికి జ్వరం వస్తుంది. స్కూలు మానేస్తాడు. అమ్మానాన్న సెలవులు పెట్టి అతడ్ని ప్రేమగా సాకుతారు. తాత, అమ్మమ్మ, బామ్మ అందరూ సద్భావనలతో ఆదుకుంటారు. దీవిస్తారు. అప్పుడు ఆ బాలుడు ప్రేమని నింపుకుంటాడు. జ్వరం దానంతట అదే తగ్గుతుంది. అలాంటి సమ యంలో (జ్వరం ఉన్నప్పుడు) రేకీ చేస్తామని అన్నామంటే ఆ బాలుడు వ్యతిరేకిస్తాడు, ఉత్సాహం కన్పరచడు. కారణం ఆ జ్వరం అనుభవించడంలో ఆ బాలుడికి ఒక లక్ష్యం (purpose)ఉంది. అతి ఆనందకరమైన ప్రేమని పొందడం కోసం ఎలాంటి బాధనైనా పడడానికి సిద్ధపడ్డాడు కనుక! ఆ ప్రేమ, ఆనందాలతో పోలిస్తే, వాడికి ఆ జ్వరం ఏమీ బాధే కాదు.

ఇలాగే ఎన్ని ఉదాహరణలైనా చెప్ప వచ్చు. సారాంశం ఏమిటంటే రేకీ పొంద దలచినవాళ్ళు ఆ సమయంలో వాళ్ళకి ఎలా అనిపిస్తే అలా చెయ్యవచ్చు. 'కాలం కర్మం' కలిసిరావాలి కదా!

రేకీ ఒక్కటేకాదు. ఏ విధమైన వైద్య మైనా సరే వ్యక్తి ఇష్టపడనప్పుడు చెయ్య కూడదు. అలాగే మంత్రోపదేశాలు, ఉపా సనలు కూడా. విరుద్ధంగా చేస్తే విపరీత పరిణామాలకు దారి తియ్యవచ్చు.

రేకీని ఎలా నేర్పుతారు? రేకీ గురు ముఖపితా నేర్చుకోవాలి. ఉపదేశం గురువు ఏర్పరచిన ప్రకారం ఉంటుంది, ఆ ప్రకారం ఆచరణలో పెట్టి అభ్యసించాలి. ఆ ఉపదేశ పద్ధతి అతి రహస్యమైనది, పవిత్రమైనదిగా భావిస్తారు. మొదట్లో ఈ పద్ధతులని అతి రహస్యంగా ఉంచినా కాలక్రమేణా అవి బహి ర్గతాలైనాయి. పాశ్చాత్యులు పుస్తకాలలో అన్నిటినీ ప్రచురించేరు. అయినా సరే అన్నీ గురు ముఖపిత నేర్చుకోవలసినవే తప్ప, వేరే విధంగా పద్ధతులు, చిహ్నాలు శక్తివంతం కావు, ఆచరణీయం కావు - అని అందరికీ తెలుసు. (పూర్వం గురువులు రేకీ చిహ్నాలని శిష్యుల కళ్ళముందు గాలిలో వ్రాసి, వాటిని నాలుకతో అంగుటిమీద (Upper Palate) వ్రాసుకుని జ్ఞాపకం పెట్టుకోమని చెప్పే వారుట. అవి ఎంతరహస్యమైన విషయాలో చూడండి).

రేకీలో నాలుగు శ్రేణులున్నాయి డా॥ ఉసై ఏర్పరిచిన విధానాలను విభాగా లను, పద్ధతులను తర్వాత వచ్చిన పెద్దగా ఏమీమార్చలేదు.

(సశేషం)

# రాశుల లక్షణములు ప్రభావము

షము, వృషభము మొదలైన పన్నెండు రాశులకూ; ఆయా పేర్లు ఎందుకు వచ్చాయో, ముందు తెలుసుకుందాం. ఆకాశంలో కనబడే ఈ పన్నెండు రాశులూ, భూమి నుంచి ఆయా రూపాల్లో కనబడతాయి కాబట్టి, వాటికి ఆయా పేర్లు వచ్చాయి. ఆ రాశుల నిర్మాణాన్ని బట్టి, వాటికి ఏ లక్షణాలు ఉన్నాయని ఋషులు దర్శించారో, అవే లక్షణాలు ఆ రాశులలో జన్మించిన వారికి ఉంటాయి, ఆ రాశుల గురించి ముందు వివరంగా తెలుసుకుందాం. అయితే ఒక గమనిక - ఆయా రాశులలో జన్మించిన వారి గుణగణాలు, నూటికి తొంభైపాళ్ళు లేదా ముప్పాతిక పాళ్ల శాస్త్రంలో చెప్పినట్టే ఉంటాయి. కాకపోతే - లగ్నంలో ఉన్న గ్రహాన్ని బట్టీ, కొద్దిగా తేడాలొస్తాయి. అవి విడిగా గ్రహించాలి. ముందుగా మేషరాశి లక్షణములు పరిశీలిద్దాం.

## మేషము

మేషం అంటే గొఱ్ఱె. కొందరు మేక అని కూడా చెప్తారు. కాని జ్యోతిషంలో మటుకు మేషం అంటే గొఱ్ఱె అనే అర్థమే బహుళ ప్రచారంలో ఉంది. అశ్వని, భరణి, కృత్తిక లోని మొదటి పాదమూ కలిసి మేషరాశిలో ఉంటాయి. ఈ మూడు నక్షత్రాలనూ కలుపుతూ ఒక గీత గీస్తే, ఆ రూపం మేషం లాగా కనిపిస్తుంది. అందుచేత ఈ రాశికి ఆ పేరు వచ్చింది.

మేషం అన్ని రాశుల్లోకీ మొదటిది అందుచేత బేసిరాశి. ఇది చరరాశి కూడాను. దీనికి 4,7,10 కేంద్ర స్థానాలైన కర్కాటకం, తుల, మకరం కూడా చర రాశులే. ఈ రాశి ప్రధానంగా అగ్ని తత్వపురాశి. దీనికి 5,9 కోణస్థానాలైన సింహము, ధనుస్సులు కూడా అగ్ని తత్త్వపు రాశులే. ఈ రాశికి అధిపతి కుజుడు.

సాహసము, తీవ్రత, దృఢనిశ్చయము, ఆవేశము, ఆలోచన లేకుండా ముందుకి దూకడం వంటివి ఈ రాశి లక్షణాలు. ఈ రాశిలో జన్మించిన వారు దృఢమైన శరీరం, పొడవైన మెడ, వెడల్పాటి భుజాలు కలిగిన వారై ఉంటారు. ధారాళమైన వాక్కు, వాదనా పటిమ, సంభాషణా చాతురితో ఎదుటివారిని ఓడించగలశక్తి ఈ రాశి లక్షణాలలో ముఖ్యమైనవి. ఆ కారణంగా వీరికి అనుమాయులు ఎక్కువవుంది ఉంటారు. ఈ రాశి వారికి నాయక లక్షణాలుంటాయి.

సాహసము, దృఢనిశ్చయము, వాగ్ధార ఉన్న కారణంగా పోలీసుశాఖలలో ప్రకాశించడానికి ఈ రాశివారికి అవకాశం ఎక్కువ. ఈ రాశివారిలో సామాన్యంగా సోమరులు ఉండరు. ఎప్పుడూ ఏదో ఒక పని కల్పించుకుని చేస్తూ ఉంటారు. పనిలో ఎవరి సలహా స్వీకరించరు. స్వతంత్రమైన నిర్ణయాలు తీసుకుంటారు. ఎవరైనా అనవసర సలహాలిస్తే కోపగించుకుంటారు, చిరాకుపడతారు. ఆ కోపాన్ని చిరాకుని తీవ్రంగా ప్రకటిస్తారు. అందుచేత ఇతరులతో వైమనస్యాలు ఏర్పడటానికి అవకాశాలు బాగా ఎక్కువ. అయినప్పటికీ, తొణకకుండా, బెణకకుండా నూత్న శక్తితో ఏదో ఒక కార్యక్రమం చేపడుతూనే ఉంటారు. వీరి కార్యక్రమాలలో ముఖ్యపాత్ర వహించేది వీరి ఆవేశమేగాని, వివేకం కాదు. ఆ కారణం చేత సామాన్యంగా వీరికి అపజయాలు ఎక్కువ ఎదురౌతూ ఉంటాయి. అయినా వీరు పట్టువదిలిపెట్టరు; స్వతంత్ర భావాలను విడిచిపెట్టరు. తమ విజయాలకు తమ సాహసమే కారణమని భావిస్తారు. తమ నిర్ణయాలే పునాదులని భావిస్తారు. అపజయాలకు మాత్రం వేరే కారణాలు చూపిస్తారు అందుచేత సంఘంలో వీరికి మొండివారుగా, మూర్ఖులుగా పేరు స్థిరపడిపోతుంది.

అయితే వీరి హృదయము దయామయము, సున్నితము. ఆ కారణంచేత, నచ్చితే ఎదుటివారి మీద ఎంత ప్రేమయినా చూపిస్తారు. కాని తమ స్వతంత్ర నిర్ణయాలకు అడ్డువస్తే మాత్రం అంత ప్రేమించిన వారినీ, లెక్కచెయ్యరు. ఎంతైనా కోపగించుకుంటారు, మళ్ళీ అంత బాధాపడతారు. శారీరకంగా, మానసికంగా బలవంతులూ సాహసవంతులూ అవటం చేత, ఎక్కువ స్త్రీ సాంగత్యం కోరుతూ ఉంటారు: కాని స్త్రీల నర్థం చేసుకోవడంలో పొరపాటు పడవచ్చు. ప్రేమవివాహాలు వీరికి పడవు.

అశ్వనీ నక్షత్రంలో పుట్టినవారు అలంకార ప్రియులుగా ఉంటారు. భరణీ నక్షత్రంలో పుట్టినవారు విలాసవంతులు అవుతారు కృత్తికా నక్షత్రంలో పుట్టినవారు పరస్త్రీ ప్రియత్వం కలిగి ఉంటారు అని పెద్దలు చెప్తారు. ఈ రాశివారిలో కృత్తికా నక్షత్రంలో పుట్టినవారికన్న అశ్వని భరణులలో పుట్టిన వారు కొంత నిదానస్థులుగా ఉంటారు, ఎక్కువ విజయాలు అనుభవిస్తారు.

రాశ్యాధిపతి అయిన కుజుడు శుభస్థితిలో లేకపోతే మాత్రం ఈ రాశివారికి అనారోగ్యం, ఆందోళన, శస్త్రచికిత్సలు, పోట్లాటలు, పరాజయాలు అధికం.

అశ్వనీ నక్షత్రంలో పుట్టినవారు, విశాఖా నక్షత్రంలోనూ, భరణీ నక్షత్రంలో పుట్టిన వారు, అనూరాధా నక్షత్రంలోనూ కృత్తికా నక్షత్రంలో పుట్టినవారు, జ్యేష్ఠా నక్షత్రంలోనూ ముఖ్యమైన పనులు చెయ్యకుండా ఉండటం మంచిదని పెద్దల సూచన.

మొత్తం మీద ఈ రాశివారు - సహనము, ఓర్పు, లౌకికజ్ఞానం అలవరచుకుంటే - అపజయంపొందకుండా జీవించగలరు. ప్రభుతుల్యులుగా బ్రతకగలరు. ✦

బాలశిక్ష

# భయం - భ



''సాత్యనారాయణి''

''**భ**యభక్తులు'' అనే మాట తరచుగా పెద్దల నోటవింటూ ఉంటాం. అల్లరి పిలల్ల గురించిగానీ, అరాచకంగా ప్రవర్తించేవాళ్ళని గురించిగానీ, ''బొత్తిగా భయభక్తులు లేవు...'' అని అంటారు.

ఈ ''భయభక్తులు'' అనే మాట ద్వంద్వ సమాసం. దానికి భయమూ, భక్తీ అర్థం. అంతేగాని, వాడెవడో కొంటివాడు అన్నట్టుగా, 'భయపడే భక్తులు' అని కాదు. ఇంతకీ, భయం దేనిగురించి ఉండాలి? భక్తి దేని మీద ఉండాలి? రెండూ ఒకేచోట ఉంటాయా, లేక ఒక చోటే ఉండాలా? లేదా విడివిడిగా ఉండాలా? ఉంటే ఎలా ఉండాలి, ఎందుకు ఉండాలి?... ఇవ్వన్నీ ప్రశ్నలే.

**''పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం।**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥''**

(సాధు రక్షణకై, దుష్టశిక్షణ చేస్తూ, ఎప్పటికప్పుడు ధర్మస్థాపన కోసం, నేను ఆవిర్భవిస్తూ ఉంటాను) అని అన్నాడు భగవంతుడు.

**''యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్ ॥''**

(ఎప్పుడు ధర్మానికి హాని జరుగుతుందో, అప్పుడు అధర్మాన్ని ఏరిపారెయ్యడానికి, నా అంతట నేనుగా అవతరిస్తాను) అని కూడా అన్నాడు.

కాబట్టి, భగవంతునికి పరమప్రీతికరమైనది ధర్మాచరణ. ఆయన కూడా దానికి లోబడే ఉంటాడు. అందుకనే, మానవులు ధర్మానికి భయపడాలి. ధర్మాన్ని మనచేత నిర్భయంగా ఆచరింపజెయ్యడానికి, భగవంతుని యందు భక్తిగా ఉండాలి.

గురువు యందు భయం ఉండకపోతే, చెడు సావాసాలు చేస్తాం. అలాగే ధర్మమునందు భయం ఉండకపోతే, అధర్మానికి దగ్గరైపోతాం. దగ్గరైపోతే దాని యందు భయం ఉండదు. భయం లేనప్పుడు, దానితో ఏకమైపోయి. అధర్మవంతులమైపోతాం. అందుకని, ఇప్పుడేం చెయ్యాలి? దుష్టుడికి దూరంగా ఉన్నట్టు, అధర్మానికి భయపడాలన్న మాట! ఎందుకంటే, అధర్మానికి భయపడితే, ధర్మానికి దగ్గరౌతాం కనుక! ధర్మకార్యాలు చేస్తాం కనుక!

ఇదేదో చాలా తికమక తర్కంగా ఉంది కదూ! చివరికి, ధర్మం అంటే భయపడాలా, అధర్మం అంటే భయపడాలా? - అన్నది పెద్ద ప్రశ్న అయికూర్చుంటోంది గదూ!...నిజమే! ఇది చాలా సన్నని సరిహద్దు రేఖ!

అందుకే, మనలో ఉన్న ఈ భయమూ, అభయమూ రెండింటినీ, విడిగా, విడివిడిగా చెయ్యాలంటే, భగవంతుడి యందు భక్తి కుదరాలి. కుదిరితే ధర్మానికి భయపడతాం. ధర్మకార్యాలు నిర్భయంగా చేస్తాం. అధర్మకార్యాలు చెయ్యడానికి భయపడతాం. అధర్మానికి భయపడం.

అందుకే విష్ణుసహస్రనామం ''భయకృత్, భయనాశనః'' (భయమును కలిగించేవాడు, భయమును నాశనం చేసేవాడు) అని భగవంతుణ్ణి కీర్తిస్తోంది.

అలాగే - ఏకము, అనేకము; అర్థమూ, అనర్థమూ; సత్తు అసత్తు; క్షరము, అక్షరము - అంటూ పరస్పర భిన్నమైన అనేక నామాలతో కూడా కీర్తించింది. కాని ధర్మం విషయంలో వచ్చేటప్పటికి - ధర్మము, ధర్మి, ధర్మగోప్త, ధర్మకర్తా, ధర్మ విదుత్తముడు, సత్యధర్ముడు, సత్యధర్మ పరాక్రముడు - అంటూ భగవంతుడిని ధర్మరూపంగానే స్తుతించింది గాని, అధర్మ రూపుడని ఎక్కడా చెప్పలేదు.

అందుకనే ధర్మానికి భయపడాలి. భయకర్తా, భయనాశనుడూ అయిన భగవంతుని యందు భక్తిగా ఉండాలి.

## 'విజ్ఞానం పోటీ - 9' ఫలితాలు

గత సంచిక (మార్చి '2000)లోని 'విజ్ఞానం పోటీ - 9'కి వచ్చిన సమాధానాలలో, అన్నివిధాలా సరిగ్గా వ్రాసిన 1. బి. ధీరజ్ శర్మ (కరీంనగర్), 2. జె. రేఖ, (వరంగల్లు)లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ. 100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు. - సంపాదకుడు

సరియైన సమాధానాలు :

1. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం; 2. మహాభారతం; 3. సుబాహుడు; 4. పర్ణశాల (పంచవటి); 5. అమరేశ్వరస్వామి; 6. కేరళ; 7. గంగానది; 8. పతంజలి; 9. తులసీదాస్; 10. విశిష్టాద్వైతం.

## కంఠస్థం చేయదగిన శ్లోకం

*శ్రీమత్పయోనిధినికేతన! చక్రపాణే!*
*భోగీంద్ర భోగ మణిరంజిత పుణ్యమూర్తే।*
*యోగీశ శాశ్వత శరణ్య! భవాబ్ధి పోత!*
*లక్ష్మీనృసింహ! మమదేహి కరావలంబమ్ ॥*

*''శ్రీమంతమైన క్షీరసాగరాన్ని నివాసంగా చేసుకున్న చక్రహస్తా! సర్పరాజమణులచే ప్రకాశిస్తున్న పుణ్యమూర్తీ! (నరసింహునికి గొడుగులా సర్పరాజు పడగలుంటాయి. వాటి మణుల ప్రకాశాల నడుమ దీపిస్తున్న మూర్తీ! యోగీశ్వరులు శాశ్వతంగా శరణు వేడే స్వామీ! సంసార సముద్రాన్ని దాటించే నావ వంటి వాడా! లక్ష్మీనృసింహా! నాకు చేతనీయుమా!''*

*ఇది ఆదిశంకరులు విరంచిన 'లక్ష్మీనృసింహ కరావలంబన స్తోత్రం' లోనిది.*

*ఈ శ్లోకాల పఠనం వల్ల ఆది శంకరులు ఒక మహావిపత్తు నుండి బయట పడినట్లుగా, 'శంకర విజయం' చెప్తోంది.*

*మనలోని భయాలను పోగొట్టి, అభయమిచ్చే అద్భుతమూర్తి లక్ష్మీ నృసింహుడు. ఆ అభయహస్తపు ఊత మనకు ఉంటే అంతకన్నా కావలసిందే ముంది?*

*ఏ నృసింహస్వామి మందిరానికి వెళ్లినా దీనిని పిల్లల చేత చదివించండి.*

# విజ్ఞానం పోటీ - 11

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -11'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 15 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు జూన్ 20వ తారీఖులోపు పంపాలి.

1. గుర్రం ముఖంతో ఉన్న విష్ణు రూపానికి పేరు ఏమిటి?
2. వామనావతారంలో విష్ణువు పాతాళానికి అణచిన రాక్షసుని పేరు?
3. రావణ కుంభకర్ణులుగా పుట్టిన వైకుంఠ ద్వారపాలకులు?
4. భృంగి ఏ దేవుని గణాలకు చెందినవాడు?
5. గంధమాదన పర్వతంపై ఉండే స్వామి?
6. మంత్రాలయంలోని సిద్ధపురుషుడు?
7. మహానంది క్షేత్రం ఏ రాష్ట్రంలో ఉంది?
8. జ్యోతిషశాస్త్రంలో ఎన్ని రాశులు ఉన్నాయి?
9. వినాయక చవితి ఏ మాసాన వస్తుంది?
10. వ్యాసుని తండ్రి పేరు?

## హితవచనం

దివా పశ్యతి నోలూకః
కాకో నక్తం న పశ్యతి ।
విద్యావిహీనో మూఢస్తు
దివా నక్తం న పశ్యతి ॥

"గుడ్లగూబ పగటిని చూడలేదు. కాకి రాత్రిని చూడలేదు. విద్యలేని మూఢుడు పగటినీ రాత్రిని కూడా చూడలేడు."

అంటే - లోకాన్ని పరిశీలించే శక్తి, అవగాహన చేసుకొనే యుక్తి విద్య వల్లనే వస్తుంది. విద్య లేనివాడు లోకాన్నీ, కాలరీతినీ గ్రహించలేడు. కనుకనే విద్యావిహీనుడైన మూర్ఖుడు పగటినీ రాత్రినీ కూడా చూడలేడని నీతిశాస్త్రకర్తలు స్పష్టీకరించారు.

# మహాభారత ప్రశ్నోక్తి -7

నిర్వహణ :
**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

33. అరణ్యంలోని పాండవులను చేరిన విదురుని మళ్ళీ తీసుకు వచ్చేందుకు ఎవరు వెళ్లారు?
34. భారతంలో "కణికనీతి" అని ఒక ప్రసిద్ధ ఘట్టం - అది ఎవరు ఎవరికి చెప్పారు?
35. ఇరావంతుడెవరు? అతనిని యుద్ధంలో ఎవరు చంపారు?
36. అజ్ఞాతవాసంలో సహదేవుని పేరేమి?
37. సంపద పొందడానికి మూలం ఏమిటి?
38. కౌరవ పక్షంలో పరుశురాముని శిష్యులెంతమంది? ఎవరెవరు?
39. అంపశయ్యమీద పడ్డాక భీష్ముడు ఒకనితో రహస్యంగా మాట్లాడాడు ఎవరితో?
40. ధర్మరాజు కాలిగోళ్ళు కందిపోయాయట - ఎప్పుడు? ఎందుచేత?
41. యుద్ధంలో జయించి, పట్టాభిషిక్తుడైన ధర్మరాజుకు మనోవేదన కలిగిందట ఎందుకు?

(జవాబులు 59వ పేజీలో చూడండి)

# ఇల్లంతా గుప్పుమనే....

కొన్ని ద్రవ్యాలకి కంటికి కనబడకుండా దాచినా, వాటి ఉనికిని దాచలేరు. పనస, అనాస, మామిడి - ఇటువంటి పదార్థాల ఉనికిని కంటి కంటె ముందు ముక్కు పసి కట్టేస్తుంది. గుప్పున వాసన వచ్చే ద్రవ్యాలలో ఒకటి ''ఇంగువ''. సాధారణంగా అందరి వంటిళ్ళల్లోనూ దర్శనమిస్తుంది.

ఇంగువ సంస్కృతంలో ''హింగు''. ఆధునిక వృక్షశాస్త్ర పరిభాషలో "Asa Foetida" మనం వాడే ఇంగువ, ఇంగువ మొక్క నుండి కారి గట్టిపడిన స్రావము. ఈ మొక్క కాండానికి దగ్గరగా ఉన్న - వేరు మీద గాట్లు పెట్టి, అక్కడినుండి కారే స్రావాన్ని సేకరిస్తారు. ఇంగువ ఘాటు వాసనకి కారణం - దానిలోని సల్ఫర్ కాంపౌండ్స్. అందరి వంటిళ్ళల్లోనూ సామాన్యంగా ఉండే మంచి ఔషధ ద్రవ్యం - ఇంగువ. కొందరు ఇంగువ వాసన కిట్టదంటూంటారు. ఇంగువలోని ప్రత్యేక గుణాల గురించి తెలుసుకుంటే, వారి దృష్టి అయిష్టమయిన వాసన మీద కాక సద్గుణాల వైపు మరలుతుంది.

వయోభేదం లేకుండా, చిన్న పెద్ద అందరిలోనూ జీర్ణ సంబంధమయిన వికృతులను పోగొడుతుంది. కఫాన్ని తగ్గిస్తుంది. కొంత షేడి చేసే గుణం ఉంది ఇంగువలో. ఉదరంలో అనవసరమైన వాయువులు చేరకుండా చేస్తుంది. రక్తప్రసారాన్ని సక్రమం చేస్తుంది. కీళ్ళనొప్పులు తగ్గిస్తుంది. స్త్రీలకి కలిగే రకరకాల బాధలలో ఇంగువ మంచి ప్రయోజనకారి. ఇలా ఎన్నో ప్రయోజనాలున్న ఇంగువని, కేవలం అవసరానికి మందుగా వాడటం మాత్రమే కాకుండా, నిత్యం మన ఆహారంలో తీసుకోవడం మంచి అలవాటు.

★ కీళ్ళనొప్పులతో బాధపడేవారు - 5 గ్రాముల ఇంగువ, 5 గ్రాముల వెల్లుల్లి, 5 గ్రాముల సైంధవ లవణం - వీటిని సుమారు 50 మిలీ. నువ్వుల నూనెలో కలిపి కాచాలి. తరువాత ఆ నూనెని వడపోసి తీసుకుని, గోరువెచ్చగా ఉన్నప్పుడు కీళ్ళమీద రాసుకోవాలి. ఒక గ్లాసుడు వేడిపాలలో ఇదే నూనెని ఒక చెంచాడు కలుపుకుని తాగాలి. ఎంత కాలం వాడాలి అనేది - వారి వారి నొప్పుల తీవ్రత మీద ఆధారపడి ఉంటుంది.

## అసలు - నకిలీ

**రకరకాల వస్తువులలాగానే ఇంగువకి కూడా కల్తీ సమస్య తప్పదు. ఇంగువని పొడిచేసి, అగ్గిపుల్ల వెలిగించి, దానిమీద వేసి చూడండి. అసలు రకమైన ఇంగువ పూర్తిగా కాలిపోతుంది. ఎక్కువ బూడిద మిగిలితే, నకిలీ అని గ్రహించండి. ఇంగువకి నీళ్లలో కరిగిపోయే లక్షణం ఉంది. ఇంగువని నీళ్లలో కలిపి పరీక్షిస్తే అసలు ఇంగువ కరిగిపోతుంది. నకిలీ ద్రవ్యాలు నీళ్ళ అడుగున మిగిలి పోతాయి. శ్రేష్ఠమైన ఇంగువ వాడితేనే ఆశించిన ఫలితాలు కలుగుతాయి.**

★ ఇంగువ కడుపులో ఉండే పురుగులకి మంచి మందు. కడుపులో పురుగులున్న పిల్లలకి, మలద్వారం దగ్గర దురద బాధిస్తూంటుంది. చిటికెడు ఇంగువని కొద్దిగా నీళ్ళలో కలిపి ప్రతి మూడు గంటలకీ ఒకసారి చొప్పున - ఒక రోజంతా ఇవ్వాలి. దురద నుండి తాత్కాలిక ఉపశమనానికి, ఇంగువ నీళ్ళని దూదిలో ముంచి మలద్వారం దగ్గర పూయాలి.

★ చిన్న పిల్లలు కడుపు ఉబ్బరించి, నొప్పితో బాధపడుతూంటే కొంచెం ఇంగువని నేతిలో వేయించి, గోరువెచ్చని ముద్దని, పొట్ట మీద రాయాలి. (పట్టు వేయడం అంటూంటారు).

★ కడుపు ఉబ్బరంగా ఉన్నప్పుడు 2-3 చిటికెల ఇంగువ పల్చటి మజ్జిగలో కలిపి (సుమారు ఒక 100 మి.లీ. మజ్జిగ) తాగాలి. వేడినీళ్ళలో చెంచాడు ఇంగువ కలిపి, ఆ నీళ్ళలో బట్ట ముంచి, పొట్టమీద కాపడం పెట్టాలి.

★ పుచ్చు పన్ను పోటుగా ఉంటే, ఇంగువ నిమ్మరసంలో కలిపి, కొద్దిగా వేడి చేసి, అందులో దూది ముంచి తీసి, ఆ దూదిని పంటిలో పెట్టుకోవాలి.

★ దగ్గు, ఆయాసం ఉన్నవారు - 300 మి.గ్రా - 50 మి.గ్రా ఇంగువ, రెండు చెంచాల తేనె, అరచెంచాడు వెల్లుల్లి రసం, 1 చెంచాడు తమలపాకు రసం - కలిపి తీసుకోవాలి. ఈవిధంగా రోజూ మూడు పూటలా వాడాలి.

### ఔషధాలు :

ఇంగువకి అనేక ఔషధ గుణాలు ఉండడం వలన, ప్రధానంగా ఇంగువ జీర్ణ మండలంపై ప్రభావం చూపే లక్షణం కలిగి ఉండడం వలనా, ఆయుర్వేదం జఠరాగ్నికి ప్రాధాన్యం ఇచ్చే వైద్య విధానం కావడం వలనా - అనేక ఔషధ చూర్ణాలలో మాత్రలలో ఇంగువ ఉంటుంది. వీటిలో 'అష్ట చూర్ణం' (దీనినే ''హింగ్వష్ట చూర్ణం'' అని కూడా అంటారు) ప్రధానమైనది. అష్టాక్షరీ గుటిక, చిత్రకాది వటి, కాంకాయన వటి మొదలయిన మందులలో ఇంగువ ఉంటుంది. ఋతు సంబంధమయిన సమస్యలలో వాడే ''రజఃప్రవర్తినీ వటి''లో ఇంగువ ఒక ప్రధాన ద్రవ్యం వాతపు నొప్పులలో వాడే ''హింగు త్రిగుణ తైలం'' కూడా ఇంగువతో తయారయినదే. ✹

# దారిద్ర్యమోచన స్తోత్రమ్

# శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామాలు

'విద్యావారిధి'', అద్వైతసిద్ధిరత్నాకర
డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి

**పద్మసుందర్యైనమః**

పద్మమువలె సౌందర భరితమైనది జగన్మాత. సూరకిరణము స్పర్శ మాత్రముతో తామర వికసించును. దేవియు భక్తి, జ్ఞాన, వైరాగాధుల ఆవిర్భావముతోనే ప్రసాదించును. సుందరమనగా అందమని అర్థము. సౌందరఘునకు ఆటపట్టు దేవి. ఆమె సౌందరఘునకు తగ్గ ఉపమానము పద్మమే. కావుననే పద్మమువంటి సౌందరఘు గలదని చెప్పబడును.

**పద్మోద్భవాయైనమః**

తామరయందు జనించినది తల్లి. ఆమె సర్వదా వసించు స్థలము తామరయే. తామర పుష్పము మన హృదయమునకు ప్రతీక. తామరవలె సుకుమారముగ, శుద్ధముగా మన హృదయము మారినచో తల్లి యందు ద్భవించును. అనగా మన హృదయమందు ప్రకాశించునని బావము. ఆమె నిత. ఐనప్పటికిని తాను ప్రకాశించునప్పుడు ఆమె పుట్టునట్లు వవహరింపబడును.

**దేవానాం కార్య సిద్ధ్యర్థమావిర్భవతి సా యదా ।**
**ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యాప్యభిధీయతే ॥**

అని మార్కండేయ పురాణ వచనము.

**పద్మముఖ్యైనమః**

పద్మమువలె వికసించిన మోము గలది. ముఖ వికాసము సంతోషమునకు చిహ్నము. లోలోపల హృదయమందు సంతోషమున్నప్పుడే ముఖము వికసించును. కావున వికసించిన ముఖము అంతఃసుఖమునకు గుర్తగును. నిత్యతృప్తియగు తల్లిని ధ్యానము చేయుటవలన భక్తులకు సైతము తృప్తి, సంతసము లభించును. భక్తులను గాంచిన మాత్రముననే శ్రీదేవికి ముఖము వికసించును. ఏలయన మానవుని జీవితమున భక్తి సిద్ధించినచో, తదుపరి జ్ఞాన వైరాగాదులు, మోక్షము, పురుషార్థ సిద్ధియు కరతలామలక మగును. కావున అట్లు జీవిత లక్షమును పొందగల్గు భక్తులగాంచిన తల్లి యగు దేవికి సంతోషము. ముఖ వికాసము ఏర్పడుట సహజమే. పద్మమువలె అందఱిని ఆకర్షించు ముఖము గలదియని అర్థము.

**పద్మనాభప్రియాయైనమః**

పద్మము నా బియందున్నది మహా విష్ణువునకు. ఆ నారాయణుని ప్రియురాలు తల్లి. కావున ఆమె అనుగ్రహము వలన భక్తులకు సిరిసంపదలు, మోక్షము సైతము లభించును. 'మోక్షమిచ్ఛేజ్జనార్ధనాత్'' అని సుహృద్వచనము శ్రీమన్నారాయణుని నాబి నుండి పద్మము జనించినది. ఆ పద్మమందు చతుర్ముఖ బ్రహ్మ జననమేర్పడినది. ఆ బ్రహ్మయే ప్రపంచ సృష్టికర్త. కాన సకల ప్రపంచ సృష్టికర్తయగు బ్రహ్మకే తల్లియగుటచే జగత్తులకే తల్లియని స్థిరపడును.

**రమాయైనమః**

రమాయనిన సంతోషింపచేయునది యని అర్థము. రమయతీతిరమా - అందను సంతసింపచేయునది అని వ్యుత్పత్తి. ప్రతి మానవునికి వాని పూర్వ కర్మానుసారము సుఖముల నొసగుటచే సుఖధాత్రి యగును జగన్మాత.

**పద్మమాలాధరాయై నమః**

తామరపూల మాలను ధరించునది. మానవుల హృదయములు భక్తిపూరితము లగునవి. జగన్మాత మాలయందు స్థలము కైకొనునను. భక్తుల హృదయములను పద్మములను ధరించును కాన ఈ నామమేర్పడినది. అనగా భక్త జన సంరక్షణా. తనతో ఐకఘు చేసుకోగల్గిన విశాల హృదయా యని బావము.

**దేవ్యై నమః**

దేవి యనగా ప్రకాశించునది. మన హృదయం నుండి మన ఇంద్రియములను, మనోబుద్ధులను సైతము సర్వదా ప్రకాశించుచు, ప్రేరేపించుచు, అనుగ్రహించునది దేవి. దివు క్రీడా, మద, మోద, కాంతి, గతిషు అని ధాతువు వలన ఎల్లప్పుడు సంతోషముగ నుండునది, క్రీడించుచుండినది, కాంతి, సౌ బాగఘు, సౌందరఘు, ప్రకాశము మొదలగు గుణములకాలవాలమైనది అని తెలియును.

**పద్మిన్యై నమః**

పద్మమును గలది పద్మిని. సర్వదా చేతుల యందు పద్మమును ధరించునది. ''పద్మాననే పద్మిని పద్మ హస్తే, పద్మాలయే పద్మదళాయతాక్షి'' అని ఋగ్వేదము దేవిని స్తుతించును.

**పద్మగంధిన్యై నమః**

పద్మమువంటి వాసనచే అందఱిని ఆనందింపచేయునది శ్రీమాత. మంగళకరమైన సుగంధముచేత మానవుల సైతము భక్తిపరవశుల గావించిన, భక్తి చేత స్పందించిన వారికి సకల సిరిసంపదల నొసగును మహాలక్ష్మి ✸

"పనిలేనివాడు పిల్లితల గొరిగాడట" అన్నాడు మా బావమరిది

"ఎవడో నీ బోటిగాడే అయింటాడు" అన్నాడు మా చంటివాడు.

వెంటనే మా చిన్నవాడు అందుకున్నాడు, "ఛఛ! మామయ్యమరీ అంత పనిలేనివాడు కాదులే! ఒకవేళ అయినా, అలా పిల్లితల గొరిగేంత మూర్ఖుడంటావా?" అని.

"ఈయన సంగతి అటుంచు. గొరిగించుకోవడానికి ఏ పిల్లి సిద్ధంగా ఉందంటావ్?" అంది మా చిన్నది.

"ఈయన కన్నా తెలివి గల పిల్లి సిద్ధంగా ఉందనుకుందాం. కాని గొరగడానికి దాని నెత్తిన జుట్టు ఉండద్దూ?" అంది మా పెద్దది.

"కరెక్ట్! పిల్లి కన్నా కోతి నయం. మనిషికి దగ్గర బంధువు. మనిషి లాగానే అనేక వెధవ్వేషాలు వేస్తుంది. దాని నెత్తిమీద అంతో యింతో జుట్టు ఉంటుంది." అన్నాడు మా చిన్నవాడు.

"అప్పుడు సామెత - పనిలేనివాడు కోతితల గొరిగాడుట - అని ఉండాలి" అన్నది మా చిన్నది.

"మరి - పిల్లితల గొరిగాడుట - అని ఎందుకయింది?" అని అన్నాడు మా చంటివాడు.

"ఆ గొరిగిన వక్తి ఎవరో చెప్తే - అది అలా ఎందుకయిందో నేను వివరిస్తాను" అని అన్నాడు మా పెద్దవాడు.

వీళ్ళు తాటాకులు కడుతున్న ధోరణి చూసి, "ఒరేయ్ నాయనా! ఎరక్కపోయి తేనె తుట్టె కదిలించాను ఇక నన్నొదిలేయండి"

# పిల్లి తల?!

అన్నాడు మా బావమరిది

"ఏమీ ఫరవాలేదులే మామా! చెప్పు" అన్నాడు మా చిన్నవాడు.

"నాయనా! సామెత యొక్క పై రూపం చెప్తేనే, ఇంత ఆటపట్టించారు. లోపలికి వెళితే, ఇంకెంత తాట ఒలుస్తారో?" అన్నాడు మా బావమరిది.

మా చంటివాడు వెంటనే అందుకుని, "నీ బాధ నా కర్థమైంది. ఆ సామెతలో ఒక కులం పేరు ఉంది. అంతేనా?" అన్నాడు.

మా బావమరిది తల ఊపాడు.

మా చిన్నవాడు నవ్వి. "కులంపేరు ఉచ్ఛరించినంత మాత్రాన ఎవ్వరూ ఏమీ అనరు. అనవసరంగా కులనింద చేస్తేనే వస్తుంది తగాదా?" అన్నాడు.

"ఆ సామెతలో కులనింద లేదంటావా?" అన్నాడు మా బావమరిది

"లేదు. కాని ఆ కులవృత్తి చేసే ఒక వక్తిని, అవహేళన చెయ్యడం మాత్రం ఉంది" అంది మా పెద్దది.

"నాకూ అదే ఆశ్చర్యంగా ఉంది. మన సామెతలలో గాని, నానుడులలో గాని సామాన్యంగా అలాటి అవహేళన ఉండదే?!" అంది మా చిన్నది.

"అక్కడ తెలుస్తోంది, ఆ సామెత యొక్క అసలు రూపం అదికాదని. అసలు రూపం తెలిస్తే, అసలు ఉద్దేశం కూడా తెలుస్తుంది" అన్నాడు మా పెద్దవాడు.

"అసలు రూపం ఏమిటి? అని అడిగాడు మా బావమరిది.

"ముందు లోకంలో వాడుకలో ఉన్న రూపం ఏమిటి?" అని అడిగాడు మా చిన్నవాడు. మాబావమరిది తటపటాయిస్తుంటే, మా పెద్దవాడు నవ్వి, "భయపడకు, నేను చెప్తాను - పని లేని మంగలి పిల్లితల గొరిగాడు - అన్నది లోకంలో వాడుకలో ఉన్న సామెత.

"ఒక్కక్షణం దీని గురించి జాగ్రత్తగా ఆలోచించు: పల్లెటూళ్ళల్లో చాలా 'బిజీ' గా ఉండే వృత్తులలో క్షురకర్మ ఒకటి. ప్రతిమనిషీ అందంగా, 'నీట్' గా కనబడాలనుకుంటాడు గదా? అలా కనబడాలంటే ముఖ్యంగా తలాగడ్డం మాయకూడదు. ఆ రోజుల్లో ఎవరూ స్వంతంగా గడ్డం కూడా గీసుకునే వాళ్ళు కాదు. ఆ క్షవరమో గడ్డమో మధాహ్నం లోపలే చేసుకోవాలి. సాయంత్రం పనికి రాదు. అలాగే అష్టమి, అమావాసాళాటివి కూడా పనికిరావు. వీటన్నిటికీ వేరే ఆరోగ్య కారణాలున్నాయి. దాని గురించి మరోసారి ఆలోచిద్దాం. ఈ విధంగా ఊళ్లో అందరూ ఆ ఉన్న తక్కువ సమయంలోనే క్షురకర్మ యొక్క ఉపయోగం పొందాలి. ఈ నాటి వృత్తి పోటీలు ఆనాడు లేవు. ఒక్కొక్క ఊరిని, దాని ప్రమాణంబట్టి, ఒకళ్ళో యిద్దరో ముగ్గురో క్షురకులు ఉండేవారు. ఆ ఉన్నవాళ్ళూ "ఫుల్‌బిజీ"గా ఉండేవారు. ఇందులో

కొందరు గ్రామముఖ్యులుంటారు గదా! కరణం, మునసబు, నాయకుడు, పూజారి, మోతుబరి వగైరా. వీళ్ళందరి పన్నులు పూర్తి అయి సామానుథి దగ్గరికి వచ్చేటప్పటికి సమయం చాలేది కాదు. దానితో ఒక్కొక్కసారి ఊరి మంగలాయన ఎంత పిలిచినా పలికే వాడు కాదు. ఒకవేళ పలికినా, 'ఈ పెద్దాయ నకి చేసొస్తా, ఆ పెద్దాయనకి చేసొస్తా' అని దాటేసేవాడు.

అలా నిత్యం ఎడతెరిపిలని పని ఉన్న మంగలాయనకి ఒక రోజు పని లేక పోయిందనుకో - ఏం చేస్తాడు? దారినపోయే ఓ లోకువ రాయుణ్ణి చూసి, ఏదో పనున్నట్టు పిలిచి వాడికి అవసరమైనా కాకపోయినా తల గొరుగుతాడు. మరి ఆ పూటకి తనకి పనిసాగాలి మర్నాటికి అదీకాక కత్తి పదును చూసుకోవాలి, అ బాసం చెడగూడదు...

కాబట్టి ''పనిలేని మంగలి పిలిచి తల గొరిగాడు'' - అన్నది సామెత. కాలక్రమేణా ఉచ్చారణలో వేగం చేత ''పిలిచి''లోని ''చి'' లోపించి, లి క్రింద లవత్తు చేరి ''పిల్లి తల గొరిగాడు'' గా రూపాంతరం చెందింది.'' అని ముగించాడు మా పెద్దవాడు.

''లేదా పిలిపించుకుని తల గొరి గించుకున్నా, లోకువ రాయుడే, కావాలని ఈ సామెతని ఇలా రూపాంతరం పొంది ఉండ వచ్చు. ఏమంటావ్?'' అని అన్నాడు మా చంటివాడు.

''ఏమంటాను? మీరంతా ఇలా పిలిచి నన్ను లోకువ చేసి మరీ తలంటితే?!'' అని లేచాడు మా బావమరిది. ✷

# వాగ్గేయవైభవం

**పల్లవి:**

**జయ జయ నృసింహా! సర్వేశ!**
**భయహర! వీర! ప్రహ్లాదవరద!**

**చరణాలు:**

**మిహిరశశినయన! మృగనరవేష!**
**బహిరంతఃస్థల పరిపూర్ణ!**
**అహినాయకసింహాసన రాజిత!**
**బహుళగుణగణ! ప్రహ్లాదవరద!**

**చటుపరాక్రమ! సమఘునరహిత!**
**నిటలనేత్ర! మౌనిప్రణుత!**
**కుటిలదైత్యతతికుక్షివిదారణ!**
**పటువజ్రనఖ! ప్రహ్లాదవరద!**

**శ్రీవనితాసంశ్రిత వామాంక!**
**భావజకోటి ప్రతిమాన!**
**శ్రీవేంకటగిరిశిఖరనివాస!**
**పావన చరిత! ప్రహ్లాదవరద!**

ఇది సంకీర్తనాచారుడు అన్నమా చార్య రచించినకృతి.

అన్నమాచార్య లక్ష్మీనృసింహమంత్రో పాసకుడు. కాబట్టి ఆ స్వామిని ఉపాసనా లబ్ధమైన ధ్యానదృష్టితో దర్శించి లెక్కకు మిక్కిలిగా నృసింహస్వామిపై కీర్తనలు రచించాడు. అహోబిలం, కదిరి వంటి క్షేత్రాల లోని నరసింహుని కీర్తించాడు.

మంత్రశాస్త్రంలో వర్ణితమైన లక్ష్మీ నరసింహస్వామి రూపాన్ని కళ్ళకుకట్టినట్లుగా ఈకృతిలో గానం చేశాడా పదకవితా పితా మహుడు. ప్రహ్లాదవరదుని నారసింహదర్శనం సాగిందీ సంకీర్తనలో.

''ఓ సర్వేశ్వరా! నృసింహా! జయజయ; భయములను పోగొట్టే వీరుడా!



ప్రహ్లాదవరదుడా!; సూర్యచంద్ర నేత్రములు నీవి (మిహిరశశినయన); నర, సింహ వేషము గలవాడా!; బాహ్యములోనూ అంతరంలోనూ నిండినవాడా!; సర్పరాజునే సింహాసనంగా చేసి దానిపై ప్రకాశించేవాడా! అనేక దివ్య గుణగణములు గలవాడా!; తీవ్రమైన పరాక్రమం గలవాడా! నీతో సమానముగానీ, అధికముగానీ లేనివాడా! ఫాలమున నేత్రము గలస్వామీ! మునులుచేత నమస్కరింప బడేదేవా! కుటిలులైన దైత్యుల కుక్షి (కడుపు)ని ఛేదించే, బలమైన వజ్రముల వంటి గోర్లు కలిగిన వేలుపా!; నామాంకము నందు లక్ష్మీదేవిని ఆసీనురాలిన చేసుకున్న వాడా! కోటిమన్మథుల వంటి సౌందర్య వంతుడా! శ్రీవేంకటగిరి శిఖరనివాసా! పావన మైన చరిత్ర కలిగిన ప్రహ్లాదవరదా! జయజయ..''

# భారతదేశ చరిత్ర - VII

(గత సంచిక తరువాయి)

గ్రీసులో నైసా అనే పట్టణం ఉంది. మెగస్తనీసు కూడా డయోనిసోస్ భారత దేశాన్ని జయించి తిరిగివెళ్లి 'మేరోస్' ప్రాంతములో నైసా పట్టణాన్ని నిర్మించాడని వ్రాశాడు. మేరోస్ అంటే గ్రీకు భాషలో 'తొడ' అని అర్థం. అందుకే డయోనిసోస్‌ని గ్రీకులు 'తన తండ్రి తొడ నుండి పుట్టినవాడని' అంటారు. మన పురాణాల్లో 'మేరు పర్వతం' మీదనే ఇంద్రాది దేవతల నగరాలున్నాయని చెప్పారు. మెగస్తనీసుకు భారతీయులు చెప్పిన ఋగ్వేదంలోని యుద్ధగాథల్ని ఆయన గ్రీకుదేవతలు బి.సి. 1300లో గ్రీసు మీద చేసిన యుద్ధాల్లాంటివని గ్రీసులాగానే భారతదేశాన్ని కూడా వారు జయించారని కల్పించి మనవాళ్లు చెప్పిన పేర్లను తారుమారు చేశాడు. హిరాకిల్స్‌ని మధుర, శూరసేన దేశాల ప్రజలు అమితంగా పూజిస్తారని చెప్పడంలో కృష్ణుణ్ణి హిరాకిల్స్‌గా మార్చివేశాడని అర్థం అవుతోంది.(హిరాకిల్స్, పండయ్యల గురించి చెప్పింది కూడా కల్పితం. అలాంటి ఆచారం ప్రాచీన ఈజిప్ట్ రాజవంశంలో ఉంది. దానినతడు మనకు జోడించాడు.) గ్రీకు హిరాకిల్స్ మన కృష్ణుడిలా కొన్ని ఘనకార్యాలు చేశాడని వాళ్ల మైథాలజీ చెప్తుంది. దాన్ని అతడు వినియోగించుకున్నాడు. లేదా మెగస్తనీసుకు తదుపరి గ్రీకులు అలా కల్పించి ఉంటారు.

4) అయితే మన చరిత్రకారులు మెగస్తనీసు చెప్పిన డయోనిసోస్, హిరాకిల్స్ విషయాలను భారతదేశం మీద 'ఆర్యుల దండయాత్ర' అనే కల్పిత కథను నిజం చేయడానికి ఉపయోగించుకున్నారు. దీనికి ఋగ్వేదాన్ని కూడా వాడుకున్నారు. ఋగ్వేదంలో అనేక యుద్ధాలు వర్ణించబడ్డాయి. వాటిలో దాశరాజ్ఞ యుద్ధం, శాంబర యుద్ధం, పైప్రవ యుద్ధం, శుష్ణ - కుయవ యుద్ధం, వింశతి జనరాజ యుద్ధం ముఖ్యమైనవి. నిజానికి ఈ యుద్ధాలన్నీ మహాభారత యుద్ధంలోని భాగాలే. కానీ ఋగ్వేద భాష్యం చెప్పినవారు చేసిన అసంబద్ధ భాష్యాల మూలంగా ఈ నిజం కప్పిపుచ్చబడి పై యుద్ధాలన్నీ ఒకదానికొకటి సంబంధం లేనివిగా కన్పిస్తాయి. ఆ యుద్ధాల్లో పాల్గొన్న వీరుల పేర్లు, మహాభారత వీరుల పేర్లు ఒకటి కాదు. దీనికి కారణం మహాభారత ఇతిహాసకారుడు వేదాల్లో చెప్పిన పేర్లకు తుల్యార్థక నామాల్ని ఇతిహాసంలో వాడడమే. (స్థలాభావం వల్ల ఈ విషయాల్ని ఇక్కడ చర్చించడం కుదరదు. ఈ విషయం మరొక వ్యాసంలో పరిశీలిద్దాం). మన వేద భాష్యకారులు పురాణాల జ్ఞానం బుర్రల్లో నింపుకుని వేదభాష్యం వ్రాశారు. పురాణాలని వేదాలతో ప్రమాణీకరించడం వారికి సాధ్యం కాలేదు. ఇన్ని పురాణ కథలకు మూలం వేదంలో ఉండి తీరాలి అనే జిజ్ఞాసతో, భాష్యాలు వ్రాసేటప్పుడు ఆ ప్రమాణాలను వెదుక్కుంటూ వ్రాస్తే ఈ కష్టం కలిగి ఉండేది కాదు. ఈనాడు నిజమైన భారత చరిత్ర సుగుంగై ఉండేదీ కాదు. ఈ అసంబద్ధ భాష్యాల వల్ల రెండు నష్టాలు జరిగాయి. ఒకటి భారతయుద్ధ కాలం క్రీ.పూ. 32వ శతాబ్దం అనే విషయం మరుగున పడింది. (దీన్ని సహేతుకంగా వెనుకటి ఋషిపీఠం సంచికలలో ఋజువు చెయ్యడం జరిగింది). రెండు 'ఇది నా స్వంతగడ్డ' అంటూ చెప్పుకోవడానికి స్థలం లేని విదేశీ మేధావుల ఆర్య - అనార్య అభూతకల్పనకు, మన చరిత్రను తారుమారు చెయ్యడానికి వీలు కలిగించి. వేదాల్లో చెప్పబడిన దాదాపు అన్ని యుద్ధాలలోను ముఖ్య భూమిక ఇంద్రుడిది. ఇండియన్ - డయోనిసోస్‌గాను, గ్రీకు దేశాన్ని ఆక్రమించుకున్న గ్రీకు - డయోనిసోస్ సోదరుని గాను నిర్ణయించారు. అయితే మెగస్తనీసు చెప్పిన మరో ముఖ్య విషయాన్ని తమ సౌకర్యం కోసం ముసుగు కప్పేశారు. మెగస్తనీసు డయోనిసోస్ నుండి సాండ్రకోట్టస్ వరకు 153 మంది రాజులు 6452 సంవత్సరాలు రాజ్యం చేశాడని చెప్పారు. కానీ గ్రీసు దేశాన్ని ఆర్య భాష మాట్లాడేవారు (గ్రీకు - డయోనిసోస్ పూర్వీకులు) క్రీ.శ. 1300లో మాత్రమే ఆక్రమించుకున్నారు. అంటే గ్రీకు, ఇండియన్ డయోనిసోస్‌ల మధ్య సుమారు 5150 సంవత్సరాల అంతరం ఉంది. లేదా భారతీయ డయోనిసోస్ కాలం క్రీ.పూ. 6778 (సాండ్రకోట్టస్ కాలం క్రీ.పూ. 326 అనుకుంటే). ఇది చరిత్రకారుల లెక్కలకి సరిపోదు. దీనిని ఒప్పుకుంటే విదేశీ ఇండాలజిస్టులకు భారతదేశ చరిత్ర పురాతనత్వాన్ని అంగీకరించవలసి వస్తుంది.

అదే సమయంలో వైదిక సంస్కృతి విద్వేషులైన కొంతమంది స్వదేశీ చరిత్రకారుల తప్పుడు సిద్ధాంతాలకి కష్టం కలుగుతుంది. అందుకే మెగస్తనీసు చెప్పిన కాలమానానికి ముసుగు వేశారు.

5) మెగస్తనీసు చెప్పిన కాలమానం వల్ల సాండ్రకోట్టస్ మౌర్యుడు కాడనే వాదానికి మరింత బలం చేకూరుతోంది.

6) చరిత్రకారులు పట్టించుకోని ఒక ముఖ్య విషయం మెగస్తనీసు చెప్పాడు. ''పాటలీ పుత్ర రాజు తన కుటుంబ నామానికి (Familay Name) తోడుగా పాలిబ్రోతుల ఇంటి పేరు (Sir Name)ను కూడా సాండ్రకోట్టస్ వలె పెట్టుకోవాలి'' అన్నాడు మెగస్తనీసు. ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే కిటుకు లభ్యమౌతుంది. Family Name, Sir Name అంటే ఏమిటి? న్యాయంగా ఇంగ్లీషు అర్థం తీసుకుంటే సుమారు రెండూ ఒకటే. కానీ తరచి చూస్తే Family Name అంటే పుట్టగానే పెట్టిన పేరు (కుటుంబంలోని పేరు) అని, Sir Name అంటే మనందరకు తెలిసినట్లుగానే ఇంటి పేరు అనీ అర్థమౌతుంది. చంద్రగుప్తుని వలె అని అనడంలోనే అసలు రహస్యం ఉంది. గుప్త వంశపు రాజులందరి పేర్ల చివర 'గుప్త' అని వస్తుంది. అది వారి Sir Name. చంద్రగుప్త (1), సముద్రగుప్త, చంద్రగుప్త (2), కుమారగుప్త..... ఇలా ఈ పేర్లలోని మొదటి భాగం చంద్ర, సముద్ర, చంద్ర, కుమార అనేవి ఫ్యామిలీ నేమ్స్. ఇదే ప్రాతిపదికపై మౌర్యవంశ రాజుల పేర్లు కూడా చెప్పవచ్చు కదా అని ఎవరైనా అనవచ్చు. కానీ అలాటప్పుడు మెగస్తనీసు సాండ్రకోట్టస్ అని ఊరుకోకుండా మౌర్య అని కూడా చేర్చి ఉండేవారు. (ఆయన భాషలో మోరియస్ అనో, మరొకలాగానో). మరో విషయం - మెగస్తనీసు స్వదేశంతో సహా అన్ని దేశాల్లోను పేర్లు రెండు మూడు భాగాలుగా ఉండడం సహజం. భారతదేశంలో కూడా అదే ఆచారం, ఒక్క గుప్త రాజులలో తప్ప. గుప్తుల పేర్లలో విడివిడిగా వ్రాయకుండా ఒకే పేరులా కన్పిస్తుంది(Family Name, Sir Name)ఇది మెగస్తనీసుకు విచిత్రంగా తోచి ఉండవచ్చు. అంతేకాక అతడు సాండ్రకోట్టస్ ఆ స్థానంలో నున్నప్పుడు రాజకుటుంబంలో 'కోట్టస్ (గుప్త) అని అంతమవుతూ రెండు మూడు పేర్లు వినిపించి ఉండాలి. లేకపోతే ఎన్నో విషయాలను వదలివేసి పేర్లు పెట్టుకునే విధానాన్ని (అదీ రాజ కుటుంబంలో మాత్రమే) గురించి మాత్రం చెప్పడానికి సందర్భం ఉండదు. ఆ కాలంలో మొదటి చంద్రగుప్తుడు రాజ్యం చేస్తుంటే సముద్ర గుప్తుడు చిన్నవాడుగానో యువరాజుగానో ఉండి ఉండాలి లేదా సముద్రగుప్తుడు రాజ్యం చేస్తుంటే చంద్రగుప్తుడు చిన్నవాడు గానో, యువరాజుగానో ఉండి ఉండాలి. ఈ విషయం మెగస్తనీసు కాలంలో రాజ్యం చేసింది గుప్తులే అని సూచిస్తోంది.

**'ఇది నా స్వంతగడ్డ' అంటూ చెప్పకోవడానికి స్థలం లేని విదేశీ మేధావుల ఆర్య - అనార్య అభూతకల్పనకు, మన చరిత్రను తారుమారు చెయ్యడానికి వీలు కలిగింది.**

7) పాటలీ పుత్రాన్ని సాండ్రకోట్టస్ తరువాత అతని పుత్రుడు 'అమిట్రో ఛేడ్స్' (ఒక బిరుదు. దానర్థం ''శత్రువులను నశింపచేసిన వాడు'' అని). రాజ్యం చేశాడని మెగస్తనీసు తదుపరి ఇండియా వచ్చిన గ్రీకు రాయబారులు చెప్పారు. మౌర్యుల్లో చంద్ర గుప్తుని తరువాత బిందుసారుడు రాజ్యం చేశాడు. అతని శత్రువుల గురించి కానీ, అతడు చేసిన యుద్ధాల గూర్చి గానీ చరిత్రకాధారాలు లేవు. ఇక గుప్తులలో సముద్రగుప్తుడూ, రెండవ చంద్రగుప్తుడూ కూడా అశ్వమేధ యాగాలు చేశారని చరిత్ర. అశ్వమేధ యాగం చెయ్యాలంటే సమస్త శత్రువులనూ జయించాలి. కాబట్టి వీరిద్దరిలో ఒకరికి అమిట్రోఛేడ్స్ అని బిరుదు రావాలి. నిజానికి రెండవ చంద్రుగుప్తుడు చంద్రగుప్త విక్రమాదిత్యుడనే బిరుదు దల్చాడు. అతడు తన సూర్య సమాన విక్రమంతో శత్రువులను నశింపచేశారు. కాబట్టే ఆ బిరుదు తగిలించు కున్నాడు. కాబట్టి గ్రీకులు చెప్పిన అమిట్రో ఛేడ్స్ రెండవ చంద్రగుప్తుడే అని చెప్పవచ్చు. దీనిని బట్టి మెగస్తనీసు కాలంలో రాజ్యం చేసినది సముద్రగుప్తుడు కావాలి.

8) మెగస్తనీసు భారతదేశంలోని వివిధ తెగలను గూర్చి చెపుతూ ఆంధ్రై (Andhrae), శిబై (Sibai) అనే తెగలను గూర్చి చెప్పారు. ఇవి ప్రఖ్యాతి చెందిన ఆంధ్ర, శిబి జాతులు. నిజానికి కాళిదాస మహాకవి 'శిబి' జనపదంలో జన్మించాడని అతడు క్రీ.పూ. రెండవ శతాబ్ది ముందు వాడనేది ఈ మధ్యనే బయల్పడ్డ శిలా శాసనం ద్వారా కూడా తెలిసింది. ఆ విక్రమాదిత్యుడు రెండవ చంద్రగుప్తుడే అయి ఉండాలి. ✦



## మేషం

అశ్వని, భరణి - కృత్తిక ప్రథమ పాదం

వీరికి ఈ మాసమంతయూ సామాన్యముగా ఉంటుంది. అధిక ప్రయత్నము చేత ధనలాభము కలుగును. ప్రయాణములు శ్రమతోకూడి ఉండును. ఉద్యోగ, వ్యాపార, వ్యవసాయదారులకు మే1.5 నుండి అనుకూలత పెరుగును. ఈ మాసప్రథమార్థమంతా ఇబ్బందులు కలుగును. చేసిన ఋణములు మాసాంతము నుండి తీర్చుటకు అవకాశముండును. అనారోగ్యములు కొద్దిగా కలుగును. అకాల భోజనములు, బంధువిరోధము కలుగును. కుటుంబమునందు చికాకులు కలుగును. విద్యార్థులకు మాత్రము పరీక్షలందు చక్కని ఫలితములు పొందగలరు. సంతానము ఆరోగ్యముగా ఉండును.

వీరు నవగ్రహ జపదానములు చేయించుకుంటే మంచిది. శివదర్శనము మాసమంతయూ చేసుకోవలెను.



## వృషభం

కృత్తిక 2,3,4 - రోహిణి - మృగశిర 1,2

ఈమాసమంతయు చెప్పుకోగలిగినంత అనుకూలత లేదు. స్వల్ప అనారోగ్యము, కార్యాలస్యము, సేవకుల అనుకూలత లేకపోవుట కలదు. సోదర సోదరీలతో భిన్నాభిప్రాయములు కలుగును. సినీ, నాటక, కళారంగాలలో వారికి సామాన్యముగా ఉంటుంది. భార్యాభర్తలలో మాట తేడాలు వచ్చును. వాహనసౌఖ్యం తగ్గును. అధిక ధనవ్యయం కలదు. వృత్తిఉద్యోగ వ్యాపార రాజకీయ, పారిశ్రామిక రంగాలలో వారికి మే15 తరువాత నెమ్మది నెమ్మదిగా అనుకూలంగా ఉంటుంది. విద్యార్థులకు స్త్రీలకు, సంతానమునకు, కుటుంబమునందు అందరికి మాసములో ద్వితీయార్థము కొద్దిగా బాగుండును. వీరు నవగ్రహములకు జపదానాలు, హోమం చేయించుకొనుట ముఖ్యం. విష్ణుసహస్రనామము రోజుకు మూడుపూటలా చేసుకోవలెను.

| చ | గు ర బు శ శు | కు | |
|---|---|---|---|
| | మే. 1 2000 | | రా |
| కే | | | |
| | | | |



## మిథునం

మృగశిర 3,4 - ఆరుద్ర - పునర్వసు 1,2,3

ఈ మాసమంతయూ చక్కని అనుకూలమైన కాలము. కుటుంబమునందు సౌఖ్యము, మిత్రలాభం, ధన లాభము కలదు. వ్యాపార వ్యవసాయదారులకు మంచి రోజులు. కళాకారులకు సామాన్యముగా ఉండును. ఆరోగ్యము బాగుండును. ప్రయాణములు అనుకూలించును. భారీ పరిశ్రమలు లాభించును. అలంకార వస్తువులు, విలాస వస్తువులను కొంటారు. ఖర్చులు సక్రమ రూపంలో ఉంటాయి. అనుకున్న పనులు నెరవేరుతాయి. సంతానము వృద్ధిలో, ఆరోగ్యంగా ఉంటారు. అంతాఅనుకూలంగా ఉంటుంది.



## కర్కాటకం

పునర్వసు 4 - పుష్యమి - ఆశ్లేష

ధనాదాయము బాగుంటుంది. బంగారు వర్తకులకు, విద్యుత్ శాఖలవారికి, భారీ పరిశ్రమలవారికి లాభసాటిగా ఉంటుంది. ఉద్యోగస్థులకు, సాహస వ్యాపారస్థులకు బాగా లాభించును. శరీర సుఖము, గృహ సౌఖ్యము. మంచిభోజనము, విందులు, వినోదములు కలవు. ప్రయాణాలు లాభించును. తీర్థయాత్రలు, వినోద యాత్రలు చేసే అవకాశం కలదు. అధికారుల ఆదరణ లభిస్తుంది. కళాకారులకు అనుకూలమైన, గుర్తింపు కలిగే రోజులు. గౌరవ ప్రతిష్ఠలు పెరుగును. వాహన సౌఖ్యము కలదు. సంతానమునకు మంచిరోజులు. తలచిన పనులు నెరవేరే రోజులు.



## సింహం

మఖ - పుబ్బ - ఉత్తర - 1

సర్వత్రా విజయము కలుగును. శత్రు నాశనము, కుటుంబసౌఖ్యము, ధన లాభము, అధికారవృద్ధి కలదు. వైద్య విద్యా, ఉద్యోగులకు మంచికాలము. విద్యార్థులు ఉత్తీర్ణులు కాగలరు. ప్రయాణాలు అధిక మేలు చూపుతాయి. వ్యాపార, వ్యవసాయ, పారిశ్రామిక, ఉద్యోగులందరికీ చక్కటి రోజులు, వాహనసౌఖ్యం కలదు. ఆరోగ్యం బాగుంటుంది. సంతానము విద్యా ఉద్యోగాలలో బాగుంటారు. భూములు రాబడిగా ఉంటాయి. జంతువులతో వ్యాపారము చేయు వారికి లాభము హెచ్చుగా ఉంటుంది. గృహోపకరణాలు అమర్చుకుంటారు. ప్రభుత్వాలావాదేవీలు ఒక కొలిక్కి వస్తాయి. ఈ రాశివారికి మొత్తంమీద అనుకూలమైన మంచి రోజులు.



ఉత్తర 2,3,4 - హస్త - చిత్త 1,2

ఈ మాసమంతయూ మిశ్రమ ఫలితముగా ఉంటుంది. వివిధ రూపముల ధన లాభము కలుగుతుంది. మీమాట చెలామణి అవుతుంది.

శత్రుజయం కలుగుతుంది. కుటుంబంలో సుఖసంతోషాలు కలుగుతాయి. అధికారుల ఆదరణ కలదు. సంతానము ఆరోగ్యంగా విద్యావృద్ధిలో ఉంటారు. వాహనసౌఖ్యం కలదు. ఇష్టవస్తు, వస్త్రప్రాప్తి కలదు. కులాచారంగా, వ్రత పూజాదికాలు జరుపుతారు. తీర్థయాత్ర, వినోదయాత్రలు చేస్తారు. కళాకారులకు మంచిరోజులు. కొంచెం శ్రమ అధికమైన అనుకున్న పనులు సాధించగలరు. నవగ్రహ హోమం కనుక చేయించుకుంటే లాభాలు నిస్సంకోచంగా కలగగలవు.



## తుల

చిత్త 3,4 – స్వాతి – విశాఖ 1,2,3

ఈ మాసమంతా ఫలితములు మిశ్రమంగా ఉంటాయి. మాసారంభంలోనే శ్రీ మహాలక్ష్మి జపం చేయించుకుంటే మంచిది. ధనము అధికంగా ఖర్చు అగును. అనుకున్న పనులు జరుగుటకు ఆలస్యం అవుతుంది. కళత్రమునకు అనారోగ్యము విద్యావైద్య రంగాలలో వారికి శ్రమ అధికము. తిలతైల, ఇనుము, ప్రత్తి వ్యాపారస్తులకు ఋణములు చేయు అవసరం రావచ్చును. విదేశీ వ్యాపారస్థులు సాహసంగా నిర్ణయాలు తీసుకొనుట మంచిది కాదు. అధికారులతో జాగ్రత్తగా మాటలాడుటమంచిది. వీరు కూడ నవగ్రహ హోమం జరిపించుకుంటే చాల మంచిది. ఈ చిత్తస్వాతి, విశాఖ నక్షత్రకులు నక్షత్రజపం కూడ చేయించుకోవలెను.



## వృశ్చికం

విశాఖ 4 – అనూరాధ – జ్యేష్ఠ

ఈ రాశివారికి సామాన్య స్థాయిలో వేలు ఉండును. ధనాదాయము స్వల్పంగా ఉండును. బంధు, సోదర విరోధము కలుగును. వ్యాపార, వ్యవసాయ, వృత్తి, ఉద్యోగ, విద్యా వైద్యరంగాలలో అనుకోని చిక్కులు కలుగుతాయి. నెమ్మదిగా సర్దుబాటు అవుతాయి. ఆరోగ్యము జాగ్రత్తగా చూచుకోవలెను. చికాకులన్నీ సహనము వహిస్తే సర్దుబాటు అవుతాయి. సాహసించి నిర్ణయాలు తీసుకోరాదు.

నవగ్రహ హోమం, దానాలు తప్పక చేయించుకోవాలి. శివాభిషేకం అవసరము.



## ధనస్సు

మూల – పూర్వాషాఢ – ఉత్తరాషాఢ – 1

ఈ రాశివారికి మాసమంతయూ అనుకూలంగా ఉంటుంది. ఆదాయము బాగుంటుంది. ధనధాన్య లాభం కలుగుతుంది. పెద్దల ఆదరణ కలుగుతుంది. వృత్తి ఉద్యోగ వ్యాపార, విద్యలలో అందరికి అనుకూలము. నూతన వస్త్ర వస్తులాభము. వాహన లాభము. భారీ పరిశ్రమలు లాభించును. తలచిన కార్యము నెరవేరును. రాజకీయాలలో వారికి అనుకున్న ఫలితములు కలుగుతాయి. మాసాంతములో కొద్దిగా ఋణాలు చేయవలసి వచ్చినా త్వరలోనే విముక్తి కలుగును.



## మకరం

ఉత్తరాషాఢ 2,3,4 – శ్రవణం – ధనిష్ట – 1–2

వినోద విహార యాత్రలు చేస్తారు. బంధువులు, మిత్రులు, సద్గోష్టితో గడపుతారు. వాహనసౌఖ్యం కలదు. వ్యవసాయ, వ్యాపారలాభం కలదు. మనశ్శాంతి, కీర్తి ప్రతిష్టవృద్ధి, మిత్రలాభం కలదు. ముత్యాల వ్యాపారస్థులకు లాభాలు అధికంగా ఉంటాయి. పెద్దల ఆదరణ, వస్తు వస్త్రలాభం కలుగుతుంది. సంగీత, సాహిత్య, శిల్ప, జ్యోతిష, నాట్య, కళారంగాలలో కృషి చేయు వారికి అభివృద్ధి, గౌరవ ప్రతిష్టలు, ధనాదాయము కలుగును.



## కుంభం

ధనిష్ఠ 3,4 – శతభిషం – పూర్వాభాద్ర 1,2,3

ఈ మాసమంతా వీరికి వివిధ రూపములుగా ధనలాభం కలుగును. నూతన వస్త్ర వస్తులాభము. సన్మాన గౌరవము, కీర్తిప్రతిష్టల వృద్ధి కలుగును. అనుకున్న పనులు నెరవేరుతాయి. ఇంటిలో సుఖసౌఖ్యశాంతులు ఉంటాయి. కోర్టువ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రభుత్వ లావాదేవీలు తీరుతాయి. ప్రయాణాలు లాభిస్తాయి. ఇంటిలో శుభకార్య ప్రయత్నాలు జరుగుతాయి. ఆరోగ్యం బాగుంటుంది. సంతానము సుఖంగా ఉంటారు. సాహస వ్యాపారాలు లాభిస్థాయి. వినోద, తీర్థ యాత్రలు చేస్తారు. మొత్తం ఈ మాసమంతా ఈ రాశివారందరికి, అనుకూలంగా ఉంటుంది.



## మీనం

పూర్వాభాద్ర 4 – ఉత్తరాభాద్ర – రేవతి

దేవబ్రాహ్మణభక్తి, ప్రశాంత జీవనము కలుగుతుంది. ఆరోగ్యము బాగుంటుంది. తీర్థ, వినోదయాత్రలు చేస్తారు. శతృనాశనం, కుటుంబశాంతి, బంధుసమాగమము కలుగుతుంది. వృత్తి వ్యాపారాలు లాభిస్తాయి. ఖర్చులు సక్రమంగా ఉంటాయి. సంతానం అభివృద్ధిలో ఉంటుంది. ప్రభుత్వ లావాదేవీలు నెరవేరుతాయి. మాసాంతమునందు కొద్దిగా చికాకులు, అనారోగ్యము ఖర్చులు పెరుగుట. అధికశ్రమ కలిగినా త్వరగానే సర్దుబాటు జరుగుతుంది. వీరు శనికి శాంతి చేయించుకుంటే మంచిది. దశరధప్రోక్త శనిస్తోత్రం జూన్ 15వ తారీకు వరకు వీరు రోజుకు రెండు సార్లు చదువుకుంటే మంచిది. ✦

# అందరికీ అవసరం

డా॥ గాయత్రీదేవి

మనిషి తన పనులు తేలికవ్వడానికి రక రకాల యంత్రాలు సృష్టించాడు. ఆ యంత్రాలని వాడుతూ ఉండాలి. అలా వాడుతుంటేనే ఆ యంత్రం మనకి ప్రయోజనకారిగా ఉంటుంది. అసలు వాడకపోయినా, సక్రమంగా వాడకపోయినా పనిచెయ్యదు. మానవుడు సృష్టించిన ఎంతటి అద్భుత యంత్రమయినా సరితూగలేనిది భగవంతుని సృష్టి, అందులోనూ మానవుడు అంతటి అద్భుత యంత్రాన్ని సృష్టించడం మాట అలా ఉంచి, సృష్టింపబడి ఉన్న మానవ శరీరంలోని అద్భుతాలని (అర్థం చేసుకునే మేథస్సు కూడా భగవత్సృష్టే) మనం సృష్టించిన యంత్రాలలాగానే, మన శరీర యంత్రాన్ని కూడా సక్రమంగా వాడడం అవసరం. ప్రతి భాగాన్నీ వాడాలి. ఏ భాగాన్ని వాడకపోయినా అది శక్తిహీనమవుతుంది.

శరీరంలోని ప్రతి అవయవమూ సక్రమంగా పనిచెయ్యడంలో సహాయపడే ఒక ప్రధాన ప్రక్రియ - వ్యాయామం.

## వ్యాయామం అంటే?

ఆయుర్వేద గ్రంథం - అష్టాంగ సంగ్రహంలో ''శరీరాయాస జననం కర్మం వ్యాయాయ ఉచ్యతే'' - శరీరానికి అలసటని, లేదా బడలిక కలిగించే పనులని వ్యాయామం అని నిర్వచించారు. అందువల్ల వ్యాయామం అంటే అదేదో - పెద్ద పెద్ద బరువులు ఎత్తడం, కష్టమైన ఎక్సర్‌సైజులు చెయ్యడం, కండలు పెంచడం అనుకోకండి.

కొంతమందికి, కొంత దూరం నడిస్తేనే అలసట కలుగుతుంది. వారికి నడకే వ్యాయామం. మరికొందరికి పరిగెత్తితేనే అలసట కలుగుతుంది. ఇంకొందరికి చాలా బరువులు ఎత్తడం, మరికొన్ని ఉర్ధము వలన మాత్రమే అలసట కలుగుతుంది. అందువల్ల, ఒకే పని అందరికీ వ్యాయామంగా చెప్పలేము.

## పరిమితి?

ఎంతసేపు వ్యాయామం చెయ్యాలి అనే ప్రశ్నకి కూడా, అందరికీ ఒకే జవాబు ఇవ్వదు ఆయుర్వేదం. బలాన్ని అనుసరించి చెయ్యాలి. ''అర్ధశక్త్యా నిషేవ్యస్తు'' - అంటే అర్ధశక్తితో వ్యాయామం చెయ్యాలి. ఒక వ్యక్తికి 6 కి.మీ. నడిచేసరికి బాగా అలసట వస్తుందనుకోండి, అతను మూడు కిలోమీటర్లు నడిచి, వ్యాయామం చాలించాలి. మరో సూత్రం ఏమిటంటే - నుదుటి మీద చెమట పట్టేవరకు, వ్యాయామం చెయ్యవచ్చు. ఏదయినా పరిమితంగానే చెయ్యాలి తప్ప, ఎక్కువ చేస్తేనే ఎక్కువ ఫలితం, త్వరగా వచ్చేస్తుంది అనుకోకూడదు. శక్తికి మించి వ్యాయామం చేస్తే, శరీరం నశిస్తుంది. (ఇందుకు ఉదాహరణగా శాస్త్రకారుడు సింహము తన శక్తికి మించి, ఏనుగు శరీరాన్ని ఈడ్చే ప్రయత్నం చేస్తే -'అదే మరణిస్తుంది) - అదే విధంగా శక్తికి మించి పనిచేసిన వారు నశిస్తారు' - అని చెప్పాడు.

## అర్హులు

బలవంతులు, తీపి, నూనె పదార్థాలు ఎక్కువగా తినేవారు, తప్పకుండా వ్యాయామం చెయ్యాలి. కఫ ప్రకృతి వారు ఎక్కువగానూ, వాత, పిత్త ప్రకృతి వారు, మధ్యస్థంగా చెయ్యాలి. సాధారణంగా 12 సం॥ల లోపు పిల్లలు, 70 సం॥ దాటినవారు, ముందు రోజు తిన్న ఆహారం జీర్ణం కానివారూ - వ్యాయామం చెయ్యకూడదు.

హేమంత, శిశిర, వసంత ఋతువులు వ్యాయానికి బాగా అనువయిన కాలం ప్రతి రోజూ ప్రాతఃకాలంలో చెయ్యడం మంచిది. కొన్ని రకాల వ్యాధులతో బాధపడేవారు వ్యాయామం చెయ్యరాదు.

## ప్రయోజనాలు

★ శరీరం తేలికగా ఉంటుంది. శరీరానికి బలం చేకూరుతుంది. మేదస్సు తగ్గుతుంది.

★ శరీరంలోని ప్రతి కణానికీ ఎక్కువ ప్రాణశక్తి చేరుతుంది.

★ రక్తప్రసారం వృద్ధి పొందుతుంది.

★ శరీరంలోని మలిన పదార్థాలు బయటికి వెళ్ళిపోతాయి. (ఈ మలిన పదార్థాలు శరీరంలో ఉండిపోతే వ్యాధికారకాలు

★ ఊపిరితిత్తులు శక్తివంతమవుతాయి.

★ వ్యాధి నిరోధక శక్తి పెరుగుతుంది.

★ మానసిక ఒత్తిడి మనిషిలోని వ్యాధి నిరోధక శక్తిని తగ్గిస్తుంది. వ్యాయామం - ఒత్తిడిని తగ్గిస్తుంది, వ్యాధి నిరోధక శక్తిని పెంచుతుంది.

మనిషి శక్తి మూడు రకాలు - సహజ సిద్ధంగా తల్లిదండ్రుల నుండి సంక్రమం చేది, ఋతువులననుసరించి కలిగేది, ఆహార విహారాల ద్వారా పొందేది. ఈ మూడింటిలోనూ మూడోది మాత్రమే మన చేతిలో ఉంది. అందువల్ల, సక్రమమైన ఆహార వ్యాయామాల ద్వారా శరీర సామర్థ్యాన్ని పెంచుకునే ప్రయత్నం చెయ్యాలి.

నడక, పరుగెత్తడం, ఈత, సైకిల్ తొక్కడం, ఇతర పద్ధతులలో వ్యాయామం - ఏదో ఒకవిధంగా ప్రతిరోజూ ఉదయం వ్యాయామం చెయ్యాలి. కాళ్ళూ చేతులూ (మెదడూ) చెయ్యవలసిన ఎన్నో పనులకి యంత్రాలు తయారుచేసుకున్న ఈ కాలంలో, శరీర యంత్రాన్ని శక్తివంతంగా పనిచేయించడానికి వ్యాయామమే మార్గం. వ్యాయామం అంటే ''అబ్బా''.. అనుకోకుండా, అది ఒక ఆహ్లాదకరమైన అంశంగా చేసుకుని, అనుసరించాలి. ✸

# పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు

డా॥ గాయత్రీదేవి

ప్రగతి సుళ్ళూరుపేట

మా పాపకి 12 సం॥లు. రొంప ఎక్కువగా ఉన్నప్పుడు నోటితో గాలి పీలుస్తుంది, రాత్రిళ్ళు గురక పెడుతుంది.

జ : రొంప ఎక్కువగా ఉన్నప్పుడు ముక్కు రంధ్రాలు మూసుకుంటాయి. కనుక నోటితో గాలి పీల్చడం సాధారణం. ఆ సమయంలో గురక కూడా వస్తూంటుంది. రొంప ఎక్కువగా ఉన్నప్పుడు - వేడి నీళ్ళలో 3-4 చెంచాల పసుపు వేసి, ఆవిరి పట్టడం ఉత్తమం. వేడి పాలలో అర చెంచా మిరియాల పొడి, అర చెంచా పసుపు, పంచదార వేసి కలిపి, రోజుకి రెండుసార్లు ఇవ్వండి. అవసరం అయితే, Dabur వారి త్రిశూన్ మాత్రలు పూటకి ఒకటి చొప్పున రోజుకి 2-3 సార్లు ఇవ్వండి. (మనము ఏమీ చెయ్యక్కర్లేకుండా, ఓ మాత్ర వేసుకుంటే తక్షణ నివారణ ఇచ్చినా, తరువాత అది ఆ శరీరం మీద పనిచేయడం మానేస్తాయి. ఇతర సమస్యలు సృష్టిస్తాయి. అందువల్ల మనం వాడే మందులు, అనారోగ్యాన్ని ఎదిరించే శక్తి శరీరానికి ప్రసాదించేవిగా ఉండాలి తప్ప, అప్పటికప్పుడు సమస్యని దూరం చేసేవిగా ఉండకూడదు).

మీ పాపకి, ఈ రొంప సమస్య నిరంతరం ఉంటుందా, అప్పుడప్పుడూ వచ్చిపోతోందో తెలియజేయండి. నిరంతరం ఉండేటట్లయితే - వేరే ఔషధాలు అవసరం.

సత్యవాణి బొంబాయి

అన్ని వ్యాధుల చికిత్సకీ, అన్ని వైద్యాలలోకీ ఆయుర్వేదమే ఉత్తమం, ఇతర వైద్యాలు పనికి రావని మీ అభిప్రాయమా?

జ : శాస్త్రాన్ని సక్రమంగా చదువుకున్న వారెవ్వరికీ ఇటువంటి అభిప్రాయాలు ఉండవు. ఆలోచించి చూచినట్లయితే, ఏ ఒక్క వైద్య శాస్త్రమూ సకల వ్యాధి నివారిణి కాదు, అయి ఉంటే ఇన్ని వైద్య విధానాలు ఆవిర్భవించవలసిన అవసరమే ఉండేది కాదు. ప్రతి శాస్త్రానికీ కొన్ని పరిమితులుంటాయి. అల్లోపతిలో సూపర్ స్పెషలైజ్ చేసిన వైద్యులు, తమ శాస్త్ర పరిమితులను గుర్తించి, మార్గాంతరం కోసం ఆయుర్వేదం వైపు దృష్టి సారించి అందులోని సూత్రాలను, మూలికా వైద్యాలనూ తమ రోగులకు సూచిస్తున్నారు. కొన్ని అనారోగ్యాలలో ఆయుర్వేదం అల్లోపతి వైపు చూడక తప్పదు. ఏ శాస్త్రాన్ని అనుసరించాం అన్నది కాదు ప్రధానం, రోగికి ఇతర ఇబ్బందులు కలుగకుండా, అనారోగ్యాన్ని పోగొట్టి, ఆరోగ్యవంతుణ్ణి చెయ్యడమే వైద్యుల కర్తవ్యం (వైద్యో నారాయణో హరిః). ఈ ఉద్దేశ్యంతోనే Holistic వైద్యం అనే పేరు ప్రాచుర్యంలోకి వస్తోంది. ఒక ప్రక్క ఆయుర్వేదంలోని సూత్రాల వెనుక ఉన్న శాస్త్రీయమైన అంశాలని శాస్త్రజ్ఞులు పరిశోధించి ఆమోదిస్తుంటే, మరో ప్రక్క ఆయుర్వేద సూత్రాలని మూఢ నమ్మకాలని పత్రికా ముఖంగా కొట్టి పారేస్తూ పాఠకులను తప్పుదారి పట్టిస్తున్నారు కొందరు వైద్యులు. ఏ విషయాన్నయినా కాదని కొట్టి పారెయ్యడం తేలికే, పరిశీలించి అవునని నిరూపించడమే అవసరం.

**"మీరందరూ నా వద్దకు అనేక కానుకలు తీసుకుని వస్తున్నారు. పుష్ప ఫలాదులు తెస్తున్నారు. ధనమిస్తున్నారు. వీటిని వేటినీ నేను కోరడం లేదు. దినానికి రెండు నిమిషాలు మాత్రం నాకివ్వండి. ఆ రెండు నిమిషాలు నిశ్చలమయిన భక్తితో పరమేశ్వరుణ్ణి ధ్యానించండి. అదే నాకు అత్యంత ప్రీతికరమైన కానుక. దినమంతా మీరు లౌకిక వ్యాపారాలతో గడుపుతారు. రెండు నిమిషాలు ఈ బీద సన్యాసికి దానమివ్వలేరా. నాకు కావలసింది అంతే."**

**- కంచి మహాస్వామివారు**

సుధాలహరి

గొట్టుముక్కల రామకృష్ణమూర్తి

వ్యాసము - 4

# మోక్షము - భిన్న సిద్ధాంతాలు

ఎవరైనా వేదాంతోపన్యాసమిస్తూ, ''మోక్షం కోసం ప్రయత్నించండి'' అని చెప్పినప్పుడు, 'మనం మోక్షమంటే ఏమిటో ఆయన చెపుతున్నారా?' అని గమనించవలసి వుంది.

మోక్షశబ్దం నిర్వచింపవలసి వుంది. ఎందుకంటే మోక్షం దేనివలన సిద్ధిస్తుంది? జ్ఞానమువలననా, లేక జపదప ధ్యానాదుల వలననా? లేక లౌకికములైన సత్కర్మల వలననా? అని తెలుసుకోడానికి ముందు దాని స్వరూపం తెలుసుకోవాలిగదా! కనుక ఈ విచారణ తొలుత కొంతచేయాలి.

మోక్షం, ముక్తి, కైవల్యం, నిర్వాణం మున్నగు శబ్దములు లోకములో ప్రయోగింపబడుతున్నది. ముక్తి, లేక మోక్షము అనగా, శబ్దార్థమును బట్టి ''విడుదల'' అని అర్థము. దేనినుండి? బంధమునుండి. కరచరణాలు కట్టివేయబడిన వాడూ, కారాగృహబంధితుడూ, దానినుండి బయటపడవలెనని కోరుతాడు. ఎందువలన? అతనికి బాధకలుగుతున్నది. దుఃఖము కలుగుతున్నది. స్వేచ్ఛలేదు. సుఖములేదు. వాని ప్రాప్తికొరకు బంధము నుండి విడుదల కోరుతున్నాడు. అట్లే, ఈ జనన మరణ రూప సంసారమంతయు జీవునకు బంధము దుఃఖకరము. దీనినుండి 'ముక్తి'ని పొంది, దుఃఖరహిత నిత్యానందస్థితి పొందడమే మోక్షము!

ఇట్టి ముక్తిని ఏది ప్రసాదిస్తుంది? అనే ప్రశ్నకు బహుసిద్ధాంత సముద్రమథనానంతరం తేలిన స్పష్టమైన, నిర్దుష్టమైన సమాధానమే! జ్ఞానాదేవతు కైవల్యమ్. (జ్ఞానంవల్ల మాత్రమే ముక్తి) అనునది.

అయితే ఈ జ్ఞానం అనే మాట పెద్ద వివాదాస్పదం. ఎన్నితెలుసుకొన్నా పూర్తికాదనియు, అజ్ఞానమే చివరకు మిగులుతుందనియూ, గమనించితిమి! కనుక ఇది అసంబద్ధ ప్రేలాపమెట్లు కాదు? అంటే దీనికి సమాధానమిది.

ఇంతకూ జ్ఞానమెందుకు? దుఃఖము తొలగి ఆనందము ప్రాప్తిస్తుందనా? అయితే, లోకంలో ఎంత విద్వాంసుడైనా, ఎన్ని విషయాలు తెలిసిన వాడైనా, తీవ్ర దుఃఖితుడౌతున్న సందర్భాలున్నవే! కనుక మనమనుకొనే జ్ఞానం జ్ఞానంకాదు. ఎందుకంటే జ్ఞాన ప్రదీపమన్నారు. దీపంవలె సర్వార్థావభాసకమైన జ్ఞానం, తప్పక దుఃఖ వినాశపూర్వక సుఖ ప్రాప్తిని కలిగించియే తీరాలి. జ్ఞానందీపం, అయితే, చీకటి మరి ఏమవుతుంది? అజ్ఞానమవుతుంది. చీకటి వల్ల బాధ, దుఃఖము. అట్లే చీకటివంటి అజ్ఞానం వల్ల సంసార దుఃఖంకలుగుతున్నది. చీకటిని దానికి విరోధి అయిన దీపం మాత్రమే పోగొట్టకలదు. అట్లే సంసారాంధకారమనెడి అజ్ఞానమును ఆత్మజ్ఞానమే పోగొట్టవలెను. కనుక 'జ్ఞానాదేవతు కైవల్యం' అని బోధించే అద్వైతమే సత్యప్రతిపాదకమౌతున్నది.

అయితే యిట్టి జ్ఞానము ఒకటి ఉన్నదా? అంటే ఉన్నదనే సమాధానం. అదియే ఆత్మజ్ఞానం. ఆత్మయే బ్రహ్మ. అట్టి బ్రహ్మనుండియే ఈ సమస్తం ఉద్భవించింది. కనుక బ్రహ్మస్వరూపమే. తానుకూడా బ్రహ్మస్వరూపుడే. ఇట్టి స్వాత్మబ్రహ్మజ్ఞానముచే అజ్ఞానస్వరూపమై, అజ్ఞాన జన్యమైన సంసారం నివర్తించి బ్రహ్మానంద ప్రాప్తి కలుగుతుంది. ఇదియే మోక్షమనే నిత్యఫలము. అయితే ఇక్కడమరింత జటిలమైన తర్కమునకు అవకాశమున్నది. ద్వైతము సత్యమా? అద్వైతము సత్యమా? అను ప్రత్యేక చర్చయందు ఆ తర్కమునంతటినీ మనము పరిశీలింతము. ప్రస్తుతము, మోక్ష విషయమున గల మరికొన్ని ముఖ్య సిద్ధాంతములను పరిశీలింపవలసి యున్నది.

నైయాయిక, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వ మీమాంసలనునవి ముఖ్యములైన ఆస్తిక దర్శనములు. ఆరవదియగు ఉత్తరమీమాంస లేకవేదాంతశాస్త్రము ఉండనే ఉన్నది. పై శాస్త్రములు క్రమముగా గౌతమ, కణాద, కపిల, పతంజలి, జైమిని మహర్షులచే రచింపబడినది. వీరందరూ తపశ్శక్తి సంపన్నులు. వారివారి మతానుయాయుల దృష్టిలో సత్యదర్శనము చేసినవారు. వీరందరికీ వేదమే ప్రమాణము. తమతమ సిద్ధాంతములను వేద ప్రమాణములతో సమర్థించుకొందురు.

క్రమముగా వీరిసిద్ధాంతముల సారమిట్లుండును. నైయాయిక మతకర్త గౌతముడు. పరమాత్మ ఈశ్వరుడు. జీవుని కంటే నిత్యభిన్నుడు. ప్రతి శరీరమందు జీవులు వేరువేరుగా నున్నారు. జ్ఞానము, ఇచ్ఛా, ద్వేషము, మున్నగు చతుర్దశ గుణములు జీవుని యందుగలవు. ప్రమాణ ప్రమేయాది

షోడశ పదార్థముల జ్ఞానము వలన దుఃఖము, జన్మ, ప్రవృత్తి, దోష మిథ్యాజ్ఞానములను వాని ఉత్తరోత్తరవినాశనవముచే మోక్షముులేక అపవర్గము సిద్ధించును. అనగా పదార్థ జ్ఞానముచే మిథ్యాజ్ఞానము నశింపగా, క్రమముగా జన్మరాహిత్యమై దుఃఖ వినాశముచే ముక్తి లభించునని వీరి సిద్ధాంతము.

కణాదమహర్షి ప్రణీతమైన వైశేషిక శాస్త్రము గూడ దాదాపు ఇట్టి సిద్ధాంతమునే గలిగి కొంత భేదించును. ద్రవ్య, గుణ, కర్మ సామాన్య విశేష సమవాయ, అభావములను సప్త పదార్థములను అంగీకరించి, వాయు, అగ్ని, జల, భూపరమాణువుల కలయికచే జగత్తు ఏర్పడుతున్నదనియు ఈశ్వర సంకల్పము మూలమనియు, ఇట్టి విజ్ఞానముచే మోక్షమనియు వీరు పల్కుదురు.

సాంఖ్యమతము కపిల మహర్షిచే ప్రణీతము. వీరిదృష్టిలో ప్రకృతి–పురుషుడు (జీవుడు) ఇద్దరుగలరు. ప్రకృతి పురుష వివేక జ్ఞానమే సాంఖ్యము. పురుషుడు అసంగుడు. దేనితో సంబంధములేక సుఖముగా నుండువాడు, ప్రకృతి సంసర్గముచే బంధమునను భవించుచున్నాడు. ప్రకృతికి మూల కారణము ప్రధానము, అచేతనము, స్వతంత్రమునైన తత్త్వము. సత్త్వరజస్తమో గుణాత్మకమై ప్రధానము జగత్తును పురుషుని భోగార్థము సృష్టించుచున్నది. వివేకముతో దీనినుండి విముక్తుడగుటయే మోక్షము. ఈశ్వర ప్రసక్తిలేదు. వీరిదృష్టిలో ఈశ్వరుడు లేడు.

యోగమతముగూడ దాదాపు ఈ కోవకే చెంది, ఈశ్వరుని అంగీకరించినది. చిత్తవృత్తి నిరోధ రూపమైన అష్టాంగ యోగము ద్వారా ఈశ్వర సాక్షాత్కారమునొందుట మోక్షమని యోగ మతము. పతంజలి మహర్షి దీనికి కర్త.

ఇక జైమిని వ్రాసిన మీమాంసా శాస్త్రమున్నది. వీరిదృష్టిలో వేదము పరమ ప్రమాణమై కర్మను బోధించుచున్నది. జ్ఞానమును బోధించు వేదాంతముల ప్రామాణ్యమును వీరు అంగీకరింపరు. కర్మవల్లనే మోక్షము. ఈశ్వర ప్రసక్తిలేదు.

ఇక వ్యాసమహర్షి కృత ఉత్తరమీమాంస బ్రహ్మసూత్రముల రూపమై వేదాంతమత మగుచున్నది. పై కపిల కణాద గౌతమాదుల సిద్ధాంతములనన్నిటిని తిరుగులేని విధంగా ఖండించి, ఔపనిషదమగు అద్వైత సిద్ధాంతమును స్థాపించినది. ఈ బ్రహ్మసూత్ర అనర్ఘ రత్నమునకు సానబట్టి ప్రకాశింపజేసినది శ్రీ జగద్గురుశంకరాచార్య భాష్యం.

అద్వైతామృత మాధుర్యము, పరిమళము, సౌందర్య వైభవములన్నియు భగవత్పాదుల సూత్ర భాష్యముతో బాటు ఉపనిషత్, భగవద్గీతల భాష్యములందు ప్రతిబింబించినది. భగవత్పాదుల అద్వైత సిద్ధాంత ప్రభంజనముచే కపిల కణాద గౌత మాదుల సిద్ధాంతములన్నియు, శారదాభ్రశకలచయమువలె ఎగిరిపోయినవి.

ఇంకను, రామానుజల విశిష్టాద్వైతము, మధ్వాచార్యులద్వైతము, భాస్కరాచార్యుల ద్వైతాద్వైతము, శాక్తేయనాపాలికాదిశైవ మత శాఖలూ, – ఈ సమస్తమూ భేదవాదములే. వీరందరి అభిప్రాయములో, ఈ ప్రపంచము సత్యము, జీవుడు ఈశ్వరుడు నిత్యభిన్నులు. వీరందరూ తమలో తాము ఎంత విభేదించి కలహించుచున్నను, అద్వైతముపై ధ్వజమెత్తడములో యోధానుయోధులే. శంకరాచార్య జగద్గురువులు విజృంభించి అద్వైతసిద్ధాంత పరశురాములై, ద్వైతారణ్యమును నిశ్శేషముగా ఉన్మూలముగావించి, తాత్త్వికనభో మండలమున ప్రచండ మధ్యాహ్న భాస్కరులై ప్రకాశించిరి. ఈ విశేషమంతయు అద్వైత చర్చలో మనం పరిశీలింతుము. ✸

## శంభూజీ చిత్రవధ

తనపై జరిగిన మూడుహత్యా ప్రయత్నాల వల్ల తనవారినెవ్వరినీ నమ్మక జౌత్రాహికుడైన కవి – కలశే అనే తాంత్రికుడిని తన ముఖ్యసలహాదారుగా చేసుకొన్నాడు శంభూజీ. ఈ కవి-కలశేకు మరాఠా సైనికాధికారులకు అంత సయోధ్య లేకపోవడాన, ప్రతి వారిని ఏదోవిధంగా జైలుపాలు చేయడమో శిక్షించడమో చేశాడు. ఈ కవి- కలశే తాంత్రిక శక్తితనని రక్షించ గలదని నమ్మాడు. శివాజీ భయపడినట్లుగానే కవి- కలశే తనకై కట్టుకొన్న సంగమేశ్వర్ వమ్యుహర్మ్యంలో మగువల నడుమ మదిరామత్తుడై యున్న శంభూజీని కవి- కలశేతో సహా నిర్బంధించారు ఔరంగజేబుసేనా నాయకులు. వీరిద్దరికీ బఫూన్లవేషం వేసి, డప్పులు మ్రోగిస్తూ, వెక్కిరిస్తూ హేళన చేస్తూ బహదూర్‌గంజ్‌లో ఉన్న ఔరంగజేబు వద్దకు తీసుకొని వెళ్లారు.

ఔరంగజేబు అతని కోటలన్నీ స్వాధీనం చేసి, దాచుకున్న డబ్బంతా ఇచ్చివేస్తే ప్రాణభిక్షపెడతానన్నాడు. అప్పటికే అపరాధ భావంతోనూ, అవమాన భారంతోనూ క్రుంగిపోతున్న శంభూజీ తన జాతికి ద్రోహం చేయనని సమాధానమిచ్చాడు. హేళనగా నవ్వుతూ ''మరి రాజాగారు ఏ షరతులమీద సంధికి ఒప్పుకొంటారో'' అని ప్రశ్నించాడు ఔరంగజేబు. ''మీకొక సిద్ధాంతము మాకొక సిద్ధాంతమూనా? మీతో సంధి చేసుకోవాలంటే తరతరాలుగా మా హిందూరాజులు తమ పుత్రికలను నజరానాగా సమర్పించ వలసి వస్తోంది కదా! తాముకూడా తమ పుత్రికల లోనో, మనవరాళ్ళలలనో ఒక్కరుకను నజరానాగా సమర్పిస్తే సంధికి ఆలోచిద్దామన్నాడు'' శంభూజీ. యావద్భారత సామ్రాట్టననుకొంటున్న ఔరంగజేబు ఈ మాటలకు మ్రాన్పడిపోయాడు. మూడువారాలు చిత్రవధ చేసి అతిక్రూరంగా శంభూజిని అంతమొందించాడు.

శంభూజీ బ్రతికి ఉండగా మరాఠ రాజ్యానికి ఏమి మేలు చేశాడనే విషయంలో మత భేదాలున్నాయి. అయితే ఆయన మరణం మాత్రం మరాఠుల ఆత్మగౌరవాన్ని పెల్లుబికించింది. ఆయన చిందించిన ప్రతి రక్తపుబొట్టు వేలాది మరఠా వీరులను మొగలాయి సింహాసనాన్ని కదిలించి వేసింది.

# కర్ణపిశాచి

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

ఒకనాడు సాయంకాలం గోధూళివేళ పశువులను ఇంటికి తోలుకొచ్చి లోపల కట్టివేశాడు పాలేరు. గృహిణి ఇంట్లో ఏదోపని చేసుకుంటున్నది. పరమనిష్ఠాపరునిగా షట్కాల శివపూజాదురంధరునిగా పేరు చెందిన అయ్యావారు లోపల సంధ్యావందనం చేసుకుంటున్నాడు.

ఆ కాపరి బావిదగ్గర కాళ్ళు చేతులు కడుక్కొని వాకిలి దగ్గరకు వచ్చి ''అమ్మగారూ'' అని కేకవేశాడు. ఆవిడ లోపలినుంచి వచ్చి వాకిట్లో నిల్చుంది.

''అమ్మ నాకు గారెలు పెట్టరా''? అని అడిగాడు.

''గారెలెప్పుడు చేశామురా'' అన్నది ఆమె.

''నాకు తెలుసులెండమ్మగారూ. 54 గారెలు చేశారు, మధ్యాహ్నం. అందులో 30 ఖర్చయినవి. ఇంకా 24 ఉన్నాయి బుట్టలో'' అన్నాడు వాడు. ఆమె విస్తుపోయింది.

ఇంట్లో ఎప్పుడో మధ్యాహ్నమనగా చేసిన గారెలసంగతి వాడికెట్లా తెలిసింది? ఆ మాయ ఏమిటో ఆమెకర్థం కాలేదు. ఆ పశువుల కాపరి చిన్నప్పటినుంచి వాళ్ళయింట్లో పని చేస్తున్నవాడే. ఆమెకేమీ తోచక ఒక

లోపల జపం చేసుకుంటున్న అయ్యావారు వాణ్ణి కేకేసి పిలిచారు. ''ఒరే ఆ గారెలు తినేసి ఇటురా'' అన్నాడు.

ఆ పనివాడు తినటం పూర్తిచేసి మంచి నీళ్లు తాగి యజమాని దగ్గరకు వచ్చాడు. ఆయన దొడ్లో చెట్టుక్రింద మంచం వేసుకొని కూచున్నాడు. వాణ్ణికూడా కూచోమని చెప్పి, అప్పుడడిగాడు. ''ఏమిరా మా యింట్లో వండిన గారెలు సంఖ్యతో సహా ఎట్లా చెప్పావు. అసలు వండిన సంగతే నీకు తెలీదు కదా. ఇప్పుడే నీవు పొలాన్నించి వస్తివి. ఈ సంగతి ఎలా కనుక్కున్నావ్!''

వాడు ఏదో చెప్పి తప్పించుకోవాలని చూశాడు. కాని ఆయన గట్టిగా పట్టు పట్టటంతో చెప్పక తప్పలేదు.

''అయ్యగారు! నా దగ్గరొక విద్య వున్నది. ఏం కావాలని అది చెవులో చెబుతూ ఉంటుంది. దానివల్ల ఆ గారెల సంగతి కనుక్కున్నానండి'' అని వాడు తన రహస్యం చెప్పాడు.

అయ్యావారికి ఆశ కలిగింది. ఎన్నో సంవత్సరాలుగా తాను కఠోర దీక్షతో శివపంచాక్షరి చేస్తున్నాడు. ఇప్పటికి కొన్ని కోట్లు పూర్తయింది. అప్పుడప్పుడు ఏదో స్వప్న దర్శనం తప్ప శివుడు తన తపస్సుకు మెచ్చి సాక్షాత్కరించనే లేదు. తన దగ్గర ఎటువంటి మహిమలూ లేవు. తన దగ్గర పనిచేసే పాలేరు దగ్గర అద్భుతమైన శక్తి ఉన్నది. తానా విద్య ఎందుకు నేర్చుకోగూడదు? అని అనిపించి తనకా మంత్రం నేర్పమని వాణ్ణి బ్రతిమిలాడాడు.

వాడు ఎంతో చెప్పి చూచాడు. ''ఇది బ్రాహ్మలు చేయగూడదండీ, బెడిసి కొడుతుందేమో'' అన్నాడు. అయినా ఆయన వినలేదు. చివరకు వాడు తప్పక అయ్యావారికి దానికి సంబంధించిన మంత్రమూ తంత్రము చెప్పాడు.

ఆ ప్రక్రియ అంతా చాల సులభంగా కనిపించిదాయనకు. మడిలేదు. శుచిత్వము లేదు. చాలా సులభంగా ఉంది పద్ధతి. వాడు చెప్పిన పద్ధతినే కొన్ని గంటలలోనే నిర్ణీత మంత్రజపం పూర్తయింది. చెవులో ఏదో హోరులాగా తర్వాత మాటలు స్పష్టంగా వినబడటం మొదలుపెట్టింది. ''ఏమయ్యా నన్నెందుకు పిలిచావు?''

''త్రికాల విషయాలు నాకు తెలియజేయటం కోసం నిన్ను బాధించాను''. అన్నాడయ్యావారు. అతడికి ఒక పెద్దనవ్వు వినిపించింది.''నీ దగ్గరకు గాని మీ ఇంట్లోకి గాని రాలేదు. నేను నీ దగ్గరకు వచ్చి రోజూ కోరిందల్లా చెప్పాలంటే నీవు నీ అనుష్ఠానం మానేసి దేవతార్చన యింట్లోనుంచి తీసేస్తే అప్పుడు సాధ్యమవుతుంది.''

అయ్యావారికి తల తిరిగింది. ఇన్నాళ్ళు తాను చేసిన తపస్సుకు అంతశక్తి ఉన్నదని తెలుసుకోలేకపోయినాడు. ఒక పిశాచాన్ని తనలోని శివతేజస్సు దగ్గరకు రానివ్వటం లేదు. మోక్షసాధకమైన యీ పవిత్రవిద్యను వదలుకొని పిశాచవిద్యల వెంటబడినందుకు తనను తాను నిందించుకొని చేతిలో ఇన్ని నీళ్ళు పోసికొని ''అయితే ఇకముందు నా దగ్గరకు రానక్కరలేదు'' అంటూ ఆ నీళ్ళు బైటకి విసిరాడు. ఆ పిశాచం వెళ్ళిపోయింది. తెలుగుదేశంలోని ఒక ఆరాధ్య కుటుంబంలో జరిగిన గాథయిది.

ఇటువంటిదే గుంటూరులోని శృంగేరి శ్రీవిరూపాక్ష పీఠాధిపతులు జగద్గురు శ్రీకళ్యాణానంద భారతీస్వామి నిలయంలో జరిగింది. ఒక రోజు జ్యోతిష్కుణ్ణని ఒక వ్యక్తి వచ్చి పీఠంలో ఉన్న కొంతమందికి జాతకము, చెయ్యి ఏది, చూడకుండానే చెవిదగ్గర చేయి పెట్టుకొని భూత భవష్యద్వర్తమానాలు చెప్పేస్తున్నాడు. అంతా ఆశ్చర్యపోతూ వింటున్నారు. ఈ కలకలం విని మేడమీదినుంచి కిందికి వచ్చారు. ఆ జ్యోతిష్కుడాయనకు సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆయన ఆసక్తితో విషయమేమిటని అడిగారు. శిష్యులు అంతా వివరించారు.

ఆయన నవ్వుతూ "వాళ్ళందరికి చెప్పావు కదా నాకు కూడ చెప్పవయ్యా" అన్నారు. "అలాగే స్వామీ" అంటూ వాడొక క్షణం కళ్ళు మూసుకొని చెవిదగ్గర చెయ్యి పెట్టుకొని ఏదో విని చెప్పాలని ప్రయత్నించాడు. ఎంతసేపు ప్రయత్నించినా ఏమీ చెప్పలేక పోయినాడు. ఖిన్నుడైన "నాదేవత పలకటం లేదండీ" అని నమస్కరించి వెళ్ళిపోయాడు.

శిష్యులకు సందేహం కలిగింది. తమందరికి అంత అద్భుతంగా చెప్పిన జ్యోతిష్కుడు స్వామి వారికెందుకు చెప్పలేకపోయినాడు అని అనుమాన నివృత్తి చేయ్యవలసిందిగా జగద్గురువులను ప్రార్థించారు.

ఆయన చిరునవ్వు నవ్వుతూ "విశేషమేమీలేదు. వాడు కర్ణపిశాచి విద్య సాధించాడు. అది అడిగిన సంగతులన్నీ చెవులో చెబుతూ ఉంటుంది. దానికి యింక జాతక చక్రము అక్కరలేదు. చెయ్యిచూడడము అక్కరలేదు. మనిషిని చూస్తే చాలు. నా ఎదురుగా వున్నప్పుడు వాడు పిలిచిన ఆ క్షుద్ర పిశాచము రాలేకపోయింది. అందు వల్ల వాడు వెళ్ళిపోయాడు" అని విశదీకరించారు. మహా పురుషుల ముందు క్షుద్ర పిశాచములు వచ్చి నిలువలేవు.

ఇటువంటి కథలు దేశంలో ఎన్నో వినిపిస్తూ ఉంటవి. వీటిలో చెప్పబడిన ఈ కర్ణపిశాచి ఒక విచిత్రమైన విద్య. దీనిని ఉపాసించిన వాళ్ళకు ఇది చెవులో అన్ని విధాలైన విషయాలను పిలిచినపుడెల్లా వచ్చి చెబుతూ ఉంటుంది. క్షుద్రవిద్యకావటం వల్ల బ్రహ్మనిష్ఠులైన వ్యక్తులు దీనిజోలికి పోరు తంత్రగ్రంథాలలో దీని సాధన విశేషాలు అనేక రీతుల చెప్పబడివున్నాయి. మంత్రరత్నాకరంలో పిప్పలాద ఋషిదర్శించిన కర్ణపిశాచినీ దేవతారూపాన్ని చూడండి.

**శ్లో. చితాసనస్థాం నరముండమాలాం**
**విభూషితాం అస్థిమణీంకరాబ్జైః**
**ప్రోతాంనరాంత్రైఃదధతీంకువస్త్రాం**
**భజామహే కర్ణపిశాచినీం తాం**

ఫేట్కారిణీ తంత్రంలో మరొక సాధన చెప్పబడింది. ఆ మూర్తి వర్ణన యిలా వుంది.

**శ్లో. ధ్యాయేత్ పిశాచీం చలశూల హస్తాం**
**శ్యామాం సుదీర్ఘాం యువతీం త్రినేత్రాం**
**క్రుద్ధాం వివర్ణాం తను వృత్తమధ్యాం**
**గుంజాఫలైః కల్పితహారయష్టీం**

గురివింద గింజల దండ మెడలో ధరించి చేతిలో శూలం పట్టుకున్న ఒక దీర్ఘశ్యామలయైన త్రిలోచనను మంత్రపూర్వకంగా ధ్యానించాలి.

కోరినప్పుడల్లా సభలోకాని, శత్రు మధ్యంలోకాని ఎక్కడైనా సరే సాధకుని కొక్కనికి మాత్రమే కనిపిస్తూ అని విషయాలు చెబుతుందట. శ్మశానంలో చేసే విద్యకంటే ఇది కొంత మేలైనది.

ఇటువంటివే కర్ణయక్షిణి, కర్ణమాతంగి మొదలైన కొంతమంచి విద్యలు కూడా వున్నవి. అయితే పిశాచవిద్యలు సిద్ధించినంత త్వరగా ఉత్తమవిద్యలు సిద్ధించవు గదా. ❀

# 'మా ఊరి దేవుడు' శీర్షికకు ఆహ్వానం

**మీ ఊళ్ళో ఉన్న దేవాలయం, దాని ప్రశస్తి, మహిమలు క్లుప్తంగా వివరించి రాసి, ఆ గుడి ఫోటోతో సహా పంపి ఈ శీర్షికలో పాల్గొనండి.**



**పూజలందుకుంటున్న గుడులే కాక, ఎంతో ప్రశస్తి ఉన్నప్పటికీ నిరాదరణకు గురౌతున్న గుడుల గురించి కూడా రాసి, ఫోటోతో సహా పంపవచ్చు. పూర్తి పేరు, చిరునామా రాసి పంపించాలి.**

**ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకి పారితోషికం ఉంటుంది.**

**మీరు పంపవలసిన చిరునామా :**

**'మా ఊరి దేవుడు' శీర్షిక**
**ఋషిపీఠం**
**భారతీయ మానస పత్రిక**
'పార్క్‌వ్యూ', నెం. 6, 4వ ఫ్లోర్,
85, జి.యన్.చెట్టి రోడ్,
టి.నగర్, చెన్నై – 600 017.

# అర్థవంతమైనది మన కాలమానం

పోలిశెట్టి బ్రదర్స్

1) తమిళనాడు, కేరళ, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల హిందువులు కాకుండా మిగతా హిందువులంతా ''చాంద్ర సౌరమానాన్ని'' వాడుతున్నారు. వారు చంద్రుని నడకలను అనుసరించి చైత్రమాసం లోని శుద్ధపాడ్యమిని సంవత్సరాదిగా గుర్తించి, పండుగ జరుపుకుంటున్నారు. మన తెలుగు వారి ఉగాది పండుగ ఇదే! (ఆ సమయానికి సూర్యుడు మీనరాశిలో ఉంటాడు)

2) తమిళనాడు, కేరళ, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల హిందువులు ''సౌరమానాన్ని'' పాటిస్తున్నారు. వీరు మేషరాశిలో సూర్యుని ప్రవేశాన్ని సంవత్స రాదిగా గుర్తించి, పండుగ జరుపుకుంటు న్నారు. ఇది వైశాఖ మాసంలో వస్తుంది.

పైవిధంగా హిందువులు రెండు విధాలైన సంవత్సరాదుల్ని జరుపుకుంటున్నా కూడా అందులో ఒక ''ఏకత్వం'' ఉంది. పై రెండు సంవత్సరాదులూ కూడా ''వసంత ఋతుకాలానికి'' చెందినవే! పైగా రెండింటికీ కొద్దిపాటి రోజులతేడా మాత్రమే ఉంటుంది. రెండు సంవత్సరాదులూ కూడా ఖగోళ ప్రత్యేకతలు కలిగినవే! ఖచ్చితమైన ఖగోళ సూత్రాల ప్రకారమే అవి నిర్ణయించబడ్డాయి. ఈ రెండు రకాల సంవత్సరాదులూ కూడా కాలమానంలో సంవత్సరానికి మొదటి రోజుగా తీసుకునేందుకు చెరొక విధంగా అర్హమైనవే!

## వసంతఋతుకాల ప్రత్యేకత

సంవత్సరారంభానికి వసంత ఋతు కాలాన్ని తీసుకోవడంలో చాలా ప్రత్యేకత లున్నాయి. సంవత్సరంలో వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులనే 6 ఋతువులున్నాయి. వీటిలో వసంత ఋతువు అత్యంత మనోహరమైనది. ప్రకృతికి వన్నె తెచ్చి, సకల జీవుల మనసులనూ రం జింపజేసేది 'వసంత ఋతువు'. వసంత ఋతుకాలానికి ప్రపంచమంతటా ఇప్పటికీ ఒక ప్రత్యేకత ఉంది. వృక్ష సంతతి పాత ఆకులనూ, బెరళ్ళనూ హేమంత, శిశిర ఋతువుల్లో వదలిపెట్టి – వసంతఋతువులో కొంగ్రొత్త చిగుళ్ళతో, పువ్వులతో, బెరళ్ళతో నూతన అందాలను నింపుకొంటుంది. ఎక్కడ చూసినా లోకమంతా ఒక నూతనత్వాన్ని నింపుకుని కళకళలాడుతూ కన్పిస్తుంది. భగవద్గీతలో శ్రీ కృష్ణపరమాత్మ ''ఋతువు లలో నేను వసంత ఋతువును'' అని స్వయంగా చెప్పి, ఆ ఋతువుకు ఒక ప్రత్యేకతనిచ్చారు.

## కాలమానంలో హిందూ పద్ధతులు

కాలమానంలో అంశాలయిన రోజు, వారం, పక్షం, కార్తె, మాసం, ఋతువు, ఆయనం, సంవత్సరం, పుష్కరం, శకం, యుగం, కల్పకం మొదలైనవన్నీ కూడా ఖగోళశాస్త్రపరంగా ఏర్పరచుకున్న ఏకైక జాతి ''హిందూజాతి''. విదేశీజాతులు మాత్రం కొన్ని విషయాల్లో ఖగోళాన్ని అనుసరించడం, కొన్ని విషయాల్లో స్వంత లెక్కలు సృష్టించుకోవడం చేశాయి.

కాలమాన అంశాల్లో ముందుగా ''రోజు'' అనే అంశం గురించి తెలుసు కుందాం.

## (1) రోజు

అర్ధరాత్రి 12 గంటల తర్వాతనుండి మళ్ళీ అర్ధరాత్రి 12 గంటలవరకూ ఉన్న కాలాన్ని 1 రోజుగా లెక్కించడం విదేశీయుల పద్ధతి. సాధారణ వాడుకలో అయితే మనమూ దీన్నే అనుసరిస్తున్నాం. ఆలోచించి చూస్తే ఈ లెక్క అసంబద్ధంగా తోస్తుంది. ఇలా ఎందుకు చెప్పవలసి వచ్చిందో ఈ క్రింది విషయాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

జనవరి నెలలో మొదటి రోజు (1వ తేదీ) అనగా – డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గంటలు దాటిన తర్వాత వచ్చే రాత్రిభాగము+జనవరి 1వ తేదీ పగలు భాగము+జనవరి 1వ తేదీ సూర్యాస్తమయం నుండి అర్ధరాత్రి 12 గంటల వరకూ ఉండే రాత్రి భాగము''. ఈ భాగాలూ కలిపి 1 రోజుగా లెక్క. ఖగోళపరంగా చూస్తే ఇది అర్థంలేని లెక్క. 'రోజు' అనేది కాలమానం లోని అంశం. కాలమానానికి ఖగోళమే కదా ఆధారం! 3 భాగాల్ని కలిపి ఒక రోజుగా లెక్కించే విదేశీ పద్ధతిలో 'రోజు' అనే అంశానికి నిర్దిష్ట ఖగోళమానం లేదు. ''జనవరి 1వ తేదీ రాత్రి సమయం'' అని

చెప్పామనుకోండి. అది ఏ రాత్రి సమయం? ''డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గంటల తర్వాత వచ్చే రాత్రి భాగమా?'' లేక జనవరి 1వ తేదీ సూర్యాస్తమయం తర్వాత వచ్చే రాత్రి భాగమా?'' ఇటువంటి తికమక ఉంది ఇందులో! అప్పుడు తప్పని సరిగా టైము చెప్పవలసిన ఆగత్యం ఉంది.

హిందువులు అనుసరించే ''రోజు'' లెక్కింపు ఖగోళశాస్త్ర రీత్యా సక్రమంగా ఉంటుంది. సూర్యోదయం నుండి మళ్ళీ సూర్యోదయం అయ్యేవరకూ 1 రోజుగా లెక్కిస్తారు హిందువులు. ప్రాచీన కాలంనుండీ కూడా మన లెక్క ఇదే! సూర్యోదయంతో మొదలై 1 పగలూ, 1 రాత్రీ కలసి ''1 రోజుగా'' చెప్పడంలో ఒక నిర్దిష్టత ఉంది. (1 రాత్రిని మళ్ళీ రెండు భాగాలుగా విడగొట్టే అయోమయ పద్ధతి ఇందులో ఉండదు). ఫలానా తేదీ రాత్రి అని చెప్తే చాలు... మరో విధంగా పొరబడే అవకాశం లేదు. రెండు సూర్యోదయాల మధ్యకాలాన్ని 1 రోజుగా గణించడం, ఒక ఖగోళనాయమాన్ని పాటించ డంగా ఉంది. హిందూకాలమాన ప్రకారం ఈ విధంగా ఏర్పరచుకొన్న 'రోజు' ఖగోళ ధర్మా నికి అనుగుణంగానూ, అయోమయావస్థ లేకుండా నిర్దిష్టంగానూ కూడా ఉంది. (సూర్యోదయం నుండి సూర్యోదయం వరకూ లేదా సూర్యాస్తమయం నుండి మరో సూర్యాస్తమయం వరకూ ఉండే ''కాలం'' - ఎప్పుడూ ఒకే పరిమాణంలో ఉండదు. భూమి సూర్యుని చుట్టూ తిరిగే వేగం స్థిరంగా ఉండక పోవడం చేత ఈ పరిమాణం మారుతూ ఉంటుంది. అంటే సంవత్సరం లోని రోజుల పరిమాణాల్లో కొద్ది కొద్ది తేడాలుంటాయి. కానీ సంవత్సరం మొత్తం మీద సరాసరి కడితే, రోజు పరిమాణం 24 గంటలుగానే ఉంటుంది. దీన్ని 'సరాసరి సౌరదినం' అంటారు. రోజుల పరిమాణాల్లో చిన్న చిన్న తేడాలున్నా రోజంటే రోజే! దీనివల్ల కాలమానంలో మార్పేమీ రాదు)

విదేశీయులు అనుసరించే 'రోజు' లో ఒక నిర్దిష్టత ఉండదు. వారి లెక్కలో అర్ధరాత్రి 12 గంటలకు రోజు మారుతుందని అం టారు. రోజు ఆరంభానికి ఒక ఖగోళ మార్పు, ఒక ఖగోళ ప్రత్యేకతా ఉండాలి. (ఎందుకంటే కాలమానం ఖగోళపైనే ఆధారపడింది కనుక!) అర్ధరాత్రి 12 గంటల సమయంలో అంత రిక్షంలో గానీ, భూగోళంపై గానీ ఏమార్పూ జరగదు. ఏ ప్రత్యేకతా గోచరించదు. మనం తయారుచేసుకున్న గడియారాల్లో, వాచీల్లో అంకెలు చూపే ముళ్లు అర్ధరాత్రి సమయాన 12 పైకి చేరినంతలో ఏమౌతుంది? ఖగోళ పరంగా ఎక్కడా ఏ మార్పూ లేదు... రాదు! కాలం అలా మామూలుగా గడుస్తుంది. ఖగోళ ఆధారమూ, మార్పూ, ప్రత్యేకతా ఏదీ లేకుండా అర్ధరాత్రి 12 గంటలు కొట్టేసరికి రోజు మొదలయిందంటూ లెక్కించుకోవ డంలో శాస్త్రీయత లేదు. (డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గంటలు కొట్టేసరికి 'క్రొత్త సంవత్సరం వచ్చేసిందోచ్!' అంటూ పండుగ చేసుకోవడం ఇటువంటి పనే!)

హిందువుల 'రోజు' లెక్క చూడండి. ''ఒక పగలు+ ఒక రాత్రి+ 1 రోజు''. ఇలా ఒక వరుసలో క్రమంగా ఉంటుంది. మరియు రోజు మారడానికి చక్కటి ఖగోళ ఆధారం ఉంది. భూమిపై వెలుగునిండే సూర్యోదయ కార్యక్రమంతో దినారంభం అవుతుంది. అంతే గాని... మానవ నిర్మిత గడియారం 12 గంటలు కొడితే రోజు మారుతుందా? గడియారాలు ఆగిపోతే, రోజు మారకుండా ఆగిపోతుందా? .... ఆలోచించండి.

మూడు విధాలైన లెక్కల ప్రకారం హిందువులు ''రోజు''ను గుర్తిస్తూ ఉంటారు.

1) సూర్యోదయం నుండి మరుసటి సూర్యోదయం వరకూ గల కాలాన్ని 1 రోజుగా గుర్తించే విధానం.

2) తిథుల ప్రకారం గుర్తించే విధానం:

చంద్రునిలో ఒక ప్రక్క అర్ధగోళాన్నే మనం ఎప్పుడూ చూస్తుంటాం. రెండవ వైపు అర్ధగోళాన్ని మన భూమి మీద నుండి చూడలేం. ఆత్మభ్రమణం కారణంగా రోజు రోజుకూ చంద్రబింబం తరుగుతూ, అమా వాస్య రోజుకు పూర్తిగా మాయమై, మళ్ళీ పెరుగుతూ పౌర్ణమి నాటికి పూర్ణబింబం కన్పిస్తుంది. చాంద్రమాసాన్ని రెండు పక్షా లుగా విడదీశారు. (1) అమావాస్యనుండి పూర్ణిమ వరకూ శుక్లపక్షం. (ఈ పక్షంలో చంద్రుడు పెరుగుతాడు) (2) పూర్ణిమ నుండి అమావాస్య వరకూ కృష్ణపక్షం. (ఈ పక్షంలో చంద్రుడు తరుగుతాడు) అమా వాస్య నుండి అమావాస్య వరకూ గల 30 రోజుల్లో 360 డిగ్రీల కోణం పూర్తి అవు తుంది. అంటే రోజుకు 12 డిగ్రీల బింబం తరగడం లేదా పెరగడం జరుగుతుంది. అలా ఒక రోజులో జరిగే సైజు మార్పునే ''చంద్రకళ'' అంటాం. అలా ఒక 'కళ' మార్పు జరిగితే 1 రోజుగా లెక్కిస్తారు హిందువులు. దాన్నే ''తిథి'' అంటారు.

(సశేషం)

## సందేహాలకు సమాధానాలు

నిర్వహణ: ఋషిపీఠం




**టి.కె.సతీష్ — నంద్యాల**

ప్ర. ఆంజనేయస్వామికి 'బజరంగబలీ' అనే పేరు ఉంది కదా! ఈ పదానికి అర్థం ఏమిటి?

జ. 'బజరంగబలీ' అనేది సరైన మాట కాదు. సంస్కృతంలోని 'వజ్రాంగబలీ' అని ఆంజనేయుని పేరు. వజ్రమువలె దృఢమైన దేహం కలిగిన బలశాలి అని ఈ పదానికి అర్థం.

ఉత్తర భారతంలో, అక్కడి భాష ప్రకారం 'వ' కాస్తా 'బ'గా మారి 'బజ్రాంగబలీ' (బజ్‌రంగ్‌బలీ) అయ్యింది. మళ్లీ మన వైపు వచ్చి 'బజరంగబలీ'గా మారింది. దీని అసలు రూపం - 'వజ్రాంగబలీ'.

**జి.నందు — అనంతపురం**

ప్ర. రావణుడు చనిపోయేటప్పుడు కొన ప్రాణంలో ఉండగా, లక్ష్మణుని అతనివద్దకు పంపి రాముడు రాజనీతిని నేర్చుకోమని చెప్పాడని ఒక సందర్భంలో విన్నాను. నిజమేనా "మంచిని వాయిదా వేయకు, చెడు ఆలోచన అమలు చేయడానికి తొందరపడకు" అని అక్కడ రావణుడు చెప్పినట్లు కూడా విన్నాను.

జ. ఈ కథ ఏ రామాయణంలోనూ లేదు. లక్ష్మణుడు రావణునికి శిష్యరికం చేసి తెలుసుకోవలసిన రాజనీతి ఏదీ లేదు. అంతేకాక - 'మంచిని వాయిదా వేయకూడదు' లాంటి అతి సామాన్య విషయం, అంతిమ స్థితిలో వున్న రావణుని ద్వారానే వినడమనేది మరో హాస్యాస్పదం. రామలక్ష్మణులకు తెలియని రాజనీతి లేదు.

కొన్ని మంచి విషయాలను జన సామాన్యానికి అందివ్వడానికి ఇలాంటి పిట్ట కథలు పుట్టిస్తుంటారు. మనందరికీ రామలక్ష్మణ, కృష్ణాది పాత్రల పట్ల ఉన్న గౌరవం చేత ఆ విషయం బాగా హృదయానికి హత్తుకుటుందని వారి అభిప్రాయం కావచ్చు.

మనం వాటిని ప్రమాణంగా భావించవద్దు. పాత్రౌచిత్యాలు దెబ్బతినే కల్పనలు ప్రమాదకరాలే!

**పి.జయ — గుంటూరు**

ప్ర. ఒకే కథ ఒక్కొక్క పురాణంలో ఒక్కొక్కలా చెప్తుంటారు. ఎందుచేత? అంటే అవి జరగలేదని అర్థమా?

జ. ఇక్కడ రెండు పద్ధతులు ఉన్నాయి. ఒక కథ ఒక పురాణంలో చెప్పేటప్పుడు, అందులో చెప్పని కొన్ని వివరాలు, మరో పురాణంలో చెప్తారు. మరో విషయం... పురాణాల కథలు కల్పభేదాల బట్టి ఉంటాయి. కొన్ని చరిత్రలు ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్క విధంగానే ఉంటాయి. 'పద్మకల్పం'లో జరిగిన రామకథకీ, 'శ్వేతవరాహకల్పం'లో జరిగిన రామకథకీ కొన్ని తేడాలు, కొన్ని సామ్యాలు ఉంటాయి. ఇవి కల్పభేదాల ఫలితమే తప్ప, జరగలేదని అర్థం కాదు.

**సవరణ**

**ఏప్రియల్ 2000 సంచికలో 'పుస్తకపీఠం' శీర్షికలో 'అష్టాదశ పురాణకథా సర్వస్వము' వెల రూ.18/- అని పొరపాటున ప్రచురింపబడింది. దానిని రూ.180/-గా గ్రహించవలసిందిగా మనవి.**

**ఎ.రేవతి — కరీంనగర్**

ప్ర. శివపురాణాదులు శివుడే గొప్ప అనీ చెప్తాయి. దేవీ పురాణాలు దేవినీ, విష్ణు పురాణాలు విష్ణువనీ... ఇలా వేటికవే భిన్నంగా ఉంటాయి. ఇంతకీ ఎవరు గొప్ప?

జ. అందరూ గొప్పే. ఈ పురాణాలన్నీ ఒకే వ్యాసుడు సమకూర్చినవే. కనుక ఆ ఉద్దేశమేమిటో గ్రహించాలి. కొన్ని కొన్ని కల్పాలలో, పరబ్రహ్మ కొన్ని కొన్ని రూపాలతో సృష్టి స్థితి లయలకు పూనుకుంటారు. అందువల్ల ఇలా తేడాలు కనిపిస్తుంటాయి.

మరో కారణం - ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క దైవం ఒక్కొక్క ప్రయోజనం కోసం తన ప్రశస్తినీ, ప్రభావాన్ని ప్రకటిస్తుంది. "క్వచిత్ బ్రహ్మా, క్వచిత్ విష్ణుః, క్వచిత్ రుద్రః ప్రశస్యతే..." ఒకసారి బ్రహ్మ, ఒకసారి విష్ణుః, ఒకసారి రుద్రుడూ ప్రశస్తి పొందుతుంటారు. అన్ని పురాణాల్లో సర్వదేవతా సమన్వయం కనబడుతుంది కూడా.

**"త్వం బ్రహ్మ సృష్టి కర్తాచ త్వం విష్ణుః పరిపాలకః**
**త్వం శివశ్శి వదోనంతః" -**

అని ఒక పురాణంలో శివస్తుతి. మరో విష్ణుస్తుతుల్లోనూ ఇదే చెప్తారు. దేవీస్తుతులూ అంతే.

ఉపాసనాపరంగా మరో రహస్యం కూడా ఉంది. మనం ఎవరిని ఉపాసిస్తున్నామో వారిని ప్రధానంగా, ఇతరులను అంగములుగా భావించి ఉపాసించడం సంప్రదాయం. అంతమాత్రం చేత ఒకరు ఎక్కువా, ఒకరు తక్కువా అయిపోరు.

**ఆర్.ప్రభాకర్ — హైదరాబాద్**

ప్ర. శ్రీరాముని చేతివేళ్ళ వల్ల ఉడతకి మూడు

గీతలు ఏర్పడ్డాయనీ, అవి సీతారామ లక్ష్మణులకి చిహ్నాలనీ అంటారు కదా! మరి అంతకు ముందు ఉడతలకి ఆ గీతలు లేవా?

జ. ఈ ఉడత ఉదంతం ఎవరో భక్తుడు మధుర భావనగా చేసిన కల్పన. దీనిని అంత వరకే గ్రహించాలి. ఉడత సాయం, ఉడతా భక్తి - అనేది భక్తికి సంబంధించిన ఒక చక్కని కల్పన. అంతే. ఈ ఉదంతం నిజానికి జరగ లేదు. మూల రామాయణాలలో లేదు. వాటి గీతలు ప్రకృతిపరంగా వచ్చినవే. ఆ గీతలకీ, పురాణకథలకీ సంబంధం లేదు.

రామకిశోర్ విజయనగరం

ప్ర. తంత్ర ఉపాసన వల్ల భగవంతుని సాయుజ్యం సాధ్యమా?

జ. మంత్రం - యంత్రం... ఉన్నదే తంత్రం. మన పూజాదులన్నీ 'తంత్రం' కిందికే వస్తాయి. సృష్టిలో ఐహికావసరాల్ని అనేక పద్ధతుల్లో తీర్చుకోవచ్చు. భౌతిక ప్రయత్నాలతో పాటూ, సూక్ష్మ ప్రపంచంలోని శక్తుల సాయంతో కూడా నెరవేర్చుకోవచ్చు. అలా ఐహిక ప్రయోజనాల కోసం సూక్ష్మ శక్తుల సాయం తీసుకోవడమే తంత్రం. వాటిఉపాసన ఆ ఫలసిద్ధితోనే పరిపూర్తి అవుతుంది. పైగా - వామాచార పద్ధతుల్లో వెళితే తత్కాల ప్రయోజనమూ, అనంతర కాలవేదనే ఫలితం.

అలాకాక - ఉత్తమ శ్రేణికి చెందిన దివ్య మంత్రాలను ఉత్తమ గురువు ద్వారా ఉపాసిస్తే, అదీ ఫలాపేక్ష రహితంగా సాగిస్తే దేవత అనుగ్రహించి సాయుజ్యానికి అవసరమైన పరిపక్వతని ప్రసాదిస్తుంది. మంత్ర జపం వల్ల మంత్రదేవత ఫలితాన్నిస్తుంది. భక్తి చేత మాత్రమే 'మంత్ర ఉద్దేశ్య దేవత' అనుగ్రహిస్తుంది. కాబట్టి మంత్ర దేవత వేరు. 'మంత్ర ఉద్దేశ్య దేవత' వేరు. ఆ దేవత స్వచ్ఛమైన భక్తికే వశ్యం.

వి.రమేష్ హన్మకొండ

ప్ర. పడుకొనే గదిలో దేవుడి పటాలు ఉంచవచ్చా? ఒకే గదిలో కాపురం చేసేవారి విషయం ఏమిటి?

జ. పండుకొనే ముందే, పడుకొని లేచిన తర్వాత భగవంతుని తలచుకోవడం, ధ్యానించడం అవసరం. అందుచేత నిరంభ్యంతరంగా దేవుడి పటాలు, కేలండర్లు ఉంచవచ్చు. అయితే నిత్యం పూజించే దైవపీఠం పడక గదిలో ఉంచుకోకూడదు.

ఒకే గదిలో కాపురం చేసేటప్పుడు తప్పదు కనుక ఒక మూలన, శుద్ధిగా దేవుడి పీఠం ఉంచవచ్చు. వీలైన ఎత్తైన స్థలంలో.

జె.కృష్ణ రాజమండ్రి

ప్ర. భగవంతుని నామం ఏఏ సమయాల్లో, ఏ ఏ నియమాల్లో చేయాలి? వాటికి ఉపదేశం ఉండాలా?

జ. భగవన్నామ జపానికి ఇది సమయమనీ, ఇది నియమమనీ లేదు. సర్వకాల సర్వావస్థలలోనూ చేయవచ్చు. రామ, కృష్ణ, శివ, దుర్గ, లక్ష్మి, సరస్వతి వంటి ఏ నామమైనా, ఏ సమయంలోనైనా స్మరించవచ్చు. నియమాలూ, పద్ధతులూ మంత్రజపానికి మాత్రమే అవసరం.

నామజపానికి ఏ ఉపదేశాలూ అక్కర్లేదు. మంత్ర జపానికి మాత్రం ఉపదేశం అవసరం. సర్వకాల సర్వావస్థలలోనూ నామజపం చేయడం వల్ల భగవత్కృప తప్పక లభిస్తుంది.

ఎన్.శివప్రసాద్ పిఠాపురం

ప్ర. నేను రోజూ విష్ణు సహస్రం, శివసహస్రం చదువుకుంటూంటాను. అవి ఇంట్లో చదవకూడదనీ, ఏ దేవాలయాల్లోనే చదవాలనీ ఒకరన్నారు? మైల (అశౌచం) ఉన్నప్పుడు చదవవచ్చా?

జ. విష్ణు సహస్రం, శివసహస్రం నిరభ్యంతరంగా ఇంట్లో చదవవచ్చు. చదవరాదని ఏ శాస్త్రమూ లేదు. అయితే మైల (అశౌచం) ఉన్నప్పుడు మాత్రం చదవరాదు.

## మహాభారత ప్రశ్నోక్తి - 7కి జవాబులు

33. సంజయుడు: అరణ్య 1-64
34. కణికుడు దుర్యోధనునకు : కణికుడు శకుని యొక్క ఆప్తమంత్రి అతడు దుర్యోధనునకు ఉపదేశించిన నీతి కణిక నీతి. ఆది 6-100
35. అర్జునునికీ ఉలూచికీ పుట్టినవాడు. అలంబుసుడు. భీష్మ 3-105
36. తంత్రీపాలుడు
37. నిర్వేదం చెందని ఉత్సాహం
    ఆనిర్వేత శ్రియోమూలం లాభస్యచ శుభస్యచ
    మహాన్ భవత్యనిర్విణ్ణః సుఖం చానంత్య మశ్నుతే. సం - ఉద్యో - 39-58
38. ముగ్గురు 1.భీష్ముడు, 2.ద్రోణుడు. 3. కర్ణుడు
39. కర్ణునితో కర్ణుని జన్మను గురించి చెప్పి పాండవులను కలిస్తే యుద్ధం ఉండదని చెపుతాడు. కర్ణుడు తిరస్కరిస్తాడు.
40. గాంధారికి నమస్కరింపబోయినపుడు. కొడుకుల నందరినీ పాండవులు చంపారని కోపంతో ఉన్న గాంధారి దృష్టి పట్టాసందులోంచి ధర్మరాజు కాలిగోళ్ళ మీద పడింది. పతివ్రత అయిన గాంధారి కోపాగ్నికి అవి మాడిపోయాయి.
41. 1. ప్రజానాశనము
    2. కర్ణునివధవలన

**6 మే 2000 నుండి**
**5 జూన్ 2000 వరకు**

# ఈనెల విశేషాలు

## వైశాఖ వైశిష్ట్యం

### శ్రీ ఎస్. రామమూర్తి శర్మ

(మే 5 వైశాఖశుద్ధ పాడ్యమి మొదలు – జూన్ 2 వైశాఖ బహుళ అమావాస్య వరకు)

**ముఖ్యదినాలు**

**మే 2000**

| | |
|---|---|
| 6 | అక్షయ తృతీయ. |
| | పరశురామ జయంతి. |
| | సింహాచల చందనోత్సవం |
| 8 | ఆదిశంకరజయంతి. |
| 9 | త్యాగరాజ జయంతి |
| 10 | గంగోత్పత్తి |
| | విద్యారణ్యస్వామిజయంతి |
| 14 | ఏకాదశి |
| 17 | శ్రీనృసింహజయంతి |
| 18 | మహావైశాఖి |
| | అన్నమాచార్య జయంతి |
| 28 | శ్రీహనుమజ్జయంతి |

పవిత్రమైన మాసాలలో వైశాఖం ఒకటి. దీనిని 'మాధవ మాసం' అని కూడా అంటారు. విష్ణుప్రీతికరమైన రూపం ఇది.

### ✹ 6 అక్షయ తృతీయ.

ఇది పవిత్ర తిథి. ఈరోజున గంగా స్నానం, నదీ స్నానం సముద్రస్నానం శ్రేయస్కరం.

అంతేకాక – శ్రీకృష్ణునకు (విష్ణువునకు) ఈ రోజున చందనం పూయడం చాలా శుభఫలాలనిస్తుందనీ, విష్ణుసాలోక్యాన్ని ప్రసాదిస్తుందని ధర్మశాస్త్రవిషయం.

> ***యః కరోతి తృతీయాయాం***
> ***కృష్ణం చందన భూషితం।***
> ***వైశాఖస్య సితేపక్షే***
> ***సయాత్యచ్యుతమందిరమ్॥***

వైశాఖ శుక్ల తృతీయనాడు నారాయణు నికి చందనలేపనం చేయడంవల్ల విష్ణుమందిర వాసం లభిస్తుంది. ఈ కారణం చేతనే సింహా చలక్షేత్రంలో చందనోత్సవం ఈ తిథిని జరుగుతుంది.

ఈ రోజున కృతయుగమునకు ఆది.

పితృకర్మలు చేసే వాళ్లు ఈరోజున పిండరహితమûగ యాగాది శ్రాద్ధం చేయాలనీ, లేదా తిలతర్పణమైనా చేయాలని ధర్మశాస్త్ర నిర్ణయం.

ఈరోజున 'ఉభకుంభదానం' (నీటి కుండ దానం) చేయడం మంచిది.

చలువ కలిగించే పదార్థాలు – పానకం, వడపప్పు వంటివి విష్ణువునకు, వేదించడం; మామిడిపళ్లు, విసనకర్ర విష్ణుప్రీతిగా యోగ్యవిప్రునకు దానం చేయడం మంచిది.

ఈ దినమే పరశురామ జయంతి

### ✹ 8 ఆదిశంకర జయంతి

భారతీయ సనాతన ధర్మాన్ని ప్రతిష్ఠ చేసిన వ్యాసదేవుని తరువాత, అంతటి పూజ్యులు ఆదిశంకరులు. పాషండాది/అవైదిక మతాల నుండి, మన మతంలో చెలరేగిన శైవవైష్ణవ భేదాల దాడులనుండి సనాతనమైన వేదమతాన్ని సంరక్షించిన మహాత్ముడు. సాక్షాత్తూ శంకరుని అవతారం.

> ***శ్రుతిస్మృతి పురాణానాం***
> ***ఆలయం కరుణాలయమ్।***
> ***నమామి భగవత్పాదం***
> ***శంకరం లోకశంకరమ్॥***

అని ఈ జగద్గురువును స్తుతిస్తారు. ఉపనిషత్తులకు, భగవద్గీతకు, బ్రహ్మసూత్రాలకు, విష్ణుసహస్రనామాలకు భాష్యం వ్రాసి; అనేక స్తోత్రగ్రంథాలు, వేదాంతగ్రంథాలు రచించి, ''ప్రపంచసారతంత్రం'' – వంటి మహాగ్రంథాన్ని జగత్తుకు ప్రసాదించి ఆసేతు శీతాచలం ప్రయాణించి సనాతన ధర్మ ప్రతిష్ఠాపన చేసిన ఆదిశంకరాచార్యులను స్మరించడం, ఆరాధించడం (కనీసం ఈ తిథిని) ప్రతి భారతీయుని కర్తవ్యం.

### ✹ 9 త్యాగరాజ జయంతి

నాదోపాసక చక్రవర్తి మహావాగ్గేయ కారులు త్యాగరాజులవారు జన్మించిన తిథి ఇది.

### ✹ 10 గంగోత్పత్తి, విద్యారణ్యస్వామి జయంతి

గంగాదేవి జన్మించిన తిథి ఇది. ఈ రోజున గంగ పూజ, గంగాస్నానం విశేష ఫలప్రదం.

ఇదే తిథినాడు విద్యారణ్యస్వామి జన్మించారు. ఆదిశంకరుల పద్ధతిలో, సనాతనమైన మన మతాన్ని క్లుచ్ఛుల ఆక్రమణల నుండి కాపాడిన సిద్ధపురుషుడీయన. భారతజాతి ఋణపడిన మహాత్ముడు. ఈ

ఋషి వేదాలకు భాష్యం వ్రాయడమేకాక, హరిహర బుక్కరాయల ద్వారా, విద్యానగర (విజయనగర) రాజ్యాన్ని ప్రతిష్ఠించారు. ఆదిశంకరుల చరిత్రను ''శంకరవిజయం'' అనే పేరుతో రచించారు.

**✹ 14 ఏకాదశి**

వైశాఖశుక్ల ఏకాదశి విష్ణువునకు ప్రీతికరమైన ఏకాదశుల్లో ఒకటి. మహామహిమాన్వితమైనది. ఈ రోజున విష్ణుసహస్రనామ పారాయణ వంటివి మహాఫలప్రదం.

మరుసటిరోజు (15వ తేదీ) వచ్చే ద్వాదశి కూడా దివ్యమైన తిథి.

***వైశాఖమాసే ద్వాదశ్యాం***
***పూజయేన్మధు సూదనం ।***
***అగ్నిష్టోమ మవాప్నోతి***
***సోమలోకం సగచ్ఛతి ॥***

వైశాఖమాస ద్వాదశి నాడు మధుసూదనుని పూజించినవారికి, యజ్ఞాలు చేసిన ఫలం లభిస్తుంది అని ధర్మశాస్త్ర వచనం.

**✹ 17 శ్రీనృసింహజయంతి**

దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు నారాయణుడు నృసింహస్వామిగా ఆవిర్భవించిన దివ్యదినమిది. నృసింహోపాసన సర్వశ్రేష్ఠమైనది.

ఈరోజున ప్రహ్లాదచరిత్ర పఠనం, నరసింహార్చన చేయాలి సర్వగ్రహ దోషాలు పోగొట్టి, జ్ఞానానందాలను ప్రసాదించేది నరసింహార్చన.

**✹ 18 మహావైశాఖి**

**అన్నమాచార్య జయంతి.**

వైశాఖపూర్ణిమికి చాలా వైశిష్ట్యం ఉంది. ఈ రోజున విష్ణుపూజ తప్పనిసరిగా చేయాలి. జల కుంభదానాదులు ఈ దినాన విశిష్ట ఫలప్రదం.

ఈ పుణ్యతిథినాడే మహావాగ్గేయకారుడు, పదకవితామహుడు అన్నమాచార్య జన్మించాడు.

32,000 కీర్తనలతో తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామిని అర్చించిన ఈ మహాత్ముని రచనలు వేదవేదాంత పురాణాది విషయాలకీ, అద్భుత కవితా రీతులకీ నిధులు.

శ్రీనివాసుని నందకాంశంగా జన్మించిన ఈ సంకీర్తనాచార్యులు మనందరికీ పూజ్యులు. విష్ణుధర్మాన్ని వేనోళ్ల చాటిన ధన్యాత్ముడాయన.

**✹ 28 శ్రీహనుమజ్జయంతి.**

రుద్రాంశసంభూతుడైన ఆంజనేయుని జన్మదినమిది. సర్వాభీష్టప్రదాయకుడై ఈ స్వామిని సింధూరాదులతో అర్చించి, స్వామి అనుగ్రహాన్ని పొందడానికి ఈ తిథి విశిష్ట. ✦

# మన పద్యం



**తనరన్ కాయము చేత రామచరణద్వంద్వైక దాస్యంబు, హె**
**చ్చిన భక్తిన్దగు వాక్కుచే ననిశమున్ శ్రీరామనామ ప్రకీ-**
**ర్తనమున్, జిత్తము చేత రామపరతత్త్వ ధ్యానముంజేయు శ్రీ-**
**హనుమంతున్ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధింపగన్**

ఇది ప్రసిద్ధమైన వేదాంత కావ్యం ''శ్రీ సీతారామాంజనేయ సంవాదము''లోని ఇష్టదేవతా ప్రార్థనలలోనిది.

ఈ కావ్యకర్త శ్రీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి.

''కాయము (శరీరం)తో శ్రీరాముని పాదాలను కొలుచుకొంటూ, మాటతో శ్రీరాముని సంకీర్తిస్తూ, చిత్తంతో శ్రీరాముని పరతత్వాన్ని ధ్యానిస్తూ - త్రికరణముల (మనసు, మాట, చేత) తో ఉత్కృష్టమైన భక్తితో రాముని ఆరాధించే శ్రీహనుమంతుని సమగ్రంగా ఆశ్రయిస్తున్నాను. ఈ ఆశ్రయ ఫలంగా నా అభీష్టార్థములు సిద్ధించుగాక!''

# ఆప్తవాక్యం

## అర్చత ప్రార్చత ప్రియ మేధాసో అర్చత

**ఓ ప్రియమైన మేధావులారా! భగవంతుని అర్చించండి. (ఉపాసించండి). విశేషంగా అర్చించండి - ఋగ్వేదం**

మానవుడైనవాడు చేయాల్సిన యజ్ఞాలలో 'దేవయజ్ఞం' ప్రధానం. దేవతలకృపలేనిదే మనుగడ లేదు. జీవుడు తన కర్మఫలానికి అనుగుణంగా దేవతాశక్తులు నిండిన శరీరాన్ని సంపాదించుకుంటాడు. ఆయా కర్మలకు ఆయా దేవతల అనుగ్రహమే, ఆయా ఇంద్రియాల శక్తులు.

సూర్యునినుండి చూపు, వాయువు నుండి ఘ్రాణం, వరుణునినుండి రుచి, అగ్ని నుండి వాక్కు, ఇంద్రునినుండి హస్తాలు.... ఇలా ఒక్కొక్క అవయవంలో ఒక్కొక్క దైవశక్తి ఉంటుంది. వీటన్నిటినీ శాసించే బుద్ధివద్ద నాడీమండలంలో ఆయా దేవతాస్థానాలున్నాయి.

మన శరీరాన్ని మనం నిర్మించుకోలేదు. దానిని నియమించడమే మనచేతిలోది. కనుక దానిలోనున్న భౌతిక వివరాలే మనకు తెలియవు. అవి తెలియాలంటే సూక్ష్మమైన భౌతిక వైజ్ఞానిక సాధనాలు కనిపెట్టాం.

వాటిని శాసించే దైవిక శక్తుల్ని తెలుసుకునేందుకు మరో సూక్ష్మ విజ్ఞానం ఉంది. దానిని వేద సంస్కృతి బోధిస్తుంది.

మొత్తానికి దేవతల వలన కలిగిన ఈ దేహం కృతజ్ఞతాపూర్వకంగా దేవతల్ని అర్చించాలి. అదే యజ్ఞం. ఈ యజ్ఞమే సమస్త ప్రపంచాన్ని సక్రమంగా నడిపే సాధన. అందుకే 'యజ్ఞో భువనస్య నాభిః' అని శ్రుతి చెప్తోంది.

దేవతాశక్తులన్నిటికీ మూలమైన పరబ్రహ్మాన్ని శివునిగానో, విష్ణువుగానో, జగదంబగానో భావించి పూజించే విధానం మన నిత్యజీవితంలో నిబద్ధీకరించారు ఘన పెద్దలు.

అయితే కాస్త మేధావులమనుకున్న వారు - ఈ పూజలన్నీ తక్కువస్థాయికి చెందినవిగా భావించి, తమ మేధస్సే గొప్పదని వీటిని నిరసిస్తారు. అటువంటి వారిని సున్నితంగా మందలిస్తూ శ్రుతిమాత ఇలా బోధిస్తుంది.

మనమెంత జ్ఞానులమైనా, మేధావులమైనా అనేక జన్మల కర్మబంధాలు మనకు ఉన్నాయి. అవి వాసనారూపంగా మన చిత్తంలో ఉంటాయి. అవి సమసిపోతేగానీ శుద్ధజ్ఞానం రాదు. మేధస్సువేరు - శుద్ధజ్ఞానపూర్వకమైన ఆనందానుభవం వేరు. మేధస్సు అనేక విషయాన్ని పోగుచేయగలదు. కానీ సత్యసాక్షాత్కారం దానివల్ల కాదు.

కాబట్టి కర్మవాసనాక్షయం కావాలంటే భగవత్కృపకావాలి. భగవద్భావన హృదయానికి పట్టడమే భగవత్కృప. ఆలోచించి నిర్ణయించే బుద్ధికి, ఆరాధించి ఆనందించే హృదయమూ కలవాలి. అప్పుడే జీవనం సక్రమమవుతుంది.

ఎన్ని కర్మవాసనలు పోగైనాయో మనకు తెలియదు, ఎన్ని ప్రాకృతిక శక్తులకూ, జీవకోటికీ మనం ఋణగ్రస్తులమో మనకు తెలియదు. ఆవాసనలన్నీ తొలగాలి, ఆ ఋణాలన్నీ తీరాలి. అది బుద్ధిశక్తులవల్ల జరగదు. ఈశ్వరార్చన వల్లనే సాధ్యమవుతుంది.

మనకున్న శారీరక ఉపకరణాలు, అంతఃకరణం - వీటిలోనున్న దైవీశక్తులను గుర్తించి; వీటిని శాసించే దేవదేవతత్త్వాన్ని ఉపాసించాలి.

బుద్ధికున్న శక్తి పరిమితం. దాని శారీరక హద్దులు, శక్తిపరమైన హద్దులు స్వల్పం. అందుకే యోగంతో శరీరశక్తిని వృద్ధిచేసుకుంటారు. తపస్సుతో మనశ్శక్తిని పెంచుకుంటారు.

సత్యసాక్షాత్కారం బుద్ధికి అందదు. ఆలోచన, అధ్యయనం ఒక విధమైన అవగాహనని ఇస్తుంది. అంతే పరిపూర్ణ జ్ఞానానికి అదిచాలదు. ఉపాసనబలం వల్లనే అనేకరహస్యాలు అవగతమవుతాయి.

ఏ పుస్తకమూ, ఏ ప్రవచనమూ చెప్పలేని రహస్యాలు ఈశ్వరకృప వల్ల మాత్రమే స్ఫురిస్తాయి.

మేధస్సుకి, ఉపాసన తోడైతే తాను తరించి, పదిమందినీ తరింపజేయగలడు.

భగవదర్చన లేనివాడు తరించడం పూర్తిగా అసాధ్యం - అని వేదహృదయం.

అంతేకాక భగవదుపాసనలోని అంతరార్థం బుద్ధిపక్వత ఉన్నవారికే అర్థమవుతుంది. కాబట్టి వారిని ఉద్దేశించి చెప్పిన వాక్యంగా కూడా దీనిని భావించవచ్చు. ✦

# MEMBERSHIP / REN WAL FORM

*Please fill in capital letters and mail to...*

**RUSHI PEETHAM PUBLICATIONS**
'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be a member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) ☐ 3 Years Rs 360/- (US $90) ☐

5 Years Rs 600/- (US $125) ☐ Donations Rs ........................

Iam paying by cheque/D.D.No.............................................drawn on

.......................................................................for Rs..........................

date..............Favouring Rushi Peetham Publications.

Name : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

Sex : Male ☐ Female ☐ Age ☐

Address : ☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐☐

City : ☐☐☐☐☐☐☐☐☐☐☐ Pin : ☐☐☐☐☐☐

Subscribers No : (Incase of Renewal) :

Education : School ☐ College ☐ Graduate/Post Graduate ☐

Business ☐ Employed ☐ Retired ☐

**P.T.O.**

Please mention Addresses or E-mail of your Nearest & Dearest who have interest in Rushi Peetham, Bharatheeya Manasa Patrika

1. ..........................................................................................

..........................................................................................

2. ..........................................................................................

..........................................................................................

3. ..........................................................................................

..........................................................................................

4. ..........................................................................................

..........................................................................................

5. ..........................................................................................

..........................................................................................

6. ..........................................................................................

..........................................................................................

7. ..........................................................................................

..........................................................................................

8. ..........................................................................................

..........................................................................................

9. ..........................................................................................

..........................................................................................

10..........................................................................................

..........................................................................................

11..........................................................................................

..........................................................................................

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

Owned & Published by : **UPADRASTA SIVAPRASAD** From : No.6, 4th Floor, No:85, G.N.Chetty Road, T.Nagar, Chennai - 600 017.
Printed By : **V.C. Chermakani, Sakthi Process**, No. 21F Kumballamman Koil St., Chennai - 600 081. Edited by : **SAMAVEDAM SHANMUKHA SARMA**

# ‘ఋషిపీఠం’ సంస్కృతి సంఘం

## - నిర్వహణకు ఆహ్వానం

ఆర్ష (ఋషి) విద్యావ్యాప్తికి మాస పత్రిక నిర్వహణతోపాటూ, ఇతర ప్రచురణలు, ఆడియోలు వెలువరించడమే కాక – ఊరూరా సనాతన సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని వివిధ కార్యక్రమాల ద్వారా తెలియజేయాలని ఈ సంస్కృతి సంఘం సంకల్పం.

మన సనాతన భారతీయ ధర్మానికి వారసులైన, చిత్తశుద్ధి కలిగిన, ఆసక్తిపరులు తమ వివరాలను, పూర్తి చిరునామాను తెలియజేస్తూ ‘ఋషిపీఠం’కి వ్రాయండి. వారిలో ఎంపిక చేసిన వారిని ఆ ప్రాంతానికి ‘‘ఋషిపీఠం సంస్కృతి సంఘ ప్రతినిధి’’గా గౌరవించి, సంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ బాధ్యతను ‘‘ఋషిపీఠం’’ – అప్పగిస్తుంది.

ఆ సంఘంలో సభ్యులను చేర్పించడం ‘ఋషిపీఠం’ లక్ష్యాలను చిత్తశుద్ధిగా, బాధ్యతాయుతంగా వ్యాప్తి చేయడం, కార్యక్రమ నివేదికలను క్రమం తప్పకుండా మాకు పంపడం ప్రతినిధికి తప్పనిసరి బాధ్యత.

ఈ సంస్కృతి సంఘ అభ్యున్నతికి వలసిన సహాయాన్ని అందజేసేవారు ఆ ప్రతినిధికిగానీ, ‘ఋషిపీఠం’కి నేరుగా గానీ విషయం తెలియజేయవచ్చు. ఋషిసంస్కృతిపట్ల నిష్ఠ, ధర్మదృష్టి, చిత్తశుద్ధి – ఇవే ఈ సంస్కృతి సంఘం ప్రాతినిధ్యానికి కనీసార్హతలు.

ఉత్సాహవంతులైన వారు ‘‘ఋషిపీఠం – భారతీయ మానస పత్రిక ’’ చిరునామాకు వివరాలతో సహా ఉత్తరం వ్రాయండి.

- సంపాదకుడు

RNI. No. : TNTEL/1999/92
Postal Regn.No. TN/Chief Pmg-30/2000

# ఋషిపీఠం

## భారతీయ మానస పత్రిక

జూన్-2000
రూ-10/-



శ్రీమత్పయోనిధినికేతన! చక్రపాణే!
భోగీంద్ర భోగ మణిరంజిత పుణ్యమూర్తే।
యోగీశ శాశ్వత శరణ్య! భవాబ్ధి పోత!
లక్ష్మీనృసింహ! మమదేహి కరావలంబమ్ ॥



''శ్రీమంతమైన క్షీరసాగరాన్ని నివాసంగా చేసుకున్న చక్రహస్తా! సర్ప రాజమణులచే ప్రకాశిస్తున్న పుణ్యమూర్తీ! (నరసింహునికి గొడుగులా సర్పరాజు పడగలుంటాయి) వాటి మణుల ప్రకాశాల నడుమ దీపిస్తున్న మూర్తీ! యోగీశ్వరులు శాశ్వతంగా శరణు వేడే స్వామీ! సంసార సముద్రాన్ని దాటించే నావ వంటి వాడా! లక్ష్మీనృసింహా! నాకు చేయూతనీయుమా''. ఇది ఆదిశంకరులు విరచించిన 'లక్ష్మీనృసింహ కరావలంబన స్తోత్రం' లోనిది.

# నమస్సు

**శంఖం చక్రం చ చాపం పరశుమసిమిషుం శూలపాశాంకుశాగ్నీన్**
**బిభ్రాణం వజ్రఖేటౌహలముసలగదా కున్తమత్యుగ్ర దంష్ట్రం ।**
**జ్వాలాకేశం త్రినేత్రం జ్వలదనలనిభం హారకేయూరభూషం**
**ధ్యాయేత్ షట్కోణసంస్థం సకలరిపుజనప్రాణసంహారచక్రమ్ ॥**

భగవంతుని ఆయుధాలు కేవలం ఉపకరణాలు మాత్రమే కావు. అవీ దేవతా స్వరూపాలే. అదేవిధంగా నారాయణుని ఆయుధమైన సుదర్శన చక్రానికి అధిష్ఠానమైన సుదర్శన దేవతా స్వరూపం ఈ శ్లోకంలో ఆవిష్కృతమయ్యింది.

''షట్కోణంలో నున్న చక్రదేవుడు – శంఖం, చక్రం, ధనుర్బాణాలు, గొడ్డలి, కత్తి, శూలం, పాశం, అంకుశం, అగ్ని, వజ్రం, ఖేటం, నాగలి, ముసలం, గద, కున్తం.... అనే ఆయుధాలు ధరించి ఉన్నాడు. అత్యుగ్రమైన దంష్ట్రాలతో, జ్వాలామయమైన కేశాలతో, మూడు కన్నులతో, అగ్నిసదృశతేజంతో, హారకేయూరాద్యలంకారాలతో ప్రకాశిస్తున్నాడు. సకలశత్రుసంహారకమైన ఈ సుదర్శన దేవుని ధ్యానించాలి.''

ఈ దేవతామూర్తుల ఉపాసన, మంత్ర, యంత్రాదులు కూడా శాస్త్రాలలో చెప్పబడ్డాయి. ధ్యానించి, స్తోత్రాదులతో నమస్కరించినా ఈ దేవతలు రక్షించి అనుగ్రహిస్తారు.

ఋషిపీఠం
జూన్ 2000

# ఋషిపీఠం

భారతీయ మానసపత్రిక

జూన్ 2000

సంపుటి 1 సంచిక 11

వ్యవస్థాపక సంపాదకుడు :
**సామవేదం షణ్ముఖశర్మ**

ప్రచురణకర్త
**ఉపద్రష్ట శివప్రసాద్**







చిరునామా : 'పార్క్‌వ్యూ', నెం.6, 4వ ఫ్లోర్, 85, జి.యన్.చెట్టి రోడ్, టి.నగర్, చెన్నై-600 017. ఫోన్ : 8281159

# ‘ధర్మం’ నుండి ‘మోక్షం’ వైపు

ఏ ప్రశ్నకైనా సమాధానం చెప్పేవాడికి ఆ విషయంపై పరిజ్ఞానం, చిత్తశుద్ధి ఎంత అవసరమో; ప్రశ్నించే వాడికికూడా అటువంటి అవసరమైన కొన్ని అర్హతలుండాలి.

‘ప్రశ్న’ అనేది ఏదో కాలక్షేపానికి పుట్టేది కాకూడదు.

మనలో చాలామంది ఒక నలుగురు కలిసినప్పుడో, లేదా ఏదో ప్రయాణం చేస్తున్నప్పుడో కాలక్షేపంకోసం కొన్ని చర్చలు లేవదీస్తాం. కాస్త పండితుడులాంటివాడు కనబడితే, అద్వైతమో, ద్వైతమో, ఉపనిషత్తో లాంటి విషయాలగురించి అడుగుతాం. పాపం-ఆయన ఉత్సాహంతో చెప్పడం ప్రారంభిస్తాడు. మనం వింటూ, వింటూ మధ్యలో ఏ వ్యాపార విషయమో, రాజకీయాంశమో ఎవ్వరైనా లేవనెత్తితే వెంటనే అటు చర్చని మళ్లిస్తాం. అ వేదాంతవిషయం అక్కడికాగి పోతుంది. ఆ పండితుడు బిక్కమొహం వేస్తాడు.

ముఖ్యంగా - ఆధ్యాత్మిక విషయాలపై ప్రశ్నించడానికి కేవలం కుతూహలం, ఉత్సుకత సరిపోదు. ఒక తపన, ఒక అన్వేషణ, ఒక మథన, ఒక జ్ఞానతృష్ణ... ఇవన్నీ కలిసిన ప్రశ్న సమాధానాన్ని సాధించితీరుతుంది. ఆ తెరుచుకున్న మనసులోకే జ్ఞానదీధితి ప్రవేశిస్తుంది.

అంతర్నిరంతర మనింధన మేధమానే...'' అని వేదం చెప్పినట్లుగా, నిరంతరం ఎడతెరిపి లేకుండా అంతరంగంలో మథనమయ్యే ‘అనింధనాగ్ని’ వంటి తపస్సుతో సాధించిన సత్యాన్ని... మనం టీ కప్పుల చర్చలో తేల్చుకుందామనుకోవడం ఎంత దుస్సాహసం!

ఆదిశంకరులు వంటి మహాత్ములు తపస్సుతో, ఉపాసనతో, వివిధ శాస్త్రజ్ఞానాలమథనతో ఆవిష్కరించిన గొప్పవిషయాలను... ఏమాత్రం అనుష్ఠానమూ, శ్రద్ధాలేకుండా మన ‘పిచ్చాపాటి’ మాటల్లో తేల్చేసుకుందామనుకోవడం ఎంతటి దుర్విదగ్ధత!

విషయంపట్ల వినీతులమై, శ్రద్ధాభక్తుల్ని ప్రకటించగానే... ఆ జ్ఞానం మనల్ని అనుగ్రహించడం ప్రారంభించిందనే అర్థం.

అందుకే మనవారు సద్గ్రంథాలపారాయణం అనే సంప్రదాయం ప్రవేశంపెట్టారు. ఆ గ్రంథాలను అత్యంత భక్తిశ్రద్ధలతో కూడిన ఏకాగ్రతతో, ఆరాధనతో చదివినప్పుడే బుద్ధికి అవగాహనమవడమేకాక, ఆ అక్షరదేవతలు అనుగ్రహించి తమ అంతర్యాన్ని మన అంతరంగంలో ఆవిష్కరింపజేస్తారు. పూర్వపు రోజుల్లో ‘వేదాంత శాస్త్రాన్ని’ మడికట్టు కొని చదివేవారు. అలా అధ్యయనం చేయాలని శాస్త్రవచనం. అలాకాక మనం సమయాన్ని గడిపేయడంకోసం వాటిని పట్టుకుంటే, ప్రయోజనం శూన్యం.

✦ ✦ ✦

అంతేకాక - ప్రధానంగా ‘‘ఆత్మవిద్య’’ విషయంలో గ్రహించడానికి ఇంకా చాలా అర్హతలు చెప్పారు పెద్దలు. అంటే చతుర్థపురుషార్థమైన ‘మోక్షం’ సాధించేందుకు కావలసిన జ్ఞానాన్ని సముపార్జించాలంటే ప్రధానమైన అర్హతలున్నాయన్నమాట.

అందుకే - ‘అథాతోబ్రహ్మజిజ్ఞాసా’- అని మొదటి సూత్రంగా ‘బ్రహ్మసూత్రాలు’ పేర్కొన్నాయి. ‘ఇక ఆతరువాత బ్రహ్మజిజ్ఞాస’. దేని తరువాత? ‘అధికారం సంపాదించుకున్న తరువాత’ - అని అర్థం. అధికారం అంటే ఏమిటి? సాధన చతుష్టయసంపత్తి - సమకూరడమే అధికారం. అది - 1. నిత్యానిత్య వస్తువివేకం - ఏది నిత్యం? ఏది అనిత్యం? అనే వివేకం ఏర్పడాలి. 2. ఇహాముత్రార్థ భోగవిరాగం - ఇహలోక సుఖాలమీద, పరలోక సుఖాలమీద పరమ విరక్తి, 3. శమదమాది సంపత్తి - అంతరింద్రియ బహిరింద్రియనిగ్రహాదులు, 4. తితీక్ష - తీవ్రమైన మోక్షకాంక్ష. ఈ నాలుగూ ఉంటేనే అప్పుడు మోక్ష విద్య - ఆత్మవిద్య - గురించి తెలుసుకోవడం ప్రారంభించాలి. అదీ శ్రోత్రియుడు (శ్రుతి - వేదం. వేదమార్గ పరాయణుడు), బ్రహ్మనిష్ఠుడైన గురువువద్దకు సమిధలు చేత ధరించి (సమిత్పాణిః) వెళ్లి, శరణువేడాలి. ఆ ప్రశ్నను ‘‘పరిప్రశ్న’’ అంటారు. అప్పుడే ఆ గురువు ఆ కర్మసమిధులను దగ్ధంచేసి మోక్షవిద్యాప్రవేశాన్ని కల్పిస్తాడు.

ఇదీ చతుర్థపురుషార్థాన్ని గ్రహించే పద్ధతి. కనుక మోక్షం గురించి తెలుసుకునేందుకు ఎంత వరకు అర్హులమో ఎవరికి వారు గ్రహించాలి. అసలు మోక్షం అంటేనే అవగాహనలేని స్థితిలో ఉన్నవారే చాలామంది.

ఇంతవిషయం ఉండగా - ఉపనిషత్తులన్నిటినీ బహిరంగ ఉపన్యాసాలుగా, ప్రసంగకాలక్షేపాలుగా చేయడం ఎంత హాస్యాస్పదం! మోక్షవిద్య గురుశిష్యుల మధ్య ఒక పాఠంగా, ఏకాంతంగా సాగవలసిన సాధన. అంతేగానీ ఉపనిషత్తులగురించి ఉపన్యసించినంత మాత్రాన చాలదు. భాష్యప్రవచనాలు పట్టుకుని కంఠస్థం చేసినా ప్రయోజనం లేదు. ముందు ఈ మానవాళికంతటికీ తెలియజేయాలంటే - ప్రథమ పురుషార్థమైన ధర్మాన్ని గురించి అవగాహన కలిగించాలి. ఇప్పుడు మృగ్యమౌతున్నది ఈ ‘ధర్మస్పృహ’.

అసలు ధర్మాన్నే విడిచిపెట్టి, సర్వాతీతమైన వేదాంత శబ్దాలను చెవినిపెట్టుకుంటే, వాటిని విపరీతంగా వ్యాఖ్యానించుకుని ఆచార

సంప్రదాయస్వరూపమైన ప్రాథమికమైన ధర్మాన్నే విడచిపెట్టే ప్రమాదముంది. ధర్మమే లేనప్పుడు మోక్షం గురించి ప్రశ్నేలేదు. మోక్షం పట్ల గౌరవం అందరికీ ఉండవచ్చు. తత్సంబంధమైన వేదాంతవిద్యా గ్రంథాలనీ చదవవచ్చు. సర్వులలోనూ ఒకే బ్రహ్మమున్నాడని అనుకోవచ్చు. కానీ బ్రహ్మమంటే ఏమిటో తెలిస్తేకదా - సర్వత్రా అతడున్నాడని తెలిసేది.

ముందుగా - మనకి అర్థకామాలపై ఆసక్తి ఉందా లేదా? అని నిజాయితీగా ప్రశ్నించుకోవాలి. ఆసక్తి లేకపోయినా 'అవసరం' ఉన్నదీ లేనిదీ తెలుసుకోవాలి. అర్థకామాలతో అవసరం ఉన్నంతకాలం 'ధర్మం' ప్రధానం. ధర్మం కర్మమయం. నిజంగా మోక్షం కావాలంటే పరంపరాప్రాప్తమైన ధర్మాన్ని (కర్మని) అనుష్ఠించితీరాలి. తద్వారా అర్థకామసంపాదన సాగాలి. 'చిత్తస్య శుద్ధయే కర్మ' - సత్కర్మాచరణ వల్ల చిత్తశుద్ధి. తద్వారా మోక్షాకాంక్ష. అనంతరం గుర్వనుగ్రహం.

కనుక అందర్నీ ధర్మాచరణవైపు ప్రేరేపించేందుకే ఆర్షవాఙ్మయాన్ని ప్రచారం చేయాలి. ధర్మం, భక్తి... ఇవే బహిరంగంగా ప్రచారం చేయగలిగేవి. వీటితో సమాజంలో సువ్యవస్థ వస్తుంది. అలా కాకుండా - అర్థం కాని పడికట్లతో వేదాంతవిద్యని బహిరంగంగా చెప్పినంత మాత్రాన ప్రయోజనం లేదు.

**అకృత్వావృత్తివిలయం అజ్ఞాత్వా బ్రహ్మమవ్యయమ్ ।**
**'అహంబ్రహ్మాస్మి' యోబ్రూయాత్ తస్యజిహ్వాం వికర్తయేత్ ॥**

ఇంద్రియవృత్తుల్నీ లయం చేయకుండానే, బ్రహ్మాత్వాన్ని అనుభవం పూర్వకంగా గ్రహించకుండానే, ''అహం బ్రహ్మాస్మి'' అని అన్నవాడి నాలుకని కత్తిరించేయాలి... అని కఠినంగా శాసించారు వేదాంతవిద్యాగురువులు.

అమ్మ, నాన్న, అక్క, చెల్లి, అన్న, తమ్ముడు, గురువు, శిష్యుడు, స్నేహితులు... ఇలా మానవసంబంధాలలో ఉన్నప్పుడు ఆయాధర్మాల్ని పాటించాలి. దైవ పితృకర్మలూ, సదాచారం విడిచిపెట్టకూడదు. ఈ అంశాలపైన అవగాహన కల్పించి, ఆచరణలో నిష్ఠ కలిగించేందుకే ఆధ్యాత్మిక గురువులూ, పండితులూ ఉద్యమించాలి. ఇది కాదని - సర్వమూ మాయఅనీ, తమ పాండిత్యాన్ని ప్రకటించుకుంటూ, యోగమనీ, సమాధి అనీ ప్రజల్నివంచించడం పాపమే. ఒక్కొక్కరూ ఒక్కోపేరూ పెట్టుకొని, మన ధర్మాలను విసర్జింపజేస్తూ, పవిత్రమైన మన ఆర్షవిషయాలకు అర్థంపర్థం లేని వ్యాఖ్యలు చేస్తూ సంఘసంఘాలుగా ఏర్పడిపోతే - అవి సనాతన ధర్మం క్రిందికిరావు.

వేద, పురాణ, వేదాంత, ఇతిహాస, స్మృతి... ఇవన్నీ చెప్తున్న సాధనల క్రమపద్ధతిని గమనించాలి. ఎవరికి ఏది పద్ధతో గ్రహించాలి. మన మానసికస్థితిని అనుసరించి వేదం మార్గాలు ఏర్పాటుచేసింది.

ముముక్షువులైన వారు వేరు. లోకంలో ఏదో వేలు జరుగుతుందనో, కీడు తొలగుతుందనో ఆధ్యాత్మికత వైపు మళ్ళినవారు వేరు. ఈ రెండో తరహా వారివద్ద వేదాంతాలేవో చెప్పి, సంప్రదాయ ధర్మవాహిని నుండి ప్రక్కకి తిప్పి భ్రష్టత్వం పట్టించకూడదు.

స్వధర్మనిర్వహణ, భగవత్ భక్తి... ఈ రెండింటితో సమాజాన్ని పటిష్టం చేయాలి. కర్మ ప్రసక్తి లేని మోక్షసామ్రాజ్యం - సత్కార్మాచరణలో పండి గ్రహించిన స్థితి మాత్రమే. 'కర్మ మనల్ని విడిచిపెట్టాలి. మనం కర్మని విడిచిపెట్టరాదు.'

శౌచ, కర్మాదుల అవసరం లేదని చెప్పే ఏ మతమూ భారతీయ మతం కాదు. మోక్షకాంక్ష ఉంటే కేవలం బాధ్యతగా కర్మ చేయాలి. మోక్షేచ్ఛ లేకపోయినా, ఆసక్తితోనైనా (ధార్మికంగా) కర్మ చేయాలి. ఇదే భగవద్గీతా సారాంశం. ఆనాటి కాలంలో రామాయణ భారత భాగవతాదుల్ని, పురాణాల్ని ప్రచారం చేయడంలో మనవారి పరమోద్దేశమిది. దివ్యమైన భగవద్విషయాలను, ధర్మాచరణ రహస్యాలను వీటిద్వారా తెలియజేసేవారు. వేదాంతానికి కూడా తగిన విధంగా వాటిద్వారానే పునాది ఏర్పడేది.

''సత్యం వద, ధర్మం చర'', ''కురు కర్మైవ తస్మాత్ త్వం'' అంటూ ఉపనిషత్తులు కూడా కర్మను ప్రబోధించాయి.

అధర్మమన్నా, పాపమన్నా భయం. దైవం పట్ల విశ్వాసం, భరోసా, శ్రద్ధాభక్తులతో సంప్రదాయాచారణ... ఇవే ఇప్పుడు ప్రబోధించాల్సిన కర్తవ్యాలు.

ప్రపంచంలో అర్థకామాలే ఉంటాయి. అందుకే సమాజ నిర్మాణం. కనుక ధర్మాన్ని ప్రబోధించాలి. ఇది సామాజికం. మోక్షం వైయుక్తికం (వ్యక్తిగతం).

'ధర్మేచ - అర్థేచ - కామేచ నాతిచరామి' - అంటూ భార్యను సైతం ధర్మార్థ కామాలలో మాత్రమే సహచారిణిని చేశారు. మోక్షంలో మాత్రం 'నాతిచరామి' లేదు. మోక్షం ఎవరికి వారు సాధించవలసిందే. ధర్మాచరణతో పునీతమైన వ్యక్తి, అధికారం సంపాదించుకొని, ఆ దివ్యమైన ఆత్మవిద్యను గ్రహిస్తాడు.

అలాగని కేవలం 'కర్మరత్వ'మే బోధించమని కాదు. అందుకే ప్రక్కన దైవభక్తి ప్రస్తావన. ఆత్మవిద్యా విషయ గ్రంథాలు, అధ్యయనం అవసరమే. కానీ 'ధర్మం' అనే పునాది బలపడ్డాకే అన్నీనూ.



# "భృగు మహర్షి"

పురాణ వాఙ్మయంలో సుప్రసిద్ధుడైన భృగుమహర్షి కథ అనేక చోట్ల ప్రస్తావించబడింది.

లోక కల్యాణార్థం కశ్యపాదిమహర్షులు యజ్ఞంచేస్తుండగా, నారదుని మాటపై, యజ్ఞభోక్తను ఎంపిక జేసేందుకు భృగుమహర్షి ఉద్యుక్తుడయ్యాడు.

దేవతలలోకెల్లా శ్రేష్ఠులైన త్రిమూర్తుల్ని పరీక్షించేందుకు బయలుదేరి, బ్రహ్మశివులను పరీక్షించిన తరువాత, వైకుంఠ లోకానికి చేరాడు. అక్కడ శేషశాయిగా ఉన్న విష్ణువును చూసి, ఎంతపిలిచినా పలకకపోయేసరికి, ఉద్రేకంతో స్వామి వక్షఃస్థలాన్ని కాలితో తన్నాడు. దానితో నారాయణుడు చలించక, నిదురలేచి, చిరునవ్వుతో భృగువును ఆదరించి, స్వాగత వచనాలు పలికి సత్కరించాడు.

లక్ష్మీపతి భృగుపాదాలను కడిగి, కాళ్లు ఒత్తుతూ -"మునివరా! కోమలమైన మీ చరణ కమలాలు, కఠినమైన నావక్షస్థలాన్ని తాకి ఎంతనొచ్చుకున్నాయో!" అని పలికాడు.

నారాయణుని ఔదార్యాన్నీ, సాత్విక గుణాన్ని చూసి భృగువు విచలితుడై తనను మన్నించమని స్తోత్రం చేసి ప్రార్థించాడు. నారాయణుని దేవోత్తమునిగా నిర్ణయించి, యజ్ఞఫలాన్ని ఆ స్వామికి ధారపోశాడు.

ఈ భృగుమహర్షి బ్రహ్మదేవుని తొమ్మండుగురు మానసపుత్రులలో ఒకడు. సప్తర్షులలో ఒకడైన భృగుమహర్షి, ప్రజాపతుల్లో కూడా ప్రముఖుడు.

పరశురాముడు భృగుమహర్షివలన ప్రభావితుడై, ఆయన ఆజ్ఞపై శివునికోసం తపస్సుచేసి, అస్త్రవిద్యాసంపన్నుడయ్యాడు. భరద్వాజాది మహర్షులు భృగువు ద్వారా అనేక విజ్ఞానాలను సంపాదించినట్టుగా పురాణాల్లో పేర్కొనబడింది.

సుప్రసిద్ధుడైన చ్యవనమహర్షి భృగువు యొక్కకుమారుడే.

ప్రజాపతిదక్షుని కుమార్తె 'ఖ్యాతీదేవి' భృగువు యొక్క పత్ని. భృగుమహర్షి పుత్ర పౌత్ర పరంపర విస్తారమైనది. భృగు వంశంలో పుట్టిన వారందరూ 'భార్గవులు'గా ప్రసిద్ధులు. భృగువు, అతని వంశజులు చాలా మంది వేదాలలో అనేక మంత్రాలకు ద్రష్టలు.

ఋగ్వేదంలో ఉల్లేఖించిన ఉశనా (శుక్రాచార్యులు) మహర్షి భార్గవుడే. ఇతడు వైదికమంత్రద్రష్ట.

ఈవిధంగా భృగువంశస్థులైన వేనుడు, సోమహూతి, స్యూమరశ్మి, భార్గవుడు, ఆర్వి – మొదలైన మహర్షులు మంత్రద్రష్టలు.

జ్యోతిష విద్యలో కూడా భృగువు మహోన్నతుడు.

'భృగుసూత్రాలు' పేరుతో జ్యోతిశ్శాస్త్ర సారాన్ని రచించాడు భృగుమహర్షి. ధర్మశాస్త్ర ప్రవక్తగా భృగుమహర్షి పేర 'స్మృతి' ఒకటి ఉంది. ✷



# ఉభయభారతి

## జరిగిన కథ

మండనమిశ్రుడు పూర్వమీమాంసలో నిధి. ఆయన భార్య ఉభయభారతి శాస్త్ర చర్చల్లో మండన మిశ్రుడిని ఓడించడానికి ఆదిశంకరులు వస్తున్నారని వాళ్ళకి తెలుస్తుంది.

కోట్లకి పడగలెత్తిన వ్యాపారి సమరసేనుడు. తన మిత్రుడైన లవణగుప్తునితో వెళుతుండగా, ఆదిశంకరుల వారిని చూడడం తటస్థించింది. వారితో సంభాషించి, పరివర్తన చెందుతారు. మహిష్మతి మహారాజు అమరసేనుడు పదిమంది భార్యలతో వినోదిస్తుంటాడు. మండనమిశ్ర, శంకరులమధ్య వాదన కొనసాగుతుంటుంది.

# విశ్వనాథ పావనిశాస్త్రి

**6 ధారావాహిక నవల**

**మండన:** కాకపోయినా స్వామీ! కర్మ సమృద్ధిగా చెయ్యడానికి, జీవునియందు అధికారభావన కలిగించడం కోసం తత్త్వమసి చెప్పబడిందనుకోవాలి. మనోబ్రహ్మ, ఆదిత్యోయూపః అన్నప్పుడు మనస్సు బ్రహ్మ అవడంలేదు. ఆదిత్యుడు యూపమూ అవడం లేదు. 'మనో బ్రహ్మేతి ఉపాసీత' - 'ఆదిత్యో బ్రహ్మేతి ఆదేశః' అన్నచోటుకి వల్లేనే, మనస్సూ ఆదిత్యుడూ బ్రహ్మము కాకపోయినా బ్రహ్మ అనుకుని ఉపాసించమన్నట్టుగానే తత్త్వమసి కూడాను.

**శంకర:** మహాపండితుడా! 'మనో బ్రహ్మేతి ఉపాసీత' అన్నచోటా, ''ఆదిత్యో బ్రహ్మేతి ఆదేశః'' అన్నచోటా మనస్సునీ, ఆదిత్యునీ బ్రహ్మగా భావించమని స్పష్టంగా ఉంది, 'అహం బ్రహ్మాస్మి' అన్నచోటా ఆ బ్రహ్మ నువ్వు, నేనే ఆబ్రహ్మని అని స్పష్టంగా ఉంది. ఇవి జ్ఞానకాండలోనివి. ఈ రెంటినీ కలిపి ఎందుకు అనవసరంగా అయోమయం సృష్టించుకుంటావు?

**మండన:** అయోమయం కాదు స్వామీ! ఆ మాటలన్నీ ఉపాసనా పరమైనవే! అక్కడ విధి స్పష్టంగా ఉంది. ఇక్కడ లేదు. అంతే భేదం. అందుచేత విధి కల్పించుకోవలసిందే! ఉపాసించవలసిందే! ఉపాసన సంపద్రూపము, అధ్యాసరూపము, విశిష్టక్రియాయోగ నిమిత్తరూపము, కర్మాంగ రూపము అని నాలుగు విధాలుగదా!

| | |
|---|---|
| సంపద్రూపము | : అల్ప వస్తువును, గుణసామ్యం చేత, అధిక వస్తువుగా భావించి ఉపాసించడం. చెంబుతో గంగ తెచ్చుకుని, దాన్నే కాశీ గంగగా పూజించడం. |
| అధ్యాసరూపము | : అది కానిదానిని అదిగా భావించి ఉపాసించడం - విగ్రహారాధన వంటిది. |
| విశిష్టక్రియాయోగ నిమిత్తరూపము | : రెండు వస్తువులు చేసే పనిని బట్టి, ఆ రెండూ ఒకటేననుకుని ఉపాసించడం - జన్మనిచ్చిన తల్లిని సృష్టికారణమైన శక్తిగా పూజించడం. |
| కర్మాంగరూపము | : ఒక పనికి సాధనంగా ఉన్నదానిని ఉపాసించడం - ఆయుధ పూజ వంటిది. |

ఈ నాలుగు విధాలలో; కర్మాంగ రూపమైన ఉపాసకుణ్ణి - ఉపాస్యరూపమైన బ్రహ్మగా భావించి ఉపాసించమని ఈ 'తత్త్వమసి' వాక్యం చెపుతోంది. అంతే తప్ప, దానికి మీరు చెప్పే అర్థం కుదరదని నా భావన.

**శంకర:** మండన మిశ్రా! నువు చెప్పినట్టుగానే, విధిని కల్పించు కుని ఉపాసన ఆరంభిస్తే, ఆ ఉపాసన వలన కలిగిన ఫలితం స్వర్గంలాగా, అనుభవించగానే అంతమైపోతుంది గదా! నాశనమై పోయేదాన్ని బోధించడానికి వేరే జ్ఞానకాండ ఎందుకు? కర్మ పరిపాకం పొందినవాడు జ్ఞానవంతుడై, తనను తాను తెలుసు కోవడానికి ఋషులు దర్శించిన మార్గమే 'తత్త్వమసి' వంటి వాక్యాలు. మోక్షం నిత్యముక్తమైన ఆత్మ స్వరూపమే గాని, కర్మ జన్యం కాదు. కర్మ జన్యమైన ఫలితం....

ఉత్పాద్యము - వికార్యము - ఆప్యము - సంస్కార్యము అని నాలుగు విధాలు.

| | |
|---|---|
| ఉత్పాద్యము | : తయారుచేసినది. శిల్పము |
| వికార్యము | : రూపం మారినది. కుండ |
| ఆప్యము | : మరొకదానిని కలిసినది. పాలు, పెరుగు |
| సంస్కార్యము | : అవలక్షణాలు దిద్ది బాగుచేయబడినది. |

మోక్షం ఉత్పాద్యమంటావా? తయారైన ప్రతీదీ పాడైపోయేదే కదా! పాడైపోతే అది మోక్షం ఎలా అవుతుంది? వికార్యమం టావా? ఒకసారి మారిన రూపం, యింకోసారి యింకో రకంగా మారవచ్చు గదా! అదీ మోక్ష స్థితికాదే? పోనీ, ఆప్యమంటావా? కలిసిన దాని నుండి తిరిగి విడిపోవచ్చు గదా! అది మాత్రం మోక్షం ఎలా అవుతుంది? అయితే సంస్కార్యమంటావా? మరి కొన్ని అవలక్షణాలు మిగిలి మళ్ళీ బాగు చెయ్యవలసి రావచ్చు. అదీ మోక్షం అనిపించుకోదుగదా!

కాబట్టి కర్మజన్యమైన ముక్తి నిత్యం కాదు. అది కేవలం స్వర్గ సుఖాలవంటిది. 'బహుస్యాం ప్రజాయై' అని సంకల్పించిన బ్రహ్మే జీవుడు అన్న మహాజ్ఞానమే మోక్షము.

ఇది పదిరోజులు సాగిన శంకర మండనుల వాదన యొక్క పరమ సారాంశం.

## - 8 -

సభ ప్రారంభించిన మూడవరోజున, ఆషాఢశుద్ధ పంచమినాడు రాత్రి, అమరేశ్వరాలయ ప్రాంగణ మంటపంలో పద్మపాదుడు మొదలైన వాళ్లు కూర్చున్నారు. నైఋతి దిక్కున ఒక శిలా వితర్దిక మీద శంకరాచార్యుడు కూర్చుని ఉన్నాడు. సూర్యాస్త మయం అయి చాలా సేపయింది. ఆకాశం ఎరుపు విరిగి నీలానికి తిరిగింది. పశ్చిమాన చంద్రరేఖ బలం పుంజుకుంటోంది. ఎంత బలం పుంజుకున్నా, మరి కొద్దిసేపట్లో అస్తమించబోయే ఆ వెన్నెలలు మసక మసకగానే ఉన్నాయి. ఆ మసక వెన్నెలలు మన్మధుడి బాణాల్లాగా దూసుకొస్తున్నప్పటికీ, దూరంగా ఉన్న కొండలను ప్రకాశింపజేయలేకపోతున్నాయి. నర్మదానదీ జలాలపై పరుచుకున్న వెన్నెలలు, తుమ్మిపూలల్లే తళుక్కుమంటున్నాయి. ఆలయ సువర్ణకలశం మీద పడిన వెన్నెలలు పరావర్తనం చెంది శంకరాచార్యుని ముఖం మీద బంగారుకాంతితో ప్రకాశిస్తున్నాయి. ఆ కాంతిలో ఆయన ముఖం మన్మథ దహనానికి ముందు, మహా శివుడల్లే ఉంది. వెన్నెలలు తళుకుమంటున్న చిఱు అలలతో కదలాడే నర్మద తుమ్మిపూల ప్రవాహంలా దిగువకి సాగి అమరుకుని 'క్షీరచంద్రికా ప్రాసాదం' దగ్గర అదృశ్యమైంది.

మాయాదేవితోపాటు రాణులనందరినీ వెంటబెట్టుకుని ప్రత్యేకరథంలో అమరుకుడు అమరేశ్వరాలయం ముందు దిగాడు. ఆ జగద్గురువు ముందు తన రాజలాంఛనాలు ప్రదర్శించడం తప్పుగా భావించాడేమో, ఆ మహారాజు తాను వస్తున్నట్టు ముందుగా కబురుపంపలేదు.

రథం దిగుతున్న రాజుకి ఆలయంలోంచి శంకరాచార్యుని కంఠం వినిపిస్తోంది. ఆయన ఏవో శ్లోకాలు చదువుతున్నాడు. నిశ్శబ్దంగా ఆలయ ప్రాంగణంలోకి ప్రవేశించాడు రాజు. ఆయనతో పాటు అంత నిశ్శబ్దంగానూ రాణులు ప్రవేశించారు. అంతకన్న నిశ్శబ్దంగా ముందు యిద్దరూ, వెనక యిద్దరూ దివిటీలు పట్టుకున్న సేవకులు ప్రవేశించారు.

శంకరాచార్యుని కంఠం వినిపిస్తోంది:-

**న మే ద్వేషరాగౌ నమే లోభమోహౌ**
**మదోనైవ మే నైవ మాత్సర్యభావః ।**
**న ధర్మో నచార్థో న కామో న మోక్షః**
**చిదానంద రూపశ్శివోహం శివోహం ।**

అంతలో కామప్రేరితమైన ఒక అడవి నెమలి, ఆడనెమలిని తరుముతూ, ప్రాకారం బయటి నుంచి చేసిన ''కేక'' శంకరాచార్యుని కంఠశ్రుతిలో కలిసిపోయింది.

నర్మదాస్రుతిలో శ్రుతికలిసిన ఆచార్యుని కంఠం వింటూ అమరుకుడు అమరుడైపోయాడు. అతనిలోని వేదన శమించి మహా పరవశుడైపోయాడు. అంత పరవశ స్థితిలో రాజుని

పూర్వమెప్పుడూ చూడని మాయాదేవి నివ్వెరపోయింది. వైఖరి దిగ్భ్రాంతి చెందింది. వాళ్ళ భావాల కనుగుణంగా వాళ్ళ ఆభరణాలు కూడా కలవరపడ్డాయి. ఆ సన్నని సవ్వడికి దుర్జయాశ్రమగిరి మొదలైన వాళ్లు కళ్లు తెరిచారు. హఠాత్తుగా కనబడిన రాజుని ఎలా ఆహ్వానించాలో వారికి తెలియలేదు. కాని ఆ రాజు ముఖం చూస్తే, ఆయన ఈ లోకంలో ఉన్నట్టులేడు. ధర్మరక్షకుడైన రాజు వచ్చినపుడు లేచి నిలబడటం కనీసధర్మం. కాని ఆ రాజు చూపు శంకరాచార్యుని వైపు ఉంది. ఎవరికీ ఏమీ తోచలేదు. అందుచేత రాజుని గమనించనట్టే కూర్చున్నారు.

అంతలో శంకరాచార్యుని కంఠకుహరం నుంచి ఆకాశగంగ శివుని శిరస్సునకవతరించినట్లు, నందీశ్వరుడు నందినీ ధేనువు వెంట పరుగెత్తినట్లు, నారాయణ ఋషి ఎదుట రంభ నాట్యమాడినట్లు, మల్లికా కుసుమాల మీద తుమ్మెద ఆడినట్లు- మరొక శ్లోకం వెలువడింది.

**అహం నిర్వికల్పో నిరాకార రూపో**
**విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం ।**
**నచాఽ సంగతం నైవ ముక్తి ర్నబద్ధః**
**చిదానంద రూపశ్శివోహం శివోహం ॥**

శంకరాచార్యుని కంఠంలో క్రమంగా పాదుకట్టుకు పోయిన ఆ శ్రుతి పక్వతకి ప్రకృతి నిశ్శబ్దమైపోయింది. నర్మదా నది యొక్క ప్రవాహఘోషకూడా వినబడటం మానేసింది.

పగలంతా ఎగిరి అలిసిపోయిన ఒక పెద్ద గరుడ పక్షి లెక్కలారుస్తూ ధ్వజస్తంభం మీద వాలింది. ఆ వేగానికి ధ్వజ స్తంభం కదలాడి చిఱుగంటలు గలగలలాడాయి. ధ్యాన సమాధిలో శివాద్వైత భావన చేస్తున్న శంకరాచ్యాని పాదాల దగ్గర ఏదో కదలిక తోచింది. ఆ కదలిక పాద సమీపంలో కాక, తన సమాధి స్థితికి చేరువగా తోచి, సమాధి చెదిరి, ఆచార్యుడు కన్ను తెరిచాడు. పాదాభివందన స్థితిలో అమరుకుడు అగ్నిశిఖ లాగా అగుపించాడు.

శిష్యగణం సమీపంగా వచ్చారు. రాజు పద్మాసన స్థితుడయ్యాడు. రాణులు కొద్ది దూరంలో నిలబడ్డారు. రాజూ, శంకరాచార్యుడూ పరస్పరం చూస్తూ అలా కొంతసేపు ఉండిపోయారు.

ఆచార్యుడు చిరునవ్వుతో, ''మహారాజా! మీరు శ్రమపడి యిక్కడికి రావాలా? అవసరమైతే మేమే మీ మందిరానికి వస్తాం కదా!'' అన్నాడు.

నిర్వికారమైన కన్నులతో ఆచార్యుణ్ణి చూస్తూ, ''ఆచార్యా! నేను మహారాజుని కాను. శివుణ్ణి అంతకు ముందే కాను. నే నెవరినో నాకు తెలియదు.'' అని తన భార్యల వైపు చూపిస్తూ, ''ఈ పదిప్రాణులూ, నా యీ శరీరానికి రాణులు'' అన్నాడు.

తెల్లబోయిన రాణులందరూ ఆచార్యునికి ఒక్క సారిగా నమస్కరించారు. బౌద్ధ మతస్థురాలైన మాయాదేవి నమస్కరించిందో లేదో తెలియలేదు.

మర్యాదనతిక్రమించని కొద్దిపాటి వ్యంగ్య హేలా విలాస విభ్రమం కూడిన కంఠస్వరంతో మాయాదేవి, ''స్వామీ! ఇప్పుడు మీరు పఠించిన శివస్తోత్రం బౌద్ధ నిర్వాణానికి చాలా దగ్గరగా ఉందే!'' అంది.

''లేదు దేవీ! బౌద్ధమతమే నా యీ నిర్వాణ షట్కమునకు దగ్గరగా ఉంది. వేదములూ, ఉపనిషత్తులూ చెప్పిందే నేనూ చెప్పాను. వేదములు చెప్పనిది ఏ మతమూ కొత్తగా చెప్పలేదు.'' అన్నాడు ఆచార్యుడు.

ఆచార్యుని 'దేవీ' అన్న సంభోదనకి మాయాదేవి కనుబొమలు ముడిచింది. అలా పిలిచే అధికారం ఒక్క మహారాజుదేననీ, తక్కిన వారందరూ ఆమెను 'మహారాణీ' అని సంబోధించాలనీ ఆవిడ అభిప్రాయం. ఆ విషయం తెలిసిన రాణులందరిలోనూ ఆ సంబోధన చాలా కదలిక కలిగించింది. కాని ఆచార్యుని కంఠ గాంభీర్యంలో ఆ కదలిక కలిసిపోయింది. ఆచార్యుని శిష్యగణం దానిని భావించలేదు. రాజు దేనినీ పట్టించుకునే స్థితిలో లేడు. రాజే ఊరుకున్నప్పుడు రాణికేం చెయ్యాలో తోచలేదు.

అందుచేత తన కనుబొమల ముడి తనలోనే ముడిచి, ఆశ్చర్యనిశితంగా చూస్తూ, ''మీరిప్పుడు చదివిన ఆరు శ్లోకాల పేరూ నిర్వాణషట్కమా? అయితే స్వామీ! అహింసావాదమూ, క్షణిక వాదమూ, శూన్యవాదమూ, నిర్వాణ మార్గమూ అన్నీ వేదాల్లో ఉన్నాయంటారా?'' అంది.

శంకరాచార్యుడు నిరావేశంగా, ''ఓయమ్మ మహారాణీ!'' అని సంబోధిస్తూ యిలా మొదలుపెట్టాడు, ''బౌద్ధులు నిర్వాణ మని నూతన వ్యాఖ్యానం చేస్తున్న స్థితి మోక్షం వంటిదే. సృష్టి

క్షణభంగురం, అశాశ్వతం అని చెప్పే ఉపనిషద్వాక్యాలకు విపరీత వ్యాఖ్యానమే క్షణికవాదం. సృష్టి యొక్క చక్రభ్రమణ వృత్తాకార లక్షణం అన్వయం కాకపోతే మిగిలేది శూన్యవాదమే! ఇక, అహింసావాదం అనాదిగా వస్తున్నదే గాని కొత్తదేమీ కాదు. ప్రతి పురాణం లోనూ కనబడుతుంది. దానిని బుద్ధుడు కూడా విశేషంగా సాధించలేకపోయాడు. ''అహింసా పరమోధర్మః'' అని అంటూనే చివరి దశలో మాంసాహార భిక్ష కూడా స్వీకరించాడు. అంటే ఆహార సేకరణలో జరిగే హింస, హింసకాదన్నమాటేగా? అలాగే వైద్యపరీక్షలలో, కొన్ని ఔషధాల నిర్మాణ యోగంలో ప్రాణిహింస జరుగుతుంది. దాన్ని కూడా వారు ప్రతిఘటిస్తున్నట్టు ఎక్కడా కనబడదు. మానవ జాతి మనుగడకై, ఆ హింసని కూడా వారు అంగీకరిస్తున్నట్టేగా? అప్పుడు యజ్ఞయాగాదులలో జరిగే హింస మానవజాతి మనుగడకోసం కాదని, వారు ఏ శాస్త్ర జ్ఞానంతో చెపుతున్నారు? ఆహారం కోసం వైద్యంకోసం జరుగుతున్న అపరిమితమైన, నిత్యమైన హింసను వదిలిపెట్టి, యజ్ఞయాగాదులలో జరిగే అల్పమైన హింసను, హింసగా అభివర్ణించడం వారి వివేకమా, లేక వైదిక మతంపై వారి ద్వేషమా? లేక ఏది హింసో, ఏది అహింసో నిర్ణయించే నియంతృత్వాధికారమా?

''అవన్నీ అలా ఉంచి, అసలు అహింసను పరమధర్మంగా ఎలా స్వీకరించడం? పరమధర్మ మంటే దానిని మించిన ధర్మం ఉండకూడదని గదా అర్థం!! లోకంలో అంతా సజ్జనులు కారు. దుర్జనులూ ఉన్నారు. ఆ దుర్జనులు సజ్జనులను హింసిస్తూ ఉంటారు. అహింసా వాదం కోసం, దుర్జనులను ఉపేక్షిస్తే, సజ్జనుడు హింసింపబడుతూ ఉంటాడు. అప్పుడు అహింసా వాదానికి అర్థం లేదు. అలా కాదని ఆ దుర్జనుడిని శిక్షిస్తే, అదీ హింసే అవుతుంది. ఈ స్థితిలో ఎప్పుడూ ఏకపక్షమే అవుతున్న ఆ అహింసావాదం గతి ఏమిటి?

''పోనీ వాదనకోసం, మానవులంతా సజ్జనులుగా మారిపోయారనుకుందాం! ఒకరి నొకరు హింసించుకోవడం లేదు అనుకుందాం. మరి జంతువుల మాటేమిటి? క్రూరమృగాల మాటేమిటి? పిల్లీ ఎలుకా, పులీ లేడీ వంటి సహజ వైరం గల ప్రాణుల మాటేమిటి? మానవులు సజ్జనులు కాగానే, అవి కూడా మారిపోతాయా? వాటి హింస వాటితోనే ఆగదు. అవి మానవుల మీదకి కూడా దాడివస్తాయి. తిరిగి వాటిని హింసిస్తే ఒక సమస్య, హింసించకపోతే మరొక సమస్య. అప్పుడూ ఏకపక్షమే గదా పరమధర్మమైన అహింసావాదం.

''అంత దాకా అక్కరలేదు. ఆహారం తింటున్నా, ఊరికే కూర్చుని గాలి పీలుస్తున్నా కూడా హింస జరుగుతూనే ఉంటుంది.

ప్రతినిత్యం పరమ సూక్ష్మమైన క్రిములు వందలాదిగా వేలాదిగా మనకు తెలియకుండానే మనచేత సంహరింపబడుతూ ఉంటాయి. మూతికీ ముక్కుకీ గుడ్డలు కట్టుకున్నంత మాత్రాన అది ఆగదు. దాని సంగతేమిటి?

''అదీ కాక ఓ మహారాణీ! హింస కేవలం శారీరకం కాదు. ఒక భయంకరమైన మాటతో, ఒక దారుణమైన ప్రవర్తనతో ఎదుటి వారి హృదయాన్నీ, మనస్సునీ ముక్కలు చేయగల హింస మాటేమిటి? వీటన్నటినీ ఎలా అతిక్రమించడం? కాబట్టి 'అహింసా పరమోధర్మః' అనేది మృషావాదం. అందుకే అహింసని బోధించిన వైదికమతం, 'దయ'ను పరమ ధర్మంగా స్వీకరించింది. అమ్మవారిని దయామూర్తిగా, పరమేశ్వరుడిని దయాస్వరూపుడిగా స్తుతించింది. మనిషిలో దయ కలిగిన నాడు హింసా ప్రవృత్తి దానంతట అదే తగ్గుతుంది. కాని అహింసా ఉద్యమంతో, హింస తగ్గవచ్చునేమో గాని, దయాగుణం పెరగవలసిన అవసరం కనబడదు. వస్తుతః ఈ రెంటికీ యిదీ భేదం.

''అన్నిటికన్నా ముఖ్యంగా ఓ మహారాణీ! బౌద్ధం కేవలం సన్న్యాసాన్నీ, భిక్షుకా వృత్తినీ మాత్రమే బోధిస్తుంది. అవి వైదిక మతంలో ఉన్నవే! నిజంగా సర్వ మానవులూ సన్న్యాసులు కాగలిగిన నాడు మరునిముషంలో సృష్టిలేదు. ఇక భిక్షుక వృత్తి దేనికి? ఎవరి గురించి? ఉన్నవారందరూ సన్న్యాసులూ భిక్షుకులూ అయిన నాడు భిక్ష వేసేదెవరు? సంఘంలో భిక్ష వేసేవాళ్ళు తక్కువై, భిక్షుకులు ఎక్కువ మంది అయితే ఆ భిక్షసాగదు. కాబట్టి భిక్షుకుల కన్నా భిక్ష వేసేవాళ్లు ఎక్కువ మంది ఉండాలి. వాళ్లు సన్న్యాసులా, భిక్షుకులా, సంసారులా? సంసారి అనంగానే వాడు బౌద్ధుడు కాడు. చూశావా, యిప్పుడు మరొక సమస్య వచ్చిపడింది! వాడు బౌద్ధుడూ అవాలి. సంసారీ అవాలి. బౌద్ధుడుగా భిక్ష స్వీకరించాలి. సంసారిగా భిక్ష వెయ్యాలి. భిక్షవెయ్యాలంటే, ఆ బౌద్ధ సంసారులు ఏవేవో వృత్తులు

చేపట్టాలి, జీవించాలి, మిగిలిన దానిలో బౌద్ధ భిక్షుకుల్ని పోషించాలి. అటువంటి వారి జీవన విధానాన్ని గురించి స్పష్టంగా చెప్పే సూత్రావళి బౌద్ధంలో ఉన్నట్టు కనిపించదు. ఒకవేళ ఎవరైనా కల్పించినా, అదేమీ కొత్తకాదు. గార్హస్థ్య ఆశ్రమ రూపంలో అనాదిగా సుఖంగా సాగుతున్నదే. వాటికే ఏవో అవక తవక మార్పులు చేసి, తమవిగా ప్రకటించుకోవాలి.

''లోతుగా చూస్తే, ఈ బౌద్ధ సన్యాసంలోకి జంతుజాలం వస్తున్నట్టు లేదు. లేక మెల్లిగా వాటికి కూడా సన్యాసం యిప్పిస్తారేమో తెలియదు. వాటి సృష్టి సాగుతూనే ఉంది. వాటి గురించి ఏవో కొన్ని జాతక కథలలో ప్రస్తావించినా, పురాణాలలో ఉన్న ముక్త జంతువుల కథలకన్న అవేమీ గొప్పవికావు.

''కాబట్టి ఓ మహాదేవీ! సంసార మాయావృతుడైన జీవుడికి, అందులోని మర్మాలు తెలిసే మార్గాలు బోధించాలి గాని ప్రతివాడినీ సన్యాసం పుచ్చుకోమనకూడదు. అలా చేస్తే, అభ్యాసం లేకుండానే కత్తితో మహావీరుడైన శత్రువును ఢీకొన్నట్టవు తుంది. అటువంటి పని వైదిక మతం చెయ్యదు. ఎక్కడికక్కడే జీవన మార్గాలను బోధిస్తుంది. ఏ ఆశ్రమానికా ఆశ్రమం లోనే ముక్తిని చేరే మార్గాలను బోధిస్తుంది.

అని మహోపన్యాసం చేసిన ఆచార్యుడు రాజు వైపు తిరిగి, ''మహారాజా! నేనైనా ఏదో క్రొత్తగా అద్వైతం బోధించడానికి రాలేదు. ఇది అనాదిగా ఉపనిషత్తులు చెపుతున్నదే. 'ఆనందం' అనేది ఎక్కడో లేదు. సర్వచరాచర జగత్తూ బ్రహ్మమే, దీని సుఖదుఃఖానుభూతులు భ్రాంతి. 'నీవు' అనే భావన భ్రాంతి, 'నేను' అనేది బ్రహ్మ. ఇంద్రియాలను బంధించి, మనస్సుని అంతర్ముఖం చేసి, సంకల్పాతీతమైన నిరంతర ఆత్మ పదార్థభావన చేస్తే, ఈ అనంత విశ్వానికి ఆధారమైన ఆ బ్రహ్మసాక్షాత్కారం అవుతుంది. అంతకన్న బ్రహ్మానందం ఏముంది?'' అంటూ తాను తిరిగి సమాధి స్థితిలోకి వెళ్లాడు ఆచార్యుడు. అమరుకుడి కళ్లు అతనికి తెలియకుండానే మూతబడ్డాయి.

ఆకాశాన తెల్లని మబ్బులు దట్టంగా అలముకున్నాయి. 'ఈతని నెదుర్కోవడం నా వల్ల కాదు గదా, నేటి బౌద్ధ గురువులలో ఎవరివల్లాకాదు' అనుకుంది మాయాదేవి. ప్రకృతి ప్రాణాయామం పట్టినట్టుగా, గాలి స్తంభించింది. 'మతగ్రంథాల లోపలికి వెళ్ళకుండా పైపై వాదాలతోనే బౌద్ధాన్ని పరాస్తం చేస్తున్నాడితను' అనుకుంది వైఖరి.

కొద్దిసేపట్లో మబ్బులు విడిపోయి, నక్షత్రాలతో నీలాకాశం ధగధగలాడిపోయింది. కళ్లుతెరిచిన రాజు అనిర్వచనీయమైన ఆనందంతో నగరం వైపు కదిలాడు.

శంకరుడు మండనుణ్ణి ఓడించడానికి వస్తున్నాడని తెలిసి మాయాదేవి సంతోషించింది కాని, ఏం లాభం? మండనుడు తనగోల తను పడతాడు గాని ఎవరిజోలికీ రాడు. కాని ఇతడు అలా కాదే! పగపట్టిన పడుచుత్రాచు! ''ఆకాశంలోంచి పిడుగులా దూసుకొచ్చి, ఎరను తన్నుకుని ఎగిరిపోయే కంచుడేగ' అనుకుంది వైఖరి.

శంకరుణ్ణి ఎలా దెబ్బతీయాలా అని ఆలోచిస్తూ మాయాదేవి రాజు ననుసరించింది. 'వెర్రి ఆలోచన' అన్నట్టుగా ఒక గుఙ్ఞం సకిలించింది. 'భేష్' అన్నట్టుగా మన్మథధ్వజ చిహ్నాలయిన చేపలు నర్మదలో ఎగిరి పడ్డాయి.

కేవలం వాదనతో ఒక విషయం సాధించవలసి వచ్చినపుడు రెండు పద్ధతులుంటాయి. ఒకటి, పూర్వప్రమాణాలను స్వీకరించడం. రెండు, వాదించే వ్యక్తి స్వయం ప్రతిభతో తానే కొత్త ప్రమాణాలను సాధించడం. పరిపూర్ణులైన యిద్దరు పండితులు వాదిస్తూంటే, కొత్తకొత్త ప్రమాణాలను సాధించే ప్రయత్నాలు జరుగుతూ ఉంటాయి. **(సశేషం)**

## 'శ్రద్ధ' ప్రాతిపదిక

ధర్మాచరణకు శ్రద్ధ ప్రాతిపదిక. ధర్మ విషయంలో 'ఎందుకు?' అన్న ప్రశ్న కంటె, 'ఏది?' అన్నదే ప్రధానం. 'ఎందుకు' అనేది అనవసరం.

ధర్మం ఆత్మసంబంధం. ఆత్మ మనస్సుకు పైది. ఆత్మకు సంబంధించిన విషయం మనస్సుకు బోధపడక తికమకపడుతుంది.

ధర్మం శాసనం. శాసనాలను శాస్త్రాలు చెబుతాయి. ''తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ'' అని గీతాచార్యుడు శ్రీకృష్ణపరమాత్మ బోధించాడు.

– కంచి మహాస్వామి



# సనాతన మహాసామ్రాజ్య పట్టాభిషేకం

గత సంచిక తరువాయి

శివాజీ పట్టాభిషేకం యావత్ హిందూ జాతికి ఆనందాన్ని కలిగించింది. రాజపుత్రులకు ధైర్యాన్ని కలగజేసింది. దక్షిణాది సంస్థానాధీశులలో హైందవ స్వాతంత్ర్యాశను చివురెత్తించింది. అయితే మరి మహమ్మదీయ పాదుషాలకు ఇది కంటకమవడం సహజం కదా!

అప్పటి గోల్కొండ నవాబు మత విద్వేషం ఉన్నవాడు కాదు. పైపెచ్చు అతని సామ్రాజ్యం బ్రాహ్మణ మంత్రులయిన అక్కన్న మాదన్నలచే పరిరక్షించబడుతోంది. బీజాపూరు నవాబులిక శివాజీని ఎదుర్కొనే స్థితిలో లేరు. ఔరంగజేబు మాత్రం శివాజీ పైకి సైన్యాన్ని పంపుతూనే ఉన్నాడు. శివాజీ వారిని పారద్రోలి, ఖాందేశ్ లాల్గావులపై దండెత్తి పటిష్టమైన స్థావరాలు ఏర్పాటు చేసుకున్నాడు. పోర్చుగీస్ వారిపై దండెత్తి 'పొండాను' స్వాధీనం చేసుకున్నాడు. బీజాపూరు వారి నుండి సతారా గెల్చి, అక్కడకు దగ్గరలో సజ్జన్‌గఢ్ వద్ద తన గురువు గారికి ఆశ్రమం కట్టించి ఇచ్చాడు.

తన సంపూర్ణ హిందూ స్వరాజ్య పథకంలో భాగంగా బీజాపూరు నవాబుల ఆధీనంలో ఉన్న చిన్న చిన్న రాజ్యాలను నయానో భయానో తన ఆధీనంలోకి తెచ్చుకోనారంభించాడు.

తంజావూరులో శివాజీ తమ్ముడు వెంకోజీ తన తురుష్క మంత్రుల సలహాతో అప్పటి బీజాపూరు పఠాన్ ప్రభువుకు సామంతునిగా ఉండటం శివాజీకే కాదు, వెంకోజీ మంత్రి రఘునాథునికే నచ్చ లేదు. ఒక ప్రక్కన అన్నగారు శివాజీ హిందూ సామ్రాజ్య స్థాపనకు అహరహం శ్రమిస్తుంటే - ఎంత సవితి తమ్ముడయినా - తమ్ముడు ముస్లిం రాజునకు దాస్యం చేయడం రఘునాథునికి రుచించలేదు. అతనితో ఎంతో చెప్పి చూశాడు. వినేట్లు కనిపించలేదు. అతనిని వదిలివేసి, శివాజీ ప్రయత్నాలకు తన వంతు కైంకర్యం చేయడానికి గోల్కొండ చేరాడు.

అప్పుడు గోల్కొండకు అబ్దుల్లా కుతుబ్‌షా నవాబుగా ఉన్నాడు. రాజ్య దాహంతో మొగల్ చక్రవర్తి చేసే దాడులు తట్టుకోవడానికి అతని క్రిందనున్న తురక సర్దారులు సమర్థులు కాకపోవడంతో తన మంత్రుల (అక్కన్న మాదన్నల) సామర్థ్యం పైననే అతడు పూర్తిగా ఆధారపడవలసి వచ్చింది. తమ ప్రతిభతో వీరు గోల్కొండ సామ్రాజ్యాన్ని రక్షిస్తూ వచ్చారు. గోల్కొండ నవాబు యొక్క హిందూ అనుకూల్యత ఔరంగజేబుకు కంటగింపుగా ఉంది. ఇప్పుడు శివాజీ పట్టాభిషేకంతో కోపం పెట్రేగి పోయింది. పరిస్థితి విషమంగా ఉన్నది. ఎలా బయటపడటమా అని ఆలోచిస్తున్న అక్కన్న మాదన్నలకూ, కుతుబ్‌షాకూ, రఘునాథ పంత్ ఆగమనం ఆనందాన్ని కలిగించింది.

రఘునాథ నాయకుని ప్రణాళిక అక్కన్న మాదన్నలకు, కుత్‌బ్‌షాకు నచ్చింది. శివాజీ సహాయంతో మొగలాయిలను నిరోధించడం, చితికిపోయిన బీజాపూరు సామంత రాజ్యాలను ఇద్దరూ కలిసి జయించి పరిగ్రహించడం ఈ ప్రణాళిక. మహారాజా, నవాబుల సమావేశానికి ఏర్పాట్లు జరిగాయి. మహమ్మదీయ నవాబు రాజ్యంలోనికి ఒక హిందూ స్వతంత్ర రాజు అతిథిగా విచ్చేయడం చరిత్రలో మొదటి సారి. కుత్‌బ్‌షా స్వయంగా ఏర్పాట్లను పర్యవేక్షించాడు. ఈ సమావేశానికి వ్యతిరేకత చూపి అలజడి చేసిన ముస్లిం సర్దారులను శివాజీ అణిచివేశాడు. ముస్లిం రాజ్యంలో ఉన్నప్పుడు ఆ ప్రజల యెడల, వారి సంస్కృతి యెడ, వారి మసీదుల యెడ ఎలా ఆదర భావంతో మెలగాలో మరాఠ సైనికులకు శిక్షణ ఇవ్వబడింది.

కుతుబ్‌షా శివాజీని సాదరంగా ఆహ్వానించాడు. శివాజీ నెల రోజుల పాటు నవాబు ఆతిథ్యం స్వీకరించి వారితో ఒడంబడిక చేసుకొన్నాడు. ఆ ఒప్పందం ప్రకారం - మొగలాయిలను ఇద్దరూ కలిసి నిరోధిస్తారు.

శివాజీ దక్షిణ దేశ దండయాత్రలో గోల్కొండ సేన సహకరిస్తుంది. క్రొత్తగా సంపాదించిన రాజ్యాలను సగం సగం పంచుకొంటారు. గోల్కొండ సేన వెంటరాగా వివిధ దేవాలయాలను దర్శిస్తూ బీజాపూరు పరిపాలనలో ఉన్న జింజి కోటను స్వాధీనపరుచుకొని, మధుర నాయకుల ఆహ్వానంపై మధురా విజయం చేసి మీనాక్షీ సుందరేశ్వరుల దర్శనం చేసుకొని, తన తమ్ముని పాలనలో ఉన్న తంజావూరు సీమ ప్రవేశించాడు.

వెంకోజీ శివాజీ దర్శనం చేసి ఆయనతో వారం రోజులు కలిసి ఉన్నాడు. శివాజీ షరతులకు ఒడంబడలేదు. ఇంతలో తన పుత్రుడు శంభాజీ గురించిన ఆందోళనకరమైన వార్త విని తాను తిరిగిపోతూ తన ప్రతినిధిగా రఘునాథుని ఉంచి సేనాపతి హంబీరావు మొహితే వెంకోజీని దండించడానికి ఏర్పాటు చేశాడు. తిరిగిపోతూ మైసూరు ప్రాంతాలలో వెంకోజీ కోటలన్నిటినీ హస్తగతం చేసుకొంటూ రాయగఢ్ చేరాడు. వెంకోజీని హంబీరావు జయించాడు. వెంకోజీ తన భార్య దీపాబాయి ప్రోద్బలంతో ముస్లిం మంత్రులను వదలి శివాజీని శరణు జొచ్చాడు. దీపాబాయి, రఘునాథ పంతుల సలహా మీద నడిచే షరతుతో వెంకోజీకి స్వాతంత్ర్యమీయబడింది.

ఔరంగాబాదులో దురలవాట్లకు లోనయినశంభూజీ శివాజీ చేత గట్టిగా మందలించబడ్డాడు. శివాజీ ఎంతో అనునయంగా హైందవ ధర్మ పరిపాలనకు రాజు ఎంతటి సచ్ఛీలుడై ఉండాలో అనేక ఉదాహరణలతో చెప్పాడు. అయినా శంభూజీ తన పోకడలను మార్చుకొనలేదు. శివాజీ మంచి విద్యాబుద్ధులు నేర్పడానికి తన పుత్రుని, కోడలిని సతారాలో సమర్థ రామదాస స్వామి రక్షణలో ఉంచాడు. శివాజీ దక్షిణ ప్రాంతం పోయినప్పుడు మొగలాయి సేనాధిపతి దిలీర్ ఖాన్ ప్రోద్బలంతో శంభూజీ సతారా వదిలి తన భార్య యశోబాయితో సహా మొగలాయిల వద్దకు చేరాడు. ఇద్దరూ కలిసి బీజాపూర్ రాజ్యాలపైన, శివాజీ రాజ్యాలపైన దాడులు చేయడం మొదలుపెట్టారు. అయితే దిలీర్‌ఖాన్ చేసే ప్రజానాశనం, దేవాలయ ధ్వంసం శంభూజీకి నచ్చలేదు. అదీకాక దిలీర్‌ఖాన్ అతనిని ఔరంగజేబుకు అప్పచెప్ప బోతున్న వార్త వచ్చింది. రాత్రికి రాత్రి యశోబాయి ప్రోద్బలంతో మొగలాయిలను వదిలి బీజాపూర్ పారిపోతూ శివాజీ ప్రతినిధులను దారిలో కలిసి, వారిచే బోధించబడి పన్హాలా కోటకు తిరిగివచ్చాడు. తన తదనంతరపు మహారాజు దుశ్శీలుడు అవడం శివాజీకి ఎంతో మనఃక్లేశాన్ని కలిగించింది.

1879 ఏప్రిల్ 20వ తేదీన జిజా పన్ను తిరిగి విధించడం ద్వారా తన హిందూ విద్వేషాగ్నికి ఆజ్యం పోశాడు ఔరంగజేబు. ఇది రాజపుత్రులకు, శివాజీ మహారాజుకు బహిరంగ సవాలు వంటిది. ఇప్పటి శివాజీ

---

తనపై జరిగిన మూడుహత్యా ప్రయత్నాల వల్ల తనవారినెవ్వరినీ నమ్మక జౌత్తరాహికుడైన 'కవి - కలశ్' అనే తాంత్రికుడిని తన ముఖ్యసలహాదారుగా చేసుకొన్నాడు శంభూజీ. ఈ కవి-కలశ్‌కు, మరాఠా సైనికాధికారులకు అంత సయోధ్య లేకపోవడాన, ప్రతి వారిని ఏదోవిధంగా జైలుపాలు చేయడమో శిక్షించడమో చేశాడు. ఈ కవి-కలశ్ తాంత్రిక శక్తితనని రక్షించగలదని నమ్మాడు. శివాజీ భయపడినట్లుగానే కవి-కలశ్ తనకై కట్టుకొన్న సంగమేశ్వర్ రమ్యహర్మ్యంలో మగువల నడుమ మదిరామత్తుడై యున్న శంభూజీని కవి-కలశ్‌తో సహా నిర్బంధించారు ఔరంగజేబు సేనానాయకులు. వీరిద్దరికీ బఫూన్లవేషం వేసి, డప్పులు మ్రోగిస్తూ, వెక్కిరిస్తూ హేళన చేస్తూ బహదూర్‌గంజ్‌లో ఉన్న ఔరంగజేబు వద్దకు తీసుకొని వెళ్లారు.

ఔరంగజేబు అతని కోటలన్నీ స్వాధీనం చేసి, దాచుకున్న డబ్బంతా ఇచ్చివేస్తే ప్రాణభిక్షపెడతానన్నాడు. అప్పటికే అపరాధ భావంతోనూ, అవమాన భారంతోనూ క్రుంగిపోతున్న శంభూజీ తన జాతికి ద్రోహం చేయనని సమాధానమిచ్చాడు. హేళనగా నవ్వుతూ ''మరి రాజాగారు ఏ షరతులమీద సంధికి ఒప్పుకొంటారో'' అన్ని ప్రశ్నించాడు ఔరంగజేబు. ''మీకొకసిద్ధాంతమూ, మాకొకసిద్ధాంతమూనా? మీతో సంధి చేసుకోవాలంటే తరతరాలుగా మా హిందూరాజులు తమ పుత్రికలను నజరానాగా సమర్పించవలసి వస్తోంది కదా! తాముకూడా తమ పుత్రికలలోనో, మనుమరాళ్ళలోనో ఒకరిని నజరానాగా సమర్పిస్తే సంధికి ఆలోచిద్దా''మన్నాడు శంభూజీ. యావద్భారత సామ్రాట్టుననుకొంటున్న ఔరంగజేబు ఈ మాటలకు మ్రాన్పడిపోయాడు. మూడు వారాలు చిత్రవధ చేసి అతిక్రూరంగా శంభూజీని అంతమొందించాడు.

శంభూజీ బ్రతికి ఉండగా మరాఠా రాజ్యానికి ఏమి మేలు చేశాడనే విషయంలో భేదాలున్నాయి. అయితే ఆయన మరణం మాత్రం మరాఠుల ఆత్మగౌరవాన్ని పెల్లుబికించింది. ఆయన చిందించిన ప్రతి రక్తపుబొట్టు వేలాది మరాఠా వీరులను, మొగలాయి సింహాసనాన్ని కదిలించి వేసింది.

**– చల్లా విశ్వనాథశాస్త్రి**

# యశోబాయి మంత్రాంగము - తారాబాయి పరాక్రమం

శంభూజీ వధానంతరం ఔరంగజేబు సైన్యాలు రాయగఢ్‌కోటను ముట్టడించాయి. రాజుపోయిన సైనికులు యుద్ధం చేయడానికి తత్తరపడసాగారు. అప్పుడు శివాజీ పెద్దకోడలు, శంభూజీ భార్య ధైర్యసాహసాలతో స్వయంగా రణభూమిలోనికి దూకారు. సేనాపతులతో మంత్రాంగాలు చేశారు. సైనికుల శిబిరాల వద్దకు వచ్చిన వీరోచితమైన వాక్యాలతో ఉత్సాహపరిచారు. ఆమె రూపొందించిన రణనీతినే మరాఠాలు ఔరంగజేబు తిరిగి వెళ్లేదాకా అమలుచేశారు. ఈ నీతి క్రింద వివరించబడింది.

1) జైళ్ళలో ఉంచబడిన వివిధ వర్గాలకు చెందిన సైనికులనందరినీ విడుదల చేసి, తమజాతి రక్షణకై మహోన్నత త్యాగాలను ఐకమత్యంగా చేసేందుకు సమాయత్తం చేయాలి.

2) రాజు, రాజపరివారం, వివిధ సేనానాయకులు వివిధ ప్రాంతాలకు తరలిపోవాలి. వారందరూ కేంద్రీకృతమై ఉండరాదు. దురదృష్టవశాత్తు ఒకరు చనిపోయినా దానిప్రభావం యుద్ధం పై ఉండరాదు.

3) గెరిల్లా యుద్ధపద్ధతిని స్వీకరించి, ఔరంగజేబుసైన్యాలు ఒక కోటపై దాడిచేస్తున్నపుడు, ఇంకొక కోటలో ఉన్నవాళ్ళు వెనక నుండి ముట్టడించాలి. వీలు కానపుడు జననష్టం జరగకుండా కోట వదిలి వెళ్ళిపోయి, అనుకూల పరిస్థితులలో తిరిగి ముట్టడించాలి.

దురదృష్టవశాత్తు ఆమె శంభూజీ తరువాత ఛత్రపతి కానున్న తన పుత్రునితోసహా ఔరంగజేబుచే నిర్బంధించబడింది. మళ్లీ తిరిగి వచ్చినట్లులేదు. అయితే వెళ్లిపోతూ తమ సవితి మరిది రాజారావును తమ ప్రతినిధిగా ప్రకటించి, అతనిని సురక్షితంగా దూరప్రాంతాలకు వెళ్ళవలసినదని సూచించింది. తదనుగుణంగా రాజారావు జింజి కోటకు చేరాడు. జింజి విజయంలో శివాజీ దీర్ఘదర్శిత్వం ఇక్కడ ఎంతో ఉపయోగించింది.

రామచంద్ర పంత్ మొదలైన వీరులు కోటలను రక్షిస్తూ చక్రవర్తి సైన్యపు కదలికలను ఎప్పటికప్పుడు తెలుసుకొంటూ సంక్షోభం కలగజేశారు. శాంతాజీ గోర్పాడే, ధానాజీ జాధవ్ వంటి సేనాధిపతులు గెరిల్లా యుద్ధంలో చక్రవర్తి సైన్యాన్ని తెగనరుకుతూ, అపార ధనసంపదలను, ఆయుధ సామాగ్రిని దోచుకుపోయేవారు. మొగలుసైన్యాలు లక్షలాదిగా మైదానంలో విడిది చేసి ఉన్నపుడు, మరాఠా సైనికులు ఒకరోజు ఒక వైపునుండి ఒక వర్గపువారు వచ్చి కల్లోలం సృష్టించి పోతే, రెండోరోజు ఇంకో వైపునుండి ఇంకోవర్గం వారువచ్చి బీభత్సం చేసి పోయేవారు. తెలివి తెచ్చుకొని ఎదుర్కొనేంతలో గాలిలా మాయమైపోయేవారు. చివరికి ఔరంగజేబు బసచేసి వున్న డేరా కూడా కూలదోయబడింది. ఒకదుర్గాన్ని జయించి ముందుకు సాగేంతలో, మరాఠాలు ఇంకో వర్గంవారు వెనుక నుంచి వచ్చి ఆ దుర్గాన్ని స్వాధీనం చేసుకొనేవారు. రాజులేని సైన్యాన్ని ఎదుర్కోవడం ఎరుగని ఔరంగజేబు ఖిన్నుడై పోయాడు.

రాజారావు సతారాకు తిరిగివచ్చి అతిచిన్నతనంలోనే మరణించాడు. అతని భార్య తారాబాయి రాజ్య బాధ్యతలను స్వీకరించింది. నిరంతరం దేశభక్తితో కార్యదీక్షతో పరాక్రమంతో విజృంభించి మరాఠా సైనికులకు అమితోత్సాహం కలగజేసింది. ఈమె నేతృత్వంలో రాజారావు కాలంలో కూడా లేనంత ఐకమత్యంతో మరాఠా సైనికులు పోరాడారు. ఒకకోటనుండి వేరొకకోటకు, ఒక సైనిక శిబిరం నుండి మరొక శిబిరానికి విక్రమించి విహరిస్తూ సైనికులకు ఎంతో ఆత్మ స్థైర్యాన్ని చేకూర్చింది. అత్యంత సమర్థంగా నిర్వహించింది. ఔరంగజేబుపై మరాఠావీరుల విజయంలో ఆమెది అత్యంత ముఖ్యభూమిక అనడంలో ఏమాత్రం సందేహం లేదు. శివాజీ కోడళ్లు ఇద్దరూ శివాజీ ఆశయసాధనలో విక్రమం చూపడం ఈ విక్రమనామ సంవత్సరంలో స్మరించదగినది.

---

శాయిస్తఖాను, జయసింగులు దండెత్తి వచ్చినప్పటి శివాజీ కాదు. మహా శక్తిశాలి. సామ్రాజ్యాధినేత. శివాజీ కఠిన పదజాలంతో ఔరంగజేబునకు ఒక లేఖ వ్రాశాడు. హైందవుల యెడల అపచారాన్ని చేతిలో ఖడ్గం దాల్చిన ఉత్తమ క్షత్రియునిగా చూస్తూ ఊరుకోజాలనని స్పష్టపరిచాడు. అప్పటి శివాజీ బలం పరిశీలిస్తే గోల్కొండ, బీజాపూరు వారే కాక యావత్ దక్షిణ భారతం అతని వెనుక నున్నారు. ఉత్తర భారతంలోనూ రాజపుత్రుల అండ ఉన్నది. మన దుర్దృష్టవశాత్తూ శివాజీకి పరమేశ్వరుడు ఆయువు ఇవ్వలేదు కానీ, ఒకవేళ మరికొన్ని సంవత్సరాలు శివాజీ ఉండి ఉంటే, మొగలాయి సామ్రాజ్యపు అంతం ఇంకా ఎంతో ముందే వచ్చి ఉండేది. ఇది

శివాజీ చరిత్రను, మరాఠుల చరిత్రను సమగ్రంగా పరిశోధించిన సమకాలీన, అనంతర చరిత్రకారుల విశ్లేషణ.

తన గురువుతో నెలరోజులు సత్సాంగత్యంలో ఉండి తిరిగి వచ్చి 1680 ఏప్రిల్ నాల్గవ తేదీ తన 53 ఏళ్ల వయస్సులో చిన్న జ్వరంతో పరలోక ప్రాప్తి నొందాడు ఛత్రపతి శివాజీ మహారాజా.

ప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ జడునాద్ సర్కార్ చెప్పినట్లు శివాజీ "The Last great constructive genius and nation - builder that the Hindu race has produced" - సమర్థ రామదాస స్వామి చెప్పిన ఇంకో ఈశ్వరావతారం కోసం ఎదురుచూస్తూ ఉందాం.

## వ్యాస రచనకు ఉపకరించిన గ్రంధాలు :


1) Delhi Sultanate - Bhavan's History Series Vol 6
2) The Mughal Empire - Bhavan's History Series Vol 8
3) The Maratha Supremacy - Bhavan's History Series Vol 8
4) History of Midieval Deccan Vol-I - Govt. of Andhrapradesh
5) New History of Marathas - Sirdesai
6) Siva Bharatham - Sampurnanand
7) Dasa Bodha - Telugu Translation by Seshadri Venkata Ramana


## అంకితము

**దర్శించినప్పుడల్లా దేశభక్తిని ఉపదేశించే సద్గురువులు శ్రీ శివానందమూర్తి గారికి కృతజ్ఞతాపురస్సరముగా సమర్పితము.**

# మాతృదేవో భవ - పితృదేవో భవ

"తల్లిదండ్రులు మనిషికి ప్రధానం. వారు సంతుష్టులు కానిదే ఏ సాధనలూ ఫలించవు.

దేవతల ఋణం, ఋషుల ఋణం, పితరుల ఋణం, భూత ఋణం - అంటూ మానవుడు తీర్చాల్సిన ఋణాలు ఎన్నో వున్నాయి. తల్లిదండ్రుల ఋణాన్ని తీర్చకపోతే ఏ కర్మా ఫలించదు.

భార్య పట్లా తీర్చాల్సిన ఋణం వుంది. తన భార్యను విడిచిపెట్టి హరీశుడు (ఒక శిష్యుడు), యిక్కడున్నాడు. ఆమెకేదో జీవనోపాధి కల్పించకపోతే నేనతగాణ్ణి దుర్మార్గుడంటాను.

రామప్రసన్నుడు (మరో శిష్యుడు) ఎంతసేపూ ఒక హఠయోగికి నల్లమందూ, పాలూ సమకూర్చడంలో దేవులాడుతున్నాడు. ఈతడిలా తిరుగుతూంటే, ఇతడి ముసలితల్లి తినడానికి లేక పస్తుండవలసి వస్తోంది. ఆ తల్లి తానే బజారుకు పోవాలి. ఈ వ్యవహారం చూస్తే నాకు ఒళ్లు మండుతోంది..." అని శ్రీరామకృష్ణ పరమహంస పలికారు.

***మాతరం పితరం చైవ సాక్షాత్ ప్రత్యక్షదేవతామ్***
***మత్వా గృహీ నిషేవేత సదా సర్వ ప్రయత్నతః ।***
***తుష్టాయాం మాతరి శివే తుష్టే పితరి పార్వతి***
***తవ ప్రీతిర్భవేద్దేవి పరబ్రహ్మ ప్రసీదతి ॥*** (మహానిర్వాణ తంత్రం)

"తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవాలని గ్రహించి, నిత్యం సేవించాలి. వారు తృప్తి చెందితే, పార్వతీ పరమేశ్వరులు ప్రీతి చెందినట్లే."

"లోకంలో అందరికీ తల్లిదండ్రులెంతో పూజార్హులు. వారు జీవించి వున్నంతవరకు శక్తికొద్దీ వారిని సేవించాలి. మరణానంతరం యథోచితంగా వారికి శ్రాద్ధకర్మలు నిర్వర్తించాలి. పుత్రుడు గర్భదరిద్రుడై వున్నా, శ్రాద్ధం జరిపించటానికి శక్తిహీనుడైవున్నా, వనానికి పోయి తన అశక్తతనెంచి కన్నీరు విడవాలి. అప్పుడు తల్లిదండ్రులపట్ల ఋణవిముక్తుడవుతాడు.

కేవలం భగవద్విషయంలో తనకు అడ్డు వచ్చేటప్పుడు మాత్రమే ఎవడైనా తల్లిదండ్రుల పట్ల అవిధేయుడై ప్రవర్తించవచ్చును. దానిచే అతడికి పాపం రాదు. ఇందుకు ఉదాహరణ : ప్రహ్లాదుడు తనను తండ్రి ఎంత వలదన్నా హరినామస్మరణ చెయ్యటం మానలేదు. అంతేగాక ధ్రువుడు తల్లి నిరోధించినా తపస్సు కోసం అరణ్యాలకు పోవటం మానుకోలేదు. ఇందులో వారు చేసింది తప్పిదం కాదు" అని కూడా పరమహంస ప్రబోధం.

# పాండురంగ విఠలుని దివ్యధామం

# పండరీపురం



మన దేశంలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో పండరీపురం ఒకటి. ఈ పేరు వినగానే ముందుగా స్ఫురణకి వచ్చేది పాండురంగ విఠలుని దివ్యనామం.

పండరీపురాన్ని 'పంఢార్‌పూర్' అని పిలుస్తారు. మహారాష్ట్రలోని షోలాపూర్ జిల్లాలో, షోలాపూర్‌కు 75 కి.మీ. దూరంలో 'భీమ' నది ఒడ్డున నెలకొని ఉన్న ఈ క్షేత్రాధిదైవం 'విఠోబా' అని పిలువబడే విఠల భగవానుడు. పాండురంగడే విఠలుడు. కృష్ణా నదికి ఉపనది భీమ. పండరీపురం వద్ద భీమను 'చంద్రభాగ' అని పిలుస్తారు. ఈ నదీ ప్రవాహ మార్గం 'నెలవంక'ను పోలి ఉండడం చేత ఈ పేరు వచ్చింది.

చంద్రభాగా నదీ తటంలో విఠోబా దేవాలయం కన్నుల పండువ గొల్పుతుంది. విఠోబాగా కొలవబడుతూ గర్భగుడిలో కొలువైయున్న మూలవిరాట్ ''విష్ణు'' భగవానుని విగ్రహం చిన్నదైనా, ఆ దివ్య మంగళ స్వరూపాన్ని చూడడానికి రెండు కళ్లూ చాలవనిపిస్తుంది. రెండు చేతులనూ కటిపై ఉంచుకుని ఠీవిగా నిలబడిన ఆ భక్తవత్సలుని విగ్రహ తేజస్సు, అవయవాల పొందిక చూపరులను కట్టిపడవేస్తాయి. విఠల భగవానుని దేవేరి రుక్మిణీ దేవికి ప్రత్యేక ఆలయం ఉంది.

విఠోబా మహారాష్ట్రుల కులదైవం. విఠల భక్తులైన మహారాష్ట్ర భక్త పుంగవుల చరిత్రలు కోకొల్లలు.

పరమ భాగవతోత్తములు, సాధు - కవి పుంగవులు అయిన భక్తతుకారాం, భక్త పుండరీకుడు, భక్త భానుదాస్‌లు మహారాష్ట్ర సాంస్కృతిక చరిత్రలో ముఖ్య భూమిక పోషించారు. ఈ మహనీయుల పవిత్ర రచనలు, పాటలు ఈనాటికీ - ఎన్నో వందల సంవత్సరాల తరువాత కూడా - కీర్తించి భజింపబడుతున్నాయి. చంద్రభాగా నది ఒడ్డుననే భక్త పుండరీకునికి కూడా ఒక ఆలయం నిర్మించబడింది. నదీజలాలలో కొంత భాగం మునిగి కనబడే ఈ ఆలయం చూడదగ్గది. నదీ తీరం వెంబడే భక్త తుకారాం, భక్త భానుదాస్, ఇంకా అనేక మంది భక్తాగ్రేసరుల సమాధులు, చూపరులను మంత్రముగ్ధులను చేస్తాయి.

పండరినాధుని చరిత్ర అత్యంత ప్రాచీనమైనది. ఇక్కడి మూలవిరాట్టు వేలాది సంవత్సరాలుగా పూజలందుకున్నట్లు చెప్పబడుతున్నా, ఇదమిత్థమైన చరిత్ర ఆంధ్ర శాతవాహనరాజుల కాలం నుంచి మాత్రమే లభ్యమౌతోంది. దానికి ముందటి చరిత్రకు సంబంధించిన ప్రమాణాలు లభ్యం కాకపోవడం వల్ల మూలవిరాట్ విగ్రహం, దేవాలయం యొక్క పుట్టు పూర్వోత్తరాలు రహస్యంగా మిగిలిపోయాయి. విఠోభాకు శాతవాహన రాజులు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చారు. అప్పటి నుండి ఈ దేవాలయం అనేక రాజవంశాల ప్రాపకంలో ఉంది.

విజయనగర రాజుల కాలంలో ఈ దేవాలయం మీద బీజపూర్, అహ్మద్‌నగర్ సుల్తానుల కన్నుపడింది. వీరి బారి నుండి రక్షించడానికి మూలవిరాట్ విగ్రహాన్ని అప్పటి విజయనగర రాజులు సురక్షిత ప్రాంతానికి తరలించినట్లు చారిత్రక ఆధారాలున్నాయి. అయితే భక్త భానుదాస్ విజయనగర రాజులను ఒప్పించి మూలవిరాట్ విగ్రహాన్ని పండరీపురానికి తిరిగి రప్పించినట్లు తెలుస్తోంది.

17వ శతాబ్దంలో ఈ దేవాలయం శివాజీ మహారాజు, ఆయన వారసుల ప్రాపకంలోనూ, 18వ శతాబ్దంలో హోల్కార్ రాజుల ప్రాపకంలోనూ ఉంది.

ఆషాఢ మాసంలో పండరీపురంలో జరిగే ఉత్సవం ''ఆషాఢ ఉత్సవం'' పేరుతో ప్రసిద్ధి పొందింది. సంవత్సరం పొడుగునా యాత్రికుల రద్దీ ఉన్నా, జూలై నెలలో వచ్చే ఆషాఢ ఉత్సవం రోజులలో దేశం నలుమూలల



నుండి జనులు తండోపతండాలుగా వచ్చి చేరతారు.

సహస్రాబ్దాలపురాతన చరిత్ర, పవిత్రతల వెనుక దాగి ఉన్న సాంస్కృతిక వైభవం ఈ ఉత్సవ సమయంలో బహిర్గతమౌతుంది. సాధువులు, భాగవతులు, నాట్యకారులు, సంగీత కారులు, వ్యాపారులు, విభిన్న వస్త్రాలంకృతులైన భక్తులు, బాజాభజంత్రీలు, సంబరాలు, ఉత్సవాలు ఒకటే మిటి... సమస్తం ఒకచోట కూడి కనుల విందు, వీనులవిందు కల్గిస్తాయి. చంద్రభాగానదీ పవిత్ర తీరాన వెలసిన పురాతన స్నానఘట్టాల్లో ఆషాఢ స్నానమాచరించి తరించ డానికి వేలాది భక్తులు లింగ-వయోభేదాల్ని, జాతి - కుల విభేదాల్ని మరచి చేరుకుంటారు. పండరీపురాన్ని గురించి చెప్పుకున్నప్పుడు వర్కారీలను గురించి చెప్పుకుని తీరాలి. ఆషాఢ ఉత్సవంలో వీరే ముఖ్య ఆకర్షణ. వర్కారీలకు అతి పవిత్ర పుణ్య క్షేత్రమిది. భాగవత ధర్మ పరాయణులైన వర్కారీల భక్తి విశ్వాసాలను ప్రతిబింబిస్తుందీ ఉత్సవం. సాంప్రదాయానుసారం తెల్లని వస్త్రాలను ధరించి వర్కారీలు సంవత్సరంలో రెండుసార్లు - ఆషాఢ, కార్తీక మాసాల్లో - పండరీపురం వస్తారు. వీరు వృత్తిరీత్యా వ్యవసాయదారులు, వ్యాపారులు అయినా ప్రవృత్తి భాగవత ధర్మానుసరణ, విఠోబా మహిమల ప్రచారం. వారి భక్తిశ్రద్ధలు వర్ణించడానికి మాటలు చాలవు. ఆషాఢోత్సవంలో భాగమైన పల్లకీ ఉత్సవంలో పండరీపురానికి అనతి దూరంలో ఉన్న వాఖేరీ నుండి పల్లకీని అనుసరిస్తూ వస్తారు వీరు. విఠోభా దేవాలయం కనపడగానే భక్తి పరవశంతో నేలపై పడి సాష్టాంగ ప్రణామాలు ఆచరిస్తారు. బాహ్య ప్రపంచాన్ని మరచి విఠోభా మహిమల్ని గొంతెత్తి గానం చేస్తారు. గర్భగుడిలోనికి ప్రవేశించగానే ''పుండరీక వరద హరి విఠలా'' అని గొంతెత్తి పలుకుతూ విఠలునికి వంగి వంగి దండాలు పెడతారు. పండరీపురంలో విఠలుడు కొలువుండడానికి కారకుడైన పుండరీకుడికి తామంతా ఋణపడి ఉన్నారని వీరి భావన.







పండరీ పురంలో ఆషాఢ పౌర్ణమి వరకు ఉండి ఆపై పండరీనాథుని మహిమలను ప్రచారం చేయడానికి తిరిగి వెళ్లిపోతారు.

పండరీపురానికి ఆగ్నేయంగా సుమారు ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో ఉన్న గోపాల్ పూర్‌లోని గోపాలకృష్ణుని ఆలయం చూడదగ్గది. చుట్టుప్రక్కల ఇంకా అనేక దర్శనీయ స్థలాలున్నాయి.

ప్రయాణీకుల సౌకర్యార్థం పండరీపురంలో తానేపూర్ మహరాజ్ మఠం, గజానన్ మహరాజ్ మఠం వంటి అనేక మఠాలు, సత్రాలు ఉన్నాయి. ఇవికాక అనేక నివాస సౌకర్యాలున్నాయి. ✸

# పుస్తకాల భవిష్యత్తు?!



మా పక్కింటి వాళ్ళు ఇల్లు ఖాళీ చేసి వెళుతూ ఇంట్లో ఉన్న పాత సాహిత్య గ్రంథాలన్నింటిని నా కిచ్చేసి వెళ్ళారు. ''మా ఇంట్లో పుస్తకాలు చదివే వాళ్లేలేరు. మా జ్ఞాపకంగా ఉంచండి'' అని చెప్పారు. ఇది కాలంతో పాటు మారుతున్న అభిరుచుల ప్రభావం.

నా పుస్తకాలతో పాటుగా వాటిని సర్దుతూ ఉన్నాను. నిజం చెప్పాలంటే ఒక చిన్న గ్రంథాలయమే మా ఇంట్లో ఉందని చెప్పవచ్చు. నా చిన్నప్పట్నుంచి ఇప్పటిదాకా సంపాదించిన పుస్తకాల సంఖ్య మూడంకెలు దాటింది.

పెళ్ళవుతూనే పుట్టింటిసారెతో పాటుగా నేను తీసుకువెళుతున్న పుస్తకాలను తనిఖీ చేసిన మా బంధువర్గంలోని కొందరు పగలబడినవ్వారు కూడా. కారణం మంచి మంచి సాహిత్య గ్రంథాలతో పాటు – పెద్ద బాలశిక్ష, చందమామ పుస్తకాలు కూడా అందులో ఉన్నాయి. ఒకొక్క సంవత్సరపు చందమామలు ఓపిగ్గా బైండుచేయించి పెట్టాను. వాళ్ళలా నవ్వినందుకు కోప్పడ్డాను కూడా. ఎందుకంటే నేను మొట్టమొదట చదివిన పుస్తకాలు పెద్దబాలశిక్ష, చందమామలే. నేనే కాదు, ఆ రోజుల్లో ఈ పుస్తకాలు చదవని పిల్లలే లేరని చెప్పవచ్చు.

ఆ రోజులు, ఆ జ్ఞాపకాలు అంటూ జీవితమనే పుస్తకంలోని మధురానుభూతుల పుటలని త్రిప్పి చదవసాగింది మనస్సు.

రోజూ సాయంత్రం వీధిదీపాలు వెలగగానే ఆడుతున్న ఆటలు ఆపి, పిల్లలందరం వారి వారి ఇళ్ళకి చేరుకొనే వాళ్ళం. కాళ్ళు చేతులు కడుక్కొని, దేవుడికి దణ్ణంపెట్టుకొని, పలక, బలపం పట్టుకుని, తాతయ్యముందు కూర్చునే వాళ్ళం. తాతయ్య వాలుకుర్చీలో కూర్చుని, చేతిలో పెద్దబాలశిక్షతో మా కోసం సిద్ధంగా ఉండేవాడు.

ఆ రోజుల్లో పెద్దబాలశిక్ష పిల్లలందరికి ఒక పాఠ్యపుస్తకం లాంటిది. భాషను నేర్చుకోవడంతోపాటు, లోకజ్ఞానం కలిగించే ఉత్తమ గ్రంథం అనికూడా చెప్పవచ్చు. తెలుగు అక్షరాలు, గుణింతం లేకుండానే అచ్చులతో, హల్లులతో రెండక్షరాల మాటలు, తర్వాత గుణింతం, వత్తులు, రెండక్షరాలు, మూడక్షరాలు, నాలుగక్షరాల పదములు, సాధకం, ఆ పిమ్మట ప్రాసవాక్యములు. తర్వాత సుమతి వేమన నీతులు, నీతికథలు, లోకస్వభావము, సామెతలు, గణితము, ఎక్కములు, తిథి, వార, నక్షత్రములు, నెలలు, ఇలా ఒకటేమిటి, పిల్లలు నేర్చుకోవలసినవన్నీ ఒక క్రమంలో పూసగ్రుచ్చినట్లు వ్రాసిన గ్రంథం.

రోజూ తాతయ్యచెప్పినట్లు పలకలో రాసి చూపించి, అప్పజెప్పేవాళ్ళం. చదవని వాళ్ళకి కథలు చెప్పేదిలేదని తాతయ్య బెదిరించేవాడు. చదువయిన తర్వాత అమ్మ పిల్లలందరిని కూర్చోబెట్టి, చేతిముద్దలు పెట్టేది. పెద్దకంచంలో వేడివేడి అన్నం, నెయ్యి, పప్పు వేసి కలిపి, పెడుతూ ఉండే అమృతంలా ఉండేది. అన్నంతోపాటు అమ్మ చెప్పే తన బాల్యం తాలూకు అనుభవాల కబుర్లు ఇంకా బాగుండేవి.

ఇక భోజనాలయ్యాయంటే చాలు మహదానందం. తాతయ్య కథలు చెబుతాడు. ఆ కథలకోసం ఎవరే పని చెప్పినా శ్రద్ధగా చేసేవాళ్ళం. ఆరు బయట తాతయ్య ప్రక్కన వరుసగా పడుకొని కథలు వినడం అంటే ఓ గొప్పసరదా. తాతయ్య ప్రక్కన పడుకోడానికి నేనంటే నేనని తగవులాట. అందరికంటే చిన్నవాళ్ళకే ఆ అర్హత అంటూ తాతయ్య ఆ సమస్యకి పరిష్కారమార్గం చెప్పడంతో తగవు సద్దుమణిగేది.

రామాయణం, భారతం, భాగవతం అన్నీ చెప్పేవాడు తాతయ్య కథలు వింటూ నవ్వేవాళ్ళం. కథల్లోని విషాద ఘట్టాలకు ఏడ్చేవాళ్ళం. ఉపమన్యుని కథవింటే మాత్రం మహా ఏడుపొచ్చేది మాకు. తాతయ్య కావాలనే కథలోని చివరి భాగాన్ని మరీ వర్ణించి చెప్పేవాడు. కళ్ళనీళ్ళు చెక్కిళ్ళ మీద జరుగుతుండగా ''ఇప్పుడు అశ్వనీ దేవతలు ప్రత్యక్షమయ్యారు కదూ!'' అంటూ విషయాన్ని త్వరగా చెప్పమని తొందరపెట్టేవాళ్ళం. అంతగా ఆ కథల్లో లీనమైపోవడం, చెప్పిన కథల్నే మళ్లీమళ్లీ చెప్పించుకోవడం అంతా ఒక చక్కని మధురానుభూతి.

అమ్మ భోజనాలకి పిలిచేదాకా కథలు చెప్పడం తాతయ్య వంతయితే, ఆ తరువాత నాయనమ్మవంతు. కాకమ్మకథలు, పంచతంత్రం కథలు, పేదరాశిపెద్దమ్మ కథలు, భేతాళకథలు ఇలా బోలెడన్ని కథలు చెప్పేది నానమ్మ. ''కాకులు దూరని కారడవి, చీమలు దూరని చిట్టడవి'' అని చెప్పగానే అడవి ఎలా ఉంటుంది? అందునా కారడవి

ఎలా ఉంటుంది? ఇలా ప్రశ్నల వర్షం కురిపించే వాళ్ళం.

కథలు వింటూ ఊ...ఊ అంటూ ఊ కొడుతూ మెల్లగా నిద్రకొరిగేవాళ్ళం. కొన్ని కథలు మహాసరదాగాను, ఉత్కంఠతని కలిగించేవిగాను ఉన్నప్పుడు వచ్చేనిద్రని ఆపుకొనే ప్రయత్నంలో మూసుకుపోతున్న కళ్ళని బలవంతంగా మూస్తూ, తెరుస్తూ, ''వింటున్నారా'' అన్న నాన్నమ్మ ప్రశ్నకి ఉలిక్కిపడి ''ఊ'' అంటా జోగుతుంటే, మా అవస్థచూసి, కథని రేపటికి వాయిదా వేసేది నాన్నమ్మ.

అలా ఆ రోజుల్లో కథల పట్ల ఆసక్తిని కలిగించే వారు పెద్దవారు. క్రమంగా మాకే చదవడం, వ్రాయడం బాగా తెలిసే సరికి మమ్మల్నే కథల్ని చదవమని ప్రోత్సహించే వారు. అప్పుడే బొమ్మల రామాయణం, భారతం లాంటి బాలల పుస్తకాలు కొనిపెట్టే వారు. అర్థం కాని పదాల అర్థాలు చెప్పేవారు. కథల్లో వచ్చే ప్రదేశాల వర్ణనలు, ఆయా పాత్రల వేషభాషలు, అన్నింటిని ఊహించు కొంటూ కలల్లో కూడా కలవరించేవాళ్ళం.

ఆ రోజుల్లో పుట్టినరోజు, ఉపనయనం లాంటి సందర్భాలలో ఎక్కువగా పుస్తకాలనే బహుమతిగా ఇచ్చేవారు. పిల్లల అక్షరాభ్యాసానికి పెద్దబాలశిక్షని బహుమతిగా ఇవ్వడం తాతయ్య అలవాటు. పుస్తకాలని ఎలా భద్రంగా దాచుకోవాలో కూడా నేర్పాడు తాతయ్య. వాటికి అట్టవేసి, ఎప్పుడుకొన్నదీ, ఒకవేళ ఎవరైనా బహుమతిగా ఇచ్చినట్లయితే వారిపేరు, తేదీ లాంటివివరాలన్నీ రాసే పద్ధతి కూడా ఆయన చలవవల్లే అలవడింది.

చిన్నప్పటి పుస్తకపఠనం అన్న అలవాటు నాతోపాటు పెరిగి పెద్దయి, ఇప్పుడీ చిన్ని గ్రంథాలయం రూపంలో జీవితాంతం తోడుండే ఓ మంచి స్నేహితునిగా నాముందు నిలిచింది.

ఈ పుస్తకాలన్నింటిని చూస్తూ ఉంటే ఎంత గర్వంగా ఉందో! సర్దుతున్న పుస్తకాలలోనుంచి అట్టలు చిరిగిపోయిన వాటిని తీసి ప్రక్కనపెట్టాను. తెలుగు నిఘంటువు, విశ్వనాథవారి వేయిపడగలు. నేను బడిలో చదువుతున్నప్పుడు సంగీత పోటీలోను, తెలుగు వ్యాసరచన పోటీలోను, వచ్చిన బహుమతులివి. అప్పుడు పాఠశాలల్లో ఇచ్చే బహుమతులు కూడా పుస్తకాలరూపంలో ఉండేవి.

కాలచక్రపరిభ్రమణంలో ఎన్ని మార్పులు! శాస్త్రసాంకేతికరంగాల విప్లవం, ఇంటింటా టీ.వి.లు, కంప్యూటర్‌లు, ఇంటర్‌నెట్‌లు. ఒకప్పుడు తీరికసమయాల్లో పుస్తకాలు చదివే పెద్దవారు కూడా టీ.వి. వీక్షణంలో కాలం గడిపేస్తున్నారు. పెద్దవారే ఇలా ఉంటే పిల్లలసంగతి సరేసరి. కాలక్షేపంపేరిట మనం ఎన్నెన్ని కోల్పోతున్నామో మనకే తెలియటం లేదు. కుటుంబసభ్యులంతా ఒకరితో ఒకరు మాటాపలుకులేకుండా యంత్రాలతో కాలం గడిపేస్తూ మానసిక చైతన్యానికి, మనోవికాసానికి దూరమవుతూ అనుబంధాలు, అనుభూతుల మాధుర్యం ఏమిటో కూడా తెలుసుకోలేకపోతున్నారు.

వాస్తవం గుర్తుకురాగానే మనస్సులో ఏదో బాధ. ఎదురుగా ఉన్న పుస్తకాలు మా భవిష్యత్తు ఏమిటో చెప్పగలవా అంటూ నన్ను నిలదీసి ప్రశ్నిస్తున్నట్లనిపిస్తోంది. ఏం చెప్పగలను? పెద్దవారు పిల్లలకి కేవలం పెద్దపెద్ద చదువులు చెప్పించి, ఆస్తులు పంచివ్వడమే కాదు, మంచి సంస్కారాన్ని, మంచి అలవాట్లని కూడా వారసత్వంగా అందించే రోజులు తప్పకుండా వస్తాయన్న ఆశాభావంతో నన్నునేను సమాధానపరచుకొన్నాను.

పుస్తక పఠనం వల్ల పెరిగే ఊహాశక్తి, భావనా పటిమ బలీయమైనదని శాస్త్రవేత్తలు రుజువు చేస్తున్నారు. మెదడుకి ఉన్న శక్తిని నిర్వీర్యం చేయకుండా ఉండాలంటే టీ.వీ. ముందు చతికిలబడే కన్నా, పుస్తక ప్రపంచాన్ని మన ముందు తెరుచుకోవడం ముఖ్యం. ✦

# 'మా ఊరి దేవుడు' శీర్షికకు ఆహ్వానం

**మీ ఊళ్ళో ఉన్న దేవాలయం, దాని ప్రశస్తి, మహిమలు క్లుప్తంగా వివరించి రాసి, ఆ గుడి ఫోటోతో సహా పంపి ఈ శీర్షికలో పాల్గొనండి.**



**పూజలందుకుంటున్న గుడులే కాక, ఎంతో ప్రశస్తి ఉన్నప్పటికీ నిరాదరణకు గురౌతున్న గుడుల గురించి కూడా రాసి, ఫోటోతో సహా పంపవచ్చు. పూర్తి పేరు, చిరునామా రాసి పంపించాలి.**

**ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకి పారితోషికం ఉంటుంది.**

**మీరు పంపవలసిన చిరునామా :**

**'మా ఊరి దేవుడు' శీర్షిక**

**ఋషిపీఠం**

**భారతీయ మానస పత్రిక**

'పార్క్‌వ్యూ', నెం. 6, 4వ ఫ్లోర్,
85, జి.యన్.చెట్టి రోడ్,
టి.నగర్, చెన్నై – 600 017.

స్వామీజీ–చార్వాకరావు

# సత్యం - నారాయణం వ్రతం

విశ్వనాథ పావనిశాస్త్రి



స్వామి సత్యనాథానంద ఆశ్రమంలో, అంతా కలిసి సత్యనారాయణ వ్రతం చేసుకుంటున్నారు. స్వామీజీ దగ్గరుండి, అందరి చేతా జాగ్రత్తగా యథావిధిగా చేయిస్తున్నారు.

రాబర్ట్ కూడా ఒకచోట కూర్చుని అంతా శ్రద్ధగా గమనిస్తున్నాడు.

పంచలోకపాలకుల పూజ జరిగింది.

నవగ్రహ పూజ జరిగింది.

ద్విక్పాలక పూజ జరిగింది.

తర్వాత పంచామృతాలతో సత్యనారాయణస్వామి ప్రతిమా శోధనా, ప్రాణప్రతిష్ఠా జరిగాయి. షోడశోపచార పూజలూ, ధూప దీప నైవేద్యాది ఉపచారాలూ జరిగాయి.

వ్రతకథ ఐదు అధ్యాయాలూ స్వామి వారే స్వయంగా చెప్పారు. రసవత్తరంగా సాగిన ఆ కథాశ్రవణం తర్వాత అంతా అక్షతలు శిరస్సున ధరించారు.

రాబర్ట్ ఆశ్చర్యపోయాడు. ఈ వ్రతం చాలా విచిత్రంగా ఉందే! ఇందులో స్వామి వారి సర్వాంగ పుష్పపూజ తప్ప, అసలు వ్రతం ఏముంది? మిగిలినదంతా అటు ఇతర పూజలూ, ఇటు కథాభాగమేనాయె! ఏమిటీ వ్రతంలోని రహస్యం?

రాబర్ట్ ఇలా ఆలోచిస్తుండగా ప్రసాద వినియోగం మొదలైంది.

సరిగ్గా ప్రసాదం సమయానికి చార్వాకరావు కూడా వచ్చాడు.

''ప్రసాదంగా కాదుగాని, ఫలహారంగా స్వీకరిస్తాను'' అని ఒక దోసెడు సత్యనారాయణస్వామి ప్రసాదం నోట్లో వేసుకుని బొక్కడం మొదలుపెట్టాడు.

బొక్కుతూ, ''ఆహా! వ్రతం సంగతి ఎట్లా ఉన్నా, దీని దుంపతెగ, ఈ ప్రసాదం మాత్రం మహా మధురంగా ఉంటుందయ్యా'' అన్నాడు రాబర్ట్‌తో.

''జాగ్రత్తగా ఆలోచిస్తే, వ్రతంలో ఏదో కనబడేటట్టుందయ్యా!'' అన్నాడు రాబర్ట్.

''మాధుర్యమా, మట్టి గడ్డలా! నువ్వు మరీ మూఢంగా తయారవుతున్నావీ మధ్య'' అని మరో దోసెడు ప్రసాదం పట్టి, ''ప్రసాదం తప్ప ఏముందీ వ్రతంలో? ఒక పద్ధతా, పాడా?! బంగారం దగ్గర మొదలై మట్టిదాకా దిగిపోయి, ఎలాగో అలాగ నా బొమ్మ చేసి నన్ను పూజించండిరోయ్, అని గోలపెట్టేసి, కాళ్ళట్టేసుకుని, బతిమాలేస్తూ ఉంటాడీ స్వామి. దానికితోడు చేస్తానని చెయ్యకపోతే కోపంట, అపైన శాపంట! బుద్ధుండాలి. అయినా శాపం పెట్టేవాడు దేవుడేమిటయ్యా?'' అన్నాడు చార్వాకరావు.

స్వామివారు నవ్వుతూ, ''ఓహో! అయితే దేవుడున్నాడన్న మాట! వాడు మాత్రం శాపం పెట్టకూడదన్న మాట!'' అన్నారు.

తింటున్న ప్రసాదం పొరమారి, ''ఛ ఛ! దేవుడా, గోంగూర కట్టా!'' అన్నాడు చార్వాకరావు.

స్వామివారు అతగాడిని వింతగా చూస్తూ, ''ఇది మరీ బాగుంది. నీ దృష్టిలో దేవుడు లేడు. ఒకవేళ ఉంటే వాడు ఎలా ఉండాలో నువు నిర్ణయిస్తున్నావు. అంతేనా!'' అన్నారు స్వామివారు.

''యస్! దేవుడు ఫిక్షన్. ఆ ఫిక్షన్ ఎలా ఉండాలో మీకు నిర్ణయం చేసి పెడుతున్నాను.'' అన్నాడు చార్వాకరావు కాలర్ ఎగరేస్తూ.

''దేవుడెలా ఉండాలో నిర్ణయం చేసేది నువ్వూ నేనూ కాదు. మనం ఎలా ఉండాలో నిర్ణయం చేసే వాడే దేవుడు. అందుకే ఈ వ్రతం'' అన్నారు స్వామీజీ సీరియస్‌గా.

వెంటనే రాబర్ట్ అందుకొని, ''క్షమించండి స్వామీ! మీరేమీ అనుకోకపోతే నాదో చిన్న అనుమానం. వ్రతంగా ఆచరించడానికి ఇందులో ఏముంది? నాకర్థం కావడం లేదు'' అన్నాడు.

స్వామి వారు నవ్వుతూ, ''మానవుడు ఏం చెయ్యాలో అది చెప్పే సూత్రం ఉంది. ఆ చెయ్యవలసినది చెయ్యకపోతే ఏం జరుగుతుందో వివరించే సూత్రం ఉంది'' అన్నారు.

రాబర్ట్, ''నా కదే అర్థం కావడం లేదు. ఇందులో లోకపాలకుల పూజా, నవగ్రహ పూజా, దిక్పాలక పూజా, కథా తప్ప అసలు వ్రతం అంటూ ఏమీ కనబడటం లేదు. దయచేసి వివరించమని ప్రార్థిస్తున్నాను'' అన్నాడు.

స్వామివారు కళ్ళలో కాంతులు విరజిమ్ముతుండగా యిలా అన్నారు: ''అదే అసలు రహస్యం. జాగ్రత్తగా విను. సత్యమే నారాయణ స్వరూపం. ఈ విశ్వమే నారాయణుడు. ఈ విశ్వమును గురించీ, ఆ సత్యమును గురించే మానవుడి నిత్యపరిశోధన. అనంతంగా సాగే పరిశోధనలో ఎప్పుడూ ఏదో ఒక విఘ్నమే. భూత వర్తమాన భవిష్యత్తులే సృష్టిస్థితి లయలు. మానవుడి ఆవిర్భావానికి కారణం మాతృ దేవత. వీళ్ళే పంచలోక పాలకులు. మాతృదేవతకి ప్రతీకగా ''గౌరీ దేవి'', సృష్టిస్థితి లయలకు ప్రతీకలుగా ''బ్రహ్మ విష్ణుమహేశ్వరులు''. సత్యాన్వేషణలో అడ్డుతగిలే అహంకారాదులను నియమించే జ్ఞాన ప్రతీకగా ''విఘ్నేశ్వరుడు''. వీళ్ళే పంచలోక పాలకులు. ముందు వీళ్ళని అర్థం చేసుకోవాలి. అందుకే ఆ పూజ.

మానవుడి జీవన మార్గంలోని ఒడుదుడుకులికి కారణం సూర్యచంద్రాది గ్రహ సంచారం. దివారాత్రములూ, ఋతుభేదములు దగ్గరనుంచి అనేక మార్పులికి ఆ గ్రహసంచారమే కారణం. ఆ నవగ్రహాలనీ అర్థం చేసుకోవాలి. అందుకే ఆ పూజ.

ఈఒడుదుడుకులనుంచి తప్పించుకోవాలని ఉన్నచోటు విడిచి, అనేక ఆశల (దిక్కుల) వైపు మానవుడు పరుగులు తీస్తాడు ఆ దిక్కులకి అధిపతులైన వారిని అర్థం చేసుకోవాలి. అందుకే దిక్పాలక పూజ.

భూత భవిష్యద్వర్తమానవముల యందు, ఎన్ని ఒడుదుడుకులు ఎదురైనా, వ్యర్థమైన పరుగులు తియ్యకుండా మానవుడు నిత్యం ఈ నారాయణ స్వరూపమైన సత్యాన్వేషణలో ఉండాలి - ఇదే బోధిస్తుంది ఈ వ్రతం....

ఇక ఈవ్రత కథాభాగంలోకి వస్తే, ఆ వ్రతం మొదట చేసినవాడు ఒక బ్రాహ్మణుడు - అనగా జ్ఞాని. ఆయన ఈ వ్రతాన్ని నిష్కామంగా చేశాడు. మోక్షం పొందాడు. ఆయన్ని చూసి వెంటనే ఒక కట్టెలమ్ముకునే వ్యక్తి - అనగా ఒక కార్మికుడు - ఆ పూట వచ్చిన ద్రవ్యంతో వ్రతం చేస్తానని అనుకుని చేశాడు. అతడూ నిష్కామంగానే చేశాడు. జ్ఞానంతో కాకపోయినా, యద్యదాచరతిశ్రేష్ఠః - శ్రేష్ఠుడు జ్ఞాని అయినవాడు ఏది చేస్తున్నాడో చూసి అది చేశాడు. ఫలితం పొందాడు. - ఆ తర్వాత ఒక రాజు సంతానం కోరి ఈ వ్రతం చేశాడు. అంటే లౌకిక లాభాలకై సత్య మార్గంలో పడ్డాడన్నమాట. ఒక మెట్టు దిగాడన్నమాట.

ఇక అక్కడి నుంచి మొదలైంది అసలు కథ. జీవితాన్ని లాభనష్టాలతో తూకం వేసే వ్యాపారి సత్యాన్వేషణ ప్రారంభించాడు. నాకు సంతానం అనే లాభం కలిగితే, వ్రతం చేస్తానన్నాడు. అంటే రుజువు దొరికితే, సత్యం పాటిస్తాడన్న మాట. అయితే వెంటనే సంతానం కలిగింది. అయినా పాటించలేదు. అదే లోభిత్వం - దాంతో నానా బాధలూ పడ్డాడు. ద్వీపాంతరంలో ఖైదు శిక్ష అనుభవించాడు. అక్కడెక్కడో అతని భార్యా, కూతురూ ఆచరించిన వ్రత ఫలితంగా విడుదలయాడు. అంటే - నువ్వాచరించిన సత్యం, నిన్నేకాక ఎక్కడో ఉన్న నీ వాళ్ళని కూడా కాపాడుతుందన్నమాట.

విడుదలైనా ఆ వ్యాపారికి బుద్ధి రాలేదు. ''నీ ఓడలో ఏమున్నాయి'' అని అడిగిన ఒక సాధువుతో వృథాగా అసత్యం చెప్పాడు. దాని ఫలితం వెంటనే ఓడ మునిగిపోయి అనుభవించాడు. ఎదురుగా సాధువు కనబడుతుంటే, వాడు దొంగేమో నన్న అనుమానంలో పడిపోయే స్థితికి వచ్చి అసత్యం ఆడేవాడికి నిష్కృతి లేదని ఈ విషయం చెపుతోంది.

చివరికి ఎలాగైతేనేం యిల్లు చేరుకున్నాడు. వ్రతం చేస్తున్న అతడి కూతురు, భర్త వచ్చాడన్న వార్త విని ఆనందంతో ప్రసాదం తీసుకోకుండా, పరుగులు తీసింది. ఆ భర్త ఓడతో సహా మునిగిపోయాడు. కాబట్టి దీని అర్థం ఏమిటి? సత్యాచరణలో అనవసర మమకారాలొద్దు. ఆ ఆచరణ సంపూర్ణంగా ఉండాలి. ఫలితం కలిగే సమయానికి అనగా ప్రసాద స్వీకరణ అన్నమాట - వ్రతభంగం చెయ్యకు. అంతా వృథా అవుతుంది - అని. ఇది ధనలోభ మమకారాల బాధ.

అలాగే.ఒక రాజు, గోపాలకులు వ్రతం చేసి ప్రసాదం యిస్తే స్వీకరించలేదు. ఇది అహంకారం. ప్రజలను కన్నబిడ్డలుగా చూడవలసినవాడు సత్యాన్ని విడిచి అహంకరిస్తే జరిగే ఫలితం ఏమిటో వివరింపబడింది.

కాబట్టి, ఈ వ్రతంలో గ్రహించవలసింది ప్రధానంగా ఇది. జగత్తులో సుఖానికి గాని, తర్వాత మోక్షానికి గాని సత్యాచరణమే గతి. అది ఆచరించనినాడు ఇక్కడా అక్కడా కూడా బాధలు తప్పవు. కాబట్టి మానవుడికి సత్యాచరణమే గతి. ఏదిక్కున ఉన్నా ఏ సమయంలోనైనా, ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా సత్యం తప్పకూడదు. అట్టే మాట్లాడితే సత్యం తప్పితేనే కష్టాలు వస్తాయి. అని వివరిస్తుంది ఈ వ్రతం. అదే ఈ వ్రతం యొక్క గొప్పదనం.

ఇక బంగారంతో గానీ, లేదా వెండితో గానీ, లేదా మట్టితోగానీ ప్రతిమ చేయమన్నారంటే అర్థం - మనల్ని బతిమాలడం కాదు. మన పూజకోసం దేవుళ్లు వెంపర్లాడరు. 'నీ శక్తివంచన చేయకు' అనీ, 'అయ్యో! నాకు స్తోమత లేదే - అని విచారించకు, నీ తాహతుకు తగినట్టుగా, ద్రవ్యలోపం చేయకుండా, మనసారా అర్చించమ'నీ ఋషి బోధ.

మనం సత్యాన్ని తప్పితే, ఆ శాశ్వత సత్యనియమోంఘన ఫలితంగా మనం దెబ్బ తింటాం. అసత్యానికి ఫలమే భగవంతుని కోపంగా, శాపంగా వర్ణింపబడింది.'' అని వివరించారు స్వామివారు.

రాబర్ట్‌తో సహా సత్యం గ్రహించి అంతా పరవశించిపోయారు. ప్రసాదం బొక్కుతూ చార్వాకరావు నిష్క్రమించాడు. ✦



# మా ఊరి దేవుడు

# శ్రీహరిహరేశ్వరస్వామి

ర్ణాటక రాష్ట్రం, చిత్రదుర్గ జిల్లాలోని హరిహరేశ్వరాలయం అతి విశిష్టమైనది. తుంగభద్రానదీ తీరాన వెలసిన శ్రీహరిహరేశ్వరాలయం కారణంగా, ఆ పట్టణం ''హరిహర''గా ప్రసిద్ధిచెందింది. మిరాజ్-బెంగుళూరు రైలు మార్గములో వున్న ఈపట్టణం నలుదిక్కులా బస్‌సౌకర్యం వుంది.

అమరశిల్పి జక్కన నిర్మితమైన ఈ ఆలయం శిల్పకళాఖండాల భాండారం. దాదాపు ఎనిమిదివందల సంవత్సరాల క్రితం నిర్మింపబడినదిగా భావింపబడింది.

ఈ ఆలయ మండలి శ్రీహరిహరేశ్వరుడు దాదాపు ఆరు అడుగుల ఎత్తుగల సాలగ్రామ శిలామూర్తి. ఈమూర్తికి పాదములులేవు. పాదతలం నుండి అరడుగు ఎత్తువరకు కాళ్ళులేవు. పూర్వాభిముఖుడు స్వామి. ఈ మూర్తి కుడిభాగం పార్వతీపతియైన పరమేశ్వరుని అర్ధదేహంగాను, ఎడమభాగం శ్రీలక్ష్మీపతి అయిన హరిరూపంగాను వుండి వెలుగుతోంది.

శ్రీహరి హరేశ్వరుని హరాంశమైన కుడివైపున వున్న ఒకచేతిలో త్రిశూలమున్నది. మరొక చేయి అభయహస్తం. కుడిచెవిపై నాగభూషణం వున్నది. కుడివైపునున్న శిరస్సులో సగభాగం జటా, గంగాదేవి, మరియు చంద్రునిచే అలంకృతమై వున్నది.

హరిఅంశమైన ఎడమభాగమున ఒక చేతిలో శంఖము, మరొకచేత చక్రము వున్నాయి. హరి అంశం చెవి కుండలాలచే శోభితం. హరిభాగం శిరసున కిరీటమున్నది. హరిహరేశ్వరమూర్తి మెడలో రుండమాల, వైజయంతీమాల, సాలగ్రామ మాలలున్నాయి. ఈ మూర్తి కుడివైపున పార్వతి, గణపతుల మూర్తులున్నాయి. ఎడమవైపున శ్రీమహాలక్ష్మి ఋష్యశృంగ ఋషులున్నారు. వీటితో మనకు కానవస్తున్నాడు



ఈ క్షేత్రమునకు సంబంధించిన కచ్చిత మైన చారిత్రకాధారాలు లేవు. ప్రాచీన కాలంలో 'కూడలూరు'గాను, ఇచట వెలసిన స్వామిని శంకరనారాయణులు గాను పేర్కొన్నట్లు ఆలయశాసనములు తెలుపుచున్నవి. శంకరనారాయణులే కాలక్రమమున హరి హరేశ్వరుడుగా పిలువబడి యుండవచ్చు.

హరిహరేశ్వర చరిత్ర స్కంద పురాణములోని కాశీకాండములో చెప్పబడింది. గుహుడనే ఋషిపుత్రుడు, మదోన్మత్తుడై, తనకు ఎవరితోనైనా, చివరకు హరి, హరాదులతోనైనా మరణము సంభవించకుండా వరమును కోరుతూ బ్రహ్మదేవుని గురించి తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై, యక్ష, రాక్షస, గంధర్వాదుల చేతగాని మరణము లేకుండా వరము నందుకొంటాడు. గుహుడు దేవతలను, మహర్షులను బాధిస్తూ లోకకంటకుడవుతాడు. దేవతలు శ్రీమహావిష్ణువును ఆశ్రయిస్తారు. తుదకు, హరిహరులిద్దరూ ఏకరూపమును ధరించి గుహుని, హతమారుస్తారు. గుహుడు చనిపోయే ముందు తన అపరాధమును క్షమించమని ప్రార్థించగా, అతని కోరిక మేరకు ఒకేరూపమున, గుహుడున్న స్థలమునే అవతరిస్తారు. అదే హరిహరేశ్వర క్షేత్రంగా పురాణ ప్రసిద్ధమైనది.

క్రీ.శ 1224లో చోళరాజ్యప్రతిష్ఠాపనాచార్యుడైన శ్రీవీరనరసింహదేవుల ప్రధాన దండనాథుడు హరిహరులకు ఆలయం నిర్మించినట్లు ఆలయ ప్రాంగణములోని

శాసనము తెలుపుచున్నది. క్రీ.శ 1554 నాటి శాసనంమేరకు, విజయనగర పాలకులైన సదాశివరాయల క్షౌరికుడు భైరప్పనాయకుని కుమారుడు బెళవది గ్రామాన్ని, వెండి పళ్ళెమును స్వామికర్పించెను.

ఉత్కళ దేశమహారాజు ఈక్షేత్రమును దర్శించి ఆలయానికి పెక్కుమాన్యము లిచ్చినట్లు శాసనమున్నది. కాలక్రమములో ఎందరో రాజులు ఈ ఆలయాన్ని విస్తృత పరచారు.

హరిహరేశ్వరాలయ శిల్పం అత్యద్భుతం. ఆలయమందలి స్తంభములు, ద్వారపాలకులు శిల్పనిక్షేపాలుగా, దర్శకులను అల రిస్తాయి.

హరిహరేశ్వరుల బ్రహ్మోత్సవాలు ఏటా మాఘశుద్ధదశమి మొదలు, మాఘబహుళ పాడ్యమి వరకు వైభవోపేతంగా జరుగుతాయి.

ఇటీవల ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ జి.డి. బిర్లా ఆలయ ప్రాంగణములో కళ్యాణ మంటపం నిర్మించారు.

యాత్రాక్షేత్రంగా ప్రసిద్ధమైన హరిహరము ఇటీవల పారిశ్రామిక కేంద్రంగా పేరు గాంచినది. మైసూరు కిర్లోస్కర్ లిమిటెడ్ వారి కర్మాగారం, శ్రీ ఘనశ్యామ్ బిర్లాగారి, హరిహరపాలిఫైబర్స్ కర్మాగారము ప్రసిద్ధమైనది. ఈ కర్మాగారాల్లో పదివేలకు పైగా కార్మికులున్నారు.

**''లక్ష్మీపతే! మధురిపో! పురుషోత్తమాద్య !**
**శ్రీకంఠ! దిగ్వసన! శూల! పినాకపాణే!**
**ఆనందకంద! ధరణీధర! పద్మనాభ!**
**త్యాజ్యాభటాయ ఇతిసంతత మామనంతి''**

**-డా. జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

# సభ

## శ్రీ శంకర జయంతి ఉత్సవాలు



వైశాఖ శుద్ధ పాడ్యమి ది. 5.5.2000 శుక్రవారం నుండి, పంచమి సోమవారం ది. 8.5.2000 వరకు శ్రీ శృంగేరి జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ మహాస్వామి వారి ఆదేశానుసారం విజయవాడ పట్టణములో గల శ్రీ శృంగేరీ జగద్గురు పాదుకాక్షేత్రం నందు శ్రీ శంకర భగవత్పాదుల వారి జయంతి మహోత్సవములు వైభవోపేతంగా నిర్వహింపబడినవి. ప్రారంభ దినమున శ్రీ శంకర భగవత్పాదులవారికి ఏకాదశరుద్రాభిషేకం, వేదపండితులచే నిర్వహింపబడినది.

ప్రతిరోజూ ప్రముఖులచే ఆదిశంకర తత్వానికి సంబంధించిన ప్రవచనాలు జరిగాయి. శ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీ బుర్రా రాధాకృష్ణమూర్తి, శ్రీ సామవేదం షణ్ముఖశర్మగారలు ప్రసంగించారు. శ్రీ శివరామ కృష్ణ క్షేత్రం నుండి రంగు రంగుల విద్యుత్ దీప అలంకరణ, పూలతో అలంకరించిన రెండు ప్రత్యేక వాహనములపై ఆదిశంకరుల ఛాయాపటము శ్రీ శారదాంబ ఛాయా పఠములు వుంచి భగవన్నామ సంకీర్తనలతో భీమవరం వాస్తవ్యులు శ్రీ కొత్తపల్లి కోదండరామగాంధీరాజుగారి ఆధ్వర్యమున సత్య నారాయణపురం తదితర ప్రాంతములందు బ్రహ్మాండమైన ఊరేగింపు ఉత్సవము నిర్వహింపబడినది.

ఈ ఉత్సవ కార్యక్రమములు అన్నియూ శ్రీ శృంగేరి జగద్గురు పాదుకాక్షేత్రం (విజయవాడ) ధర్మాధికారి శ్రీ వేమూరి వేంకట రామకృష్ణ శాస్త్రి, గౌరవ మేనేజరు శ్రీ ఆకెళ్ల సూర్యనారాయణమూర్తిగార్లు నిర్వహించినారు.

## అన్నమయ్య జయంతి



చెన్నైలోని ప్రసిద్ధ సంగీత సభా సంస్థ - ''శర్వాణీ సంగీత సభా ట్రస్ట్'' ఇటీవల - పదకవితా పితామహ అన్నమాచార్య జయంత్యుత్సవాలను అత్యంత వైభవంగా నిర్వహించింది. సంగీత, సాహిత్య, వేదాంత శాస్త్రాలలో చక్కని అభినివేశమున్న మేధావి, ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ మల్లాది సచ్చిదానందమూర్తి (ఎం.ఎస్.ఎమ్. గ్రూప్) సమర్పణలో ప్రతియేటా, ఈ సంస్థ అన్నమయ్య జయంతులను విజయవంతంగా నిర్వహిస్తోంది.

ఈ ఏడాది వేడుకల్లో ప్రసిద్ధ కర్ణాటక గాయనీమణులు 'ప్రియా సిస్టర్స్' (షణ్ముఖప్రియ, హరిప్రియ) తను ప్రతిభావ్యుత్పత్తుల్ని అద్భుతంగా ప్రదర్శిస్తూ - విభిన్న తరహాలో అన్నమయ్య కీర్తనలను ఆలపించి, సంగీతాభిమానుల మన్ననలు పొందారు. ✷

# ప్రేతలోక విశేషాలు

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

శరీరం ధరించిన ప్రతిజీవి తప్పించుకోలేనిది మరణం. సృష్టిలో కొంచెం ముందుగానో వెనకగానో తమ దేహాలు విడిచిపెట్టి లోకాంతర గతుడు కావలసిందే. సామాన్య మనుష్యుల దగ్గరనుంచి అసామాన్యులైన వ్యక్తులదాకా యీ స్థితి తప్పించుకోగల వారెవరూ లేరు. కాకుంటే కొందరు అల్పాయుష్కులు కావచ్చు. కొందరు దీర్ఘాయుష్కులు కావచ్చు. జీవులకు మరణమనేది అత్యంత బాధాకరమైన స్థితి. మరణించిన తరువాత స్థితి ఏమిటి? అనేదాన్ని గురించి అన్ని మతాలు, అందరు యోగులు ఆలోచించారు. ఎవరికి తోచిన జవాబులు వారు చెప్పుకొని సంతృప్తి చెందారు.

జంతువుల సంగతి తీసుకుంటే మనుష్యులకు వాటికి తేడా ఉంది. చనిపోయిన తరువాత మనుష్యులకు ప్రేతత్వం పొందటం, యమలోకానికి పోవటం వంటి దశలుంటాయి. యమలోకానికి మనుష్యులు మాత్రమే వెడతారు. క్రిమికీటక పశుపక్ష్యాదులు వెళ్ళవు. ప్రేతత్వమో, పిశాచత్వమో పొందటం మనుష్యులకే కాని యితర జీవులకు లేదు. చచ్చిన వెంటనే అవి మరొక గర్భంలో ప్రవేశించి జన్మలెత్తుతాయి. స్కాందంలో మహేశ్వర ఖండంలో ఈ విషయం స్పష్టంగా చెప్పబడింది.

**శ్లో. మనుష్యా ఏవగచ్ఛంతి**
**యమలోకం నచాపరే**
**మరణానంతరం తేషాం**
**జంతూనాం యోని పూరణం**
**తథాహి ప్రేతమనుజాః**
**శ్రూయంతే నాన్యజంతవః ॥**

పుణ్యాత్ములైన వ్యక్తులు అనాయాసంగా మరణిస్తారు. కుంతీదేవి తన మేనల్లుడైన శ్రీకృష్ణుణ్ణి ''అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనం'' వరాలుగా అడిగిందట. మరణబాధ లేకుండా ప్రేతత్వం పొందకుండా సూర్యమండలాన్ని భేదించుకొని యోగ సిద్ధుడైన పరివ్రాజకుడు, యుద్ధ రంగంలో వీరమరణం పొందినవాడు పోతారని పూర్వగ్రంథాలలో చెప్పబడింది.

**శ్లో. ద్వావిమౌపురుషౌలోకే**
**సూర్యమండల భేదినౌ ।**
**పరివ్రాడ్ యోగయుక్తశ్చ**
**రణేచాభిముఖేహతః ॥**

సామాన్యంగా అంతో యింతో పుణ్యం చేసినవాళ్ళు కూడా పదిరోజుల ప్రేతత్వాన్ని తప్పించుకోవటం కష్టం. ఆ తరువాత పుణ్యఫలితంగా ఊర్ధ్వలోకాలకు వెడితేవెళ్ళవచ్చు. ఇక పాపాత్ముల సంగతి చెప్పవలసిన పని లేదు. గరుడ పురాణంలోని ప్రేతఖండంలో పాపులగు ప్రాణుల గతులు చెప్పబడినవి. మరణం దగ్గరబడ్డ మనుష్యునికి ఒక క్షణం యుగం లాగా బాధాభరితంగా వుంటుంది.

**శ్లో. శతవృశ్చిక దష్టస్య**
**యాపీడాసానుభూయతే**
**ఫేనముద్గిరతే సోథ**
**ముఖంలాలాకులమ్ భవేత్**
**అధోద్వారేణ గచ్ఛంతి**
**పాపినాం ప్రాణవాయవః**

నూరుతేళ్ళు కుట్టిన బాధ అనుభవిస్తూ నురుగులు గ్రక్కుచూ ముఖం చొంగతో తడుస్తుంటే తమ దేహాన్ని చూస్తూనే బయటకి లాగబడతాడు. ఆ తరువాత వచ్చేది యాతనా దేహం. అంగుష్ఠ ప్రమాణంగల ఈ జీవుణ్ణి యమభటులు పట్టుకొని తమోమయమైన భయంకర మార్గాన రెండు మూడు ముహూర్తాలలో యమపురికి తీసుకు వెడతారు.

అక్కడ యమభటులు పాపికి ఘోరమైన నరకయాతనలను చూపించి యముని ముందు నిలబెడతారు. ఒక ముహూర్తంలో ఇదంతా పూర్తవుతుంది. యముని ఆజ్ఞచేత మళ్ళీ ఈ జీవి అంతరిక్షమార్గంలో భూమిలోని తన శరీరం దగ్గరకు తిరిగి చేర్చబడతాడు. యమపాశబద్ధుడై ఆకలి దప్పులతో పీడింపబడి ఏడుస్తూ వుంటాడు.

ఇక్కడ గమనించవలసిన అంశం ఏమిటంటే ఒక్కో మతంలో ఒక్కోవిధంగా నరకాన్ని గురించి, అక్కడికి తీసికెళ్ళే భటులను గురించి వర్ణించబడింది. ఆయా మతస్థులు మరణించినప్పుడు వాళ్ళ పూర్వసంస్కారానికి అనుగుణమైన వేషభాషలతో యమదూతలు కనిపిస్తూ వుంటారు. అందుకే కొన్ని సార్లు ఇంచుమించు మరణించి అతికష్టంమీద బ్రతికినవాళ్ళు యమలోకపు వింతలు చెబుతుంటే ఆశ్చర్యంగా వుంటుంది. ఆ యమభటులుకూడా సర్వజ్ఞత్వము, దేవజ్ఞత్వము కలవాళ్లు కారు. అల్ప శక్తులుగల చిన్న ఉద్యోగులు. కనుక అప్పుడప్పుడు పొరపాట్లు జరగడం కూడా కద్దు. ఒక్కో పర్యాయం ఒక వ్యక్తి మరణించినట్లై - అందరూ - చనిపోయినాడని ఏడుపులు, పెడబొబ్బలు బయలుదేరిన తరువాత కాసేపటికి బ్రతకటము, ప్రక్క వీధిలో అదే పేరుగల వ్యక్తి మరణించటము ప్రపంచంలో అరుదుగానైనా జరిగిన సంఘటనలు.

చనిపోయిన తర్వాత - జీవుడు శరీరంలోనించి బయటికి వచ్చిన తర్వాత కొన్నిసార్లు యమదూతలకు పేచీలు వచ్చిన సంఘటనలు పురాణాలలో కనిపిస్తూ వుంటవి. ఎంత పాపాత్ముడైనా ఏ దివ్యక్షేత్రమరణం వంటిదో పొందినప్పుడు వాడికోసం రెండు

వర్గాలవారు వాదించుకోటం, సహజంగా దేవదూతలు ఎక్కువశక్తిగలవారు కనుక యమదూతలనొప్పించి జీవిని తీసుకెళ్ళటం జరుగుతుంది.

బ్రహ్మాండపురాణంలోని లలితోపాఖ్యానంలో ఒక కథ వుంది. ద్విజవర్మ అనే కిరాతుడు ఒక అడవిలో వుండేవాడు. ఆ ప్రాంతంలో వజ్రుడనే దొంగ తను దొంగిలించిన ధనాన్ని భూమిలో పాతిపెడుతూ ఉండగా కిరాతుడు దాన్ని అపహరించాడు. ఎందరు ధనవంతుల యిండ్లలోనో దొంగిలించబడిన ధనమది. కిరాతుడా ధనంతో అడవిని బాగు చేయించి, అగ్రహారములు కట్టించి, చెరువు త్రవ్వించి, శివవిష్ణు దేవాలయములు కట్టించి పుణ్యకార్యాలెన్నో చేశాడు. ఆ ద్విజవర్మ చనిపోయిన తర్వాత దేవదూతలు, యమదూతలు వచ్చి ఆ జీవుని తీసుకెళ్ళటానికి పోట్లాడుకొన్నారు. అప్పుడు నారదుడు వచ్చి వాళ్ళను సమాధానపరచి తీర్పు చెప్పాడు. దొంగిలించబడిన ఆ ధనమెవరిదో వారంతా చనిపోయేదాకా కిరాతుడు వాయుభూతుడై ప్రేతరూపుడై అంతరిక్షంలో వుంటాడని తరువాత పుణ్యానుభవానికి వెళతాడని దేవర్షి చెప్పినమీదట వాళ్ళంతా వెళ్ళిపోయినారు.

జీవులీవిధంగా కొంతకాలం పాటు స్వర్గానికీ, నరకానికీ వెళ్ళకుండా, అంతరిక్షంలో ప్రేతలై తిరుగుతూ వుండవచ్చు. ఆ విధంగా తిరిగే ప్రేతాత్మలే మాంత్రికుల ఆవాహనకు దొరికేది. ఇతర లోకాలకు వెళ్ళిన వాళ్ళు మాంత్రికులకు దొరకరు.

ఆకాశంలో తిరిగే ఈ ప్రేతములకు తమక్రిందవున్న భూలోకవాసులను చూడగల శక్తి మాత్రమే ఉంటుంది తప్ప పైన, మరికొన్ని లోకాలున్నవనీ, వాటిలో అధికశక్తి సంపన్నులైన దేవగణాలుంటవనీ తెలియదు. మనుషులకు ఏవిధంగా ఇతరలోక జీవులను చూచే శక్తిలేదో ప్రేతములకు కూడా తమ పై భూమికలలో వుండేవాళ్ళను చూచే శక్తి ఉండదు.

కనుక ప్రేతముల నావాహనంచేసి దేవతలున్నారా? సిద్ధులున్నారా? అని అడిగితే వాళ్ళకు తెలియదు కాబట్టి - తెలియదనో, లేరనో సమాధానం వస్తుంది. అజ్ఞానులు ఆ మాటలనే నమ్ముతారు. ఈ లోకం ఎంత చిత్రమైనదంటే కొందరు దేవుని అస్తిత్వాన్ని నమ్ముతారు. దయ్యాలను, భూతాలను నమ్మరు. మరికొందరు వీటిని విశ్వసిస్తారు. సర్వశక్తి మంతుడైన పరమేశ్వరుని నమ్మరు.

మృతిచెందిన తర్వాత అంగుష్ఠమాత్ర దేహుడైన జీవుడు తన శరీరాన్ని తాను చూస్తూ, చుట్టూచేరి అందరూ దుఃఖిస్తూవుంటే తానూ దుఃఖిస్తూ వుంటాడు. అతనికి పిశాచత్వం రాకుండా వుండటంకోసం సంతానం కర్మ చేయాలి. పదిరోజులపాటు చేసే పిండోదక దానాలవల్ల ఇంకో శరీరం పుట్టి జీవుడు దాంట్లో ప్రవేశిస్తాడని గరుడపురాణం పలుకుతున్నది.

**శ్లో. అహోరాత్రైశ్చ నవభిః**
**ప్రేతః పిండమవాప్నుయాత్**
**జంతుః నిష్పన్న దేహశ్చ**
**దశమే బలమాప్నుయాత్**
**దగ్ధేదేహేపునర్దేహః**
**పిండై రుత్పద్యతేఖగ హస్తమాత్రః**

పదిరోజుల కర్మ పూర్తి అయ్యేసరికి హస్తమాత్ర ప్రమాణం గలిగిన దేహంతో పదకొండవ, పన్నెండవ రోజు తీవ్రమైన ఆకలి దప్పికలతో పిండదానాదులు తింటూ పదమూడవరోజు ప్రయాణంచేసి 'యమలోకం - నరకం చేరుకొంటాడు. ఆ పిదప తన కర్మననుసరించి పుణ్యపాపఫలితమైన సుఖ దుఃఖాల ననుభవించి మళ్ళీ భూలోకం చేరి జన్మయెత్తుతాడు.

మంత్రపూతమైన కర్మచేయబడని వాళ్ళగతి ఏమిటి? వాళ్ళకు సద్గతులు రావా? అన్ని మతాలలో ఇటువంటి కర్మకాండ లేదు గదా? వాళ్ళ పరిస్థితి యేమిటి?

లోకంలో దరిద్రుడైన వ్యక్తికి ధనవంతుడైన మిత్రుడో, దాతో సహాయం చెయ్యవచ్చు. తాను స్వయంగా సంపాదించినది కాకపోయినా స్నేహదానముల ద్వారా వచ్చిన ధనాన్ని దరిద్రుడనుభవించగలడు. స్వయంగా పుణ్యం చేసుకున్న వాడికి పుణ్యలోకములు, సద్గతులు ఎలాగూ లభిస్తవి. శ్రాద్ధకర్మ అనేది పైన చెప్పిన సహాయం వంటిది.

తమను కని పోషించినందుకు కృతజ్ఞతగా పుత్రులు తమ తల్లిదండ్రులకు శ్రాద్ధకర్మచేస్తే దాని ఫలితంవల్ల ప్రేతత్వవిముక్తి కలిగి పుణ్యాత్ములకు మరింత సుఖము, పాపాత్ములకు పాపవిమోచనము కలిగి మంచి స్థితికి పోతారు. తపోనిష్ఠులైన మహర్షులు కనిపెట్టిన అద్భుతమైన ఉపకారపద్ధతి ఇది. ఈ మార్గాన్ని అనుసరించి పెద్దల ఋణాన్ని పిన్నలు తీర్చుకోగల్గుతారు. తమ పెద్దలకు అలా పితృకర్మలు చేయనివారు పాపిష్ఠులై, ఆ పాప ఫలాలను ఇహపరాలలో అనుభవిస్తారు.

**శ్లో. భవంతీ ప్రేత రూపాస్తే పిండదాన వివర్జితా**
**అకల్పం నిర్జనారణ్యే భ్రమంతి బహుదుఃఖితాః**
**నా**
**అభుక్త్వాయాతనాం జంతుః మానుష్యం లభతేనహి॥**

కర్మకాండ లేనివారు దానము, శ్రాద్ధము, జలతర్పణము లభింపక ప్రేతరూపమును పొంది నిర్జనారణ్యమునందు బహుదుఃఖితులై కల్పాంతము తిరుగుచుందురు. చేసిన కర్మ అనుభవింపక కోట్ల కల్పములు గడిచినను తీరదు. ఏ ప్రాణికైనను కర్మ అనుభవించకుండా యాతనాదేహము పోదు. మనుష్యదేహము రాదు.

ప్రేతత్వ ప్రారంభదశలో జీవుడు స్వప్నావస్థవంటి ఒక స్థితిలో వుంటాడు. తాను

శరీరాన్ని విడిచిపెట్టాను, చనిపోయినాను అన్న సంగతి అర్థంచేసుకోవటానికి కొంత కాలం పడుతుంది. తాను ఏస్థితిలో, ఏ కారణంవల్ల మరణించాడో ఆ బాధ, భయము, దుఃఖము వదలవు. ఒక తమోమయమైన వ్యగ్రదశలో కొంతకాలం గడుపుతాడు.

సాధారణంగా తాము జీవించి వుండగా ఏ విశ్వాసాలతో వుండేవారో వాటి కనుగుణ మైన స్థితే మొదట వస్తుంది. అంటే ఒక నాస్తికుడు మరణిస్తే మరణానంతరం అతని సిద్ధాంతం ప్రకారం ఏమీ లేదు గనుక దాని కనుగుణంగా అతడు ఏమీ లేని స్థాణు స్థితిలో కొంతకాలం వుంటాడు. అయితే ఎల్ల కాలమూ అలా ఉండదు. ప్రకృతి సహజమైన పరిణామం చెంది కొద్దికాలానికే మరణానంత రం తను జీవించి వుండటాన్ని అతడు గ్రహించగలుగుతాడు.

అయితే ఆ స్థితిలో కూడ దేవుని మీద విశ్వాసము కలుగకపోవచ్చు. ఎందు కంటే ప్రేతాత్మ ఎన్నడూ దేవదర్శనం చెయ్యలేదు. సామాన్యంగా మొదటి పదిరోజులు గడిచే సరికి తమోదశ దాటి తనచుట్టూ వుండే [illegible]ని అర్థం చేసుకునే స్థితి వస్తుంది. మను[illegible]లను, పాంచభౌతికమైన ప్రకృతిని తాను చూడగలుగుతాడు. తనలాగా గాలిలో తిరిగే ప్రేతజీవులను చూడగలడు. వాటితో మాట్లాడగలడు. అంతవరకే, ఆ పైన వుండే జీవులను గురించి అతడికేమీ తెలీదు.

ఇక్కడకూడా మతవిశ్వాసాలశక్తి ప్రబ లంగానే పని చేస్తుంది. తీర్పు రోజు కోసం వేచి వుండటం వంటి మానసిక స్థితిలో కొంతకాలం వుంటాడు. హిందువులకు ఇతర లోకాలు, పునర్జన్మ మొదలైన వాని యందున్న నమ్మకాల చేత పరిణామం కొంచెం వేగంగా వస్తుంది. దీనికి కారణం శక్తివంతమైన మనస్సే తప్ప మరొకటి కాదు. ఈదశలో నుండి పరోపకార పరాయణులు, సకృతాత్ములు అయిన వ్యక్తులు సుదూరంగా ఊర్ధ్వ లోకాలు వెళ్ళిపోయి అక్కడ దివ్యసుఖాల ననుభవించి మళ్లీ క్రిందికి దిగివస్తారు.

మిగతా వారు ప్రేతత్వం వదలక తమ పూర్వస్మృతుల కల్లోలపు సుడిగుండాలలో పడి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యవశులై తీవ్ర స్వభావులై సంచరిస్తూ వుంటారు. ఆకలి దప్పికలు, విపరీత వాంఛలు నియత శక్తి గలిగిన మానవ శరీరం దాటి వాయు శరీరంలో వుండటం చేత వందలరెట్లు ఎక్కువ కాగా తమ మనస్సు సృష్టించుకున్న బాధ, భయ, భూమికల నుండి, ఇంద్రియ వికారాలనుండి బయట పడలేక మానసిక చిత్రవధను అనుభవిస్తూ వుంటారు. ఈ దశలో కలిగే భయంకర అనుభూతులన్నీ వైయక్తికములు, కర్మ ఫలితములు. ఈ దశల్లో వుండలేక తిరు గుతూ మానవ శరీరం దొరికితే బాగుండుకదా అని తపన చెందుతూ వుంటాడు. తన కోరికలు తీరటానికి పాంచభౌతిక శరీరం కావాలి. అందువల్ల ఎవరి శరీరంలోనైనా ప్రవేశం దొరుకుతుందేమోనని తీవ్రప్రయత్నం చేస్తుంటారు. బ్రతికి వుండగా తమకు అపకారం చేసిన వాళ్ళకు ప్రత్యపకారం చెయ్యటానికి కామవాంఛలు తీర్చుకోటానికి క్షుత్పిపాసలు పోగొట్టుకోటానికి మనుష్యు లను పట్టుకొని పీడిస్తూ వుంటారు. ఆ అవ కాశం అందరికీ దొరకదు.

మరి కొంతమంది యీ భూమిక దాటి సుదూరంగా వున్న నరకలోకానికి వెడతారు. భూమినుండి అది 86వేల యోజనముల దూరమున్నట్లుగా పురాణములలో చెప్ప బడింది. భూమిని ఆవిరించి భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములున్నవి. ఈ నరకలోకం భువర్లో కంలోని అడుగుభాగం. భూమికి దక్షిణంగా వుంటుంది. ఆ పక్కనే నైఋతి దిక్కున కేవలం ప్రేతాలయం ఉంటుంది. నరకంలోకి ప్రవేశించిన జీవులు తాను ఏ పాపములైతే చేశారో ఆ పాపముల కనుగుణమైన శిక్షలు పొందుతూ వుంటారు. ఆ వివరాలన్నీ పురా ణాలలో చాల భయంకరంగా వర్ణించ బడింది.

ఉదాహరణకు ఇటీవల పత్రికలలో కట్నమివ్వలేదనో, ఇతర విధాలైన ధనం కోసమో స్త్రీలను బలవంతంగా హింసించి, తగులబెట్టి చంపడం వింటున్నాము. ఆ పని చేసిన వారు మరణానంతరం కొన్ని వందల సంవత్సరాలపాటు ఆ హింసాదహన బాధను అనుభవిస్తూ వుంటారు. ఐతే ఒక సందేహం కలుగవచ్చు. సంవత్సరాల తరబడి తగుల బడటం ఏమిటి అని. మానవశరీరం ఒక పరిమితి దాటితే బాధను భరించలేదు. స్మృతి తప్పటమో, మరణించటమో జరుగుతుంది. కాని ప్రేతాత్మ బాధలననుభవించే యాతనా దేహం చావు లేనిది. ఎంత బాధనైనా అనుభ వించి తీరాల్సిందే తప్ప స్మృతి తప్పటమో, చావటమో అన్న స్థితి ఉదయించదు. పాపానుభవం పూర్తయినదాకా ఆ యాతనను అనుభవించక తప్పదు.

ఇనుప ముక్కుల కాకులు, తప్తతైల కటాహాలు, ఇంగలమున కాగిన మంగల ములు పాపులకు సుసత్యాలు. రౌరవము, మహారౌరవము, కాలసూత్రము, కుంభీ పాకము, అధతామిస్రవము, సంహారము మొదలైనవి నరక విభేదాలు. యమధర్మ రాజు దండధరుడై, దంష్ట్రాకరాళ వదనుడై క్రోధరక్తాంత కోచనుడై దుష్టులనిలా శాసి స్తాడట...

సీ. పాదంబు లిరుకేలబట్టి గుంజుండు జ
ర్ఝరింతంబుగా వీని జట్టుతాత
మెడం
గ్రుడ్ల రక్తములు చెక్కుల స్రవింప
గడికండలుగ వీని కంఠంబు వ్రేయుండు

ఋషిపీఠం

గరసాన బట్టి ఖడ్గధార
బులుత్రాళ్ల బంధించి తలక్రిందుగా వ్రేల
గట్టుడు వీని వృక్షంబు కొమ్మ

గీ. అంపమున వీని కంఠంబు ద్రెంపివిడుడు
మడమతాపుల వీని మర్మముల నొంపు
డెల్లగా నగ్నిగ్రాచిన యినుపయినుక
గులికి పోయుడు వీని ముక్కునను చెవుల.

గీ. పరకళత్రంబు కుచకుంభ పాళియందు
నఖముదివిచిన పాపాత్ము నఖమునందు
నెల్లగా నగ్నిగ్రాగిన యినుప సూదు
లుగ్ర దృష్టిని జొన్పుడత్యా గ్రహమున

(కాశీఖండము. 3. అ.)

ఈ బాధలన్నీ అనుభవించిన తరువాత పుణ్యమేమైనా కొంత వుంటే జీవుడు భువర్లోకపు పైభాగానికి వెడతాడు. ఈ బాధలను భవించే దశలేనివాడు ఈ నరక భూమికకు రాకుండానే సరాసరి పైకి వెడతాడు. ఈ భూమికలో లలితాకళాత్మకమైన అనుభూతులెక్కువగా వుంటవి. 'సంగీతమూ, నాట్యమూ, విద్యాధరులు, గంధర్వులు, అప్సరసలు విందులూ, వినోదాలు, విహారాలు - అంతా ఆనందమయమైన లోకము. తాను చేసుకున్న సుకృతం పూర్తయిన దాకా జీవుడీలోకంలో వుంటాడు.

చాలా కొంచెం పుణ్యం చేసినవాళ్ళు భువర్లోకంలో కొంచెం క్రింద పిశాచలోకంలో నివసిస్తారు. వీరి శరీరాలు ప్రేత శరీరాలు కావుగానీ, సౌందర్యవంతమైన దివ్యశరీరాలు కూడా కావు. జుంజురు వెంట్రుకలతో, బండి కందెనచాయ కాయములతో, గచ్చకాయల వంటి కనుగ్రుడ్లతో, గాడిద గొంతులవంటి వికృత కంఠస్వరములతో ఉంటూ కర్మానురూపమైన ఫలితములను అనుభవిస్తాడు.

అత్యుత్తమమైన పుణ్యకార్యాలు చేసినవారు మహాతపస్సు చేసినవారు భువర్లోకందాటి పైకి వెళ్ళిపోతారు. ✹

# మన పద్యం

నీవ పావకుడవు నీవ సూర్యుండవు
నీవ చంద్రుండవు నీవ జలము
నీవ నేలయునింగి నీవ సమీరంబు
నీవ భూతేంద్రియ నికరములును
నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును
నీవ యజ్ఞంబును నీవ ఫలము
నీవ లోకేశులు నీవ సర్వాత్మవు
నీవ కాలంబును నీవ జగము

నీవ బహుయజ్ఞభోజివి నీవ నిత్య-
మూలతేజంబు నీకునే మ్రొక్కువాడ
నీరజాక్షుండు చాల మన్నించునట్టి
శస్త్రముఖ్యమ! కావవే చాలు మునిని...

ఇది సుదర్శనచక్రాన్ని స్తుతించే

'శ్రీమదాంధ్ర మహాభాగవతం' - నవమస్కంధంలో 'అంబరీషోపాఖ్యానం' లోనిది. పోతనగారి మందారమకరందాలలో ఇది ఒకటి.

సుదర్శన దేవుడు సర్వజగచ్చైతన్య స్వరూపమైన దైవశక్తి. విష్ణుతేజస్స్వరూపుడు. విష్ణునకు అభిన్నుడు. విష్ణుభక్తులను కాపాడే దేవుడు.

దూర్వాసుడు నిష్కారణంగా ఆగ్రహించి, అంబరీషుని హింసించేందుకు 'కృత్య'ను ప్రయోగించిన తరువాత, నారాయణ ప్రేరితమైన సుదర్శనచక్రం అగ్ని శిఖలతో వచ్చి ఆ.కృత్యను సంహరించింది. ఆ తరువాత దూర్వాసమహర్షివైపు తిరిగే సరికి, దూర్వాసుడు భయంకంపితుడై రక్షణ కోసం బ్రహ్మ, రుద్ర, విష్ణులోకాలకు పరుగు పెట్టాడు. కానీ వారెవరూ రక్షణ నివ్వలేమనీ, భాగవతాపచారం తగదనీ, అంబరీషునే శరణు వేడమని చెప్పారు. దాంతో తన తప్పుతెలిసి అంబరీషుని వద్దకు వెళ్ళాడు. అంబరీషుడు సుదర్శనదేవుని ప్రసన్నం చేసుకొనేందుకు చేసిన స్తోత్రంలో తొలి పద్యమిది.

''ఓ సుదర్శనదేవా! నీవే అగ్నివి, సూర్యుడవు, చంద్రుడవు, నీటిని, నేలవు, నింగివి, గాలివి, భూతేంద్రియ సమూహానివి. నీవే బ్రహ్మమవు, సత్యమవు, యజ్ఞమవు, ఫలమవు. లోకేశులు నీవే. సర్వాత్మవు, కాలం, జగం నీవే. బహుయజ్ఞభోక్తవు. నిత్యమై మూలమైన తేజానివి నీవే. నిన్ను నేను నమస్కరిస్తున్నాను.

పద్మా

ముఖ్య ఆయుధమైన సుదర్శనా! ఇంక ఆగ్రహం చాలు, ఈ మునిని రక్షించుమా,''

ఈ పద్యంలో చివరి పదమైన ''మునిని'' అన్న మాట బదులు, ''మమ్ము'' అని పెట్టుకుంటే, మనమూ దీనిని స్తోత్రంగా చదువుకోవచ్చు. ✹

(గత సంచిక తరువాయి)

# విశ్వశక్తిని జాగృతం చేసి అద్భుతాలు సాధించే 'రేకీ'

'రేకీ నిపుణులు' మధురకవి శ్యామలరావు

రేకీ గురించి పూర్తిగా అవగాహన చేసుకోవాలంటే కొంతకాలం పడుతుంది. స్వానుభవం వలన రేకీశక్తి అనుభవం అవడం ఆ వ్యక్తి మీద ఆధారపడి ఉంటుంది. అసలు రేకీ ఉపదేశం అయినప్పుడే రేకీ స్పర్శ చేత ఆ జ్ఞానం తప్పకుండా కలుగుతుంది.

రేకీశక్తి, స్పందనలు తత్సంబంధమైన కళ్ళకి కన్పించని యంత్రాంగం గురించి తెలుసుకోవాలంటే మనం కొంచెంగా నైనా చక్రాలు, శరీరాలు, వ్యాధి సంక్రమణ మార్గాలు మొదలైన అంశాలు చర్చించాలి. రేకీ నేర్చుకునే వారికి ముఖ్యంగా వీటి అవగాహన చాల ముఖ్యం. ఎందుకంటే రేకీ మాష్టర్లు (కొందరు) అనుకునేవారికి సహితం అప్పుడప్పుడు సందేహాలు వస్తూ ఉంటాయి. రేకీ అతిత్వరగా నేర్చుకోవడం (పరిస్థితులు, కాలం అనుకూలించక), మరిచిపోవడం, అశ్రద్ధ చెయ్యడం లాంటి వాటి వలన ఎవరికైనా సందేహాలు రావచ్చును. అయితే పైన ఉదహరించిన అవగాహన లేకపోయినా, రేకీ ఒకసారి అనుభవం అయేక (దీక్ష పొందేక) తలచగానే, స్పందించి, మన ఆలోచన ప్రకారమే కాకుండ తనకి తోచినది (అదే సరియైనది, రేకీకి అన్నీ తెలుసు) చేస్తుంది. అదే రేకీలో ఉన్న అత్యున్నతమైన అద్భుతం. అన్నీ తనే చేసుకుంటుందని మీరు పైనుదహరించిన అంశాలు గురించి తెలుసుకోవడం మానకండి!

చక్రాలు, పద్మాలు, శక్తి కేంద్రాలు ఏదన్నా ఒక్కటే. వీటి అవగాహన, ఉనికి మహా యోగులు, ధ్యానపరులకు తప్ప సామాన్య మానవుడికి అందదు. ఈ సూక్ష్మ కేంద్రాలు ప్రతిఒక్కటీ నాడుల ద్వారా ఒకొక్క స్థూల పక్షములకు శక్తిని సరఫరా చేసే అద్భుత యంత్రాంగాలు. ఇవి భౌతిక శరీరంలో కాకుండా సూక్ష్మశరీరాల్లో ఉంటాయి. ఈ శక్తి పద్మాలను చూసిన యోగులు, ధ్యానపరులు వీటిని అద్భుతంగా వర్ణించుతారు. వివిధ వర్ణాలు కలిగి, ప్రకంపిస్తున్న దళాలు కలిగి, పద్మాలలాగ కన్పించే చక్రాలు ఏడు. ఈ ఏడు చక్రాలు వాటికి సంబంధించిన ఏడు సూక్ష్మశరీరాలతో వాటి వేరుదండాలను అంటిపెట్టుకుని, అన్నీ ఒక దాని కొకటి అంటిపెట్టుకుని ఉంటాయి. రెండు మూడు అంగుళాలు వెడల్పు కలిగి పరిభ్రమిస్తూ యోగధ్యానంలో దర్శనం ఇస్తూ ఉంటాయి. ఆ అద్భుతాలను దర్శించిన జ్ఞానులు వాళ్ళలో వాళ్ళు ఆనందిస్తూ, తోటి వాళ్ళతో రహస్యంగా ముచ్చటిస్తూ మురుస్తూ ఉంటారు.

ఈ చక్రాలను లలితా సహస్రంలో చాల చక్కగా వర్ణించారు. మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధి, ఆజ్ఞా, సహస్రారములు. సహస్రార చక్రం తలపైన సమతలంగా తిరుగుతూ ఉంటుంది. భగవత్ శక్తితో సంపూర్ణంగా అనుసంధానించబడి ఉంటుంది. వెన్నెముక ఒక గొట్టంలా భావిస్తే ఈ సహస్రారం మీద భాగంలో, మూలాధారం క్రింద భాగంలో ఉన్నాయనుకోవచ్చు. మిగతా చక్రాలన్నిటికీ ముందు భాగం, వెనుకభాగం (వెన్నెముకకు) ఉంటాయి.

ఈ చక్రాలు శరీరాల్లో ఉన్న కలుషాలని బైటికి (Taxins)పంపి, విశ్వంలో ఉన్న జీవశక్తి (రేకీ)ని లోపలికి తీసుకునే ద్విదిశ (Twoway)పంపుల్లాంటివి. ఒకొక్క చక్రం అధీనంలో ఒకో గ్రంథి (Gland) ఉంటుంది. ఆ గ్రంథి అధీనంలో కొన్ని అవయవాలుంటాయి. అంటే ఈ గ్రంథులు భౌతిక శరీరంలో ఉన్నా, సూక్ష్మ శరీరాల్లో ఉన్న చక్రాలు, నాడులద్వారా ప్రాణిశక్తిని పొందుతాయన్న మాట. ఆరోగ్యవంతుడిలో ఈ చక్రాలన్నీ సమానంగా పనిచేస్తూ ఉంటే విశ్వచైతన్య శక్తి శరీరానికి పుష్కలంగా లభిస్తున్నదని అర్థం. ఏకారణాలవలనైనా పైన ఉదహరించిన శరీరాలలో అడ్డంకులు ఏర్పడి, తగిన ప్రాణ పోషక శక్తి లభించకపోయినా, లోనున్న కలుషాలు, విషపూరితాలయిన పదార్థాలు మలినాలు బైటికి నెట్టబడకపోయినా, ఆయా శరీరాలు, (భావోద్రేక మానసిక కారణ) తత్సంబంధమయిన అవయవాలు వ్యాధిగ్రస్తమవుతాయి. అంటే సహజ రేకీ ప్రవాహానికి అడ్డంకులు కలిగాయని అర్థం. **(సశేషం)**

# వాగ్గేయవైభవం



పల్లవి:

కరుణ జూడవమ్మా,
కమలవైరికలాధరునికొమ్మ!
ధరను సరియుదొరకని
పంచనద నగరనాయికా! ధర్మసంవర్ధని!

చరణాలు:

అనేక జగదాధారివి నీ
వనేమదిని నెరనమ్మితిగా నే
మనేవాడనో యని నీమది నెం
చనేవద్దనుచు నాతనివేడు
దునే నాదుపై వినే చాడిచా
లునే నీదుదయకు నేపాత్రుడౌ
దునే కువలయనయనే సువసన-
జఘనే విధునిభవదనే సంతతము...

మదాన తెలియక జేసిన కర్మ
విదారి నీవని నమ్మితినే నీ
పదారవింద యుగళభక్తిమ్మ
ని దానమడిగితినే తోచదేమి
ఉదారి నీదయను దాచరాదు ద
రిదాపులేకను సదా మొరలిడ వి
నదా చెవులు ఎవరుదా ప్రోతురిక
సదాశివహితే ముదాన సతతము

పరాశక్తి నాయొకచిత్తము తా
మరాకు నీరువితము తల్లడి
ల్లరాదు అందున కేమి ఫలము శం
బరారికి యర్ధశరీరి!
పురాణపురుషుడగు రామునికి, యా
పురారికిని, నీకు రాజధరి మ
చ్ఛరాన వేరెంచరాదు అను త్యా
గరాజునిక విడువరాదు సతతము

ఇది త్యాగరాజులవారు విరచించిన పంచనదక్షేత్రము తిరువయ్యూర్‌లో వేంచేసియున్న క్షేత్రాధిదేవత ధర్మ సంవర్ధనిని స్తుతించుచున్నారు. 'కమలవైరి' అంటే చంద్రుడు. 'కమలవైరికలాధరుడు' - చంద్రకళాధరుడు - శంకరుడు. కమల వైరికలా ధరునికొమ్మ - శంకరుని అర్ధాంగి.

'ధరను సరియు దొరకని' అనగా భూలోకమందు సాటిలేని 'పంచనదనగర నాయిక' యని సంభోధించి ''సమస్త బ్రహ్మాండములకు ఆధారశక్తివైన నిన్ను నెర నమ్మితిని. నిన్నుఁగూర్చి నావిధేయత, ప్రపత్తినిగూర్చి నేనేమందునోయన్ని నీవు ఎంచవలదు. అతనిని ఇట్లే వేడుదును.''

ఆతఁడనగా తనకిష్టదైవమంయిన రాముడు. ''నాదుపై వినే చాడి చాలునే'' యనుటలో నొక విశేషమున్నది. త్యాగరాజ స్వామి సదా ఇష్టదైవముగా శ్రీరామునే భావించి ఆ మంత్రజపము చేసి, రాముని పరముగానే అనేక కీర్తనలు పాడుకొనుట చూచి కొందరు అసూయాపరులు త్యాగరాజునకు శివునిపైగాని, అమ్మవారిపై గాని, భక్తిలేదనియు సదా రామునే కీర్తించుటవలన దేవతాంతరములందీతనికి భేదదృష్టి గలదని ప్రచారము చేసిరట. ఆ 'చాడి' త్యాగరాజ స్వామివారి చెవిని బడినది. వెంటనే లోకులతో వివాదమునకు చర్చకుదిగక ధర్మసంవర్ధని వద్దనే మొరబెట్టుకొన్నట్లు అయ్యగారి శిష్య పరంపరలో వాడుకకలదు.

అందుకు తగినట్లు ''వినేచాడి చాలునే'' యను ప్రయోగము అన్వయించు చున్నది. మరియు చివరి చరణమందు ''పురాణపురుషుడగు రామునికి, యా పురారికి, నీకు-రాజధరి మచ్ఛరాన వేరెంచ రాదు'' అని స్పష్టముగా - రామునికి, శివునికి, నీకు భేదమును భావించరాదని సమాధానించినారు. పైగా ''ఉదారివైన తల్లీ! నీ దయను దాచరాదు. దరిదాపులేక మొరల నిడితే నీ చెవులకు వినవచ్చుటలేదా! తల్లీ! నీ కంటె నన్ను కాపాడువారెవరు కలరు? నా చిత్తము తామరాకుపై నీటివలె తల్లడిల్లు చున్నది.'' అని ఎంతో ఆర్తిగా అమ్మవారిని కీర్తించుకొని పై సూచించిన చాడికి పరమేశ్వరినే పరిష్కర్తగా ప్రార్థించుట ఎంతో గంభీరముగా నున్నది.

పరమ భాగవతశిఖామణులగు వారికి దైవభేదముండదు. తమ అనుభవములో సర్వ దేవతలను ఇష్టదైవమందు భావించుకొని కీర్తించుట సంప్రదాయము.

– కల్లూరి వీరభద్రశాస్త్రి
(స్వధర్మ స్వరాజ్యసంఘం)




## క్త్వార్థకము - అసమాపక క్రియ

అసంపూర్తియయిన అర్థము నిచ్చు క్రియను అసమాపక క్రియ యందురు. **వచ్చి, నడచి, వెళ్ళి, తిని** మొదలయినవి. దీనిని సంస్కృతమున "**క్త్వార్థకము**" అందురు. క్రియ చివర ''క్త్వా'' అని వచ్చును. కొన్నిచోట్ల 'య' కూడ వచ్చును. (భవతి – భూత్వా, గచ్ఛతి – గత్వా, ఖాదతి – ఖాదిత్వా, ఆహ్వాయతి – ఆహూయ, ఆగచ్ఛతి – ఆగత్య)

| | |
|---|---|
| భూత్వా అయి | మారయిత్వా – చంపి |
| పఠిత్వా – చదివి | క్రీడిత్వా – ఆడి |
| లిఖిత్వా – వ్రాసి | కృత్వా – చేసి |
| చలిత్వా – చెప్పి | క్రందిత్వా – ఏడ్చి |
| పతిత్వా – పడి | హసిత్వా – నవ్వి |
| ఉత్పత్య – ఎగిరి | జ్ఞాత్వా – తెలిసికొని |
| ధావిత్వా – పరుగెత్తి | స్మృత్వా – స్మరించి |
| నీత్వా – తీసికొని వెళ్ళి | విస్మృత్య – విస్మరించి |
| ఆనీయ – తీసికొని వచ్చి | తీర్త్వా – దాటి |
| దత్వా – ఇచ్చి | జ్వలిత్వా – మండి |

గృహీత్వా – తీసికొని

ఖాదిత్వా – తిని

పీత్వా – త్రాగి

దృష్ట్వా – చూచి

గత్వా – వెళ్ళి

ఆగత్య – వచ్చి

ఆరుహ్య – ఎక్కి

అవరుహ్య – దిగి

తాడయిత్వా – కొట్టి

వినశ్య – నశించి

ఆహూయ – పిలిచి

చింతయిత్వా – ఆలోచించి

నత్వా – నమస్కరించి

భ్రమిత్వా – తిరిగి

## అభ్యాసము - 1

1) బాలకః పాఠం లిఖిత్వా పఠతి – బాలుడు పాఠము వ్రాసి చదువుచున్నాడు

2) బాలికా అన్నం ఖాదిత్వా పాఠశాలాం ప్రతిగచ్ఛతి – బాలిక అన్నం తిని పాఠశాలకు వెళ్ళుచున్నది.

3) సః వృక్షాత్ పతిత్వా క్రందతి – వాడు వృక్షము నుండి పడి ఏడుస్తున్నాడు.

4) అహం ప్రతిదినం కార్యాలయం గత్వా ఆగచ్ఛామి – నేను ప్రతిరోజు కార్యాలయానికి వెళ్ళి వస్తాను.

5) త్వం ఇదానీం ఏవ తవగృహం గత్వా కిం కరోసి – నీవు ఇప్పుడే మీ ఇంటికి వెళ్లి ఏమి చేస్తావు?
(ఏవ = ఏ, ఆ)

6) బాలకః శ్రీవిరించిః క్షీరం పీత్వా క్రీడతి – బాలుడు శ్రీవిరించి పాలు త్రాగి ఆడుకుంటున్నాడు.

7) మార్జాలః మూషికం మారయిత్వా ఖాదతి – పిల్లి ఎలుకను చంపి తినుచున్నది.

8) శక్తిధరః ధావిత్వా కుత్రగచ్ఛతి? – శక్తిధరుడు పరుగెత్తి ఎక్కడకు వెళ్ళుచున్నాడు?

# అభ్యాసము - 2

1. ఉత్తముడు  ఆలోచించి చేయును.
2. రాముడు చలనచిత్రం చూచి ఇంటికి వచ్చెను.
3. నీవు విమానం ఎక్కి ఎప్పుడు వెళ్ళావు?
4. కాకి ఎగిరి వృక్షము నెక్కెను.
5. వాడు ఎప్పుడు వచ్చి అన్నము తినును?
6. సత్యశ్రీ ఏడ్చి నిద్రపోయెను.

## తుమున్నర్థకము

వర్తమాన కాల ప్రథమ పురుష ఏకవచన క్రియకు చివర ''తుమ్'' అని వచ్చును.

(ఉదా: గచ్ఛతి – గంతుమ్, ఆగచ్ఛతి – ఆగన్తుం, వదతి – వక్తుం)

భవితుం – ఆగుటకు
పఠితుం – చదువుటకు
లిఖితుం – వ్రాయుటకు
వక్తుం – చెప్పుటకు
చలితుమ్ – కదలుటకు
పతితుమ్ – పడుటకు
ధావితుం – పరుగెత్తుటకు
నేతుం – తీసికొని వెళ్ళుటకు
ఆనేతుం – తెచ్చుటకు
దాతుం – ఇచ్చుటకు
గ్రహీతుం – తీసికొనుటకు
ఖాదితుం – తినుటకు
పాతుం – త్రాగుటకు
ద్రష్టుం – చూచుటకు

కర్తుం  – చేయుటకు
క్రందితుం – ఏడ్చుటకు
హసితుం – నవ్వుటకు
నిద్రితుం – నిద్రించుటకు
జ్ఞాతుం – తెలిసికొనుటకు
స్మర్తుం – స్మరియించుటకు
విస్మర్తుం – మరచుటకు
తర్తుం – దాటుటకు
జ్వలితుం – జ్వలించుటకు
వినష్టుం – నశించుటకు
చింతితుం – చింతించుటకు
భ్రమితుమ్ – తిరుగుటకు

గంతుం – వెళ్ళుటకు

ఆగంతుం – వచ్చుటకు

ఆరోహితుం – దిగుటకు

తాడయితుం – కొట్టుటకు

మారయితుం – చంపుటకు

క్రీడితుం – ఆడుటకు

## అభ్యాసము - 4

1) కృష్ణః మమ గృహం ఆగన్తుం ఇచ్ఛతి – కృష్ణుడు మా ఇంటికి వచ్చుటకు ఇష్టపడుతున్నాడు.
2) నదీం తర్తుం సః ప్రయత్నం కరోతి – వాడు నదిని దాటుటకు ప్రయత్నం చేస్తున్నాడు.
3) త్వం పాఠం పఠితుం మమ గృహం న ఆగచ్ఛతి కిం? – నీవు పాఠం చదువుటకు మా ఇంటికి రాలేదు ఏమి?
4) జనకః బాలకం ఆనేతుం పాఠశాలాం గచ్ఛతి – జనకుడు బాలుని తీసుకొని నచ్చుటకు బడికి వెళ్ళెను.
5) వాహనం భ్రమితుం ఇంధనం నాస్తి – వాహనం తిరుగుటకు ఇంధనం లేదు.
6) అహం లేఖాం లిఖితుం తత్ర ఉపవిశామి– నేను లేఖను వ్రాయుటకు అక్కడ కూర్చున్నాను.

## అభ్యాసము - 5

1) నేను భోజనము చేయుటకు రాముని ఇంటికి వెళుతున్నాను.
2) సుధాకరుడు నీరు త్రాగుటకు పాత్రను (పాత్రాం) తీసికొనుచున్నాడు.
3) రామచంద్రుడు ఊరు (గ్రామం) వెళ్ళుటకు వాహనమును ఎక్కెను.
4) సత్యశ్రీ పాలు త్రాగుటకు ఏడ్చుచున్నాడు.
5) పిల్లి ఎలుకను పట్టుకొనుటకు పరిగెత్తుచున్నది.
6) నేను త్రాగుటకు ఏమి ఇస్తున్నావు?
7) నీవు చదువుటకు ఎందుకు ఏడుస్తున్నావు?
8) వాడు పనిచేయుటకు ఎప్పుడు వస్తాడు?

## అభ్యాసము - 6

ఉక్త్వా – స్మృత్వా – విస్మృత్య – తాడయిత్వా – అహ్వాయితుం – చింతితుం – ద్రష్టుం – నేతుం, కథం – ఏవ – (ఈ పదములతో వాక్యములు చేయుడు).

★ ★ ★

1) శ్రీరామః సముద్రం అతరత్ – శ్రీరాముడు సముద్రము దాటెను

2) శ్రీరామః రావణం అమారయత్ – శ్రీరాముడు రావణుని చంపెను

3) అహం పాకం అకరోత్ – నేను వంట చేసితిని

4) క్షీరం అనేతుం కః అగచ్ఛత్‌ర్ఝు – పాలు తీసికొని వచ్చుటకు ఎవడు వెళ్ళెను?

5) సః అమెరికా దేశం గన్తుం విమానం ఆరోహత్ – వాడు అమెరికా వెళ్ళుటకు విమానం ఎక్కెను.

6) శ్రీవిరించిః హ్యః క్షీరం న అపిబత్ – శ్రీవిరించి నిన్న పాలు త్రాగలేదు.

7) ఉపాధ్యాయః పాఠం అవదత్ – ఉపాధ్యాయుడు పాఠం చెప్పెను.

## అభ్యాసము - 7

**సంస్కృతంలో వ్రాయుము**

1) అతను ఉత్తరం వ్రాసెను.

2) బాలుడు చెట్టుమీద నుండి పడి ఏడ్చెను?

3) నిన్న కోతి ఎలా పరుగెత్తెను?

4) అమ్మ ఎందుకు బాలుని కొట్టెను?

5) వాడు పుస్తకము తీసికొని వచ్చెను.

6) నేను నిన్న అన్నము తినలేదు.

7) నీవు నిన్న అన్నము ఎందుకు తినలేదు?

8) అమ్మ (మాతా) నిన్న నన్ను కొట్టినది.

9) నీవు ఏమి చేసితివి?

10) నేను పాఠము చదువలేదు, వ్రాయలేదు.

# భూతకాల క్రియలు - గడచిన కాలము

## ఏకవచనము

ఉదా : భవతి – ప్రథమ పురుష – అభవత్ – అయెను
భవసి – మధ్యమ పురుష – అభవః – అయితివి
భవామి – ఉత్తమ పురుష – అభవమ్ – అయినాను

ఈ ప్రకారముగా అన్ని ప్రథమ పురుష క్రియలకూ మధ్యమ – ఉత్తమ పురుష రూపములను సాధించుడు.

| ప్రథమ పురుష | మధ్యమ పురుష | ఉత్తమ పురుష |
|---|---|---|
| అపఠత్ – చదివెను | అపఠః | అపఠమ్ |
| అలిఖత్ – వ్రాసెను | అలిఖః | అలిఖమ్ |
| అవదత్ – చెప్పెను | అవదః | అవదమ్ |
| అచలత్ – కదిలెను | అచలః | అచలమ్ |
| అపతత్ – పడెను | అపతః | అపతమ్ |
| ఉదపతత్ – ఎగిరెను | | |
| అధావత్ – పరుగెత్తును | | |
| అనయత్ – తీసుకొని వళ్ళెను | | |
| ఆనయత్ – తీసుకొని వచ్చెను | | |
| అఖాదయత్ – తినెను | | |
| అపిబత్ – త్రాగెను | | |
| అపశ్యత్ – చూచెను | | |
| అగచ్ఛత్ – వెళ్ళెను | | |
| ఆగచ్ఛత్ – వచ్చెను | | |
| అరోహత్ – ఎక్కెను | | |
| అవరోహత్ – దిగెను | | |
| అతాడయత్ – కొట్టెను | | |
| అమారయత్ – చంపెను | | |
| అక్రీడయత్ – ఆడెను | | |
| అకరోత్ – చేసెను | | |
| అక్రందత్ – ఏడ్చెను | | |
| అస్మరత్ – స్మరించెను | | |
| వ్యస్మరత్ – మరచెను | | |

సంస్కృతంలో వచ్చిన అపారమైన వాఙ్మయంలో మహాకావ్యాలు, లఘు కావ్యాలు, శాస్త్రగ్రంథాలు ఎన్నో సార్వకాలిక, సార్వజనీన విలువలతో దీపిస్తున్నాయి.

ఈ ''మూకపంచశతి'' అనే గ్రంథం 500 శ్లోకాలతో కంచి కామాక్షీదేవిని స్తుతించే కావ్యం. రచించినవారు 'మూకకవి'గా ప్రసిద్ధులు. శ్రీ కాంచీకామకోటి పీఠంలో 19వ ఆచార్యులైన శ్రీ మార్తాండ విద్యాఘనేంద్ర స్వాములవారిని సేవించి, వారి అనుగ్రహ ఫలంగా కామాక్షీదేవిని ఉపాసించారు. పుట్టు మూగ అయిన ఈ మహానుభావుడు - అమ్మ వారిని సాక్షాత్కరింపజేసుకున్నారు. అమ్మ అనుగ్రహంతో వెంటనే మూగతనం పోయి, మధురవాక్శక్తిని సంపాదించారు. ఆ వాక్ శక్తితో అపూర్వంగా 500 శ్లోకాలతో అమ్మను స్తుతించారు.

ఉదాత్తమైన కవిత్వం, చక్కని ఛందస్సులతో మధుర శబ్దచాలనం, మంత్రశాస్త్ర రహస్యాలు, భక్తిభావగాంభీర్యం - ఈ గ్రంథంలోని విభూతులు.

ఈ మూకకవి కూడా క్రీ.శ. 399-489 వరకు కాంచీపీఠాన్ని అధిష్ఠించారనీ, 489లో - అనగా ధాతృ సంవత్సర శ్రావణ పూర్ణిమ నాడు గోదావరీ తీరాన సిద్ధి పొందారనీ కొందరంటారు.

ఈ గ్రంథంలో...

1. ఆర్యాశతకం, 2. పాదారవిన్ద శతకం, 3. స్తుతి శతకం, 4. కటాక్ష శతకం, 5. మందస్మిత శతకం.... అని 5 శతకాలు (5x100) ఉన్నాయి.

**ఆర్యా శతకం:**

'ఆర్యా' అనే ఛందస్సులో ఆర్యాదేవిని స్తుతించిన వంద శ్లోకాలు.

**ఐశ్వర్యమిందుమౌలే**
**రైకాత్మ్యప్రకృతి కాంచిమధ్యగతామ్ ।**
**ఐందవకిశోర శేఖర**
**మైదంపర్యం చకాస్తి నిగామానామ్ ॥**

**శాశ్వతగ్రంథాలు - 2**

# అమ్మ మహిమకు సాక్ష్యం
# మూకపంచశతి

''ఇందుశేఖరుని (శివుని) ఏకాత్మభావ స్వభావమైన ఐశ్వర్యమే అమ్మవారు. ఈ తల్లి బాలేందు కళను శిరస్సున ధరించింది. వేదాల యొక్క సిద్ధాంతార్థమైన ఈ కామాక్షి అనే దివ్యతత్వం కాంచీనగరంలో భాసిల్లుతోంది.'' ఈ పద్యంలో పరదేవతా మంత్రంలోని 'ఐం' అనే బీజాక్షరం నిబద్ధమై ఉంది.

ఇలాంటి దివ్యభావాలు, సంగీతం పరమళించే సుమధురశబ్దాలు ఈ ఆర్యా శతకంలో శోభిస్తాయి. మేధాశక్తిని, ఐశ్వర్యాలను కలిగించే మహిమ ఈ శ్లోకాలలో ఉంది.

**పాదారవిన్దశతకం:**

ఇందులో కేవలం అమ్మవారి పాద ద్వంద్వంపై వంద శ్లోకాలున్నాయి.

**జపాలక్ష్మీ శోణీ జనిత పరమజ్ఞాన నలినీ**
**వికాసవ్యాసంగో విఫలిత జగజ్జాడ్యగరిమా ।**
**మనః పూర్వాద్రిం మే తిలకయతు కామాక్షి తరసా**
**తమస్కాణ్డద్రోహీ తవచరణ పాథోజ రమణః ॥**

''అమ్మా! నీ చరణం అనే సూర్యుడు, దాసాని పువ్వువలె ఎరుపొంది, పరమార్థజ్ఞాన రూపమైన పద్మమునకు వికాసం కలిగించి, జగత్తులోని గాఢమైన జాడ్యాన్ని హరించి, ఇప్పుడు నామనస్సు అనే ఉదయాద్రిపై ప్రకాశించుగాక!''

కేవలం కామాక్షీదేవి అనుగ్రహం ఉంటేగానీ ఇటువంటి అత్యద్భుతభావాలు రావు. అమ్మకరుణ అణువణువూ దీపించే కవితాశక్తి, కవి హృదయంలోని గాఢభక్తి ఇందులో ప్రత్యక్షరంలోనూ ప్రత్యక్షమౌతాయి.

**స్తుతి శతకం:**

ఇందులో విభిన్న వృత్తాలలో అమ్మ వైభవాన్ని వంద శ్లోకాలతో స్తుతించారు.

**త్రియంబక కుటుంబినీం త్రిపురసున్దరీ మిందిరాం**
**పులిందపతిసుందరీం త్రిపురభైరవీం భారతీమ్ ।**
**మతంగకులనాయికాం మహిషమర్దినీం మాతృకాం**
**భణన్తి విబుధోత్తమా విహృతిమేవ కామాక్షి తే ॥**

''త్రిలోచనుడైన శివుని కుటుంబిని అనీ, త్రిపురసున్దరి అనీ, ఇందిరయనీ, పులిందనాథసుందరి అనీ, త్రిపురభైరవి అనీ, భారతి అనీ, మతంగకులనాయిక అనీ, మహిషాసురమర్దిని అనీ, మాతృక అనీ ('అ'కారాది 'క్ష' కారాంత వర్ణమాలామంత్ర రూపిణి) నీ అవతార విశేషాలనే విబుధవరులు పలువిధాలుగా పేర్కొంటున్నారు''.

ప్రభావంతమైన ఈ పద్యరత్నాలలో దేవీ వైభవం సాక్షాత్కరిస్తుంది.

**కటాక్ష శతకం:**

కేవలం అమ్మవారి కడకంటి చూపులను మాత్రమే వందశ్లోకాలలో స్తుతించారు. ఇదో అద్భుతప్రతిభ.

**కేశప్రభాపటలనీలవితానజాలే**
**కామాక్షి! కుండల మణిచ్ఛవి దీపశోభే ।**
**శంకే కటాక్షరుచిరంగితలే కృపాఖ్యా**
**శైలూషికా నటతి శంకరవల్లభే తే ॥**

''అమ్మా! నీ తలకట్టుయొక్క కాంతి నల్లని మేల్కట్టు (చాందినిగా) ఉంది. చెవికున్న కుండలాల రత్నకాంతులు దీపాలుగా ప్రకాశిస్తున్నాయి. ఆ నడుమ నీకడ కన్నులను వేదికగా చేసుకుని నీ 'కృప' అనే నాట్యకత్తె (శైలూషగ) నాట్యం చేస్తోంది''

అమ్మవారి కరుణా కటాక్ష వైభవం, ఈ శ్లోకాలలో ప్రకాశించి, పఠితకు దేవీ అనుగ్రహాన్ని కలిగించే మహిమతో దీపిస్తోంది.

**మన్దస్మిత శతకం :**

ఇది కేవలం అమ్మవారి చిరునవ్వును

వర్ణించి కీర్తించే నూరుశ్లోకాల అనుపమాన స్తుతి.

**చేతః శీతలయన్తు నః పశుపతే -**
**రానన్ద జీవాతవో**
**నమ్రాణాం నయనాధ్వసీమసు**
**శరచ్చంద్రాతపోపక్రమాః ।**
**సంసారాఖ్య సరోరుహాకరఖలీకారే**
**తుషారోత్కరాః**
**కామాక్షి! స్మరకీర్తిబీజనికరాః**
**త్వన్మన్ద హాసాంకురాః ॥**

''అమ్మా! కామాక్షీ! నీ చిరునవ్వుల మొలకలు - శివుని ఆనందానికి ప్రాణాధారాలు, భక్తుల కనులకు శరత్కాలపు వెన్నెలలు, సంసారమనే తామరలను మూతపడ జేసే మంచుజల్లులు, మన్మథకీర్తికి బీజప్రాయాలు. ఆ నీ దరహాసాంకురాలు మామనస్సును చల్లబఱచుగాక!''

ఈ విధంగా 500 శ్లోకాలతో దీపించే ఈ అపూర్వ కావ్యం - మహిమాన్వితం కూడా. ఈ గ్రంథ పారాయణంతో విద్య, ఐశ్వర్య, ఆరోగ్యాది సంపదల్ని పొందినట్లు అనేక మంది అనుభవం.

అద్భుతమైన ఈ సంస్కృతశ్లోకాలను తెలుగులో విద్వాన్ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు గారు అందమైన పద్యాలలోనూ, వాటికి వచన తాత్పర్యాలలోనూ అనువదించారు.

**ఒక కృప చిత్స్వరూపము అహో!**
**పరదేవత కామకోటి పీ-**
**ఠిక విహరించుచున్నయది ఠీవిగ**
**గుంకుమ పూవు గుత్తిపో-**
**లిక నునుమేను తీవ హవళింపగ**
**గాంచి పురమ్ములోపలన్**
**సకలచరాచరాత్మకవిశాల**
**జగద్రచనాది హేతువై.**

-ఇది శ్రీ దీక్షితులవారి ఓ పద్యరత్నం.

భారతీయ వాఙ్మయంలో, శాక్తేయ సాహిత్యంలో గణనీయమైన అనర్ఘరత్నంగా ఈ 'మూకపంచశతి' శోభిస్తోంది. ✷

# సంస్కృతం - మంత్రశక్తి

(డేవిడ్ ఫ్రాలీ)

## మంత్ర ప్రాధాన్యత:-

మనం సాధారణంగా, ఒక అర్థరహిత మైన శబ్దాన్ని యాంత్రికంగా, పారవశ్యంకలిగే వరకు, పునశ్చరణ చెయ్యడమే మంత్రం అనుకుంటాం. నిజానికి 'మంత్రం' అంటే అర్థం వేరు.

యోగసాధన సఫలమవడానికి 'యోగ శక్తి' ఎలా అవసరమో, మంత్రసాధన ఫలించడానికి ఒక అసాధారణ 'మంత్రశక్తి' అవసరం. శబ్దం, దాని అర్థాల సచేతన, సృజనాత్మక శక్తీకరణ ప్రక్రియ ఇది. కవిత్వానికీ, సాధారణ మాటలకూ మధ్య ఉన్న వ్యత్యాసం వంటిదన్న మాట. ఈ శక్తి కలిగించడానికి ఒక విశేషమైన మానసిక ఏకాగ్రత కావాలి. అది ఒక గురువు యొక్క ఉపదేశ బలం, కరుణా కటాక్షాల ద్వారా కావచ్చు, మన స్వంత అంత ర్దృష్టి బలం, జిజ్ఞాస, ఆత్మప్రబోధం వల్ల కావచ్చు.

ఈ వాక్శక్తీకరణ కలిగినప్పుడు మనం కొన్ని సాధారణ శబ్దాలలో కూడా లోతైన నిగూఢమైన అర్థాలను చూడగలగడం ఆరంభమౌతుంది. శబ్దమే అర్థమైపోతుంది. మానసిక శబ్దాలను అన్వయించడానికి మనకిక వేరు భావాల అవసరం ఉండదు. 'ఓం' కారం వంటి ప్రాథమిక శబ్దాలు వ్యాపక అర్థరూపాలకు దారిచూపుతాయి. అవి భాషల అడ్డంకులను చెరిపివేసి మనను సమస్త విశ్వంతో సంభాషించే స్థితికి - నిశ్శబ్ద ప్రశాంతస్థితికి - తీసుకుపోతాయి.

హిందూ, బౌద్ధమతాల ముఖ్యమంత్రాలన్నీ సంస్కృతం నుండి ఉద్భవించినవే. మంత్రాలు సంస్కృతంలోనే ఉండాలన్న నియమం లేకపోయినా, మాంత్రికమార్గాన్ని సులభంగా ఆలంబనం చేసుకోగల శక్తి మరే ఇతర భాషకన్నా సంస్కృతానికే ఎక్కువ. ఎందువల్లనంటే సంస్కృతం మంత్రంలో నుండి ఉద్భవించింది కాబట్టి. ఇతర భాషలు తమ జడత్వాన్ని, అచేతన నిర్మాణ స్వరూపాన్ని దాటుకురాగలిగితే గానీ మంత్రశక్తిని సులభతరం చెయ్యలేవు.

మంత్రాలు రెండు రకాలు. దీర్ఘమంత్రాలు, హ్రస్వ బీజాక్షరాలు. మనకు తెలిసిన వాటిలో ఎక్కువ భాగం 'ఓం'కారం వంటి హ్రస్వ-బీజాలు లేక బీజ-మంత్రాలు. ఓం, హూం, శ్రీం వంటి మూల శబ్దాలను కలిగి ఉంటాయివి. ఈ రకమైన మూలశబ్దాల నుండే సంస్కృతభాష రూపుదిద్దుకుంది. ఆ శబ్దాలుగా తిరిగి మారిపోగలుగుతుంది.

ఈ ప్రాథమిక శబ్దాలు నామవాచక రూపాలలోనికి, క్రియారూపాల లోనికీ కూడా మారగలవు. ఉదాహరణకు 'త' (ఇచ్చు) అనే మూలం నుండి 'తల' (అరచెయ్యి అని అర్థం) మొదలైన నామవాచక పదాలూ 'తనోతి' (ఇస్తాడు) మొదలైన క్రియా పదాలూ వస్తాయి.

దీర్ఘమంత్రాలు వేదపాఠాల వలె గాన రూపంలో ఉంటాయి. వీటిలో గాయత్రి మంత్రం అతి ముఖ్యమైంది. అవి ప్రార్థనా గీతాలవలె నుండి భాషను దాని పరిణత రూపంలో చూపుతాయి.

హ్రస్వ బీజమంత్రాలు మరింత విస్తార అర్థాలు కలిగి ఉంటాయి. మనం వాటిని వాటివాటి సామర్థ్యాన్ని బట్టి, వాటి నుండి వ్యుత్పన్నమయ్యే భాషను అర్థం చేసుకోలేక పోయినా, ఉపయోగించుకోవచ్చు.

దీర్ఘమంత్రాలు వాటి అర్థాలపట్ల మనకుగల అవగాహన, ఉద్దేశ్యాల మీద ఆధారపడి ఉంటాయి. వాటిని జీవులన్నీ సుఖంగా ఉండాలి(''సర్వేజనాః సుఖినో భవంతు'') వంటి విశ్వశాంతి కాముక ప్రార్థనల్లా సాధారణ భాషల్లోనికి సులభంగా తర్జుమా చేసుకోవచ్చు. ✦

# రాశులు - స్వభావాలు

## వృషభం

సరిరాశి – స్థిరరాశి – భూతత్త్వపు రాశి

వృషభం ఈ రాశికి చిహ్నంగా శాస్త్రాలందు చెప్పబడింది. స్థిరత్వము, ఆనందము, వాత్సల్యము, దృఢత్వము, అచంచలమగు నిశ్చయత్వము ఈ రాశికి మూల సూత్రములు. వీరి విశ్వాసములు, అభిప్రాయములు, సంబంధ బాంధవ్యములు స్థిరములు. దయ, దానగుణము, క్షమాగుణము గలవారు. వీరి నెవ్వరైనను విశ్వసించి వారిపై పూర్తిగా నాధారపడవచ్చును. నచ్చిన వ్యక్తుల అపరాధములను క్షమించగలరు గానీ, నచ్చని వారిని క్షమించలేరు. వీరి అభిప్రాయములను మార్చుట ఎవ్వరికిని సాధ్యము కాదు.

ఆనందంగా జీవించుట వీరి స్వభావము. వీరి అభిరుచి ఇల్లు తీర్చుకొనుట యందు, మంచి వస్త్రములు ధరించుట యందు, శుచియైన ఆహారము గ్రహించుట యందు మనము గమనింపగలము. అందమైనవి, కళాత్మకమైనవి అగు వస్తువులు సేకరించుటకు ఎక్కువ కాలమును ఖర్చు చేయుదురు. సంగీతము, కవిత్వము, చిత్రలేఖనము వీరి అభిమాన కళలు.

అలసట ఎరుగక ఓర్పుతో కష్టపడి పని చేయుట వీరి జీవ లక్షణము. సాధారణముగా వీరు సహనము కోల్పోరు. వారి సహనమును ఎవరైనను పరీక్షించినచో అంత తీవ్రముగను ప్రవర్తింతురు. వీరికి కోపము తెప్పించుట ఎంత కష్టమో, వచ్చిన కోపమును తగ్గించుట అంతే కష్టము. దృఢమైన వీరి నిర్ణయములో మొండి పట్టుదలగా మారకుండ వారు జాగ్రత్త పడవలెను. వీరు ప్రేమ వ్యవహారములలో చిక్కుకున్నచో ఎదుటి వ్యక్తి చేతిలో కీలుబొమ్మ లగుదురు.

శారీరక శిక్షణ, ఆటలు వీరికి ఆవశ్యకములు, ప్రీతిపాత్రములు కూడా. ఎంతటి ఘనవిజయమైనను వీరికి సహజముగా రావలసియున్నట్లుగనే కనిపించును. అందువలన పొగడ్తలకు వీరు లొంగరు. కార్య నిర్వహణమున తొందరపాటు యుండదు.

వీరు స్త్రీ సాంగత్యమందు అభిలాష చూపినను, అవి కేవలము గడిపినచో వీరి యందలి కళాత్మక విలువలన్నియు వీరి పతన కారణములై వర్తించును. ఈర్ష్య, అనుమానము, క్రూరత్వము వీరియందు చోటుచేసికొనును. జీవితభాగస్వాములను అనుమానించి హింసించు స్వభావము కలుగును. శారీరక వాంఛలను వీరు నిగ్రహించుకొనగలిగినచో వీరిలోని ప్రకృతిశక్తి యుద్బుద్ధమై సంగీతము, చిత్రకళ, కవిత్వము మున్నగు ఉత్తమ మార్గముల ద్వారా ప్రకాశించును.

వీరి మార్గమున అవరోధములు వీరిని ఆప లేవు. వృషభరాశివారు ఇతరులచే పనిచేయించుట యందేకాక, ఇతరులవద్ద పనిచేయుట యందు కూడా నేర్పరితనము కలవారు. వ్యాపారమున రాణింతురు. వక్తృత్వము, న్యాయవాదవృత్తి, అధ్యాపకవృత్తి, నాటక, సినీ కళారంగములు, వ్యవసాయము నగర నిర్మాణము మొదలైన రంగాలలో విశేషముగా రాణింతురు. క్రమబద్ధముగా చేయవలసిన పనులలో వీరు మంచి నేర్పు చూపించగలరు.

సాంఘిక కార్యక్రమాలలో బాగా రాణిస్తారు. ఫొటోగ్రఫీ, చిత్రలేఖనం, మధుర పదార్థములు తయారుచేయుట, భుజించుట యందు వీరికి ఆసక్తి ఎక్కువ. ధన విషయమున వీరు అదృష్టవంతులు. వివాహము, స్నేహము మొదలైన విధానములతో వీరికి ధనము వచ్చిపడును. దానిచే ఆర్థిక స్తోమత పెరుగును.

వీరికి చక్కని ఆరోగ్యకరమైన శరీర నిర్మాణము ఉంటుంది. ఆయుః, ఆరోగ్యములు సంపూర్ణముగా కలిగి ఉంటారు. వీరు ఏదైనా కార్యనిమగ్నులైన పుడు నిద్రాహారములయందు శ్రద్ధచూపక పోవడంతో ఆరోగ్యము దెబ్బతినే అవకాశాలు ఉంటాయి. అందుచేత వీరికి ఊపిరితిత్తులు, శ్వాసాయవయాలకు, కీళ్ళకు మొదలైన అవయవాలకు సంబంధించిన దీర్ఘవ్యాధులు వచ్చే అవకాశాలు ఎక్కువ.

వృషభము వారు కార్యదీక్ష, పుస్తక పఠనము, అనేక విషయములయందు జ్ఞానము, కొత్తపథకములు వేయుట, నిర్మాణ నిర్వహణాసామర్థ్యము, స్థిరచిత్తము, ధైర్యము, భగవదనుగ్రహము, మంత్రశక్తి, సంపూర్ణముగా కలవారు. భోగులు, అదృష్ట

జాతకులు వీరు. వీరు వజ్రమును ధరించవలెను. వీరి రాశికి అధిపతి శుక్రుడు. శుక్రుడు యజుర్వేదాధిపతి. మహాలక్ష్మీ పూజ, శివాభిషేకము వీరికి ఉత్తమమైన పూజాపద్ధతులు.

**మిథునం:**

ఇది ద్విస్వభావరాశి, బేసిరాశి, వాయుతత్త్వపురాశి. దంపతులు ఈరాశికి చిహ్నము.

భిన్న తత్త్వప్రకృతుల మానవులతో కలసి మెలిసి మెలగగలరు. ఒకే విషయమందలి భిన్నాంశములను త్వరగా గ్రహించగలరు. ఇతరులను అర్థము చేసికొనుటలో, ఇతరులను విమర్శించుటలో వీరికి వీరేసాటి. ఇతరులను విమర్శించుటయందు కార్యమగ్నులైనచో జీవితము వృథాచేసికొనుటలో కూడా వీరే సమర్థులు. వీరి సూక్ష్మపరిశీలనాదృష్టిచేత, ఎదుటివానిని బట్టి స్వభావమును వెంటనే మార్చుకొని ప్రవర్తించుట వీరికి వెన్నతో పెట్టిన విద్య. భిన్నతత్త్వములు కలిగిన వ్యక్తులను సమాధానపరచుట, ఒకే త్రాటిపై నడచు ఇద్దరిని విడదీయుట కూడా చేయగలసమర్థులు వీరు. ద్విస్వభావ రాశివారగుటచేత త్వరగా ఒక కార్యనిర్ణయమునకు రాలేరు.

ప్రేమ, త్యాగము, సేవ, ఆనందము వీరి తత్త్వములు. సాంఘిక రాజకీయ, తాత్త్విక ప్రణాళికలలో వీరి కర్తవ్యము అమోఘమైనది. కాలమును, ధనమును, వ్యక్తుల సామర్థ్యములను వీరు వినియోగించగలరు. ఇతరులకు సలహాలిచ్చెదరు కాని వీరు ఆచరించలేరు - వ్యక్తులకు సహాయము చేయటంకన్నా సంస్థలకు సహాయం చేయటంలో వీరికి విశ్వాసమెక్కువ. ఇతరులను విశ్వసించి వారికి ఏపనీ అప్పగించలేరు. ఈ విషయము వలన, ఇతరులచే వీరు విసుగుదలను కూడ పొందగలరు. వీరి మనస్సును, అత్యంత ప్రియులకు కూడ చెప్పుకోలేని సిగ్గరులు. ఇతరుల గుట్టును పూర్తిగా తెలుసుకోగలరు. స్వవిషయములందు గుట్టుగా ఉంటారు. తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభం పొందగలరు.

వస్తుమార్పిడి వ్యాపారాదులలో వీరు మంచి నేర్పు చూపించి అధికరాబడి పొందగలరు. న్యాయవాదవృత్తి, వార్తాప్రసారము తంతితపాలా ముద్రణ, టైపు, గ్రంథరచన, వ్యాపార వాణిజ్య విద్యావృత్తులలోను, అనువాదము, పత్రికా రచనలలోను, వాఙ్మయము, గణితము, ఖగోళము వీరికి అనుకూల విద్యలు, వృత్తులు. తెలివితేటలున్నంత ధనార్జన వుండదు. ధనమును గూర్చిన అసంతృప్తి, భవిష్యత్తును గూర్చిన భయము వెన్నాడుచునే వుండును.

స్త్రీపురుష సంబంధ వ్యామోహము వీరికి తక్కువ. వీరికి వివాహముతోబాటు ధనము గాని, ఆస్తిగాని, ఉద్యోగ వ్యాపారాది లాభములు గాని కలుగును. అభిమానము, వంశ గౌరవము... వీటియందు ఆత్మసమర్పణం చేయుగల వ్యక్తి వీరికి వివాహ సంబంధం ఏర్పడును. అయిననూ వీరు ఆ వ్యక్తిని సందేహించుటకు విమర్శించుటకు వెనుదీయరు.

అనారోగ్యములు వీరికి తరచుగా కలుగవు. చక్కని శరీర నిర్మాణము కలిగి వుందురు. వార్ధక్యము వచ్చువరకు వీరు చిన్నవారి వలె ఇతరులకు కనిపించుదురు. ఎక్కువ దూరము నడచుట వలన నడివయస్సు నుండి నడుము, మోకాళ్ళు, చీలమండలు, వెన్ను, మెడ నొప్పులు తరచు కల్గుచుండును. ఎక్కువగా ఆలోచించుట వలన మానసిక వ్యథ, నిద్రపట్టకపోవుట కలుగవచ్చును. వార్ధక్యము నందు మనస్సు పట్టుతప్పుట, చిరాకు, అకారణ కోపము, వణుకు, కడుపులో మంట, జీర్ణాశయమున పుండు మొదలగునవి కలుగును. వేళకు భోజనము, నిద్రకలిగి మనస్సునందు సంతుష్టి, వైరాగ్యము కలిగి యితరులను గూర్చి ఆలోచించుట మానినచో వీరి ఆరోగ్యమునకు ఏ లోపము వుండదు.

ఈ రాశిలో పుట్టిన స్త్రీలకు చక్కని లలితకళానైపుణ్యముండును. సంగీతమున మంచి నైపుణ్యము కలిగివుండును. చిత్రలేఖనములు, శిల్పకళ, అల్లికపని, అలంకరణముల యందు ప్రావీణ్యముండును. స్త్రీపురుషులెవరైనను మంచి విద్యావంతులు, ఉదారులు కాగలరు. గణితశాస్త్రము, వాణిజ్య వ్యాపారము విద్యా ఉద్యోగాల యందు రాణించగలరు. వీరికి బుధుడు రాశి అధిపతి. బుధుడు అథర్వణ వేదాధిపతి. విష్ణుపూజ, శివాభిషేకము, ఆదిత్యపూజ వీరికి ఉత్తమ విధానములు. విష్ణు సహస్రనామము రోజూ చదువుట, ఆదిత్యహృదయము చదువు కొన్నచో వీరికి ఎపుడూ విజయమే. వీరి రాశికి రత్నము పచ్చ.

★ **క్షణికచిత్తః కిమపి న సాధయతి**

క్షణ క్షణానికి ఆలోచనలు మారిపోయేవాడు ఏమీ సాధించలేడు.

★ **అలసః సర్వకర్మణామనధికారీ.**

సోమరి ఏ పనులూ చేయడానికి తగడు.

**- సోమదేవుని నీతిసూత్రాలు**

# పులిమీద పుట్ర

మా చంటివాడు ఏమన్నాడో ఏమో గాని, ''ఒరేయ్! పులిమీద పుట్రలాగా నువ్వూ తయారయ్యావా నా ప్రాణానికి?'' అని అంటున్నాడు మా బావమరిది.

''పులి మీద పుట్ర అంటే ఏమిటి మామా!'' అని అడిగింది మా చిన్నది వెంటనే.

''ఏముందీ! దెబ్బమీద దెబ్బలాటిదే!'' అని మా బావమరిది కూతురు అందుకుంది.

''నే నొప్పుకోను. అలా అయితే పులి మీద పులి అనాలి'' అని లాపాయింట్ లాగాడు మా చిన్నవాడు.

''పోనీ, కత్తిమీది సాము అనుకుంటే పోలా?'' అని సర్దబోయింది మా పెద్దది.

''అలా అనుకోవడానికి వీల్లేదు. ఎందుకంటే, కత్తిమీది సాము అనే మాటకి, బహు జాగ్రత్తగా, 'ఎలర్ట్' గా ఉండాలి అని అర్థం. వరసల్లో వేగంలో ఏమాత్రం తేడా వచ్చినా కత్తి ఫట్‌మని వేసుకుంటుంది! కాని పులిమీద పుట్రలో అర్థం అలాంటిది కాదే!'' అనివాడు అంటుండగానే–

''మరి ఎలాంటిది?'' అని అడిగిది మా బావమరిది కూతురు.

వాడు దానికేసి చూస్తూ, ''అసలే అప్పోజిషన్‌తో ఛస్తుంటే, ప్రెసిడెంట్ రూల్ లాంటిది'' అన్నాడు.

''ఇక్కడ ప్రెసిడెంట్ రూల్ పుట్ర లాంటిదా?'' అంది మా బావమరిది కూతురు.

''యస్'' అన్నాడు వాడు.

''మరి ఆ మాటకి అర్థం ఏమిటి?''

''మీ నాన్న నడుగు'' అన్నాడు వాడు.

''ఆఁ– ఏముందీ! పులి లాటిదే మరో జంతువయ్యుంటుంది లేదా దానివెనక, ఏదో కుట్ర ఉండి ఉంటుంది. అది కాస్తా పుట్ర అయింది'' అన్నాడు మా బావమరిది.

మా పెద్దవాడు పెద్దగా చప్పట్లు కొడుతూ, ''శభాష్ మామా! శభాష్ వెనకటికో బండశిష్యుడు 'ప్లవంగం' అంటే ఏమిటి గురూగారూ అని అడిగాట్ట. దానికి సమాధానంగా ఆ మొండి గురువు, లవంగాల్లో ఒక జాతి నాయనా! అని సెలవిచ్చాట్ట. అలా ఉంది నువ్వు చెప్పిన అర్థం'' అన్నాడు.

''మామా! ప్లవంగం అంటే నీకు తెలుసో తెలీదో? కోతి అని అర్థం'' అని అన్నాడు మా చిన్నవాడు.

''అలా ముందే చెప్పేస్తే, తెలుసో తెలీదో ఎలా తెలుస్తుంది?'' అంది మా పెద్దది.

''ఎందుకైనా మంచిది, కాబోయే మామగారిని కాపాడదామని అలా చెప్పాడులే! నువ్వేమీ అనుకోకు'' అన్నాడు మా చంటివాడు.

''ఊరికే వాడి భయమే గాని, ఆయన గురించి ఆయనకి తెలీదంటావా!'' అన్నాడు మా పెద్దవాడు.

నలుగురూ నవ్వారు. మా బావమరిదీ, వాడి కూతురూ అలా చూస్తూ ఉండిపోయారు. అంతలో బ్రీఫ్‌కేస్‌తో మా అల్లుడు దిగాడు. అతని ముఖం చూస్తే అందరికీ భయం వేసింది.

''అదేమిటి! రాత్రి వస్తానన్నారుగా? ఇంత ఆలస్యం అయిందేం? ముఖం అలా ఉందేమిటి? ఏం జరిగింది?'' అని మా పెద్దది ప్రశ్నల వర్షం కురిపిస్తుంటే, అతడు చిరాకుగా 'మంచినీళ్ళు' అన్నట్టు సైగ చేశాడు.

మంచినీళ్ళు తాగి, యిన్ని జంతికలు నములుతూ అతడు యిలా మొదలు పెట్టాడు.

''రాత్రే వచ్చేవాడిని కాని రైలు రెండు గంటలు లేటు. లేటయినా, భోజనం వేళకి చేరిపోతాం గదా అని ఎక్కాను. దారిలో ఎటూకాని అడవిలో రాస్తారోకో! రైలు ఆరు గంటలు ఆగిపోయింది. రైల్లో తిండేలేదు, నీళ్ళూలేవు. ప్రక్కసీట్లో ఒకావిడ యిద్దరు పిల్లల్ని పెట్టుకుని కూర్చుంది. వాళ్ళేమో ఆకలో, దాహమో అంటూ గోల. వాళ్ళ అవస్థ చూసి అటూ యిటూ తిరిగి గుప్పెడు వేరు శెనగ కాయలు, గ్లాసెడు నీళ్ళూ సంపాదించే టప్పటికి నా ప్రాణం కడబట్టింది. అక్కడెక్కడో కొందరు వెధవలు రాజకీయంగా కొంప పీకో!, ఇక్కడ పని లేని మరికొందరు వెధవలు రైలురోకో! ఛఛ'' అని ముగించాడు.

మా పెద్దవాడు నిట్టూర్చి, ''మామా! ఇదే పులి మీద పుట్ర అంటే! పుట్ర అంటే కుట్రాకాదు, పెద్ద జంతువూ కాదు. పుట్రేపులు, పుట్రింతలు అన్న మాటలు వినే వుంటావు. వాటిల్లోంచి వచ్చింది ఈ పుట్ర. దాని అర్థం 'ఉసి గొల్పడం' అని. కుక్కని ఉస్కో, ఉస్కో అని అంటామే అల్లా అన్న మాట... అది అసలే పులి. దాని ప్రక్కన ఎవడో ఉండి ఉస్కో ఉస్కో అని అనడమే పుట్ర. ఉసి గొలపక పోతే, ఆ పులి, దాని దారిన అది పోవచ్చు. కాని ఇప్పుడా 'ఛాన్స్' లేదు. ఎలాగూ ఈ రైళ్ళు తిన్నగా నడిచి చావవు. దానికి తోడు ఈ రోకోలు! లేటు మీద రోకో! పులి మీద పుట్ర. ✸

ఋషిపీఠం



బాలశిక్ష

# భగవంతుని కృప

నిరంతర భగవన్నామంచేత, భగవంతుని కృపలభిస్తుందా? లభిస్తుంది. కానీ దానికి మనం సిద్ధంగా వుండాలి.

అది ఎలా? అంటే, ధారాపాతంగా వర్షం వర్షిస్తుంది. వాగులు వంకలు అన్నీ పొంగి పొర్లుతూ వుంటాయి ఆ వర్షంలో ఒక పాత్రని బోర్లించి వుంచితే, అందులో ఒక్క చుక్కయినా నీరురాదు. అలాగే భగవంతుని కృపావృష్టి నిరంతరం వర్షిస్తూనే వుంటుంది. మన హృదయమనే పాత్రని తెరచి వుంచితే అందులో ఆ కృపావృష్టి వర్షిస్తుంది. బోర్లించి వుంచితే ఒక్కచుక్క కూడా రాదు. ఇందుకు ఉదాహరణగా ఒక కథ చెప్తాను.

ఒక ఊరిలో ఒక వ్యక్తిని యింకొక వ్యక్తి కొడుతున్నాడు. అది సహాయానికి ఎవరూ రాని నిర్జన ప్రదేశం. అప్పుడు ఆ వ్యక్తి ''వాసుదేవా! కరుణాసాగరా! నన్ను రక్షించవా?'' అని ప్రార్థిస్తున్నాడు.

వైకుంఠంలో శ్రీమహావిష్ణువు అకస్మాత్తుగా లేచి, హడావిడిగా కొంత దూరం నడచివెళ్లి తిరిగివచ్చి కూర్చున్నాడు. లక్ష్మీదేవి ఆశ్చర్యంగా చూసి ''ఏమిటి?'' అని ప్రశ్నించింది. అందుకు శ్రీమహావిష్ణువు ''ఒక భక్తుడిని రక్షించడానికనీ బయలుదేరేను.''

''మరి తిరిగి వచ్చేసారేమి?'' అని ప్రశ్నించింది. ''ఇంక ఆ అవసరం లేదు. ఆ భక్తుడు తన రక్షణ తనే చేసుకుంటున్నాడు.'' అన్నాడు స్వామి.

రక్షించమని ప్రార్థించిన భక్తుడు దెబ్బలకి తాళలేక తానే, ఆ కొడుతున్న వ్యక్తిని కొట్టడం ప్రారంభించాడు. ఇక రక్షించవలసిన పనేమున్నది?

(శ్రీరామకృష్ణ పరమహంస కథ ఆధారం)

– ఎం.సత్యవతి

## 'విజ్ఞానం పోటీ – 10' ఫలితాలు

గత సంచిక (ఏప్రిల్ '2000)లోని 'విజ్ఞానం పోటీ – 10'కి వచ్చిన సమాధానాలలో, అన్నివిధాలా సరిగ్గా వ్రాసిన 1. ఇ.హేమశ్రీధరరెడ్డి (కడప), 2. కె. శ్రీనాథ్ (శిరువెళ్ళ) లకు ప్రకటించిన ప్రకారం రూ. 50/-లు చొప్పున (మొత్తం రూ.100/-లు) బహుమతి పంపుతున్నాం. విజేతలైన చిన్నారులకు అభినందనలు. – సంపాదకుడు

సరియైన సమాధానాలు :

1. మహాభారతం, 2. వీరభద్రుడు, 3. చిదంబరం, 4. బ్రహ్మమానస పుత్రుడు, 5. చైత్రశుద్ధ పాడ్యమి, 6. శ్రావణ బహుళ అష్టమి, 7. గణపతి, 8. జనక మహారాజు, 9. గరుత్మంతుడు, 10. కాళికా మాత.

## అధ్యయనం

విద్యాభ్యాసానికి 'మితి' లేదు. నిరంతరం అధ్యయనం సాగాల్సిందే. జీవితాంతం శాస్త్రాలనుండీ, అనుభవాల నుండీ నేర్చుకోవడం సాగాలి. ఎలా నేర్చుకోవాలీ – అనే శిక్షణనిచ్చేదే విద్యార్థి దశ.

విద్యార్జనకీ, ధనార్జనకీ మితిలేదు. శక్తవంచనలేకుండా, ధార్మికత వీడకుండా ఈ రెండూ సంపాదిస్తూనే ఉండాలి అని మన శాస్త్రాలవచనం. సంపదలతోపాటూ, వాటిని సద్వినియోగం చేసుకొని, జీవితాన్ని సార్థకం చేసుకోవడానికి పనికివచ్చేదే విద్య. కాబట్టి నిరంతరం అధ్యయనం అవసరం. ☆

## కంఠస్థం చేయదగిన శ్లోకం

*శ్రీ వేంకటాచలాధీశం*
*శ్రియాధ్యాసిత వక్షసమ్ ।*
*శ్రిత చేతనమందారం*
*శ్రీనివాసమహం భజే ॥*

''శ్రీ వేంకట పర్వతాన వెలసిన ప్రభువు, వక్షస్థలాన లక్ష్మీదేవి కొలువుండగా ప్రకాశించే స్వామి, ఆశ్రయించినవారి మనోభీష్టాలను నెరవేర్చే కల్పవృక్షం వంటి వాడు శ్రీనివాసుడు. ఆయనను నేను ఆశ్రయిస్తున్నాను.''

నిత్యస్మరణగానే కాక, వేంకటేశ్వర ఆలయానికి వెళ్లినప్పుడు కూడా స్వామి సన్నిధిలో ఈ స్తోత్రాన్ని చదవవచ్చు.

# విజ్ఞానం పోటీ - 12

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలను 'కాంపిటీషన్ కార్డు'పై రాసి, ఋషిపీఠం చిరునామాకు పంపండి. 'విజ్ఞానం పోటీ -12'కి అని వ్రాయడం మరచిపోవద్దు. అన్ని సమాధానాలు సరిగ్గా రాసిన వారిలో ఇద్దరికి రూ. 50/-లు చొప్పున (రూ. 100/-) నగదు బహుమతి పంపుతాం. 15 సంవత్సరాలలోపు బాలబాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. కార్డుపై మీ చిరునామా, పేరు, వయస్సు, చదువు కూడా రాసి పంపండి. సమాధానాలు జూలై 10వ తారీఖులోపు పంపాలి.

1. శ్రీకృష్ణునకు ప్రీతిపాత్రమైన వనం?
2. తిరుమలలో స్వామి కోవెల సన్నిధిలో నున్న కోనేరు పేరు?
3. మహానంది క్షేత్రం ఏ రాష్ట్రంలో ఉంది?
4. కేదారేశ్వర జ్యోతిర్లింగం ఏ పర్వతాలలో ఉంది?
5. 'అపర్ణ' అనే పేరుగల దేవత ఎవరు?
6. ఇంద్రుని వాహనమైన దివ్యగజం పేరు?
7. 'పినాకం' అనే ధనుస్సు గల దేవుడు?
8. శుక మహర్షికి తండ్రి?
9. ధృతరాష్ట్రునకు భారతయుద్ధాన్ని వర్ణించి చెప్పినవాడు?
10. భగవద్గీతలో అధ్యాయాలు ఎన్ని?

# హితవచనం

అవిచార్య న వక్తవ్యం వక్తవ్యం సువిచారితమ్ ।
కించ తత్రైవ వక్తవ్యం యత్రోక్తం సఫలం భవేత్ ॥

"ఆలోచించకుండా మాట్లాడరాదు. బాగా ఆలోచించి మాట్లాడాలి. ఏవిధంగా మాట్లాడితే సఫలమవుతుందో ఆవిధంగా మాట్లాడాలి.

మాటకి ముఖ్యం - ఆలోచన, సాఫల్యం. మాట సఫలమవ్వాలి. అందుకు తగ్గ విధంగా ఆలోచించి మాట్లాడాలి. వృథా ప్రసంగం, అనాలోచిత ప్రసంగం మంచిది కాదు.

# మహాభారత ప్రశ్నోక్తి - 8

నిర్వహణ :

డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి

42. ఉప పాండవుల పేరులేవి?

43. కర్ణునికి అర్జునుడు తప్ప మిగిలిన నల్వురూ దొరికితే వారిని దెప్పి పొడిచి విడిచాడు – వారు ఏ వరుసలో దొరి కారు?

44. మహాప్రస్థానానికి పోతున్న వారిలో ముందెవరు పడి పోయారు?

45. దుర్యోధనుడు ఒక రాజును వంచించి తన వైపు యుద్ధం చేసేటట్లు చేసుకున్నాడు ఎవరా రాజు?

46. నమ్మరాని వారెవరు?

47. ఉత్తర గోగ్రహణంలో అర్జు నుని ముందుగా గుర్తించిన దెవరు?

48. గాంధారి కూతురి పేరేమి?

49. ఈశ్వరుడు తప్ప నాకు సాటి ఎవరూ లేరని ఆత్మస్తుతి చేసుకొన్నాడు అర్జునుడు – ఎప్పుడు?

50. ధర్మ విషయంలో ధృతరాష్ట్రుని తఱచుగా ఇద్దరు నిందిం చేవారు చివరిదాకా – ఎవరు వారు?

(జవాబులు 59వ పేజీలో చూడండి)

# నాగవల్లీ దళం

పండగల్లో, పూజలలో, శుభకార్యాలలో ముందుగా దర్శనమిచ్చేవి మామిడి తోరణాలు, అవి కాక తప్పకుండా ఉండి తీరవలసినవి పచ్చని తమలపాకులు - అవే నాగవల్లీ దళాలు. తమలపాకులు ఆసియా, ఆఫ్రికా ఖండాలలో ఎక్కువగా కనబడతాయి. మనదేశంలో తమిళనాడు, మధ్యప్రదేశ్, పశ్చిమబెంగాల్, ఒరిస్సా, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్‌లలో తమలపాకు తోటల పెంపకం ఎక్కువ.

భోజనానంతరం, తాంబూల సేవన చాలామందికి అలవాటు. భుక్తాయాసాన్ని తక్షణమే నివారించే సిద్ధ ఔషధం. తాంబూలంలో పొగాకు వాడకం అలవాటు శరీరానికి హాని చేస్తుంది. అటువంటి ద్రవ్యాలు లేకుండా తాంబూలం సేవిస్తే - జీర్ణానికి తోడ్పడుతుంది (తాంబూలం గురించి త్వరలో ఒక ప్రత్యేక వ్యాసం రాబోతోంది. అందులో వివరంగా తెలియజేస్తాను)

★ తమలపాకులలో - శరీరానికి హాని కలిగించే సూక్ష్మజీవులను నశింపజేసే ప్రత్యేకమయిన శక్తి ఉంది.

★ తమలపాకులు ఆకలిని పెంచుతాయి. కడుపులో వాయువులు చేరకుండా చూస్తాయి.

★ మూత్రం సక్రమంగా విసర్జింపబడకపోతుంటే తమలపాకు రసంలో కొద్దిగా పాలు, పటికబెల్లం కలిపి తీసుకుంటుంటే - సాఫీగా మూత్రవిసర్జన జరుగుతుంది.

★ ఒక చెంచాడు తమలపాకు రసంలో తేనె కలిపి ప్రతిరోజు సేవిస్తుంటే అలసట, నీరసం తగ్గుతాయి. రోజుకి రెండు సార్లు సేవించాలి.

★ తమలపాకుకి నెప్పి తగ్గించే గుణమూ, చల్లదనాన్నిచ్చే గుణమూ ఉన్నాయి. తలనెప్పిగా ఉన్నపుడు, నెప్పిగా ఉన్న ప్రదేశం మీద తమలపాకులు ఉంచినట్లయితే ఉపశమనం కలుగుతుంది.

★ చిన్నపిల్లలకి కాస్త దగ్గు, ఆయాసం ఉన్నప్పుడు తమలపాకుల్ని, ఆవనూనెలో ముంచి, వెచ్చబెట్టి, పిల్లవాడి ఉరోభాగంమీద ఉంచడం వలన దగ్గు తగ్గుతుంది.

**ఏ విషయంలోనయినా ''అతిసర్వత్ర వర్జయేత్'' అంటూంటారు. తమలపాకులు అతిగా, నిరంతరం నములుతూండే వారికి - నోరు, పెదవులలో క్యాన్సర్ వ్యాధి వచ్చే ప్రమాదం ఉంది.**

★ తమల పాకుల్ని నూరి తేనె కలిపి, నాకించడం వలన గొంతునెప్పి తగ్గుతుంది.

★ గాయాలు త్వరగా మానడానికి - తమలపాకు రసాన్ని గాయానికి పూసి, పైన ఒక తమలపాకు ఉంచి కట్టుకట్టాలి. ఇలా చేయడం వలన గాయం త్వరగా మానిపోతుంది, చీముపట్టదు.

★ పుళ్ళు, గడ్డలు వచ్చినట్లయితే తమలపాకుని మెత్తబడే వరకూ వెచ్చబెట్టి, తరువాత దానిమీద ఆముదం రాసి, ఆ ఆకుని పుండు/గడ్డ మీద ఉంచాలి. ప్రతి 2-3 గంటలకి ఒకసారి ఆకు మార్చాలి. రాత్రిపూట వేసిన ఆకుని, మరునాటి ఉదయం వరకూ ఉంచాలి. ఇలా చేయడం వలన, గడ్డ చితికి, చీము బయటికి వచ్చేసి త్వరగా మానిపోతుంది.

★ తమలపాకుల్ని నూరి ముద్దగా చేసికానీ, ఆకులనుంచి రసం తీసుకుని కానీ- కొబ్బరి నూనెతో కలిపి నడుముకి రాసుకుంటే నెప్పి తగ్గుతుంది. ✸

## ఆరోగ్యానికి దివ్యనామాలు

**బాలాంబికేశ! వైద్యేశ!**
**భవరోగ హరేతి చ।**
**జపేన్నామత్రయం నిత్యం**
**మహారోగనివారణమ్ ॥**



''బాలాంబికేశ, వైద్యేశ, భవరోగ హర'' - అని వైద్యనాథుడైన శివుని నామాలు. నిరంతరం ఈ మూడు నామాలను స్మరించితే మహారోగాలు సైతం పోతాయి. పూర్తి ఆరోగ్యవంతుడౌతాడు.

# దారిద్ర్యమోచన స్తోత్రమ్
# శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామాలు

''విద్యావారిధి'', అద్వైతసిద్ధిరత్నాకర
డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి

**పుణ్యగంధాం సుప్రసన్నాం**
**ప్రసాదాభిముఖీం ప్రభామ్।**
**నమామి చంద్రవదనాం**
**చంద్రాం చంద్రసహోదరీమ్ ॥**

పుణ్యగంధాయైనమః

శోభనమైన సువాసనను వెదజల్లునది. శ్రీదేవి స్మరణమాత్రమున భక్తులకు రూప, రస, గంధ, శబ్ద, స్పర్శములు దివ్యముగ మనసునందు తోచును. దానివలన వారికి పుణ్యములు చేరును.

సుప్రసన్నాయైనమః

భక్తుల పట్ల ఎల్లప్పుడు ప్రసాదమును వర్షించును. లోక మాత భక్తులను తన పిల్లలవలె చూచుకొనుట చేత వారి తప్పులను మన్నించి వారి యభీష్టముల నెరవేర్చుటకు సర్వదా సిద్ధముగయుండును. అందులకే 'ప్రసన్నా' యనక 'సుప్రసన్నా' యని చెప్పబడినది.

ప్రసాదాభిముఖ్యైనమః

ఎల్లప్పుడు భక్తులకు ప్రసాదము గావింప వేచియుండునదని భావము. భక్తులకు సర్వము ప్రసాదించ సిద్ధముగయున్న తల్లి. వారివద్ద నుండి ఏదేని నామస్మరణమో, జపమో, పుష్పాంజలియో లేక నామోచ్చారణమో, నమస్కారమో జరిగినచో మరుక్షణ మందు వారి పాపముల తొలగించి వారికభీష్ట ములనొసగ వేచియుండును.

ప్రభాయైనమః

దేవి యొక్క స్వరూపము ప్రకాశరూపమే. ''జ్యోతిషాం జ్యోతిః'' అని వేదములు నుడువును.

**''న తత్ర సూర్యోభాతి నచంద్ర తారకం**
**నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః**
**తమేవ భాంత మనుభాతి సర్వం**
**తస్య భాసా సర్వమిదం విభాతి''**

అని అమ్నాయములు దేవి కాంతి వలననే, సూర్యాచంద్రాదులు ప్రకాశించునని యు, జగన్మాత 'స్వయంప్రభ' యనియు తెల్పును.

చంద్రవదనాయైనమః

చంద్రుని వలె చక్కగా ప్రకాశించు, ఆహ్లాద కరమైన మోము గలది. శరత్కాలమందలి పౌర్ణమి చంద్రునివలె అతి సుందరమైన ముఖ మండలము గల్గినది. చంద్రుడు అమృతము నకు ప్రతీక. దేవి ముఖమును స్మరించిన వారికి నిశ్చయముగ అమృతత్వము (మోక్షము) సిద్ధించును. ఆ తల్లి ధ్యానము వలన ఈ లోకమున సమస్త ఐహికభోగముల ననుభవించి చివర మోక్షమును పొందగలరు.

''శ్రీ సుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ'' అని రుద్ర యామళ తంత్రవచనమిందులకు ప్రమాణము.

చంద్రాయై నమః

చంద్రుడు దేవీవాసస్థలములలో నొకటి జగన్మాత శ్రీమన్నగరమందు, గగనాంతస్థా, భాను మండలమధ్యస్థా, అగ్ని మండలవాసినీ, పద్మాసనా మొదలగు నామములచే తెల్ప బడిన స్థలములవలె నిత్యము చంద్రమండల మందును యుండును. కావుననే చంద్రాయని పేరే గల్గినది.

అంతేకాక తన శిరస్సునందెల్లప్పుడు చంద్రుని ధరించును. చంద్రునికి పదహారు కళలవలె దేవికి పదహారు కళలు గలవు. దీనినే 'ప్రతిపన్ముఖ్య రాకాంత తిథిమండల పూజితా'' యనునామము తెల్పును. చంద్రుని వలె ఎల్లకును, ఎల్లప్పుడు సంతసమును, మనశ్శాంతిని, ప్రకాశ జ్ఞానము లను ప్రసాదించుచుండును గాన 'చంద్రా' యను నామము దేవికి సమంజసమైనదే.

చంద్రసహోదర్యైనమః

చంద్రుడు, మహాలక్ష్మి ఇరువురు క్షీరాబ్ధియందు పుట్టిన వారు. అందులకే చంద్ర సహోదరియైనది జగన్మాత.

దేవాసురులు అమృత లాభమునకై పాలకడలిని చిలుకనారంభించిరి. అందు మొట్టమొదటి హాలాహల విషముద్భ వించెను. పరమేశ్వరుడు లోక హితము నుద్దేశించి త్రిజగముల దగ్ధము చేయుచున్న హాలాహలమును తాను తీసుకొని భుజించెను. ఆ హాలాహలవిషము మూడు లోకముల కాల్చగల్గినదైనను పరమేశ్వరునేమియు చేయలేకపోయెను. ఆయన కంఠమున నిల్చి తాను పరమేశ్వరుని నీలకంఠుని గావించెను. సమస్త ప్రాణులు పరమేశ్వరుని లోకసేవకు మెచ్చి ఆయనను స్తుతించుచుండ, మరల పాలకడలి మథనము గావించిరి దేవాసురులు.

అప్పుడు మూడు లోకములను తన శరీర కాంతితో ముగ్ధులుచేయుచు పరమ దివ్యస్వరూపముగనుద్భవించినది మహాలక్ష్మి. అప్పుడే అచ్చటనున్న అందరినీ చూసి, సర్వలక్షణ లక్షణ్యుడు, పురుషోత్తముడునైన మహావిష్ణువును భర్తగా వరించి, తన చేతియందున్న చక్కని తామరపూవులమాలను ఆయన కంఠమందు వేసెను. మహావిష్ణువు సంతసించి తన హృదయమందు అమ్మవారికి శాశ్వత నివాసమేర్పరిచెను. ఇట్లు మహాలక్ష్మి కల్యాణము లోక కళ్యాణమునకేర్పడి, శ్రీమాత చంద్రసహోదరియైనది. ✸

# సావిత్రీ వ్రతం

యు. ఎస్. ఎన్. మూర్తి



అనాది కాలంనుండి మనం అనేక వ్రతాలను ఆచరిస్తూ వస్తున్నాం. ప్రతి వ్రతం వెనుక ఒక అర్థం, పరమార్థం తప్పకుండా ఉంటుంది. భారతీయస్త్రీలు 'ఐదవతనాన్ని' గొప్ప వరంగా భావిస్తారు. దాన్ని కాపాడుకోవడానికి వ్రతాలు, పూజలు, ఆచరిస్తారు. మంగళగౌరి వ్రతం, వరలక్ష్మి వ్రతం, వట సావిత్రీ వ్రతం వంటివి వీటిలో ముఖ్యమైనవి.

వీటిలో వటసావిత్రి వ్రతానికి ఒక ప్రత్యేకత ఉంది. ఈ వ్రతాన్ని వట వృక్షాన్ని పూజించడం ద్వారా జరుపుకుంటారు. నిజానికి వృక్షాల మహనీయతఎంత అతిశయించబడిందంటే - సమస్త విశ్వం ఒక వృక్షంగా భావించబడింది. భారతీయులు వృక్షాలను దేవతలుగా భావించారు. పూజించారు.

వటవృక్షం (మర్రిచెట్టు) భారతీయుల జాతీయ వృక్షం. భారతీయతకు ప్రతీక. ఆధ్యాత్మికంగా అత్యున్నత స్థానం పొందింది. దీన్ని త్రిమూర్తుల సంయుక్త స్వరూపంగా భావించారు. దీనివేళ్ళు బ్రహ్మకు, కాండం విష్ణువుకు, కొమ్మలు శివునికీ నివాసస్థానాలు. పరమ పవిత్రమైన వృక్షం ఇది.

ఈ పవిత్ర వృక్షం చుట్టూ అల్లుకొని ఉన్న అనేకగాథల్లో అతి ముఖ్యమైనది సావిత్రి కథ. సత్యవాక్పరిపాలకుడు, న్యాయపాలనా శీలుడూ అయిన అశ్వపతి మహారాజుకు సంతానం లేదు. సంతాన ప్రాప్తికై పద్దెనిమిది సంవత్సరాలు కఠోర తపమాచరించి దేవత వరబలంతో ఒక కుమార్తెను కన్నాడు. ఆమెకు సావిత్రి అని నామకరణం చేశాడు. ఆమె విద్యా, వివేక, వినయ, సౌశీల్యాలతో పెరిగి పెద్దదైంది. అశ్వపతి రాజ్యానికి పొరుగురాజైన ద్యుమత్సేనుడు గుణగణాల్లో అశ్వపతికి సరిజోడైనా, అంధుడు కావడం వల్ల అతడి రాజ్యం శత్రువులపాలై భార్య, కుమారులతో అడవులు పట్టిపోయాడు. అతడికుమారుడు తెలివైనవాడే కాక సాహసికూడా. అతడే సత్యవంతుడు. దైవవశాన సావిత్రి వివాహం సత్యవంతుడితో జరిగింది.

వివాహనంతరం సావిత్రి అంతఃపుర భోగాలను త్యజించి, నిరాడంబరమైన దుస్తులు ధరించి భర్తతోను, అత్తమామలతోను అడవిలో నివసించసాగింది. ఆ దంపతులు పరస్పర అనురాగం, ప్రేమలతో ఆనందంగా జీవిస్తూ ఉన్న తరుణంలో ఒక నాడు నారద మహర్షి సావిత్రికి







తటస్థించి అశ నిపాతం వంటి భవిష్యవాణిని వినిపించాడు. వారి వివాహం జరిగిన నాటినుండి సరిగ్గా సంవత్సరకాలం పూర్తి కాగానే సత్యవంతుడు మరణిస్తాడనే ఆ వార్తను సావిత్రి తన గుండె ల్లోనే దాచుకుని యథాప్రకారం భర్తతో అన్యోన్య జీవితం గడుపసాగింది.



నారదుడు చెప్పిన గడువుకు సరిగా మూడు రోజుల ముందు ఆమె కఠోర ఉపవాసదీక్ష ఆరంభించింది. చివరి రోజు రానే వచ్చింది. తన భర్తతో జీవితం యొక్క తుది ఘడియలు పంచుకోవలసిన సమయం ఆసన్నమైంది. ఆ రోజు ఆమె తన భర్తను అనుసరిస్తూ కట్టెలు, ఫలాలు సేకరించడానికి వెళ్లింది. సూర్యుడు పడమటి దిక్కుకు చేర గానే సత్యవంతుడు ఒక చెట్టు క్రిందకు చేరి తనచేతిలోని గొడ్డలిని క్రింద పడవేసి సావిత్రి వొడిలో తలవాల్చి విశ్రమించాడు. అతడికి నిస్సత్తువ ఆవరించింది.

తనభర్తకు ప్రాప్తించ నున్న దుస్థితి తెలిసీ సావిత్రి నిస్సహాయంగా మిగిలిపోయింది. అంతలో సత్యవంతుడి దేహం చల్లబడింది. అదే సమయంలో ఒక దివ్య తేజోమూర్తి అక్కడ ప్రత్యక్షమయ్యాడు. అతడే యమధర్మరాజు. మరణదేవత. అతడు తన చేతిలోని యమ పాశంతో సత్యవంతుడి ప్రాణాన్ని పట్టి దక్షిణదిశగా సాగిపోసాగాడు. సావిత్రి యముణ్ణి అనుసరిస్తూ తనభర్త ప్రాణాలను తిరిగి ఇవ్వమని ప్రాధేయ పడసాగింది. యముడు కరుణించలేదు. పట్టువదలని సావిత్రి అతన్ని అనేక ప్రశ్నలతో వేధించింది. ఆమె వివేకానికి అచ్చెరువొందిన యముడు ఆమెను భర్త ప్రాణాలు తప్ప వరం కోరు కోమన్నాడు. తన చాకచక్యంతో యముణ్ణి సైతం బోల్తా కొట్టించి భర్త ప్రాణాలను తిరిగి పొందింది సావిత్రి.



సావిత్రి యమధర్మరాజును ఒక వటవృక్షం క్రింద ఎదుర్కొందని పురాణోక్తి. ఈ వృక్షం నీడలో సత్యవంతుడి మరణం, పునరుజ్జీవనం – పుడమికి ప్రకృతితో కలిగే వార్షిక సహజీవన బంధానికి ప్రతీక. పుడమి సత్యవంతుడైతే ప్రకృతి సావిత్రి. నూతన జీవన చక్రం ఆరంభించడానికే అతని మరణం. వృక్ష సంతతిలో అత్యధిక జీవన ప్రమాణం – అనేక వందల సంవత్సరాలు – కలిగిన వృక్షం వట



వృక్షం. పునరుజ్జీవన పురాణగాధలో ఈ వృక్షం పాత్ర వహించడం బహుధా సమంజసం.

సత్యవంతుడు జ్యేష్ఠ పూర్ణిమనాడు పునరుజ్జీవితుడైనాడు కనుక ఆరోజున 'వట సావిత్రి' వ్రతం ఆచరించబడుతోంది. ఈ వ్రతాన్ని యావద్భారత దేశంలోనూ ఆచరిస్తున్నా ప్రముఖంగా మహారాష్ట్ర, గుజరాత్, ఒరిస్సా, పంజాబ్, రాజస్థాన్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో ఎక్కువగా ఆచరిస్తారు. వివాహిత స్త్రీలు తమ భర్తలకు పూర్ణాయుష్షు, రక్షణల కోసం ఈ వ్రతాన్ని చేస్తారు. సావిత్రి అవలంబించిన మూడు రోజుల ఉపవాసదీక్షను గుర్తుచేసుకుంటూ 'వటపూర్ణిమ' రోజున ఉపవాస వ్రతం చేపడతారు.

వ్రతం నాడు సుమంగళులు వట వృక్షాన్ని పసుపు కుంకుమలు, అక్షతలతో పూజిస్తారు. వటవృక్షాన్ని పుష్పాలతో అలంకరించి, గాజులు, మొదలైన సమస్త అలంకరణ సామాగ్రిని సమర్పించి ధూప, దీప, నైవేద్యాలతో పూజ పూర్తిచేస్తారు. అప్పుడు మొదలౌతుంది ఈవ్రతంలోని అతిముఖ్య ఘట్టం - వటవృక్షం చుట్టూ 108 సార్లు ప్రదక్షిణలుచేస్తూ ముడిప్రత్తి నుండి వడకి తీసిన దారాన్ని వృక్షం చుట్టూ చుట్టుకుంటూ వెడతారు. వటవృక్షం యొక్క దీర్ఘాయుర్దాయంతో తమ భర్తల ఆయుషును బంధించడమే ఇలా దారంచుట్టడంలోని ముఖ్య భావంగా కన్పిస్తుంది. అంతేకాదు యమునిపాశంకన్నా తాము చెట్టుకు చుట్టిన దారం పొడవు ఎక్కువ ఉండేట్లు చూడడం కోసం, ద్వారా యముణ్ణి జయించడం కోసం ఈ దారం చుట్టే ఆనవాయితీ వచ్చింది. ఇక ఈ 108 సంఖ్యకు గల ఆధ్యాత్మిక విశేషం గురించి చెప్పవలసిన అవసరమే లేదు. ఏ అనివార్య కారణాలవల్లనైనా ఇలా 108సార్లు దారం చుట్టలేని స్త్రీలు కనీసం 12 చుట్లు (సంవత్సరంలోని 12 నెలలకు గుర్తుగా) చుట్టాలి. జనన మరణాలు కాలం మీద ఆధారపడి ఉంటాయి కాబట్టి కాలాన్ని బంధించే భావనతో ఇలా దారాన్ని చుట్టడం జరుగుతోందని కూడా భావించవచ్చు.

పూజ ముగిసిన తరువాత ప్రతి స్త్రీ ఐదుగురు సుమంగళుల నొసట బొట్టు పెట్టి గౌరవించడం ఆనవాయితీ.

ప్రకృతికి పుడమి ఆలంబన. పుడమికి ప్రకృతే జీవం. ఒకటి లేకుండా (భూలోక వాసులకు) మరొకటి లేదు. పుడమికి ప్రతీక అయిన పురుషుడు (సత్యవంతుడు) దీర్ఘాయుష్మంతుడయితేనే ప్రకృతికి ప్రతీక అయిన స్త్రీ (సావిత్రి) యొక్క సౌమాంగల్యం నిలుస్తుంది. స్త్రీ పచ్చగా ఉంటేనే పురుషుడి ప్రగతి. ఇది విశ్వనియమం. కాలం మారవచ్చు. యుగాలు మారవచ్చు. మనుష్యుల ఆలోచనా సరళి మారవచ్చు. కానీ ప్రకృతీ పురుషుల నియమాలు మారవు. అలా మారిననాడు వినాశమే. ఇది గుర్తుచెయ్యడానికే అన్యోన్య దాంపత్య జీవన మాధుర్యాన్ని నిలుపుకొనేందుకు వట సావిత్రి వ్రతం కొనసాగుతుంది. ✦

## ఋషుల శాస్త్రీయ విజ్ఞానం

మన సనాతన గ్రంథాల్లో వున్న ఖగోళశాస్త్ర సంబంధమైన ప్రస్తావనల్ని బట్టి పండితులు, గ్రంథకర్తలు కాలాన్ని నిర్ధారణ చెయ్యగలుగుతున్నారు. ఋషుల శాస్త్రీయ విజ్ఞానం ఎంతో మహత్తరమైనది. జ్యోతిష సంబంధమైన వ్రతాదికాలు జరిపేందుకు శుభలగ్నాలు నిర్ణయించడానికి వీలైన, ఔపయోగికమైన విలువగల ఖగోళశాస్త్ర పరిజ్ఞానంలో భారతీయులు చరిత్రకందని కాలం నాటికే ఎంతో అభివృద్ధి సాధించారు.

ఈ సంగతి సూచించే సునిశితమైన ఖగోళశాస్త్ర విషయాలు మనకు కౌషీతకి బ్రాహ్మణంలో కనిపిస్తాయి. 1934లో ఒక విదేశీ పత్రికలో ప్రచురించిన ఒక వ్యాసంలో జ్యోతిష్యాన్ని గురించి లేదా వైదిక ఖగోళశాస్త్ర గ్రంథావళి గురించి ఇలా ఉంది : ''భారత దేశాన్ని ప్రాచీన దేశాలన్నిటికీ అగ్రస్థానంలో నిలిపి, విజ్ఞానాన్వేషకులకు దాన్ని పవిత్ర యాత్రా స్థలంగా చేసిన శాస్త్రీయ విజ్ఞానం దాంట్లో ఉంది. 'బ్రహ్మగుప్త' అనే పేరుతో ఖగోళశాస్త్ర గ్రంథం ఒకటి ఉంది. ఇందులో మన సూర్యమండలంలో ఉన్న గ్రహాల సూర్యకేంద్రక చలనం, భూ భ్రమణమార్గ వక్రత, భూమికున్న గోళాకృతి, చంద్రుడి పరివర్తన కాంతి, ప్రతిరోజూ భూమి తన అక్షం మీదే చేసే పరిభ్రమణం, పాలపుంతలో స్థిర నక్షత్రాల ఉనికి, గురుత్వాకర్షణ నియమం వంటివే కాక, కోపర్నికస్, న్యూటన్‌ల కాలం వరకు పాశ్చాత్య ప్రపంచానికి తెలియని వైజ్ఞానిక యథార్థాల్ని ఎన్నిటినో ఈ వైదిక గ్రంథాలలో చర్చించడం జరిగింది.

''పాశ్చాత్య గణితశాస్త్రాభివృద్ధికి అమూల్యంగా ఉపకరించిన ''అరబ్బీ అంకెలు'' అనేవి భారతదేశం నుంచి అరబ్బుల ద్వారా యూరప్‌కు తొమ్మిదో శతాబ్దంలో వచ్చాయి.''

**- పరమహంస యోగానంద**

## శివభక్త నందనార్

రచన : వడలి సూర్యప్రకాశరావు
మూల్యం : రూ.25/-
ప్రాప్తిస్థానం : వి.సూర్యప్రకాశరావు,
C/0. వి.శేషావతారం, కెమిస్ట్, ఎపిపి మిల్స్,
క్వార్టర్స్, F 12/11, మల్లయ్యపేట,
రాజమండ్రి - 533 105.

బ్రహ్మజ్ఞాని, మహాభక్తుడు, సత్పురుషుడు - ఏ వర్ణంలోనున్నా పూజ్యుడే. ''చండాలోస్తు - సతుద్విజోస్తు గురురిత్వేషా మనీషా మమ'' అని ఆదిశంకరులే పేర్కొన్నారు.

అటువంటి ఉత్తమాదర్శ పురుషుల చరిత్రల్ని మన పురాణవాఙ్మయం కోకొల్లలుగా అందించింది. అలాంటి కథల్లో 'నంద' చరిత్ర ఒకటి. చిదంబర నటరాజ భక్తుడైన 'నందనార్' బాల్యం నుండి శివభక్తినే ప్రాణాధికంగా భావించి, స్వామి అనుగ్రహానికి పాత్రుడై ముక్తుడయ్యాడు. ఆ కథని 'ద్విపద' ఛందంలో రచించారు శ్రీ వడలి సూర్యప్రకాశరావుగారు.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో పాల్కురికి సోమన వంటి మహాకవుల చేతిలో మేలిమి సొగసులు సంతరించుకున్న దేశీయ ఛందం 'ద్విపద'. శివకవితకు వేదికగా మారిన ఆ ఛందాన్ని ఎంచుకోవడంలో కవిగారి ఔచిత్యం కనబడుతుంది. పరిణత పాండిత్యం, హృదయమంతా నిండిన శివభక్తి, భావనాబలం కలసి ఈ కృతిలో శివుని సాక్షాత్కరింపజేసాయి.

''జాతిభేదంబన్న సడిలేని భక్తి
నీతి నియమ శుద్ధినిండిన భక్తి''
''ఆశ్రమ ధర్మంబు నాచరింపవలె,
నేశ్రమనేని సహింపగా వలయు
నేవర్ణమైన నీసడించకయు,
భావశుద్ధిని గల్గి వర్తింపవలయు''

భగవంతుని పట్ల ప్రేమ, నామసంకీర్తనల్లో, ధ్యానాదుల్లో ధన్యుడయ్యే భక్తుడు శివునకు అభిన్నుడు. అటువంటివాడు నందనార్.

ఈ పరమభక్తుని కథ చెప్తూనే, శివలీలా విలాసాలనీ, శివతత్త్వాన్నీ, శైవమందిరవైభవాలనీ హృద్యంగా అందించారు రచయిత. పైగా పూర్వపు శివ కవులలో కనబడే విష్ణుద్వేషం వంటి సంకుచిత భావాలు ఇందులో లేవు.

సాహిత్యాభిమానులూ, భక్తులూ ఆనందించ గలిగే ఈ మధుర కావ్యపీయూష - ఈ కాలంలో వెలువడడం, ఆంధ్ర సరస్వతీ వైభవానికి క్షతి లేదని ఋజువు చేస్తోంది. ✹

---

## వేసైడ్ విస్పర్స్ (ఇంగ్లీష్)

రచన : కె.వెంకటరమణి, ఐ.ఆర్.ఎస్.
& యం.డి.జయబాలన్
పబ్లిషర్స్ : మావన్నా, 4/25, ఫస్ట్ మెయిన్ రోడ్,
అన్నానగర్, చెయ్యూర్-604 407.
వెల:రూ.120/- **(US $ 7.08)**

(కవులు స్వయంగా గానం చేసిన ఈ ఆంగ్ల కవితా సంకలనము ఆడియో కేసెట్టు కూడా లభ్యమవుతోంది. వెల : రూ.60/-)

'వేసైడ్ విస్పర్స్' అనే ఈ ఆంగ్ల కవితా సంకలనము ఇద్దరు కవులు వ్రాసినది. న్యూ ఇయర్‌తో ప్రారంభించి 26 కవితలను శ్రీ జయబాలన్ రచించారు. మంచి భావుకత, శబ్దశక్తి ఉన్న కవితలివి.

న్యూ ఇయర్ అనే అదే శీర్షికతో ప్రారంభమై 'షి' అనే కవితతో ముగిసే 47 నవరసభరితమైన కవితలు శ్రీ కే.వెంకటరమణి రచించారు. ఈ 47 కవితల సంపుటి శ్రీ వెంకటరమణిగారి ఆంగ్ల భాషా ప్రావీణ్యతను, భావపరిణతిని చాటుతోంది. ఆయన భాషా చమత్కృతులతో అతికొద్ది మాటలలోనే టన్నులకొద్దీ అర్థాల్ని యిమిడ్చి నిర్మొహమాటంగా, నిర్భయంగా, నిజాయితీగా తన భావాలను వ్యక్తపరచారు. దేశకాల పరిస్థితులవల్లా, పరదేశ సంస్కృతి పట్ల వ్యామోహం చేతా, దిగజారుతున్న నైతిక విలువలనూ, పతనమవుతున్న యువతను చూసి కవి పొందే హృదయవేదన కొన్ని కవితలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ప్రకృతి, దైవం, వేదాంతం, దౌర్బల్యం, పేదరికం విషయాల మీద తన అభిప్రాయాలను వెల్లడించిన తీరు ప్రశంసనీయం. ✹

---

**''కలియుగ ధర్మాలు'' గ్రంథ రచయిత శ్రీ దశిక కృష్ణమోహన్ చిరునామా :**
**శ్రీమతి డి.పద్మావతి, 7/10/31, బళ్ళావారి వీధి, పాత బజార్, నర్సాపురం, పశ్చిమ గోదావరి జిల్లా - 534 275**
**వెల : అమూల్యం. వి.పి.పి. ఛార్జీలు అదనం.**

# మాసఫలం



## మేషం

అశ్వని, భరణి – కృత్తిక ప్రథమ పాదం

కుటుంబ సంతోషము, కీర్తివృద్ధి, ధనలాభము, ధర్మ కార్యముల కొఱకు ధనవ్యయము, మనస్సునకు సంతోషము కలుగును. కులాచారములు పాటించెదరు. ఆరోగ్యము బాగుంటుంది. ఇష్టపడిన వస్తువులు కొంటారు. సంతానమునకు పురోభివృద్ధి కలుగును. గణితశాస్త్రము నందు కృషి చేయు వారికి మంచి ఫలితముండును. జూన్ 15 నుండి శరీరారోగ్యమునందు కొద్దిగా మార్పు కలుగను. బంధుమిత్రసమాగమము కలు గును. ఉద్యోగమునందు అభివృద్ధి కలదు. ప్రభుత్వ ఉద్యోగులు, మిలటరీ, పోలీసు, ఆడిటర్సు, మొ॥ వారు యుక్తిగా సంచరించగలరు. ప్రయాణాలు ఇబ్బంది కలుగవు. గురువు ద్వితీయ స్థానమునకు వచ్చుట చేత ఈ రాశి వారు గురుజప దానహోమాలు చేయించుకుంటే మంచిది. ఒక సం॥కాలం వృషభము నందు గురు సంచారము ఉంటుంది. దానితో పాటు శని గ్రహమునకు కూడ చేయించుకొనుట అవసరము.



## వృషభం

కృత్తిక 2,3,4 – రోహిణి – మృగశిర 1,2

ఈరాశివారికి ఈ మాసమంతయు శ్రమ అధికంగా ఉంటుంది. శ్రమ చేత శరీరారోగ్యమునకు ఇబ్బంది కలుగుతుంది. శిరమునందు హృదయము నందు అనారోగ్యము కలిగే అవకాశం కలదు. ప్రయాణాలలో ఇబ్బందులు కలుగుతాయి. కుటుంబంలో మనశ్శాంతి తరుగుతుంది. ఉద్యోగాలలో ఇబ్బందులు ఎదురగును కాని సహనంగా ఎదుర్కొనగలరు. గణిత, తర్క, వేద, భౌతిక, న్యాయశాస్త్రములలో కృషి చేయు వారికి, భారీ పరిశ్రమలకు, వ్యాపారస్థులకు, సాహసవ్యాపారస్థులకు, సేద్యము నందు, లాటరీలలోను అనుకున్నంత మంచి ఫలితములు ఉండవు. ఏది ఏమైనను ఈ మాసమంతయూ మీరు భగవత్ ధ్యానము నందు ఉండుటమంచిది. శ్రీమహాలక్ష్మి, శ్రీసుబ్రహ్మణ్య పూజలు జరిపించుకొనుట చాల అవసరం. కందులు, అలచందలు దానం ఇవ్వగలరు. స్త్రీలు పుట్టలో పాలుపోసికోగలరు. పయాణములయందు జాగ్రత్త అవసరం.

| | గు<br>శ | ర శు<br>కు చ | బు |
|---|---|---|---|
| | జూన్<br>2000 | | రా |
| కే | | | |
| | | | |



## మిధునం

మృగశిర 3,4 – ఆరుద్ర – పునర్వసు 1,2,3

శుభాశుభ ఫలితములు సమానముగా ఉండును. ఆయుధ బాధ, చోరభయం కలదు. జాగ్రత్త అవసరము. శ్రమఅధికముగా ఉంటుంది. ఫలితములు సామాన్యంగా ఉంటాయి. ఆరోగ్యము నందు శ్రద్ధ అవసరం. ప్రయాణములవలన అలసట ఎక్కువ. జూన్ 15 నుండి ప్రయత్నములన్నీ ఫలించి ధన లాభము, మనశ్శాంతి, కుటుంబసౌఖ్యము కలుగును. పిల్లలు ఆరోగ్యంగా ఉంటారు. లలితకళల యందు కృషిచేయువారికి, రాజకీయులకు అనుకూలంగా ఉండును. ఆడిటర్సు, గణితశాస్త్రమునందు, వ్యాపారస్థులకు మంచి రోజులు. ప్రయాణములు అనుకూలిస్తాయి. కళత్ర ఆరోగ్యమునందు జాగ్రత్త అవసరము. గురువునకు జపం చేయించుకోవాలి. శనగలు దానం చేయండి. విదేశ ప్రయాణాలు చేయువారికి లాభదాయంగా ఉంటుంది.



## కర్కాటకం

పునర్వసు 4 – పుష్యమి – ఆశ్రేష

సర్వత్రా విజయము కలుగును. కుటుంబము నందు సుఖ శాంతులందు, అభివృద్ధి కలుగును. దైవ, బ్రాహ్మణ ఆచారములందు భక్తి శ్రద్ధలు కలుగును. అధి కారుల, పెద్దల ఆదరణ కలుగును. 'లాటరీలలో అనుకూలత ఉండదు. అనవసరమైన పెట్టుబడులకు లాభము కలుగదు. ఇనుము, నల్లధాన్యము, ప్రత్తి, టెక్నికల్ విద్యలయందు, కంప్యూటరు, సినీ, కళారంగములలో వ్యాపారులకు, భారీపరిశ్రమలకు మంచి లాభాలు కలుగును. ఉద్యోగస్థులకు బదిలీలు ఆశించినవి జరుగును. విదేశీ ప్రయాణములు చేయుదురు. అవి లాభించును.



## సింహం

మఖ – పుబ్బ – ఉత్తర ప్రథమపాదము.

ఈ మాసమంతయూ వీరికి అనుకూలము. వాహనసౌఖ్యం, ధన లాభం, నూతన వస్త్రవస్తు లాభం కలుగును. సంసారసంతాన సౌఖ్యం కలుగును. వాణిజ్య వ్యాపార, విద్యా ఉద్యోగ, వైద్య, రచన, కళా, మొ॥ అన్ని రంగాలవారికి అనుకూల కాలము, ఇష్టమృష్టాన్న భోజనసౌఖ్యం కలదు. వివాహాది శుభకార్య ప్రయత్నములు, గృహమునందు జరుగును. గౌరవప్రతిష్టలు పెరుగును. మొత్తం ఈ మాసమంతయూ అనుకూలముగా ఉంటుంది. దైవచింతనతో, సక్రమమైన ఖర్చులతో ఆనందంగా గడుపుతారు.



## కన్య

ఉత్తర 2,3,4 – హస్త – చిత్త 1,2

ఈ మాసవంతయూ వీరికి అను కూలమే. దేవబ్రాహ్మణ భక్తి కలిగియుందురు. ఇష్టకార్యసిద్ధి. కుటుంబసౌఖ్యం, సంతానాభివృద్ధి, ధన లాభం కలుగును. సుబుద్ధితో వ్యవహరిస్తారు. వాహన సౌఖ్యం కలుగును. ప్రయాణాలు అనుకూలించి ధనలాభం కలుగుతుంది. నాటక, సినీ పరిశ్రమలవారికి అధికమేలు కలుగును. విందు వినోదాల్లో పాల్గొంటారు. ధన, ధనేతర ఇబ్బందులేవీ లేకుండా, సదాచార సంబంధ కార్యక్రమాల్లో పాల్గొంటూ ఆనందంగా కాలం గడుపుతారు. ఈ మాసములో అష్టమ శని దోషం పోయి సుఖ సంతోషాలతో ఉంటారు.



## తుల

చిత్త 3,4 – స్వాతి – విశాఖ 1,2,3

ఈ మాసం నుండి రెండున్నర సం॥ ఈ రాశివారికి అష్టమ శని దోషం కలుగుతుంది. అందుచేత శనికి వెంటనే జపదానాలు చేసుకోవలసియున్నది. ఈ మాసమంతా వీరికి అనుకూలంగానే ఉంటుంది. ఆరోగ్యము బాగుంటుంది. పిల్లలు అభివృద్ధిలో ఉంటారు. విహార యాత్రలు చేస్తారు. గృహమునందు, ఉత్సవములు, శుభకార్యము చేసికొంటారు. కార్యానుకూలత, వ్యాపారాభివృద్ధి కలుగుతుంది. 15వ తారీఖు దాటిననుండి బాగుంటుంది.



## వృశ్చికం

విశాఖ 4 – అనూరాధ – జ్యేష్ఠ

వీరు ఈ మాసమంతా యుక్తిగా సంచరించవలసిన కాలము. శరీరారోగ్యమునందు జాగ్రత్త అవసరం. ఉద్యోగ, వాణిజ్య వ్యాపార, విద్యా విషయములందు జాగ్రత్త అవసరము. ఏ విషయమునందుగాని తొందరకూడదు. ప్రయాణాలలో జాగ్రత్తగా ఉండవలెను. 15వ తారీఖునుండి క్రమంగా అనుకూల పరిస్థితులు కలిగి అన్ని విషయములలోను అభివృద్ధి కన్పిస్తుంది. ప్రథమ భాగమంతయూ నవగ్రహస్తోత్రము రోజుకు తొమ్మిది సార్లు చదువుకొనుచుంటే బాగుంటుంది. క్రమంగా అనుకూలంగా ఉంటుంది.



## ధనుస్సు

మూల – పూర్వాషాఢ – ఉత్తరాషాఢ – ప్రథమపాదము

ఈ మాసమంతయూ వీరికి ప్రతికూలముగానే ఉంటుంది. గ్రహములు షష్టస్థానములో ఉండటం వలన శత్రురోగ ఋణాది భయాలు కలుగుతాయి. కుటుంబంలో అశాంతి, సంతానము కలహములు కలుగును. ప్రయాణములు అనుకూలించవు. అందువలన నవ గ్రహములకు శాంతి హోమ చేయించుకొని దానములు ఇచ్చుట చాల మంచిది. ప్రతిదినము శివాలయమునకు వెళ్ళి తొమ్మిది ప్రదక్షిణములు చేసికొనినచో బాగుండును.



## మకరం

ఉత్తరాషాఢ 2,3,4 – శ్రవణం – ధనిష్ఠ – 1–2.

ధనలాభము, కుటుంబ సౌఖ్యం, సంతాన పురోభి వృద్ధి, సజ్జనసాంగత్యము, దైవబ్రాహ్మణ భక్తి, వేదాంత జిజ్ఞాస కలుగును. వ్యవహార జయము, నూతన వస్తువులు కొనుట జరుగును. ఆరోగ్యములు కుదుటపడును. రాజకీయ, ప్రభుత్వాలావాదేవీలు సానుకూలపడును. జంతువులతో వ్యాపారము, వాహన వ్యాపారస్థులకు అధికరాభములు కలుగును. ఈ మాసమంతయూ వీరికి సర్వత్రా విజయమే కలుగును. ఈ మాసమునందు వీరు ఏమి సంకల్పించినను విజయము కలుగును.



## కుంభం

ధనిష్ఠ 3,4 – శతభిషం – పూర్వాభాద్ర 1,2,3

వీరికి ఈ మాసం నుండి అర్ధాష్టమ శని ప్రారంభమగును. బంధుజనులతో విరోధము, అనారోగ్యము, అకాలభోజనము, అశాంతి కలుగగలదు. వ్యాపార వ్యవసాయాలలో సామాన్యంగా ఉంటుంది. సంతానమునకు అనారోగ్యము, ప్రభుత్వ వ్యవహారాలలో అననుకూలత కలుగును. విదేశీ విద్యా ఉద్యోగులకు, వైద్య విద్యా వృత్తులలో వారికి మేలు కలుగును. మిత్రులవలన మనస్తాపము కలుగును. వీరు దశరథప్రోక్త శనిస్తోత్రమును చదువుకోవాలి. ఈ రాశివారికి చెప్పుకో గలిగినంత అనుకూలత కనిపించదు. ప్రతి రోజు శివ దర్శనము చేసుకుంటే మంచిది.



## మీనం

పూర్వాభాద్ర 4 – ఉత్తరాభాద్ర – రేవతి

వీరికి ఈ మాసముతో ఏలినాటి శని పూర్తి అగును. మాసంలో పూర్వభాగము కంటే తరువాత అనుకూలంగా పనులు నెరవేరును. మీకు బంధు సన్మానము పుత్రమిత్ర, భార్య తరుపు బంధువులలో కలిసియుండుట, అధికారవృద్ధి, విహారయాత్రలు కలుగును. భారీపరిశ్రమలు లాభించును. ఇంటిలో శాంతి సౌఖ్యం కలుగును. అనారోగ్యము తగ్గి, నెమ్మదిగా ఆరోగ్యము చేకూరును. శనికి తిలలు దానం చేసి ఏకాదశరుద్రాభిషేకం చేసుకుంటే మంచిది. ఏలినాటి శని గడచి జూన్ 15వ తారీఖునుండి అన్ని విధాల జీవితం బాగుంటుంది. ✷

# అభ్యంగం

సుమారు రెండు దశాబ్దాల క్రితం వరకూ కనీసం వారానికి ఒక రోజు శరీరానికి నూనె రాసుకుని, ఆ నూనె శరీరంలోకి ఇంకిన తరువాత శనగపిండి/సున్నిపిండితో నలుగు పెట్టుకుని స్నానం చేసే అలవాటు మన వారందరిలో ఉండేది. ఇప్పుడీ పద్ధతిని ఇళ్ళల్లో అనుసరించే వారు తగ్గారు, అందు కోసం మసాజ్ సెంటర్లకి వెళ్ళేవారి సంఖ్య పెరుగుతోంది.

దేహమంతటా నూనె రాసుకోవడాన్నే ''అభ్యంగం'' అంటారు. నూనె రాసుకో వడం శరీరానికి ఎంతో అవసరం.

శరీరాన్ని కప్పి ఉంచేది చర్మం. చర్మం వాత దోషానికి ఆశ్రయం. వాతాన్ని సమస్థితిలో ఉంచే ఉత్తమ ద్రవ్యం తైలం. రథ చక్రపు ఇరుసులో తైలంవేస్తే, రథం వేగంగా, సక్రమంగా నడవగలిగినట్లే, శరీరానికి తైలం పూయడం వలన శరీరం దృఢమై ఆరోగ్య వంతంగా ఉంటుంది... అని చరకసంహిత సూత్రస్థానంలో తెలియజేశారు, చరకా చార్యులు.

## అర్హులు – అనర్హులు

శ్లేష్మ రోగాలతో బాధపడేవారు, అజీర్ణ రోగులు, తిన్న ఆహారం ఇంకా జీర్ణం కాని వారు అభ్యంగానికి అనర్హులు. మిగిలిన వారంతా అర్హులే.

## తైలం?

తైలాలన్నింటిలోకీ తిలతైలం శ్రేష్ఠం. తిలతైలం అంటే నువ్వుల నూనె. అందువల్ల నువ్వుల నూనెని అందరూ రాసుకోవచ్చు. ప్రత్యేకంగా ఏమయినా ఆరోగ్య సమస్యలు న్నట్లయితే, వైద్యుల సలహా ప్రకారం ఇతర తైలాలు వాడాలి.

తైలాలలో వట్టి వేరు లాంటి సుగంధ ద్రవ్యాలు చేర్చినట్లయితే అభ్యంగం ఆహ్లాద కరంగా ఉంటుంది.

వేసవి కాలంలో చల్లగానూ, శీతాకా లంలో గోరువెచ్చగానూ ఉండాలి తైలం.

## ప్రయోజనాలు

శరీరానికి వాత సంబంధమయిన రోగాలు రాకుండా కాపాడుతుంది తైలా భ్యంగస్నానం. శరీరానికి ఎక్కువ శ్రమని సహించే శక్తి వస్తుంది.

భారమైన పనులు చేయడానికి, వ్యాయామం చేయడానికి శక్తివస్తుంది. వేదన (నెప్పి) కలిగినపుడు సహించే శక్తి కూడా వస్తుంది.

అభ్యంగ స్నానం చెయ్యడం వలన చర్మం మృదువుగా తయారవుతుంది. వృద్ధా ప్యంలో కూడా చర్మం మీద వృద్ధాప్యపు లక్షణాలు త్వరగా కనబడవు.

## అనుకరణ అవసరమా?

ప్రతి ప్రాంతంలోని ప్రజలూ వేరువేరు వస్త్రధారణ పద్ధతులు అనుసరిస్తూంటారు, వేరు వేరు ఆహారవిహారపు అలవాట్లతో ఉం టారు. సాధారణంగా ఈ అలవాట్లు ఆయా ప్రదేశాలలోని పరిసరాలపై ఆధారపడి ఉంటాయి.

మన దేశంలోని ఆహార విహారపు అలవా ట్లన్నీ కేవలం అలవాట్లుగా వచ్చినవే కాదు. ఆయుర్వేద శాస్త్రజ్ఞులు ప్రతి అంశాన్నీ శాస్త్రీయంగా పరిశీలించి చెప్పిన సూత్రాలను అనుసరించి అయిన అలవాట్లు మనవి. అతి శీతల ప్రాంతంలోని ప్రజలు వేసుకునే ఉన్ని వస్త్రాలు అందంగా ఆకర్షణీయంగా ఉన్నాయి కదాని, వాటిని ఇక్కడ మనం వేసు కునే ప్రయత్నం చేస్తే ఫలితం?

అభ్యంగం వలన శరీరం మీద ఎటు వంటి ప్రభావం ఉంటుందో పరిశీలించి చూడని పాశ్చాత్యులను అనుసరించి, మనవారు అభ్యంగం, కర్ణపూరణం (చెవిలో నూనె వేసుకోవడం) మానుకునేలా చేశారు.

ఇక్కడి ఆధునికులు కొందరు. చిత్రం ఏమిటంటే ఇప్పుడు పాశ్చాత్యులే ప్రత్యేకంగా భారతదేశానికి వచ్చిమరీ తైలం శరీరానికి పూసి చేసే రకరకాల చికిత్సలు చేయించుకుంటు న్నారు. దీన్ని ఏమంటారూ? అయినదానికీ కానిదానికీ పాశ్చాత్యాన్ని గుడ్డిగా అనుకరించే మనవారి ధోరణిలో మార్పు రావాలి. ✸

ప్రతిరోజు తలకి నూనె రాసుకోవడం అభ్యంగంలో భాగం. అలా తలకు నూనె రాసుకోవడం వలన తలనెప్పులు అరికట్ట వచ్చు. జుట్టు రాలడం, నెరవడం వంటి సమస్యలు త్వరగా రావు. జ్ఞానేంద్రియాలు సక్రమంగా పనిచేస్తాయి. శిరస్సు మీద తైలమర్దన చేసుకోవడం వలన సుఖనిద్ర వస్తుంది. ఉష్ణ ప్రాంతమయిన ఈ దేశంలో తలకి నూనె రాసుకోవడం అవసరం.

✸ ✸ ✸

కర్ణ పూరణం – ప్రతిరోజూ చెవిలో రెండు చుక్కలు నూనె వేసుకోవడం వలన వాత సంబంధమైన వ్యాధులు రావు. చెవులకి వినికిడి శక్తి సమంగా ఉంటుంది. మెడ నొప్పులు వంటివి బాధించవు.

✸ ✸ ✸

పాదాలకి ఎక్కువగా తైలమర్దనం చేయాలి. శరీర భారాన్ని భరిస్తుంటాయి పాదాలు. శరీరంలోని అన్ని భాగాలూ శక్తి వంతంగా ఉండవలసిందే. అయితే పాదాలలో, కాళ్ళల్లో బలం తక్కువయితే కీళ్ళ నెప్పులు బాధిస్తాయి. ప్రత్యేకంగా కాళ్ళకి తైల మర్దనం చేయడం వలన కండరాలకి శక్తివచ్చి, నెప్పులు తగ్గుతాయి.

డా॥ గాయత్రి

# పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు

డా॥ గాయత్రీదేవి

కొంతమంది పాఠకులు కొన్ని ప్రత్యేక సమస్యల గురించి ఉత్తరాలు రాస్తున్నారు. ఋషిపీఠం పత్రికలో ప్రతిపేజీ లింగ, వయోభేదం లేకుండా కుటుంబ సభ్యులందరూ చదివేలా ఉండాలనేది మా నిర్ణయం. రకరకాల కారణాల వల్ల (సర్క్యులేషన్ పెంచుకోవడం కోసం) ఇటువంటి ప్రశ్నలకి జవాబులిచ్చే పత్రికలు ఎన్నోఉన్నాయి. ఆరోగ్యపీఠం (ఋషిపీఠం) లో అటువంటి ప్రశ్నలకు జవాబులు ఇవ్వబడవు.

వి.భాగ్యలక్ష్మి కరీంనగర్

అమ్మా, నా వయసు 31 సం॥లు. గత 4 సం॥లుగా ఎక్కువగా గ్యాస్ తయారవుతోంది. ఎన్ని మందులు వాడినా తగ్గలేదు. ఒక్కొక్క ఆలోచన రిపీట్ అవుతోంది. భయంగా ఉంటుంది. నా సమస్యకి శాశ్వత పరిష్కారం సూచించగలరు?

జ : గ్యాస్ఎక్కువగా ఉంటోంది అంటున్నారు - త్రేపుల రూపంగా బయటకి పోతోందా, అపానవాయువుగా పోతుందా వివరం రాయలేదు. త్రేపులుగా వచ్చే గ్యాస్ సమస్య లేకుండా ఉండాలంటే - ఆహారం గబగబా మింగెయ్యకుండా, నోరు మూసి ఉంచి నిదానంగా నమిలి తినాలి. అన్నం తినేటపుడు ఎక్కువ నీరు తాగకూడదు.

క్యాబేజీ, కాలీఫ్లవర్, ఉల్లిపాయలు, బఠానీలు, శనగలు, అరటిపండు, పుల్లటి పదార్థాలు - వీటిలో గ్యాస్ని పుట్టించే లక్షణం ఉంటుంది. కనక వీటిని మానాలి.

ఎక్కువగా పీచు ఉండే ఆహార పదార్థాలు తీసుకోవాలి. చిక్కగా ఉడికిన ఆహారం తినాలి. కమ్మటి మజ్జిగ తాగాలి.

ఔషధాల విషయానికొస్తే - రోజూ రెండుపూటలా అరగ్లాసు పల్చటి మజ్జిగలో, 5-10 గ్రాముల ''భాస్కరలవణ చూర్ణం'' కలిపి తీసుకోండి. లేదా ఒక కప్పు నీళ్ళలో 1 చెంచాడు సోంపు, అరచెంచాడు వాము, 10 పుదీనా ఆకులు, చిటికెడు నల్లఉప్పు కలిపి, మరిగించి, గోరువెచ్చగా అయిన తరువాత కొద్దిగా నిమ్మరసం కలిపి, రోజూ తాగండి.

అపాన వాయువు ఎక్కువగా పోతూ ఉంటే - మలబద్ధకం లేకుండా సాఫీగా విరేచనం అయ్యేలా చూసుకోవాలి. ఎక్కువగా నీరు తాగాలి. శరీరానికి శ్రమలేకుండా నిరంతరం కూర్చునే ఉండకూడదు. తప్పని సరిగా వ్యాయామం చెయ్యాలి.

మీ ప్రశ్నలో రెండో భాగం - దీనికి పూర్తిగా జవాబు రాసేలోగా ముందు ''Trasina'' అనే ఆయుర్వేదిక్ కాప్సూల్స్ దొరుకుతాయి - రోజూ రెండుపూటలా పూటకి ఒకటి వేసుకోండి. రెండు పూటలా కనీసం 15 నెలలపాటు - దైవప్రార్థనలో గడపండి.

మీ సమస్యకి పూర్తి పరిష్కారం తెలియజేయడానికి - మీరు వివాహితలా కాదా, సంసార పరిస్థితి, మానసిక సమస్యలు ఉన్నాయా, కుటుంబంలో మీ స్థానం ఎలా ఉంటుంది - అన్నీ తెలియాలి.

పి. సత్యనారాయణాచారి సారపాక

మీరు రచించిన ''why of Herbs'' పుస్తకం V.P.P. ద్వారా పంపవలసిందిగా కోరుతున్నాను.

జ : why of Herbs ఇంకా మార్కెట్లోకి విడుదల కావలసి ఉంది. విడుదలయిన తరువాత తెలియజేస్తాము. ✸

ఈ శీర్షికకి తమ ఆరోగ్యసమస్యలు రాసేవారు - తమ సమస్యని వివరంగా రాయాలి - వ్యాధి లక్షణాలు, ఎంతకాలంగా బాధపడుతున్నారు, ఏ సమయంలో లక్షణాలు కనబడుతున్నాయి, ఎలా ఉపశమనం కలుగుతోంది, ఏ కారణంగా ఉధృతమౌతోంది మొదలయిన వివరాలతో పాటుగా, తమ వృత్తి, సంక్షిప్తంగా ఆహారవిహారాలు - తెలియజేయాలి. ఒక్క లక్షణం రాసేసి, మందు చెప్పండి అంటే మెడికల్ షాప్ వాళ్ళు ఇస్తారు. వైద్యులు సమస్యకి కారణాన్ని అర్థం చేసుకుని దానికి మందిస్తారు.




గొట్టుముక్కల రామకృష్ణమూర్తి

# ద్వైతం అద్వైతం

'జ్ఞానాదేవతుకైవల్యమ్' అను ప్రమాణానుసారంగా, జ్ఞానం వల్లనే మోక్షమని తెలుసుకొన్నాము. జ్ఞానమంటే ఆత్మజ్ఞానమే! ఆత్మజ్ఞానమంటే ప్రపంచము అసత్యమనీ, జీవుడు పరమాత్మ స్వరూపుడనీ తెలుసుకొనే అద్వైతజ్ఞానము. న+ద్వైతం - అద్వైతం - ద్వైతమంటే రెండు, అద్వైతం అంటే రెండు కానిది, అని ఈ మాట యొక్క భావము. రెండుకానిది ఒకటి, అంటే ఏకము. ఏకమేవాద్వితీయమ్, బ్రహ్మైకమ్, ఏకత్వవిజ్ఞానేన... మున్నగు ప్రయోగములందు, బ్రహ్మ ఒక్కటే సత్యమనీ, బ్రహ్మేతరమంతా మిథ్య అనీ ప్రతిపాదింపబడుతున్నది. ఇట్లు, అద్వైతము సత్యమనీ, ద్వైతము అసత్యమనీ తేలుచుండగా, ఇచట ఒక ప్రశ్న ఉదయించును.

అయ్యా! అద్వైతము సత్యమనీ, ద్వైతము అసత్యమనీ మీరనుచున్నారు. తద్విరుద్ధముగా, ద్వైతులు ద్వైతమే సత్యమనీ, అద్వైతము అసత్యమనీ చెబుతున్నారు. ఎవరికి వారు, వారికి తగిన ఉపపత్తులను, ప్రమాణములనూ, ప్రదర్శించుచున్నారు. ఒకరిని మించి మరియొకరు ప్రబలతర్కంతో అద్వైతాన్ని ఖండించుచున్నారు. అయితే ఏది సత్యమనీ, ఏది అసత్యమనీ ఎట్లు నిశ్చయింతును?

ఈ ప్రశ్నకిది సమాధానము - 'నిశ్చయింతును' అని అనుచున్నావు. సత్యమును నిశ్చయించుటకు ముందు నీవెవరో నిశ్చయించుకొంటివా? తానెవరో తెలియని అనిశ్చిత బుద్ధిమంతుడు పరమసత్యమునెట్లు తెలుసుకొనగలడు. ఇది నామాటకాదు. శ్రీశంకరభగవత్పాదులే ఒకచోట భాష్యంలో ఇట్లన్నారు.

''యో హి ఆత్మాన మేవన జానాతి మూఢః, స కథం ఆత్మనః భేదమభేదం వాజానాతి'' అని. అంటే, ''ఎవరైతే తననుతానే ఎరుగడో, అట్టిమూఢుడు ఆత్మయందు భేదమా? అభేదమా? అని ఎట్లు తెలుసుకొనును?'' అని ఈమాటల తాత్పర్యము. కనుక తన స్వరూప విచారణజేసి తానెవరో తెలుసుకొనిన వాడే అద్వైత పరమసత్యమును గ్రహించును.

అసలు ద్వైతము, అద్వైతము అను శబ్దములందే ఒక చమత్కారమున్నది. ద్వి, అనగా రెండు, అనుశబ్దమునుండి ఏర్పడి రెంటికి సంబంధించి యున్నది - అను భావమునందు ద్వైతము అనుమాట ఏర్పడినది. మరి ఈ రెండు పదార్థములేవి, వాని సంబంధమెట్టిది, మున్నగు విశేషాంశములను బట్టి ద్వైతమునందు పరస్పర భిన్నములైన పలు సిద్ధాంతము లేర్పడినవి. ఇట్టివి, సిద్ధాంతములు మతములు, సంప్రదాయములైయున్నవి. ఇట్టి సిద్ధాంత, మతసంప్రదాయాది లక్షణములే ద్వైతముయొక్క అస్థిరత్వమునకు లక్షణములు.

అద్వైతవిషయమున కూడా సిద్ధాంతమనీ, మతమనీ, సంప్రదాయమనీ లోకవ్యవహారమున్నను, నిజానికి అద్వైతమును ఒక సిద్ధాంతమనీ, మతమనీ, సంప్రదాయమనీ చెప్పలేము. ఎందుకంటే ఉపనిషద్విజ్ఞానమును బట్టి అట్టి వ్యవహారము సిద్ధింపదు. ఉపనిషద్విజ్ఞానమెట్లున్నది? అంటే, ''నేతినేతి అస్థూలమనణు అహ్రస్వమదీర్ఘమ్..'' అను విధముగా, స్థూలముగాని, సూక్ష్మము గాని హ్రస్వముగానీ, దీర్ఘము గాని...ఏదీకాదు, అని బ్రహ్మతత్త్వము ప్రతిపాదింపబడుచున్నది. వాక్కుకు గాని, మనస్సునకు గానీ అందే సమస్త ద్వైత విజ్ఞానమూ నిషేధింపబడుచున్నది. సర్వనిషేధమునకూ చివరి హద్దుగానున్నది. అనగా తాను కాని సర్వపదార్థములను 'ఇది బ్రహ్మగాదు, ఇది బ్రహ్మగాదు' అని త్రోసి వేస్తూపోగా, చివరకు తనను తాను నిషేధించుకొనలేడు. సర్వనిషేధములకు తాను సాక్షి గనుక అట్టి సాక్షి భూతమైన తానే పరబ్రహ్మయై, 'ఏకమేవాద్వితీయం' అనుశ్రుతివాక్యమునకు బోధ్య వస్తువగుచున్నాడు!

ఇట్లు పరమాత్మ, అహంకార పర్యంతమూ, సమస్త పదార్థములు అనాత్మగా నిషేధింపబడగా తాను శేషించి, ఉదయాస్తమయములులేని నిత్యజ్ఞాన స్వరూపముగా, అద్వైత బ్రహ్మగా వేదాంతములచే ప్రతిపాదింపబడుచున్నాడు కనుక ద్వైతాద్వైతములకున్న ఈ తాత్త్వికమైన భేదమే అద్వైతసత్యత్వజ్ఞానమునకు మార్గదర్శకమగుచున్నది.

మరియొక విశేషమున్నది. సంసార దుఃఖమునకు ఆత్మస్వరూప జ్ఞానము లేకపోవుటయే కారణము. సూర్యుని వలన జనించి, సూర్యుని ప్రకాశింపనీయని మేఘమువలె ఆత్మోదితమైన అహంకారము ఆత్మను తెలియనీయక స్వయముగా విజృంభించు చున్నది. ఇట్టి అజ్ఞానమును తొలగించుటయే శాస్త్రముచేయుపని. అంతే గాని, ప్రత్యేకముగా అద్వైత మతమును పేరుతో ఏదో క్రొత్త విషయమును బోధించుట లేదు.

మరియు ద్వైతము సత్యమేల కారాదు? అను సంశయమునకు అవకాశమే లేదు. ఎందువల్లనంటే ద్వైతసిద్ధాంతములకు పరస్పరమంగీకారములేదు గనుకనే, శైవవైష్ణవ శాక్తేయాది మతములు భిన్నసిద్ధాంతములను ప్రతిపాదించుచున్నవి. సత్య మొక్కటేగదా? అనేక సత్యములున్నచో, అనేక పరమాత్మలుందురు. ఒక పరమాత్మ సృష్టిని సంకల్పించగా, మరియొక పరమాత్మ సృష్టి వినాశమును గోరును. అప్పుడు గందరగోళపరిస్థితి ఏర్పడును. అట్లుగాక ఒకే పరమాత్మ బ్రహ్మవిష్ణు, మహేశ్వర రూపములు ధరించి సృష్ట్యాది కార్యములనిర్వర్తించును, అనినచో ఆ ఒకే పరమాత్మ రూపముసత్యమై, భిన్నాకృతులన్నియు మాయామయము లగును.

కనుక ఏకైకసత్యమునే ద్వైతమతములు చెప్పినచో విభిన్న సిద్ధాంతము లేర్పడుటకు అవకాశము లేదు. కాబట్టి ద్వైతమండలి సిద్ధాంత భేదములే సుందోపసుంద న్యాయమున, పరస్పరం అస్తమించి అద్వైతస్థాపన చేయును. అందుకే భగవత్పాదులు కూడ తైత్తిరీయభాష్యమున ఒక చోట ఇట్లనిరి.

''ఏతదేవమే స్వస్త్యయనం, యన్మాం ఏకయోగినం అనేక యోగి బహు ప్రతిపక్ష మాత్థ.''

ఇంతమంది భేదవాదులతో అద్వైతవాది వగు నీనొక్కదవు ఎట్లు వాదింపగలవు? అను ఆక్షేపణరాగా, వారు పైమాటలనిరి. పైమాటలకు, - ''ఏకత్వవాదినగు నాకు అనేకత్వ వాదులైన బహుప్రతిపక్షులున్నారనుటయే శుభస్కరమగును''- అని తాత్పర్యము. ద్వైతులపరస్పర సిద్ధాంతవైషమ్యమే అద్వైత స్థాపన చేయునని శంకరుల అభిప్రాయము.

కానీ, ఇచట ఇంకొక వాదము తల యెత్తుటకవకాశమున్నది. ఆ వాదమిటుందును. ''సత్యము ఏకరూప మనియు, నానాత్వమంతా మాయామయమనుచున్నారు. ఇది చెల్లదు. సత్యము ఏకరూపమై ఏలఉండవలెను? అనేక సత్యములెందుకుండరాదు? మట్టితో తయారయిన, కుండ, కూజాబాన, - మున్నగు పదార్థములలో కుండమాత్రమే సత్యమగునా! తక్కిన వస్తువులు మాత్రం సత్యములు కావా? కనుక మట్టియెంత సత్యమో, దానితో తయారయిన ఆకృతులన్నియు అంతే సత్యము'' - అని.

దీనికి సమాధానమిది- ''నీవు ఒక విషయమును విస్మరించుచున్నావు. సత్యము స్థిరమైనది, శాశ్వతమైనది'' అని. దీనిని సర్వ సిద్ధాంతములు అంగీకరించుచునే యున్నవి. కనుక పై ఉదాహరణలో కుండ, కూజా, మున్నగు పదార్థములన్నియు కార్య రూపములై అస్థిరములై నశించుచున్నవి. కనుక అసత్యములు. వానియందు నశింపని నిత్య పదార్థము మట్టి. అది ఒక్కటే తన యందు అనేకత్వములేనిది. కార్య పదార్థములన్నియు, నశించి తమకు మూలకారణమైన వస్తువునందులయించును.

మట్టియే సంస్థాన విశేషముచే, అనగా ఒక ప్రత్యేక పరిస్థితిలో, దానిని ఏర్పాటుచేసిన తీరును బట్టి వివిధ ఆకారములనూ, పేర్లను పొందుతున్నది. కనుక, కుండ మున్నగు పదార్థములందు నామరూపములు మారుచున్నవిగాని మట్టి మారడములేదు. కనుక మట్టిసత్యము. తదాకృతులన్నియు అసత్యము.

ఈ విషయాన్నే ఛాందోగ్యోపనిషత్తు ''వాచారంభణం వికారోనామధేయం, మృత్తికేత్యేవ సత్యం!'' అని వివరించింది.

కనుక సమ్యగ్విచారణ చేయడంవల్లనే, సత్యము మార్పు చెందదనియూ, స్థిరమై, ఏకరూపమై, యుండుననియు, బాహ్యములైన ఘటపటాదిపదార్థాలనుండి అహంకార పర్యంత పదార్థములన్నియు వికార పదార్థములే గనుక ఆత్మయొక్కటే సత్యమని నిశ్చయింపబడుతున్నది. కనుక సమ్యగ్విచారణ లేకపోవుటయే ద్వైత భ్రాంతికి కారణము.

చివరిసారిగా చెప్పదగినమాట - ఈసమస్త సృష్టియందు అస్తి, భాతి, ప్రియం, నామం, రూపం - అనే ఐదు లక్షణాలున్నవి. ఉండుట, ప్రకాశించుట, ఇష్టము, పేరు, ఆకారము అని ఈ మాటలకర్థము. ఇందులో అస్తి, భాతి, ప్రియం అనే మూడు లక్షణాలు బ్రహ్మ లక్షణాలు. నామరూపములు రెండును జగత్‌లక్షణాలు. కనుక నశ్వరమూ, సవికారమూ అయిన జగత్తు వ్యావహారిక సత్యమై, పరమార్థముగా అసత్యమై ముత్యపు చిప్పయందు వెండివలె బ్రహ్మమునందు కల్పితమైయున్నది. ఇట్టి కల్పనకు మూలం అజ్ఞానం! ఈ అజ్ఞాననివృత్తి ఆత్మజ్ఞానము వల్లనే కలుగును.

జీవుడు పరమాత్మ స్వరూపుడే! ఇట్టి స్వస్వరూపానుసంధానమే మోక్షము! దీనినే ప్రపంచోపశమం, శాంతం, శివమద్వైతం అని మాండూక్యోపనిషత్తు సుస్పష్టముగా తేల్చి చెప్పినది.

ఇట్లు సత్యజ్ఞానానంత స్వరూపమూ, స్వయంజ్యోతిస్స్వ భావము, నిత్యానందా ఖండై కరసమూ, అద్వితీయము ఏకమునగు బ్రహ్మయే పరమసత్యము! ✦

---

★ **ఉత్సేకః హస్తగతమపి కార్యం వినాశయతి.**

గర్వం, చేతికి చిక్కిన పనిని కూడా చెడగొడుతుంది.

★ **నాల్పం మహద్వా కార్యముపాయజ్ఞస్య. సరిత్పూరః సమమేవోన్మూలయతి తీరజతృణాన్ ద్రుమాంశ్చ.**

ఉపాయం తెలిసినవాడికి చిన్న పనీ పెద్ద పనీ అంటూ ఉండదు. నదీ ప్రవాహం ఒడ్డుమీద ఉన్న గడ్డినీ, చెట్లనూ కూడా సమంగానే పెకలించి వేస్తుంది కదా!

– సోమదేవుని నీతిసూత్రాలు

# అర్థవంతమైనది
# మన కాలమానం

పోలిశెట్టి బ్రదర్స్

అమావాస్య నుండి సూర్యుణ్ణి దాటి చంద్రుడు 12 డిగ్రీల కోణం తిరగడానికి పట్టే కాలమే ''తిథి''.

ఆవిధంగా వచ్చిన మొదటి తిథికి 'పాడ్యమి' అని పేరు పెట్టారు మనవాళ్ళు. ప్రథమ తిథికి 'పాడ్యమి' అనీ, ద్వితీయ తిథికి 'విదియ' అనీ, తృతీయ తిథికి 'తదియ' అనీ, చతుర్థి తిథికి 'చవితి' అనీ పేర్లు పెట్టారు. చవితి తర్వాత నుండి వచ్చే తిథులకు చక్కటి భావార్థాన్ని మనం గమనించగలం. చవితి తర్వాత (5వ) తిథి 'పంచమి'. 'పంచ' అనగా ఐదు అని అర్థం కదా! పంచమి నాడు చంద్రుడు 5 వంతులు పెరిగాడు లేదా తరిగాడు అని అర్థం. ఈ విధంగా పంచమి నుండి తర్వాత తిథులన్నీ కూడా ''చంద్రుడు ఎన్ని వంతులు పెరిగాడు లేదా ఎన్ని వంతులు తరిగాడు'' అనే అంశంపై ఆధారపడి 'పేర్లు' నిర్ణయించబడ్డాయి. షష్ఠి అనే తిథి 'ఆరు' శబ్దాన్ని ధ్వనిస్తుంది. ఆ రోజున చంద్రుడు 6 వంతులు పెరిగాడు లేదా తరిగాడని తెలుస్తోంది. ఇదే విధంగా ''సప్తమి'' 7 అంకెనూ, ''అష్టమి'' 8 అంకెనూ, ''దశమి'' 10 అంకెనూ, ''ఏకాదశి'' (ఏక+దశ) 11నూ, ''ద్వాదశి'' (ద్వి+దశ) 12నూ, ''త్రయోదశి'' (త్రై+దశ) 13నూ, ''చతుర్దశి (చతుర్థ+దశ) 14నూ ధ్వనిస్తున్నాయి చూడండి. అంటే చంద్రుడు ఆ తిథినాడు అన్నివంతులు పెరగడం లేదా తరగడం జరుగుతోందని దాని భావం. చక్కటి ఖగోళ అవగాహనతో ఈ తిథుల పేర్లు పెట్టబడ్డాయి. (14 తిథుల అనంతరం 15వ రోజున.... అది శుక్లపక్షం అయితే పౌర్ణమి, కృష్ణపక్షమైతే అమావాస్య వస్తాయి. రోజుకు 12 డిగ్రీల మార్పుతో చంద్రుడు 15 రోజులకూ... అనగా ఒక పక్షానికి 180 డిగ్రీలు పూర్తి చేసుకుంటాడు.

### 3) నక్షత్ర ప్రకారం గుర్తించే విధానం:

సూర్యుని చుట్టూ గ్రహాలు తిరిగే మార్గంలో స్పష్టంగా కన్పించే 27 అతి పెద్ద నక్షత్రాలను (అశ్వని మొదలు రేవతి వరకూ) యుగయుగాల క్రితమే హిందువులు గుర్తించారు. చంద్రుడు రాశి చక్రం మీదుగా ఈ నక్షత్రాలకు దగ్గరగా ఉంటున్నట్లుగా ప్రయాణిస్తూ ఉంటాడు. 27 నక్షత్రాల్లో ఒక నక్షత్రం నుండి మరో నక్షత్రాన్ని చంద్రుడు చేరే కాలాన్ని ''1 రోజు''గా మనవారు గుర్తిస్తారు. ఏ నక్షత్రం వద్ద చంద్రుడు ఉన్నట్లుగా కన్పిస్తే, ఆ నక్షత్రం పేరుతో ఆరోజును చెప్తారు.

ఉదాహరణ : చంద్రుడు 'అశ్వని' నక్షత్రం వద్ద ఉన్నరోజును 'అశ్వని' అనీ, 'హస్త' అనే నక్షత్రంవద్ద చంద్రుడు కన్పించే రోజును 'హస్త' అనీ, 'రేవతి' వద్ద ఉంటే 'రేవతి' అనీ.... అలా వ్యవహరిస్తారు.

పై మూడు లెక్కల ప్రకారం 'రోజు పరిమాణం' ఇంచుమించు సమానంగానే ఉంటుంది.

పంచాంగం ప్రకారమైనా, మామూలుగానైనా సరే సూర్యోదయంతో 'క్రొత్తరోజు' ఆరంభించే పద్ధతే ప్రామాణికమైనది. ఎందుకంటే పండితులైనా, పామరులయినా చక్కగా గుర్తించగలిగే మార్పు ''సూర్యోదయం''. అందుచేతనే మన వాళ్ళు రోజు లెక్కకు ''సూర్యోదయాన్నే'' ప్రామాణికం చేశారు.

ఇక తిథి, నక్షత్రం అనేవి చంద్ర కళలను గూర్చి, చంద్రుని నడకలను గూర్చి తెలిపే ఖగోళ విజ్ఞాన విషయాలు. వీటిని ఎక్కువగా పండితులు మాత్రమే గుర్తించ గలరు. పండితులు వ్రాసిన పంచాంగాల ద్వారా పామరులు వాటిని గుర్తిస్తారు. సుముహూర్తాలూ, దుర్ముహూర్తాలూ, జ్యోతిషాలూ, మతసంబంధ కార్యక్రమాలూ, జనన-ఉపనయన-వివాహ-శ్రాద్ధకర్మలు మొదలైన ఎన్నో కార్యక్రమాలకూ తిథి, నక్షత్రాలను చూసుకోవడం హిందువుల ఆచారం.

పూర్వకాలాన గ్రీకులు, రోమనులు, పర్షియన్లు ''సూర్యోదయం నుండి మరో సూర్యోదయం'' వరకూ '1 రోజు'గా మనలాగే లెక్కించుకునేవారు. యూదులు, మహమ్మదీయులు, బొహీమియన్లు, ఇటాలియన్లు మాత్రం 'సూర్యాస్తమయం' నుండి సూర్యాస్తమయం' వరకూ గల కాలాన్ని '1 రోజు'గా లెక్కించుకునేవారు.

పూర్వం భారతదేశంలో రోజును ''60 ఘడియలుగా'' విడదీశారు. ఒక ఘడియకు 60 విఘడియలు. 1 విఘడియకు 60 పరఘడియలు, 1 పరఘడియకు 60 సూక్ష్మఘడియలు. ఆనాటి ఖగోళశాస్త్ర లెక్క ఇలా ఉండేదట. (1 సూక్ష్మఘడియ

అనగా 0.0067 సెకను) ఘడియ ఘడియకీ గంటలు కొట్టడం రాజధానీ నగరాల్లో జరిగేది. సామాన్య ప్రజానీకం మాత్రం రోజును ''8 ఝాములు''గా విభజించుకునేవారట. పగలు 4 ఝాములు, రాత్రి 4 ఝాములుగా లెక్కించుకునేవారట. మన పల్లెటూళ్ళలో ఇప్పటికీ ''ఝాములు'' అనే మాటను ఉపయోగిస్తూంటారు.

## వారం

ఏడు రోజుల్ని ''1 వారం'' అంటున్నారు. ప్రస్తుతం ప్రపంచమంతా వారానికి 7 రోజుల లెక్కనే వాడుతోంది. జ్యోతిషగ్రహాల పేర్లతో వారానికి 7 రోజుల పద్ధతిని మొట్టమొదట నుండీ వాడుతూ వస్తున్నారు హిందువులు. మన పంచాంగంలోని 5 అంగాలలో 'వారం' అనేది ఒక అంగం. వారానికి ఏడు రోజులుగా లెక్కించిన మొదటి వారు బాబిలోనియన్లని కుహనా మేధావుల అసత్యవాదం.

పూర్వం ఒక్కొక్క దేశంవారు ఒక్కొక్క విధంగా వారానికి వ్యవధులు ఏర్పరచుకున్నారు. పశ్చిమ ఆఫ్రికాలో కొన్ని జాతులు వారానికి 4 రోజుల వ్యవధిని పాటించేవారట. యూరప్‌లో కొన్నిచోట్ల, ఆసియాలో కొన్ని చోట్ల, మధ్య అమెరికాలోనూ వారానికి 5 రోజుల వ్యవధిని పాటించేవారట. పురాతన చాల్డియన్ క్యాలెండరులో వారానికి 6 రోజులు కన్పిస్తున్నాయి.

## 7 రోజులవారం

జ్యోతిషగ్రహాల పేర్లతో హిందువులు ఏర్పరచిన 7 రోజుల వారాన్నే నేడు ప్రపంచం అంతా అనుసరిస్తోంది. భూమి మీద మనుషుల జీవితాలపై ఆకాశంలోని గ్రహతారకల ప్రభావం ఉంటుందనేది హిందువుల విశ్వాసం. దీని ఆధారంగానే గ్రహాల నడకలతో

ప్రాచీన హిందూ జ్యోతిష శాస్త్రవేత్తలు ''సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు'' అనే నవగ్రహాల్ని తమ జ్యోతిష శాస్త్రంలోకి తీసుకున్నారు. (నవగ్రహాలంటే సూర్యకుటుంబ నవగ్రహాలు వేరు, జ్యోతిషశాస్త్ర నవగ్రహాలు వేరు అని ఇక్కడ గ్రహించాలి)

రాహు కేతువులు ఛాయా గ్రహాలు కావున మన పూర్వీకులు వాటిని ప్రక్కన పెట్టి, మిగిలిన 7 జ్యోతిషశాస్త్ర గ్రహాల (సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని గ్రహాల) పేరిట 7 రోజులకూ

**హిందువులు ఏర్పరచిన 7 రోజుల వారాన్నే నేడు ప్రపంచం**

పేర్లు నిర్ణయించి ''7 రోజుల వారా''న్ని తయారుచేశారు. సూర్యుని పేరిట 'రవి వారం' అంటే 'ఆదివారం' అని నామకరణం చేశారు. ('రవి' అంటే సూర్యుడనీ, 'ఆది' అంటే మొట్టమొదటి అనీ అర్థం తెలుస్తూనే ఉంది) చంద్రుణ్ణి 'సోముడు' అని కూడా అంటారు. వారంలోని 2వ రోజును ఆయన పేరిట ''సోమవారం'' అన్నారు. కుజగ్రహానికి ''మంగళగ్రహం'' అని మరో పేరుంది. అందువల్ల 3వ రోజును ''మంగళవారం'' అన్నారు. తర్వాత బుధ గ్రహం పేరిట ''బుధవారం'', గురుగ్రహం పేరిట ''గురు వారం'', శుక్రగ్రహం పేరిట ''శుక్రవారం'', శనిగ్రహం పేరిట ''శనివారం'' అని పేర్లు నిర్ణయించారు.

ఇలా వారం లోని ఒక్కొక్క రోజుకూ ఒక్కొక్క జ్యోతిష గ్రహాన్ని అధి దేవతగా నిలిపి ఆయా పేర్లు పెట్టారు. (ఆ యా రోజుల్లో ఆయా గ్రహాల ప్రభావం భూగోళంపై కాస్త హెచ్చుగా ఉండడం పూర్వీకులు గమనించారో ఏమో మరి! ఆ విధంగా పేర్లను నిర్ణయించారు) ఆది నుండీ జ్యోతిష శాస్త్రాన్ని రూపొందిస్తూ వచ్చిన హిందువులు ఈ విధంగా 7 రోజుల వారాన్ని రూపొందించగా, కొంతమంది కుహనా మేధావుల వాదం మరోలా ఉంది.

పాశ్చాత్య భావాలకు దాసులైన ఈ పెద్దమనుషులు ''ఈ 7 రోజుల వారం మొట్ట మొదటగా మెసపొటేమియాలో మొదలయిందనీ, వారంలోని 7 రోజులకూ పై విధంగా నామకరణాలు చేసినవారు చాల్డియన్‌లనీ'' వాదిస్తుంటారు. ప్రథమంగా జ్యోతిషశాస్త్రాన్ని రూపొందించిన వారే ఈ పద్ధతిని ఏర్పరచినట్లుగా స్పష్టమౌతోంది కదా! జ్యోతిషశాస్త్రాన్ని ప్రథమంగా రూపొందించినవారు హిందువులే! పైగా, వారం అనేది మన పంచాంగంలోని అంశం. మన పంచాంగ రచనా కాలానికి ఆ మెసపొటేమియన్లు గానీ, ఆ చాల్డియన్లుగానీ ఎక్కడున్నారని......?

వారంలోని 7 రోజులపేర్లూ హిందువుల జ్యోతిషగ్రహాలకు చెందినవి.. సూర్య చంద్రులను (జ్యోతిషపరంగా) గ్రహాలలో లెక్కించే పద్ధతి కేవలం హిందువులదే! అటువంటి పద్ధతి ఏ విదేశీజాతిలోనూ లేదు. దీన్నిబట్టి కూడా వారంలోని 7 రోజుల పేర్లనూ హిందువులే నిర్ణయించారని చెప్పగలం. (సశేషం)

## సందేహాలకు సమాధానాలు



# జిజ్ఞాస

### నిర్వహణ: ఋషిపీఠం

బాలసుబ్రహ్మణ్యం ఒంగోలు

ప్ర. ఈ మధ్య ఒక సంస్థవాళ్లు వేదాలలో దేవుడు, దైవ పూజ లాంటివి లేవనీ, ప్రకృతి శక్తులను ఉదాత్త భావాలతో గానం చేశారనీ – ఒక సభలో చెప్పగా విన్నాను. అగ్ని, వాయువు వరుణుడు లాంటివారి ప్రసక్తే తప్ప, శివ, విష్ణు శక్తి లాంటివి లేవని వాళ్లు చెప్పారు. మానవ మేధతో స్వప్రయోజనాల కోసమే దేవుడ్ని సృష్టించారనీ, అది మూఢనమ్మకమనీ కూడా అన్నారు. ఈ దేవుడమ్మలూ, దేవుడయ్యలూ మోసాలనీ చెప్పారు? నిజంగా దేవపూజల ప్రసక్తి వేదాలలో లేదా?

జ. ఆ చెప్పినవాళ్లు ఎక్కడో ఏవో కొన్ని అరకొర విజ్ఞానపు వ్యాసాలను చదివేసి మిడిమిడి జ్ఞానంతో ఆడిన మాటలే ఇవి.

ఒక శాస్త్రం గురించి మాట్లాడేముందు – ఆ శాస్త్రానికి సంబంధించిన పారిభాషిక పదాల అవగాహనను మొదలుకొని, ఆ శాస్త్ర సంప్రదాయం తెలిసి, అధ్యయనం చేసి అప్పుడు మాట్లాడాలి.

కేవలం కొన్ని ఉటంకింపులు నోటపట్టి మాట్లాడ్డం సరిపోదు. దేవుడమ్మలూ, దేవుడయ్యలూ మోసాలేనని మన సంస్కృతి మీద అవగాహన ఉన్న ఎవరైనా అంగీకరించి తీరతారు. ఎంత గొప్ప పురుషుడినైనా 'దేవుడు' అని ఆరాధించడం అజ్ఞానమే. గొప్పవాడిగా గౌరవించడం మటుకు చాలు. ఈ రకమైన అజ్ఞానపు ఆరాధనని వేదసంస్కృతే నిరసించింది.

ఇక దైవం అంటే అర్థం ఏమిటి? ఒకే విశ్వచైతన్య శక్తి, ఉపాసనకై వివిధ రూపాలుగా ఆవిర్భవించిందనీ, ఆ రూపాలూ తాపసులైన ఋషులకు గోచరించిన విధానం వేదాలలోనే ఉంది. అవి అర్థం చేసుకోవాలంటే, దుర్భావ దూషితంకాని మనస్సు, ఏకాగ్రమైన శ్రద్ధతో కూడిన అధ్యయనం అవసరం.

'ఇదం విష్ణుర్విచక్రమే-'

'వేదాహమేతం పురుషం మహాన్తం' -వంటి మంత్రాలే కాక, ఋగ్వేదం మొదలుకొని అనేక విష్ణుసూక్తాలు ఉన్నాయి. మంత్ర, ఉపాసనాదులకు సంబంధించిన అధర్వణవేదంలోనూ అనేక రహస్యాలు చెప్పబడ్డాయి.

'నీలగ్రీవో విలోహితః'

'పినాకం బిభ్రదాగహి', 'నమశ్శివాయ చ శివతరాయ' మొదలైన శివరూపాలు, శివ మంత్రాలూ వేదాలలో చెప్పబడ్డాయి.

'తాం మ ఆ వహ జాతవేదో లక్ష్మీం',

'శ్రియం దేవీం', 'హిరణ్యవర్ణాం', సువర్ణరజత స్రజాం', 'అహం రుద్రేభిర్వసుభిశ్చరామి' - వంటి దేవీ సంబంధ సూక్తాలూ వేదాల్లో వేవేలు: ఇంకా కేనోపనిషత్తు, భావనోపనిషత్తు వంటి వేదభాగాలలో దేవీ ప్రభావం చెప్పారు.

'గణానాం త్వా', 'మహాన్‌హస్తీ', 'ఏకదంతాయవిద్మహే'- వంటి గణపతి మంత్రాలూ ఉన్నాయి. ఇప్పుడు మన మతంలో నున్న దేవతా రూపాలన్నీ వేదాలలోని ఉపాసనకాండలో చెప్పినవే. కంటికి కనబడే అగ్ని, నీరు మొదలైన వాటిని దర్శించడం కాదు వేదమంటే. వాటివెనక భౌతిక దృష్టికి గోచరించని దేవతాశక్తుల్ని చూసి, వాటిని భగవచ్చైతన్యంగా దర్శించినదే వేదం.

వైదికమైన సంస్కారంతో చూస్తే ఏది మూఢనమ్మకమో నిర్ణయించగలం. అరకొర చదువులకి అన్నీ మూఢాలే.

అందుకే అల్పజ్ఞాని అర్థం చెప్పడానికి వస్తే వేదమాత భయపడుతుందన్నారు పెద్దలు.

శిక్ష, వ్యాకరణం, ఛందం, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - అనే షడంగాలలో నైపుణ్యం ఉన్నవాడే వేదానికి అర్థం చెప్పగలడు.

వీటితో పురాణసంప్రదాయం తెలియాలి. ఇవేవీ మనం చేయలేకపోతే, అలా చదువుకున్న పెద్దలదగ్గర వినయంగా విద్య నేర్చుకోవాలి. శిక్షణే లేకుండా, జ్ఞానలవదుర్విదగ్ధులై మిడిసి పడితే చాలదు.

**'బిభేత్యల్పశ్రుతాత్ వేదం**
**మామయం ప్రహరిష్యతి'-**

'అల్పజ్ఞానివల్ల తన హృదయమే దెబ్బ తింటుందని వేదం భయపడుతుంది'

'యజామహే' - అంటే అర్చిస్తున్నాననే అర్థం. ఈ అర్చనావిధానమూ వేదవిహితమే.

'త్ర్యంబకం' లాంటి దేవతామూర్తులు ఋగ్వేదంలోనే చెప్పబడ్డారుకదా.

'దేవపితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యమ్' - దేవపితృ కర్మలలో ఏమరపాటు కూడదు - అంటూ వేదమే దైవోపాసన చెప్పింది.

'తస్య తే భక్తి వాంసః స్యామ' - ''దైవమా! మేము నీభక్తులం'' అని వేదమే దైవభక్తిని పేర్కొంది.

'అర్చత' అని దేవతార్చనని ప్రబోధిం

చింది వేదమే. వేదవేదాంగజ్ఞులైన పెద్దలం దరూ, దేవతారాధనలతో పునీతులయ్యారు, అవుతున్నారు. వాటి రహస్యాలేమిటీ అని ఆలోచించడం మాని, అనూచానంగా వస్తున్న ఒక మహద్విషయాన్ని, అవగాహన రాహిత్యంతో, కాదనడం - మూసుకున్న మేధకి నిదర్శనం. ఆచరించేవాడికే అవగాహన కలుగుతుంది. అలాంటి అనుష్ఠానంతో కూడిన ఆలోచనకే సత్యం దర్శనమిస్తుంది.

కె.రమాదేవి రాజమండ్రి

ప్ర. శృంగేరీ, పూరీ, బదరీ, ద్వారక - ఇవే శంకరపీఠాలనీ, కాంచీపురం శంకరపీఠం కాదనీ కొందరి వాదనలు విన్నాం. అవి నిజమేనా? శంకరులకాలం విషయమైకూడా అనేక భేదాభిప్రాయాలు పీఠాధిపతుల్లోనే ఉన్నాయి. వీటన్నిటినీ ఏమిటంటాం? ఇన్ని గందరగోళాల మధ్య వైదికమతం గతిఏమిటి?

జ. కాంచీపురంలో శంకరపీఠం 'లేద'ని ఎన్ని వాదనలున్నాయో, 'ఉందనీ' అన్ని వాదనలున్నాయి. 'ఉంద'న్న వాదననే 'బెనిఫిట్ ఆఫ్ డౌట్' నియమం ప్రకారమైనా అంగీకరించాలి.

పైగా అది లేదని వాదించినంత మాత్రాన సాధించేది ఏముంది? ప్రధానం - శంకరుల హృదయం, వారి వాఙ్మయవైభవం, వారి వైదిక మతప్రతిష్ఠాపన కర్తవ్యం. అవి నెరవేరాలి. వాటికి కాంచీపీఠం, శంకర సంప్రదాయ పద్ధతులలో కృషిచేస్తోంది. ప్రజలు శంకరభావనతో గౌరవిస్తున్నారు. ఇది ఆగదు. కనుక వాదనలనవసరం. ఇలాంటి భేదాభిప్రాయాలకు చోటివ్వడం సంకుచితత్వానికి నిదర్శనం. ఇది సమూలంగా మన సంస్కృతికే విఘాతం.

శ్రీశ్రీశ్రీ కంచి మహాస్వామి చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివంటి మహాత్ముల ఉనికి మాత్రం చేత కాంచీ శంకరమఠం ఎంతగా ప్రజల్ని చైతన్యవంతం చేసిందో, ఆ మహర్షి బోధనల బలిమి ఎంతటిదో అందరికీ తెలిసిన విషయమే. ఆ మార్గంలోనే ఇప్పటి కంచి జగద్గురువులూ జాతిని జాగృతం చేస్తున్నారు.

ప్రతి శంకరపీఠంలోనూ మహాయోగులూ, వేదమూర్తులూ, ఆదిశంకర విభూతి కలిగిన వారే అధిపతులయ్యారు, ఇప్పుడూ అధిపతులుగా ఉన్నారు. వారందరినీ వేదధర్మ మార్గనిష్ఠులంతా జగద్గురు స్థానంలో ఉంచి నమస్కరించవలసిందే. చిన్నచిన్న భేదాభిప్రాయాలు వ్యక్తిగతాలు. వాటివల్ల మూలలక్ష్యానికి ప్రమాదం లేదు.

శంకరుల కాలం ఏదైనా, వారు కాలాతీతులు. వారి ధర్మం సార్వకాలికం. అది మనకు ముఖ్యం. అంకెల గోలలు అనవసరం. ఏ గందరగోళమూ ఇక్కడ లేదు. పీఠాలెన్నో ఏనాడో సమన్వయానికి వచ్చి ఉన్నాయి.

''భగవత్పాదానాం కాలవిషయే చరిత్ర విషయేచ సన్త్యస్మాకం మత భేదాః । పరంతు తానత్ర చర్చితుం వయం నేచ్ఛావః। అస్మాచ్ఛిష్యలోకానపి తాదృశచర్చాణామవకాశ ఇతః పరం నదేయ ఇతి ఆదిశామః।''

''భగవత్పాదుల కాలవిషయంలోనూ, చరిత్ర విషయంలోనూ మాకు మతభేదములున్నవి. అయితే వాని గురించి చర్చించేందుకు మేము ఇచ్ఛగించడం లేదు. మా శిష్యలోకము కూడా ఇప్పటినుండి అటువంటి చర్చలకు తావీయరాదని ఆదేశించుచున్నాము.''

''సర్వేపి శంకరాచార్యాః దేశే శాంతి పరిరక్షణాయ లోకక్షేమాయచ మిలిత్వా ప్రయత్నిష్యామహే।''

శంకరాచార్యులమందరమూ దేశములో శాంతి పరిరక్షణకు, లోకక్షేమమునకు కలిసి ప్రయత్నిస్తాము.

*(27.6.1993న శృంగేరిలో జరిగిన శంకరాచార్యుల సమావేశంలో శృంగేరీ, కంచి, బదరి, ద్వారకా, పూరీ శంకరాచార్యులు చే(వాళ్ళు చేసిన సంయుక్త ప్రకటన - తత్త్వలోక జూన్ జూలై 1993)*

పైగా ఆదిశంకరులే - కొన్ని హెచ్చరికలు చేశారు.

కలహంగార సపత్రిరతస్తాం పరివర్జయేత్
పరస్పర విభాగేతు ప్రవేశో న కదాచన ॥

(మఠామ్నాయః)

''కలహాగ్నికి కారణమైన నియమోల్లంఘనాన్ని వదలిపెట్టాలి. ఒకరి విభాగంలో ఒకరు ప్రవేశించరాదు'' అని శంకర మఠాల నియమం.

వీటిని వేటినీ మనం విస్మరించరాదు.

చతురామ్నాయపీఠాలకూ, కాంచీపుర శంకర పీఠానికీ, ఆ అయిదు పీఠాల జగద్గురువులకూ మనసా శిరసావచసా ప్రణామసహస్రాలు.

జె.లక్ష్మీదేవి ప్రొద్దుటూరు

ప్ర. 'భగవంతుడు', 'భగవతి' అంటే అర్థం ఏమిటి?

జ. **ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః।**
**జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరిణా॥**

1. సమగ్రమైన ఐశ్వర్యం, 2. వీరం, 3. యశస్సు, 4. శ్రీ (ప్రభ), 5. జ్ఞానం, 6. వైరాగ్యము - ఈ ఆరుగుణాలూ ఉన్నవాడు భగవంతుడు. దీనికి స్త్రీరూపమే 'భగవతి'. ఇదేకాక మరో అర్థం కూడా ఉంది.

**ఉత్పత్తిం ప్రళయం చైవ**
**భూతానా మాగతిం గతిమ్ ।**
**వేత్తి విద్యామవిద్యాం చ**
**స వాచ్యో భగవానితి ॥**

1. సృష్టి, 2. ప్రళయం, 3. ప్రాణుల రాక, 4. పోక, 5. విద్య (మోక్షం), 6. అవిద్య (బంధనం) - వీటిపై అధికారం గలవాడు 'భగవంతుడు'. (స్త్రీరూపం - భగవతి). ✸

# అమ్మ - ఆవు

'బిస్సి'

మద్రాసులో మైలాపూరు కపాలీశ్వరునికి భక్తులు సమర్పించిన ఆవులను వేలం వేయడానికి దేవాలయ అధికారులు నిర్ణయించారు. ఆ ఆవులు చివరిగమ్యం కబేళానే అని గ్రహించిన ఒక సంఘం వార్ఘు ఆ ప్రయత్నాన్ని అడ్డగించారు. వట్టిపోయిన ఆవులను మేమేం చేయాలని ప్రశ్నించారు ఆలయ అధికారులు.

అసలు మంచి ఆవులను పరిరక్షించడానికి కూడా సరిఅయిన వ్యవస్థ వారికి లేదు. వచ్చిన డబ్బంతా సిబ్బంది జీతానికి, ప్రభుత్వంలో దేవదాయ శాఖని నిర్వహించడానికే సరిపోతుంది. ఇలాంటి గోశాలలు నిర్వహించడానికి పాపం వారికి డబ్బు ఎక్కడ్నుంచి వస్తుంది? పోనీలే! కంచి పీఠమువారు కొన్ని గోశాలలను నిర్వహిస్తున్నారు కదా! అదీకాక ''ఎవరు గోవుల్ని పోషించలేకపోయినా మాకు పంపండి. కష్టమో, సుఖమో మేము పోషిస్తా'' మని ఆ పీఠాధిపతులు ఒక బహిరంగ ప్రకటన కూడా చేసి ఉన్నారాయె. వారికి పంపవచ్చు కదా... అన్నారు సమితి వారు. ''అలా అని కంచి మఠం నుండి మాకు నివేదన పత్రం రాలేద''న్నారు మాననీయులైన కమీషనర్ గారు. ఇది ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో వచ్చిన వార్త. ప్రస్తుతానికి వేలం నిరవధికంగా వాయిదా వేసినట్లు తెలిసింది అనుకోండి.

కబేళాలకు వెళ్లే అవకాశం ఉన్నప్పుడు, ఆవును తల్లిగా భావించే ధర్మమునకు చెందిన హిందూ దేవాలయాధికారులు, అట్టి ఆవులను వేలం వేయడం ఉచితమా? మరి ఏం చేయాలి అంటే - 1) ముసలి ఆవుల్ని, ఒట్టిపోయిన ఆవుల్ని పోషించే శక్తి, మనస్సు లేకపోతే (ధర్మపరంగా అయితే అలా పోషించే కర్తవ్యం ఈ దేవాలయానికి ఉంది) మేము అసమర్థులము. అభిషేకానికి పాలు మాత్రం దానం చేయండి. విభూతికి పేడ మాత్రం దానం చేయండి, ఆవులను మాత్రం ఈయవద్దు అని అసహాయ ఆక్రందన చేయాలి.

2) ఇలాటి ఆవులను సగౌరవంగా ఆదరంగా చూసే సంస్థలను (అదృష్టవశాత్తు ఇంకా కామకోటి పీఠం వంటి కొన్ని సంస్థ



లున్నాయి) అర్థించి ఈ ఆవులను అక్కడకు పంపించాలి.

అసలు అర్థం కాని విషయమింకొక్కటుంది. అసమర్థులైన వారు ఈ అవులను రక్షించే సమర్థులను అర్థించాలా? లేక వారే వీరికి నివేదన పత్రం పంపాలా? ఎవరు ఎవరిని అడగాలి? దిలీపుని నుండి శివాజీ వరకు గోవును కామధేనువులా, కన్నతల్లిలా ఆదరించిన దేశం ఇది. ఇట్టిదేశంలో ఒక ధార్మిక సంస్థ చేయాల్సిన పనా ఇది! ఈవార్తను చదువుతున్నపుడు, కంచి మహాస్వామి వారితో మా అనుభవం గుర్తుకు వస్తోంది.

మా దొడ్లో, అనేక ఆవులుండేవి. మా నాన్నగారికి మా దొడ్లో పుట్టి పెరిగి, ఈనిన ఆవును మహాస్వామి వారికి ఇవ్వాలని కోర్కె. ఆయన కోరిన ప్రకారమే మా దొడ్లో పుట్టి పెరిగిన ఆవు ఈనమోపింది. అయితే ఈనే సమయానికి దూడ కడుపులో అడ్డం తిరగడంతో ఆవుని పశువుల డాక్టరు వద్దకు తోలుకొని వెళ్లారు. మనసు ఉండబట్టుకోలేక మా నాన్నగారు కూడా వెళ్లారు. డాక్టరుగారు దూడని గర్భంలోనే కత్తిరిస్తే కానీ గర్భం నుండి బయటకు లాగటానికి కుదరదనీ, లేకుంటే తల్లి ప్రాణానికి ముప్పు అనీ చెప్పారు. ఆవు ఆక్రందనలతోనే మనసు కరిగిపోయిన నాన్నగారు ఈ వార్త వినడంతో కళ్ళనుండి బొటబొట నీరు కారాయి. ఎదురుగుండా దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న చంద్ర బింబంలో చంద్రశేఖరుని (స్వామివారిని) ధ్యానించి, ''స్వామీ! ఆవూ దూడా క్షేమంగా ఉండాలి. దూడ పెయ్యదూడయిఉండాలి. నేను మేడి ఈనిన తరువాత దూడతోసహా తమకు సమర్పించుకోవా''లని ప్రార్థించారట. ఒక తెగింపు వచ్చింది. డాక్టరుగారితో దూడను లాగడానికి ప్రయత్నించమన్నారు. ఆశ్చ ర్యంగా కథ సుఖాంతమయింది. ఆవూదూడా క్షేమంగా ఉన్నాయి.

ఆ దూడ నాల్గు సంవత్సరాలయినా పొల్లలేదు. చూడడానికి కామధేనువులా ఉండేది. ఇక లాభం లేదనుకొని అమ్మివేసి, ఆరోజుల్లోనే నాలుగు వందల రూపాయలు వస్తే, అవి పుచ్చుకొని, స్వామివారిని శివస్థానంలో దర్శించి విషయం వివరించి పైకం స్వామి ముందుంచారు మానాన్నగారు.

స్వామివారు డబ్బునూ, మానాన్నగారి

ముఖాన్ని మార్చి మార్చి చూశారు. ''ఆదూడ పాల్లలేదని నీవే చెబుతున్నావు. కొన్న వానికి ఏమి లాభమనే విషయం నీవాలోచించావా? ఒకటి సరుకు మోయడానికి ఉపయోగించాలి. ఒకవేళ వాళ్ళు దాన్ని వధించినట్లయితే? ఆ దూడ మాంసమును అమ్మిన డబ్బు నాకు సమర్పించినట్లవదా? అక్కరలేదు. నాకిస్తానన్న దూడ, అది పాల్లకపోతే మాత్రం నీవెందుకు అమ్మాలి? నాకు ఆ దూడే కావాలి. వెతికి పట్టుకురా'' అన్నారు.

మా నాయనగారు, అన్నయ్యలూ ఊరు వెంబడిపడి అన్వేషణ మొదలు పెట్టారు. మేమమ్మిన వాని దగ్గరకూ, అతను అమ్మినవాని వద్దకూ, ఈ విధంగా.

ఈ లోగా స్వామివారు ఊరుకోలేదు. విజయవాడ సమీపం నుండి ఎవరు దర్శనానికి వెళ్లినా, వాళ్లకి ఈ కథంతా చెప్పి, అన్వేషణ ఎంతవరకూ వచ్చిందో స్వయంగా చూసి వర్తమానం పంపమని చెప్పేవారు.

చివరికి ఒక లంబాడీ తండావారు మా దూడను కొన్నారని తెలిసింది. వీరు ఆవును చంపరు. ప్రాణం కుదుటపడినా, వీరు సంచారజీవులు కదా! ఎక్కడని వీరిని పట్టుకోవడం? పాలుపోలేదు. ఈ లోగా స్వామివారే శ్రీమాగంటి సూర్యనారాయణ గారిద్వారా కబురు చేశారు. ''అమ్మివేసిన దూడగురించి ఇక చింత పడనవసరము లేదు. ఆ డబ్బుతో ఇంకోదూడను కొని, మేపి, ఈనిన తరువాత మఠమునకు తోలవలసినది. ఇంకెప్పుడూ ఆవుల్ని అమ్మరాదు.'' అదీ సందేశ సారాంశము. తదాదిగ మా ఇంట్లో ఆవుల్ని ఎప్పుడూ అమ్మలేదు. మందపెరిగితే మేపుకొంటారని నమ్మకం ఉన్నవారికి బహుమానంగా ఇవ్వడమే.

ఈకథను, నేను మద్రాస్‌వచ్చిన క్రొత్తలో, ఏదో పనిమీద కలిసిన ఒక ఉన్నతాధికారికి, పని అయిపోయిన తరువాత, మాటల సందర్భంలో చెపుతున్నాను. ఆయన సన్నగా మొదలయిన ఏడుపు నాపుకోలేక గదంతా ప్రతిధ్వనించేలా పెద్దపెట్టున ఏడ్వనారంభించాడు. నేను విస్తుపోయాను. తమాయించుకొన్న తరువాత ఆయన చెప్పడం మొదలుపెట్టాడు.

ఆయన వాళ్ల నాన్నగారికి సీమంత పుత్రుడు. చిన్నతనంలోనే భార్య పోయింది, ఏడాది పిల్లను వదిలి. ఈయనకు ఆ ప్రథమ కళత్రం మీదా; తద్వారా ఈ పిల్లమీదా ఇనుమిక్కిలిగా ప్రేమ, అందువల్లనే రెండో పెళ్ళి చేసుకోలేదు. తమ్ముళ్లకు, చెల్లెళ్లకు చదువు, పెళ్ళిళ్ళు, కాన్పులు అన్నీ ఈయనే చూశాడు. అయినా వారికి కృతజ్ఞత లేదు. పోనీ వారయినా సుఖంగా ఉన్నారా అంటే జీవితంలో వారికీ ఏదో ఒక అసంతృప్తి, లోటు. దీనికి తోడు ఈయనతోనే ఉంటూ ఎప్పుడూ ఏదో ఒక సమస్యను సృష్టించే పిచ్చి తమ్ముడొకడు. జీవితంలో శాంతి అనేదే కరువయి పోయింది. ఈయన తాతలకాలం నుండి ఈ స్వామివారు వారికి ఇలవేలుపు.

ఒకరోజున స్వామివారి వద్దకు పోయి, ''స్వామీ! మాతాత దగ్గర్నుంచి మిమ్మల్ని ఆశ్రయించి ఉన్నాము. ఏదో కొద్దోగొప్పో కుదిరినంతమేర ధర్మంగానే బ్రతుకుతున్నాము అయినానాకింత కష్టాలనిస్తున్నారే'' అని నిలదీశాడు. స్వామి కనులతో కరుణను వర్షించారు. సమాధానం చెప్పలేదు. వీనికీ సమాధానం కుదరలేదు. దూరంగా ఒంటరిగా కూర్చుని బాధపడుతూనే ఉన్నాడు. రాత్రితొమ్మిది గంటలపుడు స్వామివద్ద నుండి కబురు వచ్చింది.

నమస్కారం చేసి నుంచున్నాడు. ''మీ నాన్న చేసిన ఉద్యోగం ఏమిటి'' అని ప్రశ్నించారు స్వామి. పుదుక్కోట సంస్థానంలో పశువుల డాక్టరని సమాధానం. ''అది సరి! తరువాత పిల్లలంతా పెద్దవాళ్లవుతున్నారు, జీతం చాలడం లేదని పూనాలో ఆంగ్లేయుల వద్ద కొలువు చూసుకొన్నాడు. నేను వద్దని చెప్పినా వెళ్ళి చేరాడు. అక్కడ ఆయన ఉద్యోగ బాధ్యత ఏమిటో తెలుసునా?'' అని స్వామివారి ప్రశ్న. తెలియదని బదులిచ్చాడు. ''మీనాయన ఆంగ్లేయ ఉన్నతాధికారుల వినియోగానికి నిర్దేశించిన ఆవులను పరీక్షించి "Fit for consumption" అని యోగ్యతా పత్రికనిచ్చేవాడు. ఆరునెలల తరువాత మనసుకు కష్టంగా ఉండి ఉద్యోగం మానివేశాడనుకో! ఆ పాప పరిహారం కోసం ఊరూరూ తిరిగి వేలాది సార్లు శంకర విజయం ప్రవచనం కూడా చేసేవాడు. అయినా....'' అంటూ అర్థంతరంగా ఆపి మౌనంలోనికి జారుకున్నారు. ఉన్నతోద్యోగికి తన దుఃఖ కారణం తెలిసింది. అలాటికథే వినడంతో దుఃఖమిప్పుడు పెల్లుబికింది.

ఇంకోసారి శివస్థానంలో ఉండగా ఎంతో దూరం నుంచి ఒక ఆవును ఎవరో లారీలో తీసుకొని వచ్చారు. అదెంతో డస్సిపోయినట్లు కన్పించింది. క్రిందికి దింపగానే 'అంబా' అంటూ ఆక్రోశించింది. ఆ రోజుల్లో గది లోంచి బయటకు వచ్చేవారు కారుస్వామి. అయినా ఆవు ఆక్రోశాన్ని విని పరుగు పరుగున బయటకు వచ్చి ఆవుచుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేసి, గోపంచితం శిరస్సుమీద ప్రోక్షించుకొని నమస్కారం చేసి కంపిత స్వరంతో ''మఠం క్షేమంగా ఉండాలి. పీఠాధిపతులు (జయేంద్రులవారు) క్షేమంగా ఉండాలి. దేశం క్షేమంగా ఉండాలి'' అంటూ ప్రార్థించారు. ఇంకా నేను స్వయంగా చూసినవే ఇలాటి సన్నివేశాలు అనేకం ఉన్నాయి.

మహాత్ములు గోవుపై అంత గౌరవం, ఆదరం చూపారు. కామధేనువుగా పరిగణించారు. ఒక దూడ మరణించడానికి కారకుడని, మనునీతి చోళుడు, తన కుమారునికే మరణదండన విధించిన దేశమిది. అలాటిది అనేక వేల గోవులు కబేళాలకు తరలించబడుతుంటే, నిరోధించడానికి, ఉడతా భక్తిగా మన ప్రయత్నం మనం చేయకపోతే అది ఈ జాతి పాలిట శాపంగా పరిణమిసుంది. ✹

మీ మాస పత్రికలో భారతీయ సంస్కృతి సంప్రదాయాల గురించి పురాణేతిహాసాలు, రామాయణ మహాభారతంలోని విషయాల గురించి ప్రచురించి - శుష్కించి పోతున్న మన దేశ సనాతన సాంప్రదాయాన్ని పునఃప్రతిష్టింపజేయడానికి మీరు చేస్తున్న కృషి అద్వితీయం, అమోఘం. జ్యోతిషం, వ్యాకరణాది శాస్త్రాలలో నిగూఢమై వున్న సమస్త విషయాలను తెలియజేస్తున్న మీ ఋషిపీఠం మానస పత్రిక ''సరస్వతీ మాత మానస పుత్రిక'' గా భారతమాత కీర్తికిరీటంలో మణిరత్నంలా వెలుగొందాలని కోరుకుంటున్నాను.

యల్లంభట్ల వెంకటేశ్వరశర్మ · రాజవరం

బాలబాలికలకు (15 సం॥లోపు వారికి) విజ్ఞానం పోటీ శీర్షిక నిర్వహిస్తూ, హిందూ సంస్కృతిని పరిరక్షిస్తూ మీరు ప్రచురిస్తున్న ఋషిపీఠం మానస పత్రిక నిజంగా అభినందనీయం. ఆర్ష సంస్కృతికి అద్దం పట్టుచున్నదనుటలో అతిశయోక్తి కాజాలదు. ప్రతిమాసంలోని ప్రముఖ దేవతా మూర్తులను ముందుగానే జ్ఞప్తిచేస్తూ, వాటిని ఆచరించుటకు ప్రేరేపించుట సమంజసం.

విద్వాన్ శివశ్రీలేఖ కడప

మీరు 'ఋషిపీఠాన్ని' అందరికీ అందించడానికి చేస్తున్న కృషికి నాహృదయ పూర్వకమైన అభినందనలు. 'భారతీయ మానస పత్రిక' అనడం ముమ్మాటికి నిజం. చక్కని తెలుగులో, భారతీయ సంస్కృతిని అన్నికోణాలనుంచి అందిస్తున్న మీ కైంకర్యానికి నా సహాయ సహకారాలు తప్పక లభిస్తాయి. అమూల్యమైన విషయాలు




వుండటం చేత మేము జాగ్రత్తగా దాచుకోవలసిన పుస్తకం ఇది. మీ సత్కార్యానికి భగవత్కృప మీకెప్పుడు లభించాలని మనసా వాచా కర్మణా ప్రార్థిస్తున్నాను.

డా॥ సెల్వి.పి.ఉమ దిండిగల్

''సనాతన మహాసామ్రాజ్యపట్టాభిషేకం'' లో శ్రీవిశ్వనాథశాస్త్రిగారు మన మత సంస్కారం గురించి చక్కగా రాస్తూ లేవనెత్తిన కొన్ని ప్రశ్నలు అందర్నీ ఆలోచింపచేసే విధంగా వున్నాయి. అన్ని శీర్షికలు పత్రికకు మరింతగా అందాన్ని చేకూరుస్తున్నాయి.

మూల్పూరు నరసింహారావు విజయవాడ

## అక్షరామోదం

బ్రహ్మ మానస పుత్రికలాంటి
భారతీయ మానస పత్రిక
మాసపత్రిక ఋషిపీఠం!
ఈ పుణ్యభూమిలో విస్తరించిన
సంకర నాగరికతా వక్రవాదాల
విషవృక్ష శాఖల్ని ఖండించి
సర్వజన సమ్మతమైన భారతీయతని
పునఃస్థాపించడానికై
ఆవిర్భవించిన
ఆధునిక శంకరాద్వైత శారదా పీఠం!
ఆంధ్రపత్రిక, భారతిలాంటి
మంచి పత్రికల్ని ముంచివేసిన
తెలుగువాడి అభిరుచి ఏమిటో
తెలిసికూడా
తెగించి ఈ పత్రికని తీసుకొచ్చిన
ప్రచురణకర్త ప్రసాద్‌గారి కృషి,
కవిగా - అందునా - సినీ కవిగా
కీర్తి శిఖరాలు అందుకుంటూనే
సంపాదకత్వ బాధ్యతల్ని
సమర్థంగా నిర్వహిస్తున్న
షణ్ముఖశర్మగారి శేముషి
నిజంగా అభినందనీయం!
పరిమళించాలి మళ్లీ
ఈ నేలలో, గాలిలో
ఆరోగ్యకరమైన
ఆర్ష సంస్కృతీ సంప్రదాయం!
ఇది
ఉపద్రష్ట ముఖరితమైన
సామవేదం!
అందుకే
అభిమాన పురస్కృతమైన
ఈ అక్షరామోదం!

కాసల నాగభూషణం

మా వీధిలో నూతనంగా భవ్యమైన దివ్యమైన దేవాలయం నిర్మించి శ్రీవిద్యాగణపతిస్వామి వారిని ప్రతిష్ఠించినారు. ఋషిపీఠంలో 'సంకష్టహరచతుర్థి' ప్రచురించినప్పటినుండి ప్రతిమాసం భక్తిశ్రద్ధలతో వేడుకగా వైభవంగా జరుపుకొనుచున్నాము. 'సంకష్టహర చతుర్థి' గురించి ప్రచురించినందులకు ధన్యవాదములు.

ఎ.ఎమ్. ప్రసాద్ నెల్లూరు

# జూన్ 2000

# ఈనెల విశేషాలు

శ్రీ ఎస్. రామమూర్తి శర్మ

## ముఖ్యదినాలు

2 నర్మదానదీ పుష్కర ప్రారంభం

12 ఏకాదశి, నిర్జలైకాదశి

13

15 మిథున సంక్రమణం

16 జ్యేష్ఠ పూర్ణిమ

30 మాస ‹

### ✷ 2 నర్మదానదీ పుష్కర ప్రారంభం

*గంగేచ యమునే చైవ*
*గోదావరి సరస్వతి ।*
*నర్మదే సింధు కావేరి*
*జలేస్మిన్ సన్నిధిం కురు ॥*

మహా పుణ్య నదులలో ఒకటి నర్మదను నిత్యం మనం సంస్మరిస్తాం. ఈ మహానదికి పుష్కరాలు ఈరోజు నుండి ప్రారంభం. నర్మద లోని శిలలన్నీ శివస్వరూపాలుగా పూజ్యాలని శాస్త్రవచనం. పుష్కర సమయంలో నర్మదా స్నానం విశేష ఫలప్రదం.

### ✷ 12 నిర్జలైకాదశి

ఈ ఏకాదశి నాడు, చేయగలిగినవారు ఈ వ్రతాన్ని చేయవచ్చు. నిత్యం చేసే ఆచమనాదులందు తప్ప ఇతరంగా నీటిని తాగకుండా ఈరోజున ఉపవాసముంటే, పన్నెండు ఏకాదశులందు ఉపవాసమున్న ఫలం లభిస్తుంది. ఈ రోజున విష్ణుపూజ చేసుకొని, ద్వాదశి నాడు విష్ణు ప్రీతిగా, సువర్ణం, శర్కర (చక్కెర), ఉదకుంభ (నీటికలశం) దానం చేయాలి.

### ✷ 13 ద్వాదశి

ఈ రోజున గంగావతరణం జరిగిన రోజు. ఈ దినాన గంగా స్నానం, లేదా సమీప నదిలో స్నానం చేసి గంగాదేవిని తలచుకొని నమస్కరించాలి. ఈ తిథి నాడే కూర్మావతారం జరిగినది. కనుక కూర్మమూర్తిగా నారాయణుని అర్చించుతారు.

### ✷ 15 మిథున సంక్రమణం

సూర్యుడు మిథున రాశిలో ప్రవేశించే పుణ్య సమయం. ఈ సంక్రమణ వేళలో భగవదారాధన, విష్ణు సహస్ర నామ స్తోత్రాదుల పారాయణం విశేష ఫలాన్నిస్తాయి.

ఈ రోజున జలదానం చేయాలి. జ్యేష్ఠ మాసాన కూడా నీటిని విశేషంగా దానం చేయడం ఉత్తమం.

### ✷ 16 జ్యేష్ఠ పూర్ణిమ

ఈ రోజున తిలలు దానమిస్తే అశ్వమేధ ఫలం సిద్ధిస్తుందని ధర్మశాస్త్ర వచనం.

జ్యేష్ఠా నక్షత్రంతో కూడిన ఈ పూర్ణిమ యందు గొడుగు, పాదరక్షలు దానం చేస్తే ఆధిపత్యం లభిస్తుంది. ఈ తిథినాడే వట సావిత్రీ వ్రతాన్ని స్త్రీలు ఆచరిస్తారు.

ముఖ్యంగా - ఈ జ్యేష్ఠ మాసంలో చందనం, విసనకర్ర, నీటికుంభం దానం చేయడం త్రివిక్రమ ప్రీతి - అని 'ధర్మసింధు సారం' చెపోంది. ✷

## మహాభారత ప్రశ్నలకు జవాబులు

42. 1. ప్రతివింధ్యుడు, 2. శ్రుతసోముడు, 3. శ్రుతకీర్తి, 4. శతానీకుడు, 5. శ్రుతసేనుడు.

43. 1. భీముడు, 2. సహదేవుడు, 3. నకులుడు, 4. ధర్మజుడు

44. ద్రౌపది

45. శల్యుడు. శల్యుడు పాండవుల మేనమామ - అతడు మద్రదేశాధిపతి - అతడు పాండవులకు సాయపడాలని అక్షౌహిణి సేనతో వస్తున్నాడు. త్రోవలో ఎన్నో చక్కని సౌకర్యాలు కలుగజేసి దుర్యోధనుడు శల్యుని సంతృప్తిపరచి తనపక్షాన శల్యుడు యుద్ధం చేసేటట్లు వరం పొందుతాడు. ఉద్యో 1-97

46. 1. మోసకారి, 2. సోమరి, 3. పిరికిపంద, 4. నపుంసకుడు, 5. దొంగ, 6. కృతఘ్నుడు, 7. నాస్తికుడు.
శ్రీ ధూర్తకే ఉలసే భీరౌ షండే పరుషమానిని చోరే కృతఘ్నే విశ్వాసో నకార్యో నచ నాస్తికే ॥
సం.ఉద్యో - 3874

47. ద్రోణుడు. పొడుగయిన ఆ చేతులూ, నడకతీరూ చూస్తే అర్జునుడే అని తెలుసుకొని ద్రోణుడు ''అజ్ఞాతవాస సమయం అయిందా?'' అని భీష్ముని అడుగుతాడు. భీష్ముడు దుర్యోధనునితో మాట్లాడుతున్నట్లు వ్యంగ్యంగా, అయిపోయిందని సమాధానం చెపుతాడు.

48. దుస్సల : సంస్కృతంలో 'దుశ్శలా' దుః = దుఃఖమ్; శం = సుఖాంతే - లాతీతి దుశ్శలా - సుఖాంతమున దుఃఖమును తెచ్చునది.

43. ఆత్మస్తుతి మరణంతో సమానమని కృష్ణుడు చెప్పడంవల్ల - కర్ణవధ ముందు.

50. విదురుడు - సంజయుడు.

# ఆప్తవాక్యం

## ''ఆరోహణమాక్రమణం జీవతో జీవతోయనమ్''

### ఉన్నతి, పురోగమనం ప్రతి జీవికీ లక్ష్యం.

– అధర్వ వేదం)

ఎక్కడ వేసిన గొంగళి అక్కడే - అనే తీరు వ్యక్తి అభివృద్ధికి అవరోధం. ఏ పని చేపట్టామో, ఏ రంగంలో ఉన్నామో అందులో ఉన్నతి సాధించాలి. పురోగమించాలి. అందుకు ధార్మికమైన, సువ్యవస్థితమైన కృషి అవసరం.

సృష్టి చక్ర నిర్వహణ కోసం ఒక్కో వ్యక్తికీ ఒక్కో సామర్థ్యం, ఒక్కో పనీ, దానిని నిర్వ హించే బుద్ధీ, అందుకు తగ్గ వ్యవస్థా అతడికీ స్వాభావికంగానే భగవంతుడు ఏర్పరుస్తాడు. ఈ విశ్వచక్రంలో ప్రతి అణువూ సార్థకమే. చైతన్యభరితమే. వృథా ఏదీ లేదు.

'ఇది చాలులే', 'ఇంత చాలులే' - అనే ఉదాసీన వైఖరి మనిషికి ఉండకూడదు. ఆ ఉదాసీనత వైఫల్యానికి హేతువౌతుంది.

తాను చేసే పని పట్ల పూర్తి అవగాహన, అధ్యయనం, దీక్ష, క్రియ... అనేవి ముఖ్యం. నిరంతర ఆచరణ, గమన శీలమైన చైతన్యానికి చిహ్నం. ఆ చైతన్యం పని చేసేది ఒక ఉన్నతత్వాన్ని లక్ష్యంలో ఉంచుకొని. అయితే ''లక్ష్యం ఉన్నతంగా ఉండగానే సరిపోదు'' అని ఈ వేదవాక్యంలో రెండో శబ్దం (ఆక్ర మణం) - 'పురోగమనం' సూచిస్తోంది.

అంటే 'నిరంతరం ముందుకు వెళ్లడం' అని అర్థం. వెనుతిరగని ధృతితో, ఆత్మ సం యమనంతో అవాంతరాలను దాటుకుంటూ సాగడమే 'ఆక్రమణం' - పురోగమనం.

ఇప్పుడున్న దానిగన్నా ఉన్నతి, ఇప్పుడు చేస్తున్న దానిగన్నా విశేష కృషి... ఈ రెండూ ప్రతి మనిషికీ లక్షణంగా మారితే విజయం తథ్యం.

వేదసంస్కృతి ముక్కు మూసుకుని మూల ముడుచుకోవడాన్ని బోధించడం లేదు. 'ఉత్తిష్ఠత' అని మేలుకొలిపింది. ఇలాంటి వాక్యాల ద్వారా అడుగడుగునా మనలోని చైతన్యాన్ని సక్రమంగా, సము జ్జ్వలంగా వినియోగించుకొని భూమిని ఐశ్వర్యవంతంగా, సర్వ సమృద్ధిగా, ఆనంద ధామంగా మలచుకోవాలి.

ఐతే ఇందులో వదలకూడనిది 'ధార్మి కత'. ఈ ధార్మికతకి మూలం దైవశక్తిపై విశ్వా సం. దీనితో కలగలిసిన కర్తవ్యనిష్ఠను వేదమాత ప్రతిచోటా ప్రబోధిస్తోంది. పురోగమనం అంటే - ఉన్న ధర్మాన్నీ, సంప్రదాయాన్నీ విడిచి పెట్టేసి కొత్తవేషాలు వేయడం కాదు. ధర్మాన్ని మునుపటి కన్నా అధికశ్రద్ధతో ఆచరించడమే పురోగమనం.

పైగా - జీవితంలో ఎప్పటికప్పుడు ఒక రోజు కన్నా మరొక రోజు ఉన్నతంగా గడవాలి. నిన్నకన్నా నేడు గొప్పగుండాలి. నేటికన్నా రేపు బాగుండాలి. క్రమంగా విలువలు తరిగి పోవడం కాదు. పెరుగుతూ వెళ్లాలి.

ఆత్మ ఔన్నత్యమే మన సంస్కృతిలో పరమలక్ష్యం. ధర్మాచరణలో శ్రద్ధ నిరంతరం అభివృద్ధి చెందుతూ సాగాలి. తమ జీవిత కాలంలోనేకాక, తమ తరువాతి తరంవారు తమకన్నా ఎక్కువగా ఈ ధార్మికనిష్ఠను కొన సాగించాలి. ఇలా కాల క్రమంలో ధర్మాచరణ క్రమం కూడా పెరగాలి. అది పురుష ప్రయత్నాల సార్థక్యం.

మానవజీవన లక్షణమే నిన్నటికన్నా నేడు బాగుండాలని కోరుకోవడం. ఆ 'బాగు' ధార్మికమైన విశ్వశ్రేయస్సు కావాలన్నది వైదిక ఆకాంక్ష.

సృష్టిలోనున్న ఐశ్వర్యాన్ని 'విశ్వ శ్రేయస్సు' అనే దిశగా వెలికితీసి, తమ తమ మేధస్సులతో సద్వినియోగం చేసే మానవు లున్నప్పుడు, ఆ దేశానికి అంతగన్నా కావల సిందేముంది! భారతీయ సంస్కృతికి అటువంటి మనిషే వారసుడౌతాడు. ✷

# MEMBERSHIP / RENEWAL FORM

*Please fill in capital letters and mail to...*

**RUSHI PEETHAM PUBLICATIONS**

'PARK VIEW' NO 6, 4TH FLOOR , NO 85, G.N. CHETTY ROAD,
T.NAGAR, CHENNAI - 600 017.

Yes, I want to be a member in Rushi Peetham for

One year Rs 120/- (US $30) ☐ 3 Years Rs 360/- (US $90) ☐

5 Years Rs 600/- (US $125) ☐ Donations Rs ..........................

Iam paying by cheque/D.D.No..............................................drawn on

...........................................................................for Rs...........................

date...............Favouring Rushi Peetham Publications.

Name :

Sex : Male ☐ Female ☐ Age ☐

Address :

City : Pin :

Subscribers No : (Incase of Renewal) :

Education : School ☐ College ☐ Graduate/Post Graduate ☐

Business ☐ Employed ☐ Retired ☐

**P.T.O.**

Please mention Addresses or E-mail of your Nearest & Dearest who have interest in Rushi Peetham, Bharatheeya Manasa Patrika

1.

2.

3.

4.

5.

6.

7.

8.

9.

10.

11

** Terms : Allow 4 weeks for subscribing process. Super subscribe your name & Address on the reverse of the cheque/D.D. In case of further details contact Rushi Peetham Publications.

Owned & Published by : UPADRASTA SIVAPRASAD From : No.6, 4th Floor, No.85, G.N.Chetty Road, T.Nagar, Chennai - 600 017.
Printed By : V.C. Chermakani, Sakthi Process, No. 21F Kumballamman Koil St., Chennai - 600 081. Edited by : SAMAVEDAM SHANMUKHA SARMA

# 'ఋషిపీఠం' సంస్కృతి సంఘం

## - నిర్వహణకు ఆహ్వానం

ఆర్ష (ఋషి) విద్యావ్యాప్తికి మాస పత్రిక నిర్వహణతోపాటూ, ఇతర ప్రచురణలు, ఆడియోలు వెలువరించడమే కాక – ఊరూరా సనాతన సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని వివిధ కార్యక్రమాల ద్వారా తెలియజేయాలని ఈ సంస్కృతి సంఘం సంకల్పం.

మన సనాతన భారతీయ ధర్మానికి వారసులైన, చిత్తశుద్ధి కలిగిన, ఆసక్తిపరులు తమ వివరాలను, పూర్తి చిరునామాను తెలియజేస్తూ 'ఋషిపీఠం'కి వ్రాయండి. వారిలో ఎంపిక చేసిన వారిని ఆ ప్రాంతానికి ''ఋషిపీఠం సంస్కృతి సంఘ ప్రతినిధి''గా గౌరవించి, సంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ బాధ్యతను ''ఋషిపీఠం'' – అప్పగిస్తుంది.

ఆ సంఘంలో సభ్యులను చేర్పించడం 'ఋషిపీఠం' లక్ష్యాలను చిత్తశుద్ధిగా, బాధ్యతాయుతంగా వ్యాప్తి చేయడం, కార్యక్రమ నివేదికలను క్రమం తప్పకుండా మాకు పంపడం ప్రతినిధికి తప్పనిసరి బాధ్యత.

ఈ సంస్కృతి సంఘ అభ్యున్నతికి వలసిన సహాయాన్ని అందజేసేవారు ఆ ప్రతినిధికిగానీ, 'ఋషిపీఠం'కి నేరుగా గానీ విషయం తెలియజేయవచ్చు. ఋషిసంస్కృతిపట్ల నిష్ఠ, ధర్మదృష్టి, చిత్తశుద్ధి – ఇవే ఈ సంస్కృతి సంఘం ప్రాతినిధ్యానికి కనీసార్హతలు.

ఉత్సాహవంతులైన వారు ''ఋషిపీఠం – భారతీయ మానస పత్రిక '' చిరునామాకు వివరాలతో సహా ఉత్తరం వ్రాయండి.

- సంపాదకుడు

